# తెలుగు వ్యుత్పత్తికోశం

ప్రథమ సంపుటం

అ-ఙ

ప్రధాన సంపాదకుడు

డాక్టర్ లకంసాని చక్రధరరావు

ఎమ్.ఎ., పిఎచ్.డి.






ఆంధ్ర విశ్వకళా పరిషన్ముద్రణం

వాల్తేరు, విశాఖపట్నం 530 003

# తెలుగు వ్యుత్పత్తి కోశం

## ( అ - ఔ )

### ప్రథమ సంపుటం


ప్రధాన సంపాదకుడు

డా॥ ఎల్. చక్రధరరావు, ఎమ్.ఏ., పిఎచ్.డి.

సహాయకులు

కీ.శే. విద్వాన్ ప్రయాగ కోదండరామశాస్త్రి, ఎమ్.ఏ.

డాక్టర్ జి.వి.యస్.ఆర్. కృష్ణమూర్తి, ఎమ్.ఏ., పిఎచ్.డి.

డాక్టర్ బి. అరుణకుమారి, ఎమ్.ఏ., పిఎచ్.డి.

శ్రీ ఇ. విశ్వనాథరెడ్డి, ఎమ్.ఏ.

శ్రీ అత్తలూరి నరసింహారావు, ఎమ్.ఏ.





1978

ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్సు

వాల్తేరు, విశాఖపట్టణం 530 003

కాపీలు : 1,500

ఫిబ్రవరి, 197[illegible]




సిరీస్ నెం. 138



వెల : రు. 60/-




ప్రతులకు :

డైరెక్టరు
ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్సు
వాల్తేరు, విశాఖపట్టణం 530 003

ముద్రణ - ప్రచురణ : డా॥ సి. వీరేశ్వరరావు, డైరెక్టరు, ఆంధ్రాయూనివర్సిటీ ప్రెస్సు, వాల్తేరు, విశాఖపట్టణం 530 00



శ్రీ ఎమ్. ఆర్. అప్పారావు, ఎమ్.ఏ.
ఎమ్.ఎల్.ఏ.

ఆంధ్ర విశ్వకళాపరిషదుపాధ్యక్షులు

తెలుగు వ్యుత్పత్తికోశ సలహా సంపాదకులు

# తొలిపలుకు

ఆంధ్రనామ సంగ్రహం, ఆంధ్రనామ శేషం, సాంబ నిఘంటువు, ఆంధ్ర భాషార్ణవం మొదలైన పద్యనిఘంటువులూ, అకారాద్యనుక్రమణికలో రాయబడ్డకోశాలు అనేకాల్లు ఉన్నప్పటికీ తెలుగు వ్యుత్పత్తి కోశం లేకపోవడం తెలుగుకు తీరని లోటుగా భావించి తెలుగు వ్యుత్పత్తికోశాన్ని ఆచార్య శ్రీ గంటిజోగి సోమయాజిగారి పర్యవేక్షణలో వెలయింప జేయడానికి ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారు 1957 లో నిశ్చయించారు. ఆనాటికి లభ్యమైన ఆధారాల్ని అనుసరించి అచ్చులూ, కవర్గం ఆదిగాకల కొన్ని పదాల్ని సేకరించి వ్యుత్పత్తుల్ని నిర్ణయించారు. ఈ కోశంలో పదాల ఆకారాలు లిప్యంతరీకరణ (transliteration) చేయబడి వాటి అర్థాలు ఆంగ్లంలో ఇవ్వబడ్డాయి.

ఈ నిఘంటువును పూర్తిచేయాలనే సంకల్పంతో ఆంధ్ర విశ్వవిద్యాలయం విశ్వవిద్యాలయాల గ్రాంట్లసంఘం సాయాన్ని అర్థించింది. యు.జి.సి. పరీక్షకసంఘం ఈ పథకాన్ని అంగీకరిస్తూ అయిన పనిని అంచనావేసి అభిప్రాయాన్ని తెలపటానికిగాను నిపుణుల సంఘాన్ని ఏర్పాటుచేసి వారి నివేదికను పంపవలసిందిగా సూచించింది. దానికి అప్పటి ఆంధ్ర విశ్వకళాపరిషదుపాధ్యక్షులు శ్రీ లంకపల్లి బుల్లయ్యగారు ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారు, ఆచార్య జి. ఎన్. రెడ్డిగార్లతో నిపుణుల సంఘాన్ని నియమించారు. పూర్వం అనుకొన్నరీతిలో కాకుండా మొత్తంకోశం తెలుగు లిపిలో తెలుగు అర్థాలతో ఆంధ్రులకు అత్యంతోపయోగంగా ఉండేటట్లుగా తయారు చేయవలసిందని ఈ సంఘం చేసిన సిఫారసును యు.జి.సి. కి విశ్వవిద్యాలయం సమర్పించగా వారు రెండు లక్షల ఏభైవేల రూపాయల్ని మంజూరు చేశారు. ఈ విధంగా ఈ నిఘంటు నిర్మాణ కార్యక్రమం నూతన రీతిలో 1970 జూన్‌లో ఆచార్య తూమాటి దోణప్పగారి ప్రధాన సంపాదకత్వంలో ఆరంభించబడి 1976 ఏప్రిల్ వరకు కొనసాగింది. ఐదవ పంచవర్ష ప్రణాళికలో ఈ పథకానికి ఆర్థికసహాయం చేయడానికి విశ్వవిద్యాలయాల గ్రాంట్ల సంఘం నిరాకరించగా ఈ విశ్వవిద్యాలయం రెండు లక్షల రూపాయలు, మరో రెండు లక్షల రూపాయలు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు మంజూరు చేశారు. ఈ విధంగా నాలుగు లక్షల రూపాయల నిధితో 1–4–1974 నుంచి 31–3–1979 వరకు తెలుగు వ్యుత్పత్తికోశ పథకం కొనసాగుతుంది.

ఈ పథకానికి 1–6–1976 నుంచి డాక్టర్ ఎల్. చక్రధరరావుగారు డైరెక్టరుగా ఉంటున్నారు. ఈ పథకాభివృద్ధికి సలహాలివ్వడానికి సలహాసంఘాన్ని నియమించాం. ఈ సంఘంయొక్క సలహాలవల్లా, డాక్టర్ ఎల్. చక్రధరరావుగారి పర్యవేక్షణలో తెలుగు వ్యుత్పత్తికోశం సిబ్బంది నిరంతర కృషివల్లా 20–11–1976 నాటికి మొదటి సంపుటం (అ – ఔ) ఆంధ్ర విశ్వకళా పరిషన్ముద్రణాలయానికి ఇవ్వటం జరిగింది. ఇది అనతికాలంలోనే అచ్చై ఆవిష్కరణకు ఆయత్తం చేయబడింది.

తెలుగు వ్యుత్పత్తికోశం అమరజీవి పొట్టి శ్రీరాములుగారికి అంకిత మివ్వబడింది. కీ.శే. పొట్టి శ్రీరాములుగారి అమరణ నిరాహార దీక్షాఫలితంగానే ఆంధ్ర రాష్ట్రావతరణ జరిగిందనేది చారిత్రక సత్యం.

కాని పొట్టి శ్రీరాములుగారి స్మృతి జనహృదయం నుంచి తొలగుతోంది. దేశంకోసం ప్రాణాల్ని అర్పించిన అమరజీవికి ఈ కోశాన్ని అంకితం కావించటం సముచితం అని మా భావన.

ఈ వ్యుత్పత్తికోశ ద్వితీయ తృతీయ సంపుటాలుకూడా సకాలంలో వెలుగులోకి రాగలవని ఆశిస్తున్నాను

వాల్తేరు
28–8–1977

M. R. Apparow.

(యం ఆర్ అప్పారావు)
ఉపాధ్యక్షులు
ఆంధ్ర విశ్వకళాపరిషత్తు

# అంకితం

ఆంధ్రరాష్ట్ర అవతరణకు

అసువులను అర్పించిన



అమరజీవి

పొట్టి శ్రీరాములు గారికి

# పీ ఠి క

భారతీయులు అతిప్రాచీన కాలంనుంచి తత్త్వాన్వేషణ తత్పరులు. వీరు భౌతికవిషయాల్లోనూ అధ్యాత్మిక చింతనలోనూ సమగ్ర పరిజ్ఞానాన్ని సంతరించుకొన్నవారు నాల్గువేదాల్లోనూ శిక్షాఛందోజ్యోతిః కల్పనిరుక్త వ్యాకరణ శాస్త్రాల్లోనూ మీమాంసాన్యాయధర్మ శాస్త్రాల్లోనూ, చతుష్షష్టికళల్లోనూ మనదేశవాసులు పలువురు పారంగతులై అనేక మహత్తరగ్రంథాల్ని రచించారు.

నిరుక్తశాస్త్రాన్ని యాస్కాచార్యుడు ప్రతిభతో రచించాడు. యాస్కునికి పూర్వం నిరుక్త పరిజ్ఞానం భారతీయులకు లేదని చెప్పలేం ఒక పదం లేదా పదసముదాయాల వ్యుత్పత్తుల్ని గూర్చిన వివేచన చాలా కాలంనుంచి మనదేశంలో ప్రారంభమైంది ఈవిషయంలో మనవారు అగ్రగాములు. యాస్కునికి అత్యంత ప్రాచీన కాలంలోనే — అంటే — వేదాల్లోనే నిరుక్తానికి బీజాలున్నాయి. ఈ విషయం సోదాహరణంగా నిరూపించబడుతుంది.

ఋగ్వేదంలోనే అనేక పదాల వ్యుత్పత్తులు విశదపర్చబడ్డాయి.

'యో వరేవృజనే విశ్వథా విభుర్మహామురణ్వః శవసావవక్షిథ
సదేవో దేవాన్ప్రతి పప్రథేపృథు విశ్వేదుతాపరి భూర్బ్రహ్మణస్పతిః'

(2 మండలం 24 సూక్తం, 11 ఋక్కు)

'వైశ్వానరతవధామాన్యాచకేయేభిః స్వర్విదభవో విచక్షణ
జాత ఆపృణోభువనా నిరోదసీ అగ్నే తావిశ్వాపరిభూరసిత్మనా'

(3 మండలం, 3 సూక్తం, 10 ఋక్కు)

బ్రహ్మణస్పతి 'పరిభూ'గా స్తుతించ బడ్డాడు. చిన్నవారిలోను పెద్దవారిలోను వ్యాపించి ఉన్న కారణంగా బ్రహ్మణస్పతి అతిశయించి ఉన్నాడు. భూత జాతంలోనూ ద్యావాపృథివుల్లోనూ పుట్టగానే నిండి ఉండటం వల్ల వైశ్వానరుడు కూడా పరిభూగా ప్రస్తుతింపబడ్డాడు.

'అస్తావ్యగ్నిర్నరాం సుశేవోవైశ్వానర'

(10 మండలం 45 సూక్తం, 12 ఋక్కు)

విశ్వనరులకు (సకలనరులకు) హితుడు కనుక అగ్నివైశ్వానరుడు అని వ్యవహరించబడుతున్నాడు అందువల్లనే అగ్ని నరులకు సుఖసేవ్యుడు (నరాంసుసేవః) అనిపేర్కొనబడింది.

'యదరోదీద్రుద్రదన్యరుద్రత్వమ్' (హరిద్రావికమ్) ఏడ్చిన కారణంగా రుద్రుడికి రుద్రత్వం కల్గింది

'ఇన్ద్రోరాజాజగతశ్చర్షణీనామధిక్షమివిషురూపంయదస్తి'

(7 మండలం, 27 సూక్తం, 3 ఋక్కు)

ఇంద్రుడు జగత్తుకు రాజు. మనుష్యులకు రాజు. భూమిలోని నానాజీవులకు రాజు ('ఇది ఐశ్వర్యే' అనికదా!) :

'దీర్ఘాయురస్యాయః పతిర్జీవతిశరదఃశతమ్'

(10 మండలం 85 సూక్తం 39 ఋక్కు)

దీర్ఘాయువైనవాడు నూరు సంవత్సరాలు జీవించినవాడు కదా.

'హత్వాయదేవా అసురాన్యదా యన్‌దేవా దేవత్వమభిరక్షమాణాః'

(10 మండలం, 158 సూక్తం, 4 ఋక్కు)

ఇంద్రాదిదేవతలు (వృత్రాది) అసురుల్ని నశింపజేసి స్వస్థానికి వచ్చి దేవత్వాన్ని (అమృతత్వాన్ని) రక్షించుకొన్నారు (మూల ఇండో-యూరోపియన్* deu s కు ప్రకాశించు అని అర్థం)

'గుహాహితం గుహ్యమ్

(10 మండలం, 148 సూక్తం 2 ఋక్కు)

గుహయందుంచబడింది గుహ్యం గుహలో ఉన్నది కన్పించకుండా ఉంటుంది కాబట్టి అదృశ్యం, రహస్యం అనే అర్థం గుహ్యశబ్దానికి వచ్చింది.

తన్తుమాతతమ్'

(10 మండలం 56 సూక్తం 6 ఋక్కు)

'పుత్త్ర పౌత్రాది రూపంతో అవిచ్ఛిన్నమైన ప్రజను' అనిఅర్థం 'అయంహ్యేతతతస్తుర్యత్ప్రజాః' అని బ్రాహ్మణం. 'ప్రజావైతన్తుః' ప్రజలు తంతువులు కదా అని ఐతరేయ బ్రాహ్మణం.

యజుర్వేద సంహితా భాగంలో కూడా కొన్నివ్యుత్పత్తుల్ని గమనించవచ్చు వేదోఽసి యేనత్వం దేవ వేదదేవేభ్యోవేదోఽభవస్తే నమహ్యం వేదోభూయాః' 2 21

నీవు తెలుసుకొన్నావు కాబట్టి వేదానివైనావు దైవానికి వేదం అనే పేరు ఎందుకు వచ్చిందో తెలుపబడింది

'స్వయంభూరసి శ్రేష్ఠోరశ్మిర్వర్చోదాఅసి వర్చో మేదేహి' (2 26)

'వర్చోదుడవై ఉన్నావు. వర్చస్సును నాకు ఇమ్ము' అని దీనికి అర్థం. వర్చోదుడు కాబట్టే వర్చస్సును ఇవ్వగల్గుతున్నాడు

ఉపనిషద్వాఙ్మయంలో కూడా పదాలకు వ్యుత్పత్తులివ్వబడ్డాయి

'యదుచ్ఛ్వాసనిఃశ్వాసా వేతావాహుతీ సమంనయతీతిసమానః'

(ప్రశ్నోపనిషత్తు 4–4).

అగ్ని హోత్రానికి అగ్ని హోత్రాహుతులవలె ఉచ్ఛ్వాస నిశ్శ్వాసాల్ని సమంగానడిపే వాయువును 'సమాన' వాయువంటారు.

'సావా ఏషా దేవతా దూర్నామ దూరం హ్యస్యామృత్యుర్దూరం హవా అస్మాన్మృత్యుర్భవతియ ఏవంవేద'

(బృహదారణ్యకోపనిషత్తు 3–9)

మననుంచి మృత్యువును దూరంగా ఉంచుతుంది కాబట్టి వాగ్దేవతకు 'దూర్' అనేపేరు కల్గింది.

'ఏష ఉ ఏవ బృహస్పతిర్వాగ్వై బృహతీ తస్యా ఏషపతిస్తస్మాదు బృహస్పతిః'
(బృహదారణ్యకోపనిషత్తు 3–19)

బృహతీ ఛందస్సుకు పతి కాబట్టి వాక్కుకు బృహస్పతి అనేపేరు కల్గింది.

'వేకారోఽమృతబీజంతుకటఐశ్వర్యముచ్యతే
అమృతైశ్వర్య సంఘత్వాద్ వేఙ్కటాద్రిరి తిస్మృతః'
(పారమాత్మికోపనిషత్తు)

'వే' అనేది అమృతబీజమనీ 'కట' శబ్దం ఐశ్వర్యాన్ని తెల్పుతుందనీ, అమృతైశ్వర్య సంఘటన వల్ల వేంకటాద్రి అనేపేరు కల్గిందనీ తెలుస్తోంది. కాగా "వేం పాపంకటతి – నాశయతి ఇతివేంకటః" అన్న ఆధునికుల వ్యుత్పత్తి సరికాదన్నమాట.

'యజ్ఞాఖ్యః పరమాత్మాయ ఉచ్యతే తస్యహోతృభిః
ఉపనీతం తతోస్యై తత్తస్మాద్య జ్ఞోపవీతకమ్'
(పారమాత్మికోపనిషత్తు)

పరమాత్మ యజ్ఞాఖ్యుడనీ హోతలచే ఆనీతం కాబట్టి యజ్ఞోపవీతమనే పేరు కల్గిందనీ పదవ్యుత్పత్తి చెప్పబడింది.

గుహ్య షోఢాన్యాసోపనిషత్తులో 'కాలనంకలనాత్ కాలీ' అని కాలీ శబ్దవ్యుత్పత్తి చెప్పబడింది.

మనుస్మృతిలోని కొన్ని పదవ్యుత్పత్తులు.

'ఆపోనారా ఇతిప్రోక్తా ఆపోవైనరసూనవః
తేయదస్యాయనం పూర్వం తేన నారాయణః స్మృతః'
(1–10)

నీళ్ళను 'నారములు' అని అంటారు. ఆ 'నారములు' పరమాత్ముడికి ఉనికి పట్టైన కారణంగా అతడు 'నారాయణుడు' అని తలచబడ్డాడు.

'ఆద్యంయత్త్ర్యక్షరం బ్రహ్మత్రయీయస్మిన్ ప్రతిష్ఠితా
నగుహ్యోన్య స్త్రివృద్వేదోయస్తం వేద సవేదవిత్'
(11–265)

వేదాన్ని ఎరిగిన వాడు 'వేద' విదుడు.

రామాయణంలోని కొన్ని పదాలవ్యుత్పత్తులు.

'సరః ప్రవృత్తా సరయూః పుణ్యా బ్రహ్మ సరశ్చ్యుతా'
(బాలకాండ 24–10)

'బ్రహ్మసరస్సునుంచి పుట్టింది కాబట్టి 'సరయూ' అనిపేరుకల్గింది.

'ఏషావసుమతీ నామవసోస్తస్య మహాత్మనః'
(బాలకాండ 32–8)

మహాత్ముడైన వసువుకు సంబంధించిందికాబట్టి భూమికి 'వసుమతి' అనేపేరు కల్గింది.

'దితేః పుత్రా న తాంరామజగృహుర్వరుణాత్మజామ్
అదితేస్తు సుతావీర జగృహుస్తామనిన్దితామ్'

'అసురాస్తేనదైతేయాః సురాస్తేనాదితేః సుతాః
హృష్టాప్రముదితాశ్చాసన్ వారుణీగ్రహణాత్ సురాః'

(బాలకాండ 45–37,38)

దైత్యులువారుణిని (సురను) తాగలేదు కాబట్టి 'అసురులు' అనివ్యవహృతులయ్యారని, ఆదిత్యులు సురను తాగారు కాబట్టి 'సురలు' అనివ్యవహరించ బడ్డారని తెలుస్తోంది.

'సపత్న్యా తుగరస్తస్యైదత్తోగర్భజిఘాంసయా
సహతేనగరేణైవసంజాతః సగరోऽభవత్'

(బాలకాండ 70–37)

గర్భస్థ శిశువును చంపటానికి సవతిచే విషప్రయోగంచేయబడింది. విషంతో పుట్టాడు కాబట్టి 'సగరుడు' అయ్యాడు. గర-గరళ శబ్దాలు పర్యాయపదాలు.

'రక్షామఇతి యైరుక్తం రాక్షసాస్తేభవన్తువః
యక్షామఇతి యైరుక్తం యక్షాఏవభవన్తువః'

(ఉత్తరకాండ 4–13)

గోవిందరాజీయ వ్యాఖ్యప్రకారం రక్షిస్తామన్నవాళ్ళు 'రాక్షసులు' గాను భక్షిస్తా మన్నవాళ్ళు 'యక్షులు' గాను ఔతారని ప్రజాపతి అన్నాడు.

'మత్కరోత్ సృష్టవజ్రేణహనురస్యయథాహతః
నామ్నావైకపి శార్దూలో భవితాహనుమానితి'

(ఉత్తరకాండ 36–11)

ఇంద్రుడి వజ్రంచేహనువు కొట్టబడింది కాబట్టి హనుమంతుడు అనేపేరు మారుతికి కల్గింది.

యస్తయోః పూర్వజోజాతః సకుశైర్మన్త్రసత్కృతైః
నిర్మార్జనీయస్తు తదాకుశ ఇత్యస్య నామతత్
యశ్చావరోభవేత్ తాభ్యాం లవేనసుసమాహితః
నిర్మార్జనీయో వృద్ధాభిర్లవేతిచసనామతః'

(ఉత్తరకాండ 66–7,8)

దర్భముష్టిపైభాగంచే శుద్ధి చేయబడ్డాడు కాబట్టి 'కుశుడు' అనీ దర్భముష్టి కిందిభాగంచే శుద్ధి చేయబడ్డాడు కాబట్టి 'లవుడు' అనీ సీతా పుత్రద్వయానికి పేళ్ళు కలిగాయి.

'దశగ్రీవః ప్రసూతోऽయం దశగ్రీవోభవిష్యతి'

(ఉత్తరకాండ 9–33)

పదికంఠాలతో పుట్టాడు కాబట్టి అతనితండ్రి రావణుడికి 'దశగ్రీవుడు' అనేపేరు పెట్టేడు.

మహాభారతంలోని కొన్ని పదవ్యుత్పత్తులు :

'తతః సగర్భోనివసన్ కుక్షౌభృగుకులోద్వహ
రోషాన్మా తుశ్చ్యుతః కుక్షేః చ్యవనస్తేనసోऽభవత్'

(ఆదిపర్వం 6–2)

తల్లి గర్భంనుంచి జారిపడ్డాడు కాబట్టి 'చ్యవనుడు' అనే పేరు పులోమాపుత్రుడికి కల్గింది.

'ప్రమదాభ్యోవరాసాతు సత్త్వరూపగుణాన్వితా
తతఃప్రమద్వరేత్యస్యా నామచక్రే మహనృషిః'

(ఆదిపర్వం. 8–13)

ప్రమదలలో (స్త్రీలలో) శ్రేష్ఠురాలు కాబట్టి ప్రమద్వర అనేపేరుకల్గింది.

'సురూపం పత్రమాలక్ష్యసుపర్ణోఽయంభవత్వితి'

(ఆదిపర్వం 32–24)

గరుత్మంతుడికి బాగా అందమైన పర్ణాలు (రెక్కలు) ఉన్నకారణంగా 'సుపర్ణుడు' అనేపేరు కల్గింది.

'ఏవం ద్వైపాయనోజజ్ఞే సత్యవత్యాంపరాశరాత్
న్యస్తోద్వీపేనయద్బాలస్తస్మాద్ ద్వైపాయనః స్మృతః'
'వివ్యాస వేదాన్ యస్మాత్‌సతస్మాద్వ్యాస ఇతిస్మృతః'

(ఆదిపర్వం 63–86, 89)

ద్వీపంలో ఉంచబడ్డాడు కాబట్టి పరాశరాత్మజుణ్ణి 'ద్వైపాయనుడు' అని వ్యవహరించారనీ వేదాల్ని వ్యాసంచేశాడు కాబట్టి – అంటే విభజించి – వ్యాప్తిచేశాడు కాబట్టి – వ్యాసుడని అన్నారనీ ద్వైపాయన, వ్యాసశబ్దాల పదవ్యుత్పత్తులు స్పష్టీకరించ బడ్డాయి.

'అస్త్వయం సర్వదమనః సర్వం హి దమయత్యసౌ
ససర్వదమనో నామకుమారః సమపద్యత'

(ఆదిపర్వం 74–8)

అన్నిటిని దమనంచేసేవాడు కాబట్టి 'భరతుణ్ణి' 'సర్వదమనుడు' అని కణ్వాశ్రమవాసులు అర్థయుక్తంగా వ్యవహరించారు.

'కామక్రోధావుభౌయస్య చరణౌసంవవాహతుః
ఇన్ద్రియాణాంవశకరో వశిష్ఠ ఇతిచోచ్యతే'

(ఆదిపర్వం 173–6)

శ్రీమద్భాగవత పురాణం లోని కొన్ని పదవ్యుత్పత్తులు.

'నిరోధోఽస్యాను శయన మాత్మనః సహశక్తిభిః
ముక్తిహిత్వా న్యథారూపం స్వరూపేణ వ్యవస్థితః'

(ద్వితీయస్కంధం 10-6)

అన్యథా రూపాన్ని వదలి స్వస్వరూపంతో ఉండటాన్ని 'ముక్తి' అంటారు.

'తస్యైవ చాన్తేకల్పోఽభూత్ యంపాద్మమభి చక్షతే
యద్ధరేర్నాభి సరస ఆసీల్లోక సరోరుహమ్,
అయంతు కథితః కల్పోద్వితీయస్యాపి భారత
వారాహఇతివిఖ్యాతో యత్రాసీత్సూకరోహరిః'

(తృతీయస్కంధం 11, 35, 36)

విష్ణునాభి సరోవరాన్నుంచి లోకపద్మం కల్గింది కాబట్టి 'పాద్మకల్ప' మేర్పడింది. హరి సూకరం ఐనాడు కాబట్టి 'వారాహకల్పం' గా పరికల్పించ బడింది.

'తంతుతేఽవనతం దీనం కింకరో మీతివాదినమ్,
నిషీదేత్య బ్రువంస్తాత సనిషాదస్తతోఽభవత్.'

(చతుర్థస్కంధం 14-45)

దీనుడై 'ఏమిచేయును?' అని అడిగే వానిని వారు (ఋషులు) కూర్చో (నిషీద) అని అన్నారు. ఆ తరువాత వాడు 'నిషాదుడు' అయ్యాడు.

'అత్రతు ప్రథమోరాజ్ఞాం పుమాన్ ప్రథయతేయశః
పృథుర్నామ మహారాజో భవిష్యతి పృథుశ్రవాః'

(చతుర్థస్కంధం 15-4)

రాజుల్లో మొదట కీర్తిని వ్యాపింప చేశాడు. కాబట్టి మహాకీర్తిగల 'పృథు' నామంగల రాజు కల్గుతాడు.

'అజనాభం నామైత ద్వర్షం భారత మితియత ఆరభ్యవ్యపదిశన్తి'

(పంచమస్కంధం 7-3)

(జడ) భరతుడు పరిపాలించిన దేశం కాబట్టి అజనాభమనే ఈ దేశాన్ని 'భారతము' అని వ్యపదేశిస్తున్నారు.

'జన్మనాజనకః సోభూత్ వైదేహస్తు విదేహజః
మిథిలో మథనాజ్జాతో మిథిలా యేననిర్మితా'

(నవమస్కంధం 13-13)

జన్మచే 'జనకుడు' అని విదేహజుడైన కారణంగా 'వైదేహుడు' అని, మథనం వల్ల పుట్టాడు కాబట్టి 'మైథిలుడు' అని పేర్లు కలిగాయి. మిథిలుడిచే నిర్మించ బడింది కాబట్టి 'మిథిల' అనేపేరు కల్గింది.

'యోరాతోదేవయజనే దేవైర్గాధిసుతాపనః
దేవరాత ఇతిఖ్యాతః శునః శేఫః సభార్గవః'

(నవమస్కంధం 16-32)

దేవయజ్ఞంలో ఇవ్వబడ్డాడు కాబట్టి శునఃశేఫుడు 'దేవరాతుడు' అని విఖ్యాతుడయ్యాడు.

'బృహత్క్షత్రస్యపుత్రోఽ భూద్ధస్తీయద్ధస్తినాపురమ్'

(నవమస్కంధం 21-20)

హస్తిచే నిర్మించబడింది కాబట్టి 'హస్తినాపురం'

'శాన్తిమాప్నోతి చైవాగ్ర్యాం కర్మణాతేన శన్తనుః'

(నవమస్కంధం 22-14)

శ్రేష్ఠకర్మచే శాంతిని పొందుతున్నాడు కాబట్టి 'శంతనుడు' అనిపేరు కల్గింది.

'దేవదున్దుభయోనేదు రానకాయస్య జన్మని
వసుదేవంహరేః స్థానంవదన్త్యానక దున్దుభిమ్'

(నవమస్కంధం 24, 29-30)

ఎవని పుట్టుకయందు ఆ దేవదుందుభులు ఆనకాలు మోగాయోహరికి స్థానమైన అటువంటి వసుదేవుణ్ణి 'ఆనక దుందుభి' గా పేర్కొంటున్నారు.

శ్రీ విష్ణుపురాణం లోని కొన్ని శబ్దవ్యుత్పత్తులు.

'ప్రకృతౌ సంస్థితం వ్యక్తమతీతప్రలయేతుయత్
తస్మాత్ ప్రాకృత సంజ్ఞోఽ యముచ్యతేప్రతిసఞ్చరః'

(ప్రథమాంశం 2-25)

ప్రకృతి యందు ఉన్న కారణంగా విష్ణువును ప్రాకృత సంజ్ఞచే వ్యవహరిస్తారు.

'సర్పణాత్తేఽ భవన్ సర్పాహీన త్వాదహయః స్మృతాః'

(ప్రథమాంశం 5-45)

సర్పణం (పాకడం) వల్ల పాములు సర్పశబ్దవాచ్యాలై నాయనీ హీనత్వం వల్ల 'అహులు' అని వ్యవహరించ బడ్డాయనీ తెలుస్తోంది.

'పునశ్చమధుసంజ్ఞేన దైత్యేనాధిష్ఠితం యతః
తతోమధువనం నామ్నాఖ్యాత మత్రమహీతలే'

(ప్రథమాంశం 12-3)

మధువనే రాక్షసుడు నివసించిన కారణంగా 'మధువనం' అని ఒక ప్రదేశానికి పేరు వచ్చింది.

'పిత్రాపరఞ్జితా స్తస్య ప్రజాస్తేనానురఞ్జితాః
అనురాగాత్తతస్తస్య నామరాజేత్యజాయత'

(ప్రథమాంశం 13-48)

అనురాగం (రంజనం) వల్ల పృథువు రాజు అయ్యాడు.

'కృతేపాపేఽనుతాపో వైయస్యపుంసః ప్రజాయతే
ప్రాయశ్చిత్తంతుతస్యైతం హరిసంస్మరణ పరం'

(ద్వితీయాంశం 6-38)

పాపం చేసిన తర్వాత అనుతాపాన్ని పొందటాన్నే ప్రాయశ్చిత్తం అని అంటారు.

'నభ్రశ్యన్తియతస్తే భ్యోజలాన్యభ్రాణి తాన్యతః'

(ద్వితీయాంశం 9-10)

మేఘాలనుంచి జలం వెంటనే జారిపోదు కాబట్టి మబ్బుల్ని 'అభ్రాలు' అన్నారు.

'అమాఖ్య రశ్మివసతి అమావాస్యా తతః స్మృతా'

(ద్వితీయాంశం 12-8)

చంద్రుడు సూర్యమండలంలో ప్రవేశించి 'అమా' అనే రశ్మిలో ఉండే తిథిని 'అమావాస్య' అని అంటారు.

'యస్మాద్విష్టమిదం విశ్వం తస్యశక్త్యామహాత్మనః
తస్మాత్సప్రోచ్యతే విష్ణుర్విశేర్ధాతోః ప్రవేశనాత్'

(తృతీయాంశం 1-45)

ఈ విశ్వమంతా పరమాత్మ శక్తిచే వ్యాప్తమై ఉంది. అందువల్ల ఆ పరమాత్మ 'విష్ణువు' అని వ్యవహరించ బడుతున్నాడు. 'విశ్' ధాతువుకు ప్రవేశించటం అని కూడా అర్థం.

'బృహద్రథాచ్చాన్యశ్శకల ద్వయజన్మాజర యాసంహితో జరాసన్ధ నామా'

(చతుర్థాంశం 19-83)

రెండు ముక్కలుగా ఉన్న శరీరభాగాలు జరచే సంధించబడ్డాయి కనుకనే 'జరాసంధుడు' అనేపేరు కల్గింది.

మార్కండేయ పురాణంలోని కొన్నిపదవ్యుత్పత్తులు.

యస్మాచ్చణ్డఞ్చ ముణ్డఞ్చ గృహీత్వాత్వముపాగతా
చాముణ్డేతి తతోలోకేఖ్యాతాదేవి! భవిష్యసి (87-25)

చండముండుల్ని చంపి వారి శిరస్సుల్ని చండికకు కాన్కగా కాళి తెస్తుంది. చండముండుల తలల్ని తెచ్చింది కాబట్టి కాళి 'చాముండి' గా లోకంలో ప్రసిద్ధురాలౌతుందని చండిక చెప్పింది.

యతోనియుక్తోదౌత్యేన తయాదేవ్యాశివః స్వయమ్
శివదూతీ తిలోకేస్మింస్తతః సాఖ్యాతి మాగతా
(88-27)

శివుణ్ణి దౌత్యంలోనియోగించిన కారణంగా చండికకు 'శివదూతి' అనేపేరు లోకంలో ప్రసిద్ధ మైంది.

నిరుక్తకారుడైన యాస్కాచార్యుడికి (క్రీ.పూ. 600 సం.) పదవ్యుత్పత్తుల్నిగూర్చి తెలియ చెప్పడం అభీష్టం. గవాదిదేవ పత్న్యంత శబ్దసముదాయాన్ని 'సమామ్నాయం' అని అంటారు. సమామ్నాయాన్నే 'నిఘంటువు' అని కూడా వ్యవహరిస్తారు. నిఘంటు శబ్దవ్యుత్పత్తిని గురించి యాస్కుడు గ్రంథాదిని విచారణ మొదలుపెట్టాడు.

1. నిఘంటవః కస్మాన్నిగమాఇమేభవన్తి, 2. ఛందోభ్యః సమాహృత్య సమాహృత్య సమామ్నాతాః, 3. తేనిగన్తవ ఏవనన్తేని గమనాన్ని మణ్టవ ఉచ్యన్త ఇత్యేపమన్యవః, 4. అపిహ్యాహననా దేవస్యుః సమాహతాభవన్తి, 5. యద్వాసమాహృతాభవన్తి (నిరుక్తమ్ పుటలు 5-7).

1. మంత్రార్థాల్ని తెలియపరిచేవి కాబట్టి నిఘంటవులు అనిఅంటారని, 2. సంప్రదాయాన్ని బట్టి వేదాల్నుంచి గ్రహించబడి గ్రంథీకృతాలైనాయి కాబట్టి నిఘంటువులని వ్యవహృతాలై ఉండవచ్చు నని, 3. వేదార్థనిగమయితృహేతుత్వం వల్ల నిఘంటువులని చెప్పబడుతున్నాయనీ ఔపమన్యవుడు పేర్కొన్నాడని, 4. ఆహననం వల్ల నిఘంటువులౌతున్నాయనీ 5. వేదాల్నుంచి సమాహరణం చేయ బడ్డాయి కాబట్టి నిఘంటులౌ తున్నాయని యాస్కుడు గమ్, హన్, హృ, ధాతువుల్నుంచి ఈ నిఘంటు శబ్దాన్ని వివిధ విధాలుగా నిష్పన్నం చేశాడు. యాస్కుని నిరుక్తాభిరుచి ఆదిలోనే నిఘంటు శబ్దానికి ఇన్ని వ్యుత్పత్తుల్ని చెప్పడం బట్టి తెలుస్తుంది.

షడంగాల్లో నిరుక్తం ప్రధానమైన అంగం. వేదార్థ బోధకు నిరుక్త పఠనం అత్యావశ్యకం. 'తదిదం విద్యా స్థానం వ్యాకరణస్య, కార్త్స్న్యం స్వార్థసాధకంచ' (నిరుక్తమ్ 1-15) అని చెప్పటంద్వారా నిరుక్తశాస్త్రం వ్యాకరణ శాస్త్రపూరకం కావటమే కాకుండా స్వార్థసాధకంగా కూడాఉంది అని తెలుస్తోంది. సంహితను పదపాఠంగా విభజించే సందర్భంలో నిరుక్తం సాయంచేస్తుంది. (అథాపీదమన్త రేణపద భాగేన విద్యతే. నిరుక్తమ్ 1-17) ఈ శాస్త్రం వల్ల మంత్రాధిదేవతను గుర్తించవచ్చు (అథాపియాజ్ఞే దైవతే నబహవః ప్రదేశాభవన్తి తదేతేనోపేక్షితవ్యం. తేచేద్ బ్రూయుర్లిఙ్గజ్ఞా అత్రస్మ ఇతి. నిరుక్తమ్ 1-17). జ్ఞాన ప్రవృత్తికోసం, అజ్ఞాన నివృత్తికోసం ఈ శాస్త్రాన్ని నేర్చుకోవాలి. ('అథాపిజ్ఞాన ప్రశంసా భవతి, అజ్ఞాననిన్దాచ' నిరుక్తమ్ 1-18).

అన్నిపదాల్ని ధాతువులనుంచి నిష్పన్నం చేయవచ్చు అని నైరుక్తులు భావించారు ('తత్ర

నామాన్యాఖ్యాతజా నీతిశాకటాయనే నైరుక్త నమయశ్చ' నిరుక్తమ్. 1-12). యాస్కుడు చెప్పిన పద వ్యుత్పత్తులు తులనాత్మక వ్యాకరణాన్ని బట్టిచూచినా చాలావరకు సరిపోతున్నాయని డాక్టర్ సిద్ధేశ్వర వర్మగారు తమ సిద్ధాంత వ్యాసంలో నిరూపించారు.

అర్క శబ్దానికి దేవుడు, మంత్రం, అన్నం అనే అర్థాలున్నాయి. 'అర్కోదేవోభవతి దేవమర్చన్తి అర్కోమన్త్రోభవతి యదేనార్చన్తి,' అర్క మన్నం భవత్యర్చతిభూతాని. (నిరుక్తమ్ 5-4) అర్చ ధాతువు కు పూజించు, గౌరవించు, తృప్తిపరుచు అనే అర్థాలున్నాయి. మూలఇండోయూరోపియన్ భాషలో 'ఎర్క్' కు పాటఅనే అర్థం ఉంది.

అనుష్టుభ్ వ్యుత్పత్తి శాస్త్రీయంగా నిరుక్తంలో నిరూపించబడింది. 'అనుష్టు బనుష్టోభనాత్, గాయత్రీమేవత్రిపదాం సతీంచతుర్థేన పాదేనానుష్టోభతీతిచ బ్రాహ్మణమ్.' (నిరుక్తమ్ 7-12) మూడు పాదాలుగల గాయత్రికి ఇంకోపాదాన్ని అధికంగా చేర్చి 'ప్రశంసావ్యక్తీకరణ అధికంగా చేర్చేది' అనే పదవ్యుత్పత్తి కలది అనుష్టుప్ 'స్తుభ్' సంస్కృత ధాతువు. ఇది ఇండోయూరోపియన్ 'స్తైఉ' బిగ్గరగా ప్రశంసించు అవెస్త 'స్తఓ, ఇతి' అతడు 'పొగుడుతాడు' అనే పదాలతో సంబంధంకలది.

'భీమోబిభ్యత్యస్మాత్' భయంకరమైన అర్థంకల భీమశబ్దం సంస్కృత 'భీ' భయపడు అనే ధాతుసంబంధి. ఈ సంస్కృత 'భీ' ధాతువు ఇండోయూరోపియన్*భీ 'భయపడు' లిథూలి యన్ బిజోతి-స్ 'భయపడు' లతో సంబంధం కల్గిఉంది. అత్యంత ప్రాచీన కాలంలోనే యాస్కుడు అనేక పదవ్యుత్పత్తుల్ని శాస్త్రీయంగా సాధించగల్గటం మనకు ఆశ్చర్యాన్ని కల్గిస్తుంది. ప్రపంచంలోనే పదవ్యుత్పత్తి శాస్త్రానికి యాస్కాచార్యుడు ఆద్యుడు.

Etymology అనే ఆంగ్లపదం ఫ్రెంచిభాషా పదమైన etymologia (<Latin etymologia <Greek etumologia) అనే శబ్దం నుంచి నిష్పన్నమైన ప్రతిదేయ పదం. గ్రీకు etumologia శబ్దం etumos వాస్తవమైన logos 'వివరణ' అనే శబ్దాల కలయిక వల్ల ఏర్పడ్డ సమాసరూపం. శబ్ద వ్యుత్పత్తి పరంగాచూస్తే etymology అంటే (పదం యొక్క) వాస్తవమైన వివరణను ఇవ్వడం అని మనం భావించవచ్చు. సంస్కృత 'విధవా' శబ్దానికి గ్రీకులో peitheos, Latin లో vidua, ఆంగ్లంలో widow అవెస్తలో విదవా అనీ సజాతీయ భాషాపదాలున్నాయి. విధవా శబ్దం నుంచి ధవ శబ్దాన్ని తప్పుగా విరచి ఏర్పరచిన ధవ శబ్దానికి 'భర్త' అని అర్థం చెప్పి 'విధవా' అంటే భర్తలేనిది అనే అర్థాన్ని కల్పించారు. మధురాక్షసుణ్ణి చంపినవాడు మాధవుడు, కాని మా – ధవ శబ్దానికి లక్ష్మీపతి అనే అర్థాన్ని పరికల్పించడంతో పాటు శచీధవ – గౌరీధవ – మొదలైన శబ్దాల్ని సృజించారు. ఈ రీతిగా పరిశీలిస్తే ధవశబ్ద యథార్థ చరిత్రను తెలుసుకోవచ్చు. ఈ విధంగానే అసుర శబ్దంనుంచి సుర శబ్దాన్ని తప్పుగా విరచటం ద్వారా నిష్పన్నంచేసి సురను (మద్యాన్ని) తీసుకున్నవారు సురలు (దేవతలు) అనీ సురను తీసుకోని వారు అసురులు (రాక్షసులు) అనీ కృతకవ్యుత్పత్తుల్ని కల్పించారు. అవెస్తలోని అహుర, 'ప్రభువు' శబ్దపరిశీలన బట్టి ఈ విషయం నిరూపితమైంది.

ఒకపదానికి అనేకార్థాలు ఆదికాలంనించీఉండవు. ఏపదానికైనా అనేకార్థాలు ఉన్నట్లు గమనిస్తే తత్కారణాల్ని అన్వేషించాలి. సాని శబ్దానికి 1. రాణి, 2. వేశ్య, 3. సేనాపతి, 4. భార్య అనేఅర్థాలు ఉన్నాయి. సంస్కృత స్వామినీ శబ్దంనుంచి నిష్పన్నమైన సాని పదానికి రాణి, వేశ్య అనే అర్థాలు ఉన్నాయి. సాని పదానికి మొదట ప్రభ్వి అనేఅర్థం ఉండేదనీ వేశ్య అనేఅర్థం కాలక్రమేణా అర్థవిపరిణామం కారణంగా కల్గిందనీ భావించవచ్చు. సేనాపతి అనే అర్థం ఇచ్చే సాని శబ్దం ప్రాకృత సాహిణి (<సం. సాధనిన్, సేనాపతి) శబ్దనిష్పన్నం. బాతు పదానికి 1. అన్నం, 2. పక్షి విశేషం అనే రెండు అర్థాలు ఉన్నాయి. అన్నం అనే అర్థాన్నిచ్చే బాతు ఉర్దూభాత్ (<హిందీభాత్) శబ్ద నిష్పన్నం, పక్షి విశేషమైన బాతు

పోర్చుగీసు ప్రాతు శబ్దోత్పన్నం. భిన్నప్రకృతికాలైనప్పుడు భిన్నారోపాల్ని కోశాల్లో ఇవ్వాలి. ఈ వ్యుత్పత్తి కోశంలో ఈ పద్ధతి అనుసరించబడింది.

ఒక భాషలోని శబ్దరాశిని దేశ్యపదజాలమనీ, అన్య దేశ్య పదజాలమనీ రెండుప్రకాలుగా విభజించవచ్చు. స్వీయమూలభాషనుంచి నిసర్గంగా సిద్ధించిన పదజాలాన్ని దేశ్యశబ్దరాశి అని, సజాతీయ భాషల నుంచి లేదా విజాతీయ భాషలనుంచి ఎరవుగా తీసుకొన్న పదాల్ని అన్యదేశ్య శబ్దాలనీ నిర్వచించవచ్చు. కోశంలో ఈ శబ్దరాశి అంతాఉండాలి. పదాలచరిత్రను అవగతం చేసుకోవడంద్వారా ఆయా ప్రజల సాంస్కృతిక చరిత్రను తెలుసుకోవడం సాధ్యమౌతుంది. 'త్రాసులంబోని చిత్తంబులతోడుత, ప్రజవివాదములెడఁ బక్షముడిగి.' భార. శాంతి. 2.375. అని తిక్కనగారు త్రాసుశబ్దాన్ని ప్రయోగించడాన్ని బట్టి. 'ఓగిరానకు త్రాసునాయమువల్ను' (దక్షిణహిందూ శిలాశాసనాలు 10. సం. క్రీ.శ. 1278) అని ఈపూరు శాసనంలో ఉండటాన్ని బట్టి మహమ్మదీయులకు, ఆంధ్రులకు వాణిజ్య సంబంధాలు క్రీ. శ. 13వ శతాబ్దినాటికే ఉన్నాయని చెప్పవచ్చు. పారసీ 'తరాజూ' శబ్దం వర్ణలోపంవల్ల 'త్రాసు'గా తెలుగులో ప్రతిదేయ పదంగా ప్రవేశించింది. ఈ విధంగానే తెలుగులోని అరబీ, తురికీ, కత్తలాని, లింగణా పదాలు ఆంధ్రపారసీక దేశాల మధ్యజరిగిన అశ్వవ్యాపారాన్ని విశదం చేస్తున్నాయి. పోర్చుగీసు భాషనుంచి తెలుగులో ప్రవేశించిన అనాస (< పోర్చు అననాస్); బొప్పాయి (<పోర్చు పపైయా); బాల్చీ. బాల్దీ (< పోర్చు. బల్ది); పాదరి, పాదిరి (పోర్చు. ప్యాద్రి); సబ్బాతు (పోర్చు. సాబాదు) మొదలైన పదాల చరిత్రవల్ల ఆంధ్ర పోర్చుగీసు ప్రజలమధ్యగల మతసాంస్కృతికాది సంబంధాల్ని మనం అర్థం చేసుకోవచ్చు.

ఒక భాషా కుటుంబానికి చెందిన వివిధ భాషల్లోని శబ్దాల అర్థాల్ని పరిశీలించి వాటిమూల భాషా సాంస్కృతిక చరిత్రను పునర్నిర్మించవచ్చు. ఈ కింది పదాల పరిశీలన వల్ల మూల ద్రావిడభాషా వ్యవహర్తల నాగరికతను మనం తెలుసుకోవచ్చు. త. కోట్టై, 'కోట' కోటు, 'కోట'; మ. కోట, కోట; కోటు 'కోట'; కోట కొట్, కుట; 'రాజప్రసాదం,; తొద. క్వాట్. 'బంగళా'.; క. కోటె 'కోట'; కొడ. కోటె 'ప్రసాదం'; తుళు. కోటె 'కోట'; తె. కోట. (D.E.D.P. 147. No. 1831).

< మూ. ద్రా. *కోట్ట్--'కోట'

త. నకర్ 'ఇల్లు' వాసస్థానం, గుడి, రాజనగరు, పట్టణం, నకర్, పట్టణం, నగరం. తుళు. నగరు మైది, తె. నగరు రాజప్రసాదం. (D.E.D. P. 235, No. 2943).

< మూ. ద్రా. *నకర్–'నగరం.'

మూలద్రావిడ భాషావ్యవహర్తలు నగరవాసులనీ కోటలలో వారిపెద్దలు నివసించేవారనీ మనం భావించవచ్చు.

వ్యుత్పత్తికోశాలనీ చారిత్రక కోశాలనీ, వర్ణనాత్మక కోశాలనీ నిఘంటువుల్ని మూడు రకాలుగా విభజించవచ్చు. వ్యుత్పత్తికోశాల్ని రెండు విధాలుగా సిద్ధంచేయవచ్చు. ఒక భాషలోని పదాల్ని ప్రధానారోపాలుగా ఇచ్చి వాటికి సజాతీయ పదాల్ని ఇవ్వటం ఒక పద్ధతి. ఈ విధానాన్ని అనుసరించి ఈ 'తెలుగువ్యుత్పత్తి కోశం' రూపొందించబడింది. ప్రాచీనశబ్దరూపాన్ని గాని పునర్నిర్మిత శబ్దరూపాన్ని గాని ప్రధానారోపంగా గ్రహించి దానికింద సజాతీయ పదాల్ని ఇవ్వడం ఇంకో పద్ధతి. ఈ రీతిని తయారైన నిఘంటువుల్లో ఆర్. ఎల్. టర్నర్‌గారి 'A Comparative Dictionary of Indo-Aryan family of Languages' ప్రసిద్ధమైంది. ఒక భాషలో ఉన్న పదాల అర్థాన్ని కాలానుగుణంగా సంపుటిస్తే చారిత్రక కోశం తయారౌతుంది. Oxford English Dictionary సంపూర్ణమైన ప్రథమ చారిత్రక కోశం. పూనా దక్కను కాలేజివారు నిర్మిస్తున్న చారిత్రక సంస్కృత కోశం శాస్త్రీయంగా రూపొందుతూంది.

వ్యవహారంలో ఉన్న భాషా పదాలతో మాత్రం రూపొందించే కోశాన్ని వర్ణనాత్మక కోశం అంటారు. వ్యుత్పత్తి చారిత్రక వర్ణనాత్మకకోశ నిర్మాణం సాధ్యమా అంటే సాధ్యమనే చెప్పవచ్చు. 'తెలుగు వ్యుత్పత్తి కోశం' ప్రధానంగా వ్యుత్పత్తికోశమైనప్పటికీ చారిత్రకవర్ణనాత్మకలక్షణాల్ని కూడా పాటించి ఇది తయారు చేయబడింది. పదాల అర్థాలు కాలానుగుణంగా ఇవ్వబడ్డాయి. శబ్దరత్నాకర, సూర్యరాయాంధ్రాది పూర్వనిఘంటుకర్తలకు కవిత్రయ భారతం మీద ఉండే ప్రమాణ బుద్ధి కారణంగా చాలవరకు చారిత్రక కోశాలుగా రూపొందాయి. నన్నయ, నన్నిచోడ, తిక్కన, శ్రీనాథాది పదప్రయోగ కోశాలవల్ల ఈ వ్యుత్పత్తి కోశాన్ని చారిత్రకంగా కూడా రూపొందించడానికి వీలు కలిగింది. ఆకు శబ్దానికి ఇవ్వ బడ్డ అర్థాల్ని సజాతీయ పదాల్ని పరిశీలిస్తే ఈ విషయం స్పష్టమౌతుంది.

ఆకు. వి. **1.** పర్ణం, పత్రం. భార. అర. **2.174 ; 2.** ఋణాది వ్యవహార పత్రం, విజ్ఞా. వ్యవ. **38 ; 3.** చెవికమ్మ. నృసిం. **2.86 ; 4.** అధికార పత్రం, ఆజ్ఞాపత్రం భోజ. **4.45 ; 5.** తమల పాకు. కళా. **4.69 ; 6.** తాటాకు పుస్తకంలో ఒక పత్రం. ప్రభా. **5.74 ; 7.** జేబు, ప్రభా. **4.45 ; 8.** బండికంటి ఆకు, అరం ; **9.** రాట్నం, పంటె. మొ. వాటిఆకు లేదా ఋద్ద ; **10.** తలుపులకు అమర్చే ఆకు ; **11.** వరి మొ. నారు ; **12.** పొర, చెక్కు ; **13.** పైనకట్టుబడి బొద్దుమీది నల్చదరపు చెక్కడంపని ; **14.** కొడవలి, కత్తి మొ. వాటిఅంచు ; **15.** ఉన్ని, కత్తెరపదను ; విణ. **1** సమస్తపదాల్లో పూర్వపదంగా ; ఆకుపచ్చని ; **2** పలచని.

క. ఆకు. పర్ణం, నారు ; అగె. మొలక, పిలక, అంకురం ; అగు. కలుగు, పెరుగు ; తు. అగె. మొగ్గ ; పో. చూ. యెగ్గెల్. రెమ్మ. పో. చూ. త. అక్కై. మొలకెత్తు, వర్ధిల్లు ; పో. చూ. ఇలై. ఆకు ; ఇవిర్. మొలకెత్తు ; మ. అక. చిగురు, మొగ్గ ; అకిక్క, అకక్కుక. మొలకెత్తు, కెత్తు, మొగ్గతొడుగు ; గో. ఆకీ. పర్ణం ; కుంచ. ఆకె. కుఇ. ఆకు. పర్ణం, గ్రంథపత్రం, దరఖాస్తు ; ఆకూ. పర్జి. ఎవ్. పర్ణం ; నాయ. ఒల్లా. ఎగ్. పో. చూ. కురు. అక్కాల్.

< మూ. ద్రా. * ఆక్– | అకై– ; మూ. మ. ద్రా. *ఎగ్–*ఎవ్

(తెలుగు వ్యుత్పత్తికోశం, పుట **141**)

అలికిర్లాంతరు వంటి వ్యవహారిక రూపాలు కూడా వ్యుత్పత్తితో పాటు ఈ కోశంలో ఇవ్వ బడ్డాయి.

'అలికిర్లాంతరు. వి. హరికేన్ లాంతరు, తుఫానుగాలికి కూడ ఆరని దీపం.

ఇం. హరికేన్. గాలివాన ; లాంతరు దీపంబుడ్డి.

< ఇం. Hurricane lantern.

(తెలుగువ్యుత్పత్తికోశం, పుట **119**)

ఈ 'తెలుగువ్యుత్పత్తికోశం' ప్రధానంగా వ్యుత్పత్తిప్రదర్శకంగా ఉంది. వ్యుత్పత్తికోశాల గురించి సరియైనఅవగాహన పలువురికిలేదు. అమరకోశవ్యాఖ్యానమైన గురుబాలప్రబోధిక విధంగా ఉంటేనే వ్యుత్పత్తి ప్రదర్శక గ్రంథమని చాలామంది తలుస్తున్నారు. అధునిక భాషాశాస్త్రవేత్తల దృక్ప థాన్ని అనుసరించిచూస్తే ఒకపదానికి ఉన్న యథార్థ చరిత్ర చిత్రణాన్ని (పదంయొక్క పుట్టుపూర్వోత్త రాల్ని తెలపటం, దేశ్యశబ్దమైతే సజాతీయ పదాల్ని ఇవ్వటం, అన్యదేశ్యమైతే ఏభాషనుంచి పదం గ్రహింప బడిందో ఆ భాషా శబ్దస్వరూపాన్ని అర్థసహితంగా ప్రదర్శించి నిష్పన్నంచేయడం మొదలైన వాస్తవాలైన వివరణ లివ్వడం) వ్యుత్పత్తిగా భావించవచ్చు. ఆధునిక భాషాశాస్త్రప్రమాణాలకు అనుగుణంగా ఈకోశం నిర్మించ బడింది ; ప్రాచీనపద్ధతిలో కూడా అక్కడక్కడా వ్యుత్పత్తులు ప్రదర్శించబడ్డాయి. ప్రాచీనాధునిక పద్ధతులకు విరోధంలేదు, ప్రాచీనరీతులకు ఆధునిక విధానాలు పరిపూరకాలు.

కవిత్రయ భారతంలో అనేక పదవ్యుత్పత్తులు పేర్కొన బడ్డాయి. 'కురుకుల విభుండగు ధర్మస్థిరమతియగు నితండనుచు ధృతిఁజేసి యుధిష్ఠిరుండను నామముఁ దానుచ్చరించె నాకాశవాణి జన వినుతముగన్'

(భార. ఆది. 5–97)

(యుద్ధంలో) స్థిరత్వం కలవాడు కాగలడని ఆకాశవాణి యుధిష్ఠిరుడనే పేరుపెట్టింది.

'జరయను రాక్షసిచేత సంధింపఁబడినవాఁడు గావున జరాసంధుఁడను పేరిడి.'

(భార. సభా. 1.154)

'ధరణియెల్ల గెలిచి తగధనంబులుగొని
యునికినే ధనంజయుండ నైతి
నెట్టివారినైన నెదిరినఁ బోరజ
యంబుగొనుట విజయుఁడంద్రునన్ను.' (భార. విరా. 4.141)

'సత్యంబు వలుకుట సత్యవంతుండన నతఁడొప్పు' (భార. అర. 7.181)

భూమిని జయించి ధనసంకలనం చేసిన కారణంగా ధనంజయుడనీ, యుద్ధంలో ఎట్లాంటి వాళ్ళనైన జయించేవాడు కాబట్టి విజయుడనీ అర్జునుణ్ణి అన్నారు. సత్యం పలికేవాడు కాబట్టి సత్యవంతు డన్నారు. ఈ విధంగా ఆంధ్ర మహాభారతంలో 'యుధిష్ఠిర, జరాసంధ, ధనంజయ, విజయ, సత్యవంతాది శబ్దాలపదవ్యుత్పత్తులు చెప్పబడ్డాయి.

కవిత్వంలో విశేషణాన్ని సాభిప్రాయంగా ప్రయోగిస్తే పరికరాలంకారమంటారు. సాభిప్రాయంగా విశేషణాన్ని వాడటమంటే వ్యుత్పత్తి ప్రదర్శకంగా ప్రయోగించటం అని అర్థం. అప్పయ్యదీక్షితులువారు కువలయానందంలో

'అలంకారః పరికరః సాభిప్రాయే విశేషణే
సుధాంశుకలితోత్తంసస్తాపంహరతువః శివః' (62)

విశేషణం సాభిప్రాయంగా ఉంటే పరికరాలంకార మౌతుంది అని లక్షణం చెప్పి సుధాంశు కలితోత్తంసుడైన శివుడు మీ తాపాన్ని హరించుగాక అని లక్ష్యాన్ని ఇచ్చారు. ఇక్కడ శివుడికి విశేషణంగా ప్రయోగించబడ్డ 'సుధాంశుకలితోత్తంస' శబ్దం సాభిప్రాయంగా (అమృత కిరణుడైన) చల్లని చంద్రుణ్ణి సిగబంతిగా కలవాడు కనుకనే తాపహరణ సామర్థ్యం కలవాడనడం) ఉంది. ఈ లక్ష్యంలో సాభిప్రాయ విశేషణం ఒకటి మాత్రమే ఉంది. అనేక విశేషణాలు సాభిప్రాయాలుగా ఉంటే పరికరా లంకారం ఇంకా పుష్టిగా ఉంటుంది. పండిత జగన్నాథరాయలు 'విశేషణానాం సాభిప్రాయత్వం పరికరః' అని పరికర లక్షణాన్ని నిర్వచించి నిరూపించారు.

'సర్వాశుచి నిధానస్య కృతఘ్నస్య వినాశినః
శరీరకస్యాపి కృతే మూఢాః పాపానికుర్వతే'

అనే శ్లోకంలో దేహహేయత్వాన్ని తెల్పటానికి 'అన్ని అశుచులకు ఆలవాలమైన, చేసిన మేలు మరచిపోయే, నశించే' అనే విశేషణాలు సాభిప్రాయంగా ప్రయుక్తాలయ్యాయి.

విశేష్యం సాభిప్రాయంగా ప్రయుక్తమైతే పరికరాంకురాలంకారమని వ్యవహరిస్తారు.

'సాభిప్రాయే విశేష్యేతు భవేత్ పరికరాఙ్కురః
చతుర్ణాంపురుషార్థానాం దాతా దేవశ్చతుర్భుజః' (63)

అని అప్పయదీక్షితులవారు విశేష్యం సాభిప్రాయకమైతే పరికరాంకురాలంకారమౌతుం దని పేర్కొని దేవుడైన చతుర్భుజుడు పురుషార్థ (ధర్మార్థ కామమోక్ష) ప్రదాత అని లక్ష్యాన్ని చూపారు. నాలుగు చేతులుగలవాడు ధర్మార్థ కామ మోక్షాలైన నాలుగు పురుషార్థాల్ని ఇవ్వడానికి సమర్థుడు అని తెలియజెప్పడం ద్వారా చతుర్భుజశబ్దం సాభిప్రాయ విశేష్యం. పరికరపరికరాంకురాలంకారాలు సాభిప్రాయ గర్భాలై ప్రాయికంగా పదవ్యుత్పత్తి ప్రదర్శకాలై ఉన్నాయి.

తెలుగులో వ్యుత్పత్తికోశాన్ని వెలయింప చేయాలనే సంకల్పంతో ఆంధ్ర విశ్వకళాపరిషత్తును ప్రేరేపించినవారు ఆచార్య బ్రహ్మశ్రీ గంటిజోగి సోమయాజిగారు. వారి పూనిక ఫలితంగా యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్‌వారు 1957 సం॥లో ఒకలక్ష పదివేల రూపాయల్ని మంజూరు చేశారు. ఈ పథకం 1962 మార్చి 31 వరకు కొనసాగింది. ఈ కోశం రూపొందడంలో తొలిదశలో తెలుగుపదాల ప్రధానారోపాలు ఉపారోపాలు, రోమన్ లిపిలోను, వాటి అర్థాలు అంగ్లంలోను ఇవ్వబడ్డాయి. ద్వితీయ పంచవర్ష ప్రణాళికాకాలం (1957–1962) లో ఈ పథకంలో పనిచేసినవారు :

ఆచార్య జి. జె. సోమయాజి
డాక్టర్ యస్వీ. జోగారావు
డాక్టర్ టి. దొణప్ప
డాక్టర్ ఎమ్. వి. సత్యనారాయణ
డాక్టర్ ఎన్. కుమారస్వామిరాజా
డాక్టర్ బి. రామచంద్రరావు
డాక్టర్ ఎస్. శ్రీరామచంద్రమూర్తి
డాక్టర్ బి. పురుషోత్తం
శ్రీ డి. వెంకటేశ్వర్లు (టైపిస్టు)
శ్రీ బి. అప్పారావు (ప్యూన్)

అనివార్య కారణాలవల్ల తృతీయ పంచవర్ష ప్రణాళికా కాలం (1967–1972)లో ఈ బృహన్నిఘంటు నిర్మాణ కార్యక్రమం ఆపివేయబడింది. చతుర్థపంచవర్ష ప్రణాళికా కాలంలో ఈ కోశాన్ని పూర్తి చేసే తలంపుతో ఒక పథకాన్ని యూనివర్సిటీవారు యు.జి.సి. కి సమర్పించారు. ద్వితీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో జరిగిన పథకాభివృద్ధిని సమీక్షించడానికిగాను ఒక నిపుణుల సంఘాన్ని నియమించి వారి నివేదికను తమకు పంపవలసిందిగా ఆంధ్ర విశ్వకళాపరిషత్తును యు. జి. సి. వారు కోరారు. అప్పటి విశ్వకళాపరిషదుపాధ్యక్షులైన శ్రీ ఎల్. బుల్లయ్యగారు ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి, ఆచార్య జి.ఎన్. రెడ్డిగార్లతో ఒకనిపుణుల సంఘాన్ని నియమించారు. ఈ నిపుణుల సంఘం మొదటి పథకాన్ని సవరించి నివేదికను విశ్వవిద్యాలయం వారికి సమర్పించారు. ఈ సంఘసభ్యులు ఈ నిఘంటువు సంపూర్ణంగా తెలుగులో ఉంటేనే బాగుంటుందనీ అంగ్లంలో అనవసరమనీ భావించారు. ఈ నివేదికను యు. జి. సి. వారు అంగీకరించి 2,50,000 రూపాయల్ని మంజూరు చేశారు. కొంతవరకు ఆంగ్లీకరించబడ్డ తెలుగు నిఘంటువు జూన్ 1970 నుంచి ఆంధ్రీకరించబడసాగింది. అప్పటినుంచి ఏప్రిల్ 1976 వరకు ఆచార్య తూమాటి దొణప్పగారి ఆధ్వర్యంలో ఈ పథకం కొనసాగింది. ఈ కాలంలో 1955 ఆరోపాలు ముద్రణకు ఇవ్వబడ్డాయి. ఈ దశలో పనిచేసినవారు :

డా. తూమాటి దొణప్ప
శ్రీ ఎమ్.వి.యల్. నరసింహారావు
కీ.శే. ప్రయాగ కోదండరామశాస్త్రి
డా. జి.వి.ఎస్.ఆర్. కృష్ణమూర్తి
డా. ఆర్. శ్రీరామశాస్త్రి

శ్రీ వై. బాలగంగాధరరావు
శ్రీ జి. వెంకటస్వామి
శ్రీ అత్తలూరి నరసింహరావు
శ్రీ ఎమ్. శ్రీనివాసులరెడ్డి
శ్రీ జి. వి. సీతారాం (టైపిస్టు)
శ్రీ బి. నూకారెడ్డి (ప్యూన్)

పంచమ పంచవర్ష ప్రణాళికలో యు.జి.సి. సాయం ఆగిపోయింది. ఇప్పటి విశ్వకళాపరిషదుపాధ్యక్షులైన శ్రీ ఎమ్.ఆర్. అప్పారావు, ఎమ్.ఏ.,ఎమ్.ఎల్.ఏ. గారి ఉదారవైఖరివల్ల ఆంధ్ర భాషమీద వారికిగల అధికాదర విశేషంవల్ల వారు పూనికతో విశ్వవిద్యాలయం తరపున రెండు లక్షల రూపాయలు మంజూరు చేయడమే కాక ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంచేత మరో రెండు లక్షల రూపాయలు మంజూరు చేయించారు. ఆచార్య తూమాటి దొణప్పగారు గుంటూరు బదిలీ కాగా తెలుగు వ్యుత్పత్తికోశ పథకానికి డైరెక్టర్‌గాను చీఫ్ ఎడిటర్‌గాను ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారు విశ్వవిద్యాలయ తెలుగుశాఖలో లెక్చరర్‌గా ఉన్న నన్ను నియమించగా నేను 1-6-1976న యీ నిమంటు నిర్మాణ బాధ్యతల్ని స్వీకరించాను. తెలుగు వ్యుత్పత్తికోశం కార్యాలయ సిబ్బంది సంపూర్ణ సహకారాలవల్ల 12,219 ఆరోపాలతో కూడిన మొదటి సంపుటాన్ని నేను పూర్ణంగా రూపొందించి 20-11-76న ఆంధ్ర విశ్వకళాపరిషన్ముద్రణాలయానికి ఇవ్వటం జరిగింది. ఈ కృషిలో భాగస్వాములు :

డా. ఎల్. చక్రధరరావు
కీ.శే. ప్రయాగ కోదండరామశాస్త్రి
డా. జి. వి. ఎస్. ఆర్. కృష్ణమూర్తి
డా. బి. అరుణకుమారి
శ్రీ ఇ. విశ్వనాథరెడ్డి
శ్రీ అత్తలూరి నరసింహరావు
శ్రీ ఎల్.కె. మల్లేశ్వరరావు
కుమారి కె. కనకమహలక్ష్మి
శ్రీ జి. వి. సీతారాం (టైపిస్టు)
శ్రీ బి. నూకారెడ్డి (ప్యూన్)

ఈ పథకంలో చిరకాలం పనిచేసిన శ్రీ ప్రయాగ కోదండరామశాస్త్రిగారు 20-9-1976 న దివంగతులయ్యారు. వారి శ్రీమతికి ఉద్యోగం ఇవ్వటంద్వారా వారి కుటుంబానికిశాశ్వతోపాధిని కల్పించిన విశ్వవిద్యాలయంవారికి కృతజ్ఞతలు.

ఈ పథకాభివృద్ధికి సలహాలివ్వడానికి సలహా సంఘాన్ని ఆంధ్ర విశ్వకళాపరిషదుపాధ్యక్షులైన శ్రీ ఎమ్. ఆర్. అప్పారావు, ఎమ్.ఏ., ఎమ్.ఎల్.ఏ. గారు నియమించారు. వీరి విలువైన సలహాలు విశేష ప్రేరకాలుకాగా తెలుగు వ్యుత్పత్తికోశం త్వరితగతిని పురోగతిని సాధించింది. ఈ సలహా సంఘ సభ్యులు :

శ్రీ ఎమ్. ఆర్. అప్పారావు, ఎమ్.ఏ., ఎమ్.ఎల్.ఏ. (అధ్యక్షులు)
డా. ఎల్. చక్రధరరావు (కార్యదర్శి)
డా. వడ్లమూడి గోపాలకృష్ణయ్య
శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య
ఆచార్య యస్వీ. జోగారావు
ఆచార్య జి. ఎన్. రెడ్డి
ఆచార్య తూమాటి దొణప్ప

స్వల్పకాలంలోనే ఈ సలహా సంఘం మూడుసార్లు సమావేశమై సముచిత నిర్ణయాల్ని తీసుకొంది. 20–10–1976 సలహా సంఘ సమావేశంలో 'తెలుగు వ్యుత్పత్తికోశం' అని ఈ నిఘంటువుకు పేరు పెట్టాలని తీర్మానించటం జరిగింది.

ఇటీవల తెలుగు వ్యుత్పత్తికోశ సలహాసంఘం పునర్వ్యవస్థీకరించబడింది. నూతనసలహాసంఘం :

శ్రీ ఎమ్.ఆర్. అప్పారావు, ఎమ్.ఏ., ఎమ్.ఎల్.ఏ. (అధ్యక్షులు)
డా. ఎల్. చక్రధరరావు, ఎమ్.ఏ., పిఎచ్.డి. (కార్యదర్శి)
డా. బెజవాడ గోపాలరెడ్డి, డి.లిట్.
డా. వడ్లమూడి గోపాలకృష్ణయ్య
శ్రీమతి టి.ఎన్. అనసూయాదేవి, ఎమ్.ఎల్.ఏ.
శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య
ఆచార్య జి.ఎన్. రెడ్డి, ఎమ్.ఏ., పిఎచ్.డి.
ఆచార్య యస్వీ. జోగారావు, ఎమ్.ఏ., పిఎచ్.డి.

12, 219 ప్రధానారోపాలతో ఉన్న ఈ నిఘంటువు ప్రథమ సంపుటంలో 12 అచ్చుల (అ, ఆ, ఇ, ఈ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ) తో మొదలయ్యే పదాలు ఉన్నాయి. అర్థ విపరిణామం చెందని తత్సమ పదాలు తప్ప తక్కిన అన్ని రకాల పదాలు (దేశ్యాలు, అన్యదేశ్యాలు) ఈ కోశంలో గ్రహించబడ్డాయి.

'క' నుంచి 'న' వరకు మొదలయ్యే పదాలతో కూడిన ద్వితీయ సంపుటం 31–3–1979 నాటికి పూర్తి కాగలదనీ 'ప' నుంచి 'హ' వరకు మొదలయ్యే పదాలతో కూడిన తృతీయ సంపుటం 31–3–1984 నాటికి పూర్తి ఔతుందని ఆశిస్తున్నాం. ఆంధ్రనామ సంగ్రహాది ప్రాచీన నిఘంటువుల్ని పరిశీలించటమే కాకుండా లభ్యమైన వృత్తి పదకోశాల్ని మాండలిక కోశాల్ని వివిధ పద ప్రయోగ పట్టికల్ని పరిశీలించి రూపొందించిన ఈ 'తెలుగు వ్యుత్పత్తికోశం' తెలుగు ప్రజలకు అత్యంతోపయోగకారి కాగలదని ఆకాంక్షిస్తున్నాం. ద్రావిడ భాష లన్నింటిలోను ఇటువంటి వ్యుత్పత్తికోశాలు ప్రకటించబడితే మూల ద్రావిడ భాషా స్వరూపం స్పష్టమౌతుంది. ఈ తులనాత్మక భాషా పరిశీలనవల్ల వర్ణాలూ, పదాలూ, పునర్నిర్మితాలౌతాయి.

మూల ద్రావిడ భాషాచ్చులు

| | అగ్రం | కేంద్రం | పశ్చిమం |
|---|---|---|---|
| ఉన్నతం | ఇ ఈ | | ఉ ఊ |
| మధ్యమం | ఎ ఏ | | ఒ ఓ |
| నిమ్నం | | అ ఆ | |

మూల ద్రావిడ భాషా హల్లులు

| | కంఠ్యం | తాలవ్యం | మూర్ధన్యం | దంతమూలీయం | దంత్యం | ఓష్ఠ్యం |
|---|---|---|---|---|---|---|
| స్పర్శం | క | చ | ట | త̱ | త | ప |
| అనునాసికం | | ఞ | ణ | న̱ | న | మ |
| అంతస్థం | | య | | | | వ |
| కంపితం | | | | ర | | |
| పార్శ్వికం | | | ళ | ల | | |
| పార్శ్వికఈషత్స్పృష్టోష్మం | | | ఴ | | | |

క్రీ.శ. 575 సంవత్సరంలో ఎరికల్ముత్తురాజు బిరుదు గల ధనంజయుడు ఎఱ్ఱగుడిపాడు శిలా శాసనాన్ని కలమళ్ళ శాసనాన్ని వేయించడంతో తెలుగు భాషా రచనకు శ్రీకారం చుట్టబడింది. తర్వాత పలు శిలాశాసనాలు వేయబడ్డాయి. నన్నయగారి భారతావిర్భావం (క్రీ.శ. 1022–1062) తో ఆంధ్ర సారస్వతం వికసించింది. అనంతరం అనేక సహస్ర గ్రంథాలు ఆంధ్రంలో అవిర్భవించాయి. ఈ శాసన సారస్వత పరిశీలనవల్ల ఆంధ్ర భాషా ప్రాచీన స్వరూపం స్పష్టమౌతుంది.

### ప్రాచీన తెలుగు వర్ణాలు

#### అచ్చులు

| | అగ్రం | కేంద్రం | పశ్చిమం |
|---|---|---|---|
| ఉన్నతం | ఇ ఈ | | ఉ ఊ |
| మధ్యమం | ఎ ఏ | | ఒ ఓ |
| నిమ్నం | | అ ఆ | |

ప్రాచీనాంధ్ర పదాలలో ఐ, ఔ వర్ణాలు సంస్కృత భాషా ప్రభావంవల్లనూ బ్రాహ్మీ లిపిని మనం అనుసరించిన కారణంగానూ వచ్చినట్లు కన్పిస్తున్నాయి. కాని ఉచ్చారణలో ఐ కారం 'అయ్' తో సమానం; ఔ కారం 'అవ్' తో సమానం. కాబట్టి వాటిని (ఐ ఔ ల్ని) ప్రత్యేక వర్ణాలుగా గ్రహించక్కర్లేదు. సంస్కృతంలో ఉన్న ఋ, ౠ, ఌ, ౡ, ఐ, ఔ వర్ణాలు తెలుగువారు ఆ పదాలతో గ్రహించి ప్రయోగించారు. ౡ కారం మంత్రతంత్ర వ్యాకరణ వాఙ్మయాలలో మాత్రం కన్పిస్తోంది.

#### హల్లులు

| | కంఠ్యం | తాలవ్యం | మూర్ధన్యం | దంతమూలీయం | దంత్యం | ఓష్ఠ్యం | హనుమూలీయం |
|---|---|---|---|---|---|---|---|
| స్పర్శశ్వాసం | క | | ట | | త | ప | |
| స్పర్శనాదం | గ | | డ | | ద | బ | |
| స్పృష్టోష్మశ్వాసం | | చ | | ౘ | | | |
| స్పృష్టోష్మనాదం | | జ | | ౙ | | | |
| అనునాసికం | | | ణ | న | | మ | |
| అంతస్థం | | య | | | | వ | |
| తాడితం | | | | ర | | | |
| కంపితం | | | | ఱ | | | |
| పార్శ్వికం | | | ళ | ల | | | |
| ఊష్మం | | | | | స | | హ |
| పార్శ్వక ఈషత్ స్పృష్టోష్మం | | | ఴ | | | | |

సంస్కృత పదాలతో ఉర్దూ, మరాఠీ మొదలైన అన్య భాషా పదాలతో కూడి స్పర్శ తాలవ్యాలైన చ, ఛ, జ, ఝ లు; తెలుగు వర్ణాలైన క, ట, త, ప, గ, డ, ద, బ, ల కంటె మహా ప్రాణత అధిక లక్షణంగా కల ఖ, ఠ, థ, ఫ, ఘ, ఢ, ధ, భ లు తాలవ్యోష్మమైన 'శ' వర్ణం, మూర్ధన్యోష్మమైన 'ష' వర్ణం; దంతోష్ఠ్యోష్మ వర్ణమైన ఫ़ (f) వర్ణం ఉర్దూ ప్రభావంవల్ల తెలుగులో ప్రవేశించాయి.

అధునికాంధ్రంలో ప్రాచీన వర్ణాలలోని కొన్ని వర్ణాలు ఉచ్చారణ భ్రష్టాలు కాగా మరికొన్ని కొత్తగా వచ్చి చేరాయి. ఴ కారం నన్నయ కాలానికే కాలగర్భంలో కలిసిపోగా (నన్నయానంతరం

కొన్ని శాసనాల్లో 'ఱ' కారం ఉన్నప్పటికి ఆ కాలానికే అది ఉచ్చారణ భ్రష్టమైంది). నేడు 'ఱ' కారం వర్త్సస్థాయి నుంచి సవర్ణస్థాయికి దిగజారింది. ఇటువంటి మార్పులు భాషల్లో సహజంగా వస్తుంటాయి.

ఆధునికాంధ్రవర్ణాలు

అచ్చులు

| | అగ్రం | కేంద్రం | పశ్చిమం |
|---|---|---|---|
| ఉన్నతం | ఇ ఈ | | ఉ ఊ |
| మధ్యమం | ఎ ఏ | | ఒ ఓ |
| నిమ్నం | ఎ౯ | అ ఆ | |

నేటి ఉచ్చారణలో 'ఐ' కారం 'అయ్' తో సమానం 'ఔ' కారం 'అవ్' తో సమానం. కృష్ణ-క్రిష్ణవంటి చోట్ల సకృత్తుగా ఋ రిగా ఉచ్చరించబడుతున్నా ఋ, ౠ, ఌ, ౡ లు రు, రూ లు, లూ లుగా ఉచ్చరించ బడుతున్నాయి.

| | కంఠ్యం | తాలవ్యం | మూర్ధన్యం | దంతమూలీయం | దంత్యం | ఓష్ఠ్యం | హనుమూలీయం |
|---|---|---|---|---|---|---|---|
| స్పర్శశ్వాసం | క, ఖ | | ట, ఠ | | త | ప, ఫ | |
| స్పర్శనాదం | గ, ఘ | | డ, ఢ | | ద, ధ | బ, భ | |
| స్పృష్టోష్మశ్వాసం | | చ, ఛ | | ౘ | | | |
| స్పృష్టోష్మనాదం | | జ, ఝ | | ౙ | | | |
| అనునాసికం | | | ణ | న | | మ | |
| అంతస్థం | | య | | | | వ | |
| తాడితం | | | | ర | | | |
| పార్శ్వికం | | | ళ | ల | | | |
| ఊష్మం | | శ | ష | స | ఫ | | హ |

ఈ నిఘంటువులో మూలద్రావిడ ప్రాచీనాధునికాంధ్ర వర్ణాలన్నీ గ్రహించ బడ్డాయి. శబ్ద రూపాన్ని ప్రధానారోపంగా ఇచ్చింతర్వాత దాని రూపాంతరం లేదా రూపాంతరాలు (ఉంటే) చూపించ బడ్డాయి. తర్వాత అది ఏ భాషాభాగానికి చెందిందో తెలిపి దానికి ఉన్న అర్థాల్ని ప్రయోగ సహితంగా (ఉంటే) ఇచ్చి వ్యుత్పత్తి ప్రదర్శించ బడింది. ప్రధానారోపాల కింద ఉపారోపాలు (ఉంటే) గా ఇవ్వ బడ్డాయి. ఈ ఉపారోపాలు ప్రధానారోపాలుగా ఇవ్వబడ్డాయి కాని వాటిదగ్గర అర్థం చూపబడకుండా, దాని యొక్క ప్రధానారోపాన్ని సూచించడం జరిగింది. ఈ విధంగా ఉపారోపాల్ని ప్రధానారోపాలు చేయడానికి రెండు కారణాలు ఉన్నాయి. ఈ రీతిగా ఇవ్వడంవల్ల పండితులూ పామరులూ శబ్దరూపాన్ని నిఘంటువులో తేలికగా గుర్తించగల్గుతారు. ఇది వ్యుత్పత్తికోశం కాబట్టి ఉపారోపాలన్నీ తత్ ప్రధానారోప సంబంధులు అనే విషయం స్పష్టమౌతుంది. ఈ ఆరోపాల సన్నిహిత మాతృకలు వీలయినంతవరకూ ప్రదర్శించ బడ్డాయి.

భాషాశాస్త్ర పరిశోధన ఫలితంగా అనేక విషయాలు నిత్యనూతనంగా బయల్పడుతున్నాయి. గ్రంథపదపట్టికలు వృత్తిపదకోశాలు వెలువడు తున్నాయి. ఈ కారణంగా పది సంవత్సరాల కొకసారి ఈ 'తెలుగు వ్యుత్పత్తికోశం' పరిష్కరించబడి పునర్ముద్రితం కావలసిన అవసరం ఉంది. నూతన రీతిలో ద్రావిడ భాషల్లో ప్రప్రథమంగా నిర్మించబడ్డ ఈ 'తెలుగు వ్యుత్పత్తి కోశం' ఆంధ్రప్రదేశ్ ప్రజలకు ప్రమోదాన్ని ప్రయోజనాన్ని చేకూర్చ గలదనడంలో సందేహంలేదు.

కారణజన్ములైన శ్రీ పొట్టి శ్రీరాములు తమ జన్మస్థలం చెన్నపట్టణం (మద్రాసు) అయినా, నెల్లూరు జిల్లాలోని జువ్వలదిన్నెగ్రామాన్ని నివాసస్థానంగా ఏర్పరచుకొని చరిత్రగతిని గమనిస్తూ బాల్యం నుంచీ దేశభక్తిని రంగరించుకొన్నారు. 1920 లో శానిటరీ ఇంజనీరైన తర్వాత నాలుగు సంవత్సరాలకాలం రైల్వేలో ఉద్యోగం చేసి గాంధీజీ ప్రభావంవల్ల ఉద్యోగానికి రాజీనామా చేసి శ్రీ పొట్టి శ్రీరాములు సబర్మతీ

ఆశ్రమంలో బాపూజీకి ప్రియశిష్యులయ్యారు. భారత స్వాతంత్ర్య సముపార్జనకోసం అనేక పర్యాయాలు కారాగారానికి వెళ్ళారు. 1913 లోనే బాపట్లలో ప్రారంభించబడ్డ ఆంధ్రోద్యమం భారతదేశ సంపూర్ణ స్వాతంత్ర్యానంతరం పునఃప్రారంభించబడింది. ఈ మహోద్యమానికి పూర్ణసిద్ధిని కల్గించడానికిగాను శ్రీ పొట్టి శ్రీరాములు నిరవధిక నిరాహార దీక్షను ఆరంభించి, 58 రోజులు అకుంఠిత నిరాహార దీక్షానంతరం 1952 డిసెంబరు 15 వ తేదీన అసువులు బాసి అమరకీర్తిని ఆర్జించుకొన్నారు. నచ్చిఅయిన నిర్ణయాన్ని నకాలంలో చేయకపోవడం చరిత్రలో మనం తరచు చూస్తుంటాం. నిరశన దీక్షతో ప్రాణాలు పోగొట్టు కొన్నవారు చరిత్రలో అరుదు. వీరి అపూర్వ త్యాగ ఫలితంగా 1–10–1953 తారీఖున కర్నూలు రాజధానిగా ఆంధ్ర రాష్ట్రం ఆవిర్భవించింది. ఈ ఆంధ్ర రాష్ట్రమే అనంతరం హైదరాబాదు రాజధానిగా 1–11–1956 తేదీన ఆంధ్ర ప్రదేశ్‌గా రూపొందింది. రాష్ట్రానికి, భాషకు, ప్రజలకు ఉన్న సన్నిహిత సంబంధాన్ని సంభావించి, ఆంధ్ర రాష్ట్రావతరణకు అసువులర్పించిన అమరజీవి శ్రీ పొట్టి శ్రీరాములు గారికి ఈ కోశాన్ని అంకితమివ్వడం సముచితమని తెలుగు వ్యుత్పత్తికోశ సలహాసంఘాధ్యక్షులు శ్రీ ఎమ్. ఆర్. అప్పారావుగారు సూచించగా, సంఘసభ్యులందరూ ఏకగ్రీవంగా ఆమోదించారు. తర్వాత దీనికి ఆంధ్ర విశ్వకళాపరిషత్ సిండికేటు సభ్యులు తమ ఆమోదాన్ని తెలిపారు. ఈ మహానుభావునికి ఈ కోశం అంకితం కావించడం హర్షణీయం.

తమ నిరంతర ప్రోత్సాహం వల్ల ఈపథకం నిర్విఘ్నంగా కొనసాగడానికి కారకులయిన మహోదారులు, ఆంధ్రభాషా ప్రియులు, బహుసద్గ్రంథ కర్తలు, కవులు, పండితులు, కవిపండిత పోషకులు, దేశభక్తులు, ఆంధ్ర విశ్వకళాపరిషదుపాధ్యక్షులు శ్రీ ఎమ్. ఆర్. అప్పారావు, ఎమ్.ఏ., ఎమ్.ఎల్.ఏ. గారికి హృదయపూర్వక ధన్యవాదాలు.

ఈ పథక నిర్మాణానికి ఆర్థిక సహాయం చేసిన యు.జి.సి. వారికి, ఆంధ్రవిశ్వకళాపరిషత్తుకు, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వానికి,

తమ అమూల్యాలైన సలహాల ద్వారా పథక విజయానికి కారకులయిన, అనుభవజ్ఞులైన తెలుగు వ్యుత్పత్తికోశ పథక సలహా సంఘాధ్యక్షులకు, సభ్యులకు,

ఈ వ్యుత్పత్తికోశ పథకాభివృద్ధికి సర్వదా, సర్వథా సహకారాన్నందించిన ఆంధ్ర విశ్వవిద్యాలయ కార్యనిర్వహణ దక్షులు సహృదయులు రిజిస్ట్రార్ శ్రీ ఎమ్. గోపాలకృష్ణా రెడ్డి, ఎమ్. ఏ. (ఆనర్స్), బి. యల్. గారికి,

ఈ కోశాన్ని సర్వాంగ సుందరంగా ముద్రించడంలో పూర్తిగా సహకరించిన సన్ముద్రణ దీక్షా పరతంత్రులు ఆంధ్ర విశ్వకళాపరిషన్ముద్రణాలయం డైరెక్టరు డా. సి. బొ్రేశ్వరరావు గారికి,

వేదాది సంస్కృత వాఙ్మయ గత పదవ్యుత్పత్తుల్ని సేకరించటంలో సాయంచేసిన మదాంధ్ర శాఖా సంస్కృత గురువర్యులు, పుంభావ సరస్వతులు శ్రీ మధుసూదనపడంగి గారికి

హృదయపూర్వక కృతజ్ఞతలు.

తమ నిరంతర కృషి వల్ల కోశసంపూర్తికి కారకులయిన మా వ్యుత్పత్తి కోశపథక సిబ్బందికి

మనఃపూర్వకమైన అభినందనలు.

వాల్తేరు
2-2-78

లకంసాని చక్రధరరావు
ప్రధాన సంపాదకుడు

# తెలుగు వ్యుత్పత్తికోశ సలహాసంఘం

అధ్యక్షులు
శ్రీ ఎమ్. ఆర్. అప్పారావు, ఎమ్. ఏ.; ఎమ్. ఎల్. ఏ.
ఉపాధ్యక్షులు
ఆంధ్ర విశ్వకళా పరిషత్తు.

సభ్యులు

డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, డి. లిట్.
గౌరవాచార్యులు
రవీంద్ర సాహిత్యం
ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు.

వాఙ్మయ మహోధ్యక్ష
డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య
కళా-ప్రపూర్ణ
డైరెక్టర్
ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ
అండ్ రిసర్చి ఇనిస్టిట్యూట్
హైదరాబాదు.

శ్రీమతి టి. ఎన్. అనసూయాదేవి, ఎమ్. ఎల్. ఏ.
అధ్యక్షురాలు: అధికార భాషా సంఘం
హైదరాబాదు.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య
సత్తెనపల్లి.

ఆచార్య జి. ఎన్. రెడ్డి, ఎమ్. ఏ.; పిఎచ్. డి.
తెలుగు శాఖ
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం.

ఆచార్య యస్వీ. జోగారావు, ఎమ్. ఏ.; పిఎచ్. డి.
తెలుగు శాఖ
ఆంధ్ర విశ్వకళాపరిషత్తు.

డాక్టర్ ఎల్. చక్రధర రావు, ఎమ్. ఏ.; పిఎచ్. డి.
కార్యదర్శి
డైరెక్టర్; ప్రధాన సంపాదకుడు
తెలుగు వ్యుత్పత్తి కోశ పథకం.

# అ

**అ**[1] వి. తెలుగు వర్ణమాలలో తొలి వర్ణం : వివృతమై తాలవ్యేతరమైన నిరోష్ఠ్య హ్రస్వ స్వరం.

అన్ని ద్రావిడ భాషల్లోనూ ఉంది.

**అ ఆ లు** (ఉచ్చారణలో అ'ఆ లు). వి. బ.వ. 1. తెలుగు వర్ణమాల : వ్య. అ, ఆ, మొ. ; 2. తెలుగు అచ్చులు.

త. అనా౦, ఆవన్నా. తమిళ వర్ణమాల; వ్య. అ, ఆ. మొ.

**అ[2]-** రూ. ఆ[3]. సర్వ. నిర్దేశార్థకం : సమాన పూర్వపదమైన తత్పురుషార్థక ఆకారానికి కొన్ని చోట్ల వచ్చే ఆదేశం ; దూరస్థ వస్తు బోధకం.

క. తు. త. మ. కొండ. అ. నిర్దేశార్థకం.

<మూ.ద్రా. *ఆ.

**-అ[3]-** ప్రత్య. 1. ధాతువుల తుది ఉకారానికి ఆదేశంగా వచ్చే వ్యతిరేకార్థక ప్రత్యయం : చేయఁడు, చేయమి. క. అ. ధాతువుల చివర చేరే వ్యతిరేకార్థక ప్రత్యయం; పో.చూ. త. అల్. వ్యతిరేకార్థక క్రియా చిహ్నం; విధ్యర్థక ప్రథమా బ.వ. లో వ్యతిరేకార్థబోధకమైన అంతాగమం. -అ- <మూ.ద్రా. *-ఆ. 2. యుష్మ దస్మద్విశేషణాల తుది ఉకారానికి క్రమంగా వు, రు ; ను, ము- వర్ణాలు పరం అయ్యేటప్పుడు వచ్చే ఆదేశం : భరతకుల ప్రసూతులరు. భార. ఆది. 5.210; 3. ఔప విభక్తిక టి వర్ణం పరం అయ్యేటప్పుడు కొన్ని పదాల ఉకారానికి ఆదేశం : క్రిందటికి, మీఁదటికి.

**-అ[4]** రూ.చూ. ఆ[4]. ప్రత్య. 1. ప్రశ్నార్థకం. హర. 7.129 ; 2. స్వర భేదంచేత కాక్వర్థ బోధకం. కకుత్స. 4.106.

క. అ. సాదర ప్రశ్న బోధక ప్రత్యయం; సంబంధ షష్ఠిలో అవధారణార్థకం.

**-అ[5]** రూ. ఆ[3]. ప్రత్య. సంబోధన ప్రథమైకవచన ప్రత్యయం లోని ఉకారానికి ఆదేశంగా వచ్చేది : ఓ రాముఁడ.

క. అ. సాదర సంబోధనంలో అంత ప్రత్యయం.

**-అ[6]** ప్రత్య. 1. ఏవార్థకం : వాఁడ. భార. ఆది. 5.595 ; 2. అర్థ విశేషం లేకుండానే. భార. ఉద్యో. 2.20; 3. వ్యతిరేకార్థక క్రియా రూపాల్లో నిశ్చయ బోధకం ; చేయఁడ. భార. ద్రోణ. 2.89; 4. పరాపేక్షలేక స్వయంగా అనే అర్థంలో. కళా. 4.126; 5. అవ్యవధానంగా, తక్షణం : తోన. భార.ఆది. 4.151, అర. 4.94.

క. అ. సంబంధ షష్ఠిలో నిశ్చయార్థకం; త. అ. పద్యాల్లో పాదపూరక ప్రత్యయం.

**-అ[7](న్)** ప్రత్య. 1. హేత్వర్థకం : కర్ణ దుశ్శాసనుల్ గఱప. భార.ఆది. 8.12; 2. ఉద్దేశార్థకం : నిలుపఁగా. భార.ఆది. 5.8; 3. భావార్థకంలో క్రియల తుద ఆదేశం : ఉండఁ బనదు. భార.అర. 1.217; 4. ఆనంతర్యార్థకం : తలంప నన్నిది సేసె. భార.శాంతి. 5.347 ; 5. శాపార్థకం ; నినుఁ బాముదిన. కవిక. 3.127.

క. అ. ధాత్వర్థంలో అంతాగమం; త. అ. ధాత్వర్థ ప్రత్యయం.

బహుశః <మూ.ద్రా. *అల్.

**-అ[8]** ప్రత్య. మధ్యమ పురుష క్రియలకు ప్రార్థనార్థంలో వికల్పంగా : కనుగొంద. పాండు. 1.58.

**-అ[9]** కృత్ప్రత్యయం. కొన్ని ధాతువులపై విశేష్య సిద్ధికై : గీఱు > గీఱ, తునియు > తునియ.

**-అ[10]** ప్రత్య. ఔపవిభక్తికాల తృతీయా సప్తముల కాదేశం : గోట < గోరు, ఊర < ఊరు.

<మూ.ద్రా. -*అన్.

**అఆలు** చూ. అ[1].

**అంశం** వి. పచ్చని పైరు.

క. హాంసె, హావసె, పావసె. పాచి. నిలువ నీటిపై మొలిచే గడ్డిమొక్క ; తు. పచ్చ. ఆకుపచ్చ ; కొడ. పచ్చె : త. పాచ. ఆకుపచ్చగా నుండు; పాచప్పు. ఆకుపచ్చ రంగు : పాచుమయ్ ; మ. పాచు, పాయ్. పాచి, ఆకుపచ్చ ; కోట. కొద. పాచ్.

<క. హాంసె.

**అంశవవరణ** (మిశ్ర స.). వి. భిన్నాంకముల సవరణ.

<సం. అంశ-(భాగం, వంతు) + తె. సవరణ.

**అంసగుడ్డ** వి. మెరుగుగుడ్డ, కొయ్యకు మెరుగు పెట్టేటప్పుడు వడ్రంగులు రుద్దే గుడ్డ.

సం. అంస-. భుజం ; అంశు-. చివర :

క. అంచు. అంచు ; త. అంసు < సం. అంశు-. అంచు.

<సం. అంస- + తె. గుడ్డ. మిశ్ర స. ; లేదా అంస < అంచు + గుడ్డ. ఒక పక్క చింపిన గుడ్డ.

**అంసవకుంట** వి. చేపలుండే ప్రదేశం.

**అంసపాదికట్టె** వి. 1. ఇంటికప్పు దూలాలకాధారంగా నిలిపిన గుజ్జు; 2. పల్లకీ మోసేవాని చేతికర్ర.

<అంస-(సం. హంస-) పాది + కట్టె. హంస పాదం వలె చీలి వున్న కర్ర, పంగల కర్ర.

**అక** రూ.చూ. అక్క. వి. పూజ్యస్త్రీ. రాఘవ. 4.38.

**అకట** రూ.చూ. అక్కట. అవ్య. 1. అహోహో-ఆశ్చర్యార్థకం. భార.ద్రోణ. 1.109; 2. అయ్యో-సంతాపార్థకం. శృం.నై. 2.125.

**అకటవికటము** అకట+వికట(ము): రూ. అకటావికటమ్ (ఉ). విణ. వ్యత్యస్తం, తారుమారు, అడ్డదిడ్డం, సంభాషణలో అసందర్భం. వాసిష్ఠ. 2.135.

సం. అకృత-. చేయబడనిది, పూర్తికానిది ; వికృత-. వికారం, విరూపం, పరిణామం, మార్పు ; ప్రా. అకట (<సం. అకృత-చేయబడనిది)+వికట(<సం. వికృత-. తప్పుగా చేయబడినది) ; అ.మా. అకట్టు. పూర్తిచెయ్య కుండా, చెయ్యకుండా ; అకడ. చేయబడనిది. చేయనిది ; మరా. అకటోవికటో ;

క. అకటువికటు-. విరుద్ధం. విపర్యం; అగడవిగడ ; త. అకటువికటుమ్. హాస్యం, చమత్కారం, వినోదో పాయం, పితలాటకం; మ. అకటువికటు-. తలక్రిందు, తారుమారు.

<ప్రా. అకట-+వికట-.

**అకటా** రూ.చూ. అక్కట. అవ్య. సంతాపార్థకం. విక్ర. 5.147.

**అకటావికటమ్(ఉ)** రూ.చూ. అకటవికటము. విణ. విరుద్ధం, వికృతం, క్రమ రహితం. రసిక. 3.79.

**అకనాలెడ్జిమెంటు** వి. 1. గుర్తింపు ; 2. రసీదు.

<ఇం. Acknowledgement.

**అకబరు** వి. వార్తాపత్రిక. మెకంజీ. సం. 31. వల్లూరు. 44 పు.

నే. హిం. మరా. ఉ. అఖ్‌బార్. వార్తాపత్రిక ; గు. అఖబార ; పార. అఖ్‌బార్. కథలు. వార్తలు ; అర. అఖ్‌బర్. చరిత్రలు, వార్తలు, సంప్రదాయాలు.

<ఉ. అఖ్‌బార్.

**అకము[1]** రూ.చూ. హుకుము. వి. అధికారం.

**-అకము[2]** ప్రత్య. కృత్ ప్రత్యయం : అమ్మ్-అకము. సూ.ని. ; మాన్-అకము. ఆం.భా. 2.267 ; పంప్-అకము. హరభక్త విలాసము. 1.

**అకరు** రూ. అకరువు. వి. కింజల్కం, కేసరం. కు.సం. 3.351, భీమ. 3.50.

సం. ప్రా. పా. ఒ. హిం. ఆకర-. ఉత్పత్తి స్థానం ; సింహ. అరయ-;

క. ఆకర, ఆగర. పోగు. సమూహం, గని, మూల స్థానం, చోటు; తు. ఆకర, ఆకరమ్; త. ఆకరమ్. రత్నాల గని, ఆధారం, స్థానం, నివాసం, ఉగ్రాణం ; మ. ఆకరమ్. ప్రోగు, గని ; ముత్త్-ఆకరమ్. ముత్యాల గని,

<సం. ఆకర-. పుప్పొడి ఉండే చోటు, బీజకోశం.

**అకరువు** రూ.చూ. అకరు. వి. 1. పద్మం మొ. వాటిలోని దుద్దు, కర్ణిక. కు.సం. 10.28. కాశీ. 1.2 ; 2. కింజల్కం, కేసరం. ఆం.భా. 1.165.

**అకస్వారీ** వి. ద్వేషం, అసహ్యం.

ఉ. ఆక్స్‌వార్ ; పార. -వార్. మతుబర్థక ప్రత్యయం ; అర. అకస్వార్.

<ఉ. అక్స్+వార్.

**అకాడమీ** రూ. ఎకాడమీ. వి. సాంస్కృతిక వైజ్ఞానిక సంస్థ.

<ఇం. Academy; గ్రీ. లా. Akademia.

**అకారతు** క్రి. విణ. ఊరకే, అకారణంగా. నిరర్థకంగా. విశ్వే. శ.

నే. అకార్థ <సం. అకార్య-.చేయబడనిది+అర్థ-. ప్రయోజనం లేనిది. వి. అకారణం, నిరర్థకం: హిం. అకారత్, అకారథ్ <సం. అకార్యార్థ-; ప్రా. అకారి యత్థ-. విణ. ప్రయోజనం లేనిది, లాభం లేనిది: ఉ. అకారథ్. విణ. లాభంలేని, విలువలేని, అనుపయుక్తమైన, నిష్ఫలమైన ;

క. అకారత్. కారణంలేని, నిరర్థకమైన.

<ఉ. అకారథ్.

**అకిఖతు** రూ.చూ. హకీకత్. మెకంజీ. సం. 15. పోతగడ, 11 పు. ; చూ. అకీకత్.

**అకీకత్** రూ.చూ. హకీకత్. వి. 1. కథనం, వివరం: 2. వ్యవహారాలు, సంఘటనలు. మెకంజీ సం. 401. ముండాక్ల గాన. 32 పు.

**అకు** రూ.చూ. అగు. ఎపి.ఇండి. 27. 42-ఎ (సుమారు క్రీ.శ. 600–700).

**అకొ** రూ.చూ. అకో. అవ్య. 1. సంశయార్థకం. మను. 3.7; 2. ఔనా కాదా అని ; 3. ప్రశ్న; 4. ఊహ : 5. తర్కం ; 6. సంభవాసంభవతలు.

**అకో** రూ. అకొ, ఒకొ, ఒకో, కో. అవ్య. సంశయార్థకం, అనిశ్చితత్వబోధకం.

క. అక్కుమ్. కాగలదు, వనది ; అకో, అగో. దూరస్థ వస్తు సూచకం ; త. అకుం. సంభవత ; అకో < సం. అహో. ఆశ్చర్య తిరస్కారాద్యర్థకం ; కొండ. అకొ, అగో. అదిగో;

సం. అహో. సంతోష విషాదాదుల్ని తెలిపే ఆశ్చర్యా ర్థకం.

**అక్క** రూ. అక ; పో.చూ. అకె. వి. 1. స్త్రీ సంబోధన. శృం. నై. 5.127 ; 2. వంటలక్క. ఆము. 6.69 ; 3. పూజ్యస్త్రీ. వేం. 17 ; 4. పెద్ద ఆడుతోబుట్టువు. సీలా. 3.53 ; 5. పూటకూళ్లమ్మ ; ప్రత్య. 1. ఆశ్చర్యార్థకం. శుక. 1.223 ; 2. స్త్రీల పేర్లకు 'అమ్మ' వలె చేర్చబడే అనుబంధం ; రామక్క, సుబ్బక్క.

క.మ. అక్క. పెద్ద ఆడుతోబుట్టువు; తు. ఆక్క, అక్కె ; కొడ. అక్కె ; త. అక్కచ్చి, అక్కైచ్చి, అక్కా, అక్కాళ్, అక్కై, అక్కణ్ ; కోట. అక్న ; తొద. ఒక్న. ఒకొకొ; గోం. తక్కా (తక్కానా-తక్కాహక్), అక్కా ; పో.పూ. అక్కొ. మాతామహుడు ; అక్కొన, అక్కొంగ్ ; కుఇ. అకె. అకెంజి. తాత. పూర్వికుడు ; అకెబాడు. తాత, పితృవ్యుడు, పెద్దలు; పో.చూ. కువి. అకుక్క. తాత; పర్జి. అక్క. మాతామహుడు: కొలా. అక్కాబాయి. పెద్ద ఆడుతోబుట్టువు ;

సం. అక్కా. తల్లి (తిరస్కార పూర్వక ప్రయోగం; ఇది విజాతీయ శబ్దమని భావన; పో.చూ. లా. అచ్చ) అక్కా. కుంటెనగత్తె; అర్కః. అన్న ; ప్రా. అక్కా. సోదరి ; మరా. అక్కా. పెద్ద ఆడుతోబుట్టువు. మూ.ద్రా. *అక్కయ్;

మ.ద్రా. లో అర్థభేదం పరిశీలనార్హం.

< మూ.ద్రా. *అక్కయ్.

**అక్కచెల్లెండ్రు** చెల్లెలు, బ.వ. చెల్లెండ్రు ; రూ. అక్కసెల్లెండ్రు, అక్కాసెల్లెండ్రు. వి. బ.వ. ఆడుతోబుట్టువులు. **అక్కలవాడ** ల్(బ.వ.)+అ (విభ.) + వాడ (వీథి). వి. 1. వంటలక్కలుండే వీథి, పూటకూళ్ల వీథి. క్రీడా. 114 ; 2. లంజె వీథి, పూటకూళ్ల ఇళ్లలో తిండితోపాటు పడకకు కూడా సౌకర్యాలుండటం వల్ల ఈ అర్థం వచ్చి ఉండవచ్చు. **అక్కసెల్లెండ్రు, అక్కాసెల్లెండ్రు** రూ.చూ అక్కచెల్లెండ్రు వి. బ.వ. ఆడుతోబుట్టువులు.

**అక్కగారిజాతర** వి. పల్లెకార్ల కులదేవత జాతర (కాళహస్తిలో అగ్రహారంలో అక్క ఆలయం ఉంది. చెరువుల్లో లాభాలు వస్తే, వయాసి నెల ఆఖరి వారంలో జాతర చేసి ఏటలు బలి ఇస్తారు).

**అక్కచెల్లెండ్రు** చూ. అక్క.

**అక్కజపడు** చూ. అక్కజము.

**అక్కజము** వి. 1. బలపరాక్రమాదుల ఆధిక్యం. భార. ఆది. 6.203 ; 2. ఆశ్చర్యం. భార.అర. 3.55, విరా. 3.68, పి. శకు. 2.49.

నం. అక్షయ-. అజరం, అమరం ; ప్రా. అక్ఖఓ. అక్ఖయ. అక్షుభితం, పూర్తి, మొత్తం ; అ.మా. అక్ఖయ ; పా. అక్కయో ; అప. అక్కటు < నం. అకృత-. ఆశ్చర్యం ; అఖై < నం. అక్షతి ; హిం. అకజ్. నష్టం, దుష్కార్యం, హాని ; ఉ. అకాజ్ ;

క. అక్కజ. ఆశ్చర్యం, వింత, అద్భుతం; త. అక్కటు. ఆశ్చర్యార్థకం ; కుఇ. అక జిక ఆవ. చిత్తరపోవు.

< క. అక్కజ < ప్రా. అక్ఖఓ < నం. అక్షయ.

**అక్కజపడు** అ.క్రి. ఆశ్చర్యపడు. శృం. నై. 5.133. **అక్కజుఁడు** వి. 1. బలాధికుడు, సాహసి. భార. అర. 1.102 ; 2. అధికుడు. శివ. సా. 349. **అక్కజురాలు** వి. 1. అధికురాలు ; 2. పరాక్రమవంతురాలు.

**అక్కజుఁడు** చూ. అక్కజము.

**అక్కజురాలు** చూ. అక్కజము.

**అక్కట** రూ. అకట, అకటా, అక్కటా ; పో.చూ. కటకట. అవ్య. దుఃఖాన్ని తెలిపే మాట. భార.ఆది. 6.282, అర. 1.120.

నం. అః+కష్టమ్ ; ఆ. ప్రేమను లేక బాధను తెలిపే ప్రత్యయం ; అస్, అః. అవ్య. నంతోషం, కోపం, భయం, బాధ, దుఃఖం, స్మృతి మొ. తెలిపే ప్రత్యయం ; కష్ట-. చెడు, తప్పిదం, బాధాకరం, దుఃఖకరం, నీచం ; ప్రా. అ. బాధ, కోపం, దుఃఖం, దురవస్థ ; కట్ఠ-, కట్ఠ-. దుఃఖం, బాధ, ఆపద, పాపం ; అప. అక్కటు < నం. అకృత-. ఆశ్చర్యం ;

క. అకటు, అకటా, అక్కటు, అక్కటా. బాధ. దుఃఖం, ఆపద, ఆశ్చర్యం మొ. తెలిపే అవ్యయం ; త. అక్కటా-వ్-ఎఖల్. ధ్వన్య. విశ్రాంతి, ఔదాసీన్యం తెలిపే అవ్యయం ; అక్కటి. ప్రతిబంధకం. ప్రయాణంలో ప్రయాస, అపాయం.

< ప్రా. అ+కట్ఠా.

**అక్కటక్కట (టా)** అవ్య. బాధను తెలిపేది. శృం. నై. 1.108. క. అక్కటుకటా. బాధాదుల్ని తెలిపేది. **అక్కటపడు** అ.క్రి. నంతాపపడు. పండి.చ. 1.35 వ.

**అక్కటక్కట (టా)** చూ. అక్కట.

**అక్కటపడు** చూ. అక్కట.

**అక్కటా** రూ.చూ. అక్కట. శృం. నై. 2.123.

**అక్కటి** చూ. అక్కటికము. వి. దయగలవాడు, దయగలది.

బహుశః < క. అట్కట్+టి.

**అక్కటిక** రూ.చూ. అక్కటికము. వి. దయ, జాలి. మార్క. 2.127, భాగ. 4.486.

అట్కట్+ఇక.

**అక్కటికించు** అ.క్రి. జాలిపడు. శ్రీరం. మా. 10.73.

**అక్కటికము** రూ. అక్కటిక, ఎక్కటికము. వి. దయ, జాలి. భార. శల్య. 2.321.

క. అక్కఱికె. ప్రేమ ; అఱకఱ్. ప్రేమ, నంతోషం, ప్రేమించు; అత్తి, అర్తి. ప్రేమించదగినది, చక్కనివస్తువు, నంతోషం ; తు. అర్కమె. తీవ్రవాంఛ, ఆసక్తి ; త. అఱుంకల్. దయ, జాలి ; అఱ. ప్రేమతో కరగిపోవు ; అఱుక్కం. శ్రద్ధ, వ్యాకులత ; మ. అఱివు. దయ, ప్రేమ ; కొండ. అక్కి. ప్రేమ.

అట్కట్+ఇక(ము); మూ.ద.ద్రా. *అట్ (ఉ) క్ (ఉ).

**అక్కటికించు** చూ. అక్కటిక.

**అక్కడ** అ[2]-+కడ. క్రి.విశే. 1. ఆ వైపున, ఎదుటివైపున. భా.రా.యు. 1095 ; 2. ఆ చోట. వృత్తియందు బౌవిభక్తికం.

క. అకడె. ఆ వైపు, ఆ దిక్కు ; తు. అకడె. ఎదుటి పక్షం, ఎదుటివైపు; త. అ (సమీప వస్తు నిర్దేశకం)+కలై (చోటు)=అక్కటు. ఆ చోటు ; మ. అ, ఆ. అది ; అ+కలై

**అక్కము ?** వి. ఒడి. ద్వి. భాగ. 127 పు. 8 పం.

నం. ప్రా. అంక-;

కుఱు. పాక్సా (పక్క్యస్). ఒడిలో చేర్చుకొను; మాల్తో. పకె.

< నం. అంక-; పో.చూ. అక్కు.

**అక్కర[1]** రూ.చూ అక్కరము. వి. ఆంధ్రభాషలోని జాతి పద్యవిశేషం. అప్ప. 4.279.

**అక్కర[2]** వి. 1. పండుగ ; 2. వధూవరుల తొలి సంగమం.

< అక్కఱ. కోరిక, స్నేహం మొ. వాటి అర్థ విపరి.

**అక్కరకర** రూ.చూ. అక్కలకర. వి. మూలికా విశేషం.

**అక్కరము** రూ. అక్కర[1]. వి. 1. ఛందో విశేషం. కవిజనా. జాతి. 26 ; 2. అకారాది వర్ణం, వ్రాయి. శృం. నై. 2.34.

నం. అక్షరమ్. వర్ణం, అచ్చు, ధ్వని, పదం ; ప్రా. అ.మా. పా. అప. అక్ఖరమ్ ; కా. అఖర్ ; కుమా.

అఃఖర్ ; నే. అ. బెం. హిం. అఖర్ ; పం. ల. అక్ఖర్ ; సిం. అక్షరు ; సింహ. అకుర ;

క. అక్కర. అకారాది వర్ణం, అక్షరం ; ఛందోవిశేషం ; తు. అచ్చర. అకారాది వర్ణం ; త. మ. అక్కరమ్. ఒక వర్ణం, విజ్ఞానం ; అచ్చరమ్. ఒక వర్ణం ; అక్కర-వర్‌త్తణం. అనుప్రాసప్రధానమైన పద్యవిశేషం (మహాక్కర, మధురాక్కర, మధ్యాక్కర, అంతరాక్కర, అల్పాక్కర అని తెలుగులో అక్కరలు ఐదువిధాలు).

<ప్రా. అక్షర-.

**అక్కఱ** వి. **1.** కోరిక. భార.ఆర. 7.342 ; **2.** ఇబ్బంది. కష్టం. హరి. పూ. 4.124 ; **3.** కొరత, లోటు. శృం. నై. 1.103 ; **4.** చెలిమి, స్నేహం. చిత్ర భా. 5.182 ; **5.** అవసరం. ద్వి. హరిశ్చ. 1.205 ; **6.** పూజ్యభావం. సారంగ. చ. 3.265 ; 7. శ్రద్ధ, భక్తి.

క. అఱ్కఱ్, అఱ్తి, అర్తి. ప్రేమ ; అక్కఱు, అక్కఱు. అనురాగం ; అక్కఱె. ప్రేమ, కొరత, అవసరం, సందర్భం ; అఱ్కఱ్. ప్రేమించు ; తు. అర్కమె. తీవ్ర వాంఛ, ఆసక్తి ; త. అక్కఱై (?<క. లేక తె.). శ్రద్ధ, అవసరం ; అక్కఱై ; మ. అఱివ్. ప్రేమ, దయ.

<మూ.ద్రా. *అఱ్కఱ్.

**అక్కఱకత్తె** వి. అక్కరగల స్త్రీ. **అక్కఱకాఁడు** వి. అక్కర గలవాడు. క్షేత్ర. **అక్కఱగండఁడు** వి. అవసరం తీర్చుకొనేవాడు, స్వార్థపరుడు. ద్వి. హరిశ్చ. ఉ. 477. **అక్కఱగొను** (-కొను). స. క్రి. అపేక్షించు, ఆశించు. **అక్కఱదీర్చికొను** (-తీర్చికొను). స. క్రి. అవసరం తీర్చుకొను. **అక్కఱదీర్చు** (-తీర్చు). స.క్రి. అవసరం తీర్చు, ఆదుకొను. **అక్కఱపడు** అ.క్రి. **1.** ఆశపడు, కుతూహలపడు. దశకు. 4.6, భార. ఆర. 7.366 ; **2.** ఇబ్బందిపడు, కష్టపడు. హరి.ఉ 8.7. త. అక్కఱై-ప్పటు. ఆసక్తిగొను. **అక్కఱపాటు** వి. **1.** కొరత, లోటు. వేంక. పంచ. 1.415; **2.** ఇబ్బంది. భా. శ. 3.

**అక్కఱకత్తె** చూ. అక్కఱ.

**అక్కఱకాఁడు** చూ. అక్కఱ.

**అక్కఱగండఁడు** చూ. అక్కఱ.

**అక్కఱగొను** చూ. అక్కఱ.

**అక్కఱదీర్చికొను** చూ. అక్కఱ.

**అక్కరదీర్చు** చూ. అక్కఱ.

**అక్కఱపడు** చూ. అక్కఱ.

**అక్కఱపాటు** చూ. అక్కఱ.

**అక్కల** అవ్య. దుఃఖసూచకం. నిర్వ. 2.24.

సం. అక్ఖల- అవ్య. సంతోషసూచకం; అక్ఖతి కృత్వా. 'అక్ఖల' అనటం ; దే. ప్రా. అక్ఖలియ.

<సం. అక్ఖల-; బహుశః <అక్క+అల ; చూ. కలా.

**అక్కలకర** (బహుశః -కఱ) ; రూ. అక్కరకర, అక్కలకఱ్ఱ, అక్కలగర. వి. జ్వరాన్ని పోగొట్టే మూలికా విశేషం (Anthemis pyrethrum). హంస. 2.277.

సం. కరభా. వృక్షవిశేషం. అనాల కరంజా-. సూ.ని. దే. ప్రా. అక్ఖల-; ఒ. అకరకరా, అకల్లక ; హిం అక్కరకరా, అకల్లక ; మరా. అక్కలకరా ; ఉ. అక్కరకరా, అగర్‌గర్హ్ ; అర. ఆగర్‌గర్హ్ ;

క. అక్కల, అక్కలకరె, అకళ ; త. అక్కర కారమ్, అక్కరమ్ ; మ. అక్కల్‌క్కుఱవ, అక్కిల్ క్కఱ.

<ఉ. అక్కరకరా ; -కర <ప్రా. *కల్. కొర్ర మొ.

**అక్కలకఱ్ఱ** రూ.చూ. అక్కలకర.

**అక్కలగర** రూ.చూ. అక్కలకర.

**అక్కలముత్తయిదువు** చూ. అక్కలు[1]. వి. పెళ్లికూతురు మొదట అత్తింటికి వచ్చినప్పుడు ఆరాధించే దేవత.

**అక్కలవాడ** చూ. అక్క.

**అక్కలు[1]** వి. బ.వ. గ్రామ దేవతలు. క్రీడా. 137.

సం. యక్ష-. దేవజాతి ; ప్రా. జక్ఖో ; పా. యక్ఖ- ; పో.చూ. క. ఎక్కి, ఎక్కలగాణ. పాటకత్తె ; త. ఇయక్కి. యక్షిణి. సుగుణాది దేవత ; ఇచక్కి, ఇచక్కి యమ్మఁన్. దక్షిణదేశంలో ఆరాధించబడే మర్గాదేవారం.

<అక్క <అక్ఖ-<సం. యక్ష- ; పో.చూ. ఎక్కలి[2].

**అక్కలు[2]** అ.క్రి. చలికి కొమ్మకండరాలు మొ. ముడుచుకొనిపోవు. క్రీడా. 46.

<అక్కళించు ; పశ్చాన్నిర్మాణం.

**అక్కళించు** అ. క్రి. పొట్ట మొ. సంకుచితమగు ; స. క్రి. పొట్ట మొ. ముడుగజేయు, సంకుచితం చేయు. మను. 1.59.

క. అక్కళిసు, అకుఁడిసు, అకుక్కళిసు. కడుపులోని కండరాలను సంకోచింపజేయు ; తు. ఎకుక్కని ; త. ఎక్కు ; మ. ఎకుక్కక ; తొద. ఎగ్‌య్ ; మాల్తో. అకెలె.

<అకుక్క లేక అక్కళ్ ; మూ.ద.ద్రా. *అక్కళ్-.

**అక్కవాడ** వి. **1.** పూటకూళ్ల వీథి. క్రీడా. 189. ఆము. 6.69 : **2.** ద్యూతాది క్రీడాస్థానం.

సం. అక్షవాట-. ద్యూత క్రీడాస్థానం ; అక్షపాట-. మల్లయుద్ధ రంగం ; ప్రా. అక్ఖవాడ-, అక్ఖఅడ- ; పా. అక్ఖవాటో ; నే.హిం.మరా. అఖాఢా ; బెం.ఒ. అఖడా ; గు. అఖాడో. గరిడిసాల.

< ప్రా. అక్ఖవాడ-.

**అక్కసము[1]** వి. **1.** దైన్యం. కళా. 3.179 : **2.** దయ, కనికరం. ఆం.భా. 1.131.

క. అక్కస, అక్కఱ. ప్రేమ, అనురాగం.

మూ.ద్రా. *అఱ్క్-అస(ము)

**అక్కసము[2]** రూ. అక్కసు, అక్కస్సు. వి. **1.** సంతాపం, దుఃఖం. కళా. 3.179 ; **2.** అసూయ, ద్వేషం. అచ్చ. రా. యు. 200.

సం. ఆక్రోశ-. పరుషభాషణం, నింద, దూషణ ; ప్రా. అక్కోస. శాపం, తృణీకారం, ద్వేషం ; అక్కోసణ-. ద్వేషం ; అ.మా. అక్కోసో. పరుష భాషలు ; అక్కోస. స.క్రి. నిందించు ; పా. అక్కోస. శేకలు వేయు, తిట్టు, అవమానించు, తిరస్కరించు ; అక్కోసక-. తిట్టుబోతు;

మరా. అక్కస. అనూయ, ద్వేషం ; పో.చూ. ఉ. అకస్: పార. అర. అక్స్ ; ద్రా. అక్స్ ; అక్సీ. విణ.

<మరా. అక్కస-.

**అక్కసర** వి. సామీప్యం. మెకంజీ సం. పేరాల 140 పు.

సే. అక్సర్. మామూలుగా; హిం. అక్సర్. ఆధిక్యం, తరచు ; గు. అకసర. ఎక్కువ, సమీపం ; ఉ. పార. అక్సర్. సమీపం.

<ఉ. అక్సర్.

**అక్కసరి** చూ. అక్కసర. విణ. పొరుగు, సమీపం (బ్రౌ.).

**అక్కసాల** రూ.చూ. అగసాలె. వి. స్వర్ణకారుడు.

**అక్కసి** చూ. అక్కసు.

**అక్కసు** రూ.చూ. అక్కసము[2]. వి. 1. తీవ్ర వాంఛ; 2. క్రోధం ; 3. పట్టుదల (శ.ర.).

**అక్కసి** అక్కసు గలవాడు, ఆగ్రహం కలవాడు (శ.ర.). **అక్కసుకాఁడు** ఆగ్రహం కలవాడు (శ.ర.).

**అక్కసుకాఁడు** చూ. అక్కసు.

**అక్కసెల్లెండ్రు** చూ. అక్క.

**అక్కస్సు** రూ.చూ. అక్కసము[2]. వి. కోపం, ఆగ్రహం.

**అక్కాచెల్లెలుచుక్క(లు)** వి. బ.వ. పూర్వోత్తరాషాఢనక్షత్రాలు.

అక్క+చెల్లెలు+చుక్కలు. పరస్పర సమీప స్థితి వల్ల ఈ రెండింటికీ ఈ పేరు వచ్చి ఉండవచ్చు.

**అక్కామియ్యా** వి. శాసకుడు, రాజు. మెకంజీ సం. 266.51 పు.

<ఉ. హాకీంమియా.

**అక్కాసెల్లెండ్రు** చూ. అక్క.

**అక్కి** వి. 1. చర్మవ్యాధి; 2. ఒక వ్యాధి (బ్రౌ.).

క. అరిన్. నేత్రవ్యాధి ; తు. అరిన్. వాచిన మొటిమలు ; త. అక్కి. అగ్ని, బొబ్బలు, దురదలు ; అరి. దురదచే బాధపడు ; మ. అక్కి <సం. అగ్ని. నిప్పు, వాచిన మొటిమలు ; అరిక్క. దురదపెట్టు ; కొంద. అయ్ర్. మంట.

<ప్రా. అగ్గీ : చూ. అగ్గి.

**అక్కించుకొను** చూ. అంకించు. స.క్రి. 1. సంతోషించు, ఆనందించు ; 2. దక్కించుకొను.

అక్కు–ఇంచు–కొను.

**అక్కిడి** రూ. అక్కలి[2], అక్కెడ, అట్టడి. వి. ముఖ్యమైన పైరు వేసి ఆ చాళ్ల మధ్య వేసే రెండోపైరు, పప్పుధాన్యాలు మొ.

క. అక్కడి (అక్+కడి), అక్కడె.

**అక్కిడికట్టె** పప్పుధాన్యాలు విత్తటానికి ఉపయోగించే పొడుగాటి వెదురుగొట్టం, జడ్డిగం. **అక్కిడివేయు** స.క్రి. పప్పుధాన్యాలు విత్తు.

**అక్కిడికట్టె** చూ. అక్కిడి.

**అక్కిడివేయు** చూ. అక్కిడి.

**అక్కిబిక్కిదంత** వి. బాలక్రీడా విశేషం, దాగుడు మూతలు. హంస. 3.146.

పో.చూ. క. అక్కబిక్క. కనుకట్టు నేర్పు ; అక్కబిక్క విద్యె. కనుకట్టు విద్య ; పో.చూ. త. అక్కలిబిక్కలి. తబ్బిబ్బు; (అక్షిబిక్క+దంత. భ్రమగొల్పేవైపు).

? పో.చూ. ప్రా. అక్ఖి (నేత్రం)+పిక్ఖిఅ (దృష్టి).

**అక్కిలి**[1] పో.చూ. అంకిలి. వి. కలత, కలవరం. కు.సం. 10.34, మార్క. 8.66.

దే.ప్రా. అక్ఖలియ. వ్యాకులం ;

త. అక్కలి-ప్పక్కలి. తబ్బిబ్బు.

**అక్కిలిపడు** అ.క్రి. 1. చెడు, నశించు. పండి. చ. 2. 101 పు. ; 2. కలవరపడు. బసవ. 7.691.

**అక్కిలి**[2] రూ.చూ. అక్కిడి.

**అక్కిలిపడు** చూ. అక్కిలి[1].

**అక్కిగొలుసు** వి. పరమాను గడ పై భాగంలో గొలుసు లాగా ఉండే బాదు.

ప్రా. అక్ఖి (నేత్రం)+గొలుసు.

**అక్కు** వి. 1. గుండె. బసవ. 7.181, దశా. 2.38 ; 2. రొమ్ము, వక్షం. శృం.నై. 7.165, అచ్చ. రా. బాల. 62.

పో.చూ. సం. అక్-. గొంతుకింది ఎముక ; అక్ష. జీవం, ఆత్మ ; వక్షస్. రొమ్ము, గుండె ; ప్రా. అక్ఖ-. గొంతుకింది ఎముక ; అక్ఖో. జీవం. ఆత్మ ; వక్ఖ. రొమ్ము ; పో.చూ. శౌర. అ.మా. వక్ఖ ; పా. అక్ఖ, అక్ఖక. గొంతు కింది ఎముక ;

క. అక్కు (<సం. పక్ష-). కౌగిలించు, కౌగిలింత ; రొమ్ము ; త. అక్కు. ఎద్దుమూపురం ; అకమ్. రొమ్ము.

<ప్రా. అక్ఖ-.

**అక్కుగొల్లు** (-కొల్లు). వి. హృదయ శల్యం. బసవ. 4. 36, హరి. పూ. 4.179, మార్క. 7.279. **అక్కుపక్కి** రూ.చూ. అక్కుపక్షి. వి. బుద్ధిహీనుడు. **అక్కుపక్షి** రూ. అక్కుపక్కి. వి. 1. కూటిపేద, నీచుడు, అమాయకుడు ; 2. బక్కవాడు ; 3. మూర్ఖుడు. వ్యు. రెక్కలు మొ. లేక రొమ్ము మాత్రమే ఉన్న పక్షి, పనికిరానిది, బక్క చిక్కినది. **అక్కుమాలిన** విణ. భయంలేని. వ్యు. హృదయం లేని. బసవ. 7.181. **అక్కుముల్లు** వి. హృదయ శల్యం, మనోవ్యథ. రం. రా. ఉ. 107 పు. 9 పం. **అక్కొత్తుకొను** అ.క్రి. రొమ్మొత్తుకొను. కాశీ. 5.151.

**అక్కుగొల్లు** చూ. అక్కు.

**అక్కుచేప** వి. ఊదారంగు, పొట్టతల, గుండ్రటి కడుపు గల వెండిరంగు చేప (Thynnichthys sandkhol).

సం. అక్ష ; ప్రా. అక్ఖో. సముద్రజీవి.

<ప్రా. అక్ఖో.

**అక్కుజెల్ల** వి. పెద్ద కళ్లూ, ఎనిమిది మీసాలూ, ఆకుపచ్చ వెండి మిశ్ర వర్ణంలో నల్లటి చుక్కలూ, నాలుగైదు చారలూ గల మంచినీటి చేప. చూ. జెల్ల.

**అక్కుపక్కి** చూ. అక్కు.

**అక్కుపక్షి** చూ. అక్కు.

**అక్కుమాలిన** చూ. అక్కు.

**అక్కుముల్లు** చూ. అక్కు.

**అక్కురాతి** వి. పసుపు లేక బూడిద రంగు గల పల్చటి మచ్చల

చేప, కట్టు చేప (Ambassis nama).

**అక్కుళ్లు** వి. బ.వ. వరిలో ఒక రకం. ఆట్రగడలు.

క. అరి. నూర్చని గడ్డివామి ; అగళు, అగుళు. ఉప్పుడు బియ్యం, అన్నంముద్ద ; అక్కి. బియ్యం ; తు. అక్కి, అరి. బియ్యం ; త. అక్కమ్ (<నం. అర్ఘ-). ధాన్యం ; అరిచి. బియ్యం, దంచిన ధాన్యం, వెదురు బియ్యం ; అరి. బియ్యం, పిడికెడు గింజలు, నూర్చని గడ్డి వామి; పో.చూ. మ. అరి. బియ్యం.

<మూ.ద్రా. *అర్కళ్.

**అక్కుశాయి** రూ. అక్కుషాయి, అక్శాయి, అక్షాయి. వి. దేహారికి గాని దళారికి గాని ఇచ్చే రుసుం.

పార. హకెసై (హక్+ఎ+సై). కష్టానికి ప్రతిఫలం, కూలి; అర. హక్+ఉయి+సై.

<పార. హకెసై.

**అక్కుషాయి** రూ.చూ. అక్కుశాయి.

**అక్కెడ** రూ.చూ. అక్కిడి.

**అక్కెత్తుకొష** చూ. అక్కు.

**అక్కోజి** వి. ఆరుపళ్ల ఎద్దు.

మరా. అఖూజ్. తెరవబడని, అనుద్ఘాటితం ;

త. అక్కు. ఎద్దు మూపురం.

? <మరా. అఖూజ్.

**అక్రోటు** వి. ఆక్షోటం (Juglans regia).

నం. అక్షోట- ; నే. అఖ్రోట్ ; ఒ. హిం. పార. అర. అఖ్రోత్. గింజచుట్టూ గట్టిపెంకుగల కాయకాచే ఒక రకం పెద్ద చెట్టు : గు. అఖరోట ; మరా. అక్రోడ ; ఉ. అఖ్రోట్ ;

క. అక్రోడ, అక్రోడు, అక్రోడె, అక్రొట, అక్రొటె, అక్రోడదమర. గింజచుట్టూ పెంకుగల కాయలు కాచే చెట్టు (Aleurites triloba) ; త. అక్కరోట్టు (Walnut, Juglans regia).

<ఉ. అఖ్రోట్.

**అక్శాయి** రూ.చూ. అక్కుశాయి.

**అక్షరాలు** రూ. అచ్చరాలు. వి. బ.వ. శిశువులకు నోటిలో వచ్చే జబ్బు, నోటిపూత.

క. అగ్గ. పిల్లల నోటిజబ్బు; తు. అగ్గ. నోటిపూత ; త. అక్కరం. నోటిజబ్బు; అచ్చరమ్. నోటిపూత ; అఝరమ్. నాలుక పగుళ్ళు ; మ. అక్కరమ్, అక్కా రమ్. నోటిపూత.

<నం. అక్షర-(అక్షరాల వలె పొక్కులు ఏర్పడటాన్ని బట్టి ఈ అర్థం ఏర్పడి ఉండవచ్చు).

**అక్షాయి** రూ.చూ. అక్కుశాయి.

**అక్షించలు** రూ.చూ. అక్షింతలు[2].

**అక్షింతగడ్డి** చూ. అక్షింతలు[2]. వి. తృణ విశేషం.

**అక్షింతముండ్లు** చూ. అక్షింతలు[2]. వి. అంత్రింతలు.

**అక్షింతలతెగులు** రూ. అచ్చింతల తెగులు. వి. మిరప, వంగ. తములపాకు మొ. వాటి ఆకులమీద మచ్చలు పడే వ్యాధి.

**అక్షింతలపురుగు** చూ. అక్షింతలు[2]. వి. మిరప, వంగ మొ. వాటి ఆకులు తినే ఎర్రటి పురుగు (Epilachna).

అక్షింతలు[2]+అ+పురుగు.

**అక్షింతలబొట్టు** చూ. అక్షింతలు[1].

**అక్షింతలు**[1] పో.చూ. అచ్చతలు. వి. 1. పూజాదుల కుపయో గించే పసుపు కలిపిన బియ్యం ; 2. నొసటి బొట్టుకై బొగ్గు కలిపి నలుపుచేయబడిన పసుపు లేపం, చాదు.

నం. అక్షతా:. పొట్టు తియ్యని బార్లీ ధాన్యం : ప్రా. అక్ఖయ. పగులగొట్టబడనిది ; రుమా. అఛత ; నే. అఛేతా. పూజ కుపయోగించే నడుం విరగని బియ్యం : హిం. అచ్ఛత్ ;

క. అక్షత, అక్షతె, అక్షంతె. నీటిలో తడిపి పసుపు కలిపి మంత్రాలతో పవిత్రీకరించి పూజాదుల కుపయోగించే నడుం విరగని ముడిబియ్యం ; ఒక మతం వారు నుదుట పెట్టుకునే గుండ్రటి బొట్టు ; తు. అక్షద. గుండ్రటి బొట్టు ; అక్షంతరి. పసుపు కలిపి పూజాదుల కుపయోగించే నడుం విరగని బియ్యం ; త. అట్చతై. పసుపుతోగాని కుంకుమ పువ్వుతోగాని కలిపి పూజాదుల కుపయోగించే నడుం విరగని బియ్యం, బియ్యం : అట్చతై-ప్పొట్టు. బొట్టుగా ఉపయో గించే చాదు ; అక్కతై. నడుం విరగని బియ్యం గింజలు ; మ. అక్షతమ్. దెబ్బతిననిది, గాయపడనిది, నడుం విరగని బియ్యపు గింజ, చాదు.

<నం. అక్షత- ; ఆనునాసిక్యం.

**అక్షింతలబొట్టు** వి. 1. ఒక మతంవారు నొసటపెట్టుకునే గుండ్రటి బొట్టు. రుక్మా. 4.89 ; 2. అక్షింత గింజ అంటించటంకోసం నొసట పెట్టుకునే చాదు.

**అక్షింతలు**[2] రూ. అక్షించలు, అచ్చింతలు, ఇచ్చింతలు. వి. కాడలు కాడలుగా ఎదిగే బీటిగడ్డి, అంత్రింతలు.

**అఖండము** రూ.చూ. అగండము.

**అఖండంచెక్క** అఖండం+చెక్క. వి. అతుకుల్లేని ఒలుపుచెక్క, ఏకాండపు చెక్క.

**అఖండంరాయి** వి. గజంరాయి, నడిమిరాయి.

**అఖండలము** రూ.చూ. అగండము.

**అఖాతివాసు** అఖా+తివాసు. వి. పెద్ద తివాచీ. హంస. 5.394.

గు. అఖో. మొత్తం ; మరా. అక్తతివాసి ; అఖా. మొత్తం ; తివాసు. తివాచీ ; హిం. అక్హా.

<మరా. అఖా+తివాసు.

**అఖీకతు** రూ.చూ. హకీకతు.

**అఖిలాండము** రూ.చూ. అగండము.

**అఖీఖత్తు** రూ.చూ. హకీకతు.

**అగచం** రూ. అగచాం. వి. దురదృష్టం.

నం. అగత్యం. అవసరం :

క. అగత్య.

**అగచాం** రూ.చూ. అగచం.

**అగచాటులు** రూ.చూ. అగచాట్లు.

**అగచాట్లు** రూ. అగదాటులు. వి. బ.వ. కష్టాలు, ఆపదలు, కడగండ్లు. ఉ.రా. 6.343, 8.31.

క. అగచాటులు. బాధ, ఇబ్బంది ; అగచు. నొక్కి పట్టు : అగదాటు ; అగచు, అగుచు, అగుసు. నొక్కి పట్టు ; అటు. కదలిక, ఆట ; త. అక్రై. బాధించు, అణచు. బాధపడు.

<క. అగచు+ఆట+లు.

**అగర** వి. సంచకరువు, బయానా. పో.చూ. అగరా, అగాడీ.

? <సం. అగ్రవా-, అగ్రతః.

**అగరత** రూ.చూ. అగడిత ; పో.చూ. అగలు. వి. 1. పరిఖ, కందకం. రాజవా. 5.32 ; 2. బురదగుంట. నూరన దాటువు.

**అగడాడు** చూ. అగడు[2].

**అగడారు** చూ. అగడు[2].

**అగడిత** రూ. అగడత, అగడ్త. వి. పరిఖ, కందకం. రం.రా. యు. 281 పు. 31 పం.

క. అగజత, అగత్తె. కందకం ; అగచ్, అఖు, అగుర్, అగుఖు. తవ్వు : అగి, అగె. తవ్వు, కన్నం తవ్వు, గాయపరుచు ; తు. అగరు, అగళు. పరిఖ, కంద కం ; త. అకట్. తవ్వి తీయు, పరిఖ, చెరువు ; అకజ. కోట కందకం ; అవల్. లోతులేని గొయ్యి, చెరువు ; మ. అకిళ్, అకిల్. తవ్వబడినది ; అకిల్ ; మట్టిగోడ, ఆనకట్ట ; కోట. అప్. గొయ్యి తవ్వు ; తొద. అడ్. తవ్వు : కొలా. అగుల్. తవ్వు ; ? కుఱు. అర్ఖ్నా. తవ్వు, తవ్వి తీయు ; ? మాల్తో. అర్గె. తవ్వు ;

పో.చూ. సం. అఖాత-, అఖ-. గొయ్యి ; ప్రా. ఆహడ, అహాత, అగడ ; మరా. అగడ, అడ. దావి, కందకం.

<అగట్ (తవ్వు) ; అగట్ + త (తవ్వబడినది) ; <మూ.ద.ద్రా. * అక్-అట్ ; <మూ.ద్రా. * అక్-.

**అగడు**[1] పో.చూ. అగడిత. వి. నీటి దయ్యం.

క. అగట్. గొయ్యి, కందకం ; అగళ్. ఈదు : త. అగళ్. కందకం.

<క. అగళ్ ; నీటిదయ్యం ; లోతునీటిలో నివసిస్తుందనే ఉద్దేశ్యం కావచ్చు.

**అగడు**[2] రూ. అగుడు, అవడు. విణ. 1. హీనం, నీచం, నింద్యం. నా.పంచ. 4.46, ప్రబంధ. 743 ; 2. బెదరి నది, చెదరినది. పను. 2.22 ; వి. 1. అపనింద. వసు. 1.107 ; 2. పేరాస.

పో.చూ. సం. అగస్ లేక ? అకృత-. చేయబడనిది, కల్పింపబడనిది ; ప్రా. అగడ- (<అకృత-). చేయ బడనిది ; పా. అగరు (<సం. అగురు-). అగౌరవకరం ; హిం. మరా. అగళా. క్రూరం, తుంటరి ;

క. అగడు. దుష్టం, రాక్షసం, నీచం ; అగడ. మొరటు వాడు ; త. అకటు. క్రూరత్వం ; అక్రై. అణచివేయు ; పో.చూ. మ. అకటువికటు ; అకటు. తారుమారు.

**అగడాడు** అ.క్రి. ప్రేలు, వదరు. చంద్రా. 4.183. **అగడారు** వి. నింద, రవ్వ. **అగడుగత్తె** (-కత్తె : స్త్రీవాచ మరుప్ ప్రత్యయం). వి. ధూర్తురాలు, వంచకురాలు. **అగడుగాఁడు** (-కాఁడు). వి. నింది తుడు. హర. 5.10. **అగడుఁగాకి** (-కాకి). వి. తుంటరి, జగడాలమారి. హర. 2.10. **అగడుచేయు** స.క్రి. 1. నిందించు. శృం.నై. 7.88 ; 2. రట్టుచేయు, అల్లరి చేయు. విజయ. 3.28, శుక. 4.46 ; 3. చిన్నపుచ్చు, తక్కువచేయు. ఉ.రా. 6.104, పె.శకు. 2.182. **అగడుపడు** రూ. అగడువడు, అగడ్పడు. అ.క్రి. 1. క్షోభపడు, కలతనొందు. వసు. 6.62, అచ్చ.రా. ఉ. 162 ; 2. నిందపడు. విప్ర. 3.17. **అగడుపఱుచు** స.క్రి. 1. నలిపివేయు, బాధపెట్టు. ఉ.రా. 4.227 ; 2. బెద రించు ; **అగడువడు** (-పడు) ; రూ.చూ. అగడుపడు. అ.క్రి. నిందపడు. విప్ర. 3.17. **అగడ్పడు** రూ.చూ. అగడుపడు. అ.క్రి. క్షోభపడు, కలత నొందు. అచ్చ.రా. యు. 162.

**అగడు**[3] వి. సెగ, వేడి.

<సం. అగ్నిద-.

**అగడుమట్టి** వి. ఇటుక బట్టీమీద సెగ బయటికి పోకుండా కప్పే మన్ను.

**అగడుగత్తె** చూ. అగడు[2].

**అగడుగాఁడు** చూ అగడు[2].

**అగడుఁగాకి** చూ. అగడు[2].

**అగడుచేయు** చూ. అగడు[2].

**అగడుపడు** చూ. అగడు[2].

**అగడుపఱుచు** చూ. అగడు[2].

**అగడుమట్టి** చూ. అగడు[3].

**అగడువడు** చూ. అగడు[2].

**అగడ్త** రూ.చూ. అగడిత.

**అగడ్పడు** చూ. అగడు[2].

**అగండము** రూ. అఖండము, అఖండలము, అఖిలాండము. వి. దేవాలయాల్లో పెట్టే అఖండ దీపం.

సం. అ.మా. అఖండ-. పూర్తి, మొత్తం.

<సం. అఖండ-+దీపం; క్లుప్తీకరణంవల్ల 'అగండము.'

**అగంద్రపాకు** అగంద్రపు+ఆకు ; చూ. అగ్నివేంద్రము. వి. ఒకానొక మొక్క (Ammania vesicatoria).

**అగతా** చూ. అగావు. వి. సంచకరం.

సం. అగ్రతః. అగ్రమందు, ముందు ; అగ్రతరః; ప్రా. అగ్గ- ; పా. అగ్గతో-. మొదట ; అగ్గ- <సం. అగ్ర- ; ఒ. అగతర, అగతర్య, అగతుర ; హిం. అగావ ; మరా. అగాఊ. ముందుగా.

< అగ్గత < సం. అగ్రత(స్) ; వ్య. ముందుగా చెల్లించ బడేది.

**అగత్యము** వి. ఆవశ్యకం, అనివార్యం, తప్పనిది.

సం. అగతిక-. గతిలేని, తప్పని సరి ; అగత్యా. అని వార్యంగా ; ప్రా. అగతిఅ, అగై. దుఃఖం, నరకం, గతి లేనిది ; అ.మా. అగై. సర్వనాశనం, నరకం ; మరా. అగత్య. ఉత్సుకత, ఆస్థ ;

క.తు. అగత్య. అవశ్యం ; త. అకత్తియమ్. తప్పక.
<సం. అగత్యా.

**అగదగులు** పో.చూ. అగపడు. అ.క్రి. 1. సమీపించు, కలియు ; 2. కన్పించు.

<అగ- (ద) తగులు.

**అగపె** రూ. (వర్ణ వ్యత్యయం) అపక, ఆబక, అవక. వి. 1. పెద్ద తెడ్డు, కొయ్యగరిటె. ఆము. 1.80, ఆం.భా. 2.244 ; 2. ఓడల మురికి గోకి శుభ్రం చేసే కొయ్య గుద్దలి. ఆం. భా. 1.157.

క. అగె. తవ్వ, గరిటె ; అగపె. గరిటె ; అపె, హాపె. కొయ్యతో గాని కొబ్బరి చిప్పతో గాని చేసిన తెడ్డు ; త. అకప్పై. పొడుగాటి కాడగల కొబ్బరిచిప్ప గరిటె ; అప్పై. గరిటె ; అకట్. తవ్వితీయు ; మ. అకప్పాన్. గరిటె ; అప్ప.

మూ.ద.ద్రా. *అక్-అప్-అయ్ < *అక్-తవ్వు; చూ. తె. అగడ్-ఇ-త.

**అగపడు** రూ. అగ్గపడు ; పో.చూ. అగ్గము. అ.క్రి. 1. తెలియు, ఎరుక పడు. భార.విరా. 2.70 ; 2. లభించు, దొరకు, ప్రాప్తించు, సిద్ధించు. భార. ద్రోణ. 1.137, బసవ. 1.23 వ. ; 3. వశమగు, లోబడు, చిక్కు. భార. శాంతి. 3.73, బసవ. 2.33 ; 4. గోచరమగు, కనబడు. భాగ. 10 పూ. 1299.

త. అక-ప్-పటు. చేర్చబడు, తగ్గింపబడు, ఇరికించ బడు, ప్రభావితమగు, లోబడు, పొందబడు ; అకమ్. లోపల, మనస్సు, చోటు.

<అగ-పడు ; అగ <అగ్గ (ము).

**అగపాటు** చూ. అగపడు. వి. 1. వశపడటం, లొంగటం, చిక్కటం. భార.అర. 2.58, శల్య. 2.273 ; 2. ఎరుక పడటం, తెలియటం. భార.విరా. 1.158.

**అగబాటు** వి. ఇబ్బంది, ఆపద.

పో.చూ. త. అక్కప్పాటు. సముద్ర ప్రయాణంలో ఆపద, సరకు నష్టం ; అక్కప్పోర్. యుద్ధం, ద్వంద్వ యుద్ధం; విచారం, విపత్తు.

<అగపాటు. అర్థ విపరి.

**-అగము** <-అకము. ప్రత్య. తద్ధిత ప్రత్యయం, మింద్-. అగము. మిందగము. త. మింటు. నిండు, ముందుకు తోయు.

**అగరా** విబ. పదకొండు. బాల వివేక కల్పతరు.

సం. ఏకాదశ- ; ప్రా. ఏక్కారస-, ఏగ్గారహ-, ఏఆరహ-, ఏక్కాదహ- ; అ.మా. ఏక్కారస- ; అప. ఏగ్గరహ- ;

కా. కాహ ; నే. ఎఘార, ఎఘార్హ, యెఘార ; అ. ఏఘార ; బెం. ఒ. ఏగార ; హిం. ఏగారహ, గ్యారహ ; పం. యారా(గియారా( ; ల. యాహ్ఁ ; సిం. యారహఁ ; గు. అగ్యార ; మరా. అకరా ; సింహ. ఎకొళస, ఎకొళహ ; ఉ. గ్యారహ ; పార. యజదహ.

<మరా. అకరా.

**అగరాఎక్కాలు** వి. బ.వ. పదకొండు నుంచి ఇరవై దాకా గల సంఖ్యలచేత హెచ్చవేతలు తెలిపే పదకొండో ఎక్కం మొ. ఎక్కాలు, పెద్ద ఎక్కాలు.

**అగరాఎక్కాలు** చూ. అగరా.

**అగరు** రూ. అగలు[2], అగళు, అగురు[1], అసులు[2]. వి. 1. ఒక జాతి చెట్టు. యయా. 1.47 ; 2. అగరు చెట్టు నుంచి తీసిన పరిమళ ద్రవ్యం. ఆం. భా. 2.162 ; 3. పొగరు, గాటు ; 4. బియ్యం గానీ బార్లీ గానీ మాడ్చి సువాసన ద్రవ్యంతో చేర్చి బొట్టు పెట్టుకోటానికై తయారుచేసిన బొడు.

సం. అగర్. అగరు చెట్టు ; అగురు. అగరు వృక్ష, అగరు చెట్టు ; ప్రా. అగర్, అగరుఅ, అగలుఅ, అగలుయ, అగరు, అగులు ; అ.మా. అగరు, అగురు. ఒకరకం చందనం చెక్క ; అగలుఅ. నల్లచందనం చెక్క ; పా. అగరు, అగలు, అగ్గలు. సుగంధి చందనం చెక్క ;

కా. అగర, అగుర ; నే. బెం. అగర్, అగరు ; అ. అగరు ; ఒ. అగుమ్ ; హిం. అగర్, అగుర్ ; పం. గు. మరా. ఉ. అగర్ ; సిం. అగరు ; సింహ. అగిల్ ;

క. అగలు, అగళు, అగళె, అగిల్, అగిలు, అగురు, అగుళు. సుగంధం, సుగంధ ద్రవ్యం : తు. అగిలు, అగెల్, అగెల ; త. అకరు, అకిల్. చందనం చెక్క : అక్కు. అగరు చెక్క ; మ. అకిల్, అగుణల ; పర్జి. అకలు, అకళు, అగరు, అగలు, అగళు ;

హిబ్రూ. అహలిమ్ ; గ్రీ. agallochon.

<సం. అగర్.

**అగరుమడ్డి** వి. అగరులేపం. **అగరువత్తి** వి. సాంబ్రాణి కడ్డీ.

**అగరుమడ్డి** చూ. అగరు.

**అగరువత్తి** చూ. అగరు.

**అగలము** చూ. అగలు[1]. వి. వెడల్పు, వైశాల్యం. వరాహ. 10.142.

క. అగల, అగలు, అగళ. విస్తృతి, వైశాల్యం, దూరం, జోటు, వేర్పాటు ; తు. అగెల. వెడల్పు ; త అకలమ్. వెడల్పు, వైశాల్యం ; మ. అకలమ్. వెడల్పు. దూరం ; తొ. ఒక్సస్. విస్తరించు ; కొండ. అగల్గ. వెడల్పు ; మాల్తో. అగరె. వ్యాపించు.

<అగలు + అమ్.

**అగలించు** చూ. అగలు (అగలు-ఇంచు).

**అగలు[1]** రూ. అగులు[1], అవులు, ఔలు. అ.క్రి. 1. చెడు, క్షీణించు. భా. రా.యు. 1367 ; 2. పగులు, ముక్క లగు. భార. ద్రోణ. 1.358 ; 3. దుఃఖించు. ద్వి. హరిశ్చ. ఉ. 16.

క. అగల్, అగలు, అగళ్, అగులు, అల్లు, అళ్లు. వేరుచేయు, దూరంగాపోవు, తప్పుకొను, విడిపోవు ; తు. అగపుని. అ.క్రి. తొలగు, వెడలిపోవు ; స.క్రి. వేరు

చేయు, పొడిగించు ; అగపెలు. వియోగం ; త. అకల్. వదలిపోవు, మాయమగు, వేరుచేయు, వ్యాపించు ; అక్రు. తొలగించు ; అకై. బాధపడు, అలచలడు ; పో.చూ. పకల్. విభజించటం, వేరుచెయ్యటం ; మ. అకలుక. పొడిగించబడు. విడిపోవు, విరమించు ; అకల్చ. వియోగం, దూరం.

<మూ.ద.ద్రా.*అక్-అల్ <మూ.ద్రా.*అక్-.

**అగలించు** రూ. అగిలించు. స.క్రి. పగులగొట్టు, తవ్వు. విక్ర. 8.104. క. అగలిసు. తొలగించు, వేరుచేయు ; త. అకలి. వెడల్పుచేయు. **అగలుచు** రూ.చూ. అగల్చు. **అగల్చు** రూ. అగలుచు. స.క్రి. 1. భేదించు, పగులగొట్టు. దా.రా.బాల. 414 ; 2. ఉన్మూలించు, పెల్లగించు. భార. స్త్రీ. 2.9. క. అగల్చు. విడిపోవు, తొలగు, విసర్జించు. తిరస్కరించు. వేరుచేయు. **అగిలించు** రూ.చూ. అగలించు. అ.క్రి. ఊడు. భాగ. 6.370.

**అగలు**[2] రూ.చూ. అగరు[1]. వి. 1. పరిమళ ద్రవ్యం. భార. అను. 4.12 ; 2. బొట్టుకోసం నూకలు మొ. మాడ్చి సుగంధ ద్రవ్యాలు చేర్చి తయారుచేసిన బాదు.

ఇది దేశ్యం అనే వాదం కూడా ఉంది.

**అగలుసత్తు** -సత్తు. సారం. వి. అగలునుంచి తీసిన పరిమళ ద్రవ్యం ; చందనవిశేషం. **అగలుసొంటి** -సొంటి. ఎండబెట్టిన అల్లం. వి. చిరుబొద్ది, విషబొద్ది (Clypea hernandifolia). సం. పాఠా. పో.చూ. క. అగుళ్. సొంటి.

**అగలుచు**[1] చూ. అగలు[1].

**అగలుసత్తు** చూ. అగలు[2].

**అగలుసొంటి** చూ. అగలు[2].

**అగల్చు** చూ. అగలు[1].

**అగళు** రూ.చూ. అగరు. వి. రక్తచందనం. కళా. 7.216.

**అగవాళ్లు** వి. బ.వ. 1. తోలు పట్టీలు ; 2. ఒంటి అట్టచెప్పులు. వ్య. తోలు పట్టీలు గల చెప్పులు.

క. అంగాల్. అరికాలు ; అగె, అగ. లోపల ; తు. అంగారు. అరికాలు ; కొడ. అంగాలు ; పో.చూ. త. అకవటి. అరికాలు ; అకమ్. లోపల ; మ. అకమ్. లోపల ; అకంకాల్. అరికాలు ; కొండ. అంగాల్.

**అగవు** పో.చూ. అగవ తగవులు. వి. 1. పెండ్లికానుక. కువ.చ. 3.65 ; 2. పని, వ్యాపారం. దశా. 9.77.

<అగు. యోగ్యమగు.

**అగవుతగవులు** అగవు+తగవులు ; -తగవు. పెండ్లికానుక. వి. బ.వ. 1. వధూవరుల కిచ్చే పెండ్లికానుకలు ; 2. సారె పెట్టి వధువు నత్తవారింటికి పంపే వేడుకలు. కువ.చ. 3.65.

అగవు- అగు. యోగ్యమగు. తగవు- తగు. ఉచితమగు ; వ్య. యోగ్యం, ఉచితం.

**అగసాలవాడు** చూ. అగసాలె. వి. స్వర్ణకారుడు. సుమతి శ.

**అగసాలి** రూ.చూ. అగసాలె. వి. స్వర్ణకారుడు. బసవ. 4.67.

**అగసాలె** రూ. అక్కసాల, అగసాలి, అవసలి. వి. స్వర్ణకారుడు, ఆము. 4.35, నీలా. 3.3.

సం. అర్క-. కిరణం, కాంతి ప్రసారం, రాగి ; శాలిన్. కలవాడు ; ప్రా. అక్క. బంగారం ;

క. అకసాల, అక్కసాల, అక్కసాలిగ, అగసాలె. వెండి బంగారు పనిచేయువాడు ; అక (<సం. అర్క-). రాగి ; అకసాలికె. స్వర్ణకార వృత్తి ; తు. అక్కసాలె ; త. అక్కచాలైయర్. స్వర్ణకారులు, నగల వర్తకులు ; అక్కచాలై. లోహపరిశ్రమ, టంకసాల.

<ప్రా. అక్క+తె. సాలె (<ప్రా. సాలిఅ <సం. శాలిక-). బంగారుకొట్టువాడు ; <సం. అర్క-. రాగి.

**అగసి** రూ.చూ. అగిసె.

**అగసె** రూ.చూ. అగిసె.

**అగస్టు** వి. ఆగస్టు నెల. పసురాయ చాటువు.

<ఇం. August <లా. Augustus. మొదటి రోమక చక్రవర్తి అగస్టస్ సీజరు పేరిట ఏర్పడిన నెల ; ఆంగ్ల సంవత్సరంలో ఎనిమిదో నెల.

**అగాడి** విశ. ముందర, ఎదుట ; వి. గుర్రం ముందుకాళ్లకు కట్టేతాడు.

సం. అగ్ర. మొట్టమొదటి ; అగ్రణి ; ప్రా. అగ్గ. అగ్గణి ; కుమా. గు. ఉ. అగాడి ; బెం. అగడి. పూర్వం ; హిం. అగడీ ; పం. అగ్గడ్ ; మరా. అమాడి ;

క. అగాడి ; తు. అకాటి.

<ఉ. అగాడీ.

**అగాదా** చూ. అగాదు. వి. ఒకరకమైన ప్రేలుడు పదార్థం, బాణాసంచా (గంధకం మొ. ప్రేలుడు పదార్థాల్ని గట్టిగా దట్టించిన పొట్లం).

**అగాదు** పో.చూ. అగాదా. వి. 1. ఫిరంగి మొ.వి నిప్పు రగిల్చి పేల్చటం. రసిక. 4.95 ; 2. పెద్ద ధ్వని ; 3. పేల్పు.

సం. అఘాత- ; ప్రా. అఘాయ- ; అ.మా. అఘాద-

<అమా. అఘాద-.

**అగాదుచేయు** స.క్రి. తుపాకి పేల్చు. రసిక. 4.95.

**అగాదుచేయు** చూ. అగాదు.

**అగావ** చూ. అగావు[1]. వి. దబాయింపు.

**అగావు**[1] వి. 1. సంచకరం ; 2. కుదువ, ఆధి ; 3. వచ్చే పంట తాకట్టుగా ఇచ్చే అప్పు ; 4. నింద, అపనింద ; 5. తేర, ఉచితం ; 6. వాయిదా.

కుమా. అగ్వా. ముందుకు పోవు ; నే. అగువా, అగుఆ. సంధానకర్త ; అ. అగువా ఇబ. ముందుకు పోవు ; బెం. అగు. ముందు ; హిం. అగువా. మార్గ దర్శకుడు ; సిం. అగుఇ ; గు. అగువో, అగ్వో ; మరా. అగావు. సంచకరం.

<మరా. అగావు.

**అగావుగా** క్రి. విశ. అకస్మాత్తుగా, తేరగా. **అగావుబగావు** వి. అధికారంతో కూడిన చెలాయింపు.

**అగావు**[2] వి. కర్ర వలలో తలకర్రకు దారుతో వేసిన ముడి.
<ప్రా. అగ్గవ-<సం. అగ్రవత్-.

**అగావుగా** చూ. అగావు[1].

**అగావుబగావు** చూ. అగావు[1].

**అగి** రూ.చూ. అగ్గి. కవిజనా.

**అగిటిఉన్ని** వి. ఉగాది తర్వాత మృగశిర కార్తె మొదట్లో కత్తిరించిన ఉన్ని.
సం. అవి. గొర్రె, కంబళి; ప్రా. అవి, అవిఅ, అవిల. గొర్రె, మేక; పా. అవి. పొట్టేలు;
క. అవి. గొర్రె, అవిక. ఉన్ని దుప్పటి.
<సం. అవి-; అవి>అగి+టి+ఉన్ని.

**అగిదీ** క్రి.విశే. అంతా, పూర్తిగా.
మరా. అగదీ. అంతా కలిసి, మొత్తంగా.
<మరా. అగదీ.

**అగివి** చూ. అగ్గి. వి. నిప్పు, చిచ్చు. కవిజనా. 1.50, సం. అగ్ని; ప్రా. *అగణి, అగ్గి*; అమా. *అగిణి*; క. *అగిని*; త. *అక్కని*.
<సం. అగ్ని-.

**అగిలించు** చూ. అగలు[1].

**అగిశ** రూ.చూ. అగిసె.

**అగిసియ** రూ.చూ. అగిసె.

**అగిసె** రూ. అగసి, అగసె, అగిశ, అగిసియ, అవిశ, అవిసి. అవిసియ, అవిసె. వి. అవిసె చెట్టు (Corolina grandiflora, Sesbania grandiflora). యయా. 4.11.
సం. *అగస్తి*, అతసీ. అగిసె; ప్రా. *అగత్థి*, *అగత్థియ*, అయసీ; అ.మా. *అగత్థియ*; హిం. ఉ. *అగస్త్*;
క. *అకచె*, *అగచె*, *అగసె*, *అగిసె* <సం. అతసీ; తు. *అగస్తి*, *అగసెనారు*; త.మ. *అకత్తి*.
సం. *అగస్తి*. 'అగిసె'గా మారటం ధ్వని పరిణామ సూత్రాలమేరకు సంభావ్యంకాదు. కాని ప్రాకృతాదుల్లో 'అతసీ' శబ్దభవమైన 'అయసీ,' అగిసెగా మారి ఉండ వచ్చు. 'సె' అంతమందుగల తె.క.తు. రూపాలు చూస్తే, ఈ పదం సం. నుంచి ప్రతిదేయంగా కన్పించదు. ఇది జన నిరుక్తి మూలాన సం.లో చేరిన ద్రావిడపదం కావచ్చు. త.మ. రూపాలు ప్రా. నుంచి పునః ప్రతిదేయా లనేది స్పష్టం.
**అగిసెకూర** వి. కూరగా వాడే అగిసెఆకు. **అగిసెమావె** వి. అగిసె గింజలనుంచి తీసిన చమురు. **అగిసెయాకుబొట్టు** వి. అవిసెఆకు ఆకారంగలబొట్టు. ప్రభా. 4.137.

**అగిసెకూర** చూ. అగిసె.

**అగిసెమావె** చూ. అగిసె.

**అగిసెయాకుబొట్టు** చూ. అగిసె.

**అగు** రూ. అవు, కా[3]; సవదా. అగు-/కా-/అవ్-/అయ్. అ.క్రి. 1. ప్రాప్తించు, ప్రాప్తమగు. భార. ఆది. 1.119, ఉద్యో. 3.896; 2. సమర్థమగు, చాలియుండు. భార.ఉద్యో. 1.111; 3. అనుకూలమగు. భార.ఉద్యో. 1.359; 4. శక్యమగు, లంపియగు. భార.ద్రోణ. 2.99: 5. యథార్థమగు, నిజమగు. భార. ద్రోణ. 3.296: 6. తగు, యుక్తమగు, అర్హమగు. భాగ. 10 ఉ. 1236: 7. ఆయుస్సు మొ. కరచు. కాశ. శ. 14; అవ్య. అంగీకార సూచకం: సరే, సరేకాని. భార. ద్రోణ. 5.99; సహా.క్రి. ధాతువుల తుమున్నర్థక రూపాలకు అనుప్రయుక్తమై విధ్యర్థాన్ని తెలుపుతుంది. భార.శాంతి. 5.505; ప్రత్య. రూ. అవు, అవ[1]; వ్యవ. టి. సంభావనాదులపై పూరణార్థంలో ఆగమంగా వచ్చే ప్రత్యయం. భార.ఆది. 6.281; ద.హిం.రా. 4.678.

క. *అగు*, *కా*, *ఆగు*. అగు, పెరుగు; అకర్మక. *అక్కు*. కాగలదు, అవుతుంది, ఉన్నది; త. *ఆకు*. కాహొందు, జరుగు, అగు, ఉండు మొ., *ఆహుదు*, *ఆహూ*. సరే, కాను; తు. *ఆపిని*, అ. *అగు*; కొడ. *అగ్*; సవదా. *ఆ-*, *ఆయ్-*, *ఆన్-*. అగు; త. *ఆ*, *ఆకు*, *ఆకి*. రూపొందు, జరుగు, సంభవించు, చేయబడు, పూర్తియగు, అర్హమగు, యోగ్యమగు, పెరుగు, అతిశయించు, ఉండు, పోలి యుండు, సాటియగు; అక్క. కలిగించు, చేయు; *ఆమ్*. కాను; *ఆవతు*. పూరణార్థకం; మ. *ఆ*, *ఆకు*, *ఆవ*. అగు, ఉండు, జరుగు, పూర్తియగు; అక్కక. చేయు; కోట. *ఆగ్*; *ఆయ్-/ఆన్-/ఆ-*; కృదంతం: *ఆల్ఆ్య ఆట్య*. అగు: *ఆర్య*, *ఇర్*. ఉండు; తొద. *ఓక్స్*; *ఓయ్-/ఓన్-/ఓ-*. అగు, అనుకూలమగు, ఉపయోగపడు, పుట్టు; గోం. *ఐ ఆనా-ఆసీ-ఐకా*. ఉండు; కొండ. *ఆ-*. ఉండు, అగు. జరుగు; కుఇ. *ఆ-వ్-అ*. అగు, ఉండు, జరుగు, చాలి యుండు, పూర్తియగు; కువి. *ఐయలి*. ఉండు, అగు; *అ-నై*. జరుగు; పో.చూ. పర్జి. *ఎర్-*, *ఎస్-*. అగు, జరుగు, ఉండు; కొలా. *అన్-ఆంద్-*; విధ్యర్థకం. *ఆస్*. ఒకచో నుండు, ఉండు; నా. *ఆంద్-*. ఉండు; పో.చూ. బ్రా. *ఆన్నింగ్*; సవదా. *ఆన్-/ఆర్-/ఆసి-/ఆ*. ఉండు.
<మూ.ద.ద్రా. *అక్-; *ఆక్; మూ.ద్రా.*ఆ-/*ఆయ్.

**అగుగామి** (-కామి); రూ. కాగామి; పో.చూ. అగు గాములు. వి. కావటం కాకపోవటం. భార.శాంతి. 6.171. **అగుగాములు** (-కాములు); రూ. అవుగాములు, కా గాములు. వి. బ.వ. 1. యుక్తాయుక్తాలు, మంచిచెడ్డలు; 2. సుఖదుఃఖాలు; 3. సత్యాసత్యాలు. **అగుఁగదే** (-కదే); రూ. అవుఁగదే, కాఁగదె, కాఁగదే. అవ్య. 1. కారా!, ఆశ్చర్యార్థకం, ప్రశంసావాచకం; 2. కానుగదా!, నిశ్చ యార్థకం. **అగుఁగా** (-కా); రూ. అవుఁగా, కాఁగా. అవ్య. 1. అది యుక్తమే; 2. సరే కాని; పూర్వ విష యంలో అనాదరం, ప్రకరణాంతర ప్రసక్తి; 3. ప్రశంసా ద్యోతకం. **అగుఁగాక** (-కాక); రూ. అవుఁగాక, కాఁగాక. అవ్య. 1. సరే, మంచిదే, అంగీకార సూచకం; 2. ఆశీ రాద్యర్థకం. **అగుఁగాత** (-కాత); రూ. అవుఁగాత, కాఁగాత

అగుఁగావుత, అవుఁగావుత, ఔఁగావుత. అవ్య. అయ్యెదు గాక: ఆశీరర్థకం. **అగుఁగాదను** (-కాదు+అను): రూ. అవుఁగాదను, ఔఁగాదను. అ.క్రి. 1. ఇదియుక్తం ఇది అయుక్తం అని ఆలోచించు, ఆలోచించు: 2. విమర్శించు. **అగుదెంచు** (-తెంచు). అ.క్రి. 1. గతించు, నడచు. భార. విరా. 4.178, ఆర. 4.47; 2. కలదియగు, ఒప్పిదమగు. నిర్వ. 6.87. **అగునగుఁగదే** రూ. అవునవుఁగదె, ఔనౌఁగదే; పో.చూ. అగుఁగదే. అవ్య. ఔనుగదా!, ఆశ్చర్యసూచకం. **అగునఁటే** రూ. అవునఁటె, ఔనఁటే. అవ్య. శ్రోత దృష్టిని ఆకర్షించటానికి ఉపయోగించే సంబోధన: 'ఆఁ-అలాగా ?!'. **అగునె** రూ.చూ. అగునే. అవ్య. నీచ మిత్ర స్త్రీ సంబోధనంలో ఉపయుక్తం. **అగునే** రూ. అగునె, అవునె, అవునే, ఔనె, ఔనే. అవ్య. నీచ మిత్ర స్త్రీ సంబోధనంలో ఉపయుక్తం. **అగుర** రూ.చూ. అగురా. అవ్య. 1. ప్రశంసాసూచకం: 2. ఆశ్చర్యార్థకం, ఆహా!, ఓహో!. **అగురగుర** అగు+ర+అగు+ర: రూ. అవురవుర, ఔరౌర. అవ్య. ఔనౌను, నిజమే. రామా. 7.39; పో.చూ.త. ఆమ్-ఆమ్. అలాగే, ఔను, నిజంగా. **అగురా** రూ. అగుర, అవుర, అవురా, ఔర, ఔరా. అవ్య. 1. ప్రశంసాసూచకం; 2. ఆశ్చర్యార్థకం, ఆహా!, ఓహో!.

**అగుగామి** చూ. అగు.

**అగుగాములు** చూ. అగు.

**అగుఁగదే** చూ. అగు.

**అగుఁగా** చూ. అగు.

**అగుఁగాక** చూ. అగు.

**అగుఁగాత** చూ. అగు.

**అగుఁగాదను** చూ. అగు.

**అగుదు** రూ.చూ. అగదు².

**అగుదెంచు** చూ. అగు.

**అగునగుఁగదే** చూ. అగు.

**అగునఁటే** చూ. అగు.

**అగునె** చూ. అగు.

**అగునే** చూ. అగు.

**అగుర** చూ. అగు.

**అగురగుర** చూ. అగు.

**అగురా** చూ. అగు.

**అగురు¹** రూ.చూ. అగరు¹. వి. అగరుకఱ్ఱ నుంచితీసిన పరిమళ ద్రవ్యం.

**అగురు²** రూ. అవురు, ఔరు. వి. 1. వీరణం; 2. అవురు గడ్డి (Andropogon muricatus).

బహుశః అగరువలె పరిమళం కలిగి ఉండటాన ఈ పేరు వచ్చి ఉండవచ్చు.

**అగురు³** (సమాసగతంగానే ప్రయుక్తం). విశే. తములపాకు. **అగురుతోట** వి. తములపాకుతోట. **అగురువాడు** వి. తములపాకులవాడు. **అగురువీధి** వి. తములపాకు తోటలు పెంచేవారి వీధి. **అగురుసొంటి** వి. ఓషధీ విశేషం, వసతిక్తక.

**అగురుతోట** చూ. అగురు³.

**అగురువాడు** చూ. అగురు³.

**అగురువీధి** చూ. అగురు³.

**అగురుసొంటి** చూ. అగురు³.

**అగుర్వు** రూ.చూ. అగుర్వు. విశే. 1. గొప్పది, అధికం. కు.సం. 1.38, 12.189; 2. భయంకరం.

**అగుర్వు** రూ. అగుర్వు. విశే. శ్రేష్ఠం, అధికం. కు.సం. 12.972.

క. అగుర్వు, అగుర్వు, గుర్వు, గుర్వు. ఆశ్చర్యం, భయం, భయంకరస్వరూపం. పో.చూ. అగి. భయపడు+ఉర్వు. ఉబ్బు, అధికమగు; తు. అగురుని. వణికిపోవు.

< క. అగుర్వు.

**అగులు¹** రూ.చూ. అగలు¹. అ.క్రి. 1. పగులు; 2. ఈదు. భాగ. 6.370.

**అగులు²** రూ.చూ. అగరు. వి. 1. పరిమళ ద్రవ్యం; 2. చాదు.

**అగులుబొట్టు** వి. నుదుట పెట్టుకునే అగులు వాసనగల బొట్టు.

**అగులుబుగులు** చూ. అయిలు. వి. మనశ్చాంచల్యం.

**అగులుబొట్టు** చూ. అగులు².

**అగో** రూ. అదిగో. అవ్య. చూడు!, అదిగో!, అక్కడ!.

త. అతో. అటు చూడు; కొండ. అగొ, అకొ. అదిగో.

**అగోరించు** రూ.చూ. అఘోరించు. అ.క్రి. 1. మిడుకు; 2. ఏడ్చు.

**అగ్గ** వి. 1. కారం; 2. వేడి.

< అగ్గి+అ.

**అగ్గడి** వి. ముందర, అగ్రభాగం. కకుత్థ్స. 3.102.

సం. అగ్రణీ. శ్రేష్ఠుడు, ముఖ్యుడు; అగ్రత-. ముందు భాగం; ప్రా. అగ్గణీ, అగ్గాణీ. శ్రేష్ఠుడు; అగ్గల, అగ్గడ. ముందు భాగం; శౌర. మా. అగ్గదో. అగ్రభాగం; నే. అగాడి. ముందర; హిం. అగాఢీ; మరా. అఘాడీ; పార. అగ్గడ్;

క. అగ్రణి; త. అక్కరమ్; కొండ. అగ్ది.

< మరా. అఘాడీ.

**అగ్గంటిపాకు** వి. ఒక రకం కలుపు మొక్క (Striga species).

**అగ్గనగండ్లు** వి. కష్టపురోజులు.

**అగ్గపడు** చూ. అగ్గము.

**అగ్గపాటు** చూ. అగ్గము.

**అగ్గము** చూ. అగపడు. విశే. 1. అనుకూలం, వీలు. భార. విరా. 1.54; 2. అధీనం, వశం. భార.విరా. 5.14, ద్రోణ. 2.21; 3. అందుబాటులోది, సమీపించినది. భార. శాంతి. 3.151; 4. గోచరమైనది, కనబడినది. హరి.ఉ. 2.29.

సం. అగ్రం, అగ్రియ, అగ్రిస్. మొదటి, ముందరి;

ప్రా. పా. అప. అగ్గ; జై.మహా. అగ్గబ్ ; అ.మా. అగ్గ ఒ ;

త. అకమ్, ఆకమ్. లోపల, ఇల్లు, స్థలం, మనస్సు ; మ. అకమ్, అకత్తు. ఇంట్లో ; కొ.ద. ఆగ, ఆగె. లోపల.

<ప్రా. అగ్గ-.

**అగ్గపడు** రూ.చూ. అగపడు. అ.క్రి. 1. గోచరమగు ; 2. వశమగు, లోబడు, చిక్కు. **అగ్గపాటు** చూ. అగ్గపడు. వి. 1. ఎరుక, జ్ఞానం ; 2. వశంకావటం, లొంగటం.

**అగ్గరించు** స.క్రి. నదుకు.

? సం. ఆగ్రహ-.

**అగ్గలము** పో. చూ. వెగ్గలము. విశ. అధికం, ఎక్కువ. భార.ఆది. 5.239, కు.సం. 4.400 ; వి. ఆధిక్యం, అతిశయం. భార.విరా. 2.216 ; అవ్య. మిగుల, అధికంగా. హరి.పూ. 2.46.

దే.ప్రా. అగ్గల-. అధికం ; అప. అగ్గల, అగ్గలఉ ; బెం. ఒ. అగలి ; హిం. ఆగలా ; సిం. ఆగరొ ; గు. అగలుఁ ; మరా. అగలా ;

క. అగల, అగ్గళె, అర్గళె. <సం. అగ్రియ ?. అధికం, మిక్కుటం ; త. అక్కళిప్పు < అకమ్ + కళిప్పు. ఆధిక్యం ; వ్య. అంతస్సుఖం అని నిఘంటువు.

<దే.ప్రా. అగ్గల-.

**అగ్గలిక** అగ్గల(ము) + ఇక ; రూ. అగ్గలికము. వి. 1. ఉత్సాహం, పూనిక, విజృంభణం. భార.విరా. 4 170, ఉద్యో. 4.155 ; 2. ఆధిక్యం, పెంపు, అతిశయం. భార. విరా. 4.181 ; 3. శౌర్యం ; 4. విలాస చేష్ట, సరసం.

క. అగ్గళికె. ఆధిక్యం, అధికారం ; త. అక్కళిప్పు. విజయోత్సాహం.

**అగ్గలికము** రూ.చూ. అగ్గలిక. వి. శౌర్యం, విజృంభణం. భార. కర్ణ. 2.191. బసవ. 6.763.

**అగ్గలించు** అగ్గల(ము) + ఇంచు ; చూ. అగ్గలము. అ.క్రి. 1. అతిశయించు, ఎక్కువగు, వ్యాపించు, విజృంభించు. నిర్వ. 6.39, భార.శాంతి. 5.580 ; 2. ఉత్సహించు, పూను. భార.విరా. 2.31.

క. అగ్గలిసు, అగ్గళిసు. అతిశయించు, అతిక్రమించు ; తు. అగ్గళిపుని, అగ్గళిపున, అగ్గళిపుణె. అదరగొట్టు ; త. అక్కళిప్పు. సంతోషం.

**అగ్గలింపు** చూ. అగ్గలించు. వి. పొగరు.

సం. అర్ఘ- ; ? ప్రా. అగ్ఘ. స.క్రి. ఆదరించు, సమ్మానించు ; పో.చూ. అగ్గించు.

**అగ్గారు**[1] చూ. అగ్గి.

**అగ్గారు**[2] అక్క + గారు. వి. కట్టమీది సప్తకన్యల గుడి.

**అగ్గారుపూజ** వి. అగ్గారుకు పసుపు పూసి, పాలు పొంగించి చేసే పూజ.

**అగ్గారుపూజ** చూ. అగ్గారు[2].

**అగ్గి** రూ. అగని. వి. 1. నిప్పు, అగ్ని. భార.భీష్మ. 2.163 ; 2. మలం (అగ్నివలె అస్పృశ్యం కాబట్టి కావచ్చు) : 3. ఎండ.

సం. అగ్ని-. నిప్పు, హోమాగ్ని, అగ్నిదేవుడు ; ప్రా. జై.మహా.పా.అప. నాగరఅప. అగ్గి, అగ్గి ; అ.మా. అగ్గి ; హిం. ఆగ్ ; (మై). ఆగి ; పం. అగ్గ ; గు.మరా.ఆగ్ ; ఒ. అగి ;

క. అగి, అగిని, అగ్గి, హగ్గి ; తు. అగ్గి ; త. అక్కి, అక్కని, అంకి ; మ. అక్కి. నిప్పు, పళ్లపడ్డ మెటిమలు ;

లా. ఇగ్నిస్.

<ప్రా. అగ్గి.

**అగ్గారు**[1] అగ్గి + ఆరు. అ.క్రి. నశించు. **అగ్గికంటి** వి. అగ్నినేత్రుడు, వేడికంటి, శివుడు. క. అగ్గిగణ్ణ. **అగ్గికంటిదేవర** (-కన్ + ఇ + దేవర). వి. అగ్నినేత్రంగల దేవుడు, శివుడు. **అగ్గికంటిసామి** వి. శివుడు. **అగ్గికత్తెరలు** (-కత్తెరలు < కృత్తికలు). వి. బ.వ. కృత్తిక కార్తెలో మెండుగా ఉండే ఎండలు. **అగ్గికాలము** అగ్గి + కాలము ; రూ. అగ్గలకాలము. వి. వేసవి. **అగ్గికూవ** అగ్గి + కూన. వి. కాలుతున్న పెండు. **అగ్గికోల** వి. అగ్నిబాణం. **అగ్గిచూలి** వి. 1. అగ్ని కొడుకు, కుమారస్వామి ; 2. అగ్నినుంచి పుట్టినది. సీదు. **అగ్గిచెక్రం** వి. చురుకైన ఎద్దు. **అగ్గిటిక** అగ్గి + ఇటిక. వి. చెకుముకిరాయి. **అగ్గితత్తడి** వి. అగ్నిదేవుని వాహనం, పొట్టేలు. **అగ్గితాడు** చూ. అగ్నితాడు. వి. కైలాస్ వల పోగుల ముక్క వేడిచేయటానికై నిప్పంటించిన నూలుతాడు. **అగ్గితూపు** వి. అగ్నిబాణం. **అగ్గితెగులు** అగ్గి + తెగులు. వి. వరి మిరప జొన్న వేరుసెనగ ము. పైర్లకు వచ్చే తెగులు. **అగ్గితెప్ప** వి. నిప్పురవ్వ. **అగ్గిదాకు** అ.క్రి. 1. ఆకలి అగు ; 2. వడ తగులు. **అగ్గిదాహం** వి. ఎక్కువ దప్పిక. **అగ్గినిప్పు** అగ్గి + నిప్పు ; రెంటికీ అగ్ని అనే అర్థం. వి. నిప్పు. **అగ్గిపంతులు** వి. కోపిష్ఠి. **అగ్గిపిడుగు** వి. గట్టివాడు. **అగ్గిపిండం** వి. తీక్ష్ణప్రకృతి గలవాడు. **అగ్గిపుల్ల** వి. నిప్పు పుట్టించే పుడక. **అగ్గిపుల్లగాడు** వి. 1. తగవులమారివాడు, నారదుడు ; 2. తంత్రగాడు, కొండెగాడు ; వ్య. అగ్గిపుల్లలాగా కొంపలకు చిచ్చుపెట్టేవాడు. **అగ్గిపెట్టె** వి. నిప్పుపెట్టె. **అగ్గిబెట్టు** స.క్రి. 1. ఎండబెట్టు, ఎండలో పెట్టు ; 2. నిర్లక్ష్యంగా పారవేయు ; 3. నిప్పంటించు. **అగ్గిబొడి** (-పొడి). వి. కాగడా, దివిటీ. **అగ్గిబొద్దు** వి. రాయి ఉక్కు ముక్కల రాపిడివల్ల కలిగే నిప్పు నాకర్షించే నూలుతాడు. **అగ్గిములికి** వి. అగ్గిబాణం. **అగ్గిమేడి** వి. ఒక రకం మేడిచెట్టు (Ficus glomereta). **అగ్గియగు** అ.క్రి. మిక్కిలి కోపించు. **అగ్గిరాముడు** రూ. అగ్గిరావుడు. వి. 1. సమర్థుడు, దక్షుడు ; 2. ముక్కోపి. **అగ్గిరావుడు** రూ.చూ. అగ్గిరాముడు. **అగ్గివాన** వి. అగ్నివర్షం. **అగ్గివేంద్రపాకు** వి. అగంద్రపాకు (Ammania vesicatoria).

**అగ్గికంటి** చూ. అగ్గి.

**అగ్గికంటిదేవర** చూ. అగ్గి.

**అగ్గికంటిసామి** చూ. అగ్గి.

**అగ్గికత్తెరలు** చూ. అగ్గి.

**అగ్గికాలము** చూ. అగ్గి.

**అగ్గికూవ** చూ. అగ్గి.

**అగ్గికోల** చూ. అగ్గి.
**అగ్గిచూలి** చూ. అగ్గి.
**అగ్గిచెక్రం** చూ. అగ్గి.
**అగ్గించు** స.క్రి. స్తుతించు, పొగడు, కొనియాడు. బార.విరా. 4.223.

సం. అర్ఘః. విలువ, మూల్యం : అర్ఘతి. విలువకలిగియుండు, యోగ్యమగు ; ప్రా. అగ్ఘ. ఆదరించు, గౌరవించు ; అ.మా. అగ్ఘ. పూజాద్రవ్యం, ధర, విలువ ; పా. అగ్ఘ. విలువ ; అగ్ఘతి. విలువకట్టు :

క. అగ్గ (<సం. అర్ఘ-). విలువ, సరైన ధర ; వస్తువుల రాయితీ, రాయితీ, చౌక ; జలాది పూజాద్రవ్యాల సప్రశయ సమర్పణ ; తు. అగ. రాయితీ, అయోగ్యత.

అగ్గ+ఇంచు : అగ్గ-<ప్రా. అగ్ఘ-.

**అగ్గిటిక** చూ. అగ్గి.
**అగ్గితత్తడి** చూ. అగ్గి.
**అగ్గిజాడు** చూ. అగ్గి.
**అగ్గితూపు** చూ. అగ్గి.
**అగ్గితెగులు** చూ. అగ్గి.
**అగ్గితెప్ప** చూ. అగ్గి.
**అగ్గిదాకు** చూ. అగ్గి.
**అగ్గిదాహం** చూ. అగ్గి.
**అగ్గినివ్వ** చూ. అగ్గి.
**అగ్గిపంతులు** చూ. అగ్గి.
**అగ్గిపిడుగు** చూ. అగ్గి.
**అగ్గిపిండం** చూ. అగ్గి.
**అగ్గిపుల్ల** చూ. అగ్గి.
**అగ్గిపుల్లగాడు** చూ. అగ్గి.
**అగ్గిపెట్టె** చూ. అగ్గి.
**అగ్గిబెట్టు** చూ. అగ్గి.
**అగ్గిబొడి** చూ. అగ్గి.
**అగ్గిబొద్దు** చూ. అగ్గి.
**అగ్గిములికి** చూ. అగ్గి.
**అగ్గిమేడి** చూ. అగ్గి.
**అగ్గింపు** చూ. అగ్గించు. వి. స్తుతి, పొగడ్త. ఆం. భా. 1.114.
**అగ్గియగు** చూ. అగ్గి.
**అగ్గిరాముడు** చూ. అగ్గి.
**అగ్గిరావుడు** చూ. అగ్గి.
**అగ్గిరి** రూ. ఒగ్గిర, అగ్గిరితాడు, అగ్గిర్తాడు, అగ్రిజాడు. ఒగ్గిరదాడు. వి. చేపలు మొ. వాటిని పట్టే వలలకు కట్టే తాడు.

<సం. అగ్ర-.

**అగ్గిరితాడు** రూ.చూ. అగ్గిరి.
**అగ్గిర్తాడు** రూ.చూ. అగ్గిరి.
**అగ్గివాన** చూ. అగ్గి.
**అగ్గివేంద్రపాకు** చూ. అగ్గి.
**అగ్గీనం** వి. ఆగ్నేయ మూల.

సం. ఆగ్నేయ-. ఒక విదిక్కు ; ప్రా. అగ్గేయ- ;

త. అక్కినకోణం.

<సం. ఆగ్నేయ-.

**అగ్గు** చూ. అగ్గము. అ. క్రి. ఇమిడియుండు, అమరు. విష్ణుమా. 3.12, లావణ్య. 35.

<అగ్గ (ము)+ఉ.

**అగ్గురారమ్** రూ.చూ. అగ్రారము. వి. రాజు బ్రాహ్మణులకు దానంగా ఇచ్చిన గ్రామం.
**అగ్గువ** రూ. అగ్గువ. విశే. చౌక, వెలతక్కువ (శ.ర.). వి. **1.** చౌకగా ఉండటం ; **2.** ఆధిక్యం, ఎక్కువ ; **3.** ఖరీదు.

సం. అర్ఘ-. విలువ, మూల్యం, విలువైనది ; ప్రా. అగ్ఘో. విలువ, ఎక్కువ వెల ; అ.మా. అగ్ఘ. వెల, విలువ ; పా. అగ్గ-; అగ్ఘియ. విలువైన.

క. అగ్గ, హగ్గ. వెల, చౌక ; తు. అగ్గ. సరకుల రాయితీ.

<పా. అగ్ఘ- <సం. అర్ఘ-. అర్థ విపరి.

**అగ్గువగా కొను** స.క్రి. చౌకగా కొను. **అగ్గువగా తీయు** స.క్రి. చౌకగా కొను.

**అగ్గువగాకొను** చూ. అగ్గువ.
**అగ్గువగాతీయు** చూ. అగ్గువ.
**అగ్గువు** రూ.చూ. అగ్గువ. వి. మూల్యం, ధర. విజ్ఞా. 2.73.
**అగ్గెడ(న్)** అ[1]+గెడ(న్). క్రి.విశే. అక్కడ, ఆచోట. ఆము. 5.122.
**అగ్నికార్తె** అగ్ని+కార్తె. వి. భరణికార్తె.
**అగ్నికుల క్షత్రియులు** వి. బ.వ. పల్లెకార్లు.
**అగ్నిమచ్చ** అగ్ని+మచ్చ. వి. కొరివిమచ్చ, కాలిన మచ్చలాగా నల్లగా కన్పించే మచ్చ.
**అగ్నివేంద్రపాకు** రూ. అగ్గివేంద్రపాకు ; చూ. అగ్నివేంద్రము. వి. అగంద్రపాకు.
**అగ్నివేంద్రము** అగ్ని+వేంద్రము. వి. అగంద్రపాకు ; వ్య. అగ్నివలె వేడి ఐనది.
**అగ్నిహోత్రాలు** వి. బ.వ. సిగరెట్లు, బీడీలు ; వ్య. కాల్చే అగ్నులని సాక్షేపంగా (బ్రా.).
**అగ్నీశబండి** వి. ఒక చోటినుంచి మరొక చోటికి తీసుకు పోవటానికి అనువైన అగసాలె వాని కొలిమి ; ఆనేయమైన అంగార ధాని (బ్రా.).

సం. అగ్నిష్ఠికా. అశ్వమేధ యాగంలో అగ్ని కొనితెచ్చే బండి ; అగ్నిష్ఠ-. పెనం ; ప్రా. అగ్గిట్ఠ-. అగ్నియందున్నది.

<అగ్నీశ-+బండి. మిశ్ర స. ; (అగ్నీశ-<సం. అగ్నిష్ఠ-; అసాధు రూపం).

**అగ్రారము** రూ. అగ్గురారం. వి. రాజు బ్రాహ్మణులకు దానమిచ్చిన భూమి లేదా గ్రామం ; బ్రాహ్మణులు నివసించే వీధి లేక గ్రామం ; అగ్రహారం.

సం. అగ్రహార-. బ్రాహ్మణుల నివాసం కోసం రాజు ఇచ్చిన భూమి లేక గ్రామం ; అగ్ర. ముందు, హార. ప్రదేశం ; ప్రా. అగ్గహార-.

<సం. అగ్రహార-.

**అగ్రిజాడు** రూ.చూ. అగ్గిరి.
**అగ్రిమెంటు** వి. ఒడంబడిక, కరారునామా.

<ఇం. Agreement.

**అఘముడి** వి. మొదలియార్లలో ఒక తెగ.

త. అకంపటియర్. తంజావూరు మదుర జిల్లాల్లో ఒక కాపు కులం.

**అఘోరించు** రూ. అగోరించు. అ.క్రి. 1. ఆక్రోశించు, మొరపెట్టు ; 2. దుఃఖపడు ; 3. భయపడు (గ్రా.).

పో.చూ.త. అకోరమ్. భయంకరత్వం.

<అఘోర+ఇంచు (అఘోర-- భయంకరాచారాల ననుసరించే ఒకానొక శైవ శాఖ).

**అంక¹** వి. పార్శ్వం, దెస. భోజ. 6.25.

క. అంక. పక్క ; పో.చూ. అంకవడి. రికాబు ; పో.చూ. మ. అంకవటి.

అంక <వంక.

**అంక²(ము)** వి. 1. యుద్ధం, ద్వంద్వయుద్ధం ; 2. వినోదయుద్ధం.

సం. అంక. వినోదయుద్ధం, యుద్ధం ;

క. అంక. యుద్ధం, కోడిపందెం ; త. అంకం. యుద్ధం ; మ. అంకం. యుద్ధం, ద్వంద్వయుద్ధం.

<సం. అంక-.

**అంకకాఁడు** రూ. అంకకాఱుఁడు, అంకికాఁడు, అంకెకాఁడు. వి. 1. మొనగాడు, ముఖ్యుడు, శూరుడు ; వ్యు. సేనాపతి ; 2. కళంకంగలవాడు. కవిక. 3.98 ; 3. చలపాది, మాత్సర్యశీలుడు. ఆము. 4.263. **అంకకాఱుఁడు** రూ.చూ. అంకకాఁడు. వి. శూరుడు, మొనగాడు. క. అంకకాఱ. **అంకికాఁడు** రూ.చూ. అంకకాఁడు. వి. ప్రధానుడు, ముఖ్యుడు. అంక² > అంకి (ఎ)+కాఁడు. **అంకెకాఁడు** రూ.చూ. అంకకాఁడు. వి. ప్రధానుడు, మొనగాడు, వర్తక ముఖ్యుడు, శ్రేష్ఠి.

<అంకె+కాఁడు.

**అంక³** రూ. అణక. వి. (ఎద్దు మొ.వి) మెడమీది కాడి పడకోసి కిందికి తెచ్చుకోవటం.

**అంకకాఁడు** చూ. అంక².

**అంకకాఱుఁడు** చూ. అంక² ; రూ.చూ. అంకకాఁడు.

**అంకణము¹** రూ. అంగళ(o). వి. 1. రెండు స్తంభాల మధ్య ప్రదేశం. ద.బా.కా. 4.789 ; 2. ముంగిలి, ప్రాంగణం ; 3. నివేశన ప్రాదేశిక ప్రమాణం, 12 × 6 అడుగులు ; 4. పెరడు, చత్వరం, చతుశ్శాల.

సం. అంగన(ణ)మ్. ముంగిలి, ఇంటిముందరి చోటు, చోటు, నడిచే చోటు, నడవటం ; ప్రా. అ.మా. పా. అంగణమ్. ఆవరణ ; బెం. ఒ. హిం. పం. అంగనమ్ ; మరా. అంగణమ్ ; ఉ. అంగన్ ; గు. అంగుణమ్ ;

క. అంకణ. రెండు స్తంభాల మధ్య ప్రదేశం ; తు. అంకణ. చత్వరం, చతుశ్శాల, చిన్నగది ; త. అంకణమ్. పెరడు, తూము, చోటు, గది, రెండు స్తంభాల మధ్య ప్రదేశం, నివేశన ప్రాదేశిక పరిమాణం 12′ × 6′, బురద ; మ. అంకణమ్. పెరడు, ఆవరణ ; కుఇ. అంగెని పెరడు ; పో.చూ. పర్జి. అంగొడ్. ఆవరణ.

<ప్రా. అంగణమ్.

**అంకణము²** వి. అధికారం, పెత్తనం.

**అంకతాడు** రూ. వంకతాడి. వి. 1. దక్షిణాన ఆకాశంలో వడసగా నిలువున కనపడే అయిదు చుక్కలు ; 2. మోతేతి పంపు వరె కన్పించే పన్నెండు చుక్కలు (అని కొందరు).

**అంకదేవర** వి. పల్లెవాళ్ల దేవత ; చూ. అంకమ్మ.

**అంకదోస** అంక + దోస. వి. ఒకరకం దోస (Leea sambucina).

**అంకన(ము)** వి. భగవన్నామాంకితమైన స్తోత్రం. పండి.చ. 294 పు., భీమా. 66 పు., బసవ. 4.127 పు.

సం. అంకనమ్. గుర్తు, ముద్ర ; ప్రా. అ.మా. అంకణమ్.

<సం. అంకన-.

**అంకపొంకములు** మిశ్రస. ; రూ. అంకపొంకాలు. అంకాపొంకములు, అంకాపొంకాలు. వి. 1. వేగిరం ; 2. కోపం. రామా. 7.49 ; 3. వికోరం ; విశ. తీక్ష్ణం. తీవ్రం, అధికం.

క. పొంక. ఉప్పొంగే శౌర్యం ; పో.చూ. పొంగ. మహాశౌర్యశాలి ; త. పొంకు. అ.క్రి. ఉడుకు. ఉప్పొంగు.

<సం. అంక-+పొంకము. రూపు, ఉబ్బు ; మనః ప్రవృత్తి ప్రదర్శకం.

**అంకపొంకాలు** రూ.చూ. అంకపొంకములు.

**అంకమాలిక** పో.చూ. అంకించు, అంకన. వి. స్తోత్రం. కు.సం. 3.281, 11.620.

పో.చూ. త. అంకమాలై. శరీరావయవాలను వర్ణించే పద్యం.

<సం. అంక²+మాలిక ; వ్యు. నామాంకితంగా రాయబడ్డ కీర్తన.

**అంకము** వి. తప్పు లెన్నటం, ఆక్షేపం. మైరా. 1.13.

ఇది ద్రావిడ పదమని సూ.ని. ; సం. 'అంక'కు పాప మనీ కళంకమనీ అర్థం ఉంది. ఇది తజ్జన్యమైనా కావచ్చు.

**అంకమ్మ** రూ.చూ. అంకాళమ్మ. వి. ఒక గ్రామదేవత.

**అంకమ్మసివాలు** చూ. సివము. వి. బ.వ. ఒక దేవత పూనినప్పటి చేష్టలు. **అంకమ్మసోకాలు** అంకమ్మ + సోకాలు <సం. శోక-. వి. బ.వ. ఏడ్పులు, పెడబొబ్బలు.

**అంకమ్మ సివాలు** చూ. అంకమ్మ.

**అంకమ్మ సోకాలు** చూ. అంకమ్మ.

**అంకలమ్మ** రూ.చూ. అంకాళమ్మ. వి. ఒక గ్రామదేవత.

**అంకవంక** వి. మార్దవం, నమ్రత, విధేయత.

<అంక + వంక ; అంక < అణగు. వంగు, లోబడు.

**అంకవన్నియ** రూ. అంకవన్నె, అంకెవన్నియ, అంకెవన్నె. వి. రికాబు, గుర్రాన్ని ఎక్కటానికై అమర్చే ఇనుప మెట్టు. ఇందు. 2.254.

క. అంకవణి (అంక-వ్-అణి). అలంకృతమైన ఆసనం ; అంకోళి, అంగవడి (అంక-పడి). రికాబు ; తు. అంకోలె ; త. అంకవటి, అంకపటి ; మ. అంకవతి, అంకపతి.

**అంకవన్నె** రూ.చూ. అంకవన్నియ. వి. రికాబు. ఆము. 2.272, ప్రభా. 2.38.

**అంకసిరి** వి. అరవై ఏళ్లు నిండిన తర్వాత వచ్చే జబ్బు.

**అంకాశాపా** వి. కోడతాపాలు.

**అంకాపాకా** పో.చూ. అంకాపొంకములు. వి. కోపం.
< అంకాపొంకాలు ; అర్థవిపరి.

**అంకాపొంకములు** రూ.చూ. అంకపొంకములు. వి. **1.** కోపం. రామా. 7.50 ; **2.** విరోధం. కవిగ. 1 ; విశ. తీక్ష్ణం, తీవ్రం, అధికం.

**అంకాపొంకాలు** రూ.చూ. అంకపొంకములు.

**అంకారించు** పో.చూ. లంగరు. అ.క్రి. ఓడ తెరచాప ఎత్తిపోవు ; లంగరు (అంకోర) ఎత్తు.
నే. *లంగర్, లంగుర్*, లంగడు, లోలకం ; హిం. *అంకోరా*. లంగరు ; ఉ. *అన్క్రా, అన్క్రి, అన్క్రి.* వంపు కలిగిన ఇనపవస్తువు, దాఐం ములికి, గాలం ; పార. *లంగర్* ; అర. *హంచర్న్*. తెరచాపతాడు కట్టేందుకు పడిశేందుకు ఉపయోగించే లోహపుముక్క ;
క. *నంగల్, లంగర్, లంగర*. లంగరు ; తు. *లంగరు* ; త. *నంకూరమ్, లంకర్* ; మ. *నంగూరమ్, అంగర్*.
< ఉ. అన్క్రా.

**అంకాలమ్మ** రూ.చూ. అంకాళమ్మ. వి. ఒక గ్రామదేవత.

**అంకాలు**[1] వి. పాలచెట్టు, నందివృక్షం (Mimusops hexandra).

**అంకాలు**[2] చూ. ఏ.వ. అంకెము. వి. బ.వ. గోనె సంచులు.

**అంకాళమ్మ** రూ. అంకమ్మ, అంకలమ్మ, అంకాలమ్మ, మంకాళమ్మ. వి. **1.** ఒక వ్యక్తి పేరు, సంజ్ఞావాచకం. విజ్ఞా. 2 ; **2.** ఒక గ్రామదేవత, కాళిఅవతారం.
సం. *మహాకాళీ* ;
త. *అంకమ్మా*. కాళిక అవతారం : *అంకాళమ్మై, అంకాళి*. గ్రామదేవత, ప్రళయకాళి.
మహా-కాళి + అమ్మ > మాంకాళమ్మ > అంకాళమ్మ > అంకమ్మ > అంకు.

**-అంకి**[1] కృత్ప్రత్యయం : అడ్డ్-అంకి. అడ్డంకి. వేంక. పంచ. 4.248.

**-అంకి**[2] రూ. -అంగి[1]. ప్రత్య. పిట్టల పేర్ల చివరవచ్చే ప్రత్యయం : ఉల్లంకి చూ. ప్రబంధ. 238.
త. *ఉల్లాన్*. ఉల్లాంపిట్ట,

**-అంకి**[3] రూ. -అంగి[2]. ప్రత్య. గ్రామనామాల్లో ఉత్తర భాగాన వచ్చే ప్రత్యయం : అయ్యంకి, ఈరంకి, కాదంకి, పోరంకి (అంకి. సరిహద్దు అని కొందరు).

**అంకికాఁడు** చూ. అంక[3]. రూ.చూ. అంకకాఁడు.

**అంకించు**[1] స.క్రి. **1.** గమనించు. పండి. చ. 1.61 పు ; **2.** స్తుతించు, పొగడు. పండి. చ. 1.3 పు, భాగ. 8.134 ; **3** భావించు. భాగ. 7.160 ; **4.** పైకెత్తు. జై.భా. 8.314 ; **5.** ఉగ్గడించు. మను. 4.27 ; అ.క్రి. ఒప్పు, ప్రకాశించు. వసు. 4.23.
సం. అంక-. గుర్తు ;
క. అంకిసు. గుర్తించు, గమనించు. శ్రద్ధ వహించు ; త. అంకమ్. గుర్తు, చిహ్నం.
< సం. అంక- + ఇంచు.

**అంకించు**[2] స.క్రి. **1.** పట్టుకొను. కృ. శకు. 3.47 ; **2.** తాల్చు, పూను, వహించు. అచ్చ. రా. అరణ్య. 75, ద్వి. శ. సా. 1.47 పు. 16 పం. ; **3.** కలిగించు. ఉక. 1.81 ; **4.** అపహరించు. కృష్ణా. 2 ; **5.** వశపరచుకొను.

**అంకించు**[3] అంక[1] + ఇంచు. స.క్రి. **1.** పక్కకు తిప్పు, ఆడించు. నిర్వ. 8.38, జై.భా. 2.31 ; **2.** పైకెత్తు. రం. రా.

**అంకిడి** వి. కుస్తీ పట్టులో ఒకఒడుపు, మల్లబంధ విశేషం. ప్రబంధ. 89.
బహుశః < *అంకిడి ; అంక[1] (పక్క) + ఇడి (విరగగొట్టటం).

**అంకిణీలు** రూ. అంకినీడు. వి. గుర్రపుజీనుకు వేసే అలంకారం.
సం. *అంకిణీ* ;
పో.చూ. క. *అంకవణి*. అలంకృతమైన ఆసనం.
బహుశః < సం. అంకిణి. అలంకరణలో లాగా ఏదో ఒక గుర్తు లేక చిహ్నం గలది.

**అంకినీడు** రూ.చూ అంకిణీలు. వి. గుర్రపు జీనుకు వేసే అలంకారం.

**అంకియ**[1] రూ. అంకె[1]. వి. సంఖ్య.
సం. *అంక* -సంఖ్య ; ప్రా. *అంకిఅ*. గుర్తించబడిన ; *అఁక*. సంఖ్య ; అ.మా. *అంకియ*. గుర్తుగల ; కా. *అంఖ్*. సంఖ్య ; నే. *అంకె*. (అక్షరాల్లో కాక) అంకెలలో ; హిం. *అంక్*. సంఖ్య ; సిం. *అంగు* ; గు. మరా. *అంక్* ;
క. అంకె (< సం. అంక-) ; తు. *అంకె*. ; మ. *అంకె, అక్కమ్*.
< సం. అంక-.

**అంకియ**[2] రూ. అంకె[2]. వి. వశం, అధీనం.
క. *అంకె*. ఆజ్ఞ, శాసనం, అధికారం, వశం, నిగ్రహం ; తు. *అంకె*.
< అంకు[1] + ఇయ ; లేదా కన్నడం నుంచి ప్రతిదేయం కావచ్చు.

**అంకియము** రూ.చూ. అంకియ.

**అంకిలి**[1] వి. **1.** మర్మం, కీలకం. విజయ. 1.105 ; **2.** తాలు మూలమందలి కీలు, దౌడకీలు. రంగ. చ. 3.90.
త. *అణ్*. పై + *కీల్*. కీలు.
< అన్ (ఉ). (మాటాడు) + కీల్ (ఉ) ; < సం. కీల-. కీలు, వాక్స్థానం ; అణ్ + కీలు. పై కీలు.
మూ. ద్రా. *అణ్.

**అంకిలి**[2] వి. **1.** క్షోభం, కలత. భార.విరా. 2.214, షో. 164, భాగ. 6.304 ; **2.** ఆపద. భోజ. 3.144, నా. పంచ. 1.222 ; **3.** నిరోధం, అడ్డు. కాశీ. 3.11, చాహ్న. 2.137 ; **4.** భంగం, నాశం. అచ్చ. రా.యు. 474.
క. *అన్*. అనుకొను, వాలు, వంగు, నిరోధింపబడు, అలసమగు, పట్టుకొను, ధరించు, భరించు, సహించు మొ. ;

త. అణ్. ప్రతిఘటించు, నిరోధింపబడు.

అన్ + కు > అంకు + ఇలి.

మూ.ద్రా. *అన్.

**అంకిలివడు** అ.క్రి. ఆగిపోవు, అడ్డిపోవు. భోజ. 6.376. **అంకిలిపాటు** వి. అడ్డు పాటు, భంగం, నాశం. హరి. పూ. 1.61. **అంకిలిపెట్టు** రూ. అంకిలివెట్టు. స.క్రి. బంధించు, నిరోధించు, అడ్డగించు. భా. రా. సుం. 71. **అంకిలివడు** అ.క్రి. నశించు. కకుత్స. 6.161. **అంకిలివెట్టు** రూ.చూ. అంకిలి పెట్టు.

**అంకిలివడు** చూ. అంకిలి[2].

**అంకిలిపాటు** చూ. అంకిలి[2].

**అంకిలిపెట్టు** చూ. అంకిలి[2].

**అంకిలివడు** చూ. అంకిలి[2].

**అంకిలివెట్టు** చూ. అంకిలి[2].

**అంకీళ్లు** చూ. అంకిలి[1]. వి. బ.వ. 1. దౌడ ఎముకల నరాలు; 2. దౌడ ఎముకల కీళ్లు.

< అంకిలి + కీళ్లు (ద్రా.).

**అంకు[1]** స.క్రి. దొరుకు, లభించు.

క. అక్కు. ఆక్రమించు, కౌగిలించు; త. అణుకు. చేరు, చేరదీయు.

క. 'అక్కు' తెలుగులో సానునాసికమై ఉండవచ్చు.

**అంకుడు[2]** వి. పొందినవాడు, ఒకానొకదేవర; అంకమ్మ భర్త.

**అంకు[2]** వి. ఒక గ్రామదేవత, అంకమ్మ (గౌరవసూచకమైన అమ్మ అనే పదం లోపించి ఏర్పడిన సంక్షేప రూపం.)

**అంకు[3]** చూ. అంకిలి[1]. వి. దౌడ కీలు. ఆం. భా. 2.143.

పో.చూ. మ. వంకు. గొంతుక.

(అంకిలిలో 'ఇలి' లోపించటంవల్ల ఏర్పడిన పశ్చాన్నిర్మాణం కావచ్చు.)

**అంకువలు** వి. కాలువలు, అంకిళ్ళు.

**అంకుడు[1]** వి. కొడిసె (Holarrhena anti-dysenterica).

సం. అంకోటు, అంకోఠ, అంకోల, అంకోలక. కొడిసె; ప్రా. అంకొఠ, అంకొల్ల; అ.మా. అంకొల్ల.

< సం. అంకోట. (అంకోల శబ్దం. ద్రా. భా. లోంచి సం. లోకి వచ్చిందని బరో).

**అంకుడు[2]** చూ. అంకు[1].

**అంకుడుతెగులు** వి. మిరప తెగులు.

**అంకులు[1]** చూ. అంకుడు[2]. వి. బ.వ. దేవరలు.

**అంకులు[2]** పో.చూ. ఒంకి. వి. బ.వ. ఆభరణ విశేషం. ద్వి.భాగ. 10.1.8.

సం. అంక. ఆభరణం; ప్రా. అంక. ఒక జాతి రత్నం, ముత్యం;

క. అంక, వంకి, ఒంకి, బంకి. ఒక రకం కొక్కెం, కత్తి, దండ కడియం; తు. ఒంకి. ఒక రకం ఆభరణం.

అంకు + లు < సం. అంక-; పో.చూ. ఒంకి.

**అంకువలు** చూ. అంకు[3].

**అంకుసంకులకురాని** అంకుసంకులు + అ + కు + రాని. విశే. నిరంకుశమైన, అవిధేయమైన. తల వంచని. మొరకు; వ్యు. ఆజ్ఞాదులకు లోబడని.

అంకు < అంక (ఒడి) : సంకిలి (చంక) : అంకుసంకిలి > అంకు సంకులు : వ్యు. ఒడి చంక మామూలుగా వస్తువులు పెట్టుకునే చోట్లు : అంకుసంకులకురాని. ఒడిలోకి గానీ చంకలోకి గానీ రాని ; ఎటూ ఒదగని.

**అంకుసంకులు** వి. అవకాశం.

'అంకు సంకులకు రాని' నుండి పశ్చాన్నిర్మాణం.

**అంకుసము** వి. అంకుశం : ఏనుగు కుంభస్థలాన్ని పొడవటానికి ఉపయోగించే ఆయుధం. ఆం. భా. 2.195.

సం. అంకుశ- ; ప్రా. అ.మా. అంకుస ; నే. అంకుస్, అంకుసె, అఁకుసె. కొంకి, కొంకి గల వస్తువు : హిం. అంకుస్, అఁకుస్ ; ఉ. అంకుస్ ;

క. అంకుస, అంగుస (< సం. అంకుశ-) : తు. అంకుస ; త. అంకుచమ్ ; మ. అంకుసమ్.

< ప్రా. అంకుస-.

**అంకుసముమాద్రి** వి. ఇరవయ్యేడు నక్షత్రాలలో పందొమ్మిదవది, మూల ; అంకుశం ఆకారంలో ఉండటం వల్ల.

**అంకుసముమాద్రి** చూ. అంకుసము.

**అంకె[1]** రూ.చూ. అంకియ[1].

**అంకె[2]** రూ.చూ. అంకియ[2]. భా.శ. 2.

**అంకె[3]** వి. 1. సామీప్యం, చేరిక ; 2. పట్టు, అనువు, ఊతం.

పో.చూ. క. అంకె, అనికె. అనువు, అనిక, నమ్మిక ; త. అణుక్కమ్. సామీప్యం ; మ. అణుకుక. చేరు, సమీపించు ; పో.చూ. గోం. అంచనా — అంచి — అంచాకా, అంచ్‌కా. నొక్కు ; పో.చూ. కుఇ. అడ. అతుకు, కలుపు ; పో.చూ. పర్జి. అంండ్. వింటి నారి సంధించటం.

< క. అనికె.

**అంకెగొను** స.క్రి. 1. కమ్ము, వ్యాపించు. రాజవా. 3.49 ; 2. ఆక్రమించు, ముట్టడించు. క. అంకెగొళ్. పట్టు, ముట్టడించు.

**అంకె[4]** రూ.చూ. అంక[3].

**అంకె[5]** రూ.చూ. అంకెము. వి. గోనె, సంచి.

**అంకె[6]** వి. బార. (అంకె = 4 గిరలు).

**అంకెకాఁడు** చూ. అంక[2].

**అంకెగొను** చూ. అంకె[3].

**అంకెన[1]** వి. ఒకానొక ఫల వృక్షం. కాశ. 3.69.

బహుశః < అంకు[1]-ఎన.

**అంకెవ[2]** వి. గొర్రులో భాగం, ఇనప వంకి.

**అంకెవ[3]** వి. గింజలు రాలిన కంకి, చచ్చు కంకి.

**అంకెపుధాన్యం** చూ. అంకెం.

**అంకెము** రూ. అంకియము, అంకెం. వి. 1. రికాబు, గుర్రాన్ని ఎక్కేందుకు పక్కన అమర్చిన మెట్టు. వేమన.

2.267 ; **2.** ఎద్దు మొ. వాటిపై వేసే బరువులో సగం, ఒక పక్క బరువు ; **3.** అంకెం ధాన్యం పట్టే సంచీ ; **4.** ఎనభై సేర్ల ధాన్యం.

క. అంకె. ఆనుకొను, ఊతకఱ్ఱ, మీట ; ఆనికె. పట్టుకొను, ఊతకఱ్ఱ.

**అంకెపుధాన్యం** ఎద్దు మోయగల ధాన్యంలో సగం.

**అంకెంగుర్ద** వి. కుంచె కట్టుబడిలో చెంపలు కుట్టిన పట్టా, కుంచె చెంప.

**అంకెళ్లనుడి** రూ. సంకెళ్లనుడి. వి. బేడినుడి, దొండకాయ నుడి, మోకాళ్ల దిగువన ఉండే నుడి.

**అంకెవన్నియ** రూ.చూ. అంకవన్నియ. వి. రికాబు. ఉ.రా. 7.397.

**అంకెవన్నె** రూ.చూ. అంక వన్నియ. ఆము. 2.29, శుక.చ. 2.56.

**అంకెవన్నెముక** సస్తనజంతువుల చెవి మధ్య భాగంలో రికాబు ఆకారంలో ఉండే ఎముక.

**అంకెవన్నెముక** చూ. అంకెవన్నె.

**అంకెవేసికొను** అంకె[4] + వేసి + కొను. పో.చూ. అంక[3]. అ.క్రి. **1.** ఇష్టం లేనప్పుడు ఎద్దు మెడమీది కాడి కిందికి తెచ్చుకొను ; **2.** మొండికెత్తు.

**అంకోసం** వి. అనుసు, కాపీ పిడిమీది పొన్ను.

క. అణసు + కూచు.

**అంగ**[1] వి. **1.** వేగంగా పోవటానికై కాళ్లు చాచివేయటం. శుక.చ. 2.16 ; **2.** పూర్తిగా చాచిన రెండడుగుల నడిమి ప్రదేశం, దాని పరిమాణం.

సం. అంఘ్, అంఘతే, ఆనంఘే. వెళ్లు, బయలుదేరు, ప్రారంభించు, త్వరపెట్టు, త్వరగా మాట్లాడు, నిందించు ; అంఘ్రి. అడుగు.

క. అంగల. విడివిడిగా దూరంగా ఉండటం. దీన్ని 'అంగ'తో కలిపి 'అంగ' ద్రావిడ ధాతువుగా సూ.ని. గ్రహించింది.

<సం. అంఘ-.

**అంగకాల** రూ.చూ. అంగకోల. **అంగకోల** రూ. అంగకాల. వి. అంగలతో వేయు కొలత. **అంగవేయు** అ.క్రి. పెద్ద పెద్ద అడుగులు వేయు.

**అంగ-**[2] విణ. శరీరం, శరీరావయవం.

సం. మహా. అంగ-. శరీరం ; అమా. పా. అంగ-. అవయవం.

<సం. అంగ-.

**అంగజాల** వి. పొలాలకు నీళ్లు పెట్టే కావలివాడు. **అంగజాలలు** వి. బవ. **1.** అంగరక్షకులు, సొవిదల్లులు, అంతఃపురపు కావలివారు. కాశీ. 6.227 ; **2.** రాజభటులు. పి. శకుం. 2.10. త. అంగచాలైక్కారన్. గ్రామాధికారి ఆజ్ఞ ప్రకారం గ్రామస్థుల్ని సమీకరించి కావలసిన సరకులు సేకరించే సేవకుడు. <సం. అంగ (శరీరం) + జాల (కవచం). కవచధారులైన అంగరక్షకులు. **అంగజాలవాఁడు** వి. గ్రామంలో అందరికీ లోబడి ఉండే వెట్టివాడు. **అంగజీతము** వి. సొంత జీతం. శా.శ.కో. (అంగ + జీతం — ఈ అర్థం విచారణీయం). **అంగదట్టము** వి. **1.** శరీరాన్ని కప్పే ముతకబట్ట, పావడ, గాగర. మను. 2.27 ; **2.** యోషాంతరీయం. ఆం.భా. 2.158. క. అంగదట్టి. పావడ ; బహుశః త. అమ్ (అందం) + కము > అంగ(ము). అందంకోసం ధరించిన వస్త్రం, లేక సం. అంగ (శరీరం, అవయవం ; అర్థ. విపరి. కప్పవలసిన అవయవం) + దట్టి. ముతకబట్ట (ఒక ప్రత్యేక శరీరభాగాన్ని కప్పుకునేందుకు ధరించే ముతక బట్ట). **అంగబిల్ల** రూ. అంగబిళ్ల. వి. ఆడుపిల్లల మొలకు కట్టే వెండి లేక బంగారు బిళ్ల. **అంగబిళ్ల** రూ.చూ. అంగబిల్ల. **అంగమచ్చము** వి. **1.** అడియాలం, ఆనవాలు. రామాభ్యు. 5.266, సారంగ. చ. 2.137 ; **2.** శరీరంమీదిగుర్తు, పుట్టుమచ్చ మొ. **అంగమొల** వి. దిస్సమొల. **అంగమొలవాఁడు** వి. వస్త్రహీనుడు, దిగంబరుడు. **అంగమొలవేల్పు** వి. దిగంబరుడు, శివుడు. **అంగరక** రూ.చూ. అంగరకా. వి. **1.** చిన్నచొక్కా ; **2.** మోకాళ్ల వరకు వేళ్లాడేచొక్కా. **అంగరకా** రూ. అంగరక, అంగరేకు. వి. అంగాన్ని రక్షించేది, అంగీ. సం. అంగరక్ష ; ప్రా. అంగరక్ఖ ; ఒ. అంగరకక ; హిం. మరా. అంగరఖా ; గు. అంగరఖుఀ ; క. అంగరక. కవచం ; అంగరకె. కామెత్తు, కవచం ; అంగరేఖు. పెద్దచొక్కా ; తు. అంగరకె. శరీర రక్షణం ; అంగరేకె. చొక్కా ; త. అంగరక్కా. పురుషులు ధరించే పొడుగాటి చొక్కా, లోని ఉడుపు ; మ. అంగరక. కవచం, చొక్కా. <మరా. అంగరఖా <సం. **అంగరక్షలుపెట్టు** స.క్రి. **1.** రక్షణకోసం దేవతల్ని ప్రార్థించు, దీవించు ; **2.** జాగ్రత వహించు. **అంగరంగభోగములు** వి. బ.వ. అంగానికీ (దేవతా విగ్రహానికీ), రంగానికీ (దేవళానికీ) చేసే భోగాలు, అలంకారాలు, నివేదనలు మొ. ; క. అంగరంగభోగ. దేవతా విగ్రహాలకూ దేవళాలకూ చేసే భోగాలు, వైష్ణవ సంప్రదాయం ; త. అంకరంకవైపోకం. అన్నిరకాల సుఖాలు. <సం. అంగ (శరీరం) + రంగ (ప్రదేశం) + భోగ (సుఖం). **అంగరంగవైభవములు** వి. బ.వ. **1.** దేవతారాధన ఉత్సవాలు. ద. హిం. శా. 4.702 ; **2.** సుఖసంపదల అనుభవాలు. క. అంగరంగవైభవ ; త. అంకరంకవైపవమ్. <సం. అంగ (శరీరం) + రంగ (ప్రదేశం) + వైభవ (ఉత్సవం). **అంగరేకు** రూ.చూ. అంగరకా. షోడ. 3 ఆ. ; 3. **అంగవస్త్రము** రూ. అంగాస్త్రము, అంగోస్త్రము. వి. **1.** ఉత్తరీయం, పైబట్ట ; **2.** తుడుచుకునే గుడ్డ ; **3.** కొల్లాయగుడ్డ. సం. అంగ (శరీరం) + వస్త్రం (బట్ట) ; కా. అంగోస ; హిం. సిం. అంగోచా ; ఉ. అంగౌఛా ; మరా. అంగవస్త్రం, అంగుఀచే, అంగుఛో, అగోచ్యా. క. అంగవస్త్ర. పైబట్ట, తుండుగుడ్డ ; తు. అంగవస్త్రి, అంగోస్త్ర ; త. అంకవస్తిరమ్. <సం. అంగ + వస్త్రమ్.

**అంగకాల** చూ. అంగ[1].

**అంగకోల** చూ. అంగ[1].

**అంగజాల** చూ. అంగ[2].

**అంగజాలలు** చూ. అంగ[2].

**అంగజాలవా(డు** చూ. అంగ[2].

**అంగజీతము** చూ. అంగ[3].

**అంగటిముద్రమంకము** చూ. అంగడి.

**అంగటివెల** చూ. అంగడి.

**అంగట్లోపెట్టు** చూ. అంగడి.

**అంగడము** వి. నేర్పులేనివాడు; చూ. అంగడాలు. అర్థ విపరి.

**అంగడాలు** వి. బ.వ. జంతువులు.

ఒ. *అంగుళిగ*. వేళ్లని నడిచేవి.

?<ఒ. అంగుళిగ.

**అంగడి** వి. **1.** అంగడి వీథి, వీథి. భార. ఆది. 6.148; **2.** ఆపణం, దుకాణం. భార.ఆది. 8.73; **3.** కొలువు కూటం, రచ్చ, సభ. భార. ఉద్యో. 4.199; **4.** న్యాయ సభ. విజ్ఞా. 3.42; **5.** గ్రామసావిడి, రచ్చసావిడి. పాండు. 3.46; **6.** అగసాలె మొ. వారు పనిచేసే చోటు. చంద్రా. 4.17.

క. *అంగడి*. దుకాణం, కొట్టు; పో.చూ. *కడె*. అంగడి, బజారు; తు. *అంగడి*. దుకాణం; పో.చూ. *కడె*. దుకాణం; త. *అంకాటి*, *అణ్ణాటి*. బజారు, బజారు వీథి; పో.చూ. *కడై*. దుకాణం; మ. *అణ్ణాటి*. అంగడి, అంగడి వీథి; కటు. అంగడి, అంగడివీథి; కో. *అంగడి*, *అంగార్*; తొ. *ఒగొడ్య*; కొండ. *అంగడ్య*; పర్జి. *అంగాడ్*. పెరడు, ఆవరణ; కొలా. *అంగడి*. బజారు; నా. *అంగాడి*.

<తె. అమ్ము+కడ్ (అ) ఇ. అమ్మేచోటు.
మూ.ద్రా. *అమ్+కాటి.

**అంగటిముద్రమంకము** వి. అంగడి వీథిలో అమ్మకానికి తెచ్చే సరకులపై ముద్రవేయటానికి విధించే సుంకం. **అంగటివెల** వి. బజారు ధర. **అంగట్లోపెట్టు** స.క్రి. బయటపెట్టు, వెల్లడిచేయు. వ్యు. వీథిలోపెట్టు. **అంగడికా(డు** వి. దుకాణదారు, సరుకులమ్మేవాడు. క. *అంగడి కార*, *అంగడి గార*; పో. చూ. త, *కడై-క్-క్కారన్*; మ. *అణ్ణాటి-క్-కారన్*. **అంగడికెక్కు** అ.క్రి. బయటపడు, రచ్చకెక్కు. వ్యు. వీథిలోపడు. కవిక. 3.82. **అంగడిగంప** వి. తొత్తు. జారిణ స్త్రీ. అందరికీ అందుబాటులో ఉండే అంగడి గంప వంటిది. పల్నా. **అంగడివాయకుడు** వి. దుకాణాలపై అధికారి. **అంగడిపెట్టు** రూ.చూ. అంగడి వెట్టు. అ.క్రి. దుకాణం పెట్టు. **అంగడిమూమకొను** అ.క్రి. దుకాణం మూయు. **అంగడి(బెట్టు** రూ.చూ. అంగడివెట్టు. స.క్రి. వీథిలో పెట్టు, బయట పెట్టు. ప్రదీప చ. 4. **అంగడివాడ** వి. విపణివీథి. **అంగడివా(డు** వి. దుకాణదారు. **అంగడివీథి** (వీథి<సం. వీథి). వి. విపణి వీథి. క్రీడా. క. *అంగడి బీది*. **అంగడివెట్టు** (-పెట్టు: రూ. అంగడి పెట్టు, అంగడి(బెట్టు; పో.చూ. అంగట్లో పెట్టు) స.క్రి. **1.** బయటపెట్టు, వెల్లడిచేయు. శుప.చ. 3.43; **2.** దుకాణం పెట్టు. క. *అంగడి హచ్చు*. దుకాణంపెట్టు. **అంగడివేయు** స.క్రి. **1.** దుకాణం పెట్టు; **2.** పశుపక్ష్యాదులు సాగించు. **అంగడిసిద్దాయము** వి. అంగడిపై వస్తువుల రూపంలో నిక్కికంగా వచ్చే ఆదాయం. అంగడి. సిద్ధ+ఆయము. **అంగడిసుంకము** బజార్లోగానీ సంతలోగానీ దుకాణం పెట్టుకోటానికి విధించే పన్ను.

**అంగడికా(డు** చూ. అంగడి.

**అంగడికెక్కు** చూ. అంగడి.

**అంగడిగంప** చూ. అంగడి.

**అంగడివాయకుడు** చూ. అంగడి.

**అంగడిపెట్టు** చూ. అంగడి.

**అంగడిమూమకొను** చూ. అంగడి.

**అంగడి(బెట్టు** చూ. అంగడి.

**అంగడివాడ** చూ. అంగడి.

**అంగడివా(డు** చూ. అంగడి.

**అంగడివీథి** చూ. అంగడి.

**అంగడివెట్టు** చూ. అంగడి.

**అంగడివేయు** చూ. అంగడి.

**అంగడిసిద్దాయము** చూ. అంగడి.

**అంగడిసుంకము** చూ. అంగడి.

**అంగద** వి. **1.** ఆబ, తిండి, ఆశ, ఆకలి. భాగ.అర. 2.121, శృం. నై. 8.173; **2.** కోపం. భార. ఉద్యో. 1.128; **3.** కుతూహలం, ఉత్సాహం. కు.సం. 12.116, శృం.నై. 3.25; **4.** మనోవ్యథ, దుఃఖం. రామాభ్యు. 5.224; **5.** ఉపద్రవం, విపత్తు. నీలా. 2.58.

తు. *అంగాదనె*. దప్పికగొన్న; *ఆంగు*. లోభం, కుతూహలం; *అంగుని*. పై; త. *అంకా*. నోరు తెరచు; *అంకాప్పు*. నోరు తెరవటం, దప్పిగొనటం; *అంకతమ్*. ఏనుగు తిండి; *అంకలాయ్*. దుఃఖించు, బాధపడు, విచారించు, అసూయచెందు, ఆశపడు; కొండ. *అంగల్*. పైకి చూచు; పో.చూ. కుఇ. *అంగలి ఆవ*. నోరు పెద్దదిగా తెరచు; *అంగలంగ*. నోరు తెరచి; పర్జి. *అనల్ప్-*, *అనల్త్-*. నోరు పెద్దదిగా తెరచు: బ్రాకొల్. ఆకలి, కరువు; పో.చూ. కొలా. *అంగసి*. ఆవులింత; నా. *అంగాసి*. పై; కురు. *అంగ్లనా*. నోరు పెద్దదిగా తెరచు; మాల్తో. *అంగ్లొ*. నోరు తెరచిన.

పో.చూ. ఆమ్+కలి>ఆ(కలి; ఆమ్+కొను>ఆ(కొను. ఆకలిగొను; ఆమ్ (ఆమ్ము). ఆహారం (వా.) బహుశః ఆకలి గొనినప్పుడు, మింగేటప్పుడు నోరు తెరవటం కారణంగా ఈ అర్థం వచ్చి ఉండవచ్చు; ఆమ్+కా. అంగా. నోరు తెరచు.

<*ఆమ్+కద. మూ.ద్రా. *ఆమ్. ఆకలి.

**అంగదగొను** (-కొను). అ.క్రి. ఆ(కలిగొను. కు. సం. 12.116.

**అంగదగొను** చూ. అంగద.

**అంగదట్టము** చూ. అంగ[2].

**అంగవ** వి. దొడ్డి, ఇంటి ఆవరణం.

సం. *అంగణ-*; హిం. *అంగన్.*

<సం. అంగణ-.

**అంగవాలబిందె** వి. ఒక రకం పాత్ర; అభిషేకానికి జలాహరణార్థం ఉపయోగించే బిందె. పల్నా.

సం. *అంకన-.* గుర్తింపు.

అంగనాల బిందె. బహుశః చెక్కుడు పనిగల బిందె; అంగనాలు. గుర్తులు, చెక్కడాలు, నగిషీలు;

*అంగనములు <సం. అంకన-.

**అంగపొక్క** వి. దిగటానికి వీలుగా బావి గోడలో పెట్టిన గూడు.

<అంగ[1]+బొక్క. అంగ పెట్టటానికి అనువైన కన్నం.

**అంగబిల్ల** చూ. అంగ[2].

**అంగబిళ్ల** చూ. అంగ[2].

**అంగమచ్చము** చూ. అంగ[2].

**అంగమణి** వి. వివాహ సమయంలో పిడిదికి పంపే పదార్థాలు మొ.

క. *అంగమణి.* వధువుకు పెండ్లికానుక; తొలిచూలు కానుక; త. *అంకమణి.* అరణం; వధువు అత్తింటికి తీసుకుపోయే కట్నం.

<క. అంగమణి.

**అంగము[1]** రూ. అంగు[2]. హంగు. వి. రీతి, విధం, విజయ. 1.40.

క.తు. *అంగ.* రీతి, విధం.

<అమ్+కు. మూ.ద్రా. *అమ్. అందం.

**అంగము[2]** పో.చూ. అంగు[1]. వి. అందం, ఆకర్షణ.

త. *అంకమ్.* సారూప్యం, సౌందర్యం.

**అంగము[3]** చూ. అంగ[2]. వి. అడుగురి; వ్య. శరీరావయవం.

**అంగము[4]** రూ.చూ. హంగాము; చూ. అంగాము. మామిడి మొ. చెట్ల తొలికారు పంట.

**అంగమొల** చూ. అంగ[2].

**అంగమొలవాఁడు** చూ. అంగ[2].

**అంగమొలవేల్పు** చూ. అంగ[2].

**అంగందప్పు** అ.క్రి. సిగ్గుమాలియుండు.

<అంగము[3]+తప్పు. వ్య. అందం చందం లేకుండా ఉండు.

**అంగర** రూ. చూ. అంగార. వి. బూడిద, నిప్పుతో ఉన్న బొగ్గు.

**అంగరక** చూ. అంగ[2].

**అంగరకా** చూ. అంగ[2].

**అంగరక్షలుపెట్టు** చూ. అంగ[2].

**అంగరంగభోగములు** చూ. అంగ[2].

**అంగరంగవైభవములు** చూ. అంగ[2].

**అంగరపూవియ** వి. నిప్పులమీద కాల్చి చేసే రొట్టె. కాశీ. 7.185.

సం. *పూప, పూపికా.* గోదుమరొట్టె; ప్రా. *పూఅ, పూఅల, పూఅలిగా, పూవల, పూవలియా, పూవిఅ, పూవిగా, పూవలిగా*; పా. *పూవ.*

<సం. అంగార- (నిప్పు) + పూవియ (<సం. పూపికా) : <ప్రా. పూఅ, పూవిఅ. ఎండిన పిండితోచేసిన రొట్టె.

**అంగరపోలియ** రూ. అంగరులై, అంగరొల్లె, అంగారపోడి. వి. నిప్పులమీద కాల్చి చేసే రొట్టె. కాశీ. 7.186.

సం. *అంగార* (నిప్పు)+*పోలికా* (రొట్టె); *పూలికా, పోలి, పూపలి.* రొట్టె; ప్రా. *అంగార+పోలిఅ*;

పో. చూ. క. *అంగార పోళిగె, అంగర హుళిగె.* (< సం. అంగార స్ఫోటక-) నిప్పులమీద కాల్చే రొట్టె.

<ప్రా. అంగార పోలిఅ <సం. అంగార పోలికా.

**అంగరవారము** వి. మంగళవారం.

సం. *అంగారక వార-.* కుజునియొక్క వారం; ప్రా. *అంగారగ వార, అంగారయ వార*; పా. *అంగార వార*; హా. *అంగల్ వార్*; ఒ. *అంగారక*;

క. *అంగారక వార.*

<సం. అంగారక వార-.

**అంగరిల్లు** వి. తలుపులూ తాళాలూ లేని ఇల్లు.

అంగర్ ? <త. అంకురి-(కన్పించు)+ఇల్లు.

**అంగరులై** రూ.చూ. అంగర పోలియ.

**అంగరేక** వి. దేవతా విగ్రహాలకు మైపూతలూ వస్త్రాలంకారాదులూ చేసే దేవకర్మ. ద.హిం.శా. 10.422. చూ. అంగరకా.

**అంగరేకు** చూ. అంగ[2].

**అంగరొల్లె** రూ.చూ. అంగర పోలియ. చపాతీ, ఒబ్బట్టు మొ. ప్రబా. 5.112, హంస. 1.105.

**అంగలపంగలుగా** క్రి. విశే. చాలా తొందరగా. వ్య. చాచి వేసిన అడుగులతో. అంగ(లు) + పంగ(లు): చూ. అంగ[1], పంగ.

**అంగలము** వి. ముంగిలి.

<సం. అంగణమ్.

**అంగలారుచు** రూ.చూ. అంగలార్చు. అ.క్రి. **1.** వగచు, దుఃఖించు. కాశీ. 7.162; **2.** భయాదులచే అరచు. ఆము. 3.19.

**అంగలారుపు** వి. **1.** దుఃఖం; **2.** ఏడుపు.

**అంగలారుపు** చూ. అంగలారుచు; రూ.చూ. అంగలార్పు.

**అంగలార్చు** అంగల్+ఆర్చు: రూ. అంగలారుచు. అ.క్రి. **1.** భయాదులచేత బిగ్గరగా అరచు, ఏడ్చు. కాశీ. 7.162, హర. 3.10. ఆము. 3.19, సారంగ. 2.60, హంస. 4.229.

పో.చూ.క. *అంగల్.* దుఃఖంతో ఏడవటం; *అంగలాచు, అంగలార్చు.* దుఃఖించు, ఏడ్చు; *అంగలాపు.* దుఃఖం, ఏడుపు; పో.చూ.తు. *అంగలప్పు, అంగలాప.* దురాశ, పేరాశ; పో.చూ.త. *అంకలాయ్.* ఏడ్చు, దుఃఖించు, అసూయ చెందు, ఆత్మాశపడు; *అంకలాయ్ప్పు.* అశాంతి, మనోవ్యథ; మ. *అంకలాయ్కక.* ఏడ్చు, దుఃఖించు; కొండ. *అంగ్లప్మ్.* కోరిక, ఇష్టం; కురు. *అంగ్ల్నా, అంగ్లనా.* పెద్దగా ఏడ్చు.

<అంగల్ (అమ్+కల్) ; పో.చూ. అంగర.

**అంగలార్చు** రూ. అంగలారుపు. వి. 1. బిగ్గరగా ఏడవటం. రంగా. చ. 3.236 ; 2. మనోవ్యథ. ఆం.భా. 1.181 ; 3. ఆపద. ఆం. సం. మాన. 59 ; 4. దుఃఖం ; క. అంగలాపు. త. అంకలాయిప్పు.

**అంగలార్పు** చూ. అంగలార్చు.

**అంగలి** రూ.చూ. అంగిలి. వి. లోకుత్తుక.

**అంగళ(ం)** రూ.చూ. అంకణము[1]. వి. నలుచదరపు చోటు. మండువా ఇంట్లో మధ్య నీరుపడే ఖాళీ స్థలం.

**అంగవస్త్రము** చూ. అంగ[2].

**అంగవి** వి. సంతృప్తి. కు. సం. 9.55.

బహుళః <అంగవించు.

**అంగవించు** అ. క్రి. 1. దగ్గరకు వచ్చు, చేరువ అగు. పద్మ. 3.128 ; 2. ఉంకించు, యత్నించు. శృం. నై. 7.46 ; 3. మించు, జయించు. శృం. నై. 5.145 ; 4. తెగించు, సాహసించు. పాండు. 3.61.

క. అంగవిసు, అంగయిసు. కలియు, ఏకమగు, మూగు, పట్టుకొను, శ్రద్ధ వహించు; పో.చూ.త. అణుకు. సమీపించు ; పో.చూ.మ. అనుకుక, అణయుక. పై.

<అంగ[1] (వ్)+ఇంచు. వ్యు. అడుగువేయు.

**అంగవేయు** చూ. అంగ[1].

**అంగామా** రూ.చూ. హంగామా. వి. గలభా.

**అంగామీ** వి. వర్షాలు ఎక్కువగా కురిసిన సంవత్సరం.

గు. హంగామ. ఋతు సంబంధమైనది ; మరా. హంగామి ; ఉ. హంగామ్ ; పార. అంగామ్.

క. హంగామి. ఋతు సంబంధి; హంగాము. ఋతువు; త. అంగామి. తాత్కాలికం ; మ. అంగామ్. ఋతువు. తాత్కాలిక నియామకం.

<ఉ. హంగామ్ <పార.

**అంగాము** రూ.చూ. హంగాము. వి. నూర్పిళ్లకాలం, కోతల కాలం, తొలి పంటకారు. చూ. అంగామీ. 'అంగాము' అంటే పైరు పంటకు వచ్చే కాలం అని అర్థం ; ఇక్కడ తొలి పైరు పంట అనే అర్థంలో రూఢి.

**అంగాయి** వి. ఆభరణాలు.

సం. అంగజ-. శరీరం నుంచి పుట్టినది, అలంకారం ; అంగజాత-. అలంకారం ; ప్రా. అంగయ. అలంకారం, దండకడియం ; అమా. అంగయ. దేవతా విగ్రహాలంకారం, దండకడియం ; మరా. అంగాఇ. జోలపాట.

<ప్రా. అంగయ-.

**అంగార**[1] రూ. అంగర. వి. బూడిద, నిప్పుతో ఉన్న బొగ్గు.

సం. అంగారక. బొగ్గు, మండుతున్న బొగ్గు : ప్రా.సా. అంగార ; ఒ. హిం. అంగారా ; గు. అంగార.

క. అంగర, అంగార ; త. అంకారకమ్.

<సం. అంగార-.

**అంగార**[2] వి. సిమెంటు పూత.

ఉ. అంగారహ్. రేఖాచిత్రం: పార. అంగార్. పూత, వర్ణచిత్రం.

<ఉ. అంగారహ్ <పార.

**అంగారకుడు** వి. మంగలి (వా.) ('మంగలి' అనటానికి బదులు మర్యాదగా 'మంగళ' అనీ తత్పర్యాయంగా 'అంగారక' అనీ ప్రయుక్తం).

**అంగారదొల్లెలు** అంగార (సం.) + ద + ఒల్లె + లు : చూ. అంగరొల్లె. వి. బ.వ. వేయించిన గోడుమ రొట్టెలు.

**అంగారపోలి** రూ.చూ. అంగర పోలియ. వి. నిప్పులమీద కాల్చిన రొట్టె.

**అంగారు** చూ. అంగార[1]. వి. దాసు. బొట్టు పెట్టుకునే నల్లని పదార్థం.

ఒ. అంగారవా. బొగ్గునుంచి తయారైన పదార్థం : త. అంకారం. మాధ్వబ్రాహ్మణులు పెట్టుకునే బొట్టు.

**అంగాత్రము** రూ.చూ. అంగవస్త్రము. వి. ఉత్తరీయం.

**అంగి** రూ. అంగియ, అంగీ. వి. 1. మోగాళ్ల దాకా వేళ్లాడే చొక్కా. సమీర. 1.74 ; 2. పైన ధరించే పరిధానం. ఆం.భా. 2.156.

సం. అంగికా. రవిక, చొక్కా ; పా. అంగిఅ. కొన్ని రంగాలు కలది. ఉ. అంగియ. రవిక.

క. తు. కొలా. అంగి. చొక్కా, పొడుగాటి చొక్కా : త. అంకి. పై.

<ప్రా. అంగిఅ <సం. అంగికా.

**-అంగి**[1] రూ.చూ. -అంకి[2]. ప్రత్య. పిట్టల పేర్ల చివర వచ్చే ప్రత్యయం. ఉల్లంగి. హంస. 3.18.

**-అంగి**[2] రూ.చూ. -అంకి[3]. ప్రత్య. గ్రామ నామాల్లో చివర వచ్చే ప్రత్యయం. కోరంగి, పొట్టంగి, దాదంగి, మేరంగి.

**అంగిటిగుంట** చూ. అంగిలి.

**అంగిటిముల్లు** చూ. అంగిలి.

**అంగియ** రూ.చూ. అంగి.

**అంగిలి** రూ. అంగలి, అంగుడి, అంగుడు. వి. 1. అంతర్గళం, లోకుత్తుక, కొండనాలుక ఉండే చోటు. తేంక పంచం. 2.109, దశా. 1.196 ; 2. తాలువు.

క. అంగళ, అంగళు, అంగుళ, అంగుళి, అంగుళె. తాలువు ; పో.చూ. తు. అంగా. నోరు తెరచు ; అంగావుని. పై ; త. అణ్ణామ్. తాలువు, లోకుత్తుక, నోటి పైభాగం, కొండనాలుక ; అణ్ణాక్కు. కొండనాలుక ; కుళి. గుంట ; పో.చూ. అంకా. నోరుతెరచు ; పో.చూ. మ. అణ్ణామ్. తాలువు.

తె. అన్-ఉ (పలుకు) + క.త.మ. కుళి (గుంట).

మూ.ద్రా. *అణ్ (పై) + కుటి (గుంట)

**అంగిటిగుంట** వి. గళగర్తం, వావిక, కుత్తుక. రామా. 3.155. **అంగిటిముల్లు** వి. 1. ఉపజిహ్వికారోగం, గళాంకురం, కొండనాలుకు వాటూకు రోగం. బసవ. 3.325 ; 2. ఉపజిహ్విక, కొండనాలుక: బసవ. 3.340 , 3. గాలి మొ.

పోకరుండా బిడ్డలమొలకు కట్టే త్రిశూలాకారపు భూషా విశేషం. క. అంగులియముళ్. శ్వాసనూ ఆహార క్రియనూ అడ్డగించే ఉపజిహ్వికారోగం. **అంగిలిగుంట** వి. గళగర్తం, వాపిక.

**అంగిలిగుంట** చూ. అంగిలి.

**అంగీ** రూ.చూ. అంగి. వి. దుబాసీలు. మదరాసీలు ధరించే పొడుగాటి చొక్కా, నిలువుటంగీ. గువ్వల. శ. 10. చెన్న. వి. 12 వ.

**అంగు**$^{1}$ వి. 1. అందం. యయా. 3.52 ; 2. ఒప్పిదం ; విశ. ఒప్పిదమైన. అందమైన, ఇంపైన.

క. అను, అనవ్ర, అనువ్ర. అర్హత, ఔచిత్యం, నాజూకు, అందం ; అణి. అందం, అర్హత, నాజూకు, సంతుష్టి : అంద. పై : పో.చూ.తు. అంద. అందం ; త. అంకక్కారణ్. సొగుగాడు ; అంకణ్.సుందర ప్రవేశం ; అంకమ్. శరీరసౌందర్యం ; ఆమ్. అందం ; అణి. అందం ; ను. అమ్. అందం ; అణి. అందంగా ఉండు ; పో.చూ. అణి. అలంకారం ; అణియుక. ధరించు, అలంకరించుకొను.

<అమ్+కు. మూ.ద్రా. *అన్ (అణ్). అందంగా ఉండు.

**అంగుగ** క్రి. విశ. ఒప్పిదంగా, చక్కగా.

**అంగు**$^{2}$ రూ.చూ. అంగము$^{1}$. వి. రీతి, విధం. ఉంద్రా. 6.93, రసిక. 5.76.

**అంగు**$^{3}$ రూ. హంగు. వి. 1. అంగబలం. ప్రధానమైనదానికి సహకారంగా ఉండే పరికరం ; 2. గృహోపకరణం, ప్ర మొ. ; 3. సదుపాయం, సౌకర్యం.

<ఉ. హంగ్. బలం, సైన్యం.

**అంగుదారు** రూ. హంగుదారు. వి. 1. భోగం మేళంలో తాళం వేసేవాడు ; 2. సహాయకుడు.

**అంగు**$^{4}$ చూ. అంగ$^{2}$. వి. శరీరావయవం.

సం. అంగ-. శరీరం, అవయవం ; ప్రా. అంగ. పై. <అంగ$^{2}$.

**అంగుగ** చూ. అంగు$^{1}$.

**అంగుటము** రూ. ఉంగటము, ఉంగుటము. వి. 1. బొటనవేలు. దార. అర. 2.104, శల్య. 2.161 ; 2. వేలు. ఆం.భా. 2.139 ; 3. అంగుళం, బొటనవేలి ప్రమాణం.

సం. అంగుష్ఠ-. బొటనవేలు ; ప్రా. అంగుట్ఠ-, అంగుట్ఠో ; అమా.పా. అంగుట్ఠ ; నే. అంగుఠ ; అ. ఆంగఠ ; బెం. ఆనుఠ ; హిం. అంగూఠ ; పం. అంగూఠ ; సిం. అంగూఠొ ; గు. అంగుఠొ ; మరా. అంగఠ ; సింహ. అంగుట ; ఉ. అంగూఠా ; పార. అంగుస్త ;

క. అంగుట, ఉంగుట, ఉంగుట్ఠ (<సం. అంగుష్ఠ-) ; తు. అంగుష్ఠ, ఉంగుష్ఠ, అంగుట్ఠ, ఉంగుట్ఠ ; త. అంకుట్టమ్, అంకులమ్. వేలు ; అంకులి. వేలు, కాలివేలు.

<ప్రా. అంగుట్ఠ-<సం. అంగుష్ఠ-.

**అంగుడి** రూ.చూ. అంగిలి. వి. లోకుత్తుక, కాలువ.

**అంగుడు** రూ.చూ. అంగిలి. వి. 1. లోకుత్తుక, కాలువ ; 2. అర్శకింద ఉండే దొప్పవంటి భాగం (అంగిలివలె ఉండటంవల్ల ఈ పేరు వచ్చిఉండవచ్చు).

**అంగుడుతుడుపి** రూ.చూ. అంగుడు దుడిపి. వి. కొండె గాడు, కంటాలమారి. **అంగుడుదుడిపి** రూ. అంగుడు దుడుపి, అంగుడు దుడుపు. వి. చాడీకోరు, కంటాలమారి. త. అంకటుతొటుప్పి. కొండెకాడు ; పో.చూ. తొటుప్పి). చాడీకోరు ; తొటుప్పు. నింద ; తొటు. కల్పించు, అభాండాలువేయు. వ్య. అంగిట్లో అపవాదులు సృష్టించే వాడు. **అంగుడుదుడుపు** రూ.చూ. అంగుడుదుడిపి.

**అంగుడుతుడుపి** చూ. అంగుడు.

**అంగుడుదుడిపి** చూ. అంగుడు.

**అంగుడుదుడుపు** చూ. అంగుడు.

**అంగుడుముల్లు** పో.చూ. అంగబిళ్ల. వి. పిల్లల మొలకు కట్టే ఒక ఆభరణం ('అంగుడి', 'అంగుడు' మొ. పదాల సాదృశ్యంవల్ల 'అంగ', 'అంగుడు' గా మారి ఉండ వచ్చు).

అంగుడు+ముల్లు.

**అంగుదారు** చూ. అంగు$^{3}$.

**అంగులు** వి. డబ్బు. చూ. అంగడాలు. బహుశః పశువులనే డబ్బుగా వ్యవహరించే ఆచారాన్ని బట్టి అర్థ వివరి. ; వర్ణలోపం.

**అంగుళము** వి. అడుగు (బ్రిటిష్ దైర్ఘ్యమానం) లో పన్నెండో వంతు ; గజంలో 36వ వంతు.

సం. అంగుల-. 8 యవల ప్రమాణం ; ప్రా. పా. అంగుల ; కా. ఒంగుల్ ; నే. అమల్ ; ఒ. అంగుళ. హిం. అంగుల ; పం. ఉంగల్ ; ల. అంగుల్ ; సిం. అఙురు ; గు. అంగళ్ ; మరా. అంగూళ్ ; సింహ. అంగుల ; అర. అంగుల్. (తెలుగులోనూ, హిందీ మొ. కొన్ని ఉత్తరాది భాషల్లోనూ అడుగులో 12వ వంతు అనే అర్థంలో రూఢి).

**అంగుస్తాను** వి. కుడుపు, తొడుగు. కుట్టు పనివాడు వేలికి పెట్టుకొనే కుడుక ; అంగుళిత్రాణం.

హిం. అంగుస్తానా ; మరా. అంగుస్తన్, అంగుస్థాన్. అంగుష్ఠాణ ; ఉ. అంగుస్తానా ; పార. అంగుస్తిదాన్ ; త. అంకుస్తాన్.

<మరా. అంగుస్తన్. <సం. అంగుష్ఠ-.

**అంగూరు** వి. ద్రాక్ష.

నే. హిం. ఉ. అంగూర్ ; మరా. అంగూర ; క. అంగూర.

<ఉ. అంగూర్.

**అంగే** అవ్య. ఓసి, నీచ స్త్రీ సంబోధనం.

ప్రా. హంజే. సఖినిగాని, దాసినిగాని పిలవటానికి వాడే అవ్యయం ;

క. హంజె.

**అంగోచ** చూ. అంగోస్త్రము. వి. ఎరుపులో తెల్లగీరలు

పడేట్టు వేసిన తలపాగాగుడ్డ.

**అంగోష్ట్రపుపొట్ట** చూ. అంగోష్ట్రము.

**అంగోష్ట్రము** రూ.చూ. అంగవస్త్రము. వి. పై బట్ట.

**అంగోష్ట్రపుపొట్ట** వి. ఎంత తిన్నా పైకి లేవని పొట్ట. అంగవస్త్రము + పొట్ట (మాం.కో.). (అంగవస్త్రం పరిమాణంలో చాలా చిన్నది కాబట్టి మామూలుగానే పొట్టచుట్టూ చాలీచాలకుండా ఉంటుంది. ఎంత తిన్నా పైకి లేవకుండా అంగవస్త్రం కట్టుకోటానికి అనువుగా ఉండే పొట్ట అని అర్థం.)

**అంగ్రేజిపెంకు** వి. మంగుళూరి పెంకు.

అంగ్రేజి + పెంకు. (ఇంగ్లీషువారి మంచి ఈ రకం పెంకు వాడుకలోకి రావడంవల్ల ఈ పేరువచ్చింది.)

**-అఁక** ప్రత్య. ఁకు, ఁగు లు అంతమందుగల క్రియలపై వచ్చే కృత్ప్రత్యయం. మలంగు < మలంకు ; మలంకు-అ < మలంక ; అర్వాక్కాలిక విభజనంవల్ల-మల్-(అంక) అఁక ; కలంగు-అ. కలంక, కల్-అఁక ; మలఁక. మెలిక. భార. భీష్మ. 1.269. ఆదేశ పదాంశం:- అఁక < -అఁగు.

క. కలంకు, కలకు. కదలించు, కలచు ; కలకు, కలక. మురికి ; మలగు, మలంగు. వంగు ; మలకు. వంపు ; త. కలంకు. కలతచెందు ; కలక్కమ్. కలత ; మలంకు కలవరపడు ; మలక్కమ్. కలవరం ; (-అక్కమ్ < *అంకు)

-అఁక < *అఁకమ్.

**అచటు** రూ.చూ. అచ్చోటు. వి. అక్కడ, అచోటు. భార. ఉద్యో. 4.328, శాంతి. 3.92, అను. 4.438.

అ + చోటు > అచ్చోటు > అచ్చొటు > అచ్చటు > అచటు.

**అచలించు** రూ.చూ. అచ్చలించు. అ.క్రి. ఆగ్రహించు, పట్టుపట్టు. నవనాథ. 5.260.22.

**అచాటము** విశ. విరివియైనది. పృథులం.

సం. అత్యర్థ. అర్థాతకు మించినది, అత్యధికం, అపరిమితం ; అత్యంత. అమితం, అధికం, అనంతం ; మహా. అచ్చత్థ. అత్యధికం ; నే. అచాడు. తలబిరుసు ; అచాక్లి. అత్యధికం ; మరా. అచాట. బలమైన, తీవ్రమైన.

< మరా. అచాట.

**అచిత్తు** వి. రోగం వలని దౌర్బల్యం. చూ. అనురుసురు.

ప్రా. అచిత్త-. అచేతనం, జీవరహితం ;

క. అసుర్. విసుగు, వేసారు ; తు. అసరు. దగ, దప్పి ; త. అచర్. మూర్ఛ, మైకం ; అచర్త్తు (అచర్త్తి), మత్తుకలిగించు ; అచతి. మైకం ; మ. అశతి. మైకం, మరపు.

< త. అచర్త్తు ; పో.చూ. ప్రా. అచిత్త-.

**అచే** వి. ముఖ్యమైనపంట.

ఒ. అచా. మొదట భూమి దున్నేప్పుడు వేసే గుంద్రటి నాగటి చాలు.

< ఒ. అచా ; అర్థ విపరి.

**అచొటు** రూ.చూ. అచ్చోటు. వి. అక్కడ. ఆ ప్రదేశం భార. వ్య. 19.

**అచోటు** రూ.చూ. అచ్చోటు. వి. ఆ ప్రదేశం (శ.ర.).

**అచ్చ**[1] అవ్య. తిరస్కార సూచకం. అసహ్యతా సూచకం హిం. అచ్ఛా. సమ్మతిని సంతుష్టిని తెలిపే అవ్యయం పో.చూ. క. అచ్చగ, అచ్చియ. కలత. గాబరా ; త అచ్చో. జాలిని ఆశ్చర్యాన్ని తెలిపే అవ్యయం మ. అచ్చో. బాధను ఆశ్చర్యాన్ని తెలిపే అవ్యయం (ధ్వన్యనుకరణం కావచ్చు ; పో.చూ. హిం. అచ్ఛా).

**అచ్చ**[2] రూ. అచ్చము, అచ్చు[2]. విశ. 1. కేవలం. సాంకర్యము లేనిది, కలగలుపు లేనిది. భార. అను. 1.193 ; 2. స్వచ్ఛం, నిర్మలం. హరి.ఉ. 6.122 ; 3. దట్టం సాంద్రం. శృం.నై. 6.22 ; 4. తెల్లనిది. యయా. 1.120

సం. అచ్ఛ. స్వచ్ఛం, నిర్మలం ; పా. అమా. ప్రా. అచ్ఛ ; వా. ఓఛు. పల్చని ; నే. హి. పం.ఉ. అచ్ఛా మంచి ; సిం. ఖభో ; గు. అఛు ;

క.తు. అచ్చ. స్వచ్ఛం ; త. అచ్చమ్. సరిగా ; అచ్చా మంచిది ; అచ్చు. సరైన పోలిక, అసలు స్వరూపం.

< ప్రా. అచ్ఛ- < సం. అచ్ఛ-.

**అచ్చకాలు** వి. కల్తీలేని విత్తులు. **అచ్చగుండ్లపేరు** వి. 1. ముత్యాలహారం ; 2. స్ఫటికమాల. **అచ్చతెమఁగు** రూ.చూ. అచ్చతెలుఁగు. **అచ్చతెలుఁగు** రూ. అచ్చతెనుఁగు. వి. స్వచ్ఛమైన తెలుగు, సంస్కృతసమేతరమైన తెనుగు. పో.చూ.క. అచ్చ గన్నడ/-కన్నడ. స్వచ్ఛమైన కన్నడం. **అచ్చతెల్పు** విశ. స్వచ్ఛమైన తెలుపు. భార.అను. 1.193. **అచ్చబంగారము** వి. 1. మంచి బంగారం ; 2. మంచి అనే అర్థంలో బుజ్జగింపు మాట. **అచ్చబియ్యము** వి. 1. ఒకే రకం బియ్యం, కలగలుపు కాని బియ్యం ; 2. రాళ్లు వగైరా ఏరిన బియ్యం. క. అచ్చక్కి. అచ్చ + అక్కి. పొట్టువగైరా చెరిగిన బియ్యం. **అచ్చవెండి** వి. స్వచ్ఛమైన వెండి. **అచ్చవెన్నెల** వి. స్వచ్ఛమైన వెన్నెల. **అచ్చావు** అచ్చ[2] + ఆవు. వి. తెల్లఆవు.

**అచ్చకారము** రూ.చూ. అచ్చాకారము. వి. క్రయవిక్రయాల నిశ్చయార్థం ముందుగా ఇచ్చేధనం, సంచకరం.

**అచ్చకాలు** చూ. అచ్చ[2].

**అచ్చకాలుబుచ్చకాలు** రూ.చూ. అచ్చికలు బుచ్చికలు. వి. పరస్పరానుకూల్యం.

**అచ్చక్షరములు** చూ. అచ్చు[1].

**అచ్చగుండ్లపేరు** చూ. అచ్చ[2].

**అచ్చటు** రూ.చూ. అచ్చోటు. వి. అక్కడ, ఆప్రదేశం. భార. అను. 2.5, 4.67, ఆము. 41.11.

**అచ్చత** రూ.చూ. అక్షింతలు2. వి. బొట్టుగాఉపయోగించే బియ్యం.

**అచ్చతబొట్టు** అచ్చత + బొట్టు. వి. అక్షింతలతో పెట్టు కొనే బొట్టు.

సం. అక్షత + వృత్త ? ; నే. అచ్ఛత్ తిలక్ ;

క. అకతె బొట్టు; తు. అకద బొట్టు; త. అట్చుత్తై పొట్టు.

**అచ్చుతుకు** చూ. అచ్చు[1].

**అచ్చుతుకువల్ల** చూ. అచ్చు[1].

**అచ్చతెనుఁగు** చూ. అచ్చు[2].

**అచ్చతెలుఁగు** చూ. అచ్చు[2].

**అచ్చతెల్గు** చూ. అచ్చు[2].

**అచ్చన[1]** రూ. అచ్చెన. వి. పూజ, పెద్దలపట్ల దేవతలపట్ల గల భక్తిప్రవృత్తి. బసవ. 3.71 వ.;

సం. అర్చనా. గౌరవం, పొగడ్త, భక్తి: ప్రా. అచ్చణం, అచ్చణా: మహా. అమా. అచ్చణా. పూజ: దే. ప్రా. అచ్చణం. సేవ, శుశ్రూష: పా. అచ్చన, అచ్చనా, అచ్చతి. పొగడు, గౌరవించు;

క. అచ్చన. పూజ, మర్యాద.

<ప్రా. అచ్చణా.

**అచ్చన[2]-** విశే. పాచికలకుగాని, పాచికలాటకుగాని సంబంధించినది.

సం. అక్ష-. పాచిక, పాసికలాట; మహా. అమా. అచ్ఛ-, పాచిక, కన్ను: పా. అచ్ఛ. పాచిక: అచ్ఛిబద్ధ. జూదపు పలక.

**అచ్చనగండ్లు** (-కండ్లు: -కల్లు+లు.) వి. బ.వ. 1. బాలికా క్రీడా విశేషం. భోజ. 5.76: పాంచా. 1.57; 2. పై ఆటలో ఆడే బొమ్మరాళ్లు. వసు. 4.59; కళా. 6.229. **అచ్చనగల్లు** (-కల్లు.) వి. అచ్చనగాయ: **అచ్చనగాయలాడు** (-కాయల్ -ఆడు.) -అ.క్రి. అచ్చనగాయలాటఆడు. **అచ్చనగాయలు** (-కాయలు.) వి. బ.వ. అచ్చనగండ్లు. రుక్మి. 1.86 (-కాయలు. కాయలవలె ఉండే రాళ్లు). **అచ్చనగుండ్లు** (-గుండు -లు.) వి. బ.వ. అచ్చన గండ్లు. రామా. 5.121. యయా. 3.151. **అచ్చనలాడు** అ.క్రి. అచ్చనగాయల్లాగా పైకీ కిందికీ మనస్సులో ఊగినలాడు. **అచ్చనలు** వి. బ.వ. 1. నృత్యం. పండి. 160 వ., బైబా. 1.55; 2. బాలికా క్రీడా విశేషం.

**అచ్చనగండ్లు** చూ. అచ్చన[2].

**అచ్చనగల్లు** చూ. అచ్చన[2].

**అచ్చనగాయలాడు** చూ. అచ్చన[2].

**అచ్చనగాయలు** చూ. అచ్చన[2].

**అచ్చనగుండ్లు** చూ. అచ్చన[2].

**అచ్చనవుచ్చు** స. క్రి. ఊడబెరుకు, పైకిలాగు. కు. సం. 2.76.

సం. అచ్ఛన్న-. ? ప్రా. అచ్ఛణ్ణ-. గుప్తం కానిది, ప్రకటితం.

<ప్రా. అచ్ఛణ్ణ-+పుచ్చు.

**అచ్చనలాడు** చూ. అచ్చన[2].

**అచ్చనలు** చూ. అచ్చన.[2].

**అచ్చబంగారము** చూ. అచ్చ[2].

**అచ్చబియ్యము** చూ. అచ్చ[2].

**అచ్ఛము** రూ.చూ. అచ్చ[2]. విశే. 1. స్వచ్ఛం, నిర్మలం. భార.అను. 1.193, శృం.నై. 6.22; 2. కేవలం, మిశ్రంకానిది, శుద్ధం. భార. ఆశ్వ. 2.203, భీమ. 2.19, 3. తెల్లనిది. యయా. 1.120; 4. దట్టం, సాంద్రం.

**అచ్ఛముగ** అవ్య. నిస్సంశయంగా, స్వేచ్ఛగా, ఇష్టానుసారంగా.

**అచ్ఛముగ** చూ. అచ్ఛము.

**అచ్చర** వి. అప్సరస. దేవ వేశ్య. మను. 2.38.

సం. అప్సరస్; ప్రా. అచ్ఛరా, అచ్ఛరసా, అచ్ఛర అ. అందగత్తె, ఇంద్రాణి; అమా. పా. అచ్ఛరా. దేవకన్య: హిం. అఛరా, అఛరీ;

క. అచ్చర, అచ్చరసి, అచ్చరి; త. అచ్చరమ.

<ప్రా. అచ్ఛరా.

**అచ్చరనది** వి. ఆకాశగంగ, బహుశః పాలపుంత. దశా. 2.17. **అచ్చరవాక** వి. అచ్చరనది.

**అచ్చరనది** చూ. అచ్చర.

**అచ్చరము** వి. అక్షరం, వర్ణం, వైజ. 2.95. వేణు. శ. 22.

సం. అక్షరమ్. వర్ణం, అచ్చు, ధ్వని, మాట: ప్రా. అచ్ఛర-; అప. అచ్ఛర ?; కా. అఛుర్; నే. అచ్ఛెరె, అచ్ఛెర్; హిం. ఉ. అచ్ఛర్;

క. తు. అచ్చర; త. అచ్చరమ్,

<ప్రా. అచ్ఛర-.

**అచ్చరవాక** చూ. అచ్చర.

**అచ్చరాలు** రూ.చూ. అక్షరాలు. వి. నోటిపూట.

**అచ్చరు** రూ.చూ. అచ్చరువు. వి. ఆశ్చర్యం. కు. సం. 11.197.

**అచ్చరువడు** (-పడు.) అ.క్రి. ఆశ్చర్యపడు. కు. సం. 10.486.

క. అచ్చరి బడు/-పడు.

**అచ్చరువడు** చూ. అచ్చరు.

**అచ్చరువు** రూ. అచ్చరు, అచ్చెరియము, *అచ్చెరు, అచ్చెరువు, అచ్చెర్వు. వి. ఆశ్చర్యం. కు. సం. 11.768.

సం. ఆశ్చర్య-; ప్రా. అచ్ఛర, అచ్ఛరి అ, అచ్ఛరీ అ, అచ్ఛర, అచ్ఛరి అ, అచ్ఛరిజ్జ. అచ్ఛరీ అ, అచ్ఛెర, అచ్ఛెరగ, అచ్ఛెరయ; జై మహా. అచ్ఛరియ, అచ్ఛెరియ; శౌర. అచ్ఛరి అ, అచ్ఛరీ అ; అమా. అచ్ఛర, అచ్ఛెరిగ; మా. అశ్చలి అ; పా. అచ్ఛరియ; అప. అచ్ఛెరయ. (< సం. ఆశ్చర్యక-); నే. అచర్జై, అస్త్రర్జై, అసర్జై. విశే. ఆశ్చర్యకరం, అద్భుతం; హిం. అచ్ రజ్; గు. అచరజ, అచరత; ఉ. అచర్జ్;

క. అచ్చరి, అచ్చర్య, అచ్చరియ; తు. అచిర; త. అచ్చరియమ్; మ. అచ్చరియమ్, అచ్ఛరియం; పర్జి. అచ్ఛిరిత్; ఒరయాన్. అజ్ గుత్.

<ప్రా. అచ్ఛర (+-వు).

**అచ్ఛలము** వి. 1. చలం, పట్టుదల. భార.సభా. 2.170; 2. ఉత్సాహం, పూనిక. బా.రా. యు. 250; 3. కోపం. జై.భా. 5.42. అ+చలము. అ పట్టుదల; క్రమంగా

పట్టుదల అని రూఢి.

? <ప్రా. అచ్చలమ్. నిర్దోషత, అనపరాధత <సం. అచ్చలమ్.

**అచ్చలించు** రూ. అచలించు; అచ్చల (ము)+ఇంచు. అ.క్రి. ఆగ్రహించు, పట్టుపట్టు.

**అచ్చవెండి** చూ. అచ్చ[2].

**అచ్చవెన్నెల** చూ. అచ్చ[2].

**అచ్చాకారము** రూ. అచ్చకారము, అచ్చారము. వి. క్రయ విక్రయాల నిశ్చయార్థం ముందుగా ఇచ్చే ధనం, సంచకరువు.

సం. సత్యంకార. వాగ్దానం, ధ్రువీకరణ, సంచకరం; మహా. సచ్చంకార; పా. సచ్చకార; మరా. సచకార, సావోకర్;

త. అచ్చకారమ్, అచ్చారమ్; మ. అచ్చారం.

<త. అచ్చకారమ్.

**అచ్చాడి** రూ.చూ. అచ్చాళి. వి. 1. స్వచ్ఛమైనవాడు, స్వచ్ఛమైనది; 2. శ్రేష్ఠుడు, శ్రేష్ఠమైనది.

**అచ్చాడీ** రూ.చూ. అచ్చాళి. చూ. అచ్చాడి.

**అచ్చాటి** రూ.చూ. అచ్చాళి.

**అచ్చాటీ** రూ.చూ. అచ్చాళి.

**అచ్చారము** రూ.చూ. అచ్చాకారము.

**అచ్చాళి** రూ. అచ్చాడి, అచ్చాడీ, అచ్చాటి, అచ్చాటీ, అచ్చాళు, అచ్చోడి. వి. 1. జంజాటం లేనివాడు, సంసార తాపత్రయం లేనివాడు. పతివ్రతా. 35; 2. బ్రహ్మచారి; 3. బుద్ధిహీనుడు.

క. అచ్చాళ్, అచ్చాళు. దృఢమైనవాడు; అచ్చు+అళ్; అచ్చు. దార్ఢ్యం, బలం; అసడ. పిచుడు, బుద్ధిహీనుడు; త. అచ్చ (స్వచ్ఛం, నిర్లిప్తం)+ఆళి. అచ్చాటి; అచళాన్. పీచుడు, బుద్ధిహీనుడు; అచ్చానమ్. అజ్ఞానం.

<క. అచ్చాళ్.

**అచ్చాళిగామండు** అ.క్రి. ఏకాకిగా నుండు, ప్రశాంతంగా ఉండు.

**అచ్చాళిగామండు** చూ. అచ్చాళి.

**అచ్చాళు** అచ్చము+అళు. రూ.చూ. అచ్చాళి.

**అచ్చావు** చూ. అచ్చ[2].

**అచ్చి** వి. 1. అచ్చి మట్టం, దేశవిశేషం, సుమత్రా దీవిలో వాయవ్య భాగం; 2. పైగో గుర్రం.

సం. అచ్ఛా, అచ్ఛ-; ప్రా. అచ్ఛ. ఒకానొక ఆర్య దేశం, అచ్ఛదేశ సంబంధి; అచ్ఛా. వరుణదేశపు రాజధాని.

త. అచ్చి. సుమత్రా దీవిలో వాయవ్య భాగం.

<త. అచ్చి.

**అచ్చిమట్టము** రూ. అచ్చుమట్టము. వి. పొట్టి గుర్రం. త. అచ్చిమట్టమ్, సుమత్రా దేశపు పొట్టిగుర్రం. <త. అచ్చిమట్టమ్.

**అచ్చిక[1]** రూ.చూ. అచ్చికము[1]. వి. 1. కలవరం, క్షోభ. హరి. పూ. 8.74; 2. కొరత, వెలితి, లోపం. హంస. 1.89.

క. అచ్చిగ, అచ్చుగ. కలత, గాబరా; త. అచి. శిథిలమగు, నశించు; అచియల్. కలత; మ. అచియుక దూరమగు, నశించు; అచ్చల్. ఇచ్చు. దండుగ. ఆదారం, అవసరం.

**అచ్చిక[2]** రూ.చూ. అచ్చికము[2]; అచ్చు[2]+ఇక; చూ. అచ్చ[2]. వి. స్వచ్ఛత, పరిశుభ్రత.

**అచ్చికబుచ్చిక** రూ. అచ్చికబుచ్చికము. వి. 1. కలుపుగోలు మాట, బెల్లింపు మాట. ద్వి. హరిశ్చ. 2.636; 2. కలుపుగోలుతనం, మైత్రి, అభేదం. వెంక. పంచ. 2.68; విజయ. 3.30.

క. అచ్చికె మచ్చిక, అచ్చుక; ఇ. అచ్చిమెచ్చి. మచ్చిక నుండి మ కారం లోపించగా, అచ్చిక+మెచ్చు+ఇక (నమ్మి ఉండటం).

**అచ్చికబుచ్చికము** రూ.చూ. అచ్చిక బుచ్చిక. వి. సాంత్వనం.

**అచ్చికము[1]** రూ. అచ్చిక[1]. అచ్చు+ఇకము (పో.చూ. అచ్చు[6].) వి. కొరత, లోపం. కళా. 6.133.

క. అచ్చు. దండుగపడు, పండని పొలానికి శిస్తు కట్టు; త. అచి. వ్యయపడు, శిథిలమగు, నశించు.

**అచ్చికము[2]** రూ. అచ్చిక[2]. అచ్చ[2]+ఇకము. విశే. స్వచ్ఛం. ఆం.భా. 1.158.

క.తు. అచ్చ. స్వచ్ఛం; త. అచ్చమ్. సరిగా, ఖచ్చితంగా.

**అచ్చికలుబుచ్చికలు** రూ. అచ్చకాలు బుచ్చకాలు. వి. బ.వ. కలుపుగోలుతనం. చంద్రా. 3.45.

**అచ్చించు** చూ. అచ్చు[1].

**అచ్చింత** రూ.చూ. అక్షింతలు[2]. వి. ఒకరకం కలుపుమొక్క.

**అచ్చిమట్టము** చూ. అచ్చి.

**అచ్చియుండు** చూ. అచ్చు[6].

**అచ్చివచ్చు** చూ. అచ్చు[7].

**అచ్చివె(లు)** చూ. అచ్చు[1].

**అచ్చు[1]** వి. 1. గుర్తు, చిహ్నం. కు.సం. 4.376, బసవ. 6.599, పి. శకుం. 4.175; 2. ఆదర్శం, తొలి దృష్టాంతం. కు.సం. 7.867; 3. పోత పోయటానికి ఉపయోగించే చట్రం, కరువు. భార. విరా. 2.52; 4. ప్రతిబింబం, ప్రతిరూపం. భార.స్త్రీ. 1.51; 5. ముద్రవేసిన తూనికరాయి మొ. విజ్ఞా. 3.65; 6. పద్ధతి, విధం. భోజ. 7.15; 7. నాణేలు కాగితాలు మొ. వాటిపై అక్షరాలు బొమ్మలు ఒత్తే సాధనం, ముద్ర. భాగ. 10. ఉ. 330; 8. అచ్చున పోసి తీసిన వస్తువ, బెల్లపు అచ్చు; 9. దున్నిన పొలం చదునుచేసే కొయ్యమొద్దు; 10. సన్నటి ఇనప ఊచల తడిక; 11. బెల్లం; 12. నేత పనిముట్టు.

క. అచ్చు, హచ్చు. చేర్చు, అంటించు. మొ; అచ్చు. గట్టితనం, బలం, మూస, మూసపోసి తీసినది, ముద్ర, గుర్తు, ముద్రాక్షరం, నేతపనిముట్టు; తు. అచ్చి. గుర్తు, ముద్ర, మూస, ముద్రణ, నేత పనిముట్టు; త. అచ్చు. మూస, ముద్రాక్షరం, నేత పనిముట్టు, సరిపోలిక, గుర్తు, చిహ్నం, ముద్ర, ముద్రణ; అచ్. ప్రవేశించు, చొచ్చు, మునుగు; మ. అచ్చు. చిహ్నం, ముద్ర, మూస, నేత పనిముట్టు.

<ఆశ్ + చు. అచ్చు ; చూ. ఇడ్డు.
మూ.ద్రా.* అచ్.

**అచ్చక్షరములు** వి. బ.వ. అచ్చువేసిన అక్షరాలు. **అచ్చతుకు** వి. బద్దె పోగులకు పడుగు పోగులు కలిపి పడిపెట్టటం. **అచ్చతుకుపల్ల** వి. ఎత్తుపల ; అచ్చుకర్రలకు ఆధారంగా నిలబెట్టినపల్ల. **అచ్చించు** వి. అచ్చుకొట్టు, నకలు తీయు ; అచ్చు + ఇంచు ; త. అచ్చటి. పుస్తకం ముద్రించు. **అచ్చీవె(లు)** వి. పన్నె కట్టుబడిలో దంతెలమధ్య దువ్వెన పళ్ల మాదిరిగా వరసగా ఉండే ఈనెలు, లేక ఊచలు. **అచ్చుఒగ్గు** స.క్రి. అచ్చు తీసివేయు. **అచ్చుకట్టు** స.క్రి. 1. ఏర్పరచు, విభజించు. హరి. ఉ. 10.158, నృసిం. 1.8, పాండు. 1.11, జైమి. 1.85 ; 2. (నేతలో) కర్రలకు పడిదారాలు కట్టి అచ్చు తయారుచేయు. క. అచ్చుకట్టు, అచ్చుకట్టు ; తు. అచ్చికట్టు. సక్రమ పద్ధతి, ఏర్పాటు ; త. అచ్చుక్కట్టు. చేనికి గనిమలు వేయు, చిత్ర రచనకు ముందు చుట్టు గీత గీయు. **అచ్చుకట్టుపొలము** వి. పల్లపు సాగుకై మళ్ల కట్టిన చేను. **అచ్చుకట్టుబిళ్ల** వి. అచ్చుబిళ్ల ; అచ్చుకట్టేటప్పుడు పడిదారంచుట్టే కొయ్య. **అచ్చుకట్టువాఁడు** అచ్చు[1] + కట్టు + వాఁడు. వి. బట్టలనేత కుపయోగించే అచ్చులు కట్టేవాడు (ఈ జాతివాడు నేత్రవైద్యం కూడా చేస్తారు). త. అచ్చుకట్టి. అద్దకంకోసం బట్టల్ని మడతలు పెట్టి కట్టేవాడు ; అచ్చు కట్టు. నేత పనిముట్టు. **అచ్చుకట్టువేయు** స.క్రి. సాగుకు వీలుగా పొలాన్ని మళ్లమళ్లగా విభజించు. **అచ్చుకుప్ప** వి. ధనవంతుడు. వ్య. రాజముద్ర గల నాణేల పోగు. **అచ్చుకూటము** రూ. అచ్చుఁగూటము. వి. ముద్రాక్షరశాల. క. అచ్చుకూట ; త.మ. అచ్చుకూడ్డటమ్. **అచ్చుకూర్చు** స.క్రి. అచ్చు ఏర్పాటుచేయు. **అచ్చుకొట్టు** స.క్రి. ముద్రించు. క. అచ్చుహాకు. ముద్ర వేయు. ముద్రించు ; పో.చూ. అచ్చొత్తు : త. అచ్చు-అటి. ముద్రించు. **అచ్చుకోయు** స.క్రి. అచ్చులో బద్దెపోగులు గాని దెంతె పోగులుగాని వరసగా కోయు. **అచ్చుగిరక** వి. మగ్గంమీద అచ్చుగుడులు తగిలించే కొయ్య కప్పి. **అచ్చుఁగూటము (-కూటము)**. రూ. చూ. అచ్చు కూటము. వి. ముద్రాక్షర శాల. **అచ్చుచిత్తులు** వి. బ.వ. ముద్రణ కావలసిన వాటి చిత్తు ప్రతులు, ప్రూఫులు. **అచ్చుటెద్దు** అచ్చు + ట్ (ప్రకృతి భావ నివారక ప్రత్యయం) + ఎద్దు. వి. అచ్చుపోసి వదిలేసిన ఎద్దు, ఆబోతు. **అచ్చుపడు** అ.క్రి. 1. తగియుండు, ఉచితమగు, సార్థకమగు. భార. విరా. 5.165 ; 2. స్పష్టమగు, తెల్లమగు. బయల్పడు. భార. ద్రోణ. 5.315, హరి. ఉ. 3.159 ; 3. మూర్తీభవించు, రూపొందు. భార. అర. 7.175 ; 4. అబ్బు, అలవడు. విక్ర. 6.98, కళా. 4.13 ; 5. ఏర్పడు ; 6. ముద్రితమగు. **అచ్చుపఱచు** రూ. చూ. అచ్చుపఱుచు. స.క్రి. 1. ప్రాప్తింపజేయు, కలిగించు. భార. అను. 5.234 ; 2. ఏర్పరచు. పద్మ. 2.9 ; 3. నియమించు, నియోగించు. **అచ్చుపఱుచు** రూ. అచ్చుపఱచు ; 'అచ్చుపడు' ప్రేరణార్థకం. స.క్రి. 1. నియమించు, నియోగించు. భార.విరా. 4.28 ; 2. ప్రాప్తింపజేయు, కలిగించు ; 3. ఏర్పరచు. **అచ్చుపాటు** వి. స్పష్టత. భార. శల్య. 1.11. **అచ్చుపొడిచివది** విశే. 1. అచ్చుపోసినది ; 2. స్వేచ్ఛాచారం కలది. **అచ్చుపొడుచు** స.క్రి. ఎద్దుకు ఆబోతుగా ముద్రవేయు. **అచ్చుపొందించు** స.క్రి. అచ్చు పొందేట్టు చేయు. **అచ్చుబద్ద**[1] వి. అచ్చు పోగుల్లో ఒకవెంబడి పోగులు చెదరకుండా దూర్చిన వెదురుబద్ద. **అచ్చుబెల్లము** వి. అచ్చులుగా పోసిన బెల్లం. **అచ్చువేయు** స.క్రి. ముద్రించు. **అచ్చొత్తు** స.క్రి. 1. గుర్తు పెట్టు. బసవ. 5.31 ; 2. ముద్రించు. హరి.ఉ. 7.33. క. అచ్చొత్తు. ముద్రవేయు. గట్టిగా నొక్కు ; తు. అచ్చి ఒతుని. పై.

**అచ్చు**[2] రూ.చూ. అచ్చ[2]. వి. పరిశుద్ధి, నైర్మల్యం. విజ్ఞా. ప్రా. 114 : విశే. 1. పరిశుద్ధం, నిర్దోషం. విజ్ఞా. ప్రా. 91. శుక. 4.46 ; 2. స్పష్టం. హరి. పూ. 7.38 ; 3. యథార్థం, సరి అయినది. ఉ.రా. 2.316, 3.92.

**అచ్చుగ** అవ్య. ఒప్పుగా. భాగ. 11.18. **అచ్చుఁదనము** వి. స్వచ్ఛత, పవిత్రత, శంకర. **అచ్చుపాలు** వి. అనుకూల్యం.

**అచ్చు**[3] వి. పాచిక. సిం.ద్వా. 10.88.
సం. అక్ష- ; ప్రా.పా. అచ్ఛ-.
<ప్రా. అచ్ఛ- <సం. అక్ష-.

**అచ్చు**[4] వి. 1. ఇరుసు మాను, బండి ఇరుసు ; 2. వినరు రాయి కుపయోగించే కొయ్యపనిముట్టు.
సం. అక్ష-. ఇరుసు ;
క. త. మ. అచ్చు ; తు. అచ్చికోలు. చూ. అచ్చు[1]. అర విపరి.
<సం. అక్ష-.

**అచ్చు**[5] పో. చూ. అరువు. స.క్రి. 1. (దండుగు పన్ను, అప్పు మొ.) విధిగా చెల్లించు. విజ్ఞా. 3.48, దశా. 4.1168, 1281 ; 2. ఇచ్చు. ఉ.హ. 5.268. అ.క్రి. 1. పూచీపడు, పూటపడు. కాశీ. 5.125 ; 2. అప్పుపడు, ఋణపడు. ద్వి. హరిశ్చ. ఉ. 728. శేష. 3.221.
క. అచ్చు (-అళిసు, అళియు, శిథిలంచేయు. నాశంచేయు). దండుగపడు, పందని పొలానికి శిస్తు చెల్లించు ; అచ్చికె. దండుగ పడు ; త. అఱ. వ్యయించు, నాశంచేయు.
<అటి-చు.

**అచ్చియుండు** స.క్రి. ఇచ్చుకోవలసి ఉండు. **అచ్చుకావలి** రూ. ఆచుకావలి. వి. తమతమ ప్రాంతాల్లో దొంగతనాలు మొ. జరగకుండా చూసేందుకూ, జరిగే పక్షంలో ఆ సొమ్ము తెప్పించి ఇప్పించేందుకూ, లేదా, ఆ నష్టం భరించేందుకూ ప్రాంతీయాధికారులకు (విజయనగర రాజ్య కాలంలో) ప్రభువులిచ్చిన జాగీరు. అచ్చు[5] + కావలి. **అచ్చుకొను** రూ. ఆచుకొను. అ.క్రి. 1. పూచీపడు ; 2. దండుగ చెల్లించు. **అచ్చుకోలు** వి. కొత్త భూస్వామికి రైతు అచ్చుకోవటం. **అచ్చుదల (-తల)** వి. 1. అంగీకారం, ఒప్పుదల. కళా. 2.120 ; 2. అప్పుపడి ఉండటం ; 3. అచ్చిరావటం, కలిసిరావటం. **అచ్చుబాటు** వి. అప్పు.

**అచ్చు**[6] వి. వలకన్ను, కన్ను.

సం. అక్షి-, కన్ను : ప్రా. అచ్ఛ, అచ్ఛి, అచ్ఛీ.

<ప్రా. అచ్ఛ-.

**అచ్చుబద్ద**[2] వి. వల అల్లటాని కుపయోగించే పరికరం.

**అచ్చు**[7] వి. లాభం, ప్రయోజనం (దీనికి అసమాసంలో ప్రయోగంలేదు). అ. క్రి. కలిసివచ్చు. అనుకూలమగు, లాభసాటిగా నుండు.

క. అచ్చు. సాన్నిహిత్యం, స్నేహం, ప్రేమ, ఆదరం.

**అచ్చివచ్చు** అ. క్రి. **1.** మేలగు, శుభమగు, కలిసివచ్చు; **2.** చౌక అగు, లాభసాటి అగు.

**అచ్చు**[8] వి. స్వరం, ప్రాణాక్షరం; అకారాదికం. సులక్ష. 5.113.

సం. అచ్. 'అ' నుండి 'ఔ' వరకు గల వర్ణాలకు వాడే సాంకేతిక పదం; నే. అచ్. పై;

క. అచ్చు. అక్క, స్వరం; ను. అచ్చు; త. అచ్చు; మ. అచు, అచ్చు.

<సం. అచ్, పాణినీయ ప్రత్యాహార సంజ్ఞ.

**అచ్చుఒగ్గు** చూ. అచ్చు[1].

**అచ్చుకట్టు** చూ. అచ్చు[1].

**అచ్చుకట్టుపొలము** చూ. అచ్చు[1].

**అచ్చుకట్టుబిళ్ల** చూ. అచ్చు[1].

**అచ్చుకట్టువాఁడు** చూ. అచ్చు[1].

**అచ్చుకట్టువేయు** చూ. అచ్చు[1].

**అచ్చుకావలి** చూ. అచ్చు[6].

**అచ్చుకువ్వ** చూ. అచ్చు[1].

**అచ్చుకూటము** చూ. అచ్చు[1].

**అచ్చుకూర్చు** చూ. అచ్చు[1].

**అచ్చుకొట్టు** చూ. అచ్చు[1].

**అచ్చుకొమ** చూ. అచ్చు[5].

**అచ్చుకోయు** చూ. అచ్చు[1].

**అచ్చుకోలు** చూ. అచ్చు[6].

**అచ్చుగ** చూ. అచ్చు[2].

**అచ్చుగిరక** చూ. అచ్చు[1].

**అచ్చుఁగూటము** చూ. అచ్చు[1].

**అచ్చుచిత్తులు** చూ. అచ్చు[1].

**అచ్చుటెద్దు** చూ. అచ్చు[1].

**అచ్చుతుఁడు** వి. విష్ణువు. కాళ్ల. 8.28,27.

సం. అచ్యుత-. చ్యుతిలేనివాడు. విష్ణువు; ప్రా. అచ్చుఅ-. విష్ణువు; అమా. అచ్యుత. ద్వాదశ స్వర్గం, ఏకాదశ ద్వాదశ స్వర్గాధిపతి; పా. అచ్చుత-. స్థిరం, శాశ్వతం; అప. అచ్చుయ. జైనుల స్వర్గం పేరు.

క. తు. అచ్చుత; త. అచ్చుతన్.

<సం. అచ్యుత-.

**అచ్చుదల** చూ. అచ్చు[6].

**అచ్చుఁదవము** చూ. అచ్చు[2].

**అచ్చువడు** చూ. అచ్చు[1].

**అచ్చువఱచు** చూ. అచ్చు[1].

**అచ్చువఱచు** చూ. అచ్చు[1].

**అచ్చుపాటు** చూ. అచ్చు[1].

**అచ్చుపాలు** చూ. అచ్చు[2].

**అచ్చుపాడిచివది** చూ. అచ్చు[1].

**అచ్చుపొడుచు** చూ. అచ్చు[1].

**అచ్చుపొందించు** చూ. అచ్చు[1].

**అచ్చుబద్ద**[1] చూ. అచ్చు[1].

**అచ్చుబద్ద**[2] చూ. అచ్చు[6].

**అచ్చుబొటు** చూ. అచ్చు[6].

**అచ్చుబెల్లము** చూ. అచ్చు[1].

**అచ్చుమట్టము** రూ. చూ. అచ్చుమట్టు. వి. పొట్ట గుర్రం.

**అచ్చుముచ్చు** వి. మంచి చెడు. అచ్చు[2] + ముచ్చు (బొంగ).

**అచ్చువేయు** చూ. అచ్చు[1].

**అచ్చెవ** రూ.చూ. అచ్చన[1]. వి. పూజ.

**అచ్చెరియము** రూ.చూ. అచ్చరువు. వి. ఆశ్చర్యం, అద్భుతం. కృ. శకు. 2.179.

**అచ్చెరు** రూ.చూ. అచ్చరువు. వి. అద్భుతం.

**అచ్చెరువడు** రూ. అచ్చెరుపడు. అ. క్రి. ఆశ్చర్యపడు: క. అచ్చరి బడు/-పడు. **అచ్చెరుపాటు** రూ. అచ్చెరు వాటు. వి. ఆశ్చర్యం. **అచ్చెరువడు** (-పడు) రూ.చూ. అచ్చెరుపడు. **అచ్చెరువాటు** (-పాటు) రూ.చూ. అచ్చెరు పాటు. వి. ఆశ్చర్యం, అద్భుతం. భార. శాంతి. 3.446.

**అచ్చెరువడు** చూ. అచ్చెరు.

**అచ్చెరుపాటు** చూ. అచ్చెరు.

**అచ్చెరువడు** చూ. అచ్చెరు.

**అచ్చెరువాటు** చూ. అచ్చెరు.

**అచ్చెరువు** రూ.చూ. అచ్చరువు. వి. ఆశ్చర్యం, అద్భుతం. భార.ఆది. 1.156, 2.198, కు. సం. 3.55, భార.విరా. 4.91, భీమ. 1.72, ఉ.రా. 4.

**అచ్చెరువువడు** అ. క్రి. ఆశ్చర్యపడు. **అచ్చెరువుపాటు** వి. ఆశ్చర్యం.

**అచ్చెరువువడు** చూ. అచ్చెరువు.

**అచ్చెరువుపాటు** రూ. అచ్చెరువు.

**అచ్చెర్వు** రూ.చూ. అచ్చరువు. వి. ఆశ్చర్యం. అహల్యా. 1.102.

**అచ్చొటు** రూ.చూ. అచ్చోటు. వి. **1.** అక్కడ, ఆప్రదేశం. భార.ద్రోణ. 2.251, ఆము. 4.145; **2.** ఆడుగిరి. హరి. ఉ. 9.42; **3.** ఆ పక్క.

**అచ్చొత్తు** చూ. అచ్చు[1].

**అచ్చో** అ[2]- + (చ్) చో; చూ. చోటు; రూ.చూ. అచ్చోటు; సప్తమి అచ్చో (టన్). క్రి. విశే. ఆ ప్రదేశంలో. భార. అశ్వ. 4.228, మను. 3.3, దశా. 1.301.

**అచ్చోటు** < అ[2]- + చోటు; రూ. అచటు, అచాటు, అచోటు, అచ్చటు, అచ్చొటు, అచ్చో. వి. **1.** అక్కడ, ఆ ప్రదేశం. నిర్వ. 10.24; **2.** ఆడుగురి.

**అచ్చేరి** రూ.చూ. అచ్చారి.

**అజ**[1] రూ.చూ. అజా. వి. మొత్తం, పూర్తి మొత్తం: రైతు వంతూ రాజు వంతూ కలిసి చేలో పండిన పంట మొత్తం.

**అజ**[2] చూ. అజ్జ[1]; రూ. అజవా. వి. గుర్తు, జాడ.

**అజవజ** రూ. అజవజా, అజావజా, అజాబజా: చూ. అజ[2], వజ్జ. వి. జాడ, అతీగతీ, ఆచూకీ.

**అజవజా** రూ.చూ. అజవజ.

**అజబాజరేటు** రూ.అతరాపు రేటు. వి. 1. ఇతర భూముల శిస్తు రేటు; 2. సరిహద్దు ధర.

మరా. అజూబాజూ. సమీపంలో ఉన్న.

< పార. అజా+బాజా. (పక్క) + ఇం. రేటు (ప్రక్క పొలాల శిస్తు రేటు).

**అజమాయిషీ** రూ. చూ. అజ్మాయిషి. వి. పర్యవేక్షణ. పెత్తనం.

**అజము**[1] రూ. అదము. వి. 1. గర్వం: 2. ఉలికిపాటు, బెదరు.

పార. అజ్మ్. కినుక. కసరు, ద్వేషం; అర. ఉ. అజ్మ్.

<ఉ. అజ్మ్ <అర. అజ్మ్.

**అజము**[2] అవ్య. తరచుగా, ఎల్లప్పుడు. చూ. అజ[1].

**అజవా** రూ.చూ. అజ[2]. వి. 1. లక్ష్యం; 2. గుర్తు.

**అజా** రూ. అజ[1]. వి. మొత్తం, పూర్తి మొత్తం, రైతు వంతు రాజు వంతు కలిసి చేలో పండిన పంటమొత్తం. (మొత్తంలో అని అర్థమిచ్చే పార. అజాజుమ్లా లోని అజా మొత్తం అనే అర్థంలో ప్రయోగించబడి వుండవచ్చు.)

**అజాఅంబారా** రూ. అజ్జాఅంబారా, అజ్జాంబారా. వి. 1. రూపురేఖ; 2. దిక్కూమొక్కూ. చూ. అజ[2], అంబారము.

**అజాన్‌గొలుసు** వి. పడవ పరమాను గడకు, చాపకు కట్టిన చిన్న తాడు.

పార. అర. హజీన్. వంచు, వంకి కర్రతో లాగు. తిరిగిపోవు.

**అజాన్‌తాడు** వి. తెరచాప ఎత్తేతాడు. (కప్పీలోనించి దూర్చబడి తెరచాపకు కట్టబడి వుంటుంది. చూ. అజాంతాడు.

**అజావజా** రూ.చూ. అజవజ.

**అజాబజా** రూ.చూ. అజవజ.

**అజారము** చూ. హజారము. వి. 1. ఆస్థాన మంటపం, కొలువు కూటం. క్రీడా; కువల. 2.3; 2. మొగసాల, నగరి తలవాకిలి.

**అజారు**[1] వి. మోటబావి పక్కన పేర్చిన రాళ్ళమీద అడ్డంగా పరచిన కర్ర.

ఉ. హజర్. రాయి; పార. అజిర్, ఆజుర్, అజ్యుర్. ఇటుక.

<ఉ. హజర్ <పార. (మోటబావిమీద రాయి వేస్తారు కాబట్టి కొయ్యవేసినా అదే పేరు స్థిరపడి వుండవచ్చు).

**అజారు**[2] చూ. హాజరు. వి. హాజరు, సిద్ధం.

**అజీలుగా** చూ. ఆజీలుగా. క్రి.విశ. సర్వదా, ఎల్లకాలం.

**అజుకుంచు** స.క్రి. 1. అక్రమంగా తక్కువ వెలకట్టు; 2. నమ్మించి మోసగించు. ఉ. అజూకా <అర. అజూక్.

**అజూద** వి. ఒక ఆట.

? పార. అజిద, ఆజద. చిల్లులుకలది. రంగువేయబడింది, స్వర్ణాక్షరాలతో వ్రాయబడింది.

**అజ్జ**[1] రూ. హజ్జ. పో.చూ. అంజ, అంగ. వి. 1. అడుగుజాడ. పండి. 5.341 పు.: 2. అడుగు దూరం. చంద్రా. 2.91; 3. అడుగు, పాదం. అచ్చ. రా. 155.

సం. పద్యా. అడుగులు, పద్య. పాదసంబంధి; ప్రా. పజ్జా. తోవ; పా. పజ్జి. పై:

క. పజ్జె, పెజ్జె, హజ్జె, హెజ్జె. అడుగు, అడుగుజాడ, జాడ, అంగ; తు. పజ్జె, అజె. పై; తొ. ఒజ్. అడుగు; కొలా. అజ్. అడుగుజాడ.

తె. హజ్జ <క. హజ్జ.

**అజ్జలువెట్టు** అ.క్రి. 1. పూను, కదగు. కు.సం. 9.228; 2. అడుగులు వేయు. **అజ్జవాలు** వి. కోడి, చరణాయుధం, అచ్చ. రా. అయో. 38; అజ్జ[1]+వాలు (ఆయుధం): చరణాయుధమనే సంస్కృత సమాసానికి తెనుగుపోత.

**అజ్జ**[2] రూ. ఎజ్జ. వి. అదను, సమయం. భార. శల్య. 1.320, శాం. 2.43; విశ. అనుకూలం, తగినది.

సం. అద్య-. అవ్య. ఈనాడు, ప్రస్తుతం; ప్రా. అమా. అజ్జ; పా. అజ్జ, అజ్జా, అజ్జతా; అప. అజ్జు (అద్య), అజు, అజ్జ; కా. అజ్; కు. గు. మరా. ఉ. ఆజ్; నే. అజ, ఆజు; అ. అజి; బెం. అజి, అజు; ఒ. అజి, అజి; హిం. ఆజ్, అజు; పం. అజ్జ్, అజ్జో; ల. అజ్జీ; సిం. అజ్జ్, అజు; సింహ. అద;

క. అజ్జ. అదను, సమయం; అజ్జగళ్ల. తెలివైన దొంగ

త. అత్తుమ్. సమయం, అవకాశం.

సం. అద్య->ప్రా. అజ్జ. (అర్థ విపరిణామం).

**అజ్జగా** క్రి.విశ. నేర్పుగా.

**అజ్జ**[3] రూ.చూ. అజ్జా[1]. అవ్య. ప్రశంసనార్థకం.

**అజ్జగా** చూ. అజ్జ[2].

**అజ్జము** రూ.చూ. అజ్ఝము. వి. 1. కొన్ని పనసలు గల వేద భాగం అనువాకం; 2. గ్రంథ భాగ విశేషం.

**అజ్జరె** రూ.చూ. అజ్జారే. అవ్య. ప్రశంసార్థకం.

**అజ్జరే** అజ్జ+రే. రూ.చూ. అజ్జారే.

**అజ్జలువెట్టు** చూ. అజ్జ[1].

**అజ్జవాలు** చూ. అజ్జ[1].

**అజ్జా**[1] రూ. అజ్జ[3], అజ్ఝా. అవ్య. ప్రశంసార్థకం.

పో.చూ. సం, అద్ధా. అవ్య. నిజంగా, స్పష్టంగా.

? ప్రా. అజ్జా. పూజ్యస్త్రీ <సం. ఆర్యా.

**అజ్జా**[2] రూ.చూ. ఉజ్జా-. వి. అంచనా.

**అజ్జాఅంబారా** రూ.చూ. అజాఅంబారా.

**అజ్జాపాయి** వి. సుమారు, దగ్గర. చూ. అజ్జ[1].

అజ్జ+పాయి<ప్రా. పాయ-; సం. పద్యా; రెండూ సమానార్థకాలే; ఇది దరిదాపు లాంటిది.

**అజ్జాంబారా** రూ.చూ. అజాఅంబారా.

**అజ్ఞాయించు** రూ.చూ. అరజాయించు ; పో.చూ. అంజాయించు, ఉజ్ఞాయించు. అ.క్రి. వెనుదీయు, సంకోచించు.

**అజ్ఞాయింపు** చూ. అజ్ఞాయించు. వి. ఓర్పు.

<అజ్ఞాయించు (అర్థ విపరిణామం).

**అజ్ఞారె** రూ.చూ. అజ్ఞారే.

**అజ్ఞారే** రూ. అజ్జరె, అజ్జరే, అజ్జారె, అజ్జురె, అజ్జురే. అజ్ఞూరె, అజ్ఞూరే. అవ్య. ప్రశంసార్థకం. సీతా. 3.23, ఇందు. 5.114.

సం. ఆర్యః. పూజ్యుడు, ప్రశంసనీయుడు ; ప్రా. అజ్జ. పూజ్యుడు ; అజ్జా. పూజ్యురాలు.

త. అప్పో. సంతోషాశ్చర్యాద్యర్థకం.

<అజ్జ(ప్రా.)+రే.

**అజ్జి** వి. కుంటివాడు. చూ. అజ్జ$^{1}$.

**అజ్జలు** వి. ఒక రకం సన్నటి పొడుగాటి చేప. చూ. అడుజు.

**అజ్ఝము** రూ. అజ్జము. వి. కొన్ని పనసలు గల వేద భాగం. పాంచా. 4.25.

సం. అధ్యాయః. గ్రంథ భాగం ; ప్రా. అజ్ఝాయ, అజ్ఝాఅ ; పో.చూ. అమా. అజ్ఝయణ ; పో.చూ. ప్రా. అజ్ఝాయక. వేదాధ్యయనం చేసే బ్రాహ్మణుడు ;

త. అత్తియాయమ్. గ్రంథభాగం.

<ప్రా. అజ్ఝాయ.

**అజ్ఝురె** రూ.చూ. అజ్ఞారే. అవ్య. ప్రశంసార్థకం. మల్ల. 2.18. పాంచా. 4.25.

**అజ్ఝురే** రూ.చూ. అజ్ఞారే.

**అజ్ఝూ** రూ.చూ. అజ్ఞా$^{1}$. అవ్య. ప్రశంసార్థకం.

**అజ్ఝూరె** రూ.చూ. అజ్ఞారే. అవ్య. ప్రశంసార్థకం. ఇందు. 4.114.

**అజ్ఝూరే** రూ.చూ. అజ్ఞారే.

**అజ్మాయిషీ** రూ. అజమాయిషీ, అజ్మాయిషీ, అయిమాయిషి, అజ్మాయిషి. వి. 1. పరిశోధన ; 2. అనుభవం ; 3. పెత్తనం.

నే. అజ్మైస్, అజ్మాఇస్. పరిశోధన ; హిం. అజ్మాఇస్, అజ్మాఇసీ ; గు. అజమాయేష ; మరా. అజ్మస, అజ్మాస, అదమస, అద్మాస ; ఉ. అజ్మాఇశ్, అజ్‌మాయిష్, పార. అఝ్మ-ఎ-శ్ ;

క. అజమాసు. మమారు, దాదాపు, ఇంచుమించు ; తు. అజమాసు, అజమాజసుని. అంచనా, పరిశోధన ; త. అజ్మాఅ. పరిశోధన, పంట అంచనా ; మ. అజమాసి. పై.

<ఉ. అజ్‌మాయిష్.

**అజ్మాయిషీ** రూ.చూ. అజ్మాయిషి. వి. 1. కరణాల లెక్కలు మొ. ; 2. శోధన, పరీక్ష.

**అంచ**$^{1}$ వి. 1. పక్క, పార్శ్వం, సామీప్యం. ఇందు. 3.27, ఆం.భా. 3.21 ; 2. వద్ద, సమీపం.

క. అంచు. బట్టఅంచు, బద్దె, సరిహద్దు, గట్టు, పక్క, సామీప్యం ; పో.చూ. అంశ. తద్భ. అంస. భాగం మొ. ; తు. అంచి. ఆవైపు.

పో.చూ. సం. అంచ్. వంచు ; అంచః.

**అంచ**$^{2}$ వి. హంస. భార.సభా. 2.44.

సం. హంసః ; ప్రా. పా. హంస ; పం. హంస్ ; సిం. హస్‌బ ; గు. హన్స్ ; మరా. హంస ;

క. అంచె ; తు. అంస ; త. అంచమ్, హంసమ్, అన్నమ్.

<ప్రా. హంస- <సం. హంసః.

**అంచకొదమ** వి. చిన్న హంస. శృం.నై. 6.22. **అంచగమన** వి. హంస వలె ఒయ్యారంగా నడిచే స్త్రీ. శార్ఙ. 4.146. అంచ+సం. గమనా. **అంచెగఱులపాన్పు** గఱి+లు+ల+పాన్పు. వి. హంసతూలికాతల్పం. క. అంచె దుప్పటివాసు, అంచెయుప్పలిగ. హంసతూలికలు : పో.చూ. త. అన్నత్తూవి. పై. **అంచగుఱ్ఱపుజోదు** వి. హంస వాహనుడు, బ్రహ్మ. అచ్చ.రా.యుద్ధ. 50. అంచ$^{2}$+గుఱ్ఱము (వాహనం)+జోదు <సం. యోధ-. **అంచతత్తడి** హంస వాహనుడు. బ్రహ్మ. పో.చూ. త. అన్నమ్‌ఉయిర్‌త్తోన్. **అంచతత్తడిచెలియ** అంచతత్తడి+చెలియ. వి. బ్రహ్మభార్య, సరస్వతి. **అంచతొయ్యలి** వి. ఆడుహంస. **అంచపదము** వి. హంసపాదు. ఆము. 5.28. **అంచయాన** వి. హంస వలె నడిచేది, స్త్రీ. రుక్మా. 4.14. <సం. హంసయానా. **అంచయేనుఁగుమావంతు** అంచ+య్+ఏనుఁగు+మావంతు. వి. బ్రహ్మ. చూ. అంచగుఱ్ఱపు జోదు. **అంచరవుతు** రూ. అంచరౌతు. వి. హంస నెక్కేవాడు, బ్రహ్మ. **అంచరెక్కలపెజ్జ** అంచ+రెక్కలు+అ+పెజ్జ. వి. హంసతూలికాతల్పం. **అంచరౌతు** రూ.చూ. అంచరవుతు. వి. బ్రహ్మ. **అంచలవిడిది** అంచలు+అ+విడిది. వి. హంసల ఆవాసం అనబడే ఆకాశ గంగ. విడిది (వసతి) < తె.విడియు.

**అంచ**$^{3}$ వి. అంతస్తు, ఇంటిమీద ఇల్లు. చూ. అంచియ.

**అంచ**$^{4}$ రూ. అంచె$^{2}$. వి. వెదురు మొ. వాటితో అల్లిన పెద్ద బుట్ట. చూ. అంచు$^{2}$.

**అంచ**$^{5}$ రూ.చూ. అంచు$^{3}$ ; నేతబట్ట పొడుగువైపు కొన.

**అంచగుదిపాయ** కరగుదిపాయ, లచ్చగుదిపాయల్లో చివరిది. **అంచగుప్పివేత** వి. కుప్పడంనేత, అంచులో వేరే రంగు పేకదారాలు పెట్టి డిజైన్లు పూలు, ఆకులు, మొక్కలు, మొ. వచ్చేటట్టు నేసే నేత.

**అంచకొదమ** చూ. అంచ$^{2}$.

**అంచగమన** చూ. అంచ$^{2}$.

**అంచగఱులపాన్పు** చూ. అంచ$^{2}$.

**అంచగుదిపాయ** చూ. అంచ$^{5}$.

**అంచగుప్పివేత** చూ. అంచ$^{5}$.

**అంచగుఱ్ఱపుజోదు** చూ. అంచ$^{2}$.

**అంచతత్తడి** చూ. అంచ$^{2}$.

**అంచతత్తడిచెలియ** చూ. అంచ$^{2}$.

**అంచతొయ్యలి** చూ. అంచ$^{2}$.

**అంచన** రూ. అంచనా. వి. ఊహ, ఉజ్జాయింపు. ప్రభా. 1.142, చమత్కార. 1.102.

సం. అంచన. విభజన ; ఉ. పార. అంచెనా (అన్. ఉన్నది, చనన్. అంత) ; త. అంచణా. చేనిమీది పంట విలువ ఊహించటం, ఉ. అంచెనా నుంచి వచ్చినట్లు తమిళ నిఘంటుకారులు.

**అంచవకట్టు** పో.చూ. అంచన చూచు. అంచన చేయు, అంచన వేయు. స.క్రి. ఊహించి విలువ కట్టు. **అంచవ చూచు** స.క్రి. ఫల పరిమితి నూహించు. **అంచవచేయు** స.క్రి. విలువ కట్టు. **అంచవదారు(డు** రూ. అంచనాదారు(డు. గుట్ట లోని ఉప్పునుగాని చేనిలోని ధాన్యాన్నిగాని చూచి విలువ కట్టేవాడు, ఫల పరిమితిని ఊహించేవాడు (ఉ. -దార్. మతుప్ ప్రత్యయం). **అంచవవేయు** స.క్రి. విలువ కట్టు.

**అంచవకట్టు** చూ. అంచన.

**అంచవచూచు** చూ. అంచన.

**అంచవచేయు** చూ. అంచన.

**అంచవదారు(డు** చూ. అంచన.

**అంచవవేయు** చూ. అంచన.

**అంచ(వ)వట్టు** స.క్రి. కుప్పడం నేతలో అంచు పడుగు వరకు వేరే రంగు పేకపోగులు దూర్చి నేయు.

**అంచవా** రూ.చూ. అంచన. వి. ఊహ, ఉజ్జాయింపు.

**అంచవాఅమ్మకం** ఉజ్జాయింపు ధరకు అమ్మటం. **అంచవా జాబితా** వి. ఒక్కొక్క రైతుకు ఎంత పండుతుందో ఊహించి తయారుచేసిన లెక్క. **అంచవాలు** వి.బ.వ. పంటల పరిమితిని సూచించే పని. **అంచవావ్యవహారము** వి. అందాజు వ్యవ హారం.

**అంచవాఅమ్మకం** చూ. అంచనా.

**అంచవాజాబితా** చూ. అంచనా.

**అంచనాడె** రూ.చూ. అంచునాడె; చూ. అంచు[3].

**అంచవాలు** చూ. అంచనా.

**అంచవావ్యవహారము** చూ. అంచనా.

**అంచవదము** చూ. అంచ[2].

**అంచపాగడ** వి. నేతలో అంచులకు పెట్టే పడుగునూలు.

**అంచపేటు** వి. అంచులో నేసిన డిజైను.

**అంచపోగులకుంచె** వి. నరిచేసేటప్పుడు పడుగులో చివరి అంచు దారాలు దువ్వే కుంచె.

**అంచయాన** చూ. అంచ[2].

**అంచయేను(గుమావంతు** చూ. అంచ[2].

**అంచరవుతు** చూ. అంచ[2].

**అంచరెక్కలసెజ్జ** చూ. అంచ[2].

**అంచరౌతు** చూ. అంచ[2].

**అంచల** చూ. అంచ[1]. క్రి.విశ: దగ్గరలో. ఉ.రా. 1.188; వి. పార్శ్వం, పక్క. ప్రబంధ. 290, రాజ.చ. 2.177.

సం. అంచల. బట్ట అంచు బద్దె; హిం. అంచల.

<సం. అంచల.

**అంచలచక్కి** వి. నేతపడుగు పక్కభాగంలో అతికే పోగులు.

**అంచలము** పో.చూ. అచ్చలము. వి. **1.** పట్టుదల, నిర్భీతి.నల. 3.1008; **2.** కోపం, రోషం.

బహుశః <అచ్చలము. 'చ' కారానునాసికీకరణం వల్ల.

**అంచలవిడిది** చూ. అంచ[2].

**అంచలు** వి.బవ. అంచు నేతదారాలు.

**అంచి** చూ. అంచు[3]. వి. గిన్నె అంచు.

**అంచించు** చూ. అంచన. స.క్రి. అంచనచేయు, ఊహించు. ఫల పరిమితి నూహించు. చమ. 1.102, తల్లా. 2.

<సం. అంచ్ + ఇంచు. ఒక వైపు మొగ్గు.

**అంచిపుచ్చు** చూ. అంచు[1].

**అంచియ** రూ. అంచె[1]. వి. **1.** వరుస, దారు; **2.** మజిలీ.

క. అంచె. తపాలు, తపాలా దారి, ఆగే చోటు; తు. అచె, అంచల్. తపాలు; త. అంచల్, అంచి. మజిలీ, తపాలు.

పో.చూ. సం. అంచిత; ప్రా. అంచియ. గమన విశేషం; మరా. అంచి. తపాలు, మజిలీ.

<అంచ[1]. అర్థ విపరిణామం: మజిలీ చేసేది దారి పక్కనే కాబట్టి.

**అంచీ** వి. ఇటికావంలోని రెండో తెప్ప. చూ. అంచియ.

**అంచీలు** వి.బ.వ. మెట్లు, చీడీలు, తావలు. చూ. అంచియ.

**అంచు[1]** (అన్చు) రూ. అనుచు. స.క్రి. **1.** పంపించు, పుచ్చు. భార. ద్రోణ. 1.344; **2.** పనుచు, ఆజ్ఞాపించు. ఉ.రా. 3.199.

త. అణుప్పు. పంపు; మ. అనుప్పుక. రాచ మర్యాదలతో పంపు; పో.చూ. కుడ. అమ్పు. స్వేచ్ఛగా వదలు, వదలిపెట్టు, భార్యగా పంపు, దానంగా ఇచ్చు;

ఆస్ట్రిక్ ముండా. అను. ఆజ్ఞాపించు, నియమించు.

<అనుచు/పంచు.

**అంచిపుచ్చు** స.క్రి. అనుమతించి పంపు. భార. అశ్వ. 3.4.

**అంచు[2]** రూ.చూ. అదఁచు. స.క్రి. **1.** అణగద్రొక్కు, బాధించు కు.సం. 8.153; **2.** తాడించు, మొత్తు; **3.** అద్దు.

క. అణసు. గట్టిగా కలిపి పట్టేది, కర్ర మొ. వాటి పొన్ను; తు. అణె. సమీపించు, కలియు; త. అణై. కలియు, కౌగిలించు; గోం. అన్వానా-, అన్వి-, అన్వాకా, అన్వకా. నొక్కు.

**అంచు[3]** రూ. అంచ[5]. వి. **1.** అరము, బండి కంటి ఆకు. భాగ. 5.2.81; **2.** రీతి, విధం. జై.భా. 3.26; **3.** అగ్రం, కొన. ఆము. 2.49; **4.** చీర చెరగు, కమ్మి. హంస. 4.29; **5.** ఒడ్డు, గట్టు; **6.** సమీప ప్రదేశం; **7.** ఎద్దు కొమ్ముకు వేసే పొన్ను; **8.** కొడవలి మొ. వాటికి అలుగు బిగింపుకోసం వేసే ఇనపకట్టు; **9.** నేతబట్ట పొడుగు వైపు కొన; **10.** (మత్స్య) బుంగమూతి అంచు, దొట్ట అంచు; **11.** పడవ పైభాగం.

క. అంచు. చివర, కొన, చీరకమ్మి, హద్దు, గట్టు, పక్క, సామీప్యం; త. అణై. గట్టు, అడ్డు, తీరం, సముద్ర తీరం, అంచ. ప్రాపు; అణ్. దగ్గరకు, చేరు, చేర్చు; మ. ఆణ. ప్రాపు, దిండు, గట్టు;

పో.చూ. సం. అంశు. చివర మొ.; ప్రా. అంసో; అమా. అంస. భాగం: అంసి. మూల; అంసియ. స్థిరభాగం.

<అణ్ + చు. పో.చూ. అంత, అంటు, మొ.

**అంచుకమ్మలు** వి.బ.వ. అంచులో అందంగల చెవిపోగులు. శుక. 2.456. **అంచుకోపు** అంచులో పడుగు వైపు భాగం; **అంచుగడి** వి. అంచులో నేసిన గడి. **అంచుచెక్కలు** వి.

అద్దకంలో అంచులకు వేరే రంగు అంటకుండా దిగించే కొయ్య పలకలు. **అంచురూలు** వి. అంచుల్లో డిజైన్లు నెయ్యటానికి చేతిమగ్గం పడుగుమీద పంతెనమాదిరిగా కట్టిన లావు దారాలు. **అంచువాడె** రూ. అంచనాడె, అంచులాడె. వి. అంచునేతకు ప్రత్యేకంగా వాడే కొమ్మునాడె. **అంచువేత** వి. పడుగు అంచులకు డిజైన్లు వచ్చేటట్లు నేసే నేత. **అంచు పడుగు** వి. అంచునేతకు ప్రత్యేకంగా వాడే పడుగునూలు. **అంచుపాగర** వి. అల్లు చేసే పడుగులో అంచుల్లో కలిపే నూలు. **అంచుపోగు** వి. పడుగు పక్కభాగంలో అతికిన పోగు. **అంచుబుటా** వి. అంచులో నేసిన చిన్న డిజైను. **అంచుమలుపువేత** వి. అంచ గుప్పినేత. **అంచుముట్టు** అ.క్రి. తుదముట్టు. వసు. 4.124 ; వి. చిట్టచివర. **అంచులవాఁడు** వి. చిత్రకారుడు, జీనిగిరివాడు, అంచులు అద్దేవాడు. బట్టలకు అంచులు వేసేవాడు. ఆం.భా. 2.282. **అంచులాడె** రూ.చూ. అంచునాడె. **అంచులు** వి. బ.వ. చనుమొనలు, చూచుకాలు. **అంచువాయి** వి. మగ్గంమీద దాపిన పడుగులో నడిమి పాయనుంచి కుడివైపు.

**అంచుకమ్మలు** చూ. అంచు[3].

**అంచుకయించుక** అవ్య. అంతో ఇంతో, ఏదో కొంచెం, ఒక్కింత. పి.శకు. 2.159.

పో.చూ. క. అనితు, ఇనితు. అంత, ఇంత : తు. అతు, ఈతు. పై ; త. అత్తైత్తు. చాలా.

(ఇంచుక సామ్యంవల్ల ఏర్పడిన రూపం 'అంచుక.')

**అంచుకోపు** చూ. అంచు[3].

**అంచుగడి** చూ. అంచు[3].

**అంచుగండ** వి. నిష్ఠాపరుడు. శివ. 1.18.

క. అచ్చుగొండ. ఈశ్వర సేవానక్తుడు ; అచ్చుగొళ్. అమితానక్తి కలిగియుండు.

**అంచుచెక్కలు** చూ. అంచు[3].

**అంచురూలు** చూ. అంచు[3].

**అంచువాడె** చూ. అంచు[3].

**అంచువేత** చూ. అంచు[3].

**అంచుపడుగు** చూ. అంచు[3].

**అంచుపాగర** చూ. అంచు[3].

**అంచుపోగు** చూ. అంచు[3].

**అంచుబుటా** చూ. అంచు[3].

**అంచుమలుపువేత** చూ. అంచు[3].

**అంచుముట్టు** చూ. అంచు[3].

**అంచులవాడు** చూ. అంచు[3].

**అంచులాడె** చూ. అంచు[3].

**అంచులు** చూ. అంచు[3].

**అంచువాయి** చూ. అంచు[3].

**అంచె**[1] రూ.చూ. అంచియ. వి. 1. పరున, దారు. కాశీ. 1.132, మను. 5.61 ; 2. మజిలీ ; 3. రెండు మజిలీలమధ్య దూరం ; 4. వాహనాల లేక వాహకుల మార్పుపై వచ్చే టపా.

**అంచెగుఱ్ఱాలు** వి. బ.వ. మజిలీ నుంచి మజిలీకి వాడే గుఱ్ఱాలు. **అంచెతపా (టపా)** వి. వాహనాల లేక వాహకుల మార్పుపై వచ్చే టపా. **అంచెబోయలు** రూ. అంచెబోయీలు. వి. బ.వ. పల్లకీమోసేవారు. **అంచెబోయీలు** రూ.చూ. అంచెబోయలు. **అంచెలంచెలు** వి. బ.వ. వరుసలు వరుసలు, దార్లు దార్లు. కాశీ. 1.132, మను. 4.60. **అంచెలుగట్టు (-కట్టు)** అ.క్రి. 1. దార్లుతీర్చు. మను. 5.61 ; 2. ఒక స్థానంలో ఉండు ; 3. ఒకడి తర్వాత ఒకడు ఇలా తీసుకుపోవటానికి వరుసగా నుండు.

**అంచె**[2] రూ.చూ. అంచ[4]. వి. 1. వెదురుబద్దలలో వెరల్పుగా అల్లిన తూర్పారపట్టే బుట్ట : 2. వంగకుండా నీళ్లు చల్లి పెద్ద చేపల్ని ఉంచే బుట్ట.

**అంచెబుట్ట** వి. ఎక్కువలోతు లేకుండా వెరల్పుగా అల్లిన బుట్ట.

**అంచెగుఱ్ఱాలు** చూ. అంచె[1].

**అంచె త(ట)పా** చూ. అంచె[1].

**అంచెబుట్ట** చూ. అంచె[2].

**అంచెబోయలు** చూ. అంచె[1].

**అంచెబోయీలు** చూ. అంచె[1].

**అంచెలంచెలు** చూ. అంచె[1].

**అంచెలుగట్టు** చూ. అంచె[1].

**అంచోడించు** అ.క్రి. ముందువెనుకలాడు.

**అంజ**[1] రూ. హంజ ; పో.చూ. అంగ, అజ్జ[1]. వి. 1. అంగ. పి.శకు. 3.105 ; 2. అడుగు, అడుగు దూరం. మను. 3.91 ; 3. పాదం. నీలా. 2.41 ; 4. మల్లబంధ విశేషం, పాదివి పట్టటం. ఆం.భా. 2.209.

పో.చూ. క. పజ్జె, పెజ్జె, హజ్జె, హెజ్జె. అడుగు, అడుగుజాడ, అంగ ; తు. అజె, పజ్జె. పై :

ఉ. పంజ. పాదం ముందు భాగం.

<అజ్జ. అనునాసికీకరణం. తె. అజ్జ, హజ్జ. అడుగు ; పజ్జ. సామీప్యం.

**అంజగొను** స.క్రి. ఆకర్షించు. అచ్చ. భార. 3.45 వ. **అంజమెడపట్టు** (అంజ + మెడ + పట్టు) వి. మల్లబంధ విశేషం, అడుగు ముందుకువేసి ప్రతిస్పర్ధి మెడ పట్టుకోవటం. ఆం.భా. 2.209. ఉ. ఆంజి ఫేరా. వేళ్లు కలిపి ప్రతిస్పర్ధి చేయి మెలిపెట్టటం, జయించటం.

**అంజ**[2] పో.చూ. అంచు[3] ; చూ. అంచ[1]. వి. దగ్గర, చెంత. ఆం.భా. 3.21.

**అంజ**[3] వి. భయం, జంకు. కు. సం. 9.148. చూ. అంజు.

**అంజగొను** చూ. అంజ[1].

**అంజనకాఁడు** అంజన + కాఁడు. వి. అంజనం వేసి నిధి నిక్షేపాలు కనిపెట్టే వాడు.

సం. అంజన (కాటుక) + కార ;

క. అంజన. కాటుక ; తు. అంజనకారె. అంజనం వేసేవాడు ; త. అంచణక్కారణ్. మాంత్రికుడు ; మ. అంజనమ్. కాటుక, సుర్మా.

**అంజనరాయి** వి. సౌవీరం, కాటుకరాయి.

క. అంజన. పూత, తేటపరచటం, కాటుక, కాటుకతో కలిసే పని, సౌవీరం మొ., మాయకాటుక ; తు. అంజన ; త. అంచణక్కల్ ; మ. అన్జనక్కల్.

**అంజమెరవట్టు** చూ. అంజ[1].

**అంజలిగుంజలి** అంజలి + గుంజలి. క్రి. విశే. క్షోభ పడేటట్లు, చీకాకు పడేటట్లు, బాధ కలిగేటట్లు. బసవ. 4.97 ; విశే. గాసి నొందినది.

క. అంజు. భయపడు, కలతచెందు, సంకోచించు, గుంజు, లాగు : పో.చూ. తు. అంజుని ; త. అంచు. పై.

< అంజు + అలి + గుంజు + అలి ; అంజు + అలి భయం, గుంజు + అలి. గట్టిగా కొట్టు : పో.చూ. గుంజలి.

**అంజామ్** వి. అంతం, హంగు.

హిం. ఉ. పార. అంజామ్.

< ఉ. అంజామ్.

**అంజాయించు** రూ.చూ. అరజాయించు.

**అంజి**[1] వి. 1. బాలికా క్రీడా విశేషం (ఐదుగురు ఆడుకునేది కావచ్చు). భోజ. 5.76 ; 2. ఇసుకలో దూది బంతులతో ఆడే ఆట.

సం. పంజి. పంజీ. పింజ, ఏకు ;

క. అంజి, పంజి. ఆడుకునే దూది బంతి ; పంజికె, అంజి, పంజి, హంజి. ఏకు.

**అంజిదోయాలు(-దాయాలు)** వి. బ.వ. స్త్రీలు పిల్లలు గవ్వలతో ఆడే ఆట.

**అంజి**[2] పో.చూ. అమిజి. వి. 1. పంతు, పర్యాయం ; 2. ఉచితం ; 3. ఊరిఉమ్మడి పని, భూమి దామాషా ప్రకారం చేసే శ్రమ ; 4. వెట్టి చాకిరి.

పో.చూ. సం. హంజా, హంజికా. దాసి, చేటిక ; ప్రా. హంజే. చేటి. దూతికల నాహ్వానించే ఆమంత్రణ పదం ; హిం. హంజి, హంజికా. పై ;

< త. అమించి. వెట్టి పని ; అమంచి. జీతంనాతం ఇవ్వకుండా బలవంతంగా చేయించే పని.

**అంజి**[3] చూ. అందె. వి. పాదాభరణం.

**అంజిక** చూ. అంజు.

**అంజిదో(దా)యాలు** చూ. అంజి[1].

**అంజివణ్ణతువ్యాపారి** వి. పంచాననంవారు అనబడే ఒకానొక వర్తక సంఘానికి చెందినవాడు.

త. అంజి (అయిదు) ; వణ్ణత్తు (వర్ణాలకు సంబంధించిన) + సం. వ్యాపారి.

**అంజీరు** రూ.చూ. అంజూర. వి. సీమమేడిపండు.

**అంజు** అ.క్రి. సందేహించు, భయపడు, బెదరు. బసవ. 5.62, భాగ. 10 పూ. 1317.

క. అంజు. భయపడు, కలతచెందు ; తు. అంజుని. భయం ; త. అంచు. భయపడు, హడలిపోవు ; మ. అంచుక. పై ; కొండ. అంజ్. భయపడు. అంజిల్. భయం ; కుఇ. అజ, అజి-. భయం, భయపడు ; కువి. అజ్జిర. భయపడు, అజ్జి. భయం ; బ్రా. హిజింగ్. బిత్తరపోవు.

మూ. ద్రా. √ అంచు.

**అంజిక** చూ. అంజు + ఇక. వి. 1. సందేహం, జంకు. రం. రా. కిష్కిం. 200 పు. 13 పం. ; 2. భయం. ఆం. భా. 1.133. క. అంజికె. భయం ; తు. అంజికె, అంజిగె ; త. అంచిక్కై, అంచుకై ; మ. అంచుక, కువి. అజి అస్కి.

**అంజూర** రూ. అంజీరు, అంజూరు. వి. సీమమేడిపండు. హంస. 4.134.

సం. అంజీర-; నే. అంజిర్, అమ్జిర్ ; హిం. అంజీర్ ; గు. అంజీర ; మరా. అంజి(జీ)ర ; ఉ. అంజీర్, ఇంజీర్ ; పార. అంజీర్ ; అర. ఇంజీర్. క. తు. అంజూర.

< ఉ. అంజీర్ < పార. < అర.

**అంజూరు** రూ.చూ. అంజూర. వి. 1. వృక్షవిశేషం, అత్తిచెట్టు, మేడిచెట్టు, ఉదుంబరం : 2. సీమ అత్తిపండు, సీమ మేడిపండు.

**అంజె** పో.చూ. అజ్జ, అంజ. వి. 1. పాదం, అడుగు ; 2. అందె, పాదాభరణం.

పో.చూ.క. పజ్జె, పెజ్జె, హజ్జె, హెజ్జె. అడుగు, అడుగుజాడ, అంగ ; తు. పజ్జె, అజె, అజ్జె. పై.

**అట** చూ. అటు. అవ్య. 1. కొన్నిపట్ల అర్థవిశేషం లేకుండానే ప్రయుక్తం. భార. ఆర. 4.119, కు.సం. 7.888 ; 2. అక్కడ, ఆచోటు, నిర్వ. రా. 2.58, దశా. 7.141, ఆము. 1.36 ; 3. ఆకాలం, ఆసమయం. మను. 6.51 ; 4. తచ్ఛబ్దార్థకం. రం. రా. అయో. 97 పు. ; 5. ఎట్టి, ఏమి, ఎన్ని, ఎవడు, ఏది మొ. పదాలకు 'అయినా' అనే అర్థంలో అనుప్రయుక్తం.

< అటు + అ6.9.

**అట(న్)** అవ్య. 1. ఆవల, ఆ ప్రదేశం తర్వాత. భార. భీష్మ. 1.21 ; 2. పిమ్మట, అనంతరం. భార. ద్రోణ. 4.298.

< అటు + అ9. సప్తమ్యంతం.

**అటమీద(న్)** క్రి. విశే. పిమ్మట, అనంతరం. రం.రా. 2.971 పు. 5 పం. **అటమున్న** క్రి. విశే. అంతకుముందు. కు. సం. 7.888. **అటమొన్న** రూ. అటుమొన్న. క్రి. విశే. మొన్నటికి పూర్వపు దినం. దశా. 2.418.

**అటక** రూ.చూ. అట్టుక. ఇంట్లో గోడలమీద అడ్డంగా పలకలు కొయ్యలు మొ. వాటితో మంచెవలె అమర్చినది, మసెల.

**అటకబండ** రూ. అట్టబండ, అట్టవబండ, అట్టుబండ. వి. అటక చెక్కకు బదులుగా వేసిన రాయి. **అటకమిద్ది** వి. మట్టికప్పు దాని కింద అటకలుఉన్న ఇల్లు.

**అటకబండ** చూ. అటక.

**అటకమామిడి**[1] వి. ఒకరకం మామిడి. అటక + మామిడి. జీడిమామిడి, నరమామిడి, ముంతమామిడి మొ. పదాల సామ్యంలో ఆకారాన్నిబట్టి ఈ పేరు వచ్చి వుండవచ్చు.

**అటకమామిడి**[2] రూ.చూ. అటిక మామిడి. వి. గల్జేరు జాతి కలుపు మొక్క.

**అటకమిద్ది** చూ. అటక.

**అటకర్(వాళ్లు)** వి. దేవాంగులు, నేతపనివారిలో ఒక తెగ.

క. పటెగాఱ, హట్టెగాఱ. పట్టు నేతగాడు;

సం. పటుకార. నేతపనివాడు, ముచ్చివాడు. హిం. పట్ కార్. పై.

< క. హట్టిగార.

**అటకలి** వి. జిడ్డుపోవటానికి రుద్దుకునే, ఉడకబెట్టిన పిండివంటి పదార్థం ; ఉత్సాదనం. ప్రబంధ. 572, యయా. 4.89.

క. అడ, అడి, అడు. వంట ; అడికె, అడకె, అడిగె, అడుగె. వంట మొ. ; తు. అడుపుని. వండు; అడి. వండిన, తయారు చేయబడిన ; అడిగుళు. వంటవారు ; కొడ. అడిగెకరె. వంటవారు; అడిగెకరతి. వంటకత్తె ; త. అటు. ఉడకబెట్టు, వేచు; అటు. వంట; అటుప్పు. పొయ్యి; కళి. పిండితోకాచిన జావ, పిండివంట, కుడుపుకుకట్టే ఉడక బెట్టిన పిండి ; మ. అటుక. వండు ; అటుక్కళ. వంట యిల్లు ; అటుప్పు. పొయ్యి ; గోం. అట్టానా. ఉడకబెట్టటం ; అటన, అటానా. వండు ; అటా్క. వంటకుండ; కుఇ. అటు. కాచు, మరగబెట్టు ;

పో.చూ. సం. అట్ట. ఎండిన, ఎండు ; ప్రా. అట్టై. ఎండటం ; మరా. ఆట్ణే. ఆరబెట్టు.

**అటకావు** రూ.చూ. అటకావ.

**అటకాయించు** చూ. అటకావు. స.క్రి. నిరోధించు. అడ్డగించు.

క. అటుకాయిసు. ఆపు, అడ్డగించు ; తు. అటకాయిసుని. పై. అటకా-యి-ఇంచు.

**అటకావు** రూ. అటకావ, అట్కావు. వి. ఆటంకం. అడ్డు. మెకంజీ నం. 268. వెంపల్లె 6 వ.

నే. అట్కో, అడ్కో. అడ్డు, ఆపు మొ. ; బెం. అటుక్. అడ్డు ; హిం. అటుకానా; పం. అటుక్నా. ఆపబడటం; గు. అటుకవ. నిరోధం, ప్రతిఘటన ; మరా. అట్. అట్కావ్. అడ్డంకి ; ఒ. అట్కాఇ. ఆటంకం, అడ్డు ;

క. అటుకావు; తు. అటుక, అటుకావు; పో.చూ. మ. అటుక్కావ్. ఆశ్రయం; ద్రా. అడ్, హడ్. ఆశ్రయం పొందిన.

<మరా. అట్కావ్.

**అటగొబ్బు** రూ.చూ. ఆటగొబ్బు. వి. మూడు కర్రలుగల గొర్రు.

**అటతాళము** వి. సంగీతంలో తాళభేదం, పద్నాలుగు అక్షరాల కాలంగల తాళం. (ఆం.వా., సూ.ని. దీన్ని సంస్కృత సమానంగా గ్రహించాయి.)

క. అటు. చలనం, నటనం మొ.; త. అటుతాళమ్. తాళభేదం. బహుశః <అట-తాళము.

**అటమ** వి. భయం, ఆంతక. ఆం.భా. 1.133.

సం. హఠ-. హింస, దౌర్జన్యం.

<సం. హఠ-. అర్థ విపరిణామం.

**అటమట** రూ. అటమటము. వి. 1. దుఃఖం, బాధ, యయా. 3.124 ; 2. మోసం, వంచన, మాయ. శశా. 3.78 ; 3. అపలాపం, మోసపుమాట. ఆం.భా. 1.116 ; 4. వ్యర్థం ; 5. అబద్ధం.

క. అటు. నటన ; అటుమటు, అటుమటె, వంచన ; తు. అటుమటు. పై ; త. అటలై. కష్టం, బాధ, యుద్ధం ; అటలై మటలై. గర్వోక్తులు ; అటు. బాధించు.

సం. హఠమ్. మొండిపట్టు, పగ, కీడు, క్రౌర్యం ; ప్రా. అట్టమట్ట-. దుశ్చింత, పాపం ; పో.చూ. నే. అటుమట్టు. విణ. కఠినమైన, (చెప్పులు మొ. తడిసి ఎండి) బిర్రబిగిసిన. మోసంవల్ల కలిగిన మానసిక సంక్షోభానికి ధ్వన్యనుకరణ.

**అటమటకత్తె** వి. మోసకత్తె. వంచకురాలు, ద్వి.శ.సా. 3.103 వ. **అటమటకాఁడు** మోసగాడు. ద్వి.పారిజా. 2.646. **అటమటఁజెందు** (-చెందు) అ.క్రి. కలతజెందు, దుఃఖపడు. రసిక. 5.33. **అటమటపడు** (-పడు) అ.క్రి. విచారించు, దుఃఖించు. ప. నారదా. 8. **అటమటించు** స.క్రి. 1. మించు, తిరస్కరించు. మను. 5.101 ; 2. దాచు, కప్పుపుచ్చు. వి.పు. 6.305 ; 3. మోసపుచ్చు. విజయ. 3.161 ; 4. బాధపడు. రాజ.వా. 2.70 ; 5. అపహరించు. శుక. 2.360. క. అటుమటిసు. మాయచేయు, మోసగించు. **అటమటింపు** చూ. అటమటించు. వి. 1. చలనం, వదలిక ; 2. మోసం, వంచన ; 3. దాచ, వ్యథ ; 4. దొంగతనం. **అటమటీఁడు** చూ. అటమటకాఁడు. వి. మోసగాడు. ఉ.హా. 3.112. కాశీ. 7.60.

**అటమటకత్తె** చూ. అటమట.

**అటమటకాఁడు** చూ. అటమట.

**అటమటఁజెందు** చూ. అటమట.

**అటమటము** రూ.చూ. అటమట. వి. 1. మోసం. కాశీ. 3.111. మను. 5.19 ; 2. వ్యర్థం. భాగ. 1.373. రామా. 6.65 ; 3. దుఃఖం, బాధ. సారంగ. చ. 2.258 ; 4. భగ్నం, చెడిపోయినది. సారంగ. చ. 3.105 ; 5. క్షుబ్ధం, కలతనొందినది.

**అటమటపడు** చూ. అటమట.

**అటమటించు** చూ. అటమట.

**అటమటింపు** చూ. అటమట.

**అటమటీఁడు** చూ. అటమట.

**అటమర** చూ. అటమట. వి. పారిపోవటం, పలాయనం ; విణ. వ్యర్థం.

త. అటలై ముటలై. గర్వోక్తులు.

**అటమరింపు** వి. పలాయనం.

**అటమరింపు** చూ. అటమర.

**అటమీఁద(న్)** చూ. అట(న్).

**అటముమ్న** చూ. అట(న్).

**అటమొన్న** చూ. అట(న్).

**అటావలియొల్లుండి** చూ. అటు.

**అటి** రూ.చూ. అట్టి[1]. విణ. అట్టి, అటువంటి. మను. 3.84. ప్రయోగాంతరం లేదని. శ.ర.

**అటిక** రూ. అటికె. అట్టిక[1]. వి. వెడల్పు మూతిగల చిన్నకుండ. కుండ, దాక. రాజవా. 2.128.

క. అడు. వండు; అడిగె. వంట, విందు ; తు. అళియ, అరియ. వెడల్పు మూతిగల చిన్నకుండ : పో.చూ.త. అటు. వండు ; గోం. అట్గా. వంటకుండ.

*అట్ (వండు) + ఇక.

**అటికమామిడి** రూ. అటకమామిడి[2]. అటుకుమామిడి, అటికమాడు, అటికెమామిడి. వి. గలేరుజాతి కలుపుమొక్క, మండలచ్ఛదం ; (Boerhavia diffusa, Linn.). హంస. 4.10.

**అటికె** రూ.చూ. అటిక. వి. దిష్టికుండ.

**అటికెబుర్ర** వి. చిన్నమట్టిపాత్ర.

**అటికెబుర్ర** చూ. అటికె.

**అటికెమారు** రూ.చూ. అటికమామిడి.

**అటికెమామిడి** రూ.చూ. అటికమామిడి.

**అటు** రూ.చూ. అట్టు[3]. క్రి.విశ. 1. ఆప్రకారంగా. భార.శాంతి. 5.163 ; 2. ఆ వైపుగా, ఉ.రా. 6.65, విజయ. 2.202 ; విశ. తచ్ఛబ్దార్థకం.

**అటావలియెల్లుండి** క్రి.విశ. ఆవలిఎల్లుండికి తర్వాతి దినం, నేటి తర్వాత నాలుగో రోజు. **అటుగనుక** (-కనుక). సము. అందుచేత, కాబట్టి. కిరా. 1.78. **అటుగాన** (-కాన). సము. అందుచేత, కాబట్టి. **అటుగావున**(-కావున). సము. అందుచేత, కాబట్టి భార.శాంతి. 3.453. **అటుండు** అ.క్రి. ఇలాగేఉండు, నిరర్థకంగా ఉండు, ఆదరం పొందకుండా ఉండు. కళా. 4.130 **అటుమొన్న** రూ. అటమొన్న. క్రి.విశ. మొన్నటికి పూర్వపు దినం. కుప.చ. 2.80. **అటులు** రూ.చూ. అట్టు[2]. క్రి.విశ. ఆప్రకారం. నిర్వ. 8.71, భార.విరా. 1.252. **అటువంటి** విశ. అట్టి, తాదృశం. వి.పు. 7.371. **అటువలె** క్రి.విశ. 1. వలె. సారంగ.చ.3.128; 2. అట్లు, ఆవిధంగా. శశా. 4.28. **అటువెట్టు** (-పెట్టు).స.క్రి. 1. విసర్జించు, నిరాకరించు, పాండు.3.81 ; 2. అవతలపెట్టు. జాహ్న. 1.131. **అట్ల** రూ.చూ. అట్లా. క్రి.విశ. ఆవిధంగా. భా.రా.అయో. 39, సారంగ. చ. 3.135. **అట్లా** రూ. అట్ల. క్రి.విశ. ఆవిధంగా. **అట్లాగు** క్రి.విశ. ఆవిధంగా. **అట్లు**[2] రూ.చూ. అట్టు[2]. క్రి.విశ. 1. ఆప్రకారంగా. భార.ఉద్యో. 4.155 ; 2. వలె. నిర్వ. 8.71. భార.శాంతి. 1.103, శృం.నై. 1.20 ; 3. అర్థవిశేషం లేకుండానేదీనిపై 'కైవడి,' 'పోలె' మొ. వాటి ప్రయోగం. భార. ఆది. 3.127.

**అటుక** రూ.చూ. అట్టుక. వి. అటక. హంస. 3.94.

**అటుకు** రూ.చూ. అట్టుక. వి. 1. అటక ; 2. అటకమిద్దె.

**అటుకుమామిడి** రూ.చూ. అటికమామిడి.

**అటుకులబద్దు** వి. గరిగుమ్మడి, లోలుగతీగ, షవ్వపెర్రగుమ్మడి (Visit tomentosa, Heyne).

**అటుకులు** రూ.చూ. అడుకులు. వి.బ.వ. నానబోసి వేచి దంచిన వడ్లు, భక్ష్యవిశేషం. పృథుకాలు. దశ. 8.426.

**అటుకువల** వి. పెద్దచేపల్ని పట్టే వల.

**అటుకొయ్య** రూ అటుకోయ ; చూ. తెల్లచందన. వి. ఇరగవలలో పడేచేప, సందవ, అటుకుల సందవ (Stromateus sinensis).

**అటుకోయ** రూ.చూ. అటుకొయ్య.

**అటుకోలకఱ్ఱ** చూ. ఆటకోల. వి. పావుచెక్క తొక్కినప్పుడు అచ్చుకఱ్ఱను కిందికిలాగే కఱ్ఱ.

**అటుకోలసుది** చూ. ఆటకోల (?). వి. మగ్గంలో పూనుగఱ్ఱకు కట్టినదారం.

**అటుగనుక** చూ. అటు.

**అటుగాన** చూ. అటు.

**అటుగావున** చూ. అటు.

**అటుజాతి** చూ. అటు. వి. దుష్టజాతి.

<అటు. దూరంగా ఉంచబడిన (జాతి).

**అటుండు** చూ. అటు.

**అటుమొన్న** చూ. అటు.

**అటులు** చూ. అటు.

**అటువంటి** చూ. అటు.

**అటువబండ** వి. దర్వాజా ఉత్తరానిమీద పరిచేబండ.

**అటువలె** చూ. అటు.

**అటువెట్టు** చూ. అటు.

**అటె** రూ.చూ. అట్టె[1]. అవ్య. 1. వృత్తాంత కథనానికి. భార. ఆది. 5.9 ; 2. ఆక్షేపానికి. భా.రా. బాల. 601 ; 3. ఉత్కర్షకు. భా.రా. అయో. 39 ; 4. ఆశ్చర్యానికి. భార.విరా. 5.216.

**అటే** అవ్య. స్త్రీ సంబోధనలో పద, వాక్యాలకు చివర ఉపయోగించే ప్రత్యయం. పోయినాడటే.

<అట+ఏ. ఇక్కడ 'ఏ' స్త్రీ సంబోధన ; పో.చూ. పోయినాడటరా.

**అటేరన్** వి. పడికిన నూలు చిలపలుగాచుట్టే కొయ్య పనిముట్టు. హిం. అటేరన్ ; గు. అటేరవుమ్.

<హిం. అటేరన్.

**అటొ** రూ.చూ. అటో ; అట+ఒ.

**అటో** రూ. అటొ ; చూ. అట్టె. అవ్య. ఆశ్చర్యార్థకం.

**అట్కారి** చూ. అటకర్‌వాళ్లు. వి. తమిళనాడులోని పట్టునేత గాండ్రులో ఒక తెగ.

<క. హట్టిగార.

**అట్కావు** రూ.చూ. అటకావు. వి. ఆటంకం. మెకంజీ సం.93, విశ్వనాథ నాయకుని చరిత్రం. 17 పు.

**అట్ట**[1] వి. కబంధం, మొండెం, భార. కర్ణ. 3.371.

క. అట్టె. మొండెం ; అఱు. వేరు చేయబడు, తెంచివేయబడు ; అట్టె. వేరుచేయబడినది, నరకివేయబడినది. తు. అట్టె. అస్థిపంజరం, చట్రం ; త. అట్టై-యే-అటల్. నరకివేయబడిన వీరుని మొండెం చేసే వీరకృత్యాలు : మ. అఱు. వేరుచేయబడు, తెంచివేయబడు.

<క. అట్టె[1].

**అట్ట**[2] రూ. అట్టియ. వి. 1. గుంపు. సిం.ద్వా. 6.89,90 ; 2. భాగం, విభాగం. సిం.ద్వా. 6.92 ; 3. ఒకదానికొకటి అంటుకొని దళసరిగా ఏర్పడ్డ కాగితం మొ. ; 4. చెప్పుల కిందభాగాన ఉండే తోలుముక్క ; 5. సందులేకుండా లేచిన పుండ్లు, చెమటకాయలు.

క. అట్టు. కలియు, అతుకు ; అట్టె. చెప్పుకిందభాగం. చెట్టుబెరడు, తోలు ; తు. అట్టె ; కొడ. అట్టె. చెట్టుబెరడు ; త. అట్టయి. చెప్పుకిందిభాగం, దళసరి అట్ట, పుస్తకంఅట్ట ; అట్టు. కలియు, అతుకు, అంటు, సమీపించు.

<అట్టు. కలియు.

**అట్టకట్టు** అ.క్రి. అట్టగా ఏర్పడు. పి. శకు. 3.176. **అట్టపొట్ట** వి. స్థూలకాయం, గూనకడుపు. **అట్టలమోపు**

వి. తోర్లమూట.

**అట్ట³** వి. వడిసెలలో రాయి పెట్టేచోటు.

**అట్టకట్టు** చూ. అట్ట².

**అట్టకీలు** చూ. అర్ధము. వి. మడతబందు.

క. అడె. మూయబదు ; త. అటి. మూయు ; మ. అట. తాళం ; అటెక్క. మూయు, అర్దు ; అట్టం. అర్దు ; కోట. అడ్ల్. మూయు ; తొద. అడ్ఫ్ (అడ్). మూయు.

**అట్టచెమ్మ** రూ. అట్టనమ్మ, అట్టాచెమ్మ, అష్టాచెమ్మ. వి. నాలుగు గవ్వలతో ఆడేఆట ; నాలుగు గవ్వలూ బోర్లాపడితే ఎనిమిదిగాను, వెలికిలా పడితే నాలుగుగాను లెక్క.

సం. అష్ట-. ఎనిమిది ; ప్రా. అట్ఠసమైఅ. ఎనిమిదిచే పరిమితం.

<సం. అష్ట+చెమ్మ. 8,4 పందేల ఆట ; బహుశః చెమ్మ<చతుర్+వార.

**అట్టడి¹** రూ. అట్టిడ³, అట్టిడి ; పో.చూ. అట్టుక. అట్టము. వి. 1. బురుజుపై యిల్లు. భా.రా. సుంద. 15, ఉ.హ. 2.92 ; 2. అటక ; 3. చప్పిడి. చప్టా.

సం. అట్టల-, అట్టాల-, కావలి బురుజు ; అట్ట, అట్టకః. పై ; ప్రా. అట్ట, అట్టో. మేడపైగది ; అమా. అట్టాలగ. చిన్న గోపురం ; పో.చూ. అటుక ; పా. అట్టాల. కావలి బురుజు ; నే. అట్టాలి. మేడపై ముందరి వసారా ; హిం. అటా. పైగది ; మరా. అటాళీ. చప్పరం ; సింహ. అటులు. కావలి బురుజు.

క. అట్టణ, అట్టణె, అట్టళె, అట్టోళి, అట్లు<అట్టాల. మేడపైగది, పరువంజా ; తు. అట్టళిగె, అట్టాళిగె. అటుక ; అట్ట. పైగది, ఇంటికప్పు ; త. అటుక్కు. దొంతర, శ్రేణి ; అట్టాలై. మేడపైగది, కావలిబురుజు, మంచె, గొర్రెలదొడ్డి, గ్రామం ; అట్టాలమ్. పై ; అట్టాణి. కావలి బురుజు ; పో.చూ. మ. అటుక్కుల్.

<సం. అట్టల-.

**అట్టడి²** వి. అక్కడి.

**అట్టడి³** రూ.చూ. అట్టవ.

**అట్టడిబుర్ర** వి. అక్కడికట్టె.

**అట్టదుగు** వి. నేల చదునుచేసే పని, సున్నబరిచేపని.

**అట్టపొట్ట** చూ. అట్ట².

**అట్టబంద** రూ.చూ. అటకబంద.

**అట్టము¹** వి. బురుజుపై యిల్లు ; చూ. అట్టడి.

**అట్టము²** చూ. అద¹. వి. అతిశయం, ఆధిక్యం.

క. అడ్డ. అధికం ; అట్టుళి. గుంపు ; తు. అట్టి. కుప్ప, ప్రోగు ; త. అటి. ప్రోగుచేయు, సన్నిహితమగు ; మ. అట-మఴ. ఎడతెగని వాన ; తొ. ఒడ్యక్. తరచు.

**అట్టము³** రూ.చూ. అష్టము. వి. ఎనిమిది పన్నాలుగల వేద భాగం, వేదకాండం.

**అట్టలతద్ది** చూ. అట్లు¹.

**అట్టలమోపు** చూ. అట్ట².

**అట్టవ** రూ. అట్టడి³, అట్టాము. వి. 1. బండిమీద పేర్చిన తుమ్మ, రేగు మొ. కంపమోపు : 2. పందిరి : 3. అటుక.

**అట్టవబంద** రూ.చూ. అటకబంద. వి. అటకబంద.

**అట్టవడ్డె** వి. కవిలె, లెక్క పుస్తకం.

మరా. అడవణ, అడవణె. క్షిప్తించుంచుకొను ; వి. కవిలె ;

క. అడ్డవణె, అడవణె. కాగితం. త. అట్టవట్టె కవిలె.

<త. అట్టవడ్డె.

**అట్టవబంద** చూ. అట్టవ.

**అట్టవమ్మ** రూ.చూ. అట్టచెమ్మ.

**అట్టహాసము** వి. ఆడంబరం, ఆడంబరం.

సం. అట్ట-. అవ్య. పెద్దగా ; అట్టహాసిత. పెద్దనవ్వు నటించు: అట్టహాస్య. పై: అట్టాట్టహాస్య. మరీ పెద్దనవ్వు.

<సం. అట్టహాస. అర్థవిపరి.

**అట్టహాసముకాఁడు** వి. ఆడంబరపు మనిషి.

**అట్టహాసముకాఁడు** చూ. అట్టహాసము.

**అట్టాచెమ్మ** రూ.చూ. అట్టచెమ్మ.

**అట్టామ** రూ.చూ. అట్టవ. వి. బండిమీద అమర్చిన కంప మోపు.

**అట్టార** వి. పూరిల్లు.

<సం. అట్టాల-.

**అట్టి¹** అట్టు²+ఇ ; రూ. అటి. విశే. 1. తాదృశం, సదృశం. దార. సభా. 2.23 ; ఆశ్వ. 2.40 : 2. తచ్ఛబ్దార్థకం. ఆశ్వం. పై. 1.16.

**అట్టిఁడు** రూ. అట్టేఁడు. వి. అటువంటివాడు. దార. ఆది. 4.17. **అట్టిరు** వి.బ.వ. అటువంటివారు; ఏ.వ. అట్టిఁడు. దార. ఆది. 2.219. **అట్టివాఁడు** వి. అటువంటివాడు. ఆం. భా. 2.117. **అట్టేఁడు** రూ.చూ. అట్టిఁడు. వి. అటువంటివాడు. ఆం. భా. 2.117.

**అట్టి²** వి. చట్టి.

**అట్టిక¹** రూ.చూ. అటిక. వి. మట్టికుండ, దాక. పాండు. 4.176.

**అట్టిక²** రూ.చూ. అట్టుక. వి. చిన్న మేడ. ఆం.భా. 2.17.

**అట్టిగుది** వి. సరిగుంజల అర్ధపట్టెకు వేసిన దారు.

**అట్టిటు** చూ. అట్టు².

**అట్టిటుపడు** రూ.చూ. అట్టిట్టుపడు. అ. క్రి. 1. క్షోభించు, కలతచెందు. సారంగ. చ. 3.223; 2. వ్యత్యస్తమగు, తారుమారగు. పద్మ. 7.22. **అట్టిటుసేయు** (-చేయు). స.క్రి. క్షోభపెట్టు, కలచు. కళా. 1.25.

**అట్టిటుపడు** చూ. అట్టిటు.

**అట్టిటుసేయు** చూ. అట్టిటు.

**అట్టిట్టగు** చూ. అట్టిట్టు.

**అట్టిట్టు** చూ. అట్టు².

**అట్టిట్టగు** అ.క్రి. కలతచెందు, క్షోభించు (అట్టు+ఇట్టు+అగు). నిరం. 4.41. **అట్టిట్టుగా(న్)** అవ్య. తారుమారుగా, దశా. 9.166. **అట్టిట్టుగానుండు** చూ. అట్టిట్టుగా. అ.క్రి.

దావు(బరుకుల మధ్య నుండు. **అట్టిట్టువడు** రూ. అట్టిటుపడు. అ.క్రి. 1. వ్యత్యస్తమగు. పద్మ. 7.22; 2. క్షోభించు.

**అట్టిట్టుగా(న్)** చూ. అట్టిట్టు.

**అట్టిట్టుగామందు** చూ. అట్టిట్టు.

**అట్టిట్టువడు** చూ. అట్టిట్టు.

**అట్టి(డు** చూ. అట్టి[1].

**అట్టితలుపు** వి. అడ్డకమ్ముల తలుపు.

క. అట్టి, పట్టి, హట్టి. కమ్మి, బద్ద, ముక్క, పిలిక; మరా. పట్టీ. పై.

<క. అట్టి + తలుపు.

**అట్టియ** రూ.చూ. అట్ట[3]. వి. గుంపు. నీలా. 2.86.

**అట్టిరు** చూ. అట్టి[1].

**అట్టివా(డు** చూ. అట్టి[1].

**అట్టీ(డు** చూ. అట్టి[1].

**అట్టు**[1] వి. భక్ష్యవిశేషం. ఆము. 2.60.

క. అట్టు, అడు. వండు; అడె. అట్టు; తు. అడ్యె. రొట్టె; త. అడై. పలచని రొట్టె; తడై. చదును; తట్టు. రొట్టెగా ఒత్తు; మ. అట. రొట్టె; అట్టు. కాల్చి చేసినది కావచ్చు; గోం. అట్టానా. వండు; కుఇ. అను. వేడిచేయు, కాచు; కొంద. ఆయ్క;

పో.చూ. (ప్రా. అట్టై. ఎండు; మరా. అట్ ణె. అరబెట్టు.

**అట్లు**[1] వి. బ.వ. తద్దె నోము నివేదనకై చేసే దోసెవంటి అట్లు.

**అట్టు**[2] రూ. అటు, అటులు, అట్టులు, అట్లు[2]. క్రి.విశ. 1. ఆవైపు. విక్ర. 6.122; 2. ప్రకారం. విధం. హంస. 2.127; 3. ఆ ప్రకారంగా, ఆ విధంగా.

క. అటు, అటు, అష్టు, అస, అసు. అంత; ఈసు. ఇంత; త. అట్టు. అటువంటి.

బహుశః <అట్టు/అష్టు. అస్, ఈస్, ఏస్, ఇట్ (టు). అట్(టు), ఎర్(రు) - లు ధాతు రూపాలై వుండ వచ్చు.

**అట్టిటు** రూ.చూ. అట్టిట్టు. క్రి. విశ. 1. వ్యత్యస్తంగా, తార్మారుగా. కళా. 2.17; 2. రెండువైపులా, ఆవైపు ఈవైపు. రా. ఇందు. 2.62. **అట్టిట్టు** రూ. అట్టిటు. క్రి. విశ. 1. వ్యత్యస్తంగా, తార్మారుగా. దశా. 9.169; 2. రెండువైపులా. **అట్టులు** రూ. అట్టు[2]. క్రి. విశ. అటులు, ఆవిధంగా. భార.శాంతి. 4.185. **అట్టువోలె** (-పోలె). రూ. అట్లువోలె. క్రి.విశ. అదేవిధంగా. భార. శాంతి. 2.239.

**అట్టుక** రూ. అటక, అటుక, అటుకు, అట్టిక[2], అట్టుగ, అట్టువ; పో.చూ. అదుకు[1]. వి. అటుక. శుక. 3.215, హంస. 3.91.

సం. అట్టికః. అటుక; అట్ట-. అవ్య. ఉన్నతంగా; ప్రా. అట్టం, అట్టో. దుకాణం, అటుక; అ.మా. అట్టాలగ, అట్టాలగయ. ఆయుధాగారం; పా. అట్ట. కావలి బురుజు; నే. అటాలి. వసారా, చదునైన కప్పు; హిం. అటాల్. దొంతి; అట. ఇటుక; పం అటాలా. ప్రోగు; గు. అటారీ. వసారా; మరా. అటాళీ. చప్పరం; అటాలా. మంచె; సిం. అటువ. బియ్యపుకుప్ప; ఉ. అటా. అటుక, వసారా;

క. అట్ట. అటుక; తు. అట్ట. పై; త. అటుక్కు. దొంతి, వరుస; అట్టం. డాబాపైకప్పు. పై అంతస్తు; మ. అట్టమ్. అటుక; కోట. అట్ త్. అటుక; తొద. ఒటుమ్. కప్పువాసాలకు రాళ్లతో కట్టిన అటుక; గో. అట్టె. అడ్డదూలాలు; పర్జి. అటు. అటుక; అట్ట. ఇంటికప్పుకింద బొంగుతో బద్దతో వేసిన చట్రం; కురు. అట్టా. పరువంజా, అటుక.

<సం. అట్టక/అట్ట.

మూ.ద్రా. *అట్-. సంస్కృతంలో ప్రమేయం లేకుండా వివిధ రూపసాధనకు వినియోగించే మూలధాతువు.

**అట్టుగ** రూ.చూ. అట్టుక. వి. అటక. కేయూ. 3.239.

**అట్టుపుట్టానవాళ్లు** వి. పుట్టుక మొదలుకొని చెప్పే గుర్తులు, పుట్టుపూర్వోత్తరాలు. (వా.)

క. అట్టు. చుట్టరికం.

అట్టు + పుట్టు + ఆనవాళ్లు. చుట్టరికం పుట్టుక గుర్తులు అట్టు = అంటు, చుట్టరికం.

**అట్టుప్పు** వి. ఒక దినుసు ఉప్పు, వంటఉప్పు, పాక్యం. చూ. అట్టు[1].

క. అట్టుప్పు. సముద్రపు నీటి నెండబెట్టి చేసిన ఉప్పు; అటు, అట్. ఎండు; త. అట్టుప్పు. పై; అటు. ఉడుకు.

<అట్టు + ఉప్పు. ఎండిన ఉప్పు.

**అట్టుబండ** రూ.చూ. అటకబండ. వి. అటకబండ.

**అట్టులు** చూ. అట్టు[2].

**అట్టువ** రూ.చూ. అట్టుక. వి. 1. అటుక. సిం.ద్వా. 11.43; 2. నాటకరంగం.

**అట్టువోలె** చూ. అట్టు[2].

**అట్టె**[1] అట్టు[2] + ఎ; రూ. అటె. ప్రత్య. 1. వృత్తాంత కథనానికి. భార.ఆది. 6.306; 2. ప్రశ్నకు. భార.ఆది. 7.40; 3. ఆక్షేపానికి. భార.సభా. 2.39; 4. పరిహాసానికి. భార. అర. 2.52; 5. ఉత్కర్షకు. భా.రా.అయో. 39; 6. ఆశ్చర్యానికి. కు.సం. 5.576.

**అట్టె**[2] రూ.చూ. అట్టే. అవ్య. 1. తదేకదృష్టిగా, అదేపనిగా. శుక. 2.172; 2. వెంటనే, శీఘ్రంగా. దశా. 2.362. 3. అక్కడ, పక్క; అట్టెపెట్టు, అట్టెఉంచు మొ. వ్యవ.

**అట్టెపెట్టు** రూ. అట్టేపెట్టు. స.క్రి. 1. విడుచు. ద్వి.హరిశ్చ. 4.2478; 2. ఉంచు, ప్రత్యేకించు. (వా.)

**అట్టె**[3] వి. కంకబద్ద; గూనపెంకును నునుపు చెయ్యటానికి కుమ్మర్లు వాడే పల్చటి కొయ్యముక్క.

క. కొరద. అట్టె. చెట్టుబెరడు; త. అట్టి. చెప్పు తోలు.

**అట్టెట్టులు** వి. పొరలు, దొంతరలు. ఒకదానిపై నొకటిగా పేర్చబడ్డవి.

**అట్టెడ**[1] వి. 1. నూతిలోని అడుగు మొ. పైకితీయటానికుపయోగించే చిల్లులతట్ట; 2. కళ్లంలో ఎగరబోసిన ధాన్యాన్ని జల్లించే జల్లెడ. త. అట్టు. నీరుపోసినట్టు పోయు, తేనెవలె ప్రవహించు.

**అట్టెర**[2] వి. వంతెన.

క. అట్టు. కలియు, కలయిక, త. అట్టు. కలియు, అతుకు.

**అట్టెర**[3] వి. ఆఢక పరిమాణం, 16 సేర్ల ధాన్యంపట్టే గోనె. ఆం.భా. 2.166. పో.చూ. సం. ఆఢక. ఒక కొలమానం.

కలిపివేయబడినది; ధాన్యం నింపి అంచులు కలిపి కుట్టటంవల్ల ఆ పేరు వచ్చియుండవచ్చు.

**అట్టెర**[4] పో. చూ. పట్టెర. వి. స్త్రీ కంఠాభరణం, పట్టెర. (వా.)

**అట్టెర**[5] రూ.చూ. అట్టడి[1]. వి. కోటలో ఒక భాగం. పట్నా.

**అట్టెడి** రూ.చూ. అట్టడి[1]. వి. కోట కొత్తళంపై కట్టిన యిల్లు.

**అట్టెపెట్టు** చూ. అట్టె[2].

**అట్టెము** చూ. అంటు. వి. రాతి విగ్రహాలు కదలకుండా లక్క మొ. వాటితో వేసిన అతుకు.

క.త. అట్టు. అతుకు; తు. అంటుని; కొలా. అంట్; నా. అట్.

**అట్టెలగంట(లు)** వి. వరిచేలో పెరిగే కలుపుమొక్క.

క. అంటు. వ్యాపించు; *గంటిగ.* కలుపుమొక్క (Spermococa hispida).

**అట్టే** అట్టు[1]+ఏ; రూ. అట్టె[2]. క్రి.విశ. 1. ఉన్నదిఉన్నట్టుగా. కళా. 3.109; 2. అధికంగా.

**అట్టేపెట్టు** రూ. అట్టెపెట్టు. స.క్రి. 1. అధికంగా పెట్టు; 2. విడుచు, దిగవిడుచు, మిగుల్చు.

**అట్టేపెట్టు** చూ. అట్టే.

**అట్ఠము** రూ. అట్టము[3]. వి. ఎనిమిది పన్నాలుగల వేదభాగం. అష్టకం. ఆం.భా. 1.111.

సం. అష్టన్; ప్రా. జైమహా.శౌర. అప. అట్ఠ; అ.మా. అత్థ; పా. అట్ఠ, అట్ఠ; బెం. అట; ఒ. హిం. సిం. గు. మరా. ఉ. ఆఠ్; పం. అఠ్, అట్ఠహ;

క. అట, అట్టు, అడ; తు. అట్టి; త. అట్టమ్, అట్టకమ్; కుఇ. అటొ; కువి. ఆర; పర్జి. ఆట్;

లాటిన్. అక్టో.

<ప్రా. అట్ఠ-.

**అట్ఠాని** వి. మూటలు దించుకునే తిన్నె.

హిం. అడ్. ఆగు; ఠాన్. చోటు;

త. అట్టాలై. మంచె.

<*హిం. అడ్+ఠాని.

**అట్వ్యార** వి. వారం.

సం. అష్టావర్త; మహా. అఠవాడ; హిం. అఠోదియా; సిం. అఠిడో; గు. అఠవాదియుం (<సం. అష్టవార-); మరా. అఠ్వడా, ఆఠ్వడా.

<మరా. అఠ్వడా.

**అట్వ్యారలెక్క** వి. వారం వారం జమాఖర్చులు.

**అట్వ్యారలెక్క** చూ. అట్వ్యార.

**అట్నము** పో.చూ. అట్టడి[1]. వి. బురుజు.

**అటాన్లు** వి. ఒక రకం పప్పుదినుసు, బటానీలు (Pisum sativurm).

క. పుటాణి. వేపిన బటానీలు:

గు. వటాణా; మరా. పుటాణా, బాటాణా.

పటాన్లు అని అసంకరపద మంచల వ్యవహారం.

**అట్ల** చూ. అటు.

**అట్లకాడ** చూ. అట్లు[1].

**అట్లతద్ది** చూ. అట్లు[1].

**అట్లతద్దె** చూ. అట్లు[1].

**అట్లనోము** చూ. అట్లు[1].

**అట్లపంక్తి** చూ. అట్లు[1].

**అట్లపండుగ** చూ. అట్లు[1].

**అట్లా** చూ. అటు.

**అట్లాగు** చూ. అటు.

**అట్లు**[1] వి. బ.వ. భక్ష్య విశేషం. చూ. అట్టు[1].

**అట్టలతద్ది** రూ.చూ. అట్లతద్దె. వి. అట్లుపోసే పండుగ, ఆడవాళ్ల పండుగ. **అట్లకాడ** వి. అట్లు వేసేందుకు ఉపయోగించే కాడ. **అట్లతద్ది** రూ.చూ. అట్లతద్దె. **అట్లతద్దె** రూ. అట్లతద్ది. ఆశ్వయుజ బహుళ తదియ; భర్త చిరాయువు కావాలని బాలికలు అట్లు పోసుకొని మహాలక్ష్మీవ్రతం చేసుకొనే తదియ. **అట్లనోము** వి. అట్లతద్దెనోము. **అట్లపంక్తి** వి. అట్లతద్దెనాడు అట్లు తినటానికి కూర్చున్న ముత్తైదువల వరుస. **అట్లపండుగ** వి. అట్లతద్దె. **అట్లుడుకు** అ.క్రి. కలతచెందు, అట్టులాగా ఉడికిపోవు.

**అట్లు**[2] రూ.చూ. అట్టు[2].

**అట్లుపోలె** రూ. అట్టుపోలె. క్రి.విశ. అదే విధంగా.

**అట్లుడుకు** చూ. అట్లు[1].

**అట్లుపోలె** చూ. అట్లు[2].

**అట్లొట్లు** రూ.చూ. నట్లొట్లు. వి. పంగుళ్లు; వాన వెలిసిన తర్వాత చూరునుండి కారే నీటిబొట్లు. ఆం.భా. 1.82.

<నట్లొట్లు. నకారలోపం.

**అఠాత్తుగా** రూ. హఠాత్తుగా. క్రి.విశ. ఆకస్మికంగా, ఉన్నట్లుండి.

సం. హఠాత్. బలాత్కారంగా; హఠ- హింస. బలాత్కారం.

<సం. హఠాత్. అర్థవిపరి.

**అఠార** పో.చూ. అట్టాల. వి. నేత బయలులో మరమగ్గం చట్రం నిలబెట్టటానికి నిలుపు రాటలకు అడ్డంగా మంచెమాదిరి బిగించిన కర్రలు.

**అఠావడీబంట్రోతు** వి. రివెన్యూ బంట్రోతు.

<త. అట్టవణై+బంట్రోతు: అర్థవిపరి.

**అడ**[1] వి. 1. ముద్ద. యయా. 2.83; 2. ఆకృతి. మను. 3; 3. చింతపండు మొ. తొక్కి చేసిన ఉండ; 4. రేగువళ్లు మొ. ఉప్పులో ఊరబెట్టి మినప పిండితో కలిపి చేసి ఎండబెట్టిన రొట్టె; 5. పైరు కోసి వేసిన కుప్ప.

క. అడె. ముద్ద; అట్టు. పెట్టు; తు. అట్టి; దొంతి; త. అడై. ప్రోగుచేయు, సన్నిహితమగు, గట్టిపడు; మ. అటుక్కు. వరుస, దొంతి; అటుక్కుక. పేర్చు

కుఇ. ఆడ్. కలిసియుండు, సాయపడు.

మూ.ద్రా. *అట్. కలియు.

**అడకట్టు** స.క్రి. 1. తీసికొను ; 2. ముద్దకట్టు. క. అడె గట్టు. ముద్దకట్టు, ముద్దచేయు. **అడగొను** అ.క్రి. ముద్దకట్టు. ప.నం. 11.150. **అడచేయు** స.క్రి. ముద్దచేయు. **అడపర(ఱ)** అడ[1]-పర. వి. ముద్ద. **అడమర** అడ[1]-మర ; చూ. అడపర. వి. ముద్ద.

**అడ[2]** వి. పోకచెక్క.

క. అడ, అడకె, అడికె. పోక ; తు. అడ్డ-కత్తెరి, ఐడ-కత్తెరి. అడకొత్తు, పోకచెక్కలు కత్తిరించే కత్తెర ; త. అడైక్కాయ్. పోక. ఆకు వక్క ; మ. అటుక్క, అడెక్క ; కోట. అర్క్‌య్ ; తొ. అడ్క్‌య్.

<త. అడై. గుత్తియగు, కలియు. పోకకాయలు గుత్తులు గుత్తులుగా ఉంటాయి.

**అడకత్తి** రూ.చూ. అడకొత్తు. వి. పోకలను ముక్కలుచేసే కత్తెరలాటి సాధనం. **అడకత్తు** రూ.చూ. అడకొత్తు. **అడకత్తెర** రూ.చూ. అడకొత్తు. క. అడగత్తి ; తు. అడ్డకత్తెరి, ఐడ-కత్తెరి. మరా. అడకిత్తా. **అడకొత్తు** రూ. అడకత్తి, అడకత్తు ; పో.చూ. అకొత్తు. వి. అడకత్తెర. సారంగ. చ. 2.167. క. అడకొత్తు, అడకోతు ; మరా. అడకితా, అడకిత్తా <అడక + ఒత్తు లేక అడ + కొత్తు ; పో.చూ. త.క. కొత్తు. నరకు, ముక్కలుగా నరకు. **అడగొంటు** పో.చూ. గొంటు వక్క. వి. మొద్దు పోకచెక్క. శుక. 3.22. క. గోటాడికె ; తు. కొట్టాయి, గోటుకాయి. గొంటు కాయి. మొద్దు పోకచెక్క ; పో.చూ. త. కొట్టైప్పాక్కు. పచ్చి పోకచెక్క.

**అడ[3]** రూ. అడి[1]. వి. 1. నేతలో అంచు వెయ్యటానికి చక్కటి నూలితో అమర్చబడ్డ పనిముట్టు ; 2. మగ్గానికి అమర్చిన కొయ్యనుంచి కిందికి వేలగట్టిన లావపాటి దారాలు ; 3. డాబీ మగ్గంమీద పేటు అడకట్టి నేసిన డిజైను.

క. అడె. ఎత్తుకొయ్య ; వడ్రంగులు మొ.వారు తాము చెక్కే కొయ్యకింద ఆధారంగా పెట్టుకొనే కొయ్య ; త. అడు. కలియు, నొక్కు ; అడై. కలయిక.

**అడచెక్క** వి. డిజైను వేసుకోటానికి నూలుచుట్టే కొయ్య పనిముట్టు. **అడకాడు** వి. 1. నేతలో డిజైన్లు పడటానికి డాబీ అడనుంచి రెండు పాయలుగా విడదీసి, అంచు పడుగులోకి వేలాడదీసిన దారం ; 2. మగ్గానికి బిగించిన పడుగులో దూర్చిన పెద్ద లాకలు జారిపోకుండా అడ్డంగా కట్టిన దారం. **అడదొడ్డి** వి. దిండుకు బొడిపెలు చేసిన ఒక రకం డాబీ ; దిండు తిరిగినప్పుడు బొడిపెలు కోలలను లేపుతాయి. **అడనిచ్చెన** వి. పేటుదారాలు దూర్చి రెండు పాయలుగా విడదీసిన చిన్న పన్నె. **అడపన్నె** వి. అడనిచ్చెన. **అడబల్ల** వి. చేతి మగ్గంమీద డిజైన్లు నేసేటప్పుడు, అని తొక్కగా లేచిన పోగుల్ని నిలిపి వుంచటానికి పడుగులోగాని, అడ్డ బేలులోగాని దూర్చే చెక్క. **అడమగ్గం** వి. డిజైన్లు నెయ్యటానికి పేటు దారాలు కట్టిన ఒకరకం మగ్గం. **అడవడి** పేటు దారాలనుంచి అంచు పడుగులోకి వేలాడే వడి దారాలు. **అడవాల్లు** వి. మగ్గం రోసెకు దండెకు మధ్య నేత భాగం. **అడమాత్రాలు** మగ్గం డాబీనుంచి కిందికి వేలాడే లావు దారాలు, పేటు దారాలు.

**అడ[4]** రూ. ఎడ[0]. చూ. అట్టు[1]. వి. గ్రామదేవతలకు నైవేద్యం పెట్టే వంటకం.

క. అడి, అడె. వంట ; తు. అడిగె ; త. అటు. వై ; కుఇ. అటి. కాచు.

**అడకట్టు** చూ. అడ[1].

**అడకట్టె** చూ. అడ్డ[3]. వి. అడ్డపట్టె.

**అడకత్తి** చూ. అడ[2].

**అడకత్తు** చూ. అడ[2].

**అడకత్తెర** చూ. అడ[2].

**అడకము** (<అడఁగు). వి. లోపల ఇమిడి ఉన్నది. అంతర్భూతం.

క. అడక. నిలవ ఉంచటం ; కొడ. అడకి. పిడికిలియందు ఇమిడి ఉండు ; త. అటుక్కమ్. లోపలి వస్తువులు ; మ. అటుక్కమ్. ఇమిడి ఉండటం.

**అడకర** చూ. అడఁగు. వి. ఓప్పు, సహనం.

**అడకించు** చూ. అడకు.

**అడకు** రూ.చూ. అడఁచు. స.క్రి. దాచు. బసవ. 5.275.

క. అడగు, అడంగు, అడిగు, అణగు, అణుగు. దాచు ; తు. అడెంగుని, దెంగుని ; త. అటక్కు ; మ. అటుక్కుక. వై.

**అడకించు** రూ. అణకించు. అణఁగించు. స.క్రి. 1. మోసపుచ్చు. వంచించు. భాగ. 8.318, భోజ. 6.6 ; 2. అపహసించు, ఉల్లాసమాడు. మను. 4.84, ప్రబా. 3.135. క. అణకిసు, అణికిసు. అపహసించు.

**అడకొత్తు** చూ. అడ[2].

**అడకొయ్యలపీట** అడ[3] + కొయ్యలపీట ; చూ. అడ్డ[3]. వి. నిట్టాడిమీద వేసిన నాలుగు ముఖాలపీట.

**అడగాలి** (<వడగాలి ; వడ. ఉత్తరం). వి. ఉత్తరపుగాలి.

**అడగు** చూ. అడఁగు. వి. అపవాదం, నింద, రట్టు.

**అడగొంటు** చూ. అడ[2].

**అడగొను** చూ. అడ[1].

**అడగోలుగొను** పో.చూ. ఒడగోలుగొను. అ.క్రి. అపహరించు. హరి. ఉ. 6.16. అడగోలు + కొను. మొత్తంగా ఎత్తుకుపోవు.

**అడంగల్** రూ.చూ. అడంగులు[1]. వి. గ్రామ సంబంధమైన మొదటి లెక్కలు.

**అడంగి** చూ. అడంగులు[2]. వి. పడవలో కూర్చునేందుకు వేసిన అడ్డుచెక్క.

**అడంగు** వి. 1. మొదటిచోటు, పుట్టినచోటు, నివాసం ; 2. గిట్టుబాటు ధర, అసలుధర ; విశే. తగులుబడియైన.

త. అటంకల్. నివాస స్థానం.

**అడంగువెల** వి. పట్టిన వెల, అసలు ఖరీదు, ఉయిసవెల. త. అటుక్కవిలై, అటుక్కమ్. గిట్టుబాటు ధర, అసలు వెల.

**అడంగులు**[1] రూ. అడంగల్. వి. గ్రామ సంబంధమైన ముఖ్యమైన లెక్కలుగల పుస్తకం.

త. అటుంకల్. గ్రామంలో పొలాలు, సాగు వివరాలు తెలిపే పుస్తకం; అటుంకు, ఇముడు.

త. అటుంకల్ + ఉ > *అడంగలు > అడంగులు[1].

(వా.ని. దీన్ని ఏ.వ. గా గ్రహించి, శ.ర. ను అనుసరించి, దీనికి హిందీ మూలాన్ని సూచించింది. అది సరికాదు.)

**అడంగు(లు)**[2] చూ. అడంగి. వి. 1. పడవ అడుగు అడ్డచెక్క; 2. కొనదోనెలో అడ్డంగా లోపలివైపు వేసిన కొయ్యలు, బొంగులు; 3. గొప్తుకానా దగ్గర పొడవుగా అడ్డంగా ఉండే కర్రలు.

**అడంగువెల** చూ. అడంగు.

**అడఁకువ** రూ. అణఁకువ, అణుఁకువ. చూ. అడఁగు. వి. 1. నమ్రత, అణగి వుండటం, గర్వంలేకుండా వుండటం. భార.ఉద్యో. 2.35; 2. వంగటం. పసు. 4.23.

క. అణకువె. నమ్రత; త. అటక్కమ్. ప్రశాంతత, నమ్రత, ఆత్మనిగ్రహం.

**అడఁగఁగట్టు** చూ. అడఁగు.

**అడఁగఁగొట్టు** చూ. అడఁగు.

**అడఁగఁద్రొక్కు** చూ. అడఁగు.

**అడఁగారు** చూ. అడఁగు.

**అడఁగించు** చూ. అడఁగు.

**అడఁగు** రూ. అణఁగు. అ.క్రి. 1. ఇముడు, అంతర్గతమగు. భార.ఆది. 6.165; 2. దాగు, మరుగుపడు. భార.ఉద్యో. 1.142; 3. నమ్రమగు, లొంగు, లోబడు. భార.ద్రోణ. 2.154; 4. నశించు, చెడు. భార.శల్య. 1.368; 5. నిరుద్ధమగు. భార.శాంతి. 5.319; 6. అదృశ్యమగు, మాయమగు. ఉ.హ. 6.5; 7. దిగబడు, కుంగు. కాశీ. 2.107.

క. అడగు, అడంగు. దాగు, తగ్గు, మాయమగు; తు. అడెంగుని, దెంగుని. దాగు; త. అటుంకు. లోబడు, కుంగు, నశించు, మాయమగు; మ. అటున్నుకు. అణచివేయబడు, లోబడు; కుఇ. అట్స, ఆట్స. దాగు; నా. ఢాస్. దాగు, మూయు; పో.చూ. ద్రా. అడ్. ఆశ్రయం.

మూ.ద్రా. *అట్. నిరుద్ధమగు.

**అడఁగఁగట్టు** (-కట్టు). స.క్రి. తగ్గించు. శుక. 2.154. **అడఁగఁగొట్టు**(-కొట్టు). స.క్రి. అణచు. **అడఁగఁద్రొక్కు**(-త్రొక్కు). స.క్రి. 1. ఓడించు. రామా. 7.70; 2. అణగునట్లు తొక్కు. దశా. 2.159. **అడఁగారు** రూ. అణఁగారు. అ.క్రి. 1. కుంగు, అడుగంటు; 2. అణగు, తగ్గు; 3. నశించు. **అడఁగించు** స.క్రి. 1. నశింపజేయు, పోగొట్టు. భార.భీష్మ. 1.52; 2. లోబరచు, తగ్గించు. క. అడగిసు. దాగునట్లు చేయు; ఆదంగిసు, అణఁగిసు. దాచు. అణచు. ఓడాడ్చు.

**అడఁగుబొడ్డు** వి. దేలుకాది, లోపలఁగణఁగిపంచెకట్లు గోచి అంచుల్లో గిరి ఏర్పడే బొడ్డు.

**అడఁగుబొడ్డు** చూ. అడఁగు.

**అడచిపడు** రూ.చూ. అడిచిపడు. అ.క్రి. గర్జించు, ఎగిరిపడు. కాశీ. 5.89.

**అడచెక్క** చూ. అడ[3].

**అడచేయు** చూ. అడ[1].

**అడజడి** రూ.చూ. అలజడి. వి. దుఃఖం.

**అడజడిపెట్టు** రూ.చూ. అలజడిపెట్టు. స.క్రి. దుఃఖపెట్టు. మార్క. 1.199.

**అడజడిపెట్టు** చూ. అడజడి.

**అడఁచు** 'అడఁగు' ప్రేర.; రూ. అణఁచు, అణుచు, అడచు, అడుచు[2]. స.క్రి. 1. నశింపజేయు, పోగొట్టు. భార.శాంతి. 1.140; 2. దాచు. భార.ఆశ్ర. 1.152; 3. కుదుము (కొప్పులో పెట్టుకొను). ఉ.హ. 5.56; 4. కుంగజేయు. కాశీ. 2.107; 5. లొంగదీయు. కాశీ. 6.9.

క. అడచు, అణచు, ఆణకు. లొంగదీయు; త. అటైచ్చు. పెట్టు, ఉంచు, కుదుము. మూయు; అటై. పై; మ. అటెక్కుక. మూసివేయు; కొండ. అట్. అణచు.

**అడకాడు** చూ. అడ[3].

**అడతి** రూ.చూ. అడితి[1] వి. 1. కమీషను, తరుగు; 2. కమీషను వ్యాపారి, తరగిరి.

**అడదడి** పో.చూ. అలజడి. వి. ప్రభుత్వం.

త. ఆళ్. పరిపాలించు; తటై. రక్షణ.

**అడది** రూ.చూ. హళఁది. వి. 1. పసుపురంగు; 2. ఆకుపచ్చ.

**అడదొడ్డి** చూ. అడ[3].

**అడవిచ్చెవ** చూ. అడ[3].

**అడందొల** వి. అప్పుడు పుట్టిన చేపల్ని పట్టే వల, చాలా చిన్న చిన్న కన్నులు గలది.

**అడప**[1] చూ. అడపము. వి. అడపకత్తియ, అడపకాడు; తాంబూలము చుట్టిఇచ్చే సేవకురాలు, సేవకుడు. శృం.నై. 7.141.

క. అడప, హడప. తములపాకులసంచి, కట్లసంచి; అడపవళ, అడపవళ్ల. తాంబూల కరండవాహి; అడపిగ. పై; తు. అడప, హడప. మంగలిపొది; త. అటైప్పై, అటైప్పమ్, అటప్పమ్. తమలపాకులసంచి, మంగలిపొది; అటైప్పకారన్. తాంబూల కరండవాహి; మ. అటప్పమ్, అటప్పన్. తమలపాకులసంచి.

<అటై + ప్ + పై. తమలపాకులసంచి.

**అడపకత్తియ** రూ. అడపకత్తె. వి. తమలపాకులసంచి పట్టుకునేస్త్రీ; తాంబూలకరండవాహిని. **అడపకత్తె** రూ.చూ. అడపకత్తియ. వై.జ. 1.113. **అడపకాఁడు** వి. తమలపాకుల సంచి పట్టుకునే సేవకుడు, తాంబూల కరండవాహి. క. అడపిగ. తాంబూల కరండవాహి, మంగలి; హడపాళి. తాంబూలం తయారుచేసి యిచ్చే సేవకుడు; హడపగాలి. మంగలి; త. అటైప్పక్కారన్; మ. అటుప్పక్కారన్.

**అడపది** వి. అడపకత్తియ. ఉ.రా. 4.223.

**అదవ[2]** రూ. అదుప. వి. పశువుల కాళ్లకువచ్చే ఒకానొక వ్యాధి : గాలిసె గాలి.

పో.చూ. క. అడవు. మొటిమలు : త. అట్టైప్పుణ్. ఒలబద్ధకం, ఒకరకం పశువ్యాధి ; అట్టైప్పాణ్. రాచ పుండు, పశువుల ప్లీహజ్వరం.

అద+వ ; త.తె.క. రూపాలకు ఒకేమూలం ; అట్టై-. దాచటం, దాగివున్నది - అన్న అర్థంలో కావచ్చు ; చూ. అదుప.

**అదవ[3]** వి. ఇంటివాసం. (వా.)

**అదవ[4]** విణ. బరువైనది. (వా.)

**అదవ[5]** చూ. అద[1]. వి. కంప మండలు లొక్క కట్టిన కట్ట.

**అదవకత్తియ** చూ. అదప[1].

**అదవకత్తె** చూ. అదప[1].

**అదవకాఁడు** చూ. అదప[1].

**అదవట్టియ** రూ.చూ. అర్ధపట్టెము.

**అదవట్టె** రూ.చూ. అర్ధపట్టియ.

**అదవడు** పో.చూ. అదలు. అ.క్రి. సంశయించు, సంకోచించు. రం.రా. అయో. 97.

<? అర్ధపడు. నిరోధించు.

**అదవతదవ** రూ.చూ. ఎదపఁదదప.

**అదవది** చూ. అదప[1].

**అదవపెన్నె** చూ. అద[3].

**అదవము** రూ. హదపము. చూ. అద[3], అదప[1]. వి. 1. పక్క లాకులనంచి, బరణి. ఆము. 2.75 ; 2. మంగలిపొది.

క. అడప, హడప ; తు. ఆడప; త. అట్టైప్పమ్ ; దే.ప్రా. హదప్ప, హడప్ప.

బహుశః ద్రావిడ భాషల్లోంచి ప్రతిదేయం.

**అదవమువాఁడు** వి. అదపకాడు. శృం.నై. 6.141.

**అదవమువాఁడు** చూ. అదపము.

**అదవర(ఱ)** చూ. అద[1].

**అదవరగట్టు** అ.క్రి. ముద్దగట్టు.

**అదవరగట్టు** చూ. అదపర.

**అదపాతదపా** రూ.చూ. ఎదపఁదదప.

**అదపాదదపా** రూ.చూ. ఎదపఁదదప.

**అదపాను** వి. చెప్పులజోడు.

అద+పాను <పార. పోశ్. ఆచ్ఛాదనం.

**అదవు[1]** రూ. హదపు. వి. 1. భద్రంగా చూడటం, ఉపదర్శనం. ద.హిం.శా. 5.1020 ; 2. వంతు, వరుస. ద.హిం.శా. 4.1367.

క. అడవు, అడవు, అడర్పు. తాకట్టు ; తు. అడవు. పై ; త. అట్టైప్పు. ఒదంబడిక ; అట్టైమాణయ్. తాకట్టు ; అట్టై. న్యాసం ; అడుకు. తాకట్టు ; అట్టై. అప్పగించు ; మ. అటుప్పు. నెల ఖాతామీద రోజూ కొంత సరకు కొనే మామూలు ; చేతికందిన దబ్బు ; నేర్పు ; సంపాదన.

**అదవు[2]** చూ. అడఁగు. స.క్రి. అణచివేయు, లోగొను, నాశనం చేయు ; అ.క్రి. పట్టు, ఇముడు.

**అదపొద** రూ. అడాపొడ. పో.చూ. అదపడు. వి. రూపు. జాడ, అడుగుల గుర్తు. మను. 3.46.

పో.చూ. క. అడి. అడుగు, అడుగుజాడ ; పాడె. ఎత్తు, పొడవు ; పో.చూ. తు. పుడె. పక్క ; పో.చూ. త. అట్టై. యాళమ్. గుర్తు.

**అదబల్ల** చూ. అద[3].

**అదబాల** పో.చూ. అదపాల. వి. వంటవాడు, వంటకత్తె. బసవ. 7.23. భాగ. 10. ఉ. 7.

క. అడబళ. వంటవాడు ; అడువళ. పై : వళ. ప్రత్యయం ; పో.చూ. మడివళ. చాకలి : బళ, వళ్ల, వాడ, వాడి మొ. ప్రత్యయాలు ; తు. అడిగెదాయె. వంటవాడు ; త. ఉణుమట్టైయణ్. వంటవాడు ; కొండ. అట్క. అగ్గిపెట్టు.

బహుశః <క. అడువళ.

**అదబాలతనము** వి. వంటవాని పని, వంట. భాగ. 9.287.

**అదబాలతనము** చూ. అదబాల.

**అదబుక్కొడి** వి. బుక్కొడి, పాలదంతం (Ehretia bevis).

**అదభంగరము** విణ. అక్రమం.

నే. అడ్‌బంగె. అర్ధదిద్దం, తలబిరుసు ; హిం. అడ్‌బంగ. హెచ్చుతగ్గు, విషయం, దుర్గమం; పం. అడ్డాబంగె: సిం. అడ్‌బంగు ; గు. అడబంగ. తుంటరి, మొరటు, అసహ్యం ; మరా. అడెఁ. వెన్నుగాడి.

తు. అలుబంగ. వినుగు, బాధ.

**అదమగ్గం** చూ. అద[3].

**అదమర** చూ. అద[1].

**అదమానము** రూ. అడుమానము. వి. తాకట్టు, కుదువ.

క. అడె. న్యాసం, కుదువ ; తు. అడవు, అడావు. కుదువ, తాకట్టు; త. అట్టైమాణమ్. తాకట్టు; అట్టై. కుదువ, న్యాసం.

<త. అట్టైమాణమ్.

**అదరించు** చూ. అదరు[1].

**అదరు[1]** అ.క్రి. 1. అతిశయించు. భార.ఆది. 4.161 ; 2. ఒప్పు, తగు. భార.ఆది. 7.81; 3. ప్రసరించు, వ్యాపించు. భార.విరా. 1.308 ; 4. కడగు, పూను, సిద్ధపడు. భార. అను. 3.212 ; 5. కలుగు, పుట్టు. భార.అర. 6.147 ; స.క్రి. అలముకొను, ఆవరించు. దశకు. 7.43 ; వి. 1. సమయం, అదను. హరి.పూ. 7.42 ; 2. ఆధిక్యం. అచ్చు రా.అయో. 3.

క. అడరు, అడర్. కలియు, అతిశయించు, అడర్పు. కలుపు, సిద్ధపరచు ; అడవు. ఒప్పిదం ; అడగు. అను గుణ్యం, అందం; తు. అట్టి. కుప్ప, ధాన్యపురాశి ; త. అటు. తగు, యోగ్యమగు; అటర్. అ.క్రి. సన్నిహిత మగు, క్రిక్కిరియు ; అట్టైవు. ఒప్పిదం, ఔచిత్యం, క్రమం, తీరు; మ. అటురుక. చీలిపోవు, పగులు; అటువు. నిత్య కృత్యం, నేర్పు, సంపూర్ణత ; కుఇ. అద. తగియుండు ; మాల్తో. అద్యె. తగియుండు, చాలు.

<మూ.ద్రా. అట్-.

**అదరించు** స.క్రి. 1. కలిగించు. భార.విరా. 4.180 ;

2. వ్యాపింపజేయు, భార.ఉద్యో. 2.112 ; 3. (దాడాదులు) ప్రయోగించు. భార.ద్రోణ. 1.353 ; 4. నడపు, ప్రవర్తిల్లజేయు, భార. అను. 5.251 ; 5. ఒప్పగించు. భాగ. 5.186 ; 6. చేయు. విజయ. 2.165 ; 7. వర్ధిల్లజేయు. హరి. నల. అవ. 23. క. అదర్చు. కలుషు, సిద్ధపరచు ; అదరిసు. అవలంబింపచేయు. **అదరుచు** రూ.చూ. అదర్చు. స.క్రి. (దాడాదులు) ప్రయోగించు. జై.భా. 7.10. తు. అట్టు. పెట్టు, విడుచు ; క. అదుర్. ఎదుర్కొను. ఆక్రమించు. **అదరుచెంచు** (-చెంచు). పో.చూ. అదరుదేరు. అ.క్రి. అతిశయించు. వృద్ధిచెందు. **అదరుదేరు** (-దేరు). అ.క్రి. అతిశయించు. వృద్ధిచెందు. మార్క. 5.230 **అదరువ (ప్)** చూ. ఎదరున (న్). క్రి.విశ. సందుకట్టున, విశ్రాంతివేళ. **అదరువడు** అ.క్రి. విజృంభించు. ఉ.రా. 4.291. **అదర్చు** రూ. అదరుచు. స.క్రి. (దాడాదులు) ప్రయోగించు. జై.భా.7.10.

**అదరు**[2] అ.క్రి. 1. ప్రజ్వలించు. భార.అర. 1,139 ; 2. కలగు, క్షోభించు. ఉ.రా. 4.133 ; వి. 1. ముప్పు, ఆపద. హరి. పూ. 7.42 ; 2. విచారం, దుఃఖం ; 3. భయం.

క. అదల్, అదలు. దుఃఖించు ; త. అదల్. ప్రజ్వలించు ; వి. మంట, వేడి, తీవ్రత ; మ. అదల్. వేడి, నిప్పు.

**అదరుచు** చూ. అదరు1.
**అదరుచెంచు** చూ. అదరు1.
**అదరుదేరు** చూ. అదరు1.
**అదరువ (ప్)** చూ. అదరు1.
**అదరువడు** చూ. అదరు1.
**అదర్చు** చూ. అదరు1.
**అదలగొట్టు** చూ. అదలు1.
**అదలండి** చూ. అదలు2.
**అదలవిటల** వి. ఒకజాతి నూనెగింజల చెట్టు (Lepidium sativum).

త. అళి. అదలవిటల ;
హిం. హాలిమ్ ; మ. అహలీవ్యా.

**అదలించు** చూ. అదలు1.
**అదలిపోవు** చూ. అదలు1.
**అదలు**[1] అ.క్రి. 1. చలించు, అదరు. కాశీ. 7.36 ; 2. భయపడు, బెదరు. రసిక. 4.47 ; వి. భయం. మను. 6.11.

క. అదలు. కదలు, వణకు, భయపడు, దుఃఖించు ; వణకు, సంక్షోభం ; త. అటి. చరచు, లాగు. వణకిపోవు, పీచు ; కొలా. అడ్గ్. (గుండె మొ.) కొట్టుకొను ; కొండ. అడ్స్. దుఃఖించు.

**అదలగొట్టు** స.క్రి. 1. పోగొట్టు. హంస. 4.57 ; 2. భయపెట్టు. **అదలించు** స.క్రి. 1. భయపెట్టు. ఆం.భా. 3.124 ; 2. చేయు ; 3. గద్దించు. **అదలిపోవు** అ.క్రి. భయపడు, అదలు. **అదలుచు** స.క్రి. భయపెట్టు.

**అదలు**[2] రూ. అదరు2. అ.క్రి. 1. శోకించు. భార. భీష్మ. 1.45 ; 2. ఏడ్చు, విలపించు. జై.భా. 6.265 ; వి. శోకం. భార. శాంతి. 1.56 ; విశ. దుఃఖించుచున్న. మను. 3.13.

క. అల్, అబు. ఏడ్చు : ఏడ్పు. దుఃఖం : అబల్ శోకించు ; అదలు. శోకం, శోకించు ; ఉ. అర్లని. మంద నొప్పు ; త. అటలై. కష్టం, బాధ : అబు. ఏడ్చు : అబల్ అమాయచెందు, కోపించు, మండు ; మ. అదల్. యుద్ధం అబల్. వేడి, నిప్పు, కాంతి, మంట, దుఃఖం.

<మూ.ద్రా. *అద్-అల్.

**అదలండి** వి. శోకం, కలకలి. దు.ని. 5.578, భాశి ఆశ్వ. 1.88. **అదలుకొను** అ.క్రి. శోకించు. ఉచ్చు. రా. 287.

**అదలుకొను** చూ. అదలు2.
**అదలుగింజలు** వి.బ.వ. లేత పచ్చరంగులో దోసగింజల్లాగ ఉండే గింజలు ; గ్రహణిలో వైద్యానికి ఉపయోగిస్తాయి
**అదలుచు** చూ. అదలు1.
**అదవ** రూ. అదుప. విశ. 1. పాడైన ; 2. చెడిపోయినది.

క. అటి. అది. వినాశకాలం ; అటు. వినాశం, హాని తు. అటిప్పు, అర్పుని, అళియుని, అలిప్పుని. నశించు శిథిలమగు ; త. అటి. నశించు. శిథిలమగు. వినాశం అటిపు. వినాశం ; మ. అటుకుక. కుళ్లు. నశించు అటియుక. శిథిలమగు, నశించు ; కోట. అర్స్. తుడిచి పెట్టుకు పోవు ; తుడుచు ; కాలియప్. వినాశం.

<అటి. 8-10 శతాబ్దులనాటి నాల్లో ఉన్న తొలియావం ;

**అదవఅప్పు** వి. ఎప్పటికీ వసూలుకాని అప్పు. **అదవనరకులు** వి.బ.వ. దెబ్బతిన్న పాతవస్తువులు. **అదవాపట్టి** వి. అప్పులు మొ. వాటి నిరరప పట్టి.

**అదవఅప్పు** చూ. అదవ.
**అదవడి** చూ. అద3.
**అదవందరము** చూ. అరబందము. వి. దిక్కుమొక్కులేనిది.
**అదవలు** రూ.చూ. అడుగులు1. వి.బ.వ. గంతులు, నాట్యంలో పాదక్రియలు.
**అదవనరకులు** చూ. అదవ.
**అదవాపట్టి** చూ. అదవ.
**అదవాముదం** < అదవి + ఆముదం. వి. పెద్ద నేపాళపుచెట్టు (Jatropha cutcas)
**అదవాల్లు** చూ. అద3.
**అదవి** రూ. అడివి. వి. అరణ్యం, వనం. భార. ఆది. 6.278 ; విశ. వన్యం, క్రూరం. ఉదా. అదవిచెట్లు, అదవిజంతువులు. భార.భీష్మ. 2.220.

క. అడవి, అడివి. < సం. అటవీ. అరణ్యం ; అడర్. కలియు, కిక్కిరియు ; అట్టు. కిక్కిరిసినస్థితి ; తు. అదవి. త. అటవి. అరణ్యం, ఉద్యానవనం ; అట్, అటర్. అణ్. సన్నిహితమగు, దట్టమైన, క్రిక్కిరిసిన ; అంటు. సమీపించు ; మ. అటవి. అరణ్యం ; కొలా. అడవి. బ.వ. అదవికుల్, అడవి ; నా. అడయ్ ;

సం. అటవిః, అటవి. కిరిగేచోటు, అరణ్యం ; ప్రా. అ.మా. అడవి, అడవి ; మహా. అటవి ; అప. అడవి.

మూ. ద్రా. *అ(ట్)ద్. 'శిలప్పదికారం' నాటికే తమిళంలో ఈ పదం కన్పించటంవల్ల ఇది దేశ్యమని డాక్టర్

కాల్డ్వెల్ నిర్ణయం.

**అడవిఅరటి** వి. వన కదళి. **అడవిఅవిసె** రూ.చూ. అడవియవిసె. **అడవిఆముదము** రూ.చూ. అడవియాముదము. **అడవి ఉచ్చింత** వి. తృణ విశేషం; కాకమాచి, కాచి. **అడవిఏలకి** వి. అడవిజాతి ఏలకి (Amomum subalatam). **అడవికంది** వి. కల్రఉలవ (Rhynchosia suaveolens). **అడవికంద** వి. సర్పనాళం (Vitis carnosa). **అడవికాకర** వి. వనకారవేల్లం, మట్టుకాకర (Momotdica cochinchinensis). **అడవికాపు** వి. వనవాసి, ముని. **అడవికిక్కన** యా. అడవికిక్కస. వి. దేవనాళం (Arundo dorex). **అడవికిక్కన** రూ.చూ. అడవికిక్కస. **అడవికిక్కస కసపు** వి. అడవి కిక్కస గడ్డి. **అడవికుక్క** వి. 1. అడవిలో ఉండే కుక్క; 2. తోడేలు. **అడవికొండగుమ్మడి** వి. చిన్నగుమ్మడి. తీగగుమ్మడి; చిన్నమందుల మారి (Vitis linnaei). **అడవికోడి** వి. వనకుక్కుటం, కారుకోడి. క. అడవికోళి. అడవిలో ఉండే బూడిదరంగు కోడి. **అడవిగగ్గెర** వి. అడవితులసి, సుముఖ (Ocimum ballatum). **అడవిగన్నేరు** వి. బయట తెలుపు లోపల పసుపు రంగు కలిగి, మామూలు గన్నేరులాగా నాలుగు రేకులు కాక, ఐదు రేకులు గల చక్కని సువాసన గల పూవు (Plumeria alba). **అడవిగాడిద** వి. కంచరగాడిద, చారలగుర్రం. **అడవిగీము** వి. అడవి ఇల్లుగా గలది, కోతి. అచ్చ. రా. 206. **అడవిగుబ్బతుద** వి. వసంత గంధం, సిందూర గంధ, నాగరక్త, కుంకుమ (Mallotus philippinensis). **అడవిగెనసు** వి. పిండాలుకం (Dioscorea aculeata). క. అడవిగెణసు. అడవిలో పెరిగే చిరగడదుంప. **అడవిగొడ్డలి** వి. వంటచెరకును, చేపలను నరికే గొడ్డలి. **అడవిగొఱ్ఱె** వి. అడవిలో ఉండే గొఱ్ఱె. క. అడవికురి. **అడవిగోరింట** వి. వనోద్రికం (Erythroxylon monogynum). **అడవిచామలు** వి. బ.వ. కొండజొన్నలు, వనశ్యామాకం (Wild millet). **అడవిచిక్కుడు** వి. వనక్షుద్రశింబి (Dolichos tetraspermus). **అడవిచిచ్చు** వి. కార్చిచ్చు. భార. అశ్వ. 2.161. **అడవిచెఱకు** వి. కాంతారం, తెలుపు కలిసిన పచ్చ చెరకు. **అడవిచేమ** వి. శకుటం, చేమలో ఒక రకం (Colocasia nymphaeifolia). **అడవిచేమంతి** వి. అడచామంతి (Helicters isora). **అడవిజామ** వి. బండి మురుగుడు తీగ (Calycopteris floribunda). **అడవిజీలకఱ్ఱ** రూ.చూ. అడవిజీలకూర. **అడవిజీలకూర** వి. నేలవావిలి, విషకంటకం (Vernonia anthelmintica). సం. అటవిజీరక. **అడవితగరిస** వి. ఒక జాతి కసింద. **అడవితంగేడు** వి. ఇరిడి, కొండతంగేడు (Mimora xylocarya). **అడవితమ్మ** వి. ఎఱ్ఱతమ్మ, కారుతమ్మ (Canavalia ensiformis). **అడవితిరుగుడు** రూ. అడవిదిరుగుడు. వి. వనచరం, కోతి. రామా. 6.60. **అడవితుమ్మ** వి. తుమ్మజాతికి చెందిన పెద్ద ముళ్లచెట్టు (Acacia latronum). **అడవితెల్లగడ్డ** వి. నక్క ఉల్లి గడ్డ (Silla indica). **అడవితొగరి** వి. తుపరి, మడ్డి (Morinda citrifolia). **అడవితొలసి** వి. క్షవకం, అడవితులసి. **అడవిత్రిమ్మరి** వి. వనచరం, కోతి. అచ్చ.రా. కిష్కిం. 39. **అడవిదవనము** వి. దవనం, దమనం, నాగదమని (Artemisia vulgaris). చూ. దవనము. **అడవిదిరుగుడు** రూ.చూ. అడవితిరుగుడు. రామా. 6.60. ఉ.రా. 3.269. **అడవిదున్న** వి. కారెనుబోతు. **అడవిదుంపతీగ** వి. ఎల్లగడ్డ (Discorea oppositifolia). **అడవిదేశం** వి. అరణ్య ప్రదేశం. **అడవిదొండ** వి. కాకిదొండ. **అడవిదోమ** వి. దంశి. **అడవినట్టు** అడవి+నట్టు. వి. వనౌకసం, కోతి. అచ్చ.రా. సుంద. 115. **అడవినాభి** వి. అరణ్య వననాభి (Gloriosa superba). **అడవినిత్యమల్లె** వి. సూర్యమణి, రక్తపుష్ప (Hibiscus hirtus). **అడవినిమ్మ** వి. కారునిమ్మ. వనజంబీరం (Atalantia monophylla). **అడవినువ్వులు** వి. జర్తిలం. **అడవినెలవరి** అడవి+నెలవు+అరి. వనవాసి, ముని. ఆం.భా. 2.176. **అడవినెలవు** వి. 1. కోతి; 2. వనవాసి. **అడవినెల్లి** వి. వనాగ్నిమంథం (Mallotus repandus). క. అడవినెల్లి. **అడవినెల్లికూర** వి. కూరనెల్లి (Premna herbacea). **అడవిపత్తి** రూ.చూ. అడవిప్రత్తి. **అడవిపత్తితీగ** వి. సుగంధపాల (Hemidesmus indicus). **అడవిపంది** రూ. అడవిపంది. వి. వనసూకరం, ఏకలీడు. **అడవిపల్లె** వి. వనగ్రామకం, అడవిమధ్యలో ఉండే చిన్న ఊరు. **అడవిపసుపు** వి. పసుపులో ఒక రకం. **అడవిపాలతీగ** వి. రైతుపాల (Cryptolepis buchanani). **అడవిపాలు** వి. వ్యర్థం, నిరుపయోగం. క. అడవిపాలు. **అడవిపిప్పలి** వనపిప్పలి (Piper hymenophyllum). **అడవిపిల్లి** వి. ఒక జాతి పిల్లి. వనమార్జాలం. కాశీ. 2.43. **అడవిపుచ్చ** వి. ఒక జాతి పుచ్చ (Cucumis pubescens). **అడవిపుట్టువు** వి. 1. అడవిలో పుట్టినది, ఏనుగు; 2. దేవేంద్రుని వాహనం, ఐరావతం (అయితే ఐరావతం పుట్టింది అడవిలో కాదు; సముద్రంలో). **అడవిపెసర** వి. వనముద్గం, కారుపెసర. క. అడవి-య-హెసఱు. **అడవిపెసలు** వి. బ.వ. వనముద్గం. **అడవిపొగాకు** వి. ఒక రకం పొగాకు (Lobelia nicotianaefolia). క. కాడహొగెసొప్పు; త. కాట్టుప్పుగైయిలాయ్; మ. కాట్టుపుకయిల. **అడవిపొట్ల** వి. వనపటోలం, ఒక జాతి పొట్ల. **అడవిపొన్న** వి. ఒక రకం పొన్న. ఉప్పుపొన్న (Rhizophora mucronata). **అడవిపోతుకాకర** వి. ఒక రకం కాకర, ఆకాకర, పూగాకర (Memordica dioca). **అడవిప్రత్తి** రూ. అడవిపత్తి. వి. కొండపత్తి, పగడిపత్తి, వనకార్పసి (Thespesia lampus). క. అడవి-హత్తి. **అడవిబంకతీగ** వి. పాతేపతీగ (Cissampelos pareira). **అడవిబచ్చలి** వి. వనోపోదక (Ceropegia tuberosa). **అడవిబంతి** వి. నేమబంతి (Blepharispermum subsessile). **అడవిబాతు** వి. అడవిలో ఉండే బాతు; ఎఱ్ఱటి రెక్కలు గల తెల్లటి పక్షి. బాగా ఎగర గలదు. **అడవిబిక్కి** వి. కొండబిక్కి. పెద్దబిక్కి, కారింగువ (Gardenia latifolia). **అడవిబిళ్లు** వి. ఒక జాతి అడవిచెట్టు (Sophora interrupta). **అడవిబీర** వి. 1. కోశఫల (Luffa amara); 2. ధామా

**అపూటు** రూ.చూ. అపూటము. విశే. స్వచ్ఛం.

**అపోశనము** రూ.చూ. ఆపోశనము. వి. ఆపోశనం: భోజనాదియందు భోజనాంతమందు పుడిసిట నీళ్లు పోసుకొని మంత్రపూర్వకంగా పుచ్చుకోటం: అట్లా పుచ్చుకునే నీళ్లు. భీమ. 2.136.

**అప్ప** వి. రాయి తొలిచే మొద్దు ఉలి.

**అప్ప** రూ.చూ. అప్పుడు. వి. ఆసమయంలో. భార.అను. 3.21, శృం.నై. 4.136.

**అప్ప** రూ. అప, అప్పా. వి. 1. అక్క, జ్యేష్ఠసోదరి. భార. విరా. 2.36; 2. తండ్రి. అచ్చ.రా. 4.127; 3. తల్లి; అవ్య. 1. ఆశ్చర్యార్థకం. వేంక.పంచ. 3.340, దవిక. 2.78; 2. ప్రీతి సూచకం. వసు. 4.53; 3. పూజ్యతా సూచకం. కృష్ణశ. 85; 4. గౌరవాదర సూచకం. కు.ఇందు. 1.127; 5. ప్రశంసా సూచకం. సారంగ చ. 1.31; ప్రత్య. పురుషుల పేర్లపై వచ్చే అంత్యాగమం.

క. అప, అప్ప. తండ్రి, పురుషుల పేర్ల చివర వచ్చే ప్రత్యయం, గౌరవవాచకం, వయోవృద్ధులను తెలిపేది, వాత్సల్య సూచకం, తారతమ్య సూచకం, ఆహా! అయ్యో!; తు. అప్ప, అప్పి. పురుషుల పేర్ల చివర వచ్చే గౌరవ వాచకం; అప్పె. తల్లి; కొడ. అప్పా. తండ్రి: త. అప్పన్. వాత్సల్య సూచకం, తండ్రి; అప్పచ్చి. తండ్రి; అప్పా. తండ్రి, విషాద ఆశ్చర్యాద్యర్థకం; అప్పు. తండ్రి; అప్పాత్తై. అక్క; అప్పి. యజమానురాలు, అక్క; మ. అప్పన్. తండ్రి, పితృవ్యుడు; అప్పప్పా. ఆశ్చర్యార్థకం; అప్పు. వాత్సల్య సూచకం; కొండ. ఎబ. తండ్రి; గోం. అపొఆల్, అపొరానా, అపొరాలోజ్. తండ్రి; మైపో. నా తండ్రి; మిఅపో. నీ తండ్రి; కుఇ. అబ. తండ్రి, ముత్తాత, పూర్వుడు, పెద్దవాడు, అధికారి, అయ్యా; ఆపో. పిల్లవాడు, కొడుకు; ఆబకోన. అయ్యో!; అపి. పిల్ల, భార్య; కువి. అప్ప. నాయనమ్మ; కొలా. అప్ప, అప్పా.మేనత్త; అప్పా. మేనమామ భార్య; ఒల్లా. అబ. తండ్రి; బ్రా. అబ్బా. తండ్రి; అబా. తండ్రి, తాత, గౌరవ సూచక సంబోధన; అప్పా. దుఃఖాతిశుడు.

ప్రా. అప్ప (సం. ఆప్త-). చుట్టం, స్నేహితుడు; అప్ప, అత్త (సం. ఆత్మన్). తనది, శరీరం, స్వభావం, ఆత్మ; దేశి. అప్ప, అప్పా. తండ్రి; అప్పా. సంబోధన ప్రథమ;

ఉ. అప. అక్క; ముండా. సంతా. అబ. తండ్రి; టిబె. అఫ. తండ్రి.

<మూ.ద్రా. *అప్-.

**అప్పప్ప** అవ్య. ఆశ్చర్యార్థకం. సారంగ.చ. 1.31.

**అప్పా** అవ్య. 1. ప్రశంసార్థకం. రాజ.చ. 1.58; 2. ఆశ్చర్యార్థకం. క. పో.చూ. అప్ప. అయ్యో!; త. పో.చూ. అప్పా. విషాదాశ్చర్య వ్యథా సూచకం; మ. అప్ప, అప్పా, అప్పప్పా.

**అప్పగించు** చూ. అప్పన[1]. రూ. ఒప్పించు, ఒప్పగించు. స.క్రి. 1. పదిలంగా కాపాడుమని ఒకరి అధీనంలో ఉంచు. భార.విరా. 1.249, ఆర్య. 1.93; 2. లోబరచు, అగ్గము సేయు. కుమా. 3.14; 3. పాపములను వర్జించి ఎరుపవెట్టు.

సం. అర్పణ-. ఇవ్వటం. రాను. అప్పగించటం ప్రా. అప్పణం. రాను; ఒప్పు. ఇచ్చు. కాన్కఇచ్చు అమా. అప్పణం. ఇవ్వటం. బహూకరించటం: పా అప్పనా. పారపశ్యం; ఇప. అప్పి-న (సం. అర్పయతి)

క. ఒప్పిసు, ఒప్పయిసు. ఇచ్చు. కాన్కఇచ్చు అప్పగించు; తు. ఒప్పిస్పని, ఒప్పిస్పుణ; త. ఒప్పి <ఒప్పివి.

<ప్రా. అప్పణ-: దేశా <ఒప్పు.

**అప్పగింత** చూ. అప్పగించు. వి. అర్పణం. ఒప్పగింత.

క. ఒప్పిసువికె; తు. ఒప్పాప్పని: త. ఒప్పి విత్తల్.

**అప్పచి** రూ. చూ. అప్పచ్చి. వి. అప్పం మొ. తీపి తిని బండారం, రాయిలం. ఉత్త. ఉత్తర. పరుత్త. 8.144

**అప్పచులు** వి. బ.వ. బాలక్రీడా విశేషం. చంద్ర 2.6 (అప్పాలు చేస్తున్నట్టు ఆడే ఆట కావచ్చు).

**అప్పచ్చి** రూ. అప్పచి. వి. 1. అప్పం. ఆం.దా. 2.264 2. భక్ష్యం.

క. అప్ప. బియ్యపు రొట్టె; అచ్చి. రొట్టె; అప్పచ్చి రొట్టె (బాల భాష); తు. అప్ప. ఒక రకం తీపి పదార్థం త. అప్పచ్చి. మిఠాయి.

**అప్పటము** విశే. స్వచ్ఛమైనది, మిశ్రితంకానిది.

సం. అస్పృష్ట-. స్పృశింపబడనిది; మహా. ప్రా. అప్పట్ట; మరా. అపూట;

క. అప్పట; మై. తె. కొంకణి. అపూట; మై. అప్ట; త. అప్పట్టమ్.

<ప్రా. అప్పట్ట.

**అప్పడము** రూ. అప్పళము. అప్పలము. వి. భక్ష్యవిశేషం. ఉ.రా. 6.122, కాశీ. 7.186.

సం. పర్పటః. భక్ష్యవిశేషం; మహా. అప్పడ, పప్పడ, పప్పడగ; అ.మూ. పప్పడ, పప్పడియా, పప్పహడ; మరా. పాపడ, పాపడి; హిం. పాపడ్;

క. అప్పడ, అప్పళ, పప్పడి, పపళ, హప్పళ; తు. అప్పడ, అప్పళ, పప్పడ, పప్పళ, హప్పళ; త. అప్పళమ్, అప్పళామ్, పప్పటుమ్; మ. పప్పటమ్.

< ప్రా. అప్పడ < సం. పర్పట, పరప్పు; బహుశః సం. పర్పుశు-పరప్పు. (పప్పు) విస్తరించుట అనే ద్రావిడ పదంనుంచి ఏర్పడి వుండవచ్చు. మో.వి. <పర్ప్ (వెళ్లు); పర్ప, పర్పట-.

**అప్పడాలకట్టె** చూ. అప్పడాలు.

**అప్పడాలకొడుపు** చూ. అప్పడాలు.

**అప్పడాలు** చూ. అప్పడము. వి. భక్ష్య విశేషం.

అప్పడములు > అప్పడాలు. లోప దీర్ఘత.

**అప్పడాలకట్టె** వి. అప్పడాలు ఒత్తటానికి ఉపయోగించే గుండటి కర్ర. **అప్పడాలకొడుపు** వి. అప్పడాలకర్ర.

**అప్పడు** చూ. అప్ప; అప్ప-డు. వి. తండ్రి. రాజ. వి. 1.33

క. అప్ప. తండ్రి, మాతామహుడు; తు. అమ్మె: త. అప్పన్; మ. అప్పజ్; కొండ. అపాసి.

**అప్పణ** రూ.చూ. అప్పన[2]. వి. ఉత్తరువు, సెలవు.

**అప్పన**[1] రూ.చూ. అప్పనము. వి. 1. ఇచ్చుట. శుక. 2.216; 2. కానుక. ప్రభు. 2.13 వ.

**అప్పనచేయు** రూ. అప్పనసేయు. స.క్రి. ఇచ్చు, అప్పగించు. అధీనంచేయు. రాజ.చ. 2.95. **అప్పనసేయు** రూ. చూ. అప్పనచేయు. స.క్రి. అధీనంచేయు. హరి.పూ. 5.200, రుక్మా. 2.44.

**అప్పన**[2] రూ. అప్పణ. వి. అనుమతి, ఆజ్ఞ. బహులా. 3.28, శుక. 2.215.

సం. ఆజ్ఞాపన-. ఆజ్ఞ, ఆజ్ఞాపించటం: అర్పణ-. కానుక, అర్పించటం, తిరిగి ఇచ్చివేయటం :

క. తు. అప్పనె. ఆజ్ఞ, న్యాయం, అనుమతి, సెలవు ; త. అప్పణై. ఆజ్ఞ.

<ప్రా. అప్పణ. అర్థ విపరి.

**అప్పనచేయు** చూ. అప్పన[1].

**అప్పనము** రూ. అప్పన[1]. వి. 1. అప్పగింత, ఒప్పందం. భార.ఆది. 6.266 ; 2. పన్ను. భార.అను. 2.62 ; 3. కానుక. మార్క. 7.20, శగా. 5.119; 4. ఉచితం.

సం. అర్పణ-. సంపాదించటం, కానుక, ఇవ్వటం, తిరిగి ఇచ్చివేయటం: ప్రా. అప్పణమ్. కానుక; అ.మా. అప్పణ. ఇవ్వటం, కానుక ఇవ్వటం;

క. అర్పణె, అర్పణ. వినరటం, చేర్చటం, స్థిర పరచటం, ఉంచటం, కానుక ఇవ్వటం; తు. అర్పణె. కానుక; త. అర్ప్పణమ్. అంకితం; మ. అర్పణమ్. ఉంచటం, అప్పగించటం, కానుక.

<ప్రా. అప్పణమ్.

**అప్పనముగొను** (-కొను). స.క్రి. పన్నుగా పుచ్చుకొను. హరి.పూ. 5.6. **అప్పనముచేయు** స.క్రి. అధీనమందుంచు. అప్పగించు. ద్వి. హరిశ్చ. ఉ. 2437.

**అప్పనముగొను** చూ. అప్పనము.

**అప్పనముచేయు** చూ. అప్పనము.

**అప్పనసేయు** చూ. అప్పన[1].

**అప్పనాలబావ** వి. అవ్యక్తుడు. అప్రయోజకుడు.

**అప్పప్ప** చూ. అప్ప.

**అప్పము** రూ. ఆపము. వి. భక్ష్య విశేషం (ఊతప్పము, వెన్నప్పము మొ.). కాశీ. 7.185, ఉ.రా. 6.122.

సం. అపూప-. రొట్టె; ప్రా. అపూయ, అపూవ ; అ.మా. అపూఅ, అపూవ, అపూయ ;

క.తు. అప్ప. రొట్టె; అప్పు. చేతితో ఒత్తటం; త. అప్పం, ఆపం. రొట్టె; మ. అప్పమ్; బ్రా. అప్పా. పిల్లల తినుబండారం.

<నం. అపూప > పూప (ఋగ్వేదం): ఇంతకంటె అప్పు. (చేతితో ఒత్తు) అనే ధాతువునుంచి దీని వ్యుత్పత్తి సాధించటం మంచిది. <అప్పు+అమ్.

మూ.ద్రా. *అప్పు-.

**అప్పలము** రూ.చూ. అప్పడము. వి. భక్ష్య విశేషం. చంద్రా. 6.93.

**అప్పళము**[1] రూ.చూ. అప్పడము. వి. 1. భక్ష్య విశేషం. ఉ.రా. 5.288: 2. బాలక్రీడా విశేషం. అష్టమ. క. 1-50 పు. 26 పం., కాళ. 3.33.

**అప్పళము**[2] వి. చరపు, ఆస్ఫాలనం.

నం. ఆ-స్ఫాల-. రాపిడి, చరవు, ఘర్షణ: ప్రా. అప్ఫాల; మహా. అప్ఫాల(న). చేతితో కొట్టటం;

క. అప్పళిసు. కొట్టటం, దెబ్బ; తు. అప్పళి. అర చేతితో కొట్టటం.

<ప్రా. అప్ఫాల-.

**అప్పళము**[3] అవ్య. శీఘ్రంగా. ఆం.భా. 3.71.

<ఆ+పాళము. ఆ సమయం.

**అప్పళించు** స.క్రి. 1. తట్టు, చరచు. ఆస్ఫాలించు. భార.విరా. 2.7, చిత్ర భా. 5.28; 2. పట్టుకొను, అదిమిపట్టుకొను. భార.సౌ. 1.18, వై.భా. 7.211; 3. ఆక్రమించు, క్రమ్ము. భా.రా. అర. 1.14, భీమ. 1.44; 4. తాకు, స్పృశించు. హరి.పూ. 7.38; 5. అలదు, రాచు, అద్దు. వేంక. పంచ. 4.391, శృం.నై. 2.141; 6. కొట్టు, రాజ.వి. 3.65, పారి. 3.38; 7. మూయు, కప్పు. ఉ.రా. 2.201; 8. తుడుచు. ఉ.రా. 6.207: అ.క్రి. 1. యత్నించు, ఉత్సహించు, తమకించు. భార. విరా. 2.45.

సం. ఆస్ఫాలః. ఆస్ఫాలన. దెబ్బ, చరవు: ప్రా. అప్ఫాలణం; అ.మా. అప్ఫాలణం. చేతితో నిమరటం. వీణ మొ. వాయించటం; అవ. అప్ఫాల-ఇ. (ఆస్ఫాలయతి);

క. అప్పళిసు, అప్పరిసు, కొట్టు, చరచు; తు. అప్పళిపుని; త. అప్పళి. గిలాబు చేసి నునుపు చేయు; మ. అప్పి.

<ప్రా, అప్ఫాల-.

**అప్పళింత** చూ. అప్పళించు. వి. చరపు. రామా. 7.168.

**అప్పసము**[1] రూ. అప్పిశము. అవ్య. 1. నిచ్చలు, సతతం, శుక. 1.385, రాజవా. 4.119. క్రీడా. 86, ఆం.భా. 1.66 ; 2. బుద్ధున, స్వయంగా.

పో.చూ. సం. అభ్యాస-. అభ్యాసం, పౌనఃపున్యం.

బహుశః <అబ్బెసము <సం. అభ్యాస-.

**అప్పసము**[2] వి. 1. పొలంలోని నీరు కిందివైపుకు జారి పోకుండా అడ్డువేసిన మట్టిపెళ్ల ; 2. బోదెల నడిమి చిన్న కాలువ.

<అప్పు+అసము. క. అర్పు.>తె. అప్పు. చేర్పు, కలుపు.

**అప్పా** రూ.చూ. అప్ప.

**అప్పాటున(న్)** ఆ + పాటు-న(న్). క్రి.విశ. తబ్బిబుగా, ఉన్నపళాన.

**అప్పిశము** రూ.చూ. అప్పసము[1]. అవ్య. 1. ఎల్లప్పుడు ; 2. నిజంగా.

**అప్పీలు** వి. మొర, మనవి, క్రింది న్యాయాధికారి తీర్పులోని లోపాలు చూపి న్యాయంకోసం పై అధికారులకు చేసుకున్న విన్నపం.

<ఇం. Appeal.

**అప్వ** చూ. అచ్చు[4]. వి. ఋణం. భార.విరా. 4.205, కర్ణ. 2.21.

త. అప్పు < తె.

<అచ్చు[4]. చూ. ; లేదా అరుగు, అరుదు. మొ.వాటి లోని మూలధాతువైన అర్ (పోవు, నశించు) నుంచి వచ్చి వుండవచ్చు: అరు(వు) > అర్వు > అప్వు.

**అప్వవప్వలు** వి. బ.వ. అప్పులు. శుక. 2.375.

బహుశః నప్పు-లు < చప్పు-లు < చల్పు < చలువ.

**అప్వరవ్వడు** చూ. అప్పుడు.

**అప్వడు** రూ. అవుడు, అప్డు. వి. ఆసమయం, ఆకాలం. భార. ఆది. 6.192, కు.సం. 11.702, కాశీ. 3.99, రాజ.వి. 2.69.

క. అ + పొతేతు. ఆ సమయంలో ; తు. అపొర్తు. ఆ సమయం ; త. అప్పొళుతు, అప్పొఴుతు, అప్పొతు. అప్పుడు, ఆ సమయంలో ; మ. అప్పొళుతు, అప్పొళ్, అప్పొఴు. అప్పుడు ; గోం. అప్పొజ్, అప్పొడా (అప్పొజే). అప్పుడు, పూర్వం ; పర్జి. అపొట్. ఆ సమయం ; కొలా. అపుడ్, అప్పుడ్, అపుడ్. అప్పుడు ; నా. అపుర్.

మూ.ద్రా. <*అ- *పొఴు-. అ + పొఴు > అప్పొఴు > అప్పుడు.

**అప్వడప్వడు** క్రి.విశ. మధ్యమధ్య, తరచుగా. **అప్వడే** అవ్య. ఆసమయమందే. శృం.నై. 7.70.

**అప్వడే** చూ. అప్పుడు.

**అప్వఁబుట్టువు** మిశ్రస. : అప్పు + పుట్టువు. వి. పద్మం ; నీటియందు పుట్టినది. హరిశ్చ. 4.43.

<సం. అప్ (నీరు) + తె. పుట్టువు.

**అప్వలపోతు** చూ. అప్పులు.

**అప్వలు** చూ. అప్పు. వి. బ.వ. ఋణములు.

**అప్వలపోతు** వి. అప్పు పుచ్చుకున్నవాడు, ధనగ్రాహకుడు, అధమర్ణుడు.

**అప్వసప్వలు** చూ. అప్పు.

**అఫజుదు** రూ.చూ. అఫ్జూద్.

**అఫత** వి. వారం.

హిం. హఫ్తా. వారం ; ఉ. హఫ్తహ్ ; పార. హఫ్త ; అర. హఫ్తక్.

<ఉ. హఫ్తహ్.

**అఫము** రూ.చూ. అభము. వి. అభదం.

**అఫరాతఫిరీ** వి. దుర్వినియోగం.

మరా. అఫ్రాతఫర్. దుర్వినియోగం ; హిం. అఫ్రాత్ఫరీ. గందరగోళం ; ఉ.అర. ఇఫ్రాత్. అమితం ; పార. ఇఫ్రాత్ఫిరీ.

<మరా. అఫ్రాతఫర్ < పార. ఇఫ్రాత్ఫిరీ.

**అఫీము** రూ.చూ. అభిని. వి. నల్లమందు. భద్ర.శ. 6.

**అఫ్జూద్** రూ. అఫజుదు. వి. అభివృద్ధి, పెంపు ; విశ. మిక్కిలి, అధికం.

ఉ.పార. అఫ్జూంద్. వృద్ధి, ఆధిక్యం.

<ఉ. అఫ్జూంద్.

**అబక** రూ.చూ. అగప. వి. 1. కొయ్య గుద్దలి. ఆం.భా. 1.15 ; 2. పెద్ద తెడ్డు. ఆం.భా. 2.224 ; 3. తెంగాగరిటె.

**అబటుచేవ** వి. ఒకరకం చేప.

క. అబండు > అబాడు. వికృతమైన.

అబటు < క. అబాడు + చేప.

**అబద్దు** రూ.చూ. అబద్ధము. వి. అసత్యం.

**అబద్ధము** రూ. అబద్దు. వి. అసత్యం, బొంకు. శృం.నై. 7.6

సం. అబద్ధ-. అనిబద్ధం, అపరిమితం. స్వచ్ఛంద అనుద్దిష్టం : అ.మా. అబద్ధ. ఛందోబద్ధం కానిది, అబద్ధ. అనిబద్ధం, విశృంఖలం :

క. అబద్ధ. అసత్యం, బొంకు : త. అవత్తు అవత్తం. ; మ. అపథం. అపమార్గం.

<సం. అబద్ధ-. అర్థవిపరి.

**అబందవ** వి. క్రమభంగం, చక్కన చెడినది.

సం. అబంధన-. వదులైన, కట్టుబాటులేని.

<సం. అ + బంధన-.

**అబందర** రూ. అబిందర. వి. 1. పాడైనది, చెడిపోయినది 2. తెలియనివాడు, అజ్ఞుడు.

**అబందరము** రూ. అరబందము, అరబందరము. వి. అయోమయం.

**అబరు** వి. తప్తసీసం.

ఉ.పార. అబర్. తప్తసీసం.

<ఉ. అబర్.

**అబాని** చూ. అబాను.

**అబాసు** వి. దౌష్ట్యం, అల్లరి. సేతు. 4.133 వ.

సం. అభాస-. శోభ, కాంతి, కపటరూపం : ప్రా అభాసా : అ.మా. అభాస ;

క. అబాసు. కంపు, దుర్వాసన ; త. అపావమ్ రోత ; మ. అభాసమ్. నీచం, నికృష్టం.

<సం. ఆభాస-. అర్థ విపరి.

**అబాని** వి. దుష్టుడు, నీచుడు. హంస. 5.113.

**అబిందర** రూ.చూ. అబందర. వి. అక్రమం.

**అబిలోని** వి. పచ్చాలు గడుగుల పొడవు ఎనిమిది అ. వెడలు గల లావు తల చేప.

**అబిసీ** వి. 1. రౌతు. చంద్రా. 4.192 ; 2. హబిసీవాడు అబిసీనియా దేశస్థుడు.

ఉ. హబసీ ; అర. హబ్సి

<ఉ. హబసీ. అబిసీ దానిసలు పేరుపొందిన రౌతు కావటం వల్ల, అబిసీ రౌతు అనే అర్థంలో రూఢమైంది.

**అబిసీలు** వి. బ.వ. గుఱ్ఱంమీద షికారు, వాహ్యా చంద్రా. 4.192.

**అబిసీలు** చూ. అబిసీ.

**అబోరు** వి. శూన్యం, నిర్జన ప్రదేశం (ఇల్లు 'అబోరు'గా ఉంది= దావురు మంటున్నది).

**అబ్బ** పో.చూ. అప్ప. వి. తండ్రి. వేణు. శ. 12 ; అవ్య. 1 ఆశ్చర్యార్థకం. పార్వ. 2.175 ; 2. పూజ్యతాద్యోతక

సీలా. 2.55 ; 3. వినుగును తెలుపుతుంది. రసిక. 3.59 ; 4. సంతాప సూచకం. రసిక. 3.59 ; 5. ప్రశంసార్థకం.

క. అబ్బ. ఆహా ! అయ్యో ! ప్రశంసను ఆశ్చర్యాన్ని సూచిస్తుంది; తు. అబ్బ ; త. అప్పన్, అప్పా. తండ్రి, ఓ తండ్రీ !, ఆశ్చర్యార్థకం ; అప్పాటా, అప్పాటీ. ఆశ్చర్యార్థకం ; మ. అప్పన్, తండ్రి ; కొంద. ఎబ. తండ్రి ; కుఇ. అబ. తండ్రి, పూర్వీకుడు, ముత్తాత. పెద్ద వాడు, అధికుడు; ఒల్లా. అబ. తండ్రి ; కురు. అబ్బా. తండ్రి ; బ్రా. అబ్బా. తండ్రి, అబా. తండ్రి, తాత, గౌరవార్థక సంబోధన ;

ముండా. సంతా. అబ. తండ్రి (చిన్న పిల్లల సంబోధన); టిబెటన్ మొ. అఫ. మొ. తండ్రి; హీబ్రూ. ఓబా. తండ్రి ;

హిం. అబ్. తండ్రి ; అబూయిద్. మనిషి ; మరా. అబా, ఆబా. పెద్దల సంబోధన ; ఉ. అబూ. తండ్రి, ప్రారంభకుడు :

ఇం. అబ్బ. తండ్రి ; లా. అబ్బస్. దేవుడు.

**అబ్బకాఁడు** వి. 1. అభాగ్యుడు, అదృష్టహీనుడు. వేంక. పంచ. 4.262 ; 2. మూఢుడు. బహుశః <అబ్బ-కాడు ; వ్య. అబ్బ అని నివ్వెరపోయేవాడు. **అబ్బఁడు** వి. తండ్రి. బహుళా. 1.20. **అబ్బబ్బ** వి. పితామహుడు ; అవ్య. ఆశ్చర్యార్థకం. రసిక. 3.59.

**అబ్బకాఁడు** చూ. అబ్బ.

**అబ్బగాళ్లు** వి. పశువులు రాతినేలపై నడవటం వల్ల వడే మెత్త కాళ్లు ; పో.చూ. అబ్బెగాలు.

**అబ్బగించు** అ.క్రి. తాళు, సహించు, ఓర్చు. కు.సం. 2.202, 10.563, 12.841, 848.

<అబ్బు+అ+గించు. అర్థ విపరి. ; సూ.ని. ప్రకారం ఈ ప్రయోగం కు.సం. లోనే కనిపిస్తుంది. అందులో కూడా 'అబ్బగింపక' అనే ప్రయుక్తం.

**అబ్బఁడు** చూ. అబ్బ.

**అబ్బబ్బ** చూ. అబ్బ.

**అబ్బమంచం** వి. నాల్గు దిక్కుల వుండే నాల్గు నక్షత్రాలు.

**అబ్బరకంరాయి** వి. సీసవురాయి (Galena, galenite, lead glance, blue, lead, lead sulphide).

అబ్బరకం<సం. అభ్రకమ్ ; సీసం అనే మూల ద్రవ్యానికి ఇది ప్రధాన ఖనిజం ; కాని దీన్ని పొరపాటున అభ్రకం (మైకా) రాయిగా గుర్తించటం వల్ల ఆ పేరు వచ్చి, అలాగే నిలిచిపోయింది.

**అబ్బరము** గ్రా.చూ. అబ్రము. విశ. 1. అపారం, అమితం. అచ్చ.రా. 6.189 ; 2. ఆశ్చర్యకరం ; వి. అద్భుతం, ఆశ్చర్యం.

**అబ్బురపడు** చూ. అబ్బురము.

**అబ్బురపాటు** చూ. అబ్బురము.

**అబ్బురము** రూ.చూ. అబ్రము. వి. ఆశ్చర్యం, ఆశ్చర్యకరమైన కార్యం. ఉ.రా. 3.104, సీమం. 3.188 ; విశ. 1. అరిది, దుష్కరం. కళా. 5.189 ; 2. ఆశ్చర్యకరం, వింతమైనది, దశా. 3.211 ; 3. కొత్తది.

సూ. ని. దీన్ని అపూర్వ, అద్భుత శబ్దాలనుంచి సాధించింది.

**అబ్బురపడు** రూ. అబ్రపడు. అ.క్రి. ఆశ్చర్యపడు. గయా. 2.18. **అబ్బురపాటు** వి. అబ్బురపడటం, ఆశ్చర్యం. మను. 2.28.

**అబ్బె** అబ్బ-ఎ. అవ్య. అనిష్టం, అనాదరం, మొ. భావాలను సూచిస్తుంది.

**అబ్బెగాలు** వి. శిశువులు పారేడేటప్పుడు వంపుగా పెట్టిన కాలు. దశా. 8.185.

క. అంబెగాలు. పారాడటానికి నేలకు మోపిన (చేతులూ) మోకాళ్లూ.

<క. అంబెగాల్<క. అంబు. విస్తరించటం ; లేదా <క. హంబు.

**అబ్బెంద** వి. వృక్ష విశేషం, ప్రేము (Calamus rotang). యయా. 4.25, 5.48.

క. అబ్బె. పిల్లలు ప్రాసుకునే కలాలు చెయ్యటానికి పనికివచ్చే చెట్టు ; పో.చూ. హబ్బె. ప్రేము.

**అబ్బెసము** వి. అభ్యాసం, అలవాటు. కాశీ. 5.232, సీమం. 3.188.

సం. అభ్యాసః. ఆవృత్తి, పరిశ్రమ, శిక్షణ, అలవాటు, పునశ్చరణ, అధ్యయనం, సైనిక శిక్షణ ; ప్రా. అబ్భాస. పరిశ్రమ, శిక్షణ, పునశ్చరణ, అధ్యయనం ; అ.మా. అబ్భాస. పునశ్చరణ ;

క. అబ్బెస ; తు. అబ్బెస ; త. అప్పియాచమ్.

<ప్రా. అబ్భాస-<సం. అభ్యాస-.

**అబ్బో** అబ్బ+ఓ. అవ్య. ఆశ్చర్యార్థకం.

**అబ్రపడు** చూ. అబ్రము.

**అబ్రము** రూ. అబ్బరము, అబ్బురము. వి. ఆశ్చర్యం. ప్రభా. 1.56.

సం. అభ్ర-. అంతులేనిది, ఆకాశం ;

క. అబ్బర. పెద్ద అరవు, ధ్వని, వాంఛ.

<సం. అభ్ర-. అర్థవిపరి.

**అబ్రపడు** రూ. అబ్బురపడు. అ.క్రి. ఆశ్చర్యపడు. అని. 4.56.

**అభము** రూ. అవము. వి. అశుభం.

**అభిని** రూ. అఫీము. వి. నల్లమందు, చెట్టు జిగురు, నిర్యాసం. ఆం.భా. 2.304.

సం. అహిఫేనమ్. పాము విషం ; అఫేనమ్. నల్లమందు ; నే. అఫిమ్ ; బెం. ఆఫెమా ; హిం. అఫీమ్, అఫిణ్, అఫయూన్ ; గు. అఫె, అఫీమ్. నల్లమందు ; అఫీని. నల్లమందు తినేవాడు ; మరా. అఫీన్, అఫీమ్. నల్లమందుసారం ; అఫ్రూ. నల్లమందు ; అర. అఫ్యన్, ఆఫ్‌యూన్, ఆఫీన్ ;

క. అఫిని, అపిని, అప్పు, అఫియు, అఫీయు, అఫు, అభిని, ఆఫియు. నల్లమందు ; తు. ఒపిని ; త. అపిని, అపిన్ ; కుఇ. అఫు ; పర్జి. ఆఫు ; బ్రా. అఫీమ్ ;

గ్రీ. ఓపియన్, ఒపస్ ; చైనీస్. అఫుయుంగ్.

<మరా. అఫీన్.

**అభినిపాలు** వి. నల్లమందు పాలు.
**అభినిపాలు** చూ. అభిని.
**అభిమానకర్తె** మిశ్రస. వి. ఆత్మగౌరవంగల స్త్రీ, అభిమానవతి. ఐసవ. 5.53.
క. అభిమానగిత్తి. అభిమానవతి, సుకుమారి; మ. అభిమాని. గర్వి, అహంకారి.
<నం. అభిమాన- (ఆత్మగౌరవం)+-కర్తె.
**అమ** రూ.చూ. అమ్మ. వి. స్త్రీ. భార.విరా. 2.100; ప్రత్య. 1. స్త్రీ నామాంత ప్రత్యయం. దశా. 1.24; 2. ప్రేమాదర సూచకంగా కొన్ని పురుష నామాలకు కూడా అంతాగమం. దశా. 1.74.
**అమకరం** రూ.చూ. అమరము². వి. పడవ వెనుక భాగం, తెడాపు.
**అమక్కళము** వి. (పెళ్లి) సందడి, కోలాహలం.
క. అమక్కళమ్, అమర్కళమ్ (అమర్ <సం. సమర-+కళమ్). యుద్ధభూమి, పెళ్లిసందడి.
<క. అమక్కళమ్.
**అమగము** వి. అసహ్యం, రోత.
సం. అమార్గ-. చెరుదారి; ప్రా. అమగ్గ. చెరుదారి, కషాయం మొ. హేయ పదార్థం.
<ప్రా. అమగ్గ-. అర్థవిపరి.
**అమంచి** రూ. అమిచి. వి. వెట్టిపని, హీనవృత్తి.
క. అమించి, అమంచి. వెట్టిపని.
బహుశః < అర. అమాన్. రక్షణ; అమ్న-చి. రక్షితులు చేసే పని, వెట్టిపని.
**అమడ** వి. జంట.
సం. యమళమ్; ప్రా. జమల. జంట; అ.మా. జమల. సరళరేఖలో ఉండటం, పరస్పరం తగిలివుండటం; జమలత్. జంటగా వుండటం; మరా. ఆవళె, జావళె. కవలలు;
క. అమళ్. జంట; తు. అమరు, అవళు. జంట, రెట్టింపు; త. యమళమ్. జంట, కవలలు; మ. యమళమ్. జంట.
<నం. యమళ-.
**అమడకాయ**¹ వి. జంటగాఉన్న కాయ. **అమడతామర మొగ్గ** వి. జంటతామరమొగ్గ. చంద్రా. 6.128. **అమడపిల్లలు** వి. బ.వ. కవలు. **అమడమాటలు** వి. బ.వ. 1. మడత మాటలు; 2. స్వవచోవ్యాఘాతాలు; 3. శ్లేషవచనాలు. **అమడలు**¹ వి. బ.వ. కవలు. దము. 6.42.
**అమడకాయ**¹ చూ. అమడ.
**అమడకాయ**² రూ. ఆమడకాయ. వి. గోల్లగొండి జాతికి చెందిన ఒకరకం కలుపుమొక్క (Cyanotis cucullata).
**అమడతామరమొగ్గ** చూ. అమడ.
**అమడపిల్లలు** చూ. అమడ.
**అమడమాటలు** చూ. అమడ.
**అమడలు**¹ చూ. అమడ.
**అమడలు**² వి. తృణధాన్య విశేషం.
నం. అంబష్ఠ-; ప్రా. అంబట్ఠ-;
క. అంబాడె; తు. అంబడు; మ. అంబల.
**అమదు** రూ.చూ. ఆముదం. వెనుకపల్లి గా.సం. 1073.
**అమండస్తా** రూ.చూ. అమాందస్తా. వి. రోటిలో వస్తువులు తాంబూలం మొ.వి దంచుటకై చిన్న రోలు, రోకలి.
**అమయు** పో.చూ. అమరు. అ.క్రి. ఉపయుక్తమగు. ఉ.హ. 4.213.
క. పో.చూ. అమర్, అమరు. యుక్తమగు, తగి యుండు; సిద్ధపడు, సిద్ధించు; త. అమై. క్రమ పరచు, తగియుండు, సిద్ధపరచు, ఉపయోగయోగ్యమగు, నెరవేర్చు.
<మూ.ద.ద్రా. *అమ్-అయ్.
**అమరకము** చూ. అమరు.
**అమరగాఁడు** చూ. అమరము¹.
**అమరనాయఁకరము** చూ. అమరము¹.
**అమరనాయఁకుఁడు** చూ. అమరము¹.
**అమరపుపాదు** చూ. అమరము².
**అమరము**¹ వి. 1. వేయిమంది పదాతులకు నాయకత్వం; 2. అవసరమైనప్పుడు సైన్య సహాయం చేసే నిబంధన మీద రాజు సామంతునికి ఇనాముగా ఇచ్చే భూఖండం. కృష్ణ. 2.73.
త. అమరమ్.
<క. అమరమ్ <నం. సమరమ్.
**అమరగాఁడు** (-వాఁడు). వి. అమరం అనుభవిస్తూ రాజ సేవ చేసే భటుడు, యుద్ధభటుడు. కుప. చ. 3.9. తె. అమరక్కారన్. **అమరనాయఁకరము** వి. అమరనాయకుని అధికారం. **అమరనాయఁకుఁడు** వి. అమరపు గ్రామాలు పరి పాలించే దొర.
**అమరము**² రూ. అమకరం, అమరాము. వి. పడవ వెనుక భాగం.
త. అమరమ్. పడవ వెనుకభాగం; పడవ నడిపే తెడ్డు; మ. అమరమ్. పడవ వెనుకభాగం; ఏనుగు వెనుకభాగం; వెనుక.
<నం. అపర-.
**అమరపుపాదు** వి. అమరం భాగంలో ఉండే చెక్క. **అమరంగజ్జ** వి. అమరంవైపు చెక్కలమధ్య నీటిలో తేల టానికి వీలుగా ఉన్న పల్లపుభాగం. **అమరంబరువు** వి. వెనుక బరువు.
**అమరంగజ్జ** చూ. అమరము².
**అమరంబరువు** చూ. అమరము².
**అమరలేమ** వి. దేవతా స్త్రీ. కు.సం. 8. 127.
సం. అమర-(దావరేని)+తె. లేమ. మిశ్రస.
**అమరాక** వి. వెన్నుమీద రంపంగల పసుపురంగు చేప; పో.చూ. అమరము².
**అమరాము** చూ. అమరము². వి. పడవ వెనుకభాగం.
**అమరిక** చూ. అమరు.
**అమరించు** చూ. అమరు.
**అమరు** అ.క్రి. 1. ఒప్పు. భార. ఆది. 1.65, పారి. 2.36; 2. సరిపడు, తగు. భార. శాంతి. 1.240; 3. సిద్ధమగు.

భార. అశ్వ. 1.40, ఉ. హ. 6.147 ; బహుళా. 4.4 ; **4.** కలుగు. శృం.నై. 2.110 ; **5.** కుదురు, అనుకూలమగు. వేంక. పంచ. 2.49 ; **6.** నెరవేరు ఫలించు. ఘటికా. 2.113 ; అచ్చ. రా. 1.180 ; **7.** లభించు, అబ్బు. బిల్హ. 2.84 ; **8.** ఏర్పడు, పొనగు.

క. అమరు. సన్నిహితమగు, కలియు, గుంపుగూడు, కన్పించు, ఒప్పు, పేరుపొందు, అధివసించు, ఆధారపడు, ఎదుర్కొను, బాధించు ; తు. అమరుని. శాంతించు, పరిష్కరించు, పట్టుకొను ; అమపుని, ఎమెపుని. శాంతింపజేయు, అణచు, కౌగిలించుకొను ; త. అమర్. వేచియుండు, శాంతించు, విశ్రమించు, పరిష్కరించు, గట్టిపడు, అభివృద్ధిచెందు, ఒప్పు, విస్తరించు, స్థిరపడు; మ. అమరక. అణగు, పదురుకొను, ఆశ్రయించు, ఉపశమించు.

<మూ.ద.ద్రా.* అమర్.

**అమరకము** వి. **1.** అమరము[1] ; **2.** అమరటం, అమర్చటం ; **3.** ఈనాములు మొదలగు సాగుబడి పొలాలను సొమ్ముకు గానీ, ధాన్యాల మక్తాకుగానీ కవులు కదపాలు వ్రాసికొని అమర్చటం. క. అమరికె, అమరెక్కె. ఒప్పు, సరిపోవటం; అమరు-అకము. **అమరిక** వి. **1.** ఒప్పు, అందం. పాంచా. 4.5 ; **2.** కుదిరిక, అనుకూల్యం. శశా. 3.112. క. అమరికె, అమరెక్కె. ఒప్పు, యుక్తత; త. అమరిక్కై. ప్రశాంతత. **అమరించు** స.క్రి. **1.** నియోగించు. వేంక. పంచ. 1.172, పల్నా. 44 ; **2.** చేయు, కావించు. ఇందు 2.12 ; **3.** పెట్టు, ఏర్పరచు, రచించు. హంస. 2.205. **అమరుచు** రూ. అమర్చు. స.క్రి. **1.** ఏర్పరచు ; **2.** చేయు, కావించు; **3.** తాల్చు, ధరించు ; **4.** కూర్చు, సంఘటించు, పెట్టు ; **5.** సిద్ధపరచు. క. అమర్చు, అమరిసు. ఏర్పరచు, నిర్వహించు, కలుపు, అలదు, చేర్చు, ధరించు, గట్టిగా పట్టుకొను, సిద్ధపరచు, చేయు, పొందు ; తు. అమపు, అమర్పు, అమెపు. ఏర్పరచు, ఆపు, అణచు, నొక్కిపట్టు, కౌగిలించు ; త. అమర్త్తు. పని కల్పించు, స్థిరపరచు, శాంతింపజేయు, ఆపు ; మ. అమర్త్తు, అమర్కుక్క. అణచు, లోబరచుకొను. **అమర్చు** రూ.చూ. అమరుచు. స.క్రి. **1.** ఏర్పరచు. భార.ఆది. 2.2, భీష్మ. 1.173, ఆను. 3.223 ; **2.** చేయు, కావించు. భార.ఆది. 6.213, 7.140 ; **3.** తాల్చు, ధరించు. హర. 5.37, శుక. 2. 456 ; **4.** కూర్చు, సంఘటించు. ఇందు. 2.179; **5.** సిద్ధపరచు. <ప్రా.తె. అమర్+చు.

**అమరుచు** చూ. అమరు.

**అమర్చు** చూ. అమరు.

**అమర్ద** వి. పడవ వెనుకభాగం ; గూడునుంచి వెనుకగల భాగం.

**అమలీలు** వి. అటూ ఇటూ సరకులు మోసేవారు.

**అమలు**[1] రూ. అములు. వి. **1.** ఆచరణ, పరిపాలన, ఆచరణలోకి తేవటం ; **2.** విచారణ ; **3.** స్థానం, పదవి.

నే. అమల్దార్. అధికారి ; అమల్. పదవి, పదవీకాలం, గౌరవం, గొప్పదనం; మరా. అమల్. విధి, పదవి, అధికారం, పరిపాలన ; హిం. అమల్. స్థానం, పని, వ్యాపారం, అధికారం, ప్రఖ్యాతి ; ఉ. అమర్ ; అర. అమల్.

త. అమల్, అముల్. పరుల పక్షాన ఒక పొలంపై గానీ వ్యాపారంపై గానీ పెత్తనం.

<ఉ. అమల్.

**అమలుచేయు** స.క్రి. ఆచరణలోకి తెచ్చు. **అమలుదారు** రూ. అమల్దారుడు. వి. తాలూకాలో పన్ను వసూలుచేసే అధికారి, పోలీసు అధికారి, తహశ్శీలుదారు. **అమల్దారుడు** రూ.చూ. అమలుదారు.

**అమలు**[2] వి. మత్తు, మైకం.

గు. అమలపానీ. మత్తు.

క. అమలు, మత్తు, మైకం.

**అమలుచేయు** చూ. అమలు[1].

**అమలుదారు** చూ. అమలు[1].

**అమల్దారుడు** చూ. అమలు[1].

**అమవస** రూ. అమస, అమావాష, అమావాస, అమావాసి, అమాశ, అమాశె, అమాష్, అమాష, అమాస, అమ్మవాసె, ఆమాస. వి. అమావాస్య. భార.ఆది. 5.66, ఆను. 3.159.

సం. అమావస్యా, అమావాస్యా. కూడియున్న చంద్రసూర్యులు గలది, కృష్ణ పక్షంలో చివరి దినం ; అమావాసీ. సామీప్యం ; ప్రా. అమావసా, అమవస్సా, అమావాసా. అమావాస్య ; అ.మా. అమావస్సా, అమావాసా, అమవస్సా ; అప. అమావాస ; హిం. గు. అమాస్ ; సిం. ఉమాసు ; మరా. అవస్ ;

క. అమావాసె, అమాసె, అమావాస్యె ; తు. అమాసె ; త. అమావాశై, అమావాచి ; మ. అమావాస్య ; కొలా. అవుస్.

<సం. అమావాస్యా.

**అమస** రూ.చూ. అమవస.

**అమహత్తు** వి. వ్యాకరణ పరిభాష. మహత్తు పురుషులను తెలిపేది ; మహత్తు కానిది అమహత్తు, స్త్రీ తిర్యగ్జడాలను తద్విశేషణాలను తెలిపేది.

<సం. అ+మహత్ (వ్యు. గొప్పదికాని).

**అమాంఖానా** వి. స్నానాల గది.

హిం. హమామ్, హమ్మామ్. స్నానాల గది ; ఉ. హమ్మామ్ ; పార. హమ్మామ్, హమామ్. వేడి నీళ్ల స్నానం ; అర. హమ్మామ్.

<ఉ. హమ్మామ్+ఖానా (చోటు).

**అమానతు** రూ.చూ. అమానత్తు. వి. న్యాసం. తాకట్టు. విశ్వే. శ. 57.

**అమానత్తు** రూ. అనామత్తు. అమానతు. వి. ఒకరి అధీనంలో ఉంచబడిన సొమ్ము, న్యాసం.

నే. అమానత్. ప్రభుత్వం వసూలు చేసే సుంకం ; హిం.ఉ.పార.అర. అమానత్. నమ్మకం. న్యాసం ; గు. అమానత్, అనామత్ ; మరా. అనామత్. న్యాసం, రోజువారీ లెక్కకురాని మొత్తం.

<ఉ. అమానత్.

**అమాని** రూ. అమానీ. వి. ప్రభుత్వ యాజమాన్యం, ప్రభుత్వ

యాజమాన్యంకింది భూమి.

హిం.ఉ.పార.అర. అమానీ. ప్రభుత్వాధీనం ;

క. అమాని. ధర్మకర్తృత్వం ; న్యాసం ; పన్ను బకాయివల్ల గానీ మరే కారణంవల్ల గానీ ప్రభుత్వపరమైన భూమి, 'ఇజారా' కానిది, హక్కుదారు అధీనంలో లేనిది.

<ఉ. అమానీ.

**అమావిగ్రామాలు** వి. బ.వ. గుత్తకివ్వకుండా కలెక్టరు అధీనంలో ఉన్న గ్రామాలు. **అమానిబాజీబాబు** వి. పన్ను లేకుండ మేడిపాలు ఇచ్చే భూమి. ఉ. అమ్ని+బాజి+ బాబ్ ; బాజి (స్థితి)+బబ్ <ఉ. బబ్ (అంశం, విషయం). **అమానిభూములు** వి. బ.వ. ప్రభుత్వం పక్షాన కలెక్టరు అధీనంలో ఉన్న భూములు.

**అమావిగ్రామాలు** చూ. అమాని.

**అమానిబాజీబాబు** చూ. అమాని.

**అమానిభూములు** చూ. అమాని.

**అమానీ** రూ.చూ. అమాని.

**అమామదస్తా** రూ.చూ. అమాందస్తా. వి. మందు దినుసులు తాంబూలం మొ. వి దంచే ఇనుపరోలు, రోకలి.

**అమాంతము** చూ. అనామతు. వి. చిల్లర బేరం ; క్రి.విఙ. అకస్మాత్తుగా, హఠాత్తుగా.

హిం.ఉ.పార.అర. అమానత్. న్యాసం.

ఉత్పత్తిదారుకూ కొనుగోలుదారుకూ మధ్య చిల్లర వ్యాపారి దళారిగా వుంటూ, వస్తువుల్ని కొంతకాలంపాటు మాత్రమే తనవద్ద ఉంచుకోటాన్నిబట్టి అర్థవిపరి. వచ్చి వుండవచ్చు.

**అమాంతగా(డు** (-కా(డు). వి. 1. చిల్లర బేరగాడు ; 2. నడి కొల్లగాడు, హక్కు లేకుండా మధ్యవచ్చి ఆక్రమించేవాడు. **అమాంతముగా** క్రి.విఙ. 1. అనుకోకుండా, హఠాత్తుగా ; 2. మొత్తంగా, పూర్తిగా. **అమాంతవర్తకుడు** వి. దళారి, నడి బేరగాడు.

**అమాంతగా(డు** చూ. అమాంతము.

**అమాంతముగా** చూ. అమాంతము.

**అమాంతవర్తకుడు** చూ. అమాంతము.

**అమాందస్తా** రూ. అమందస్తా, అమానుదస్తా. వి. రోలు, రోకలి.

నే. హమామ్దస్తా. లోహంతో చేసిన చిన్న కల్వం ; హిం. హమాందస్త ; గు. హమాందస్తో ; ఉ. హావం దస్తా ; పార. అర. హావందస్త.

<ఉ. హావందస్తా.

**అమాంబాపతు** వి. బ.వ. 1. అన్ని రకాలు ; 2. అన్ని సంగతులు ; 3. నానా వస్తువులు.

<ఉ. హమా (మొత్తం)+పార. బాబత్ (అంశం).

**అమార్** రూ. అమారు[1]. వి. లావుతాడు.

**అమారతాడు** రూ. అమ్మారితాడు. వి. పడవ కట్టివేసే తాడు.

**అమారతు** రూ.చూ. ఇమారతు. వి. ప్రభుత్వకార్యాలయం.

**అమారు**[1] వి. ఓడ లంగరు, లంగరు మోకు ; విఙ. తయారైన, సిద్ధమైన.

హిం. అమార్, హార్ :

క. ఆమార్, ఆమ్మార్. ఓడ మోకు :

పోర్చు.స్పా. అమ్రర :

<పోర్చు. అమ్రర.

**అమారుతాడు** వి. మోకు.

**అమారు**[2] వి. అమాడు రాయి. చేలులకు కట్టేది.

**అమారుతాడు** చూ. అమాడు[1].

**అమాలి** వి. బరువులు మోసేవాడు.

గు. హమాల. దోయి, బరువు మోసేవాడు, కూలివా — మరా. హమాల్. కూలివాడు ; ఉ. హామల్. బరువు అర. హమ్మల్. బరువు మోసేవాడు.

<ఉ. హమల్.

**అమావాష** రూ.చూ. అమవస.

**అమావాస** రూ.చూ. అమవస.

**అమావాషి** రూ.చూ. అమవస.

**అమావాపిట్టు** వి. అమావాస్య చీకటి.

**అమాశ** రూ.చూ. అమవస.

**అమాశె** రూ.చూ. అమవస.

**అమాష్** రూ.చూ. అమవస.

**అమాష** రూ.చూ. అమవస.

**అమాస** రూ.చూ. అమవస.

**అమాసమబ్బు** వి. అమావాస్య చీకటి.

**అమిజి** రూ.చూ. అమంజి. వి. జీతబత్తెములు లేనిపని వెట్టిచాకిరి ; విఙ. జీతబత్తెములు లేనిది, వెట్టి.

**అమిడిద** వి. చిక్కుడు కుటుంబానికి చెందిన కలుపు మొక్క (Alysicarpus monififter).

**అమిదం** చూ. ఆముదము.

**అమిరితం** వి. ఒక రకం మామిడి ; అమృతంవలె తియ్యనిది.

<సం. అమృతమ్.

**అమిరితి** వి. ఒకరకం కలుపు మొక్క : ఎంత తీసినా చావనిది.

<సం. అమృతి.

**అమిరె** వి. కొయ్య కండలు పెరిగి, కళ్లు ఎర్రబడి, నీరుకారే కంటిజబ్బు.

**అమిర్చికొను** చూ. అమరు. స.క్రి. దక్కించుకొను.

**అమీతుమీ** వి. ఔనో కాదో ఏదో ఒకటి.

<సం అమ్ (ఔను)+తు (కాని) ; ధ్వని సామ్యం: అర్థ విపరి.

**అమీవ** రూ. అమీన్, అమీనా, అమీను, ఆమీను. వి 1. శిస్తు వసూలు చేసే చిన్న అధికారి ; 2. న్యాయాధికారి తీర్పులలోని ఆస్తి జప్తులు వేలం మొ.వి అమలు జరిపే ఉద్యోగి.

నే. అమిని. న్యాయస్థానం ; హిం. అమిన్. విశ్వసనీయుడు, మంత్రి ; ఉ. అమీన్. ధర్మకర్త. వివాదగ్రస్తమైన ఆస్తి అజమాయిషీకై న్యాయస్థానంచేత నియమితుడైన ఉద్యోగి, మధ్యవర్తి, న్యాయాధికారి.

క. అమిన, ఆమిన. తాత్కాలిక జిల్లా రివెన్యూ అధికారి, సబ్‌జడ్జి, మధ్యవర్తి, కోర్టుతరఫున జప్తు వేలం

మొ. అమలు జరిపే ఉద్యోగి: తు. అమీన, అమీనె, అమినెరు. శిస్తు బకాయీలు నిర్బంధంగా వసూలు చెయ్యటానికి నియమితుడైన ఉద్యోగి: త. అమినా, అమినా, అమిన్ ; మ. అమిన్. అధికారి, పంచాయతీదారు.

<ఉ. అమీన్.

**అహీరు** రూ. అమీరుడు, హంబీర, హంవీర, హమ్వీర. వి. భాగ్యవంతుడు, శూరుడు. మొకంటి సం. 2. పొట్లపాడు 118, 119 వ.

హిం. మరా. ఉ. పార. అర. అమీర్. ధనవంతుడు, నాయకుడు, ముఖ్యుడు, ఉదారుడు, శాసకుడు, సర్దారు.

<ఉ. అమీర్.

**అహీరుఁడు** రూ.చూ. అమీడు.

**అముజు** రూ.చూ. అవుజు. వి. బురద.

**అముడు** వి. అంచులో చిట్ట చివరి భాగం.

**అముదు** రూ. అమదు. వి. అమృతం నైవేద్యం.

సం. అమృత-.; ప్రా. అమయం, అమిఅం, అముయం ; శౌర. అమదం ; అప. అమయ ;

క. అమర్దు, అవర్దు ; తు. అమర్‌; త. అముతు, అమదు, అముద.

<త. అమదు.

**అముదుపడి** పో.చూ. అమృతపడి; అముదు+పడి. వి. నిత్య నైవేద్యం. ద.హిం.శా. 4.1288. క. అమృత. అమృతం, సోమరసం ; తు. అమర్‌; త. అముతుపటి. అన్నం ; అముతుపట్టై. వడ్డన ; అముతు. అమృతం, అన్నం, నైవేద్యం : అముతం, అమిర్తు. అమృతం, అన్నం : అమ్మ. అన్నం ; సం. అమృత- ; అ.మా. అమత, అమయ, అమియా ; పా. అమత ; అప. అమయ, అమిఅ. <త. అముతుపటి ; సం. అమృత (ఆహారం)+తె. పడి (కొల). మిశ్రన.

**అముదుపడి** చూ. అముదు.

**అమురుదండె** వి. మగ్గం తాళ్లు కట్టటానికి ఆధారంగా మగ్గానికి పైన అమర్చిన కొయ్య.

**అములు** రూ.చూ. అమలు.

**అమృతపడి** పో.చూ. అముదుపడి. వి. నిత్యనైవేద్యం.

**అమృతపాణి** వి. ఒక జాతి అరటి పండు.

క. బాతె. అరటి ; కొడ. బాళె ; తు. బారె, బాళె ; త. వాటయ్ ; మ. వాఴ ; కోట. వాగ్, వాయ్, వాణ్ ; తొద. పాల్.

<సం. అమృత-+మూ.ద్రా. *పాట్ ; అమృతం వలె తీయని అరటి.

**అమేష** రూ.చూ. హమేషా. క్రి విణ. ఎల్లప్పుడు, శాశ్వతంగా.

**అమేషా** రూ.చూ. హమేషా.

**అమ్మాఁడమ్మా** చూ. అమ్మక్ డమ్మక్. వి. లోకాభి రామాయణం, మాటామంతి.

**అంప** అనుచిత విభాగం చూ. అమ్ము[1]. విణ. బాణ సంబంధమైన. భార. ఉద్యో. 2.136 ; వి. బాణం.

క. అంబు. బాణం; కొడ. అంబి. తు. అప్పు, అంబు; త. అప్పు. విణ. ; మ. అంపు. బాణం, ఈక ; కోట. అంబ్, అమ్ ; తొద. ఒబ్ ; కొండ. అమ్ ; కుఇ. అంబు. వి. బ.వ.; అప్క. బాణం, బాణాగ్రం ; కువి. అంబు (బ.వ. అప్క) బాణాగ్రం ; పర్జి. గద. ఆంబ్ ;

పో.చూ. సం. అంబ్. పోవ.

<మూ.ద.ద్రా.* అమ్బ్-.

**అంపకట్టె** వి. బాణం. ఆము. 6.74. అంప+కట్టె. బాణంగా చేయబడిన కట్టె ; ఇనుప ములుకులకు బదులు గట్టి కొయ్యకే ములికి చెక్కి బాణంగా వాడే అలవాటును బట్టి వచ్చివుంటుంది. **అంపకయ్యము** వి. బాణయుద్ధం. **అంపకాఁడు** వి. విలుకాడు, విలువిద్యలో నేర్పరి. ఆము. 4.246. క. అంబుగాఱ. **అంపకోల** వి. బాణం. భార. శల్య. 1.248, శృం.నై. 8.139. **అంపగఱి** (-కఱి) వి. బాణానికి చివర కట్టే పక్షి ఈక. **అంపచిచ్చు** వి. బాణాగ్ని. **అంపతప్పు** వి. బాణం తగలకుండా తప్పించుకొనే నేర్పు. వాల్మీకి. 2.95, కకుత్థ్స. 4.57. **అంపదొన** వి. అంబుల పొది. రాజవా. 2.46. క. దొణె, డొణె ; త. తూణి. **అంపపెట్టు** వి. 1. బాణ పాతదూరం. భార. ద్రోణ. 4.228 ; 2. బాణపుదెబ్బ. **అంపపొది** అంప+పొది. వి. అంబులపొది. భార. భీష్మ. 1.106. క. పొదె, పుదె ; త. అంపుప్పుట్టిల్. **అంపపోకడ** వి. బాణ గమనం, బాణ వ్యయం. జై.భా. 5.32. **అంపముల్కి** వి. బాణపుటలుగు. చంపూ. 3.23. **అంపఱ** వి. బ.వ. బాణ పరంపర. భార. ఆది. 4.202, భీష్మ. 2.305 ; వి. బాణం. ఇందు. 2.134. పో.చూ. త. అంపఱా-త్-తూణి. అంబులపొది; మ అంపఱ. అంప+పఱ (సమూహం). **అంపవెల్లి** వి. బాణ ప్రవాహం, బాణ సమూహం. పి. శకుం. 3.133. **అంపసానకట్టె** (–సాన+కట్టె). వి. బండి ఇరుసుకు నొగలు కలిపి కట్టే కఱ్ఱలు. **అంపసాల** వి. ఆయుధశాల. <అంప+ సం. శాలా.

**అంపకట్టె** చూ. అంప.

**అంపకము** చూ. అంపు.

**అంపకయ్యము** చూ. అంప.

**అంపకాఁడు** చూ. అంప.

**అంపకోల** చూ. అంప.

**అంపగఱి** చూ. అంప.

**అంపచిచ్చు** చూ. అంప.

**అంపతప్పు** చూ. అంప.

**అంపదొన** చూ. అంప.

**అంపపెట్టు** చూ. అంప.

**అంపపొది** చూ. అంప.

**అంపపోకడ** చూ. అంప.

**అంపముల్కి** చూ. అంప.

**అంపఱ** చూ. అంప.

**అంపవెల్లి** చూ. అంప.

**అంపసమ్మ** వి. దోనె మొద్దు పగలకుండా బిగించిన ఇనపకట్టు.

క. అమ్బి. పడవ ; అమ్బిగ, అమ్బగ, అమ్బుగ. పడవ నడిపేవాడు ; తు. అంబిగారె ; త. గెమ్బి.

చిన్న పడవ; మ. అమ్ప్-ప్పాట్టు. పడవ నడిపేవాళ్లపాట: పో.చూ. మరా. అమ్బి, అమ్బెకరీ. పడవ నడిపేవాడు.

అంప <క. అంబి + పన్ను <పన్నె (మీట).

**అంపపావకట్టి** చూ. అంప.

**అంపపాల** చూ. అంప.

**అంపాచారము** వి. ధారాపాతం, జలప్రవాహం. వి.పు. పూ. 7.68.

సం. అంబు. నీరు + ఆసార. ప్రవాహం;

త. ఆచారమ్ <సం. అ-సార-. జడివాన.

అంప + అదార. బాణ వర్షంలాంటి జడివాన; ఆసార >ఆదార. అతి విరళమైన రూపం; దీనికి మరో ప్రయోగం లేదని సూ.ని.; అంబు. సం. నీరు, తె. బాణం; సం; అంబు కు అనుచిత పాదేశం; సం. అంభశ్చార. శబ్దభవమని ఆం. వా.

<అంప + సం. ఆసార-.

**అంబి** వి. నీరు.

సం. అంబు. నీరు.

<సం. అంబు.

**అంపించు** చూ. అంపు[2].

**అంపించుకొను** చూ. అంపు[2].

**అంపియ** రూ.చూ. అంపె.

**అంపు[1]** వి. పొదువు, నిడివి — దాని కొలత.

**అంపు[2]** చూ. అనుపు. స.క్రి. 1. పోవునట్లు చేయు, పంపించు. మను. 5.23; 2. ఆజ్ఞాపించు; వి. 1. యుద్ధాదులకు పోయేముందు చేసే ఉత్సవం. దశకు. 8.56; 2. అమ్మవారిని సాగనంపేటప్పుడు చేసే ఉత్సవం. ఆం.బా. 1.143.

త. అనుప్పు. పంపించు.

**అంపకము** వి. పంపించటం, వీడ్కొల్పటం. మృ. వి. 3.69, హంస. 4.6. క. అంప. పంపించటం, వీడ్కోలు; త. అంపకం. అనుజ్ఞ; అనుప్పు. సాగనంపు; మ. అనుప్పుక. సగౌరవంగా సాగనంపు. అంపు + అకము. **అంపించు** స.క్రి. పంపించు. ఉ.రా. 7.50, పల్నా. 37. మ. అనుప్పు. (< √ అన్ + పు + ఇంచు; అంపు + ఇంచు). <మూ.ద్రా. *అన్ (కదలు). **అంపించుకొను** అ.క్రి. పంపునట్లు చేసికొను, సెలవు పుచ్చుకొను. కకుత్స్థ. 3.139, దశా. 2.113. **అంపుదోడు** వి. ప్రయాణమందలి తోడు, యాత్రా సహాయుడు.

**అంపుకొను** స.క్రి. పంచు.

< ? పంపు + కొను.

**అంపుదోడు** చూ. అంపు[2].

**అంపె** రూ. అంపియ. వి. చింపిగుడ్డ ('అంపెలుగట్టి' బ.వ. లోనే ప్రయోగం). సిం. ద్వా. 10.71.

**అంబకళము** చూ. అంబలి. వి. 1. జావ. బసవ. 5.265; 2. అంబలివలె కాచిన రుచ్యమైన పదార్థం. కాశీ. 7.185.

క. అంబకళి, అంబలి, అంబిల. మొ. <సం. ఆమ్లి. రాగి వరి మొ. పిండితో కాచి మజ్జిగ పులుసు కలిపిన జావ; తు. అంబలి.

<అంబ(లి) + క(బ)ళము.

**అంబటపక్షి** వి. కోల శరీరం కలిగి పొలుసులు లేని ముదురు నీలిరంగు చేప (Mene maculata).

**అంబటికాడ** వి. ఒక రకం కలుపు మొక్క (Trianthema portula castrum).

**అంబటికాయ** వి. సాగే శరీరం, కండలు, లోపల బుడ్డగం నల్లటి పెద్ద పీత.

**అంబటిగెట్టాకు** వి. అంబటికాడ.

**అంబటిచేయి** చూ. అంబలి.

**అంబటిజోరిగాడు** చూ. అంబలి.

**అంబటిపోచమ్మ** చూ. అంబలి.

**అంబటిప్రొద్దు** చూ. అంబలి.

**అంబటిమోడు** రూ. అంబలిమూడు. వి. ఒకరకం కలుపు మొక్క (Trianthema monogyna).

**అంబటేల** చూ. అంబలి.

**అంబడ** రూ.చూ. అంబాళము.

క. అంబాడె, అమటె; తు. అంబడె, అమటె; త. అంబిరమ్, అంబళమ్, అంబయమ్; మ. అంపళమ్, అంపాళమ్;

సం. ఆమ్రాతక-, ప్రా. అంబాడ-.

<ప్రా. అంబాడ-.

**అంబడిబేకి** రూ. అంబడి బేడు. వి. సన్నటి తోక ఎనిమిది రెక్కలు కలిగి ఆకుపచ్చ పల్చగా ఉండే తెల్లటి చేప. చూ. బేకి.

**అంబడిబేకు** రూ.చూ. అంబడి బేకి.

**అంబం** రూ. అమ్మం. ఏకిన తర్వాత పొడుగ్గా చుట్టిన ఉన్ని.

**అంబరంవల్లి** వి. బద్రేని, బూదరేణి (Capparis divaricata).

**అంబరసా** వి. మామిడిపండ్ల రసం.

<సం. ఆమ్ర + రస-.

**అంబరు** వి. 1. ఒక విధమైన పరిమళ ద్రవ్యం. హంస. 5.514; 2. పసుపు రంగు.

సం. అంబర-. పరిమళ ద్రవ్యం;

ఉ. పార. అర. అంబర్;

క. అంబర; త. మ. అంపర్. అంబెర్.

<ఉ. అంబర్.

**అంబర్‌చెర్ఖా** వి. ఏకాంబరం అనే ఆయన తయారు చేసిన మర రాట్నం.

**అంబర్‌మాలు** వి. అంబర్‌చెర్ఖా మీద వడికిన నూలు.

**అంబలము** పో.చూ. అలబలము. వి. కల కల ధ్వని.

పో.చూ. త. అంపల్. నింద.

**అంబలి** వి. 1. జావ, పులిజావ. వేంక. పంచ. 1.588; 2. గంజి. ఆము. 1.81.

సం. ఆమ్లికా. పులిసినది; ఆమ్లమ్. పులిపెరుగు, పులిమజ్జిగ;

క. అంబలి, అంబకల, అంబిల, అంబులి, అమ్లి. తమిద జావ, కోడి గ్రుడ్డులోని తెల్ల సొనవంటి జిగట పదార్థం; తు. అంబులి. తమిదజావ, జిగురు పదార్థం; త. అంపలి (<తె. అంబలి). తమిదజావ;

ఒబెల్య్ ; కొలా. అంబ. అన్నం ; అంబల్. ఆహారం ; నా. అంబల్. అన్నం.

<నం. అమ్ల-.

**అంబలిచేయి** వి. అంబలి లాగే చెయ్యి, కుడి చెయ్యి. **అంబలి జోరిగా(డు** (చోరి+కాడు) వి. (అంబలి దొంగిలించే) ఒక రకమైన పక్షి. హంస. 3 12. **అంబలి పోచమ్మ** వి. గవ్వలంత పొక్కులు దూర దూరంగా లేచే ఒక రకం మశూచి. **అంబలిప్రొద్దు** వి. అంబలి లాగే వేళ, మధ్యాహ్నం. **అంబలేల** వి. అంబలి లాగే వేళ. <అంబలి +నం. వేలా (వకార లోపం). **అంబలిపెట్టు** అ.క్రి. (పడుగు మొ. వాటికి) గంజిపెట్టు.

**అంబలిపెట్టు** చూ. అంబలి.

**అంబలిమోదు** రూ.చూ. అంబలిమోదు.

**అంబళము** రూ.చూ. అంబాళము.

**అంబష్ఠ** వి. అమాయకుడు. అం. బా. 3.12.

నం. అంబష్ఠః. బ్రాహ్మణునికి వైశ్య స్త్రీయందు జన్మించినవాడు, వైద్యుడు ; మావటివాడు ; ప్రా. అంబట్ఠో. దేశనామం ; అ.మా. అంబట్ఠహ ;

క. అంబటు. మంగలి, వైద్యుడు ; త.మ. అంపట్టన్. మంగలి.

<నం. అంబష్ఠ-. (అర్థ వివరి.).

**అంబా** రూ. అంబే. వి. ఆవుల ఆవుదూడల ధ్వన్యను కరణం.

క. అంబా, అంబే, అంబ్యా, అమ్మా ; తు. అంబా, అంబే, అంబొ ; త. అమ్మా ; మ. అంప, అమరుక. అరుపు, పాట ;

నం. హంభా.

**అంబాడు** అ.క్రి. పారాడు, పాకు.

క. అంబె, అంబ, అంబు. పాకు.

**అంబారపిణుజు** చూ. అంబారము.

**అంబారము** రూ. అంబారు. వి. 1. ధాన్యరాశి, కుప్ప ; 2. పంటలో ప్రభుత్వంవారి భాగం.

హిం.ఉ. అంబార్. కుప్ప, పోగు ; అంబార్ఖానా. గిడ్డంగి ; గు. అంబార. కుప్ప ; మరా. అంబర, అంబార. ధాన్యపు కొట్టు ; పార.అర. అంబర్. కుప్ప, మొత్తం, గిడ్డంగి ;

క. అంబార. గడ్డివామి ; త.మ. అంపారమ్. కుప్ప, వరికుప్ప, ధాన్యపు గిడ్డంగి.

<ఉ. అంబార్.

**అంబారపిణుజు** రూ.చూ. అంబారుపిడుజు.

**అంబారి** రూ. అంబారీ. వి. ఏనుగుమీది పీఠం, చౌడోలు. రంగా. చ. 1.161.

హిం. అంబారీ, అమారీ ; ఉ. అమారీ, అమ్మారీ ; పార. అమారీ ; అర. అమ్మారీ ;

క. అంబారి ; తు. అంబారి, అంబరి ; త.మ. అంపారి.

<ఉ. అమ్మారీ.

**అంబారిదండె** వి. మగ్గం కాళ్లు కట్టటానికి ఆధారంగా మగ్గానికి పైన అమర్చిన కర్ర, అముదు దండె.

**అంబారిదండెకాడు** వి. అచ్చుకు ఆధారంగా అంబారి దండెకు వేసిన పొడుగుకాడు.

**అంబారీ** రూ.చూ. అంబారి. వి. ఏనుగుమీది పీఠం, చౌడోలు.

**అంబారీలు** వి. గోమార్లు ; చూ. అంబారు పిడుజు.

**అంబారు** రూ.చూ. అంబారము. వి. ధాన్యపు రాశి.

**అంబారుఖానా** వి. సామాను కొట్టు. మెకం. నం. 13, పు. 64.

<ఉ. అంబార్+ఖానహ్ (కొట్టు). **అంబారుపిడుజు** రూ. అంబారపిణుజు, అంబారుపిణుజు. వి. పశువులను అంటి పట్టి రక్తం పీల్చే పురుగు, కొణుజు. క. అంబారె, ఎండు కొయ్యలో ఉండే పురుగు ; అంబారుణ్ణి. కొణుజు ; పో.చూ. తు. ఉణ్జు. **అంబారుపిణుజు** రూ.చూ. అంబారు పిడుజు.

**అంబారుకాడాలు** వి. మట్టిలో ఉండే చిన్న పురుగులు.

**అంబారుఖానా** చూ. అంబారు.

**అంబారుపిడుజు** చూ. అంబారు.

**అంబారుపిణుజు** చూ. అంబారు.

**అంబాల** రూ.చూ. అంబాళము.

**అంబాలము** రూ.చూ. అంబాళము.

**అంబాలు** వి. పల్లెవారి పాటలు.

**అంబాళము** రూ. అంబర, అంబళము, అంబాల, అంబాలము. వి. ఆమ్రాతం, కపీతనం, నల్లమామిడి (Spondias mangifera). రం.రా. ఉ. 116 పు. 15 పం.

నం. ఆమ్రాతకః ; ప్రా. అంబాడకో ;

క. అంబాడె, అమటె, (అమ్టెకాయి, వ్యవ.) <అంబష్టె ; తు. అంబడె, అమడె ; త. అంబిరమ్, అంబళమ్, అంబయమ్ ; మ. అంపళమ్, అంపాళమ్ ; పో.చూ. కుఇ. అంబెటి. ఒక జాతి చెట్టు.

< ప్రా. అంబాట(కో).

**అంబు** రూ.చూ. అమ్ము[1]. వి. 1. బాణం. చమ. 1.25 ; 2. మేదరవాడివద్ద ఉండే బాణంవంటి ఇనప పనిముట్టు ; 3. బలపం ; 4. శుభకార్యాల్లో దీపానికి నూనెవేసే దంటుపుల్ల.

**అంబులపొది** చూ. అంపపొది. వి. బాణములుంచే పొది.

**అంబుదబ్బ** వి. కాడు కట్టిన వింటి బద్ద.

**అంబుదబ్బ** చూ. అంబు.

**అంబుపక్కెర** వి. మత్స్య విశేషం.

బహుశః < అంబు + పక్కెర (బాణం వలె ఉండే చేప).

**అంబులపొది** చూ. అంబు.

**అంబులోజు** వి. కింద తెలుపు పైన నలుపు తెలుపు, పొట్ట కింద మచ్చలు గల చేప.

**అంబెద్దు** వి. అంబెద్దులాటలో ఎద్దుగా నటించే శిశువు ; వ్య. పారాడే ఎద్దు.

**అంబెద్దులాట** వి. బాలక్రీడా విశేషం (చేతులూ మోకాళ్లూ నేల కానించి ఎద్దుల్లాగా పారాడుతూ ఆడే ఆట).

**అంబెద్దులాట** చూ. అంబెద్దు.

**అంబే** రూ.చూ. అంబా.

**అంబేర** వి. అమాయకుడు, పిరికివాడు. పద్మ. 3.57, సారంగ.

చ. 2.56, చంపూ. 2.25.

క. అణ్మ, అమ్మ. పౌరుషం, పరాక్రమం, పరాక్రమవత్త్వం; అణ్మ. పాలకుడు; త. ఆణ్మై. పౌరుషం.

అంబు+ఏద (ఏదు=అదృశ్యమగు; పౌరుషం లేనివాడు); లేదా అమ్బ(ఉ)+పేద (పౌరుషానికి పేద).

**అమ్మ**[1] రూ. అమ, అమ్మా. వి. తల్లి. భాగ. 1.10; ప్రత్య. 1. పూజ్య స్త్రీ వాచకం, పూజ్య స్త్రీ సంబోధన. భార.ఆది. 8.4, భాగ. 10, పూ. 184, 1742, పారి. 1.75; 2. సాధారణంగా స్త్రీ నామాల తుద చేరే ప్రత్యయం. ఉదా. సీతమ్మ, వెంకమ్మ, మొ.; 3. పురుష నామాలకు కొన్నింటికి చివర ప్రేమాదర సూచకంగా చేరే ప్రత్యయం. ఉదా. కృష్ణమ్మ, నాయుడమ్మ, మొ.; ఆశ్చ. 1. ఆశ్చర్య సూచకం. విజయ. 2.73; 2. వాత్సల్య సూచకం. దశా. 6.35.

క. అమ్మ, అబ్బె, అమ, అవ్, అవె, అవ్వ, అవ్వె (<సం. అంబా). తల్లి, స్త్రీ నామాంత ప్రత్యయం. స్త్రీ సంబుద్ధి, పూజ్యస్త్రీ, అవ్వ, గ్రామదేవత, ఆహా, అయ్యో; తు. అమ్మ. తల్లి, పూజ్యస్త్రీ; త. అమ్మా. తల్లి, ఆశ్చర్య సంతోష కరుణ సూచకం; అమ్మ. ఆశ్చర్యార్థకం; అమ్మన్. తల్లి; అమ్మనే. ఆశ్చర్యార్థకం; అమ్మనై. తల్లి; అమ్మాటి. ఆశ్చర్య కరుణోపశమన సూచకం; అమ్మాళ్. తల్లి; అమ్మై. తల్లి; అమ్మైయో. ఆశ్చర్యార్థకం; అంపా. తల్లి; అంపికై. పార్వతి, తల్లివంటిది; మ. అమ్మ. తల్లి, దేవత, అమ్మమ్మ. విషాద సందేహ సంభ్రమ సూచకం; కోట. అమ్మొన్ర్. అమ్న, అమాఌ. తల్లి, దేవత; గోం. అవ్వల్-అవ్వానా- అవ్వాహ్క, తల్లి; కొంద. అయ్న. స్త్రీ, భార్య; కుఇ. అమ. మేనత్త, మేనమామ భార్య, గృహిణి, కన్య, పూజ్యస్త్రీ; కువి. అమ్మ. మేనత్త, అత్త; పర్జి. అవ్వ. పితామహి; కొలా. అమ్మ, అమ్మా. తల్లి; నా. అమ్మతాక్. తల్లిదండ్రులు; అయ్య. స్త్రీ, భార్య; ఒల్లా. అస్కల్. స్త్రీ; బ్రా. అమ్మ. తల్లి, అవ్వ, పూజ్యస్త్రీ సంబుద్ధి;

సం. అంబా. తల్లి, పూజ్యస్త్రీ; ప్రా. అమ్మా; పా. అమ్మ; అ.మా. అమ్మ, అమ్మగా, అమ్మా; అప. అమ్మా.

<ప్రా. అమ్మా (శిశు భాషనుంచి ధ్వన్యనుకరణం); ఈ పదానికి సమీప రూపంలో ఉన్న పదాలు అనేక ప్రపంచ భాషల్లో కన్పిస్తున్నాయి; దీని పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకోవటం కష్టసాధ్యం.

**అమ్మక** రూ.చూ. అమ్మక్క. **అమ్మకచెల్ల** రూ.చూ. ఆశ్చ. ఆశ్చర్య సంతాపాది సూచకం. విజయ. 1.70, దశా. 7.59, క్రీడా. 46. **అమ్మక్క** రూ. అమ్మక. ఆశ్చ. ఆశ్చర్య ప్రశంసా విషాదాది సూచకం. రం.రా. 1.75 పు. 12 పం., చంద్రా. 1.86, విజయ. 1.41. త. అమ్మకో. కరుణ సూచకం. **అమ్మక్కరొ** అమ్మ+అక్క+రో; రూ. అమ్మక్కరో. ఆశ్చ. ఆశ్చర్య సూచకం. రుక్మా. 5.88. **అమ్మక్కరో** రూ.చూ, అమ్మక్కరొ. **అమ్మక్కలు** రూ. అమ్మలక్కలు. వి. బ.వ. స్త్రీలు (తల్లులు అక్కచెల్లెండ్రు – ఆక్షేప సూచక ప్రయోగం). సారంగ. చ. 2.80. **అమ్మగారు** వి. 1. తల్లి; 2. పూజ్యస్త్రీ: 3. దేవత: 4. స్త్రీ నామాంతాన చేరే గౌరవ వాచకం. ఉదా. సీతమ్మగారు. మొ. **శుక.** 3.358. **అమ్మచెల్ల** రూ. అమ్మకచెల్ల. ఆశ్చ. **అయ్యో!** ఆహా! ఓహో!... ఆశ్చర్య సంతాపాది **సూచకం.** భార.శాంతి. 3.387. చంపూ. 1.25, శుక. **2.104.** **అమ్మడుగులు** వి. బ.వ. బంగారంతో అమ్మవారి **పాదల్లాగా** చేసి, దారం గుచ్చి, స్త్రీలు కంఠాన ధరించే **ఆభరణం.** అమ్మ+అడుగులు. పోలేరమ్మ అడుగులు. రసా. **4.87.** **అమ్మతల్లి** పో.చూ. అమ్మవారు. వి. గ్రామదేవత. **అమ్మమ్మ** వి. 1. తల్లి తల్లి, మాతామహి: 2. పూజ్యస్త్రీ: **ఆశ్చ.** ఆశ్చర్య ప్రశంసా విషాదాది సూచకం. ఘటికా. **1.45.** క. అమ్మమ్మ, అమ్మమ, అమమ, అమ్మ, **అవ్వ:** ఆహా! అయ్యో!: తు. అమ్మమ్మ. **ఆశ్చర్యోపశమన** సూచకం: త. అమ్మమ్మ. ఆశ్చర్యార్థకం: మ. అమ్మయ్య. శోక సంశయ సంభ్రమ సూచకం. **అమ్మయ్య** రూ. అమ్మయ్యో. ఆశ్చ. 1. దుఃఖ సూచకం (వ్య. **తల్లి.** తండ్రి; ఓ తల్లి, తండ్రీ!). కవిరా. 3.82; **2. ఆపద** నుంచి ఉపశమన సూచకం; వి. ఉపాధ్యాయుని **భార్య.** **అమ్మయ్యో** రూ.చూ. అమ్మయ్య: అమ్మ+అయ్య+**ఓ.** ఆశ్చ. ఆశ్చర్య భయాది సూచకం. **అమ్మరొ** రూ. **అమ్మరో.** ఆశ్చ. 1. ఆశ్చర్య ప్రశంసాది సూచకం. **భార.విరా.** 3.37, పాంచా. 5.76 (వ్య. ఓ తల్లీ!): **2. దుఃఖ** సూచకం. **అమ్మరో** రూ.చూ. అమ్మరొ. ఆశ్చ. **ఆశ్చర్య** ప్రశంసాది సూచకం. పల్నా. 42. **అమ్మలక్కలు** రూ.చూ. అమ్మక్కలు. శుక. 4.35. **అమ్మల్ల** ఆశ్చ. వాత్సల్య సూచకం. **అమ్మవారు** పో.చూ. అమ్మగారు. వి. **1.** **దేవత.** గ్రామదేవత, గంగతల్లి. కళా. 5.46; **2.** గౌరవనీయురాలు; **3.** మశూచి (మశూచివంటి అంటురోగాలు అమ్మవారి వల్ల వస్తాయని సామాన్య ప్రజల నమ్మకం). క. అమ్మనవరు. గ్రామదేవత, పూజ్యురాలు, మశూచి; తు. అమ్మొనరు. దేవత, గ్రామదేవత; త. అమ్మై. మశూచి. ఆటలమ్మ. **అమ్మాయి** వి. **1.** చిన్నపిల్ల; **2.** కుమార్తె. త. పో.చూ. అమ్మాయ్. మాతామహి; మ. పో.చూ. అమ్మాయి. పినతల్లి, పెత్తల్లి; మేనమామ భార్య. పినతండ్రి పెత్తండ్రి భార్య; అత్తగారు (అమ్మాయి అనేది మొదట్లో స్త్రీ నామాల తుద సంబోధనలో చేరి క్రమంగా వాత్సల్య సూచక ప్రత్యయంగా పరిణమించింది). **అమ్మో** ఆశ్చ. ఆశ్చర్య ప్రశంసా భయాది సూచకం.

**అమ్మ**[2] వి. స్తనము, చన్ను.

క. అమ్మి, అమ్మన్ని. స్తనం; తు. అమణి, అమని, ఉమని; త. అమ్మమ్; మ. అమ్మిన్ని.

**అమ్మం** రూ.చూ. అంబం.

**అమ్మక** చూ. అమ్మ[1].

**అమ్మకచెల్ల** చూ. అమ్మ[1].

**అమ్మకపుపన్ను** చూ. అమ్మకము.

**అమ్మకము** అమ్ము[3]+-అకము[2]; చూ. అము[2]. వి. అమ్మటం, అమ్ముడు. అమ్మకపు పన్ను. వి. ప్రతి రూపాయి అమ్మకం మీద వేసే పన్ను.

**అమ్మక్క** చూ. అమ్మ[1].
**అమ్మక్కరా** చూ. అమ్మ[1].
**అమ్మక్కరో** చూ. అమ్మ[1].
**అమ్మక్కలు** చూ. అమ్మ[1].
**అమ్మక్దమ్మక్** వి. మోనం.
**అమ్మగారు** చూ. అమ్మ[1].
**అమ్మచెల్ల** చూ. అమ్మ[1].
**అమ్మడుగులు** చూ. అమ్మ[1].
**అమ్మణ్ణి** చూ. అమ్మ[1]. వి. అనుగుబిడ్డ.

క. అమ్మణ్ణి, అమ్మి. ప్రేమాస్పదురాలు ; అమ్మ, అమ. 'ఇదిగో విను !' అనే అర్థంలో పాదపూరక శబ్దం ; త. అమ్మణి. పూజ్యస్త్రీ సంబుద్ధి ; అమ్మ. ఇదిగో ; పో. చూ. అణ్ణి. వదిన ; మ. అమ్మిణి. ప్రేమాస్పదురాలు, అనుగుబిడ్డ, తల్లి, భార్య.

<క. అమ్మణ్ణి. అమ్మ + అణ్ణి (ప్రేమసూచక సంబోధన) ; లేదా <త. అమ్మణి.

**అమ్మతల్లి** చూ. అమ్మ[1].
**అమ్మనబోంట్లు** చూ. అమ్మనములు. వి. బ.వ. 1. దొంగ తొత్తులు ; 2. బాలికా క్రీడా విశేషం, అచ్చనగాయలాట.

త. అమ్మానై-ప్-పరువమ్. చిన్నతనంలో 'అమానై' ఆట ఆడే వయస్సు ; అమ్మ (గౌరవనీయమైన) + అన (బాల్య సూచక ప్రత్యయం) + బోంట్లు (స్త్రీలు) ; యువతులు ఆడే ఆట కాబట్టే దానికా పేరు వచ్చి వుంటుంది.

**అమ్మనములు** రూ. అమ్మనలు, అమ్మనెలు, అమ్మానెలు. వి. బ.వ. గచ్చకాయలు మొ.వి ఎగరవేస్తూ బాలికలాడే ఆట, అచ్చనగాయలు. చంద్రా. 4.6, దశా. 8.81.

క. అమ్మాలె. అచ్చగాయలాట, అచ్చనగాయలు ; త. అమ్మానై, అమ్మనై ; మ. అమ్మాన(మ్).

**అమ్మనలు** రూ.చూ. అమ్మనములు.
**అమ్మనెలు** రూ.చూ. అమ్మనములు.
**అమ్మనేచెల్ల** అమ్మ + నే + చెల్ల(ను) ; చూ. అమ్మ : అమ్మచెల్ల. ఆశ్చ. 1. ఆక్షేపోద్దిష్టం. శశా. 3.81 ; 2. పరిహాసోద్దిష్టం. దశా. 2.330.
**అమ్మమ్మ** చూ. అమ్మ[1].
**అమ్మయ్య** చూ. అమ్మ[1].
**అమ్మయ్యో** చూ. అమ్మ[1].
**అమ్మరా** చూ. అమ్మ[1].
**అమ్మరో** చూ. అమ్మ[1].
**అమ్మలక్కలు** చూ. అమ్మ[1].
**అమ్మల్ల** చూ. అమ్మ[1].
**అమ్మవారు** రూ. అమ్మోరు. చూ. అమ్మ[1].

**అమ్మవారినాలికె** వి. చౌడేశ్వరి పండుగనాడు అమ్మవారి గుడిలో పద్మాకారంలో అయిదు రంగుల్లో వేసే ముగ్గు. **అమ్మవారిపొంగు** వి. మశూచి, చిడుములు.

**అమ్మవారినాలికె** చూ. అమ్మవారు.
**అమ్మవారిపొంగు** చూ. అమ్మవారు.
**అమ్మవాసె** రూ.చూ. అమవస.
**అమ్మా** రూ.చూ. అమ్మ. ఆశ్చ. సాధారణంగా బాధా సూచకం.
**అమ్మానెలు** రూ.చూ. అమ్మనములు.
**అమ్మాయి** చూ. అమ్మ[1].
**అమ్మారితాడు** రూ.చూ. అమారతాడు.
**అమ్మి** చూ. అమ్మ. వి. బాలిక, నీచ స్త్రీ.

క. తు. అమ్మి. సాదర బాలికా సంబోధన.

**అమ్మిక** వి. అంబిక, పార్వతి. ఆం.భా. 1.40.

సం. అంబికా. తల్లి, గౌరవనీయురాలు ; అ.మా. అమ్మగా, అమ్మయా. తల్లి ; పా. అంబకా. తల్లి. సాధ్వి, సాదర స్త్రీ వాచకం ;

క. అంబికె. తల్లి, దుర్గ ; త. అంపికై. పార్వతి, తల్లి.

<సం. అంబికా.

**అమ్ము**[1] రూ. అంబు. వి. బాణం. భార.ఆది. 5.234, భా.రా. 5.441, ప్రభా. 2.64.

క. తు. అంబు. బాణం ; త. -అంపు ; మ. అంపు. బాణం, ఏదుముల్లు ; కొంద. అమ్. బాణం ; కుఇ. అంబు బాణం, బాణ ముఖం ; పర్జి. ఒల్లా. అంబ్. బాణం.

<మూ.ద్రా. *అమ్బ్.

**అమ్ములపొది** అమ్ములు + అ + పొది. వి. తూణీరం. భార. విరా. 2.28. **అమ్ముపేటునేల** వి. బాణం పడేటంత దూరప్రదేశం. వి. పు. 4.190.

**అమ్ము**[2] స.క్రి. విక్రయించు. భార. కర్ణ. 2.111; అ.క్రి. అమ్మబడు. వి. పు. 6.325.

గోం. మమ్క్. అమ్ము.

మూ.ద.ద్రా. *అమ్-.

**అమ్ముకొను** స.క్రి. వెలకిచ్చు. విక్రయించు. భార.శాంతి. 1.178.

**అమ్ముకుతరిబె** వి. తలుపు మూలల్లో తీసే సన్నటి గాడి.

క. అముకు. నొక్కు ; తు. అమపుని; త. అముక్కు ; మ. అముణ్ణుక ; కొలా. అముక్.

**అమ్ముకొను** చూ. అమ్ము[2].
**అమ్ముడు** చూ. అమ్ము2. వి. అమ్మకం. హర. 4.37.

**అమ్ముడుపడు** అ.క్రి. 1. అమ్ముడుపోవు, విక్రయింపబడు: 2. అధీనమగు, వశమగు. కు.సం. 6.674. **అమ్ముడుపెట్టు** స.క్రి. విక్రయించు. వైజ. 3.82. **అమ్ముడుపోవు** రూ. అమ్ముడువోవు. అ.క్రి. 1. అమ్మడగు. హరిశ్చ. 4.124 ; 2. అధీనమగు, వశమగు. **అమ్ముడువోవు** రూ.చూ. అమ్ముడుపోవు. అ.క్రి. 1. విక్రయింపబడు : 2. అధీనమగు, వశమగు. హర. 4.36.

**అమ్ముడుకొణిగెలు** వి. బ.వ. ధాన్య విశేషం. హంస. 4.128.
**అమ్ముడుపడు** చూ. అమ్ముడు.
**అమ్ముడుపెట్టు** చూ. అమ్ముడు.
**అమ్ముడుపోవు** చూ. అమ్ముడు.
**అమ్ముడువోవు** చూ. అమ్ముడు.
**అమ్ములపొది** చూ. అమ్ము[1].
**అమ్ముపేటునేల** చూ, అమ్ము[1].
**అమ్మెయి** ఆ[2] + మెయి. అవ్య. హఠాత్తుగా, అకస్మాత్తుగా, దబ్బాటుగా (వ్య. ఆ విధంగా). భార.విరా. 1.74.
**అమ్మొత్తు** *అమ్ము + ఒత్తు. వి. అదుముడు, పీడనం.

క. అణ్ము, అమ్ము. సమర్థమగు, పౌరుషంతో ఉండు; త. అణ్ము. చేరు ; అణ్ణు. చేరు, కలియు, కలుపు.
*అణ్ము > అమ్ము + ఒత్తు.

**అమ్మో** చూ. అమ్మ[1].

**అమ్మోరు** రూ.చూ. అమ్మవారు. వి. గ్రామదేవత.

**అమ్రాయి** వి. మామిడితోపు.
సం. ఆమ్రరాజి.
<ఉ. అమ్రాఈ.

**అయ** రూ.చూ. అయ్య. అవ్య. పూజ్యతా వాచకం. పరమ. 3.172. ప్రత్య. పురుషనామాలకు అనుప్రయుక్తం. భీమ. 4.1.
క. అయ, అయ్య. లింగధారు లుపయోగించే గౌరవ వాచకం ; తు. అయ్య. గౌరవ వాచకం. అయె. పురుష నామాల కనుప్రయుక్తమగు ప్రత్యయం. రామయె, బొంబయె, మొ.
**అయగాండ్రు** రూ.చూ. అయ్యగాండ్రు. వి. బ.వ. పూజ్యులు, పెద్దలు, ఆచార్యులు. పరమ. 3.284. క. అయ్నార్, అయ్యళు, ఆయనవరు, అయ్నోరు. సాదర బ్రాహ్మణ సంబోధన. **అయగారికలలచీర** అయగారు-ఇ + కల-లు-అ + చీర ; కల = చార వి. పురుషులు ధరించే ఒక రకం చారల దోవతి. పర. 2.412. **అయగారు** రూ.చూ. అయ్యగారు. వి. 1. గురువు. యయా. 3.131. 2. పూజ్యుడు. ప్రబంధ. 216. **అయవారు** రూ.చూ. అయ్యవారు. వి. గురువు. కాశ. శ. 73.

**అయగాండ్రు** చూ. అయ.

**అయగారికలలచీర** చూ. అయ.

**అయగారు** చూ. అయ.

**అయబు** రూ. అయివు[2], అయిబు. వి. దోషం, అవమానం, అపకీర్తి.
మరా. అయబ్. లోటు లోపం. ఉ. పార. ఐబ్ ; అర. అయబ్, ఐబ్.
క. అయిబు.
<ఉ. ఐబ్.

**అయయో** అయ్ + అయ్ + ఒ ; రూ.చూ. అయ్యయ్యో. ఆశ్చ. వంతాపార్థకం.

**అయయో** రూ.చూ. అయ్యయ్యో ; అయ్ + అయ్ + ఓ.

**అయరె** రూ.చూ. అయ్యారే.

**అయరే** రూ.చూ. అయ్యారే.

**అయవారు** రూ.చూ. అయ్యవారు.

**అయారె** రూ.చూ. అయ్యారే ; అయా.రె. ఆశ్చ. ఆశ్చర్య ప్రశంసాద్యర్థకం. కాశీ. 5.303, ఇందు. 2.109.

**అయారే** రూ.చూ. అయ్యారే ; అయా + రే. ఆశ్చ. ఆశ్చర్య ప్రశంసాద్యర్థకం. శరా. 4.67.

**అయాలతు** వి. ప్రభుత్వం.
ఉ. పార. అర. ఇయాలత్ ;
<ఉ. ఇయాలత్.

**అయి** రూ. ఐ[2], ఏ[2] ; చూ. అగు. అవ్య. 1. అగు ధాతువు యొక్క భూతార్థకాసమాపక క్రియారూపం, క్త్వార్థకం ; భార.అర. 1.8. నిర్వ. 1.19 : 2. ఉద్దిష్ట విధ్యర్థకా లైన 'ఇ' 'ఉ' లు చివర గల పదాలకు అనుప్రయుక్తం : 3. స్వయంగా, తనంతటతాను అనే అర్థంలో అవధారకం (దీనికి వ్యస్త ప్రయోగం లేదు).
క. ఆగి, అయి, ఆగిసి ; తు. ఆదు ; త. ఆకి ; మ. ఆయిట్టు, ఆయి.
'స్వయంగా' అనే అర్థంలో మాత్రమే 'అయి'కి 'ఏ' రూపాంతరం.

**అయికదురు** వి. ఒక రకం ఉన్ని కదురు.
సం. అయస్. లోహం. ఇనుము ; ప్రా. పా. హిం. అయ.
<సం. అయస్ + తె. కదురు.

**అయిటం** రూ. ఐటం. వి. 1. అంశం : 2. భాగం.
<ఇం. item.

**అయితి** రూ.చూ. ఆయితు. విశే. 1. ఉచితం. వాంఛనీయం : 2. శక్యం. సాధ్యం.

**అయిద** రూ. ఐద ; చూ. ఎయిదు. క్రి. విశే. వెంబడి. వెనుక.

**అయిదార** రూ. ఐదార, బందార ; హి.చూ. వాయిదార. వి. అగ్ని.

**అయిదు**[1] రూ.చూ. ఐదు. వి. పంచ సంఖ్య. భార. ఉద్యో. 1.375, భీమ. 5.67.
**అయిదుకైదువులజంత** రూ.చూ. ఐదుకైదువుల జంత. వి. మన్మథుడు. **అయిదుగురు** రూ.చూ. ఐదుగురు వి. బ.వ. అయిదుమంది. **అయిదుదాయులు** రూ.చూ. ఐదు దాయులు (అయిదు + దాయి = దాయాది ; వి. అయిదు విధాలైన దాయల మీద చేసే పనులు – వడ్రంగం, కమ్మరం, కంచరం, అగసాలెపని, కాసెపని – అనే పంచ శిల్పాలు : ఇవి కులవృత్తులుగా కలవారినే 'పంచాణంవారు' అంటారు). <అయిదు + దాయి. **అయిదువదిగావించు** రూ.చూ ఐదు పది గావించు. స.క్రి. ముక్కలు చేయు : అ.క్రి. మ్రొక్కు, నమస్కరించు (చేతికి ఐదేసి వేళ్లు ; రెండు చేతులూ జోడించినప్పుడు పది వేళ్లూ కలిపి నమస్కరించటం). **అయిదువదిసేయు** (-చేయు) ; రూ.చూ. ఐదు పదిసేయు. అ.క్రి. 1. రెండు చేతులూ జోడించి పది వ్రేళ్లూ కలిపి నమస్కరించు ; 2. వెనుకంజవేయు, వెనుదీయు (ముందు కాలు వెనుక కాలితో చేర్చినప్పుడు రెండు కాళ్ల వేళ్లూ కలిపి పది). **అయిదుమోములవేల్పు** రూ.చూ. ఐదు మోముల వేల్పు. వి. శివుడు.

**అయిదు**[2] రూ. ఐద చూ. ఎయిదు. క్రి.విశే. వెంబడి, వెనుక.

**అయిదుకైదువులజంత** చూ. అయిదు[1].

**అయిదుగురు** చూ. అయిదు[1].

**అయిదుదాయులు** చూ. అయిదు[1].

**అయిదువదిగావించు** చూ. అయిదు[1].

**అయిదువదిసేయు** చూ. అయిదు[1].

**అయిదుమాల్గు** వి. అన్నాలలో ఐదవ మాల్గు చుట్టు.

**అయిదుమూరలజోగి** వి. అయిదు మూరల పొడవు గల కుంటెలం భాగం.

**అయిదుమోములవేల్పు** చూ. అయిదు[1].

**అయిదువ** రూ. ఐదవ. పో.చూ. అయిదు[2]. వి. పతివత్ని, సువాసిని, పుణ్యస్త్రీ. బిల్హ. 3.207.

క. అయ్‌దు. కలియు, కూడు ; అయ్‌దువె, అయ్‌దె. పుణ్యస్త్రీ ; పో.చూ. త. ఐతు. అందమైనది ;

పో.చూ. సం. అవిధవా. విధవ కానిది.

**అయిదువతనము** రూ. అయిదోతనము, ఐదువ తనము, ఐదోతనము. వి. సౌమాంగల్యం, సువాసినీత్వం, **అయిదువ త్రాడు** రూ. ఐదువ త్రాడు. వి. మంగళసూత్రం. రాశి. **అయిదువరాలు** రూ. ఐదు వరాలు. వి. పతివత్ని, సువాసిని, పుణ్యస్త్రీ.

**అయిదువతనము** చూ. అయిదువ.

**అయిదువత్రాడు** చూ. అయిదువ.

**అయిదువరాలు** చూ. అయిదువ.

**అయిదేళ్లాయం** వి. అయిదేళ్లాస్త్రివల ; కండెవలజాతి ; అయిదేళ్ల వెడల్పు కన్నులు గలది.

**అయిదేళ్లాస్త్రివల** వి. కండెవలజాతిది ; అయిదు వేళ్ల దూరేంత కన్నులు గల వల.

**అయిదోతనము** రూ.చూ. అయిదువతనము.

**అయిన** రూ. ఐన ; చూ. అగు. విణ. (అగు ధాతువుయొక్క భూతార్థక విశేషణం) ; జరిగిన, ఏర్పడిన, తగిన, గౌరవింపబడిన. భార.అర. 4.129, నిర్వ. 1.14, శృం.నై. 1.79.

**అయినవారు** విణ. బ.వ. బంధువులు, స్నేహితులు. భార.అను. 2.56.

**అయిన(న్)** రూ. ఐన(న్). క్రి.విణ. 'అగు' ధాతు చేదర్థక రూపం. నిర్వ. 3.78, భార.అను. 3.373, శృం.నై. 2.68 ; సముచ్చ. అయినప్పటికి, కాని.

**అయినవారు** చూ. అయిన.

**అయినిల్లు** రూ. ఐనిల్లు. వి. **1.** ఇంటి మధ్య భాగం. నట్టిల్లు ; **2.** మంచికుటుంబం.

పో.చూ. క. అయిను/ఐను. మూలమైన, ప్రధానమైన, ముఖ్యమైన.

**అయినింటివాడు** విణ. గొప్ప వంశంలో పుట్టినవాడు.

**అయినింటివాడు** చూ. అయినిల్లు.

**అయిను**[1] విణ. నికరం. మొత్తం.

సే. ఐన్. నియమం, నిబంధన ; హిం. ఆఈన్. నియమం ; గు. ఆఈన. నియమం, ఆచారం ; మరా. ఐన్. గొప్ప ఆస్తి ; ఉ. ఐన్. పూర్తి. మొత్తం ; పార. ఐన్. మొత్తం.

< ఉ. ఐన్.

**అయినుజమ** వి. మొత్తం వసూలైన శిస్తు. **అయిను బేరీజు** వి. పూర్తిమొత్తం. **అయినులెక్క** వి. జమాఖర్చు. లెక్క.

**అయిను**[2] వి. యింగిలా బెండ వలకు కట్టిన కట్లు.

**అయినుజమ** చూ. అయిను[1].

**అయినుబల్ల** వి. **1.** వల అల్లేందుకై ఉపయోగించే వెదురుబద్ద ; **2.** తెప్పలో కూర్చుండి నీటినినెట్టూ వెళ్లే వెదురు కొయ్య.

**అయినుబల్లత్రాడు** రూ. ఐనుబల్లతాడు. వి. **1.** అయినుబల్లకు తెప్పకు కట్టిన తాడు. అయినుబల్ల నీటిలో పడిపోకుండా తెప్పకు కలిపి కట్టిన కొబ్బరి తాడు ; **2.** అయినుబల్లకు ఒక రంధ్రం గుండా దూర్చిన దారం.

**అయినుబేరీజు** చూ. అయిను[1].

**అయినులెక్క** చూ. అయిను[1].

**అయిన్తాడు** వి. పరమాను గడ కొత్తకు కట్టిన సావడాను.

**అయింద** రూ. అయిందా. క్రి. విణ. ఇకమీదట, ఇకముందు.

హిం.పార. ఆఇయంద. తర్వాత ; ఉ. ఆఇందహ్ ఆయంద ;

< ఉ. ఆయందహ్.

**అయిందా** రూ.చూ. అయింద.

**అయిపు**[1] రూ.చూ. ఐపు[1]. వి. గుర్తు. ఆనవాలు, జార. ద్వి. శ.సా. 3.103 పు. 8 పం.

**అయిపు**[2] రూ.చూ. అయబు. వి. దోషం, అవమానం, అపకీర్తి.

**అయిపోవు** రూ. ఐ-పోవు ; చూ. అగు. అ.క్రి. పూర్తియగు, అగు. భార.శాంతి. 1.62.

క. ఆగిహోగు. పూర్తియగు ; తు. ఆదుపోపిని, ఆతుపోపుణ ; త. ఆకి-ప్-పో, ఆయ్-ప్-పో.

**అయిబు** రూ.చూ. అయబు.

**అయిబునయిబు** వి. మంచిచెడ్డ, ముద్దుముచ్చట.

**అయిమా** వి. భరణం, జీవనభృతి.

ఉ. యామియా ; పార. యామియ్, యామియహ్, యామియ. రోజువారీ ఖర్చు. అర. యామియహ్. దిన బత్తెం, రోజుకూలి.

< ఉ. యామియా

**అయిమాయిషీ** రూ.చూ. అజ్మాఇషి. వి. అంచనా, పరిశోధన, పరీక్ష.

**అయిమూల** రూ. ఐమూల. మిశ్రన. వి. **1.** రెండుదిక్కులకు నడిమి దిక్కు, విదిక్కు ; **2.** కడమూల, మారుమూల, మరీ ఇరుకైన ప్రదేశం.

సం. మూల. అంచు, మొదలు ; సం. అతి. > ప్రా. ఐ. త. వై. పదను, వాడి.

<సం. అతి > ప్రా. ఐ.

**అయిర**[1] రూ. ఐర ; పో.చూ. అవిరి. వి. నేత్రరోగ విశేషం, కంట్లో పెరిగే దుర్మాంసం, ఆవిరి. పండి. చ. 4.272 ప.

పో.చూ. క. అరి. కంటిజబ్బు ; అయ్‌రి. కంటి క్రింది రెప్పవాపు ; కంటిపాప జబ్బు. త. పో.చూ. అక్కి. (<సం. అక్షి) కన్ను. మరా. ఆహిరా, ఆహేరా. కంటి జబ్బు.

< క. అ్రయి.

**అయిర**[2] రూ. ఐర[2]. వి. ఆర్జవం, ఔచిత్యం, తిన్నన.

సం. అజర. వృద్ధాప్యంలేని, శిథిలంకాని. నిత్య యౌవనంతో కూడిన. మహా. అయిర.

<మహా. అయర- <సం. అజర-.

**అయిరకొను** రూ. ఐరకొను. అ.క్రి. మాను, చక్కబడు.

**అయిరకొను** చూ. అయిర[2].

సంబంధమైన విధి, ధర్మం. మ. అఅమ్. ధర్మం.
<మూ.ద్రా. *అఱ్-.

**అఱకన్ను** రూ.చూ. అరకన్ను. వి. సగం (కొంచెం) మూసిన కన్ను. భార. అను. 3.22, వేంక. పంచ. 4.310, చంద్రా. 2.84. **అఱకాలు** రూ.చూ. అరకాలు, అరికాలు. వి. పాదతలం. భార.అర. 5.377, కు. సం. 638. పో. చూ. క. అంగాలు; తు. అంగాయ; త. అఱంగై; అకంగై. **అఱకూడు** వి. 1. అర్ధాన్నం, కడుపునిండని తిండి. ఆము. 6.69: 2. పూటకూడు. క. అరహొట్టెయూట. **అఱక్రొన్నెలతూపు** రూ. అరక్రొన్నెలతూపు. వి. అర్ధ చంద్ర బాణం. అచ్చ.రా. 6.544. అఱ-క్రొ(న్)+నెల+తూపు. **అఱగొర్దము**. రూ.చూ. అఱగొర్దెము; అఱ-(హాని)+గొర్దము (కీడు). వి. దుండగం, ద్వేషం (అతిశయార్థంకోసం పునరుక్తి). **అఱగొర్దియము** రూ. చూ. అరగొర్దెము. **అఱగొర్దెము** రూ. అఱగొర్దము, అఱగొర్దియము, అరగొర్దె. వి. సాహసం, దుండగం, దౌష్ట్యం. ఉ.హరి. 4.106. **అఱగొఱ** (-గొఱ). వి. 1. కపటం. భీమ. 2.155; 2. భేదం. పారి. 5.62; 3. న్యూనత. త. అత్తైకాత్తై. **అఱచట్ట** రూ. అరచట్ట. వి. చిన్న చొక్కా, మొలవరకు వచ్చే చొక్కా. వైజ. 2.47, రమునా. 7 పు. 6 పం. క. అరచల్లణ, అరచణ్ణ. చిన్నఇజారు, పిర్రలు దిగే ఇజారు; పో. చూ. త. అరై-క్-కైచ్-చట్టై. అరచేతుల చొక్కా; అర్-చ్-చట్టై. పొట్టిలాగు: మ. అరక్కుప్పాయం, -చట్టు. పొట్టి ఉడుపు; సం. శాట, శాటక, శాటి, శాటీ. వస్త్రం; ప్రా. సాడా, సాడగ, సాడిఆ; పా. సాట, సాటక, సాటికా. బహుశః చట్ట < ప్రా. సాడగ < సం. శాటక. **అఱచూడ్కి** వి. అర్ధ వీక్షణం. ఆము. 5.7. పో. చూ. క. అరమాపు. అర్ధ వీక్షణం; పో.చూ. అరెనోట. పక్క చూపు, కటాక్షం; మ. అర. సగం. **అఱచేయి** రూ. అరచెయి, అరచెయ్యి, అరచేయి. వి. కరతలం. భార. అర. 3.128, కాశీ. 5.226. పో.చూ.క. అంగెఇ; పో.చూ. తు. అంగై; త. అకంగై, అంకై, అఱంకై. **అఱచేయు** స.క్రి. 1. వంచించు, మోసపుచ్చు; 2. మరుగు పరచు, దాచు. **అఱజాతి** రూ. అరుజాతి. వి. కులహీనుడు, దుష్టుడు. కు. సం. 7.880, హరి.పూ. 5.239. **అఱపది** వి. పదిలో సగం, ఐదు. రామ రాజీయం 213. క. అరపది. **అఱపేమఁడు** వి. 1. మూర్ఛితుడు. భార.ద్రోణ. 2.74; 2. ప్రాణావశిష్టుడు. భార.సౌప్తి. 1.201. **అఱపేద** వి. మిక్కిలి పేద. అహల్యా. 1.83. పో. చూ. త. అఱ. పూర్తిగా; పో.చూ. కుఇ. పెద. కష్టం. **అరపొఱుడు** వి. సగం గూను. భార. అర. 2.134. క. పొఱ (బయట); త. పుమ్. వీపు. అఱ+పొఱ+డు. **అఱమఱ** రూ. అరమర, అరమరము, అరమరిక, ఎరమరికం. వి. 1. మర్మం, గుట్టు. నిర్వ. 9.126; 3. వ్యాజం, కాపట్యం. నవ.చ. 4.141 పు. 19 పం.<మూ.ద్రా. *అక్‌మర్-. **అరమరిక** రూ. చూ. అఱమర. వి. సందేహం, భేదం, జంకు. **అఱమాట** వి. వక్రోక్తి, వంకరమాట (వ్య. చెడ్డమాట). హంస. 5.70, 71. **అఱమీటుమొన** రూ. అరమీటుమొన. వి. మల్ల విద్యయందు పన్నెండు మొనల్లో ఒకటి. హంస. 1.206. **అఱసంజ** వి. అర్ధ సంధ్య. పద్మ. 3.23. పో.చూ. క. అరసంజె; సం. సంధ్యా; ప్రా. అ.మా. సంఝా. **అఱసేయు** (-చేయు). స. క్రి. 1. వంచించు, మోసపుచ్చు. భార. ఉద్యో. 4.68; 2. మరుగుపరచు, దాచు. శ్రీం. నై. 2.36.

**అఱక** చూ. అఱు. వి. మూపు, స్కంధం. హరి. ఉ. 4.140.

**అఱకట** రూ.చూ. అఱకర. బసవ. 5.140 పం., హరి. పూ. 7.105.

**అఱకటము** రూ. చూ. అఱకర. పద్మ. 9.186.

**అఱకర** రూ. అఱకట, అఱకటము, అఱకరము, అఱకలి, అర్కంట. చూ. అఱు[2]. వి. 1. మూపు, స్కంధం. భార. ఆది. 6.160; 2. పొదిగిలి. అచ్చ. రా. 4.72.
< అఱు-అ-కర.

**అఱకరము** రూ.చూ. అఱకర. వై.భా. 1.10. ద్వి. హరిశ్చ. పూ. 1853.

**అఱకన్ను** చూ. అఱ[1].

**అఱకము** చూ. అఱుగు. వి. అజీర్ణవ్యాధి, అరుకువ. ఆం. భా. 2.128.
క. అఱవె, అఱివె, అటకమె. అజీర్ణవ్యాధి; తు. అరక్కమె. అఱుగు-అము.

**అఱకలి** రూ. చూ. అఱకర. వి. స్కంధం. మూపు. భార. అర. 3.286.

**అఱకాలు** చూ. అఱ[1].

**అఱకూడు** చూ. అఱ[1].

**అఱక్రొన్నెలతూపు** చూ. అఱ[1].

**అఱగమి** రూ.చూ. అఱుగమి.

**అఱగొర్దము** చూ. అఱ[1].

**అఱగొర్దియము** చూ. అఱ[1].

**అఱగొర్దె** పో.చూ. అఱగొర్దెము. వి. దుష్టుడు, దుండగీడు.

**అఱగొర్దెతనము** పో.చూ. అఱగొర్దె; రూ. అఱగొండెతనము. వి. దుండగం, దౌష్ట్యం. బసవ. 5.105 పం.

**అఱగొర్దెము** చూ. అఱ[1].

**అఱగొండెతనము** రూ.చూ. అఱగొర్దెతనము. భల్లా. 5.

**అఱగొఱ** చూ. అఱ[1].

**అఱచట్ట** చూ. అఱ[1].

**అఱకువ** చూ. అఱుగు. వి. 1. అజీర్ణవ్యాధి; 2. తక్కువది, లోపం.

**అఱచు** రూ. ఆర్చు. అ.క్రి. 1. ధ్వనిచేయు, కేకవేయు, బొబ్బపెట్టు. భార.ఆది. 6.168; 2. మొరపెట్టు. భార.అర. 2.112; 3. విలపించు, ఏడ్చు. భార.ద్రోణ. 2.132; స.క్రి. 1. ప్రేలు, వదరు, వాగు. భార.కర్ణ. 3.93; 2. బిగ్గరగా చదువు. ప్రబోధ. 2.7; 3. బిగ్గరగా పిలుచు.
క. అఱుచు, అఱిచు, అఱుచు, ఆర్చు. బొబ్బపెట్టు. తు. అరెదుని. అరచు; త. అత్తై. మ్రోగించు. పలుకు, ధ్వనిచేయు, అలలవలె మ్రోగు, అరచు, గర్జించు; మ. ఆర్క్కుక. బిగ్గరగా అరచు, గర్జించు. కుఇ. రసప

(రసిత) ; కొలా. రవ్(రస్త్). చెప్పు, మాట్లాడు.
**అఱచూడ్కి** చూ. అఱు[1].
**అఱచేతమమచుకొను** చూ. అఱచేయి.
**అఱచేతఁబండ్లువచ్చు** చూ. అఱచేయి.
**అఱచేతఁబ్రాణములుపెట్టికొను** చూ. అఱచేయి.
**అఱచేతికిఁదెచ్చు** చూ. అఱచేయి.
**అఱచేతిది** చూ. అఱచేయి.
**అఱచేతిలోనికివచ్చు** చూ. అఱచేయి.
**అఱచేయి** చూ. అఱు[1].

**అఱచేతమమచుకొను** స.క్రి. అరిచేతిలో పెట్టుకొను, లాలించు. శుక. 3.137. **అఱచేతఁబండ్లువచ్చు** అ.క్రి. అసంభవ కార్యం జరుగు (పొ. అరచేతిలో పళ్లు మొలుచు). కళా. 3.218. **అఱచేతఁబ్రాణములుపెట్టికొను** అ.క్రి. ప్రాణాలువిడువ సిద్ధపడు. భార.స్త్రీ. 2.87. **అఱచేతికిఁదెచ్చు** స.క్రి. వశపరచుకొను. భార.ఉద్యో. 2.182. **అఱచేతిది** విణ. అరిచేతిలో వున్నదానివలె వశమైనది. భార.అను. 1.23. **అఱచేతిలోనికివచ్చు** అ.క్రి. సులభమగు. భోజ.6. 375.

**అఱచేయు** చూ. అఱు[1].
**అఱజాతి** చూ. అఱు[1].
**అఱడా** రూ.చూ. అరడా. వి. కంఠభూషావిశేషం.
**అఱడు** రూ.చూ. అరడా.
**అఱప** రూ. అరప. వి. జొన్నచేలు మొ. వాటి కావలికై ఎత్తుగా కట్టిన మంచె. బసవ. 310.

పో.చూ. క. హర, హరె. వ్యాప్తి. వ్యాపించు ; పరవు. వ్యాపించు ; ద్రా. అర్. ఆశ్రయం.

**అఱవది** చూ. అఱు[1].
**అఱపీనుఁగు** చూ. అఱు[1].
**అఱపు** రూ. అరపు[1]. వి. అరవటం, కూత. భార.ఉద్యో. 3.235, కళా. 3.218.

పో.చూ. క. అఱచు, అఱుచు. అరచు.

<అఱచు.

**అఱపేద** చూ. అఱు[1].
**అఱపొఱడు** చూ. అఱు[1].
**అఱమర** చూ. అఱు[1].
**అఱమఱిక** చూ. అఱు[1].
**అఱమాట** చూ. అఱు[1].
**అఱమీటుమొన** చూ. అఱు[1].
**అఱవ[1]** వి. 1. పెంకెఆవు, ఒఱియ. భార.విరా. 1.101 ; 2. దుష్టుడు. బసవ. 6.202 వ.

త. అఱువై. కీడు, హింస.

**అఱవ[2]** వి. సన్యాసి, భిక్షువు. వైజ. 3.97.

త. అఱవన్. నీతిమంతుడు, యోగి, బ్రాహ్మణుడు ; అఱ(య్). నీతి, సుశీలత ; అఱ(వ్)-అ. నీతిమంతుడు, కర్తవ్యపరాయణుడు.

**అఱవ[3]** రూ.చూ. అరవ[1]. వి. తమిళుడు. చూ. అఱవము. ఆం.భా. 2.103.

**అఱవత** వి. అరవస్త్రీ. కాశీ. 3.109. క. అరవగిత్తి, అరవితి, అర్చితి : పో.చూ. ... ఇర్వల్. రాక్ష (అర్/పెరల్). **అఱవలు** వి. బ.వ. తమిళులు.

**అఱవదు** వి. సస్యవిశేషం. కాశీ. 3.152.
**అఱవత** చూ. అఱవ[3].
**అఱవము** చూ. అఱవ[3]. వి. తమిళభాష.

క. అరవ, అరవు, అరవ్వు, అర్వు. తమిళం ; తు. అరవభాషె ; త. అరవు, అరవర్, అరువర్. తమిళులు ; అరువానాడు. అరవం మాట్లాడే ప్రదేశం. అరువాళర్ ; దక్షిణాదిన ఒగట్లు సంఘానికి చెందిన ఒక తెగ ; మ. అరవమ్. వ్వసి.

<త. అరవ.

**అఱవఱ** విణ. 1. దగ్ధమైన ; 2. కుష్ఠించిన.

క. అఱు. చేపచేయబడు, నరకచేయబడు ; అఱకే. దగ్ధత్వం ; త. అఱు. నరించు, ముక్కలగు ; వఱు. ఎండు ; మ. అరిక్క. చీల్చు, చిలకించు.

అఱు>అఱు+వఱు>వఱు.

**అఱవఱలు** రూ. అరవరలు విణ. 1. దగ్ధం. భార. భీష్మ. 2.136, హరి.పూ. 5.180 ; 2. కుష్ఠించిన. వి. బ.వ. రుసుకలు. అప్ప. 1.197. క. అఱువె. శైథిల్యం, జీర్ణత్వం ; అఱ్క. దగ్ధత ; త. అరాత్రు. రుద్దు. మెరుగు పెట్టు. **అఱవఱసేయు** -చేయు. స.క్రి. 1. దగ్ధంచేయు, ధ్వంసంచేయు. హరి.ఉ. 6.14 ; 2. ఖండించు.

**అఱవఱలు** చూ. అఱవఱ.
**అఱవఱసేయు** చూ. అఱవఱ.
**అఱవలు** చూ. అఱవ[3].
**అఱవంజ** చూ. అఱు[1].
**అఱిమి** వి. కుత్తుకలో పుట్టే ఒకానొక వ్యాధి. బసవ. 3.365.

పో.చూ. త. అఱ. నాశనం.

**అఱిమికొను** అ.క్రి. అఱిమిరోగం కలిగియుండు. కు.సం. 5.641.

**అఱిమికొను** చూ. అఱిమి.
**అఱిమించు** చూ. అఱుము. స.క్రి. అఱుముచేయు, ఎదుర్కొనజేయు, ప్రతిఘటింపజేయు. జై. భా. 4.69.

పో.చూ. క. అతొ. కొట్టు ; త. అత్తైంచి. కొట్టించు ; మ. అఱ. దెబ్బ ; అఱయుక. గట్టిగా కొట్టు.

<అఱుము+ఇంచు.

**అఱిముఱి** క్రి. విణ. 1. అనాలోచితంగా. కు.సం. 2.171 ; 2. వెంటనే, తోడ్తో. భార. విరా. 3.215 ; 3. అత్యంతం, మిక్కిలి. భార. ఉద్యో. 4.317 ; 4. దబ్బిబ్బుగా, తారుమారుగా. భార. భీష్మ. 2.390 ; 5. తరచుగా, దట్టంగా. భార. ద్రోణ. 1.89 ; 6. నిశ్చయంగా, నిజంగా. వసు. 3.179 ; 7. దొత్తిగా. సురా. 90 ; 8. శీఘ్రంగా, వేగంగా ; విణ. అత్యంతం, మిక్కిలి. దశా. 2.30. దడబడ, గడబడ- లాగా తొందరనుగానీ తొందరపాటునుగానీ తెలిపే ధ్వన్యనుకరణం.

**అఱిముఱితనము** వి. కలవరం, క్షోభం. బసవ. 4.372. పో.చూ. తు. అర్యముర్య. ఉద్రేకంతో అరవడం. **అఱిముఱిపడు** అ.క్రి. సంభ్రమించు, తొట్రుపడు.

**అఱిముఱితనము** చూ. అఱిముఱి.

**అఱిముఱివడు** చూ. అఱిముఱి.

**అఱిమెనకుండలు** రూ. అరిమెనకుండలు. పో.చూ. ఐరేని కుండలు. వి. బ.వ. బచ్చెనపని చేసిన పెళ్లికుండలు.

**అఱియు** స.క్రి. నశింపజేయు.

క. అఱి. నశింపజేయు, పాడుచేయు: తు. అఱియుని; త. అఱి ; మ. అఱియుక. నశించు, పాడగు.

<మూ.ద్రా. *అఱ్-.

**అఱిసియ** రూ.చూ. అరిసె.

**అఱిసె** రూ.చూ. అరిసె.

**అఱు**[1] రూ.చూ. ఆఱు[1]. అ.క్రి. క్షీణించు, నశించు. భార.ఆది. 2.13, హరి. 7.83.

క. అఱ్. ఎండు, అదృశ్యమగు ; అఱు. నరుకబడు ; తు. అలి, అళి, అరి, అఱి. నశించు ; త. అఱు. నశించు; మ. అరుక్కుక. తగ్గు.

**అఱు**[2] రూ.చూ. అఱ్ఱు[2]. వి. **1.** మెడ, కంఠం. భార. ఆది. 2.167, కాశీ. 3.12 ; **2.** ముందుభాగం, పురోభాగం. భా.రా. 3.249 ; **3.** ఉపకంఠం, చేరిక, సామీప్యం. మను. 4.16, శుక. 3.586.

**అఱుక్రమ్ము** అ.క్రి. చుట్టూ కమ్ము, కమ్ము. రం.రా. 5.265 పు. 4. పం, కవిక. 4.180. త. అఱు. పూర్తిగా ; అఱు (సమీపం)+క్రమ్ము. **అఱుత(న్)** చూ. అఱ్ఱు. క్రి. విశే. సమీపంలో.

**అఱుకువ** చూ. అఱుగు. విశే. అపక్వం, అపరిణతం, బాగా ఉడకనిది. ఉ. హరి. 4.50. వి. అజకం, అజీర్ణవ్యాధి. ఆం.భా. 2.128.

క. అఱివె. అజీర్ణం ; పో.చూ. అఱువె, అఱ్కమె. శిథిలత, అజీర్ణం ; పో.చూ. తు. అర్కమెయ్. బలమైనకోరిక, అజీర్ణవాతం.

**అఱుక్రమ్ము** చూ. అఱు[2].

**అఱుగు** రూ. అఱువు. అ.క్రి. **1.** జీర్ణమగు. భార. ఉద్యో. 2.52 ; **2.** క్షీణించు, తరుగు, కృశించు. భార. ద్రోణ. 4.220, భోజ. 3.79.

క. అరగు. క్షీణించు, జీర్ణమగు ; అఱె. వికృతమగు ; తు. అర్కుని. తగ్గు, అణగు ; త. అఱు. జీర్ణమగు ; మ. అరుక్కుక, అరు(వ్) . తగ్గు.

<మూ.ద్రా. *అఱ్-.

**అఱుగఁదీయు** (-తీయు). అ.క్రి. తోము, రాచు, అరుగునట్లు చేయు. **అఱుగమి** వి. అజీర్తి. భార. అను. 3.196 ; వరాహ. 12.61.

క. అఱివె. అజీర్తివిరేచనాలు ; అఱువె ; (అఱుగు-అమి). **అఱుగుఁదెవులు** (-తెవులు). రూ. అరుఁదెవులు, అరువుఁదెవులు, అఱుఁదెవులు, అఱువుఁదెవులు. వి. క్షయవ్యాధి. పో.చూ. క. అఱ్. ఎండు, అదృశ్యమగు. అఱుగు+తెవులు. క్షీణించే వ్యాధి. **అఱుగుళ్లు** వి. శిథిలత (అఱుగుడు+లు). **అఱుగువడు** (-పడు). అ.క్రి. క్షీణించు, చెడు. హరి. పూ. 5.239 ;

**అఱుగుడు** రూ. అఱువుడు. విశే. జీర్ణమైనది. శై. భా. 9.197. వి. జీర్ణం కావటం, అరగటం. సాంబో. 2.19 ; వి. బ.వ. తునకలు, ముక్కలు.

పో.చూ. క. అఱివె. జీర్ణం కావటం ; అఱువె. శిథిలత, జీర్ణం కావటం ; పో.చూ. అఱుకు, అఱ్కు. క్షీణించు, చెడిపోవు ; పో.చూ. మ. అరుక్కుక. తగ్గు, క్షీణించటం.

అరుగు-డు.

**అఱుగుళ్లు** చూ. అఱుగు.

**అఱుగఁదీయు** చూ. అఱుగు.

**అఱుగుఁదెవులు** చూ. అఱుగు.

**అఱుగువడు** చూ. అఱుగు.

**అఱుత(న్)** చూ. అఱు[2].

**అఱుదు** రూ.చూ. అరిది. వి. ఆశ్చర్యం. భార. ఆది. 2.187.

**అఱుఁదెవులు** రూ.చూ. అఱుగుఁదెవులు. భార. అను. 3.175.

**అఱుపు**[1] అఱుగు, ప్రేరణ. స.క్రి. **1.** అరిగించు, జీర్ణంచేయు ; **2.** ఇముడ్చు ; **3.** దక్కించు : అ.క్రి. **1.** ఇముడు ; **2.** లొంగు, అడగు ; **3.** దక్కు.

**అఱుపు**[2] స.క్రి. ఉంచు, కాపాడు, భద్రపరచు.

త. అఱు. నివసించు ; అఱై. నివాసం.

**అఱుము** రూ. అర్ము. పో.చూ. తఱుము. అ.క్రి. **1.** ప్రతిఘటించు, మార్కొను. భార. భీష్మ. 2.6, శశా. 8.50 ; **2.** సాహసించు, తెగించు. కాశీ. 2.86 ; **3.** విజృంభించు, అతిశయించు. వసు. 3.179 ; స.క్రి. **1.** ఆక్రమించుకొను, వశపరచుకొను. మార్క. 2.113 ; **2.** ఎదుర్కొను. రం. రా. ఉ. 77 పు. 12 పం ; **3.** ఒత్తిడిచేయు, బాధించు. అచ్చరా. 1.45 ; వి. ఎదుర్కోటం, ప్రతిఘటనం. భార. భీష్మ. 2.306.

త. అఱై. వ్యూహము, సైనిక శిబిరము.

బహుశః <మూ.ద్రా. *చఱ్-.

**అఱువంద్రు** వి. అరవైమంది. కాశీ. 4.188.

క. అఱువదింబర్ ; మ. అఱువదు, అరవై.

అఱు <ఆఱు+వంద్రు <పన్-ఱు.

**అఱువది** రూ. అర్వది, అఱువై, అరవై. వి. అరవై. భార. ఆది. 1.82, కాశీ. 5.266.

క. అఱువత్తు, అర్వత్తు, అరవై ; తు. అజ్బ, అజిప. త. అఱుపతు ; మ. అఱువదు.

అఱు-(ప) వది.

**అఱువు** రూ.చూ. అఱుగు. అ.క్రి. **1.** జీర్ణమగు ; **2.** క్షీణించు, తరుగు.

**అఱువుడు** రూ.చూ. **అఱుగుడు**. విశే. **1**. జీర్ణమైనది. ఉ. హరి. 4.79 ; **2.** శిథిలమైనది ; వి. అరగిపోవటం. **అఱుఁదెవులు** రూ.చూ. అఱుగుఁదెవులు. నిర్వ. రా. 4.65. **అఱువుళ్లు** వి. ఖండాలు, ముక్కలు. భార. కర్ణ. 3.300, భా.రా. 5.548.

**అఱువుడు** చూ. అఱువు.

**అఱువుఁదెవులు** చూ. అఱువు.

**అఱువుళ్లు** చూ. అఱువు.

**అఱువై** రూ.చూ. అఱువది. వి. అరవై. వరాహ. 10.137.

**అఱ్ఱు**[1] రూ.చూ. నఱ్ఱు. వి. ప్రయాణంతో పిక్కక దగిన ఆవు,

కరట. భార. విరా. 1.101.

**అట్టి**[2] రూ.చూ. అటి[1]. వి. కీడు, హాని. ప్రబోధ. 1.50.

**అట్టి**[3] రూ.చూ. అటి. వి. 1. గది. ద్వి. సారంగ. 1.15 వ: 2. పెట్టెలోనగు వానిఅర-.

మ. అఱ, భాగం, గది.

**అట్టిము** రూ.చూ. ఎట్టిము. వి. ముళ్లమోవు.

**అట్టాఁక** అడ్డాఁగు. వి. 1. బాధరికం, మడుగు. కాశీ. 7.178; 2. అడ్డు, అంతరాయం. భోజ. 4.212; 3. ఒత్తుడు. బార. కాశ. 3.89, కళా. 1.26.

త. అట్టుమ్. గోప్యం, అంతరాయం, విచ్చేదం; అబద్ధం. బాధ.

అఁక+అఁక (శ.ర.); అట్టు+అఁక (వాని).

**అట్టాకలి** వి. అర్ధాకలి. తీరని ఆకలి. భోజ. 6.173.

అఁకలి+అఁకలి (శ.ర.): <అట్టు[2]+అఁకలి.

**అట్టాఁగు** రూ. అట్టాఁచు. స.క్రి. 1. బాధించు, పీడించు. రామ. 351, చాటువు; 2. గొంతు పట్టుకొను. దశా. 5.22.

పో.చూ. మ. అర్దిక్క. బాధించు.

అట్టు[2]+అఁగు.

**అట్టాఁచు** స.క్రి. బాధించు. చంద్ర. చ. 5.50.

అట్టు[2]+అఁచు.

**అట్టాడు** అ.క్రి. 1. దగ్గరలో తిరుగు, ఇటూ అటూ తిరుగు, చుట్టు చుట్టు తిరుగు. భార. విరా. 2.42; 2. ఊగులాడు, ఆందోళన మొందు. శృం.నై. 5.183; 3. తహ తహలాడు, తమకించు, విప్ర. 1.68.

పో.చూ. క. అడ్డాడు. వెనుక ముందాడు, విహరించు, వచార్లచేయు.

అట్టు[2]+ఆడు.

**అట్టావు** చూ. అట్టు[1]. వి. అడవి ఆవు

అట్టు[1]+ఆవు.

**అట్టియము** పో.చూ. అటుగు. రూ. అట్టెము[1]. వి. అజీర్ణం.

క. అరివె. అజీర్తి.

**అటు**[1] వి. వృక్ష విశేషం (Bauhinia parviflora.)

**అట్టు**[2] రూ. అటు[2]. వి. 1. కంఠం. భార. విరా. 5.178, దశకు. 3.131: 2. ఉపకంఠం, చేరిక, సమీపం; 3. ముందు భాగం; 4. ఎద్దుమెడ పుండు; 5. గ్రామ నామాల్లో ఉత్తర భాగం, ముఖ్యంగా ఉత్తర సర్కార్లలో: ఉదా. పామట్టు.

క. అట్టు. సన్నిహితంగా ఉండు; తు. అటుక, అట్టుక. సమీపించు, కలియు; అటుక్క. సమీపించు; పర్జి. చర్, చర్తిల్. కంఠం.

**అట్టుకడుగు** స.క్రి. విశ్రాంతి ఇచ్చు (బాగా పనిచేసి వయస్సు చెల్లిన ఎద్దు మెడను పాలతో కడిగి, పని నుంచి వదిలేసి, ఊరికే మేపుతారు. ఆ ఆచారాన్నిబట్టి పై అర్థం వచ్చింది. **అట్టువంచు** అ.క్రి. మెడవంచు, లోబడు.

**అటు**[3] వి. కంకులతో గూడిన పైరు పై భాగం, ఎన్ను, కదురు, గొలును, తల.

**అట్టుకడుగు** చూ. అట్టు[2].

**అట్టువంచు** చూ. అట్టు[2].

**అట్టెము**[1] రూ.చూ. అట్టియము. వి. అజీర్ణం. ఆం. భా. 2.128.

**అట్టెము**[2] వి. బాలిశ క్రీడల్లో ఒక రోజు (ఆ రోజు ఆటను మానివేస్తారు).

**అట్రోడు** వి. దుర్బలస్థితి. ఇ.క్రి. పాడయిపోవు.

**అల**[1] వి. తరంగం, కెరటం. ఉ.రా. 7.283.

క. అలె. అల, కెరటం: ఆలె. అటూ ఇటూ కదలాడు; తు. అలంకుని, అలంగుని. **(అలవలె)** కదలు, ఊగాడు; కలె. అల; త. అలై. అల, ఊచు, వణకించు: మ. అల. అల; కోట. కొద. **అల్క్.** (అలవలె) కదలు; కొలా. ఎలవ. అల.

<మూ.ద.ద్రా. *అల్-.

**అలరాయి** అల+రాయి. వి. గట్టులోవైపు అలల తాకిడికి దెబ్బతినకుండా పరుపుగ దిగించేరాయి, **లోదా** రాయి.

**అల**[2] రూ.చూ. అల్ల[1]. విశ. 1. ప్రసిద్ధమైన. భాగ. 8.95: 2. ఆ (నిర్దేశార్థకం). నిర్వ. 6.88, భార. విరా. 5.285, శృం.నై. 2.124.

**అల**[3] రూ.చూ. అలా. అవ్య. సంబోధనాంత పదాలకు అను ప్రయుక్తం, సంబోధనార్థకం. నిర్వ. 2.24.

**అల**[4] వి. వలపైన గుండ్రంగా ఉంగరంవలె ఉండే భాగం.

**అలక**[1] రూ. అల్క[2]. అల్కా. వి. సూక్ష్మం, సన్నం. మను. 6.31.

సం. లఘుక-. తేలికైన, అప్రధానమైన, అల్పమైన: ప్రా. లహు, లహుఅ, లహుగ. చిన్న, తక్కువ, నీచం. తేలిక; కుమా. హాల్కో. తేలిక; నే. హాలుకొ; బెం.గు. ఉ. హాల్కా; సిం. హాల్కొ;

పో.చూ. క. హాల్కా; పో.చూ. తు. హాల్కు; పో.చూ. త. ఆల్కా.

ద్రావిడ పదమని జె. బ్లాక్; చూ. హాలుకో. టన్నర్.

**అలకన** విశ. పల్చనిది. మను. 6.31; వి. పలుచదనం.

**అలక**[2] రూ.చూ. అలుక[1], అల్క[1]. వి. 1. కోపం, రోషం: 2. ద్రోహచింత.

మ. అలుక్కుక. కలచు.

**అలకపానుపు** రూ.చూ. అలుకపానుపు. వి. పెళ్లిలో పెళ్లి కొడుకు విలాసంగా అలిగి కూర్చోటానికి వేసే పాన్పు.

**అలక**[3] వి. 1. లంగరు 'ఎద్దాడు'కి రాతికి మధ్య కట్టే నూలు తాడు; 2. తొరపసంలో అలుగుకు, ఎంటితాడుకు కట్టే రింగుపంటితాడు; 3. కొమ్ముగర్రకు తగిలించేతాడు; 4. లంగరు (పన)కు పై వైపున ఉన్న గుండ్రటితాడు.

**అలకతాడు** వి. 1. పడవ చెక్కలను దిగించే (అల్లే) తాడు, కొబ్బరి సులక; 2. లంగరుకు రాయి ముడివేసిన తర్వాత మలచి వదిలినతాడు. **అలకముడి** వి. లంగరుకో రాతికి తాడుతో వేసిన ముడి. **అలకలతాడు** వి. వలకు కట్టే కట్టలకు రంధ్రాలుచేసి ఆ రంధ్రాల ద్వారా కట్టలలోకి దూర్చేతాడు, కట్టలు దూర్చినతాడు.

**అలకం** చూ. అలక[1]. వి. తేలిక.

**అలకతట్టు** వి. అరచేతి వెడల్పూ, ఒళ్లంతా కంప, తేనెకు పొడవు, చిన్ననోరు, నన్నటితోకగల తెల్లటిచేప.

**అలకతాడు** చూ. అలక³.

**అలకవ** చూ. అలక .

**అలకపొమవు** చూ. అలక².

**అలకబట్ట** వి. 1. తెలుపుమీద నల్లదార , 2. ఎరుపు నలుపు తెలుపు రంగుల పొర(లు).

**అలకముడి** చూ. అలక³.

**అలకలతాడు** చూ. అలక³.

**అలకా¹** రూ.చూ. అలగా.

**అలకా²** వి. చేపల బుంగపైన పట్టుకునేందుకై ఉన్న పట్టు తాడు.

**అలకాడ** వి. చెవి పై భాగంలో పెట్టుకునే కర్ణాభరణం.

**అలకాతాడు** వి. 1. లంగరు రాయి దగ్గర కట్టే తాడు; 2. కొమ్ముగడతో తగిలించేరాడు.

**అలకాముడి** వి. బరమలో అలుగుకు రాడుకు వేసే ఉంగరం వంటి మరోతాడు.

**అలకాలు** రూ. అలగాలు. వి. బ.వ. బల్ల సొరుగులకు వేసిన ఇత్తడి గుబ్బలు.

ఉ. హల్కా. గుండ్రని ; అర. హల్కహ్.

< ఉ. హల్కా.

**అలకావ్** వి. గేలం యొక్క రాగితీగ.

**అలకి** వి. ఒకరకం కుండ. భార.అశ్వ. 3.156, హరి పూ. 5.221.

సం. అలు(కా). చిన్న నీళ్లకుండ; అలు, ఆలు ; ప్రా.దేశి. అలుగా ;

కొండ. అలె.

<సం. అలు+కా.

**అలకిపుట్టువు** వి. కుండనుండి పుట్టినవాడు, అగస్త్యుడు. ప్రబంధ. 174.

**అలకిపుట్టువు** చూ. అలకి.

**అలకువ** చూ. అలుగు. వి 1. కొరత, న్యూనత; వైముఖ్యం, పెడమొగం. మై. 1.63 ; 2. ఆయాసం, అలసట. భల్లా. 4.

పో.చూ. క. అలకు, అలగు, అలుకు, అలుగు, అలుంగు, అళకు, అళుకు, అళుంకు, అళ్కు. తిరుగాడు, కదలాడు వణకు ; త. √ అలై. కదలు, వణకు, బాధించు, విసిగించు ; మ. అలయుక. వెనుకముందాడు, తిరుగు, అలసిపోవు.

**అలగము** రూ.చూ. అలంగము. వి. 1. కోట ప్రాకారపు గోడకు ఆధారంగా మట్టితోగాని రాతితోగాని ఏర్పరచిన కొరడు కోటగోడ పైభాగం · 2. వరికుప్ప చుట్టూ నూర్చటానికై వరి కట్టలు అమర్చినది, కళ్లం.

**అలగా** రూ. అలకా¹ విశ. 1. ప్రత్యేకమైన ; 2. నీచం, హీనం.

సం. అలగ్న-. అసంబద్ధం, ప్రత్యేకం ; అ.మూ. పా. అలగ్గ; కా. అలొగు. అనుచితంగా ; ఆలగ, అలగ్గ, అలగ్గై. ప్రత్యేకమైన ; బెం. ఆలగ్ ; హిం. ఆలగ్, అలగ ; పం. అలగ్గ ; సిం. అలగు ; గు. అళ్గొ ; మరా.ఉ.అర. అలగ్ ;

క. అలాయిద, అలాహిద ; తు. అలాయిద ; త. అలక్కు. ప్రత్యేకత ; అలకలకాక. ప్రత్యేకంగా , అలక్కలక్కాయ్ ; అలాయితా, అలాతి, అలాతు. ప్రత్యేకమైన ; కుఇ. అల్గె.

< ఉ. అలగ్ < అర. అలగా.

**అలగాఅలగా** వి. విడివిడిగా గూన పెంకులను కాల్చటానికి పేర్చే తీరు. **అలగాఅసామీలు** వి. బ.వ. స్థిర నివాసం లేనివారు. **అలగాజనము** వి. తక్కువజాతి జనం. **అలగాజాతివాఁడు** వి. తక్కువజాతివాడు. **అలగాదేవళం** వి. గ్రామదేవత గుడి. **అలగాపుల్లరి** వి. 1. పొరుగూరి పశువులు మేసేదానికి తీసే రూకలు ; 2. బందెలదొడ్డిలోనుంచి తప్పించుకుపోయిన పశువులమీద వేసే పన్ను. **అలగాభూమి** వి. 1. పశువుల మేతకు వదలిన బంజరు ; 2. నిరుపయోగమైన భూమి. **అలగాసామి** వి. విడి వ్యక్తి, అప్పుడప్పుడు వ్యవసాయం చేసేవాడు.

**అలగాఅలగా** చూ. అలగా.

**అలగాఅసామీలు** చూ. అలగా.

**అలగాజనము** చూ. అలగా.

**అలగాజాతివాడు** చూ. అలగా.

**అలగాదేవళం** చూ. అలగా.

**అలగాపుల్లరి** చూ. అలగా.

**అలగాభూమి** చూ. అలగా.

**అలగాసామి** చూ. అలగా.

**అలగాలు** రూ.చూ. అలకాలు.

**అలగు** చూ. అలుకు². చిక్కటి పేడనీళ్లతో కళ్లం అలుకు.

**అలంకు** పో.చూ. కలంకు. వి. మురికి.

క. అలకు. కదలు ; త. అలంగు.

< త. అలంగు (కొలనిలో నీరు కదలి మురికి అయినట్లు ; అర్థవిపరి.).

**అలంగము** రూ. అలగము, అలఁగము అలంగిం. వి. కోట చుట్టూ వేసిన మట్టి దిమ్మ, వప్రం, కోట గోడ పైభాగం. రామా. 6.246.

సం. అలంఘ్య-. దాటరానిది ;

బెం. అలంగ, అలాంగ · హిం. అలఀగ్ ; ఉ. ఆలంగ్. కందకాలు మొ. ; మరా. అలంగ. కోట ; పార. అలంగ్, ఆలంగ్ ;

క. అలంగ. వప్రం ; త. అలంకమ్.

<మరా. అలంగ.

**అలంగముతిరుగు** అ.క్రి. చుట్టూతిరుగు, వ్యర్థంగాతిరుగు. **అలంగంతొక్కు** అ.క్రి. ఆవేశానికి లోనుగాకుండు.

**అలంగముతిరుగు** చూ. అలంగము.

**అలంగంతొక్కు** చూ. అలంగము.

**అలంగిం** రూ.చూ. అలంగము. వి. వప్రం.

**అలంగిరి** రూ.చూ. ఆలంగీరు, మెకం.సం. 118.8.

**అలంగీరు** రూ.చూ. ఆలంగీరు. మెకం.సం. 1.151.

**అలంగ్రి** రూ.చూ. ఆలంగీరు.

**అలగము** రూ.చూ. అలంగము. వి. వప్రం.

**అలగు** పో.చూ. అలయు. అ.క్రి. **1.** దుఃఖించు, ఏడ్చు, ఆర్తధ్వనిచేయు. భాగ. 1.142, జై.భా. 7.177 ; **2.** అలయు, శ్రమపడు. భాగ. 10. పూ. 1732 ; **3.** అలురు, భయపడు. పాండు. 1.101, కళా. 6.66 ; **4.** జంకు, సంకోచించు. ద్వి.భాగ. 1.688 పం. ; **5.** కోపపడు.

పో.చూ. క. అఱు, అఱ, అఱువు. ఏడ్చు ; అలకు, అలగు, అలుకు, అలుగు, అలుంగు, అళకు, అళుకు, అళుంకు, అళ్కు. కదలాడు, వణకు ; పో.చూ. తు. అలంకుని, అళంకుణ. కదలాడు, వణకు ; పో.చూ. అర్పిని. ఏడ్చు ; త. అలంకు. కదలు, వణకు, ఊగు, వ్రేలాడు, ఆందోళనచెందు, బాధపడు, జాలిగొను, ప్రకాశించు ; మ. అలఞ్ఞుక. కలవరం.

<మూ.ద.ద్రా. *అల్-.

**అలగఁజేయు (-చేయు)** స.క్రి. శ్రమపెట్టు, కల్లతపెట్టు.

**అలగఁజేయు** చూ. అలగు.

**అలహారతి** రూ.చూ. అళహారతి.

**అలచంద** రూ.చూ. అలసందియలు.

**అలచందలు** రూ.చూ. అలసందియలు.

**అలచందాకు** అలచంద+ఆకు. వి. అలసంద ఆకు, త్రిలిన్నపత్రం.

**అలచందాకు** చూ. అలచందలు.

**అలచాట** రూ.చూ. అలవచట. వి. తలంటుతీగ (Ipomea chryseides).

**అలచు** రూ. అలను. వి. తిరస్కారం. భార.ద్రోణ. 5.236.

త. అలచు. నిందించు, గద్దించు ;

పో.చూ. సం. అలస-. అలసిన.

<మూ.ద.ద్రా. *అల్-.

**అలజడి** రూ. అదజడి, అల్లడి. వి. **1.** ఆపద, బాధ, ఇదుమ. భార.ఉద్యో. 3.305, హరి.ఉ. 4.110 ; **2.** క్లేశం, శ్రమం. భార.ఆశ్ర. 1.65, భార.అశ్వ. 4.115.

క. అలసికె. అలసట, అలసత్వం ; త. అలచటి. విసుగు, బాధ ; అలైచటి. అలసట, బాధ ; మ. అలసల్, అలశల్. కలత, అలసట, ఆశాభంగం.

**అలజడిచేయు** స.క్రి. అలజడి కలిగించు. శరభ.హరిశ్చ. 2.210. **అలజడిపడు** అ.క్రి. అలజడినొందు. వరాహ. 4.34. **అలజడిపాటు** వి. కలత. భార. అను. 2.64. **అలజడిపెట్టు** రూ. అదజడిపెట్టు. స.క్రి. అలజడి కలిగించు. మొల్ల. 1.49.

**అలజడిచేయు** చూ. అలజడి.

**అలజడిపడు** చూ. అలజడి.

**అలజడిపాటు** చూ. అలజడి.

**అలజడిపెట్టు** చూ. అలజడి.

**అలజడిదరి** వి. ఒకానొక పక్షి (విరళ ప్రయోగం).

**అలచు** అలఁగుప్రేర. స.క్రి. బాధించు, శ్రమపెట్టు, అలగ చేయు. భార.ద్రోణ. 2.321, భా.రా. 3.2.303, కాశీ. 3.10.

త. అలచు. తిట్టు, గద్దించు ; అలట్టు. బాధించు ; మ. అలెక్కుక. కొట్టుమిట్టాడు. సంతెలు బాదుకొను ; అలప్పల్. విసుగుదల. కోపం : అలట్టుక. తొందరపెట్టు.

<మూ.ద.ద్రా. *అల్-.

**అలది** రూ.చూ. హాళది. వి. పసుపురంగు.

**అలందుర** రూ. అలందురు. వి. ఖేదం. దుఃఖం. భార.ఆది. 5.139 ; అ.క్రి. దుఃఖించు. భార.విరా. 5.139.

మ. అళాన్ను, అళాప్పుక. సంక్షోభించు ; త. అలంత్తై. బాధ ; అలంతలై. కలత. దుఃఖం. విసుగు, తబ్బిబ్బు ; మ. అలతి. బాధాకరం.

<మూ.ద.ద్రా. *అల్-.

**అలందొక్కురు** చూ. అలమ్[1].

**అలఁత** చూ. అలయు. వి. **1.** దుఃఖం. భార.ఆర. **2.39.** విరా. 2.303 ; **2.** అలయిక, శ్రమం. భార.అశ్వ. **4.64.** హరి.పూ. 2.17 ; **3.** బాధ. వ్రత. 1.147.

త. అలంత్తై. బాధ ; అలంతలై. కలత, దుఃఖం. విసుగు, తబ్బిబ్బు ; అలు. అలయు ; మ. అలతి. బాధ, దుఃఖం.

<మూ.ద.ద్రా. *అల్-.

**అలఁతి** విశే. **1.** తరం, శక్యం. కు. సం. **4.432 ; 2.** సూక్ష్మం, చిన్నది. భార.విరా. 4.105, ద్రోణ. **2.116,** శాంతి. 2.21 ; **3.** పలుచనిది. వసు. 1.107 ; **4.** అల్పుడు, తక్కువవాడు. మల్ల. నీతి. 11 ; వి. **1.** పరిమితి, కొలది. కు. సం. 9.209 ; **2.** అల్పమైన యత్నం. భార.ఉద్యో. 4.261 ; **3.** తేలిక. భార.విరా. 2.228.

క. అళవు, అళతె. పరిమాణం ; అళ్, అళవే. అధికారం, సామర్థ్యం, శక్యత, ఒందుదాటు, బలం ; అళవి. శక్తి ; తు. అళతె. పరిమాణం ; త. అళవై. పరిమితి, ఎల్ల ; అళవు. ఆవరకు, ఆమాత్రం, పరిమాణం ; అళ్. కొలుచు, పరిమితిచేయు ; మ. అళవు. ఆవరకు ;

పో.చూ. సం. అల్. సమర్థమగు ; అలమ్. శబ్దాన్ని సాధించటంకోసం అల్ ధాతువు సృజించబడింది ; అరమ్. తద్వ్యతి రూపం ; అలమ్ (చాలు, తగినంత, సమానం మొ.) ; ప్రా. అలమ్. పూర్తి ; అ.మా. అల. సమర్థుడు ; అలమ్. పూర్తి, సమర్థం.

<మూ.ద.ద్రా. *అళ్-.

**అలఁది** రూ.చూ. హాళఁది. వి. పసుపురంగు.

**అలఁదు** స.క్రి. పూయు, రాచు. భార.విరా. 1.107, కాశీ. 1.48.

పో.చూ. క. అళ్. చేరు, కలియు ; తు. అలంబుని. బట్టలుతుకు ; త. అలమ్పు. బట్టలుతుకు ; అళవు. కలుపు ; అళ్, అళై. కలియు ; మ. అలక్కుక. బట్టలుతుకు.

**అలఁదురు** రూ.చూ. అలందురు. అ.క్రి. **1.** క్షోభించు, కలత చెందు. భార.ఆది. 5.139 ; **2.** దుఃఖించు, ఏడ్చు. భార ద్రోణ. 2.257, నిర్వ. 5.

**అలవాటి** రూ. అనపనూడి, అల్పి. వి. గుండునూడి.

స్పా. అల్ఫిలెర్ ; పోర్చు. అల్ఫినేతి ;

నే. అల్పిన్, ఆల్పిన్ ; హిం. అల్పిన్, ఆల్పిన్

(3)

ఉ. అల్ఫిన్.

త. అలప్పునాత్తు.

<పోర్చు. అల్ఫినేతి.

**అలపాల** అవ్య. ఒక అంతట, తేలికగా.

సం. అల్ప-.

అలపాలు (<సం. అల్ప-.)+అన్.

**అలవు** రూ. అలుపు[2]; చూ. అలయు. వి. అలసట, శ్రమం. హర. 5.36, శివరా. 3.26; స.క్రి. శ్రమపెట్టు.

క. అలవు, అల, అలువు. అలసట, బడలిక; త. అలైప్పు. కదలిక, వణకు, కలత, దుఃఖం: మ. అలుప్పు. అలసట; అలప్పు. కలత, తబ్బిబ్బు.

**అలఫు** వి. వెయ్యి (1000).

ఉ. పార. అల్ఫ్. వెయ్యి; అర. అల్ల్ఫ్.

<ఉ. అల్ఫ్.

**అలబడి** వి. అలగాజనం.

**అలబడినోరు** వి. బూతులు మాట్లాడేవాడు (అర్థవిపరి.).

**అలబడికొదవ** వి. పరువుతక్కువపని.

**అలబడినోరు** చూ. అలబడి.

**అలబడికొదవ** చూ. అలబడి.

**అలబలము** వి. కలకలం, సందడి, జనులు, పక్షులు మొ. వాని ధ్వని. పారి. 1.105.

క. అలంబు, అలమ. కదలు; తు. అలంబుని. త. అలవలై. వదరుబోతు; అలంపల్. శబ్దం, ధ్వని: అలప్పల్. వ్యర్థ ప్రసంగం, గందరగోళం; అలంపు. ధ్వనిచేయు, మొరయు, గుసగుసలాడు.

**అలబొ(పొ)ద్దు** వి. సూర్యాస్తమయానికి ముందువేళ.

అల (కొంచెపు)+పొద్దు (అల్ల, అల=కొంచెం, మందం, శాంతం).

**అలమ్[1]** చూ. అలుము[1].

**అలందొక్కుడు** వి. వెంపలి, నీలి, జనుం, సీతాఫలం, కానుగు మొ. వాటి ఆకులు ఎరువుగా మడిలో తొక్కటం.

**అలమ్[2]** వి. తీగెలు పాకేందుకు నాటిన అల్లు కర్రలు.

హిం. ఉ. పార. అర. అలమ్. జెండా.

<ఉ. అలమ్.

**అలమట** చూ. అలమరు. వి. 1. దురవస్థ, కష్టం, బాధ. భార. అర. 1.213, విరా. 2.104, హర. 2.102; 2. శ్రమం, అలసట. బా.రా. 1.481; 3. దుఃఖం, చింత. ఉ.హ. 5.94.

క. అల. బడలిక, బాధ; త. అలం, దుఃఖం, బాధ, దురవస్థ; అలమరల్, తబ్బిబ్బు, కలవరపాటు; అలు. అలయు, బడలు; మ. అలంభావం. చాలుననే భావం, విసుగుదల.

**అలమటపడు** స.క్రి. అలమటపొందు, చింతించు. పద్మ. 8.162. **అలమటించు** అ.క్రి. 1. దుఃఖించు, ఏడ్చు. వి.పు. 7.79; 2. విచారించు, అరయు, పరిశీలించు. ద్వి.శ.సా. 2.89 పు. 22 పం.

**అలమటపడు** చూ. అలమట.

**అలమటించు** చూ. అలమట.

**అలమర** రూ.చూ. అలమారు.

**అలమరగూడు** వి. తలుపులు లేని అలమర అర.

**అలమరగు** వి. కలిసిమెలసి వుండే అలవాటు.

**అలమరగూడు** చూ. అలమర.

**అలమరు** అ.క్రి. 1. శ్రమపడు, బాధపడు. శివరా. 2.106. వేంక. పంచ. 1.130; 2. విలపించు, ఏడ్చు. వేంక. పంచ. 4.493.

త. అలమరు, అలమరల్ (< అలమ్‌వరు). తబ్బిబ్బుపడు, నివ్వెరపోవు, విసుగుజెందు, దుఃఖించు.

<అలమ్+(వ్)అరు.

**అలమార** రూ.చూ. అలమారు.

**అలమారు** రూ. అరమర[2], అరమార, అరమాలు, అలమర, అలమార, అల్మార, అల్మారా, అల్మారు, అల్మైరా, అన్మారా. వి. బీరువా, సొరుగులుగల ఎత్తైన కర్రపెట్టె; గోడకు అరలు అమర్చి తలుపులతో ఎత్తిన చిన్న గుమ్మం, గోడ బీరువా.

నే. అల్మారి, అలామారి. బీరువా; హిం. అలమారి, అలమారి; ఉ. అల్మారి;

క. అల్మైర; తు. అల్మెరి; త. అలమారి; మ. అల్మారి; పోర్చు. అల్మారిఒ.

<పోర్చు. అల్మారిఒ.

**అలమారుకోనేరు** రూ. అల్మర కోనేరు, అల్మారా కోనేరు. వి. చతురస్రాకారంగా అలమర సొరుగుల వంటి దిగుడు మెట్లు గల బావి.

**అలమారు కోనేరు** చూ. అలమారు.

**అలమారుచు** స.క్రి. బండి ఎద్లను మార్చి కట్టు.

<అలు-అ+మారుచు (గొడ్లను మార్చటం); బహుశః <వల(ను)+మారుచు (కుడి ఎడమ పక్కలు మార్చటం).

**అలము** అ.క్రి. వ్యాపించు, ప్రసరించు. భార.శాంతి. 4.51; స.క్రి. 1. ఆక్రమించు, క్రమ్ము. నిర్వ. 8.57, భీమ. 4.121: 2. దరిజేరు, సమీపించు. మార్క. 8. 205; 3. పరివేష్టించు, ఆవరించు, చుట్టుకొను. భాగ. 9.537; 4. అలదు, పూయు. ఆము. 5.34; 5. సందిట బట్టు, కౌగిలించు, వసు. 3.146; 6. అదుము, ఒత్తు. పాండు. 3.156, పరమ. 2.42; 7. గ్రహించు, పట్టుకొను. కువ.చ. 4.194; 8. కప్పు, మూయు. హంస. 2.63; వి. శాక విశేషం, నేలపై పాకే తీగ. భా.రా. 5.186, నల. 1.140.

క. అలంబు, అలబు, అలుబు, అలుంబు. నీటిలో గుంజు, ఉతుకు; అలబు, అలుబు. శాక విశేషం (Alysicarpus); అళుర్. కమ్ము, కప్పు: అళుమ్పు. ఆధిక్యం, గొప్పదనం; తు. అలుంబుని, లుంబుని. నీటిలో గుంజు, ఉతుకు; త. అళవు. కలుపు, కుళలప్రళ్ళ చేయు; అలంపు. తిరుగు, వెనుక ముందాడు: అలై. కలుపు, కలియు.

<మూ.ద్రా. *అళ్-.

**అలముకొను** స.క్రి. 1. ఆక్రమించు, అలము. భార.మౌ. 106, కాశీ. 1.111; 2. పొందు. శృం.నై. 4.125;

3. కౌగిలించుకొను. వసు. 5.57 ; 4. పైకొను, పైబడు. రామ. 2.6 ; 5. ఆచ్ఛాదించు, కప్పు. యయా. 5.118 : అ.క్రి. 1. ఏకీభవించు, కలిసిపోవు. భార.ఉద్యో. 2.87 : 2. ప్రసరించు, వ్యాపించు. భార. శాంతి. 4.60 ; 3. అభిముఖమగు. వాసి. రా. 1.98.

**అలముకొను** చూ. అలము.

**అలమేలుమంగ** రూ.చూ. అలరుమేలు మంగ. ప్రబంధ. 2.

**అలమేల్మంగ** రూ.చూ. అలరుమేలు మంగ. ఆము. 1.87.

**అలంపనా** రూ.చూ. ఆలంపనాహ్. మెకం. వం. 113.20.

**అలంపనాహ్** రూ.చూ. ఆలంపనాహ్.

**అలంబోతు** వి. తోకలేని కోతి.

బహుశః < అలము + పోతు.

**అలయు** రూ. అలియు. అ.క్రి. 1. వినుగు, వేసారు. భార. ఆది. 8.183 ; 2. శ్రమపడు, డయ్యు, ఆయాసపడు. భార. అర. 2.26 ; 3. తడయు, ఆలస్యంచేయు. ఉ.హ. 2.91 ; 4. చింతిల్లు, వగచు. భాగ. 9.730.

క. అల. అలసట ; అలె. అటూ ఇటూ కదలాడు, తిరుగాడు ; తు. అలెయుని, అలెవుని, అలెపుని. అలయు ; అలసుని, అలజుని. అలయు, వినుగు జెందు, బాధపడు ; త. అలై. తిరుగు : అల్లా. దుఃఖం ; అలు. అలయు ; మ. అలయుక, అలసుక. అలయు ; కోట. అల్వ్. అలయు ; గోం. అలాఙ్. అలసట ; కుఱు. లయాకొయా. నిర్లక్ష్యంగా తిరగటం ; లైకొయొర్నా. ఒళ్లువిరుచుకొను ; పో.చూ. బ్రా. అల్లా. కలవరం ; హలాక్. అలసిన, బడలిన.

< మూ.ద్రా. *అల్-అయ్-.

**అలయించు** స.క్రి. ఆయాసపెట్టు, మించు. భార.ద్రోణ. 2.17, ఉ.రా. 1.99. త. అలైచు. కలతపెట్టు ; అలై. పీడించు, విసిగించు, దుఃఖపెట్టు ; మ. అలెక్కుక. కొట్టుమిట్టాడు, దుఃఖంతో గుండెలు బాదుకొను. **అలయిక**. వి. ఆయాసం, శ్రమం. కళా. 6.224. క. అలసికె. అలసట ; త. అలైచ్చల్ ; మ. అలచ్చల్. వినుగు, దుఃఖం.

**అలయించు** చూ. అలయు.

**అలయిక** చూ. అలయు.

**అలరమ్ము** చూ. అలరు.

**అలరాయి** చూ. అల[1].

**అలరారు** చూ. అలరు.

**అలరించు** చూ. అలరు.

**అలరింత** చూ. అలరు.

**అలరు** అ.క్రి. 1. కలుగు, ఉదయించు. భార.అర. 1.360, బసవ. 2.506 పం. ; 2. (పూవు) విరియు, విచ్చు. భార. విరా. 2.316 ; 3. పూచు, పుష్పించు. భార.శల్య. 1.129, ఆము. 5.133 ; 4. వికాసంపొందు, శోభాయుక్తమగు. భార.ఆది. 5.186, శల్య. 2.228 ; 5. సంతోషించు, ఆనందించు. భార.ఆశ్ర. 2.143, శృం.నై. 1.74 ; 6. ఒప్పు, తగియుండు. ఆము. 5.143. వి. 1. పుష్పం, పువ్వు. మను. 3.84, ఆము. 2.19 ; 2. సంతోషం. అచ్చ. రా. 5.76 ; 3. ఒప్పు, శోభ.

క. అలర్, అరల్, అరళ్. విస్తరించు, ఉబ్బు, విచ్చు, వికసించు, సంతోషించు ; తు. అరలుని, అరళుని, అరళుణ, అలదుని, అడ్లుని. విచ్చు, వికసించు ; త. అలర్, అలరి. విచ్చు, వికసించు, వ్యాపించు, ప్రకాశించు, ఏర్పడు, కూడు ; మ. అలరుక. విచ్చు, వికసించు.

< మూ.ద.ద్రా. *అలర్.

**అలరమ్ము** వి. పుష్పబాణం. నిర్వ. 1.38. శృం.నై. 1.81. క. అలరంబు, అలరమ్బు. పూలు బాణాలుగా గలవాడు, మన్మథుడు. **అలరారు** అలరు + ఆరు. అ.క్రి. 1. ఒప్పు, శోభిల్లు. భార. సభా. 1.241, ఆను. 3.254, శృం.నై. 6.8 ; 2. పుష్పించు. ఆము. 5.139 ; 3. వికాసంపొందు, సంతోషించు. దశా. 1.111 ; 4. కలుగు. భార.భీష్మ. 1.245, దశా. 2.299 ; 5. తగు, సరియగు. భార.విరా 5.265. **అలరించు** స.క్రి. 1. సంతోషపెట్టు. నిర్వ.రా. 1.6, శృం. నై. 8.12 ; 2. చేయు, నిర్మించు. రాజవా. 1.9 ; అ.క్రి. ప్రకాశించు, ఒప్పు. భార. శల్య. 1.155. క. అలరిసు. వికసింపచేయు. **అలరింత** వి. నవ్వు, హాస్యం. **అలరుచు** రూ. అలర్చు. స.క్రి. చేయు. పల్నా. 65, విజయ 1.112 ; అ.క్రి. సంతోషించు. భార. ఉద్యో. 2.31 ; క. అలర్చు, అలరిసు. వ్యాపింపజేయు, వికసింపజేయు. **అలరునూనె** వి. పువ్వులతో చేసిన నూనె, సువాసన నూనె. దశా. 5.67. **అలరుబంతి** వి. పూబంతి. షట్. 2.88. **అలరుమేలుమంగ** రూ. అలమేలు మంగ, అలమేల్‌మంగ. అలర్మేలుమంగ. వి. శ్రీ వేంకటేశ్వర స్వామి భార్య, పద్మావతి. త. అలర్మేలుమంకై. పద్మాసన, లక్ష్మి ; అలమేలు. < త. అలర్మేల్‌మంకై. **అలరుఁబోఁడి** (-పోఁడి). వి. పుష్పంవలె మనోజ్ఞ ఐన స్త్రీ : స్త్రీ. శృం.నై. 8.195 ; త. అలరి. అందం, పూవు. < అలరు + పోఁడి. వ్యు. పుష్ప సౌందర్యంగల స్త్రీ. **అలరుఁబోఁటి** రూ.చూ. అలరుఁబోఁడి. వి. పుష్పంవలె మనోజ్ఞ ఐన స్త్రీ : స్త్రీ. భీమ. 1.4. **అలరువిలుకాఁడు** రూ. అలరువిల్కాఁడు. వి. పుష్పధన్వుడు, మన్మథుడు. వి.క్ర. 1.133. క. అలరువిలు. పూవిల్లు. **అలరువిలుతుఁడు** రూ. అలరువిల్తుఁడు. వి.పుష్ప ధన్వుడు, మన్మథుడు. భార. విరా. 1.245. **అలరువిలుదాలుపు** (-తాలుపు) ; రూ. అలరువిలుదాల్పు, అలరువిల్దాలుపు, అలరువిల్దాల్పు. వి. పుష్పధన్వుడు, మన్మథుడు. (అలరు-విలు-తాలుపు). **అలరువిలుదాల్పు** రూ.చూ. అలరువిలుదాలుపు. **అలరువిల్కాఁడు** రూ.చూ. అలరువిలుకాఁడు. **అలరువిల్తుఁడు** రూ.చూ. అలరువిలుతుఁడు. **అలరువిల్దాలుపు** రూ.చూ. అలరువిలుదాలుపు. **అలరువిల్దాల్పు** రూ.చూ. అలరువిలుదాలుపు. **అలరొందు** అ.క్రి. 1. శోభిల్లు, ఒప్పు. కాశీ. 2.28 ; 2. సంతోషించు. అచ్చ.రా. 5.76. **అలర్చు** రూ.చూ. అలరుచు. స.క్రి. 1. ప్రకాశింపజేయు, ఒప్పునట్టు చేయు. ఉ. హ. 1.55 ; 2. సంతోషపెట్టు. వేంక. పంచ. 3.143 ; 3. వికసింపజేయు. చంద్రి. 4.11. < అలర్ + చు. **అలర్మేలుమంగ** రూ.చూ. అలరుమేలుమంగ. ప్రబంధ. 881.

**అలరుచు** చూ. అలరు.

**అలరునూనె** చూ. అలరు.

**అలరుబంతి** చూ. అలరు.
**అలరుమేలుమంగ** చూ. అలరు.
**అలరుఁబోఁడి** చూ. అలరు.
**అలరుఁబోణి** చూ. అలరు.
**అలరువిలుకాఁడు** చూ. అలరు.
**అలరువిలుతుఁడు** చూ. అలరు.
**అలరువిలుదాలుపు** చూ. అలరు.
**అలరువిలుదాల్పు** చూ. అలరు.
**అలరువిల్కాఁడు** చూ. అలరు.
**అలరువిల్తుఁడు** చూ. అలరు.
**అలరువిల్దాలుపు** చూ. అలరు.
**అలరువిల్దాల్పు** చూ. అలరు.
**అలరొందు** చూ. అలరు.
**అలర్చు** చూ. అలరు.
**అలర్మేలుమంగ** చూ. అలరు.
**అలల్‌హిసాబు** వి. ముందుగా డబ్బు ఇవ్వటం.

అర. ల[1]ఇల్-హిసాబు. లెక్కప్రకారం;

క. అలల్ హిసాబు.

<అర. ల[1]ఇల్-హిసాబు.

**అలవ[1]** వి. 1. కంచె, దడి, ఆవరణం; గుంజలు నాటి కమ్ములు మొ. వాటిని అడ్డంగా చొప్పించిన వెలుగు. హరి. పూ. 6.123, రాజవా. 3.81; 2. పశువులకు గడ్డి వెయ్యటానికై ఏర్పరచిన తొట్టి, గాడి; 3. గొడ్ల కొట్టంలో కవ్వు క్రింద మేత మొ. పెట్టుకునే మచ్చు; 4. గోడ, మరుగు గోడ.

పో.చూ. క. అళతె. పరిమాణం; త. అళవై. హద్దు; అళ. హద్దు నిర్ణయించు; మ. అళవు. అంతవరకు.

సం. ఆలవాల. శబ్దభవమని కాంబెల్.

<మూ.ద.ద్రా. *అళ్-అ.

**అలవ[2]** రూ. అల్లవ, అల్లు[1], అర్లు. వి. తీగెలు అల్లుకోటానికి పెట్టే దడి, లేదా నిలువుకొయ్యలు. చూ. అల్లు[1].

**-లవ[3]** వి. తెరచాపమాను, కొమ్మగర్ర కలిపి బిగించిన కట్టు లేదా మేకు.

**అలవచట** రూ. అలచాట. వి. తలంటు తీగె (Ipomea chryseides).

**అలవడు** అ.క్రి. 1. స్వాధీనమగు, వశమగు. నిర్వ. 1.56; భార.విరా. 1.122; 2. ఒప్పు, తగు. భార.విరా. 1.291, భా.రా. 1.755; 3. ఉండు. భా.రా. 3.1.248; 4. అభ్యస్తమగు, అబ్బు. భార. విరా. 1.197; 5. సిద్ధించు, నెరవేరు. భార. కర్ణ. 2.140; 6. కూడు, కలియు, చేరు. భార. భీష్మ. 2.178; 7. పరిచితమగు, చనవు కలిగియుండు. హరి. పూ. 8.35; 8. తగు, అర్హమగు. భార. అర. 5.152, భీష్మ. 3.422, హరి. ఉ. 7.141; 9. కలుగు, లభించు. భార. అర. 7.464; 10. శక్యమగు, సాధ్యమగు. భాగ. 10. ఉ. 462; 11. కుదురుపడు. భార. విరా. 4.164; 12. పొందబడు.

క. అళ, అళవి, అళవు. కలసియుండు, తగియుండు, ఏకీభవించు, సిద్ధమగు, మొ. తు. అళవుని, అలముని, అలవుని. కలుపు. త. అళ. కలుపు, కుశలప్రశ్నలు చేయు.

<అల(వు)+పడు.

**అలవమచ్చ** వి. తెలుపుమీద మరే రంగుదైనా మచ్చ.

**అలవరి** రూ. అటవరి. వి. అలంగం, వప్రం; కోట గోడకు బలంగా చుట్టూ వేసే మట్టిదిన్నె. ఆం.భా. 2.12.

**అలవరించు** రూ. అల్వరించు; చూ. అలవడు. స.క్రి. 1. వశపరచు. భార. విరా. 2.80; 2. అభ్యసింపజేయు, నేర్పు. భార. విరా. 5.333; 3. సంపాదించు. భార. ఉద్యో. 1.12; 4. అభ్యసించు, నేర్చు. భార.అను. 5.124; 5. కావించు, చేయు. విక్ర. 2.78; 6. సవరించు, చక్కబరచు. హరి. పూ. 5.9; 7. ధరించు, తాల్చు. కాశీ. 3.116; 8. పెట్టు, ఉంచు. హై.భా. 3.87; 9. పూను. వహించు. హై.భా. 3.120; 10. సిద్ధపరచు, సమకూర్చు. హై.భా. 8.177; 11. సృజించు, నిర్మించు. వి. పు. 2.38; 12. అలంకరించు. వేంక. పంచ. 4.233.

**అలవరించుకొను** అ.క్రి. నేర్చుకొను. భార.విరా. 2.208.

**అలవరించుకొను** చూ. అలవరించు.
**అలవర్చు** రూ.చూ. అలవఱుచు.
**అలవరులు** వి. బ.వ. ధాన్యవిశేషం. హంస. 4.128.

**అలవఱుచు** ('అలవడు' ప్రేర; రూ. అలవర్చు) స.క్రి. 1. పూను, వహించు. భార.శాంతి. 3.205; 2. నేర్పు. మార్క. 5.41; 3. ధరింపజేయు, కూర్చు. శృం.నై. 6.57; 4. కావించు, చేయు. శివరా. 4.20; 5. (కంకణాదులు) కట్టు. ఆము. 6.134; 6. అలంకరించు; 7. అప్పగించు.

**అలవాటు[1]** చూ. అలవడు. వి. 1. అభ్యాసం. భార.శాంతి. 6.547, భాగ. 9.275; 2. సిద్ధి. శశా. 4.547; విణ. 1. సిద్ధం. భా.రా. 2.164; 2. అభ్యాసపడినది. మను. 3.48; 3. అభ్యస్తం. వైజ. 2.110.

**అలవాటుగా** క్రి.విణ. మామూలుగా. **అలవాటుచేయు** స.క్రి. నేర్పు. భా.రా. 2.292. **అలవాటుపడు** అ.క్రి. అభ్యాసం చేసుకొను.

**అలవాటు[2]** వి. మగ్గం ఎడమవైపు.
**అలవాటుగా** చూ. అలవాటు[1].
**అలవాటుచేయు** చూ. అలవాటు[1].
**అలవాటుపడు** చూ. అలవాటు[1].

**అలవి** రూ.చూ. అలవు. విణ. శక్యం, సాధ్యం. భార.ఆది. 7.232, కు.సం. 7.878, శృం.నై. 7.122; వి. 1. కొలది, పరిమితి. భార.ఉద్యో. 1.126, కు.సం. 5.515; 2. శక్తి; సామర్థ్యం. భార.భీష్మ. 2.6; 3. విధము. అచలా. 1.27.

**అలవికాదు** అవ్య. అసాధ్యం.

**అలవికాదు** చూ. అలవి.

**అలవు** రూ. అలవి, లావు. వి. 1. బలం, శక్తి, సామర్థ్యం, భార. విరా. 2.257; 2. ఉపాయం, నేర్పు. భార.కర్ణ. 1.147; 3. పరిశ్రమ. మార్క. 3.318; 4. విధం. భాగ. 10. ఉ. 1207; 5. అలవు. హై.భా. 8.71;

క. అళవు, అళ. బలం, శక్తి, సామర్థ్యం, శక్యత, సాధ్యత; పో.చూ. త. అళవు. పరిమాణం, సంఖ్య;

అళ్. బలం, దృఢత్వం.

<మూ.ద్రా. *అళ్-అ.

**అలవోక** చూ. అలవు. క్రి.విఱ. **1.** అవలీలగా, అనాయాసంగా, రం.రా.ఉ. 87 వు. 10 పం.; **2.** ఆకస్మికంగా, హఠాత్తుగా. భార.విరా. 3.36; **3.** అశ్రద్ధతో, అజాగ్రత్తతో. భార. శాంతి. 5.406; **4.** యాదృచ్ఛికంగా, దైవికంగా. భార. శాంతి. 6.327; **5.** విలాసంగా, ఒయ్యారంగా. విక్ర. 3.48; విఱ. **1.** ఆసక్తిలేనిది, ఆస్థలేనిది. శృం.నై. 4.9; **2.** మందం, అల్పం. మను. 3.28; **3.** సవిలాసం, ఒయ్యారం కలది. పాండు. 5.180. వి. **1.** విలాసం, లీల, క్రీడ, వినోదం. భార.ద్రోణ. 2.166, కాశీ. 6.96; **2.** తేలికతనం, సౌలభ్యం; **3.** ఉబలాటం, ఉత్కంఠ; **4.** తిరస్కారం; **5.** అశ్రద్ధ; **6.** యదృచ్ఛ, స్వేచ్ఛ. కళా. 5.40.

క.అళ్-అ > అల + (పో) వోక. పెద్ద ప్రయత్నం లేకుండా.

**అలవోకగ(వ్)** క్రి.విఱ. అలక్ష్యంగా. వి.పు. 6.19. **అలవోకయుబలె** క్రి.విఱ. సవిలాసంగా. యయా. 2.65. **అలవోకయుమబోలె (-పోలె)** క్రి.విఱ. అవలీలగా, అనాయాసంగా, కాశీ. 6.96. **అలవోకయు(వ్)బోలె (-పోలె)** క్రి.విఱ. అశ్రద్ధతో, అనాదరంగా. హర. 4.16. **అలవోకవలె(వ్)** క్రి.విఱ. అనాయాసంగా. పాండు. 2.83. **అలవోకవోలె(వ్)** క్రి. విఱ. **1.** యాదృచ్ఛికంగా. శివరా. 4.48; **2.** అవలీలగా, అనాయాసంగా. భార.శాం. 6.372, సమీర. 6.169.

**అలవోకగ(వ్)** చూ. అలవోక.

**అలవోకయుబలె** చూ. అలవోక.

**అలవోకయుమబోలె** చూ. అలవోక.

**అలవోకయు(వ్)బోలె** చూ. అలవోక.

**అలవోకవలె(వ్)** చూ. అలవోక.

**అలవోకవోలె(వ్)** చూ. అలవోక.

**అలసట** చూ. అలయు. వి. ఆయాసము, అలపు. పల్నా. 81.

క. అలసికె. అలసట, బడలిక, సోమరితనం; త. అలచటి. విసుగుదల, బాధ; మ. అలసల్, అలశల్. కలత, అలసట, ఆశాభంగం.

సం. అలస-తా. సోమరితనం (సంస్కృతంలోని 'అలస' శబ్దం ద్రావిడభాషాజన్యం).

**అలసటపెట్టు** స.క్రి. ఆయాసపెట్టు, శ్రమపెట్టు.

**అలసటపెట్టు** చూ. అలసట.

**అలసందియ** రూ.చూ. అలసందియలు.

**అలసందియలు** రూ. అలచంద, అలచందలు, అలసందియ, అలసందెలు. వి. బ.వ. పెద్ద బొబ్బరలు, రాజమాషం. మార్క. 3.203 (Dolichos caljomg).

ప్రా. అలసందో. ధాన్యవిశేషం; అ.మా. అలసందగ. మరా. అళోసుందా.

క. అలసంది, అలసందిగె, అలసందె, హలసంది, హలసందె. కాయధాన్యం (దేశ్యమని కిట్టెల్); తు. అలసండె, లత్తసె. కాయధాన్యం.

అలసాంద్ర (సం.) శబ్దరూపమని శ.ర.; అలసాంద్ర శబ్దం మో. వి. గ్రాంథిక ఇతర నిఘంటువుల్లో కానరాదు. బహుశః క. హలసందె, సం. హలసంధి శబ్దాల నుండి పుట్టివుండవచ్చు. హలసంధి. రెండు దాళ్ల మధ్య వేసే పైరు కాబట్టి దేశ్యమని కాంబెల్.

**అలసందెలు** రూ. చూ. అలసందియలు. వి. బ.వ. పెద్ద బొబ్బరలు.

**అలసపడు** పో.చూ. అలయు. అ.క్రి. ఖిన్నమగు. దశా. 2. 296.

ర. అలిచల. జడత్వం; అలచల్. అలసత్వం; మ. అలసస్. సోమరి.

పో.చూ. సం. అలస-. చురుకులేని, శక్తిలేని, సోమరి.

**అలసాలె** వి. కొరివి చెట్టు (Plecospermum spinosum tree).

**అలసు** రూ.చూ. అలచు. వి. తిరస్కారం, అవహేళనం.

మ. అలప్పల్. విసుగు, దుఃఖం.

**అలా** రూ. అల[3], అలో[1]. అవ్య. సంబోధ నాంతాలకు అనుప్రయుక్తం, విచార సూచకం. ఉ.హ. 4.302.

క. అల, అలా, ఎల. ఆశ్చర్యనిశ్చయాద్యర్థకం; ఎల-అ. స్నేహపూర్వక సంబుద్ధి; తు. అళో. బాధా సూచకం; త. అలా. స్నేహపూర్వక సంబోధన; కుఱ. అల. ఆశ్చర్యార్థకం: అలె. వాత్సల్యపూర్వక సంబోధన; పర్జి. అలె. సంబోధనం.

సం. హలా. అవ్య. స్త్రీ సంబోధన; ప్రా. హలా.

**అలాకం** చూ. అలకం. వి. తేలిక, సులభం.

**అలాకు**[1] రూ.చూ. హలాకు. వి. **1.** పాడు, హతం, చావు; **2.** వ్యర్థం, చెడిపోవటం; **3.** తిరస్కారం.

హిం. హలాకూ. వినాశం, బాధ; ఉ.పార.అర. హలాక్.

క. హలాకు. అణచబడినది, జయింపబడినది, దుర్బల మైనది, శిథిలమైనది, నశించినది; తు. అలాకు, హలాకు. శిథిలం, వ్యర్థం; త. అలాక్కు. ఒంటరితనం, ప్రత్యేకత.

<ఉ. హలాక్.

**అలాకుచేయు** స. క్రి. పాడుచేయు, నాశంచేయు. **అలాకువలాకు** **1.** చెల్లాచెదరగు; **2.** చాలతేలిక; **3.** వ్యర్థం.

**అలాకు**[2] రూ.చూ. అళాకు. వి. పదిలో ¼ వంతు.

**అలాకుచేయు** చూ. అలాకు[1].

**అలాకువలాకు** చూ. అలాకు[1].

**అలాగా** చూ. అలక[1]. క్రి.విఱ. సులభంగా.

**అలాటి** రూ.చూ. ఆలాగంటి. విఱ. అటువంటి.

**అలాదా** రూ.చూ. అలాహిదా. విఱ. ప్రత్యేకం.

**అలాది** రూ.చూ. అలాహిదా. విఱ. ప్రత్యేకం.

**అలామతుకట్ట** వి. బోయాకట్టె, సముద్రంలో గుర్తుకోసం వేసే కర్ర.

హిం. ఉ. అర. అలామత్. గుర్తు; పార. అలామత్, అలామ.

<ఉ. అలామత్ (గుర్తు) + కర్ర (గుర్తుకోసంవేసే కర్ర).

**అలాయిదా** రూ.చూ. అలాహిదా.

**అలాయిబలాయి** వి. సన్నిహిత మైత్రి.

హిం. అల్-అబా, అల్-అవి. దౌహిత్రులు ; మహమ్మదు కుమార్తె ఫాతిమా, ఆమె భర్త ఇమామ్‌అలీ. ఫాతిమా అలీల సంతానం హస్సన్ హుస్సేన్‌లు ; భలా-ఈ. మేలు ; ఉ. అలవి, భలా ఈ. మేలు ; పార. అర. అలవి ;

క. అలాయిబలాయి. ప్రేమాభినందనం, కౌగిలింత. పో.చూ. అలాబి. మొహరం పండుగ < ఉర్ < అర. అలావి. అర్థవిపరి.

< ఉ. అలవీ-భలాఈ.

**అలారము** వి. 1. ఆసన్నభయసూచకం. 2. మేలుకొలుపు ధ్వని ; 3. గడబిడ, అల్లరి.

హిం. అలారమ్, అలార్మ్ ;

క. ఎలారం ; తు. ఎళ్‌రాం, త. అలారమ్ ;

ఇం. Alarm. ఆకస్మిక భయాది, ఆసన్న భయాది సూచకం.

< ఇం. Alarm.

**అలారంగడియారము** వి. నియమిత వేళకు గంట కొట్టే గడియారం.

**అలారంగడియారము** చూ. అలారము.

**అలాల్కోరు** వి. పీడులూడ్చే వృత్తివారికి సంబంధించినది.

హిం. మరా. ఉ. పార. హలాల్ ఖోర్ ; ఉ. హలాల్ ఖోర్ ; పార. హలాల్ ఖోర్. పీడులూడ్చేవాడు ; గు. హలాల్ ఖోర ; అర. హలాల్ ఖోర్. న్యాయార్జితం తినేవాడు ;

< ఉ. హలాల్‌ఖోర్.

**అలాల్కోరువాడు** వి. పీడులూడ్చేవాడు.

**అలాల్కోరువాడు** చూ. అలాల్కోరు.

**అలాల్‌టప్పా** వి. అటాఅటలు ; నీలివార్తలు.

హిం. ఉ. పార. అలీల్. దుర్బలం ; అర. అలీల్. దుష్టం ;

ఫ్రెం. తప్పా. దూరం.

< ఉ. అలీల్ + ఫ్రెం. తప్పా.

**అలావతు** వి. వాడుక, అలవాటు.

ఉ. అర. అలామత్. గుర్తింపు ; గుర్తు.

< ఉ. అలామత్. అర్థవిపరి.

**అలావాదా** రూ.చూ. అలాహిదా.

**అలావు** వి. పీర్లపండగనాడు పాడుతూ అడుగు వెయ్యటం.

**అలావుసంత** చూ. అలావ. వి. అలావ తొక్కేచోటు, అగ్నిగుండం.

**అలాహదా** రూ.చూ. అలాహిదా.

**అలాహిజా** రూ.చూ. అలాహిదా.

**అలాహిద** రూ.చూ. అలాహిదా.

**అలాహిదా** రూ. అలాదా, అలాది, అలాయిదా, అలావాదా, అలాహదా, అలాహిజా, అలాహిద, ఆలాహిదా. విశ. ప్రత్యేకం.

హిం. అలహదా ; గు. అలాహిదమ్ ; మరా. అలాహిదా, అలాదా ; ఉ. అలహదా.

క. అలాయిద, ఆలాహిద. తు. అలాయిద ; త. అలాయితా, అలాతి, అలాతు, కుఇ. అల్‌యె.

< ఉ. *అలహదా.

**-అలి** అవ్య. వృత్తియందు, అందు, ఇందు, ఎందు అనే వాటిపై వచ్చే ఆగమం.

క. అల్లి, అలి. అక్కడ ; తు. అవుళు. ఒల్లా. అల్.

< మూ.ద్రా. *అల్.

**అలికించు** చూ. అలుకు[2].

**అలికిడి** రూ.చూ. అలుకుడు. చప్పుడు, మనుష్య సంచారాదుల వలన కలిగే ధ్వని. వి. భార.సౌప్తి. 1.169, వేంక. పంచ. 3.200.

**అలికిర్లాంతరు** వి. హరికేన్ లాంతరు, తుపాను గాలికికూడ ఆరని దీపం.

ఇం. హరికేన్. గాలివాన ; లాంతరు. దీపంబుడ్డి ;

< ఇం. Hurricane lantern.

**అలిగించు** చూ. అలుగు[2].

**అలిగిరి** వి. దొంగ.

**అలిగె** వి. వలకన్నుల పరిమాణం తెలిపేపుల్ల (కొండ్లాలకు 3"ల వెడల్పు, 4" పొడుగు).

**అలిది** రూ.చూ. హళది. వి. 1. పసుపుపచ్చదనం ; 2. తెల్ల తెగడ, సరళ వృక్షం (Ipomaea turpethum).

**అలిపి** చూ. అలుచు. వి. బడలిక, అలసట.

< మూ.ద్రా. అల్-చు ; అలయు, అళను మొ.

**అలిపిరి** రూ. అల్పిరి. చూ. అలుపము. విశ. అల్పం, దుర్బలం. ద్వి.భాగ. 2.24 ; వి. అల్పశరీరం గలవాడు.

అలుప-ఇరి < సం. అల్ప-పలుచనిది, చిన్నది (స్వర సామ్యం), అలిపిరి.

**అలిపిరిది** వి. 1. సన్న నూలువడికే సాధనం, కదురు ; 2. సన్నని స్త్రీ.

**అలిపిరిది** చూ. అలిపిరి.

**అలిబీవాదన** వి. 1. నేరం జరిగినప్పుడు తాను వేరొక చోట ఉన్నట్టు ముద్దాయి చేసే ప్రతివాదం (వ్య. వేరొక చోట ఉన్నట్టు వాదం) ; 2. గైరు హాజరు.

< ఇం. alibi.

**అలియు** రూ.చూ. అలయు. అ.క్రి. అలసిపోవు. యుద్ధమల్లుని బెజవాడ శాసనం.

**అలివి** వి. 1. ఒట్టు (మేకు)కు కోలకర్రను బిగించే కొబ్బరి తాడు ; 2. వల అనవేసిన భాగం ; 3. అల్లకం, వల అల్లకం.

**అలివికాయ** వి. నల్లటి గిట్టలూ, వెన్నుమీద బుడ్డ గల తెల్లటి పీత.

**అలివితీయు** అ.క్రి. (దారానికి) పురితీయు.

**అలివివల** రూ.చూ. అలివొల.

**అలివొల** రూ. అలివివల. వి. కనీసం 25 మంది కలిసి ఒడ్డున 100 గ. లోపున చేపలు పట్టేవల.

**అలిసా** వి. కోలకర్ర కామకు వేసిన గుండ్రటి తాడు.

**అలుక**[1] రూ. అల్క, అలక[2]. చూ. అలుగు[1]. వి. 1. వైరం, ద్వేషం. భార. ఆది. 7.91, కేయూర. 3.29 ; 2. కోపం.

రోషం. భార. ఆది. 1.79, హర. 3.180, 4.34 ; 3. ద్రోహచింత. ఆము. 4.255.

త.పో.చూ. అలై. బాకు ; మ. అలెక్కుక. కొట్టు మిట్టాడు ; దుఃఖంతో గుండెలు కొట్టుకొను.

**అలుకపామవు** రూ. అలకపానువు. వి. పెళ్లిలో పెళ్లి కొడుకు విలాసంగా అలిగి కూర్చోటానికి వేసే పాన్పు. **అలుకపామ్పు** రూ.చూ. అలుకపానువు.

**అలుక**[2] చూ. అలుక[1]. వి. అల్పుడు, తేలికైనవాడు, గౌరవ శూన్యుడు. భార. సభా. 2.269, ఉద్యో. 4.312.

త. అల్గ. అల్పం, నీచం, అసత్యం ;

హిం. ఉ. హల్కా. తేలికైన.

<ఉ. హల్కా. అర్థవిపరి.

**అలుకవ** విశే. తేలికమైనది, పలుచనిది. క్రీడా. 226.

**అలుకవ** చూ. అలుక[2].

**అలుకపామవు** చూ. అలుక[1].

**అలుకపామ్పు** చూ. అలుక[1].

**అలుకము** వి. దేవాలయం.

**అలుకు**[1] రూ.చూ. అళుకు. అ.క్రి. భయపడు, వెనుదీయు, జంకు. భార. ఉద్యో. 3.35, అను. 1.173, పల్నా. 93 ; వి. భయం, జంకు, శంక. భార. ద్రోణ. 1.319.

**అలుకువ** వి. జంకు, సంకోచం, కవిరా. 5.258.

క. అళకు. భయం ; మ. అళుక్కం.

**అలుకు**[2] రూ. అల్కు[2]. స.క్రి. 1. పేడ మొ. వాటితో నేల మొ. రాచు, లిప్తం చేయు. భార. ఉద్యో. 3.152 ; 2. చల్లు, కు.సం. 6:765, భార. అను. 2.108 ; 3. కదల్చు. కు.సం. 8.10 ; 4. (పువ్వులు) చెరువు, గ్రుచ్చు. హరి. ఉ. 7.75 ; 5. ఊడుచు, (మొక్కలు) నాటు. పాండు. 2.59 ; వి. అలకటం, విలేపనం.

క. అలకు, అలుకు. కదలు, వణకు ; అలచు. కదల్చు, (గుడ్డ. మొ.) జాడించు ; అల. కదలాడు. పో.చూ. త. అళై. కలుపు, నానబెట్టు, పొర్లాడు, కలియు.

<మూ.ద.ద్రా. *అల్-.

**అలికించు** స.క్రి. పేడ. మొ. వాటితో నేల అలుకునట్లు చేయు. పల్నా. 54. **అలుకుగుడ్డ** పో.చూ. అలుకుఁజుట్ట. వి. అలకటాని కుపయోగించే పాత గుడ్డ. **అలుకుజాలు** వి. మాగాణిలో విత్తనం చల్లే ముందు గాని నాటు వేసే ముందు గాని దున్నిన చాలు. **అలుకుజుట్ట**-చుట్ట ; పో.చూ. అలుకు గుడ్డ. వి. అలకటాని కుపయోగించే పీచుచుట్ట. **అలుకుదువట్టి** వి. ఎదపెట్టక ముందు పొలం చదునుచెయ్యటానికి తోలే కొయ్య మొద్దు. **అలుకుపండుగ** వి. చేలల్లో జనుప విత్తనాలు చల్లేటప్పుడు మృగశిరకార్తెలో చేసుకునే పండుగ (పంచ పాండవుల బొమ్మలు నిలిపి పాయసం వండి నైవేద్యం పెడతారు).

**అలుకుగుడ్డ** చూ. అలుకు[2].

**అలుకుజాలు** చూ. అలుకు[2].

**అలుకుఁజుట్ట** చూ. అలుకు[2].

**అలుకుడు** రూ. అల్కుడు, అలికిడి. పో.చూ. అలయు. వి. చప్పుడు, ధ్వని. భార.ఉద్యో. 2.3.

క. అలకు, అళకు, అలుగు, అలుంగు. కదలు ; తు. అలంకుని, అలంగుని. త. అలంకు, అలుంకు, అలక్కు. కదలు ; అలంపు. ధ్వనిచేయు, గునగునలాడు ; మ. అలుక్క, అలుక్కుక, అలెక్కుక. కదలు.

**అలుకుతాడు** చూ. పల్లెరాడు. వి. నూలుపొందుకు చుక్క కట్టటానికి గుడ్డలు చేసుకునేటప్పుడు కొలత చూసుకునే తాడు.

**అలుకుదారం** చూ. అల్లికదారం. వి. అచ్చుటికిన పడుగులో చివరి పోగుల ముడుల వెంబడి కూర్చిన దారం.

**అలుకుదుపట్టె** చూ. అలుకు[2].

**అలుకుపండుగ** చూ. అలుకు[2].

**అలుకుమంద** వి. పడుగుమీద గంజివేసే వేప, వెంపలి మొ. మంద.

**అలుకువ**[1] చూ. అలుకు[1].

**అలుకువ**[2] చూ. అలుగు[2].

**అలుక్కుంచె** (అలుకు + కుంచె). వి. పడుగు దువ్వే కుంచె.

**అలుగ** రూ.చూ. అలుఁగు[1] వి. జలనిర్గమ స్థలం, మరిగొమ్ము. తూము.

**అలుగు**[1] రూ.చూ. అలుఁగు[1]. వి. కాలవ, చెరువునుంచిగాని, రిజర్వాయరునుంచి గాని నీళ్లు పోవటానికి ఏర్పరచిన దారి.

**అలుగు**[2] రూ. అల్గు[2]. అ.క్రి. 1. కోపపడు. భార. ఆది. 4.184, శాంతి. 5.474 ; 2. హానిచేయు. మార్క. 8.23 ; 3. ద్వేషించు, పగగొను. నీతి. 21.

పో.చూ. త. అళకు్క. కలతచెందు, భయపడు ; పో. చూ. మ. అళక్కుక. ఉలికిపడు, ముడుచుకొనిపోవు, కొయ్యబారు.

**అలిగించు** స.క్రి. కోపం వచ్చేట్టు చేయు. భార.ద్రోణ. 5.370 ; క. అళికుసు. చెరిపివేయు ; అళిసు, అళి యిసు, అళసు, అళిచు, అళుచు, అళుసు, అళియ, అళ్సు. పాడుచేయు, నశింపజేయు, చంపు, చెరిపివేయు ; త. అలై. తొందరపెట్టు, విసిగించు, బాధించు ; మ. అలెక్కుక. కొట్టుమిట్టాడు, దుఃఖంతో గుండెలు బాదుకొను. **అలుకువ**[2] వి. కోపం, అలుక. చంద్రా. 4.180.

**అలుగు**[3] వి. తెప్పయొక్క మొక్కు పుల్లను తండు కర్రను కలిపి కట్టే కొబ్బరి (లేక తాటినార) తాడు (ఇది ఎప్పుడూ మొక్కు పుల్లనే వుంటుంది. తండు కర్రను ఈ అలుకులోంచి దూర్చు తారు).

**అలుగు**[4] రూ.చూ. అలుఁగు[2]. వి. 1. బరమలోని ఇనుప ముక్క ; 2. తండు కర్రను పడవకొయ్యకు బిగించే గుంద్రటి కొబ్బరితాడు ; 3. 'టరబనం' కింది ఇనుపభాగం ; 4. చేదాడిత అంచు.

**అలుగుపాము** వి. ఒక రకం సముద్రపు కట్లపాము.

**అలుగుల** రూ.చూ. అలుగులము. వి. 1. ఘర్షణం, రాపిడి. పల్నా. 51 ; 2. బాధ, దుఃఖం.

**అలుగులపడు** అ.క్రి. వ్యాకులపడు, సంక్షోభపడు, లంపట పడు. భార.ఆది. 8.267, కర్ణ. 1.147.

**అలుగులపడు** చూ. అలుగుల.

**అలుగులము** రూ. అలుగుల. వి. సంక్షోభం, వ్యాకులత, క్లేశం,

నలుగుడు, బాధ. భార.ఆర. 1.301.

క. అలుగు. కలతచెందు, చెదరిపోవు. త. అలుక్కులై. అస్తవ్యస్తమగు, చెల్లాచెదరగు.

**అలుఁగు**[1] రూ. అలువ, అలుగ, అలుగు[1], అల్గు[1]. వి. **1.** పరీవాహం; చెరువు మొ. వాటిలోని అదనపు నీరు పోవటానికేర్పరచిన దారి. క్రీడా. 31, సిం.ద్వా. 2.156; **2.** అలువుగుండా పోయేనీరు. బా.రా. 6.2332, భాగ. 3.667.

క. అలగు, ఆలుగు. తిరుగాడు; త. అలంకు, అలుంకు. నడచు.

**అలుఁగుబారపట్టె** వి. వానకాలంలో చెరువులు నిండి పారే నీరు. **అలుగులువాఱు-పాఱు.** అ.క్రి. ప్రవహించు; అలుగు నుండి ప్రవహించే నీటివలె ప్రవహించు. బసవ. 1.542. **అలుగులువెడలు** అ.క్రి. అధికమగు. వ్య. అలుగులుదాటిపోవు పద్మ. 2.183.

**అలుగు**[2] రూ. అలుగు[4] అల్గు[3], ఎలుగు[1], ఎలువు[3], ఎల్గు. వి. **1.** బాణాగ్రం, ములికి, పిడిగాక మిగిలిన ఆయుధాంశం, బాణం చివరి ఉక్కుముక్కు. భార.ఉద్యో: 2.62, ద్రోణ. 1.349; **2.** ఖడ్గం, కత్తి. భార. భీష్మ. 3.23, బసవ. 5.144 వ. 146 పం.; **3.** ఆయుధం. మను. 4.115, పాండు. 1.101; **4.** గుంటక గుజ్జులకు తగిలించిన ఇనప బద్దె; **5.** తొల్లికకు వేసిన రేకు పొర; **6.** కొడవలికి పదును లేని వైపు; **7.** గడ్డపార చివర వున్న వెడల్పు పలుగు; **8.** బరమాలోని ఇనప ములికి.

క. అలగు, అలుగు. కత్తివాయి, కత్తి; త. అలుకు. ఆయుధం, ములికి, కత్తివాయి, కొంకిగడ, పక్షిముక్కు; మ. అలకు. కత్తివాయి, కత్తి, ఈటె.

< మూ.ద.ద్రా. *అల్-.

**అలుఁగుగడ్డపార** వి. చివర వెడల్పు పలుగుగల గడ్డపార.

**అలుఁగుగడ్డపార** చూ. అలుఁగు[2].

**అలుఁగుబారపట్టె** చూ. అలుగు[1].

**అలుఁగురాజనములు** చూ. అలుఁగు[2]. వి. బ.వ. ధాన్య విశేషం. హంస. 4.128; కలవాళ్లు తినే ములుకుల్లాంటి తెల్లటి సన్నబియ్యం కావచ్చు.

**అలుఁగులువాఱు** చూ. అలుఁగు[1].

**అలుఁగులువెడలు** చూ. అలుఁగు[1].

**అలుచు**[1] వి. **1.** అల్పుడు, నీచుడు. భార.విరా. 3.107; **2.** తిరస్కారం. ఆం.భా. 1.134; **3.** మందుడు, సోమరి.

క. అలసు, అలచు. విసుగు, సోమరితనం, త. అలైచల్. సోమరితనం; మ. అలసన్. సోమరి; పో. చూ. సం. అలసః.

< మూ. ద. ద్రా.*అల్-.

**అలుచు**[2] చూ. అలుము. స. క్రి. (నూలు) జాడించు, ఉతుకు.

**అలుదుంప** చూ. ఆలు. వి. బంగాళాదుంప.

< హిం. ఆలూ + తె. దుంప.

**అలుపటిపని** వి. అలికి ముగ్గులు పెట్టి, వంటసామగ్రి మొ. శుద్ధిచేసే పని.

**అలుపము** విఋ. **1.** అల్పం, నీచం. భార. ఉద్యో. 3.117 **2.** తంతువు, సన్నని నూలుపోగు.

సం. అల్ప. చిన్న, కొద్ది; ప్రా. అమా. పా. అప్ప (అల్ప).

క. అలుప; తు. అల్ప; అల్పిసు; త. అల్పత్తువం, అల్పత్వం, నైచ్యం, లాఘవం; మ. అల్పం. చిన్న, కొద్ది.

< సం. అల్ప-.

**అలుపు**[1] అ. క్రి. ఒప్పు, సమ్మతించు.

< అనుప. పంపు. అర్థవిపరి.

**అలుపు**[2] రూ. చూ. అలపు. వి. బడలిక. శశా. 3.9.

**అలుపుఁడు** చూ. అలుపము వి. అల్పుడు, నీచుడు. భార. విరా. 1. 266.

సం. అల్పః > అల్పుడు > అలుపుడు.

**అలుబాయి** రూ. చూ. హల్వ. వి. హల్వా: పాలు పంచదారలో చేసిన తీపి పదార్థం.

**అలుము**[1] చూ. అలము. వి. పైరులోని కసవులోనగునది, కలుపు.

**అలుము**[2] చూ. అలుచు[2]. స. క్రి. (నూలు) జాడించు, ఉతుకు.

**అలువ**[1] రూ. చూ. అలుఁగు[1]. వి. **1.** జలనిర్గమన మార్గం. భార. విరా. 5.240, అశ్వ. 3.196; **2.** చెరువుకొమ్ము. చెరువులో ఎక్కువైన నీళ్లు పొర్లిపోవటానికి కట్టకు పల్లంగా ఉన్న వైపున కట్టిన రాతికట్టడం.

**అలువు**[2] అ. క్రి. **1.** కోపించు. భార. శాంతి. 1.35. **2.** ద్రోహం తలపెట్టు.

**అలువు**[3] వి. బాడిదలో 'కాం'కు తగిలించిన ఇనప భాగం; ఇనప బుర్ర.

**అలువురాయి** చూ. అలవు. వి. తేలికగా ఉండేరాయి.

**అలేలు** వి. మేదరి బద్దలు, వెదురు బద్దలు.

**అలో**[1] రూ. చూ. అలా. అవ్య. బాధాదుల్ని వ్యక్తంచేసే ప్రత్యయం.

**అలో**[2] రూ. చూ. హల్లో. అవ్య. ఆశ్చర్యాద్యర్థకం.

**అల్క**[1] రూ. చూ. అలుక[1]. వి. కోపం. భార. ఆది. 1.139. విరా. 3.350, భీమ. 3.8.

**అల్క**[2] రూ. చూ. అలక[1]. విఋ. సూక్ష్మం, తేలిక, సులభం. భార. ఉద్యో. 3.55.

**అల్క**[3] చూ. అల్లకం. వి. చేపలబుట్ట అల్లటం.

**అల్కా** రూ. చూ. అలక[1].

**అల్కీ** రూ. చూ. హల్కీ; చూ. అలక[1]. విఋ. తేలిక, నీచం; **అల్కీజాతులు** వి. తక్కువ జాతులవారు.

**అల్కు**[1] రూ. చూ. అలుకు[1]. అ. క్రి. భయపడు, జంకు, వెనుదీయు. భార. ఉద్యో. 1.304.

**అల్కు**[2] రూ. చూ. అలుకు[2] స.క్రి. పేడ మొ. వాటితో నేల మొ. వాటిని రాచు, లిప్తం చేయు. యయా. 2.87.

**అల్కు(డు)చాలు** చూ. అలుకుజాలు. వి. మాగాణిలో విత్తనం చల్లేముందు గానీ నాట్లు వేసే ముందు గానీ దున్నిన చాలు.

**అల్కు(డు)చాలు** చూ. అల్కు[2].

**అల్కుడు** రూ. చూ. అలుకుడు. వి. చప్పుడు, ధ్వని. భార. ఉద్యో. 2.111.

**అసము**[3] వి. 1. అవకాశం, వీలు. వేంక. పంచ. 4.18 ; 2. చనవు. శుక. 1.335 ; 3. ప్రేమ, స్నేహం.

సం. వశ-. కోరిక, శక్తి, పలుకుబడి, అధీనం.

<సం. వశ-.

**అసర** వి. దైత్యుడు ; విశే. రాక్షసమైన.

సం. అసుర-. పారలౌకికం ; రాక్షసుడు, దేవవిరోధి ; ప్రా.పా. అసుర. రాక్షసుడు ; అ.మా. అసుర. ఒక దేవ జాతి ;

క. పర్జి. అసుర. రాక్షసుడు ; త. అసుర్, అసురర్. దేవతలతో యుద్ధంచేసే దైత్యజాతి ; మ. అసురన్. రాక్షసుడు.

<సం. అసుర-.

**అసరసంజ** రూ. అసరసంజె, అసరసందె, అసలుసందె. వి. సాయంత్రం ; రాక్షసులు పిశాచాలు తిరిగేవేళ. బహుశః <సం. అపరసంధ్యా. **అసరసంజె** రూ.చూ. అసరసంజ. **అసరసందె** రూ.చూ. అసరసంజ.

**అసరవేయు** అ.క్రి. ఆలసించు, జాగుచేయు.

క. అసుర్. బడలిక, సొమ్మ ; త. అచరప్పోటు. ఆపు, ఆలసించు ; అచర్. సొమ్మసిల్లు ; అయర్. బడలు, సొమ్మసిల్లు, తెలివిదప్పు ; మ. అయర్క్క. మూర్ఛిల్లు, సొమ్మసిల్లు, అన్నుకొను.

**అసరసంజ** చూ. అసర.

**అసరసంజె** చూ. అసర.

**అసరసందె** చూ. అసర.

**అసరు** పో.చూ. పసరు. వి. ఆకులసారం, శాకరసం. భార. శల్య. 2.160. విశే. పసరుగలది, లేత, అల్పం. పాండు. 5.157.

క. హసరు, హసర్, హసురు, పసుర్. ఆకుపచ్చ రంగు ; తు. పజి ; త. పై. ఆకుపచ్చన, అభినవత్వం, యౌవనం ; పచుమై. ఆకుపచ్చన, యౌవనం, మార్దవం, సారం ; మ. పయి, పై,పైం. ఆకుపచ్చని, లేత, కొత్త ; పచు, పస, పసిమ. లేత, కొత్త, తడి. పచ్చని ; పయిర్. పచ్చని పైరు ; గోం. పెసెల్. పెసలు ; పర్జి. పయ్. పచ్చని ; పయరి, పయల్. పెసలు ; కొలా. పెసల్. పెసలు ; నా. పెసళ్. పెసలు.

<క. హసరు.

**అసలారు** రూ.చూ. ఎసలారు. అ.క్రి. 1. అతిశయిల్లు, అధికమగు. భార. అను. 2.6, బసవ. 5.262 ; 2. ఒప్పు. నవ.చ. 1.18 పు. 24 పం.

**అసలు**[1] వి. పంకం, బురద. పారి. 2.34, వసు. 2.32.

క. అసి. కదలు, చలించు ; త. అచఱు, అచుంపు. బురద, చుండు ; అచటు. చిన్నచీలిక, గరుకుబోటు, పుండు మీది చెక్కు ; అసై. కదలు.

<మూ.ద.ద్రా. *అచ్-.

**అసట(బెట్టు** (-పెట్టు). స.క్రి. బురదలో పెట్టు, కీడ్పరచు. వేంక. పంచ. 4.130. **అసలుకొను** అ.క్రి. బురదవలెనగు. కాశీ. 1.3, జై.భా. 6.128. **అసలుకొలుపు** రూ.చూ. అసలుకొల్పు. **అసలుకొల్పు** రూ. అసలుకొలుపు. స.క్రి. పంకిలం చేయు, బురదచేయు. కాశీ. 1.123, క్రీడా. 136. **అసలుమన్ను** వి. పాకంలో ఉన్న మన్ను. **అసలు(బుట్టువు-** (పుట్టువు). వి. బురదయందు పుట్టినది, పద్మం. అచ్చ.రా. 1.4.

**అసలు**[2] రూ. అస్సలు. విశే. 1. మొదటిది ; 2. మూలధనం ; 3. స్వచ్ఛం, సంకరంకానిది ; అవ్య. నిజంగా. పల్నా. 23, క్షేత్ర. 54.

నే.మరా. అసల్, అస్సల్. మొదటి, మంచి ; హిం. అర. అసల్. మొదటిది, మూలం, నిజం ; గు. అసల్, అస్లీ ; ఉ. అసల్, అస్ల్ ;

క. అసల్. మొదటిది, ఉత్తమమైనది, అద్వితీయం, న్యాయసమ్మతం, మూలధనం ; తు. అసలు. మొదటిది, మూలధనం ; త. అచల్. ద్రా. అసల్. వాస్తవం, మొదలు ; అస్లీ. నిజమైన, స్వచ్ఛమైన.

<ఉ. అస్ల్.

**అసలుకాపి** వి. మొదటి ప్రతి. <ఉ. అస్ల్ + ఇం. copy. **అసలుదావా** వి. మొదటి వ్యాజ్యం. <ఉ. అస్ల్ దావా. **అసలుపైకము** వి. 1. రహస్యంగా ఉంచదగినది ; 2. మూలధనం. <ఉ. అస్ల్ + తె. పైకము. **అసలు ఫాయిదాలు** పో.చూ. అసలువడ్డి. వి. బ.వ. మూలధనమూ లాభమూ. హిం. అసల్‌ఫాఇద. మొత్తం ; మరా. అసల్‌ఫాయిదా ; ఉ.పార.అర. అసల్‌ఫాఇదహ్. <ఉ. అసల్‌ఫాఇదహ్. **అసలుబేరీజు** వి. 1. మొదటిలెక్క ; 2. మొదటిపన్ను (కిస్తు). <ఉ. అస్ల్‌బేరీజ్. **అసలుమినహా భూమి** వి. పన్నులేని పొలం. **అసలుమొత్తము** వి. మొదటి మొత్తం. <ఉ. అస్ల్ + తె. మొత్తము. **అసలులెక్క** వి. మొదటి లెక్క. <ఉ. అస్ల్ + తె. లెక్క. **అసలువడ్డి** వి. మూలధనమూ వడ్డీ. <ఉ. అస్ల్ + తె. వడ్డి. **అసలువాది** వి. మొదటి ఫిర్యాది. <ఉ. అస్ల్ + సం. వాది(న్).

**అసలుకాపి** చూ. అసలు[2].

**అసలుకొను** చూ. అసలు[1].

**అసలుకొలుపు** చూ. అసలు[1].

**అసలుకొల్పు** చూ. అసలు[1].

**అసలుదావా** చూ. అసలు[2].

**అసలుపైకము** చూ. అసలు[2].

**అసలుఫాయిదాలు** చూ. అసలు[2].

**అసలుబేరీజు** చూ. అసలు[2].

**అసలుమన్ను** చూ. అసలు[1].

**అసలుమసలు** పో.చూ. అసలారు. అ.క్రి. ఒప్పు. పాండు. 1.131.

అసలు(<ఎసలు) + మసలు.

**అసలుమినహాభూమి** చూ. అసలు[2].

**అసలుమొత్తము** చూ. అసలు[2].

**అసలు(బుట్టువు** చూ. అసలు[1].

**అసలులెక్క** చూ. అసలు[2].

**అసలువడ్డి** చూ. అసలు[2].

**అసలువాది** చూ. అసలు[2].

**అసలుసందె** రూ.చూ. అసరసంజ. వి. మునిమాపు.

**అసలేరు** రూ.చూ. అసిలేరు. వి. ఆశ్లేష.

**అవళ్లు** చూ. అసలు[2]. వి. బ.వ. మాతృకలు, మూలప్రతులు. నకళ్లు కానివి.

**అవవవ** ధ్వన్య. పో.చూ. విసవిస. వి. ఆలస్యం, జాగు. దశకు. 7.109.

క. అసవస. తొందర ; అస, అసి, అసు. కదలిక ; త. అచర్. మూర్ఛిల్లు.

**అవహ్యము** వి. రోత.

సం. అసహ్య- సహింపరానిది, సాధ్యంకానిది.

క. అసమ్య, అసహ్య, అసంహ్య, అసయ్య. రోత ; తు. అసహ్య ; త. అచకియం, అచంకియం. అపరిశుభ్రత ; అచింకం. అశుభ్రత, అక్రమత, రోత, అసహ్యం, సహింపరానిది.

<సం. అసహ్య- అర్థ విపరి.

**అవహ్యపడు** అ.క్రి. రోతచెందు, అసూయపడు. భార. ఉద్యో. 2.58. **అవహ్యించు** అ.క్రి. రోతపడు, ఏవగించు.

**అవహ్యపడు** చూ. అసహ్యము.

**అవహ్యించు** చూ. అసహ్యము.

**అహొదు** రూ.చూ. హసాదు. అవ్య. 1. మంచిది, బళి. రామా. 3.149 ; 2. చిత్తం (పెద్దల ఆజ్ఞను శిరసావహించటం).

**అహారు** వి. తీరిక, తీరుపాటు.

**అసి[1]** విశే. అల్పార్థకం (సమాసపూర్వపదంగానే ప్రయుక్తం).

క. అసి. సన్నన, కృశత్వం, బలహీనత, అల్పత్వం ; త. ఐ. అల్పత్వం, సూక్ష్మత.

**అసికోత** వి. చిన్నకోత. ద్వి.హరిశ్చ. పూ. 2040. **అసిగాయము** వి. 1. చిన్నగాయం ; 2. తేలిపోయినగాయం. **అసిమేత** వి. జబ్బువల్ల కొద్దికొద్దిగా మెయ్యటం. **అసిమేపు** వి. జబ్బువల్ల కొద్దికొద్దిగా మెయ్యటం.

**అసి[2]-** వి. చలించేది, కదిలేది.

క. అసి. కదలు, చలించు, వేలాడు, ఊగు ; అసుంబు. కదలించు, చలింపజేయు మొ. ; త. అచంకు. కదలు, చలించు ; అచై.

<మూ.ద్రా. *అక్-. కదలు.

**అసిబోవు** -పోవు. అ.క్రి. రవంత తగిలి తప్పిపోవు. రామా. 2.24 ; **అసియాడు** రూ. అసేడు. అ.క్రి. 1. కదలు. అల్లలాడు, వణకు. శృం.నై. 6.102, భా.రా. 2.148 : 2. సంచరించు, తిరుగు. రామా. 2.13 ; 3. చలించు. చెదరు. విజయ. 1.61 ; **అసియారుచు** రూ. అసియార్చు, స.క్రి. అల్లలార్చు. **అసియార్చు** రూ.చూ. అసియారుచు; స.క్రి. అల్లాడించు, కదలించు. కాశీ. 7.159 ; **అసిపోవు** -పోవు. అ.క్రి. 1. క్షీణించు, నశించు, వరాహ. 10.45 ; 2. తప్పిపోవు. రామా. 2.24.

**అసికోత** చూ. అసి[1].

**అసిగాయము** చూ. అసి[1].

**అసింట** రూ. అసంట, అసంటు, అసుంట. వి. అటు, అవతల.

క. అస. అంత ; ఇస. ఇంత.

అసు, ఇసు, ఎసు అనే పదాలు వృద్ధుల ఉచ్చారణలో ఉన్నట్లు శేతన (13 వ శతాబ్ది) ; అసువలె. ఆం.భా. 26.

అటు > అసు > అసు + ఇంట(న్) > అసింట.

**అసిత్తు** వి. 1. నిస్సత్తువ ; 2. ఉష్ణరోగం ; 3. వ్యాధివలని దౌర్బల్యం.

సం. అశక్తి. దౌర్బల్యం ; ప్రా. అసత్తి. ; నే. అసక్. అనారోగ్యం, అశక్తి.

<ప్రా. అసత్తి.

**అసిపమ్మ** వి. ఒక గ్రామదేవత, బలికోరే గ్రామదేవత.

సం. అశన-. ఆహారం ; త. పచ్చై-య్-అమ్మన్. ఒక గ్రామదేవత.

బహుశః <సం. అశన- + తె. అమ్మ.

**అసిమని** వి. మంచిచెడ్డ.

**అసిమెమరు** వి. జబ్బువల్ల కొద్దికొద్దిగా నెమరు వెయ్యటం.

<అసి[1] + నెమరు.

**అసివేటు** రూ. అసేటు. వి. జారువేటు, బాగా తగలని దెబ్బ.

<అసి[1] + న్ + ఏటు.

**అసిపి** రూ.చూ. అసిమి. విశే. నడుమ మూతిగల ఒకవిధమైన చిన్న గోనెసంచి, ఎద్దులమీద వేయటానికి కుట్టిన గోనెసంచి.

**అసిమి** రూ. అసిపి. వి. ఒకవిధమైన చిన్న గోనెసంచి. చెన్న. బస. 4.35.

క. పసుబె, పసుంబె, హసిబె, హసుబె, హసుంబె. మధ్య మూతిగలిగి, ఎద్దుకు రెండుపక్కలా ఉండేట్టు వేసే సంచి ; తు. పసంబె, పస్మబె. సంచి ; త. పై. సంచి ; జోలె ; పాముపడగ, విప్పు ; అచంపి, అచంపై, పచంపై. బుజాన వేసుకొనే సంచి ; మ. పయింప. సంచి.

<క. హసుంబె.

**అసిమిగొల్లెవ** వి. 1. గోనెలతో వేసిన చిన్నగుడారం ; 2. ఇరుపక్కలా వంపుగా కాలవలె ఏర్పరచిన చిన్న గుడారం. కళా. 8.42. **అసిమిసంచి** వి. మధ్య మూతిగల జంటసంచి, అశ్వసంచి.

**అసిమిగొల్లెవ** చూ. అసిమి.

**అసిమిసంచి** చూ. అసిమి.

**అసిమేత** చూ. అసి[1].

**అసిమేపు** చూ. అసి[1].

**అసిబోవు** చూ. అసి-[2].

**అసియాడు** చూ. అసి-[2].

**అసియారుచు** చూ. అసి-[2].

**అసియార్చు** చూ. అసి-[2].

**అసిరమ్మ** వి. ఒక గ్రామదేవత ; స్ఫోటకం అమ్మవారు.

సం. అసుర. పిశాచి.

<సం. అసుర- తె. అమ్మ.

**అసిలి** రూ.చూ. అసిలేరు.

**అసిలేరు** రూ. అసలేరు, అసిలి. వి. ఆశ్లేషానక్షత్రం.

సం. ఆశ్లేషా. సప్తమనక్షత్రం పేరు ; ప్రా. అసిలేసా ; అ.మా. అసిలెసా.

<ప్రా. అసిలేసా.

**అసివారు** రూ. సవారి, స్వారి. వి. 1. వయాళి, విహారం. కాశీ. 4.195 ; 2. గుఱ్ఱపుస్వారి. మను. 1.11.

సం. అశ్వవార-. గుఱ్ఱపరౌతు ; పా. అస్సారోహ ; నే. అస్వారి. యానసాధనం ; మరా. అసివార్. గుఱ్ఱపు రౌతు ; హిం. ఇస్వార్ ; గు. అస్వార, అసవార్ ; ఉ. అస్వార్.

<ఉ. అస్వార్ ; నిఘంటువుల్లో 'అసి-పాఱు' అని అనుచిత విభాగం కన్పిస్తుంది.

**అసివోవు** చూ. అసి²-. అ.క్రి. **1.** నశించు. వరాహ. 10.45 ; **2.** తప్పిపోవు. రామా. 2.24.

**అసుకు** వి. తడిపొడి (కొంత తడిగా కొంత పొడిగా ఉండటం).

**అసును** విశే. చదునైన, నున్నటి, మెత్తటి.

క. హసన, హసను. స్వచ్ఛం, నిర్మలం ; హస. మంచిస్థితి, సాగు ; పో.చూ. హదను. అనుకూల్యం.

<క. హసను.

**అసునుమన్ను** రూ. అనురుమన్ను. వి. పాకంలోఉన్న అడుసు. **అసురుమన్ను** రూ.చూ. అనునుమన్ను.

**అసునుమన్ను** చూ. అసును.

**అసున్నతి** మిశ్రన. వి. (మహమ్మదీయులు) సున్నతి చేయ కుండటం.

నే. సున్ని. సున్నత్ చేయించుకున్న మహమ్మదీయుడు ; హిం. సున్నత్. సున్నతి ; గు. సునత్, సునతా ; మరా. సంతా ; ఉ. సున్నత్. నియమం, ఆచారం ; అర. సున్నత్. ఆచారం ;

క. సునతె, సున్నతె.

<సం. అ-+ఉ. సున్నత్.

**అసున్నతీయులు** వి. బ.వ. సున్నతి చేయించుకోనివారు ; మహమ్మదీయేతరులు.

'మహమ్మదీయ' శబ్దసామ్యంపై సం. ఈయ ప్రత్యయం చేర్చి క్రైస్తవమత ప్రబోధకులు కల్పించిన మిశ్రరూపం.

<సం. అ-+ఉ. సున్నత్+సం. -ఈయ.

**అసున్నతీయులు** చూ. అసున్నతి.

**అసురుమన్ను** చూ. అసును.

**అసురుసురు** ధ్వన్య. రూ. అసులుసులు. వి. బడలికయందు విడిచే ఉచ్ఛ్వాస నిశ్వాసాల ధ్వన్యనుకరణం. పల్నా. 58, అచ్చరా. 4.22, కవిరా. 5.265.

క. అసురుసురు. బడలిక, అలసట ; అసుర్. బడలిక, మైకం ; త. అచర్. మైకం కమ్ము ; అచితి. మైకం ; అచప్పు. పరాకుగానుండు ; అచా. మైకం ; అచైవు. వినుగు ; ఉయిర్. ప్రాణం ; మ. అసతి. మైకం.

**అసురుసురగు** అ.క్రి. అలయు, బడలు, శ్రమనొందు. మను. 4.84.

**అసురుసురగు** చూ. అసురుసురు.

**అసులుపట్టె** వి. గడప, దర్వాజా చట్రపు కింది కమ్మి.

**అసులుసులు** ధ్వన్య. రూ.చూ. అసురుసురు.

**అసెవి** వి. అశ్విని.

<సం. అశ్వినీ.

**అసెరెకి** రూ.చూ. ఉసిరి. వి. ఉసిరిక (Phyllanthus emblica).

**అసెల్లె** వి. మజ్జిగదారు.

**అసెసరు** వి. పన్ను నిర్ణయించేవాడు, ఆలోచనలో సహాయపడే వాడు, సెషన్సు కోర్టులో అసెసరు.

ఇం. అసెసర్. పన్ను నిర్ణయించేవాడు, మదింపుచేయు వాడు, మేజస్ట్రేటుకు లేదా జడ్జికి సహాయుడుగా ఉండేవాడు.

<ఇం. Assessor.

**అసేటు** రూ.చూ. అసినేటు. వి. జారుడెల్ల.

**అసేడు** రూ.చూ. అసియాడు. అ.క్రి. చలించు, వణకు, ఊగాడు. శశా. 4.139.

**అసోగము** వి. అశోకం, కంగేలి (Uvaria longifolia).

సం. అశోక-. వంజులం ; ప్రా. అసోగ-, అసోయ ; అ.మా. అసోగ ;

క. అసుకె, అసుగె ; త. అచోకమ్ ; మ. అసోకమ్.

<ప్రా. అసోగ-.

**అసోగమాను** అశోకవృక్షం, కంగేలి.

**అసోగమాను** చూ. అసోగము.

**అస్కాచక్కెర** వి. తెల్లటి బరకచక్కెర, గంజాం జిల్లా అస్కా అనే గ్రామంలో తయారయ్యే చక్కెర.

**అస్కింత** (అనుకు+ఇంత) వి. కొంచెం.

**అస్తం** వి. హస్తకార్తె.

<సం. హస్త-.

**అస్తపుతాడు** వి. మగ్గం నిలువుపట్టెకూ కింది ఉడతతాడుకూ కట్టే తాడు.

<సం. హస్త-+తె. తాడు<త్రాడు.

**అస్తమానం** రూ. అస్తమాను. వి. సూర్యాస్తమయం ; అవ్య. ఎల్లప్పుడు, ఎడతెగకుండా (వ్య. సూర్యాస్తమయందాకా).

సం. అస్తమాన-<అస్తమయన. సూర్యాస్తమయం ; ప్రా. అత్థమ. అస్తమయం ;

క. అస్తమాన, అస్తమన, అస్తమయ. అస్తమయం ; తు. అస్తమాన ; త. అస్తమనమ్ ; మ. అస్తమానమ్.

<సం. అస్తమాన-. అర్థవిపరి.

**అస్తమాను** రూ.చూ. అస్తమానం.

**అస్తము** రూ.చూ. అత్తము. వి. గెలలో ఒకభాగం, అరటిపండ్ల అత్తం.

**అస్తరికారి** చూ. అస్తరు².

**అస్తరు**[1] రూ. అస్తరువు, అస్త్రీ. వి. **1.** అతుకు వేసిన గుడ్డ. మాసిక. ఆం.భా. 2.158 ; **2.** ఒక గుడ్డకు ఆశ్రయంగా లోపక్క వేసి కుట్టే గుడ్డ.

సం. ఆస్తర-. కప్పు, దుప్పటి మొ. ; నే. అస్తర్. లోపక్క కుట్టే గుడ్డ ; హిం. గు. మరా. అస్తర్ ; ఉ.పార. ఆస్తర్, అస్తర్ ;

క. ఆస్తర, ఆస్తరణ, అత్తరణ. కప్పు, దుప్పటి, ఏనుగుపైన వేసే రత్నకంబళం.

<ఉ. అస్తర్.

**అస్తరువేయు** స.క్రి. లోపల అస్తరుగుడ్డ మొ. వేయు.

**అస్తరువేసికుట్టు** స.క్రి. లోపల అస్తరుగుడ్డ మొ. వేసి కుట్టు.

**అస్తరు**[2] వి. గిలాబా.

<అస్తరు[1]. అర్థ విపరి.

**అస్తరికారి** రూ. అస్త్రకారి. వి. **1.** గచ్చుమీద మెరుగు

పెట్టేవాడు ; **2.** రాళ్లమధ్య సందులకు నున్నం మెత్తటం.
**అప్తర్‌కార్** వి. నునుపు గిలాబా పనివాడు.
**అప్తరువు** రూ.చూ. అస్తరు[1]. వి. **1.** అరుకువేసే గుడ్డ ; **2.** అతుకు, మాసిక ; **3.** ఒక గుడ్డకు ఆశ్రయంగా లో పక్క వేసి కుట్టే గుడ్డ.
**అప్తరువేయు** చూ. అస్తరు[1].
**అప్తరువేసికుట్టు** చూ. అస్తరు[1].
**అప్తర్‌కార్** చూ. అస్తరు[2].
**అప్తాయిప్తము** రూ.చూ. అస్తావెస్తము. వి. చాదస్తం.
**అప్తాలబద్ద** వి. పదునులో అచ్చు తర్వాత దూర్చిన సన్నటి బద్ద.
<సం. హస్త-; నేసేటప్పుడు ఈ బద్దను చేత్తో జరుపు కుంటారు కాబట్టి ఆ పేరు.
**అప్తావెప్తపుమనిషి** చూ. అస్తావెస్తము.
**అప్తావెప్తము** రూ. అస్తాయిస్తము. ఆస్తావెస్తము. వి. చాదస్తం.
సం. అస్తవ్యస్త-. చెల్లాచెదరు, తబ్బిబ్బు, తార్మారు : ఒ. అస్తబ్యస్త; హిం. అస్తవ్యస్తీ ; మరా. అస్తావ్యస్త ; క. అస్తావ్యస్త.
<సం. అస్తవ్యస్త-. అర్థ విపరి.
**అప్తావెప్తపుమనిషి** వి. చాదస్తుడు.
**అప్తిభారము** రూ. అస్థిభారము, హస్తిభారము. వి. పునాది. అడుగుమట్టు.
సం. అస్తి. అవ్య. ఉన్నది ; భార. బరువు, పెద్ద మొత్తం ; హస్తిభార- ఏనుగు భారం వంటిది ; హిం.ఉ. పార. ఉస్తువార్. పునాది ;
క. అస్తిభార, అస్తివార. పునాది ; తు. అస్తిభార ; త. అస్తిపారమ్, అస్తివారమ్, మ. అస్తివారమ్.
<సం. అస్తిభార-. అస్తిక్షీర (పాడిఆవు) మాదిరిగా, భారం గలది అని ; < సం. హస్తిభార-. లేదా < ఉ. ఉస్తువార్.
**అప్త్రకారి** రూ. అస్తరికారి. చూ. అస్తరు[2]. వి. **1.** గచ్చుమీద మెరుగుపెట్టేవాడు ; **2.** రాళ్ల మధ్య సందులకు నున్నం మెత్తటం.
**అప్త్రకారితాపి** వి. సన్నగా పొడుగ్గా ఉండే కొయ్యతాపి.
**అప్త్రకారితాపి** చూ. అస్త్రకారి.
**అప్తిలారు** అ.క్రి. మరణించు.
సం. అస్థి. ఎముక.
<సం. అస్థి + లు + ఆరు.
**అప్త్రీ** రూ.చూ. అస్తరు[1].
**అప్థిభారము** రూ.చూ. అస్తిభారము. వి. పునాది.
**అప్నాదు** వి. సన్నదులు, దస్తావేజులు.
ఉ. అస్నాద్ (సనద్ బ.వ.) సన్నదులు మొ.
<ఉ. అస్నాద్.
**అస్పృశ్యులు** వి. బ.వ. అంటరానివారు అని వ్యుత్పత్తి. ఈవిధంగా చాదస్తులు అశాస్త్రీయంగానూ తప్పుగానూ తలచేవారు, హరిజనులు.
సం. అస్పృశ్య-. అంటరాని ; మరా. అస్పృశ్య. అంటరానివాడు ; హిందువులలో తక్కువ కులంవాడు.
<సం. అస్పృశ్య-. అర్థ విపరి.

**అప్బాబు** వి. వస్తువులు. కొరముట్లు, సామానులు.
నే. అస్బాబ్. సామాను ; ఉ.అర. అస్బాబ్.
<ఉ. అస్బాబ్.
**అప్మాకమ్** వి. ఉంచుకొన్నది, ఉంపుడుకత్తె.
సం. అస్మాకమ్. మాయొక్క.
<సం. అస్మాకమ్ ; వ్యు. మాకు చెందినది, మాది ; అర్థ విపరి.
**అప్సలు** రూ.చూ. అసలు[2].
**అప్సరు** ధ్వన్య. పో.చూ. ఉసురుసురు. వి. బడలికయందు విడిచే ఉచ్ఛ్వాస నిశ్వాసాల ధ్వన్యనుకరణం.
**అప్పెరికి** రూ.చూ. ఉసిరి.
**అహ** రూ. అహో. అవ్య. ఆశ్చర్యాద్యర్థకం. వే.మా. **5.69.**
క. అహహా. ఆశ్చర్యాద్యర్థకం ; తు. అహా, ఆహా ; త. అ, అఅ, అకా.
**అహనికొలిమి** వి. కమ్మరిపన్ను.
హిం.ఉ.పార. ఆహన్. ఇనుము.
<ఉ. ఆహన్ + తె. కొలిమి.
**అహవాలు** వి. సమాచారం, పరిస్థితి, సంఘటన.
హిం.మరా. అహ్‌వాల్. వృత్తాంతం ; ఉ. అహ్‌వాల్. సమాచారాలు, సంఘటనలు ; పార. అహ్‌వాల్. సాహస యాత్ర, ప్రమాదం ; అర. అహ్‌వాల్. పరిస్థితులు. విషయం, ప్రమాదాలు.
<ఉ. అహ్‌వాల్.
**అహహ** రూ. అహహో, అహోహో. అవ్య. **1.** ఆశ్చర్యసూచకం. భార.ఆది. 6.90, భీమ. 3.128 ; **2.** ప్రశంసాసూచకం. శృం.నై. 2.10 ; **3.** ఆక్షేపార్థకం. దశా. 1.245, 2.383.
క. అహహా. ఆశ్చర్యాద్యర్థకం ; మ. అహహా.
**అహహో** రూ.చూ. అహహ. అవ్య. ప్రశంసాద్యర్థకం.
**అహో** రూ.చూ. అహ. అవ్య. **1.** అంగీకార సూచకం. సారంగ. 2.121 ; **2.** ప్రశంసార్థకం. నీలా. 2.19.
**అహోయిత్యము** రూ.చూ. ఆగాత్యము. వి. కొంచెమును గొప్పగా చేసి కావించే అరుపు, ఏడుపు మొ.
**అహోరె** రూ.చూ. అహోరే. అవ్య. ఆశ్చర్యద్యోతకం ; ఆహో.
**అహోరే** రూ. అహోరె. ఆశ్చర్యద్యోతకం.
<అహో + అరే ; లేదా అహో + రే.
**అహోహో** రూ.చూ. అహహ. అవ్య. ప్రశంసార్థకం. కృష్ణ. 3.76.
**అహోరించు** అ.క్రి. మొత్తుకొను, విలపించు.
**అహై** వి. వలపటి ఎద్దు (ధ్వన్యనుకరణశబ్దం కావచ్చు).
**అహ్రరామ** వి. తోకరెక్క మధ్యభాగం నల్లగా ఉండే ఊదా రంగు సముద్రపు చేప (Gobioides anguillaris).
**అహ్లికారులు** రూ. హలేకారులు ; చూ. ఆలెగాడు[1]. వి. బ.వ. ఉద్యోగస్థులు.
నే. అహల్‌కార్. వార్తాహరుడు ; హిం. అహల్కార్ ; ఉ. అహల్‌కార్ ; పార. అహ్లికార్. పనివాడు ; అర. ఆహల్‌కర్. ఉద్యోగస్థుడు.
<ఉ. అహల్‌కార్.
**అటియు** పో.చూ. అచ్చు. స.క్రి. నాశనంచేయు, ధ్వంసంచేయు,

కుడిచి పెట్టు.

క. అఱి. నశించు, ధ్వంసమగు, నాశనంచేయు, ధ్వంసం చేయు ; వి. నాశనం, ధ్వంసం ; తు. అర్ పుని, ఇఱ్యుని. నాశనంచేయు, ధ్వంసంచేయు ; త. అఱి. నాశనమగు, ధ్వంసమగు ; నాశనంచేయు, ధ్వంసంచేయు ; మ. అఱి యుక. కో. అల్ చ్-.

<పూర్వ తె. *అట్-చ్-<మూ.ద్రా. *అట్-.



ఆ¹ వి. తెలుగు వర్ణమాలలో రెండవవర్ణం.

వివృతమై తాలవ్యేతరమైన నిరోష్ఠ్య దీర్ఘ స్వరం. అన్ని ద్రావిడ భాషల్లోనూ ఉంది.

దీర్ఘత ద్రావిడ భాషల్లో వర్ణ భేదక సామర్థ్యంకలది. కాబట్టి దీర్ఘస్వరాలన్నీ ద్రావిడభాషల్లో వర్ణాలే.

<మూ.ద్రా. *ఆ.

ఆ² రూ. అ⁶. అకారాంత పదాలకు చివర వైకల్పికంగా వచ్చే ప్రత్యయం. క. తు. త. ఆ. సంబోధన ప్రత్యయం ; పో.చూ. త. సంబోధనంలో పదాంతాచ్చులకు దీర్ఘం ; అన్బన్. తండ్రి. సంబోధన ; అప్పా, తోఢ. స్నేహితురాలు. సంబోధన ; తోడ. మొ.; కువి. ఆ. వాక్యాంతంలో చేరే గౌరవసూచక ప్రత్యయం ; 'వాడు ఆ'. రండయ్యా ; కురు. ఆ. విధ్యర్థకాల అంతాగమం, బర్-ఆ. రా.

<మూ.ద్రా. *-ఆ.

ఆ³ పో.చూ. ఆయా¹, ఆయయి, ఆయాయి, అయ్యయి, అయ్యాయి, అయ్యై. రూ. అ². సర్వ. 1. ఆ, అది. దూరస్థ వస్తు నిర్దేశకం. భార.ఆది. 1.67 ; 2. పూర్వ నిర్దిష్టార్థ బోధకం. భాగ. 8.21.

క. తు. ఆ. నిర్దేశ సర్వనామం ; త. ఆ. హల్లుముందు; అప్పుడు ఆ హల్లు ద్విరుక్తమవుతుంది. 'అవ్వ'; ఆ. అచ్చు ముందు ; 'అ-య్-ఇవై'; ఇవై. సమయం; అయిపై. ఆ సమయం. నిర్దే. సర్వ.; మ. ఆ ; కుఇ. ఆ, అ- ; కువి. ఆ, అ-, ఏ-; పర్జి. ఆ; కొలా. అ-, ఆ ; కురు. ఆ ; మాల్తో. ఆ ; బ్రా. ఏ.

<మూ.ద్రా. *ఆ/*అ-.

**అయ్యా** రూ. ఆయా¹. విశే. ఆయా (వస్తువులు), అటువంటి. **అయ్యాయి** రూ. చూ. ఆయాయి. విశే. ఆయా (వస్తువులు), అటువంటి. <ఆ + అయి. **అయ్యై** రూ. ఆయై. విశే. ఆయా. (వస్తువులు), అటువంటి. **ఆడ¹** -ఁద < కడ. క్రి. విశే. అక్కడ. రం. రా. 2.52 వ. 22 పం. **ఆడ-కాడ** -కు + ఆడ. క్రి. విశే. అక్కడక్కడ. క్రమక్రమంగా, అప్పుడప్పుడు. **ఆడాడ** చూ. ఆడ. క్రి. విశే. అక్కడక్కడ. రం.రా. 2.116 పు. 10 పం. **ఆతగాఁడు** ఆత <అతఁడు+కాఁడు ; రూ.చూ. అతగాడు. సర్వ. వాడు, అతడు. శుక. 2.190. **ఆతఁడు** రూ. అతను, ఆతను, అతఁడు. సర్వ. వాడు. భార.ఆది. 3.23, 5.17. క. అతను. వాడు ; పో.చూ. తాన్. వాడు, ఆమె, అది. (పూర్వ నిర్దిష్టార్థ బోధకం) ; తాను. పో.చూ. త. అత్తన్. తండ్రి, పెద్ద ; తాన్. వాడు, ఆమె, అది ; పో.చూ. మ. తాన్. ఎవరైనా. <మూ.ద్రా. *ఆ+తన్. తాన్-. **ఆతను** రూ.చూ. అతఁడు. **ఆతల** రూ.చూ. అవతల. క్రి. విశే. 1. తర్వాత, అవలికాలం. హరి. పూ. 4.30 ; 2. అవతలివైపు, అవలి ప్రదేశం. ప్రబో. 1.82. క. ఆదలె. ముందు, ఎదుట. <మూ.ద్రా. *ఆ+తలయ్. **ఆతలీతలసేయు** చూ. ఆతల. స.క్రి. అట్టిటుసేయు, తలకిందుసేయు. భాగ. 8.444. **ఆపె** పో.చూ. ఆయప. సర్వ. ఆమె. **ఆబిడ** -బిడ; పో.చూ. బిడ్డ. రూ. ఆబిడె, ఆవిడ, ఆవిడె. సర్వ. ఆమె. విజయ. 1.130. <ఆ- బిడ్డ. **ఆబిడె** రూ.చూ. ఆబిడ. **ఆమె** పో.చూ. ఆయమ్మ¹. సర్వ. ఆస్త్రీ. **ఆయక** రూ.చూ. ఆయక్క. సర్వ. ఆమె, పూజ్యురాలు. యయా. 4.165. కళా. 1.68. **ఆయక్క** పో.చూ. అక్క. రూ. ఆయక. సర్వ. ఆమె. ఆస్త్రీ. **ఆయది** రూ. అయ్యది. వి. ఆమె, ఆ వస్తువు. **ఆయన** -అన <అన్న ; చూ. అన్న. సర్వ. 1. అతడు, పూజ్యుడు. భార.ఉద్యో. 2.261 ; 2. భర్త. **ఆయప** -అప <అప్ప. వి. ఆమె. **ఆయమ** రూ.చూ. ఆయమ్మ. వి. ఆమె. భార. శాంతి. 1.7. **ఆయమ్మ¹** రూ. ఆయమ. వి. ఆమె, ఆ స్త్రీ. <ఆ+అమ్మ. **ఆయయి** రూ. ఆయాయి. విశే. ఆయా (వస్తువులు), అటువంటి. <ఆ+అయి. **ఆయా¹** రూ.చూ. అయ్యా. విశే. ఈ ఆ. వివిధమైన. <ఆ+ఆ. **ఆయాయి** రూ. ఆయయి, అయ్యయి, అయ్యాయి, అయ్యై. విశే. ఆయా (వస్తువులు), అటువంటి. నార.వు. 1.210. **ఆయై** రూ.చూ. అయ్యై. విశే. ఆయా (వస్తువులు), అటువంటి. **ఆలాగంటి** (-లాగు+వంటి). రూ. అలాటి, ఆలాటి. విశే. అట్టి, అటువంటి. **ఆలాగు** విశే. అట్లు, ఆ విధంగా. **ఆలాటి** రూ.చూ. ఆలాగంటి. విశే. అటువంటి. **ఆవిడ** రూ.చూ. ఆబిడ. **ఆవిడె** రూ.చూ. ఆబిడ.

-ఆ⁴ రూ. అ⁴. అవ్య. 1. ప్రశ్నార్థక ప్రత్యయం. కు.సం. 12.801. భార. మౌ. 44 ; 2. క్రియాపదాలమీద వచ్చి 'ఏని, ఎడల' అనే అర్థం ఇస్తుంది. విజయ. పీఠిక. 54, దశా. 4.659.

క. తు.త.మ.కువి. -అ. వినయపూర్వక నం ప్రశ్న.

<మూ.ద./మ.ద్రా. -*ఆ.

**ఆ[5]-** రూ. ఆఁ, ఆమ్[1]. చూ. ఆవు. వి. **1.** ఆవు. అ+లు. అని బ.వ.లో మాత్రమే ప్రయుక్తం. భార.ఆను. 4.22 ; **2.** ఆవుయొక్క. నమాన పూర్వపదంగా ప్రయుక్తం.

క. అ/ఆన్. ఆవు నంక్షిప్తరూపం ; త. అ. ఆవు.

<మూ.ద.ద్రా. *ఆ. ఆవు ; *ఆన్. ఆవుయొక్క.

**ఆగదపు** (-కదపు). వి. ఆవులమంద. **ఆదూడ** వి. ఆవు దూడ. భాగ. 10. పూ. 92. **ఆబర్ధ** (-పర్ధ). రూ.చూ. ఆఁబర్ధ. వి. ఆవుపెయ్య. **ఆబెయ్య** (-పెయ్య) రూ.చూ. ఆఁబెయ్య. వి. ఆవుపెయ్య. **ఆబోతు** (-పోతు) రూ.చూ. ఆఁబోతు. వి. అచ్చుటెద్దు ; యథేచ్ఛగా తిరగటానికై అచ్చు వేసి విడిచిన ఎద్దు, ఎద్దు. **ఆబోతురౌతు** రూ.చూ. ఆఁబోతు రౌతు. వి. ఎద్దునెక్కేవాడు, శివుడు. **ఆబోతువేయుట** వి. పెద్దల స్మృతి చిహ్నంగా అచ్చువేసి కోడెను విడిచిపెట్టటం. **ఆబోతు సౌరము** రూ.చూ. ఆఁబోతుసౌరము. వి. నప్తస్వరాల్లో ఒకటి, ఋషభం. **ఆమంద(ము)** వి. ఆవులమంద. క. మందె. పశువుల గుంపు, పశువులు నిలిచే బీడు ; త. మంతై. మంద.

**ఆ[6]** అవ్య. అంగీకార సూచకపదం.

తు. ఆఁ. అంగీకారాన్నిగాని జ్ఞప్తిని గాని సూచించే ప్రత్యయం ; పో.చూ. త.మ.ఆమ్.

**ఆ[7]** అవ్య. ఆశ్చర్య సూచకపదం.

క.తు. ఆ, ఆహ్. ఆశ్చర్యాన్ని బాధను సూచిస్తుంది ; త. ఆ, ఆహ ! ఆశ్చర్య ప్రశంసాద్యర్థకం ; మ. ఆ.

**ఆ[8]** నంప్రార్థనంలో మధ్యమ పురుష మువర్ణకదువర్ణకాలకు అను ప్రయుక్తంగా వచ్చేది. చెప్పుమ్ (ఉ)-అ.ఉ.హరి. 2.72.

**ఆ[9]** ప్రశ్నార్థంలో కాకూక్తి చేత వ్యతిరేక సూచకం. 'నరి.యే.- ఆ,యే. ఇతడు.'

త. ఆ.

**ఆ[10]** క్రియానమాసాల్లో పూర్వపదంగా ప్రయుక్తం. రూ.చూ. ఆఁ[2]. ఉదా. ఆకలి. ఆకొను రూ. ఆఁకొను. అ.క్రి. ఆకలిగొను.

**ఆఁ[11]** రూ.చూ. ఆ[5]. నమస్త పదాల్లో పూర్వపదంగా ప్రయుక్తం. విశ. ఆవుయొక్క.

**ఆఁదోఁక** (-తోఁక). వి. **1.** ఆవుతోక ; **2.** ఆవుతోక ఆకారం. **ఆఁదోఁకగా (న్)** (-తోఁకగాన్). క్రి.విశ. ఏటవాలుగా, ఆవుతోక ఆకారంలో. **ఆఁదోఁకపాటు** వి. ఏటవాలుగా ఉండటం. **ఆఁబర్ధ** (-పర్ధ). రూ. ఆబర్ధ వి. **1.** పాలువిడిచిన ఆవుపెయ్య. మను. 2.7 ; **2.** ఆవుపెయ్య. **ఆఁబసి** (-పసి). వి. ఆవు. యయా. 2.49. **ఆఁబెచ్చు** (-పెచ్చు). వి. ఆవుతోలు. **ఆఁబెయ్య** (-పెయ్య). రూ. ఆబెయ్య. రూ. ఆబేయ. వి. ఆవుపర్ధ. భార. 2.90. **ఆఁబెరుగు** (-పెరుగు). వి. ఆవుపెరుగు. చెన్న.బ. 3.73. **ఆఁబేయ** (-పేయ) రూ.చూ. ఆఁబెయ్య. వి. ఆవుపర్ధ. బహులా. 2.19. **ఆఁబోతు** (-పోతు). రూ. ఆబోతు, ఆంబోతు. వి. అచ్చుటెద్దు. భార. విరా. 1.286, భాగ. 10.4.519. **ఆఁబోతురౌతు** రూ. ఆబోతురౌతు వి. వృషభవాహనుడు, శివుడు. **ఆఁబోతుసౌరము** రూ. ఆబోతుసౌరము వి. నప్తస్వరాల్లో ఒకటి, ఋషభం.

**ఆఁ[2]** క్రియానమాసాల్లో ప్రయుక్తం రూ. ఆ[10]. చూ. ఆఁకలి.

**ఆఁకొను** రూ. ఆకొను. అ.క్రి. ఆకలిగొను. భార. 5.3.338.

**ఆఁకొన్నతనము** వి. ఆకలిగొని ఉండటం. భీమ. 2.120.

**ఆఁకొన్నవాఁడు** వి. ఆకలిగొన్నవాడు. ఆం.భా. 2.260.

**ఆఁకొంట** వి. ఆకలిగొనటం. ఆం.భా.2.260.

**ఆక** అవ్య. పిమ్మట, పద్చాక, తిన్నాక.

**ఆకట** అవ్య. అయ్యో.

**ఆకట్టు** అవ్య. వలె, పోలె.

**ఆకతాయ** రూ. ఆకరాయి, ఆగరాయి. వి. దుష్టుడు, తుంటరి. హర. 5.10, హంస. 5.113.

నం. ఆతతాయిన్. హంతకుడు, దుర్మార్గుడు, దొంగ ; పో.చూ.క. ఆతతాయి. పో.చూ.త. అతతాయికళ్. దొంగలు, హింసకులు, హంతకులు ; పో.చూ.మ. ఆతతాయి. దుండగీడు.

బహుశః 'ఆగాత్యం' సంబంధి.

<నం. ఆతరాయిన్. వర్ణవిభేదం.

**ఆకతాయతనము** వి. దౌష్ట్యం, క్రౌర్యం, దుండగీడుతనం.

**ఆకతాయతనము** చూ. ఆకతాయ.

**ఆకతాయతీగె** వి. తిప్పతీగె, తిప్పతీగ (Dioscorea spinosa).

**ఆకతాయి** రూ.చూ. ఆకతాయ.

**ఆకప్పు** చూ. ఆకు. వి. పచ్చి ఆకులమీదనుంచి నిప్పులపై ఉడికించే అప్పు (అప్పచ్చి), దాలిరొట్టె.

**ఆకము** చూ. హాకము. వి. అధికారం.

**ఆకర** చూ. ఆకురాయి[2]. వి. లోహాన్ని అరగదీసే సాధనం.

**ఆకరు** రూ. చూ. ఆఖరు. క్రి. విశ. చివర.

**ఆకరువు** రూ. చూ. ఆఖరు. క్రి. విశ. చివర, నమాప్తం.

**ఆకళించు** స.క్రి. **1.** అవగాహనంచేసుకొను, తెలిసికొను. కళా. 4.32 ; **2.** కలిగించు, చేయు. కృ. శకు. పీఠి. 94.

నం. ఆకలయతి. పరిశీలించు, ఊహించు, గ్రహించు ; ప్రా. అగల. న.క్రి. గ్రహించు, ఊహించు ;

మ.రా. ఆకల్నె. నిర్బంధించు, గ్రహించు.

< నం. ఆకల్ + ఇంచు.

**ఆకళింత** వి. అవగాహనం. **ఆకళింపు** రూ. ఆఁకళింపు. వి. అవగాహనం.

**ఆకళింత** చూ. ఆకళించు.

**ఆకళింపు** చూ. ఆకళించు.

**ఆకసము** వి. **1.** ఆకాశం. భార.అర. 4.74, భీష్మ. 1.133 ; **2.** స్వర్గం.

నం. ఆకాశః. శూన్య ప్రదేశం, ఆకాశం, వాతావరణం ; ప్రా. ఆకాస, అగాస, ఆయాస. అంతరాళం ; పా. ఆకాస ; అమా. జై.మ.హా. అగాస ;

నే. అకాస్, ఆకాశ్, అకాస్, ఆకా్ఁస్ ;

క. అకస, ఆకాస, అగస ; తు. అకాస ; త. ఆకాచమ్, ఆకాయమ్ ; మ. ఆకాశం, ఆకాయం ; ద్రా. ఆసమాన్.

< ప్రా. ఆకాస-.

**ఆకాత్యము** రూ. చూ. ఆగాత్యము. వి. **1.** గోరంతలు కొండంతలుచేసి అరిచే అరుపు, ఏడ్చే ఏడుపు ; **2.** తన ఇష్టప్రకారం ఇతరులు నడుచుకోలేదని, తాను చస్తానని గానీ, చంపుతాననిగానీ పట్టుపట్టి చేసే అల్లరి.

**ఆకాశ-** విశే. అంతరిక్షం, శూన్యం. సమాస పూర్వపదంగా ప్రయుక్తం.

**ఆకాశఉట్టి** మిశ్రస. వి. గృహప్రవేశ సమయంలో గుమ్మడి కాయను పెట్టి వేలాడదీసేవుట్టి. <నం. ఆకాశ-+ తె.ఉట్టి. **ఆకాశగరుడగడ్డ** మిశ్రస. వి. చెట్టుపైన పెరిగే మొక్క, తరురోహిణి, బదనిక. క. *అకాశగరుడబల్లి*. ఒక జాతి తీగ (Bryonia epigea); త. *ఆకాచ-కరుటన్*. ? <నం. ఆకాశ + తె. గరుడగడ్డ. **ఆకాశచక్రము** వి. ఒక రకం బాణానంచు. హంస. 3.28. < నం. ఆకాశచక్ర-. అర్థ విపరి. **ఆకాశచువ్వలు** పో.చూ. ఆవాయి నువాయిలు, అవ్వాయి చువ్వలు. చూ. చువ్వ. బర్ద, క్ర. వి. బ.వ. తారా చువ్వలు. **ఆకాశపంచాంగము** వి. పుక్కిటి పురాణం. గాలికబుర్లు. త. *ఆకచ-పంచాంకమ్*. అర్థం లేని అబద్ధం, గాలి కబుర్లు ; నం. *పంచాంగ-*. తిథి, వారం, నక్షత్రం, యోగం, కరణం, అనే అయిదంగాలు కలది. < నం. ఆకాశ పఞ్చాఙ్గ-. అర్థవిపరి. **ఆకాశపురాణము** వి. పుక్కిటి పురాణం, గాలికబుర్లు. < నం. ఆకాశపురాణ-. అర్థవిపరి. **ఆకాశబాణము** వి. తారాచువ్వ. రాజవా. 5.61. క. *ఆకాశ-బాణ* ; త. *ఆకాయ-వాణమ్* ; నం. *బాణ-*. అమ్ము, శరం. < నం. ఆకాశబాణ-. అర్థవిపరి. **ఆకాశబెండ** వి. పెద్ద బెండ. మిశ్రస. ? ; బెండ (Abelmoschus esculentus). **ఆకాశమల్లె** వి.మానుమల్లె (Millingtonia hortensis) ; ఎత్తుగా పందిరిమీద అల్లుకొనేది కాబట్టి. ఆకాశమల్లె. < నం. ఆకాశ-. చూ. మల్లె. **ఆకాశరామన్న** పో. చూ. ఆకాశరామయ. వి. అజ్ఞాత వ్యక్తి, అనామకుడు, ప్రచ్ఛన్నుడు. త. ఆకాచరామన్. అనామకుడు, ప్రచ్ఛన్నవ్యక్తి. < నం. ఆకాశరామ + తె. అన్న. **ఆకాశరామన్నఅర్జీ** వి. ఊరూ పేరూ లేనివాడి దరఖాస్తు. **ఆకాశరామయ** పో.చూ. ఆకాశరామన్న. **ఆకాశవర్తకుడు** వి. మోసగాడు ; గాలిలో బేరం చేసేవాడు. **ఆకాశవాణి** వి. **1.** రేడియో ; **2.** ఆకాశంనుంచి గాని స్వర్గంనుంచి గాని వినబడే వాక్కు. క. *ఆకాశవాణి*. రేడియో, దివ్యవాణి ; త. *ఆకాశ్‌వాణి*. రేడియో. < నం. ఆకాశవాణీ-. దివ్యవాణి. అర్థవిపరి.

**ఆకాశగరుడగడ్డ** చూ. ఆకాశ-.

**ఆకాశచక్రము** చూ. ఆకాశ-.

**ఆకాశచువ్వలు** చూ. ఆకాశ-.

**ఆకాశపంచాంగము** చూ. ఆకాశ-.

**ఆకాశపురాణము** చూ. ఆకాశ-.

**ఆకాశబాణము** చూ. ఆకాశ-.

**ఆకాశబెండ** చూ. ఆకాశ-.

**ఆకాశరామన్న** చూ. ఆకాశ-.

**ఆకాశరామన్నఅర్జీ** చూ. ఆకాశ-.

**ఆకాశరామయ** చూ. ఆకాశ-.

**ఆకాశవర్తకుడు** చూ. ఆకాశ-.

**ఆకాశవాణి** చూ. ఆకాశ-.

**ఆకాసపాయలు** చూ. ఆకసము. వి. వర్షాధారంతో పండే ఒక రకం వడ్లు, మెట్టవడ్లు.

**ఆకితము** అవ్య. ముందుగా, పూర్వం.

< ఆ[3] + కితము < నం. కృతమ్.

**ఆకిమ్** రూ.చూ. హాకీము. వి. ప్రభువు, పరిపాలకుడు, సేనాని.

**ఆకిరి**[1] చూ. ఆఖరు. వి. దూలం మట్టంవరకు లేచిన గోడ.

**ఆకిరి**[2] రూ.చూ. ఆఖరు.

**ఆకిరు** రూ.చూ. ఆఖరు.

**ఆకిలి** చూ. వాకిలి. వి. చుట్టు దవంతికి మధ్య కప్పునించి నీరు పడేందుకు వీలుగా ఏర్పరిచిన ఖాళీ.

< వాకిలి.

**ఆకు** వి. **1.** పర్ణం, పత్రం. భార. అర. 2.174 ; **2.** ఋణాది వ్యవహార పత్రం. విజ్ఞా. వ్య. 38 ; **3.** చెవికమ్మ. నృసిం. 2.86 ; **4.** అధికార పత్రం, ఆజ్ఞాపత్రం. భోజ. 4.45 ; **5.** తములపాకు. కళా. 4.69 ; **6.** తాటాకు పుస్తకంలో ఒక పత్రం. ప్రభా. 5.74 ; **7.** జాబు. ప్రభా. 4.45 ; **8.** బండికంటి ఆకు, అరం ; **9.** రాట్నం, పంటి మొ. వాటి ఆకు, లేదా బద్ద ; **10.** తలుపులకు అమర్చే ఆకు ; **11.** వరి మొ. నారు ; **12.** పొర, చెక్కు ; **13.** తులసికోట అంచు నగిషీపని ; **14.** దూలం కింద స్తంభం పైన కట్టుబడి దొడ్డుమీది నల్పదరపు చెక్కడం పని ; **15.** కొడవలి, కత్తి మొ. వాటి అంచు ; **16.** ఉన్ని కత్తెర పదును ; విశే. **1.** సమస్త పదాల్లో పూర్వపదంగా : ఆకు పచ్చని ; **2.** పలచని.

క. ఆకు. పర్ణం, నారు ; అగె. మొలక, పిలక, అంకురం ; అగు-. కలుగు, పెరుగు ; తు. అగె. మొగ్గ ; పో.చూ. యెగ్గల్. రెమ్మ ; పో.చూ. త. అకై. మొలకెత్తు, పర్ణిల్లు ; పో. చూ. ఇలై. ఆకు ; ఇవిర్. మొలకెత్తు ; మ. అక. చిగురు, మొగ్గ ; అకెక్క, అకకుక్క. మొలకెత్తు, మొగ్గదొడుగు ; గో. అకీ. పర్ణం ; కొండ. అక్ ; కుఇ. అకు. పర్ణం, గ్రంథ పత్రం ; కువి. అకు. వ్యవహార పత్రం, జాబు, పర్ణం, దరఖాస్తు ; అకూ్క ; పర్జి. ఎవ్. పర్ణం ; నాయ. ఒల్లా. ఎగ్ ; పో.చూ. కురు. అ్రకార్.
<మూ.ద్రా. *అక్-/అక్- ; మూ.మ.ద్రా. *ఎగ్-*ఎవ్.

**ఆకుఅలము** వి. ఆకులు, మూలికలు, కూరాకులు. ఆకు + అలము. తీగ. **ఆకుకళ్ళి** వి. ఆకుజెముడు. **ఆకుకోసు** వి. ఆకుకూర. **ఆకుగిట్ట** వి. పల్చగా వెడల్పుగా ఉన్న గిట్ట. **ఆకుగొడ్డలి** వి. సన్నటి వాదరగల గొడ్డలి. **ఆకుగొబ్బి** వి. గోసుగడ్డ, కేబేజి. **ఆకుఁగూర (-కూర)** వి. కూరగా వాడే ఆకులు. **ఆకుచాటు** విశే. ఆకుమరుగు, దాగిఉన్న, పొంచిఉన్న. **ఆకుచిలుత** రూ.చూ. ఆకుఁజిలుత. **ఆకుచిరుతపులి** పో.చూ. ఆకుఁజిలుత. **ఆకుచిలక** రూ.చూ. ఆకుఁజిలుక. **ఆకుచిలుక** రూ.చూ. ఆకుఁజిలుక. **ఆకుచుట్ట** వి. కాగితాలకట్ట. ఆం.భా. 2.167. **ఆకుచెప్పు** రూ. ఆకుఁజెప్పు. వి. ఆకులాంటి పల్చటి అట్టగల చెప్పు, ఒకరకం

పాదరక్ష. క. కెర/కెరవు, కెరపు, కెర్పు. చెప్పు; త. వెరుప్పు; మ. చెరిప్పు. **ఆకుచెమ్మడు** వి. ఆకుజెముడు. **ఆకుజెముడు** వి. పత్రస్నుహి, ఒకజాతి జెముడు (Euphoribia nerifolia). **ఆకుజెల్ల** వి. ఒకరకం చేప. హంస. 4.187. **ఆకుఁజిఱుత** (-చిఱుత) రూ. ఆకుచిఱుత. వి. ఒక జాతి చిరుతపులి. **ఆకుఁజిలుక** రూ. ఆకుచిలక, ఆకుచిలుక వి. తెల్లబొట్లు, పెద్దరెక్కలుగల ఒకజాతి పురుగు. **ఆకుఁజెప్పు** రూ.చూ. ఆకుచెప్పు. **ఆకుటిక్క** (-ఇక్క. ఇల్లు). వి. పర్ణశాల, ఆకుటిల్లు. అచ్చ.రా. 3.102. **ఆకుటిల్లు** (-ఇల్లు). వి. 1. పర్ణశాల. వేంక.మా. 1.125; 2. గుడిసె. **ఆకుతీగ** వి. తములపాకు తీగ. **ఆకుతేలు** (-తేలు) రూ. ఆకుఁదేలు. వి. ఆకులమీద ఉండి తేలులాగా కుట్టే ఒకరకం ఆకుపచ్చ పురుగు. **ఆకుతోట** వి. తమలపాకులతోట. **ఆకుదాగు** వి. ఆకుల్లో కన్పించే నాగుపాము. **ఆకుఁదేలు** రూ.చూ. ఆకుతేలు. **ఆకుఁదోఁట** (-తోట). వి. 1. తములపాకుతోట. విజయ. 1.17; 2. నారుమడి. **ఆకుపచ్చ** విణ. ఆకువలె పచ్చనైన రంగు కలది, హరితం. **ఆకుపచ్చన** వి. ఆకుపచ్చ రంగు. **ఆకుపత్రి** (-పత్రి) రూ. ఆకుఁబత్రి. వి. లవంగపు చెట్టు. **ఆకుపసరు** వి. 1. ఆకుల రసం; 2. ఆకుపచ్చ. **ఆకుపాఁచి** (-పాఁచి. నాచు). రూ. ఆకుఁబాఁచి. వి. కుంభిక, ఒకరకం పాచి. **ఆకుపీఁకెలు** వి. బాలక్రీడావిశేషం. హంస. 3.146. **ఆకుపురుగు** (-పురుగు) రూ. ఆకుఁబురుగు. వి. 1. ఆకుపచ్చ మిడుత, గొల్లభామ; 2. గొంగళిపురుగు. **ఆకుపూజ** వి. తములపాకులతోచేసే పూజ. **ఆకుపోత** వి. 1. నాటు; 2. నారు పోయటం. **ఆకుపోయు** స.క్రి. 1. నాటువేయు; 2. నారుపోయు. క. అగెహాయ్. మొలకెత్తు. **ఆకుప్పు** వి. ఒకరకం ఉప్పు. **ఆకుబట్ట** వి. వర్ణమాల. **ఆకుబుట్ట** వి. ఆకులతో అల్లిన బుట్ట. **ఆకుమడి** వి. వారుమడి. **ఆకుమడుపు** వి.. సున్నంరాసి, ఈనెలు తీసిన తములపాకుచుట్ట, చిలక. ఉ.రా. 4.423. **ఆకుమిడుత** వి. ఆకుపచ్చ మిడుత. **ఆకుమొలపాకు** రూ. ఆకుమొలుకాకు. వి. ఆకునాటితే మొక్క మొలిచేజాతి ఆకు. **ఆకుమొలుకాకు** రూ.చూ. ఆకుమొలపాకు. **ఆకుఁబచ్చ** (-పచ్చ). విణ. హరితం, ముదురుపచ్చ. **ఆకుఁబత్రి** రూ.చూ. ఆకుపత్రి. **ఆకుఁబాఁచి** రూ. చూ. ఆకుపాచి. **ఆకుఁబీఁకె** (-పీఁకె). వి. ఆకుతోచుట్టగా చుట్టి, పిల్లలు ఊదుకునే పీకె. హంస. 3.146. **ఆకుఁబురుగు** రూ.చూ. ఆకుపురుగు. **ఆకురాయి**[1] వి. పక్షివిశేషం. **ఆకురాయి**[2] రూ. ఆకుఱాయి. వి. కత్తులు మొ. వాటిని రాచి పదునుపెట్టే ఒక పనిముట్టు, పత్రపరశువు. పో.చూ. త. అకై. ఆకు + అరై. ఒరపిడి ?. **ఆకురాలుకారు** వి. ఆకులు రాలే కాలం. **ఆకురాలుపుగండ్లు** వి. బ.వ. పండుటాకులు రాలటంవల్ల లేత కొమ్మలమీద పడే గుంటలు, మళ్లీ చిగురుతెత్తే గుంటలు. **ఆకుఱాయి** రూ.చూ. ఆకురాయి[2]. పార్వ. 4.21. **ఆకులతలుపు** వి. రెక్కల తలుపు. **ఆకులోటా** వి. పల్చటి రేకులోటా. **ఆకుపన్నాలు** వి. ఒకరకం వరిధాన్యం. పో.చూ. గరికనన్నాలు, పిచ్చికనన్నాలు మొ. **ఆకుసంపెఁగ** వి. సంపెగపూవు, సంపెగచెట్టు. **ఆకుసంబెళ** వి. పక్కలాకుల సంచి. **ఆకొత్తు** పో.చూ. అడకొత్తు. వి. అడకత్తెర. పోకలు కత్తిరించే కత్తెర. బహూళా. 5.118.

**ఆకుఅలము** చూ. ఆకు.
**ఆకుకళ్ళి** చూ. ఆకు.
**ఆకుకోవ** చూ. ఆకు.
**ఆకుగిట్ట** చూ. ఆకు.
**ఆకుగొర్గలి** చూ. ఆకు.
**ఆకుగొబ్బి** చూ. ఆకు.
**ఆకుఁగూర** చూ. ఆకు.
**ఆకుచాటు** చూ. ఆకు.
**ఆకుచిరుత** చూ. ఆకు.
**ఆకుచిరుతపులి** చూ. ఆకు.
**ఆకుచిలక** చూ. ఆకు.
**ఆకుచిలుక** చూ. ఆకు.
**ఆకుచుట్ట** చూ. ఆకు.
**ఆకుచెప్పు** చూ. ఆకు.
**ఆకుచెమ్మడు** చూ. ఆకు.
**ఆకుజెముడు** చూ. ఆకు.
**ఆకుజెల్ల** చూ. ఆకు.
**ఆకుఁజిఱుత** వి. ఆకు.
**ఆకుఁజిలుక** చూ. ఆకు.
**ఆకుఁజెప్పు** చూ. ఆకు.
**ఆకుటిక్క** చూ. ఆకు.
**ఆకుటిల్లు** చూ. ఆకు.
**ఆకుతీగ** చూ. ఆకు.
**ఆకుతేలు** చూ. ఆకు.
**ఆకుతోట** చూ. ఆకు.
**ఆకుఁదేలు** చూ. ఆకు.
**ఆకుఁదోఁట** చూ. ఆకు.
**ఆకునాగు** చూ. ఆకు.
**ఆకుపచ్చ** చూ. ఆకు.
**ఆకుపచ్చన** చూ. ఆకు.
**ఆకుపత్రి** చూ. ఆకు.
**ఆకుపసరు** చూ. ఆకు.
**ఆకుపాఁచి** చూ. ఆకు.
**ఆకుపీఁకెలు** చూ. ఆకు.
**ఆకుపురుగు** చూ. ఆకు.
**ఆకుపూజ** చూ. ఆకు.
**ఆకుపోత** చూ. ఆకు.
**ఆకుపోయు** చూ. ఆకు.
**ఆకుప్పు** చూ. ఆకు.
**ఆకుబట్ట** చూ. ఆకు.
**ఆకుబుట్ట** చూ. ఆకు.
**ఆకుమడి** చూ. ఆకు.
**ఆకుమడుపు** చూ. ఆకు.
**ఆకుమిడుత** చూ. ఆకు.
**ఆకుమొలపాకు** చూ. ఆకు.
**ఆకుమొలుకాకు** చూ. ఆకు.

**ఆకుఁబచ్చ** చూ.ఆకు.
**ఆకుఁబత్తి** చూ. ఆకు.
**ఆకుఁబొఁచి** చూ. ఆకు.
**ఆకుఁబీఁకె** చూ. ఆకు.
**ఆకుఁబురుగు** చూ. ఆకు.
**ఆకురాయి**[1] చూ. ఆకు.
**ఆకురాయి**[2] చూ. ఆకు.
**ఆకురాలుకారు** చూ. ఆకు.
**ఆకురాలుపుగండ్లు** చూ. ఆకు.
**ఆకుతాయి** చూ. ఆకు
**ఆకులతలుపు** చూ. ఆకు.
**ఆకులోటా** చూ. ఆకు.
**ఆకువన్నాలు** చూ. ఆకు.
**ఆకుసంపెఁగ** చూ. ఆకు.
**ఆకుసంబెళ** చూ. ఆకు.
**ఆకె** పో.చూ. ఆయక. సర్వ. **1**. ఆస్త్రీ. ప్రభా. 5.131; **2.** ఆమె.

క. ఆకె. ఆస్త్రీ, భార్య; -కె. ప్రత్యయం. పో.చూ. *తన్-గి తన్-గె*; కొర. *తంగె*. చెల్లెలు. తు. *(తన్) గి*, *(తన్) గడి*; త. కై, కై-య్-ఐ. స్త్రీలింగ ప్రత్యయం. పో.చూ. *తన్-కై*, *తన్-కై-చ్చి*, *తన్-క-చ్చి*. చెల్లెలు; పో.చూ.మ. *తన్-గ-చ్చి*; కుఇ. *అన్-గి*, *తన్-గి*; కువి. *తన్-గి*. సోదరి.

<మూ.ద్రా. *ఆ[3] + *కయ్.

**ఆకొత్తు** చూ. ఆకు.
**ఆకొమ** చూ. ఆ[10].
**ఆకోడాలు** వి. హండాకు ఇరువైపుల వుండే లోహపు రింగులు (చెవులు).

ప్రా. అక్కోడియ. లాగబడినది; హండాను ఎత్తటానికి గాని లాగటానికిగాని ఉపయోగించే సాధనాలు కనుక వాటిని ఆకోడాలు అంటారు.

**ఆక్కమాను** ఆకు + కమాను. చూ. ఆకు[1]. వి. మధ్యభాగం గుమ్మటం లాగా వుండి పై చివర మొనదేలివుండే ఆర్చి.
**ఆక్టు** వి. శాసనం, చట్టం.

<ఇం. Act.

**ఆఖయిరు** రూ.చూ. ఆఖరు. మెకంజీ. సం. 114 పు. 35.
**ఆఖరు** రూ. ఆకరు, ఆకరుపు, ఆకిరి, ఆకిరు, ఆఖయిరు, ఆఖిరు, ఆఖేరు, ఆహరు. విశ. చివరిది; వి. చివర, అంత్యం.

నే. *ఆఖిర్*. చివర; *అఖరి*, *అఖిరి*, *అఁఖరి*. చివరిది; హిం. *ఆఖిర్*, *ఆఖిరీ*; మరా. *అఖర*. ఊరిచివర; పార. *అఖిర్*. అంతం, చివర; ఉ. *అఖిర్*, *అఖ్విర్*. చివర, వెనుక, మార్పు, ఫలితం; అర. *ఆఖిర్*;

క. ఆఖరు, *అఖైరు*. చివర, చివరిది; తు. *అకేరి*; బ్రా. *అఖిర్*, *ఆఖిరి*.

<ఉ. ఆఖిర్.

**ఆఖిరు** రూ.చూ. ఆఖరు.
**ఆఖేరు** రూ.చూ. ఆఖరు.
**ఆగ్గరకాఁడు** చూ. ఆగడము.

**ఆగడపలు**[1] రూ. ఆడెబలు, ఆతెలు[2]; పో.చూ. ఆగము. వి. బ.వ. మబ్బుదొంతరలు. హరి. పూ. 7.160, హర. 2.16, ఆం.భా. 1.73.

ఆగము + అడపలు. మేఘమాలికలు; పో.చూ. ఆగ మేగములు; సం. అకాశ-. > త. *అగాయ*. మబ్బు, గాలి, మొ. బహుశః ఆ[2] + కడప(మెట్టు); మెట్లవలె ఉన్న మబ్బు దొంతరలు; లేదా. ఆగాయ > ఆగ.

**ఆగడపలు**[2] వి. చేను అక్కడక్కడా తడికావడం.
**ఆగడము** వి. **1**. అకార్యం, చెడ్డపని, కొంటెపని. భార. అను. 5.312; **2**. వంచన, మోసం. భార. మౌ. 8; **3**. అనాదరం, పరిభవం, ఉ. హరిశ్చ. 4.159; **4**. దుష్కార్య చిహ్నం, చెడ్డపనులు చేసినట్లు సూచించే గుర్తు. సాశంగ. చ. 3.48; **5**. ఉత్పాతం. ఉరా. 6.285; **6**. దౌష్ట్యం. నీలా. 3.27; **7**. అన్యాయం, దుర్నీతి. అచ్చ.రా. 1.147; విశ. **1**. వంచకుడు. వేంక. వంచ. 1.519; **2**. అపరాధి, దండ్యుడు. భాగ. 10. పూ. 1416.

సం. *అగస్*. అపరాధం, హాని, పాపం, దోషం; ప్రా. *అగ*; పా. *అగు*. నేరం, అపరాధం; మరా. *అగ*, *అగి*;

క. *ఆగడ*. అట, పరిహాసం, అవహేళన, అవమానం; *అగడకాఱ*. తుంటరి; *అగడతన*. తుంటరితనం; త. ఆకటుయమ్. అవహేళన, అకార్యం, క్రౌర్యం.

**ఆగడకాఁడు** వి. దుష్టుడు, తుంటరి. **ఆగడముచేయు** స.క్రి. **1**. రట్టుచేయు, రవ్వపెట్టు. చంద్రా. 5.68; **2**. ధిక్కరించు. నార. పు. 5.86. **ఆగడించు** స.క్రి. ధిక్కరించు, అవమానించు. పండి.చ. 4.306. **ఆగడీఁడు** వి. **1**. కొంటెవాడు, దుండగీడు, దుష్టుడు. హరి. పూ. 5.218, హర. 5.10, దశకు. 11.112.

**ఆగడముచేయు** చూ. ఆగడము.
**ఆగడించు** చూ. ఆగడము.
**ఆగడీఁడు** చూ. ఆగడము.
**ఆగండాలు** వి. అబద్ధాలు.
**అగతి** వి. బలి, శాంతికోసం క్షుద్రదేవతలకు సమర్పించే నెత్తురు కూడు. పో.చూ. సం. ఆహుతి-.
**ఆగతాయి** రూ.చూ. ఆకతాయి.
**ఆగదవు** చూ. ఆ[5].
**అగపెట్టు** చూ. ఆగు.
**ఆగమ్**[1] రూ: యాగీ. వి. **1**. తప్పు, అపరాధం; **2**. పాపం; **3**. అల్లరి; **4**. నాశం.

సం. *ఆగస్*. పాపం, అపరాధం, తప్పు.

<సం. ఆగస్.

**ఆగమ్**[2] వి. మేఘం, ఆకాశంలో తెరలుతెరలుగా కన్పించే నీటి ఆవిరి. చూ. ఆగడపలు[1].
**అగమేగాలమీద** రూ.చూ. ఆఘమేఘాలమీద. అవ్య. అతిత్వరగా.
**అగమ్మపక్షి** వి. ఎటూ దిక్కులేనివాడు.

సం. *అగమ్య*. గమ్యంలేని, అసంభవం; ప్రా. *అగమ్మ*. గమ్యంలేని, అసంభవం; పా. *అగమ్మ-*; నే. *అగమ్య-*, గమ్యంలేని, అసంభవం; ఒ. *ఒగొమ్యొ*. గమ్యంలేని.

అనంభవం ; హిం. గు. అగమ్య. దొరరాని, గమ్యంలేని ;
<ప్రా. అగమ్మ-.

**ఆగవేగముగా** క్రి. విశ. పూర్తివేగంతో.
సం. ఓఘ-. ప్రవాహం ;
త. అగాయ. గాలి.
బహుశః ఆగ <సం. ఓఘ ; లేదా ఆగ (గాలి) <త. అగాయ.

**ఆగా** వి. ఆర్చికి పక్కలవచ్చే పెద్దవంపు.
సం. అగ్ర. ముందు ; ప్రా.పా. అగ్గె ; కా. ఒగు. మొదటి ; కుమా. అగి ; అ. అగ్ ; నే. అగె, అఘి. ముందు ; బెం. ఆగె. మొదటి, ముందు ; ఒ. సింహ. అగా ; హిం. ఆగే. ముందు ; పం. అగ్గే ; సి. అగా ; గు. అగ్లూ ; మరా. అగ్యా.

**ఆగాడి** వి. తూర్పారపోసినపుడు గింజ నిండుగా లేకపోవటంవల్ల రాశికి దూరంగా పడిన తేలిక ధాన్యం ; తాలు తప్ప.
హిం. అగాడి. విశ. ముందు ;
పో.చూ. క. అవుడు. గింజ ; తు. అవిల్. తాలుగింజ, నూక ; పో.చూ. త. అకాటమ్, ఉత్తరేణి జాతి.

**ఆగాతమ్మ** చూ. ఆగాత్యము. వి. ఆగాయిత్యం చేసే పిల్ల.

**ఆగాత్యము** రూ. ఆకాత్యము, ఆగాయిత్యము ఆగాయిత్తు, ఆగిత్తము, ఆఘాత్యము, అహాయిత్యము, ఆహాయిత్యము ఓగాత్యము. వి. దౌర్జన్యం, మూర్ఖత్వం, సాహసం, దౌష్ట్యం, గోరంతలు కొండంతలుచేసి అరవటం, ఏడవటం, వైపరీత్యం, అనౌచిత్యం.
సం. అ-ఘాత్య. (అ-ల హన్). నాశనం చేయదగినది ;
క. ఆగాత్య. పెద్ద బాధపడుతున్నట్టు నటన ; ఆత్మహత్య చేసుకొంటానని బెదరింపు ; త. అకాయిత్తియమ్.
<సం. అ-ఘాత్య-.

**ఆగాయిత్తు** రూ.చూ. ఆగాత్యము.

**ఆగాయిత్యము** రూ.చూ. ఆగాత్యము.

**ఆగారం** వి. ఆహారం.
సం. ఆహార-. ఆహారం ; ప్రా.పా. ఆహార. నే. ఆహార. ఒ.హిం.గు. ఆహార.
<సం. ఆహార-.

**ఆగావు** విశ. ముందుగా దొరికినది.
ఉ. అగాహ్. తెలిసినది, సూచితం, పరిచితం ; పార. ఆగాహ్. తెలివిడి, ప్రకటన ; హిం. అగాహ్.
<ఉ. ఆగాహ్.

**ఆగించు** చూ. ఆగు.

**ఆగిడి** చూ. ఆగు.

**ఆగిత్తము** రూ.చూ. ఆగాత్యము.

**ఆగు-** రూ.చూ. ఆఁగు.
**ఆగపెట్టు** రూ.చూ. ఆఁకపెట్టు. స.క్రి. నిరోధించు, ఆపు. **ఆగించు** స.క్రి. ఆపు. పెంచు, పరామరికచేయు, కాపాడు, మందవేయు, లొంగదీయు. **ఆగిడి** వి. అవరోధం, ఆటంకం. **ఆగుట** వి. నిలవటం.

**ఆగుట** చూ. ఆగు.

**ఆగుబ్బతిలు** పారాం. వా.ని. చూ. ఆగుబ్బు. అ.క్రి. అతిశయించు. మను. 2.28.

**ఆగుబ్బు** (-ఉబ్బు) చూ. అగుర్వు. విశ. 1. అధికం, మిక్కుటం. భాగ. 10. పూ. 226 ; 2. అసంఖ్యాకం· రామా. 1.45 ; వి. విజృంభణం. అతిశయం. కృష్ణక. 1.65.
పో.చూ. క. అగి. వణకు, భయపడు ; అగుర్వు, అగుర్బు. విస్మయం. భయం. భయంకర స్వరూపం ; అగుర్విసు. భయపెట్టు ; ఉర్వు. ఉర్బు, ఉబ్బు. ఉబ్బు పైకి లేచు ; తు. అగురుని. వణకు టూలు.

**ఆగొష్టు** వి. ఇంగ్లీషు నెలల్లో ఎనిమిదోనెల.
<ఇం. August.

**ఆగ్నేయంపారవ** వి. ఆగ్నేయ దిక్కున ఇల్లు పెరిగి ఉండట మనే పెద్ద దోషం.
<సం. ఆగ్నేయ-*పారవ.

**ఆగ్రహము** వి. కోపం. వి.పు. 1.13.
సం. ఆగ్రహ-. పట్టుదల చలం, ఆక్రమణం, ఆసక్తి పట్టుకోవటం, అనుగ్రహం· పా. అగ్గహ. పట్టుదల, అభినివేశం ;
క. ఆగ్రహ. కోపం ; త. ఆక్కిరకమ్. కోపం, ఆవేశం ; మ. ఆగ్రహమ్. ఆసక్తి. అభిలాష.
<సం. ఆగ్రహ- ; మూ.ద.ద్రా. లో సర్వసామాన్యంగా అర్థవిపరి.

**ఆగ్రహించు** చూ. ఆగ్రహము. అ.క్రి. కోపించు. మార్క. 7.245. భార.సభా. 2.38.
క. ఆగ్రహిసు. కోపించు.

**ఆఘమేఘాలమీద** రూ. ఆగమేగాలమీద. అవ్య. అతిత్వరగా.

**ఆఘాత్యము** చూ. ఆగాత్యము.

**ఆంకాకరకాయి** చూ. ఆఁగాఁకర. వి. ఆఁగాఁకరకాయ.

**ఆంక్ష** రూ. ఆంట్ష. వి. వెలి, మఠాధిపతి విధించు నిషేధం ; మందలింపు, బలవంతం, అడ్డగింత, బహిష్కారం.
పో.చూ. సం. ఆకాంక్షా. కోరిక.
<సం. ఆకాంక్షా. అర్థ విపరి.
**ఆంక్షపత్రిక** వి. వెలిచీటి బహిష్కార పత్రం.

**ఆంక్షపత్రిక** చూ. ఆంక్ష.

**ఆంగలేయులు** చూ. ఆంగ్ల.

**ఆంగిలేయులు** చూ. ఆంగ్ల.

**ఆంగ్రేజి** వి. ఆంగ్లము, ఆంగ్లేయుడు ; విశ. ఆంగ్లసంబంధి.
ఇం. *English* ; హిం. అంగ్రేజీ. నే. అంగ్రేజీ ;
<హిం. అంగ్రేజీ.
**ఆంగ్రేజిచౌకోటు** వి. పై పట్టెకు క్రింది పట్టెకు పరదాలు తీసిన ద్వారబంధం.
<హిం. అంగ్రేజీ + చౌకోటు < చౌఖట్.

**ఆంగ్రేజిచౌకోటు** చూ. ఆంగ్రేజి.

**ఆంగ్ల** చూ. ఇంగ్లీషు. విశ. ఇంగ్లీషు సంబంధి.
క. ఆ-గ్ల ఆంగ్లము ; త. ఆంకిలమ్.
<ఇం. Anglo-
**ఆంగలేయులు** రూ.చూ. అంగలేయులు. వి. ఇంగ్లీషువారు.
**ఆంగిలేయులు** రూ. ఆంగలేయులు, ఆంగ్లేయులు. వి. ఇంగ్లీషు

వాడు. ఆంగ్లదేశము వి. ఇంగ్లండు. ఆంగ్లేయులు రూ.చూ. ఆంగిలేయులు.

**ఆంగ్లదేశము** చూ. ఆంగ్ల.

**ఆంగ్లేయులు** చూ. ఆంగ్ల.

**ఆఁక** చూ. ఆఁగు. వి. **1.** నిరోధం, అడ్డు, అడ్డగింత. భార. అను. 2.386 ; **2.** వేల చెలియలికట్ట. దశకు. 12.34 ; **3.** చెర చెరసాల. కాశీ. 6.224, భాగ. 10. పూ. 77 ; **4.** కట్టుపాటు, మర్యాద నిబంధనం. మను. 3.129.

క. ఆంకె, ఆనికె. గట్టిగా పట్టుకోటం ; తు. ఆంకె. బలవంతం, అధికారం, ఆశ్రయం.

**ఆఁకగొను** అ.క్రి. ఆపబడు, ఆగు. భార.అది. 8.200, ద్రోణ. 1.201. **ఆఁకగొలుపు** స.క్రి. అడ్డగించు, నిరోధించు. ఉ.హరి. 1.57. **ఆఁకతోఁట** వి. పరులు రాకుండా కట్టుపాటు చేసిన తోట. భార.అర. 7.9, రం.రా. 5.274. **ఆఁకత్రాడు** వి. **1.** కవ్వాన్ని తగిలించటానికై రాటకు కట్టే తాడు. భీమ. 4.59, భాగ 8.205 ; **2.** అడ్డుతాడు. **ఆఁకపడు** అ.క్రి. నిరుద్ధమగు, ఆటంకమొందు. భా.రా. 4.401. **ఆఁకపెట్టు** -పెట్టు ; రూ. ఆఁకవెట్టు, ఆగపెట్టు. స.క్రి. ఆపు, అడ్డగించు. భా.రా. 6.728. **ఆఁకయిల్లు** వి. చెరసాల. భాగ. 10. పూ. 148. **ఆఁకవిరితోఁట** వి. పరులు రాకుండా కట్టుపాటుచేసిన పూలతోట. పాండు. 5.294. **ఆఁకవెట్టు** రూ.చూ. ఆఁకపెట్టు. స.క్రి. ఆపు, అడ్డగించు, కకుత్స. 4.10. **ఆఁకించు** స.క్రి. నిరోధించు. కళా. 5.112. **ఆఁకిడు** స.క్రి. అడ్డుపెట్టు. భాం ఉద్యో. 3.255, కాశీ. 7.55.

**ఆఁకగొను** చూ. ఆఁక.

**ఆఁకగొలుపు** చూ. ఆఁక

**ఆఁకట్టు** చూ. ఆఁక. స.క్రి. **1.** అడ్డగించు, నిరోధించు. కవిక. 4.119, నీలా. 2.41 **2.** ఆక్రమించు, కమ్ము.

**ఆఁకతోఁట** చూ. ఆఁక.

**ఆఁకత్రాడు** చూ. ఆఁక

**ఆఁకపడు** చూ. ఆఁక.

**ఆఁకపెట్టు** చూ. ఆఁక.

**ఆఁకయిల్లు** చూ. ఆఁక.

**ఆఁకరము** రూ. చూ. ఆఁకారము ; చూ. హంకారము. **1.** ఆగ్రహం, చలం. భార. ఆది. 8.200, భా.రా. 6.584 ; **2** అము, మదం. ఆం. భా. 1.138.

**ఆఁకరి** రూ.చూ. ఎనకరి. వి. గిరిజనుడు.

**ఆఁకలి** చూ. ఆఁ[3]. వి. క్షుత్తు భార. ఆది. 2 65, 6.191, శుక. 3.411 ;

పో.చూ.తు. అంగాదనె దాహం, అంగి లోభం. తిండి ఆశ, అపిని ; ఇణగావునె. తిండికాశపడు ; అపినిచెందు ; పో చూ.త. అంకా (-కట్-ప్ప-) నోరు తెరచు ; కుయి. సకె, సకి. ఆకలి ; సకెసావ. ఆకలి గొను ; కువి. హాక్క. ఆకలి ; హచ్కితిమన్ని, కచ్కిలి మన్ని, హాక్కగత్తి ఆకలిగొన్న ; పర్జి. చాకొల్. ఆకలి, కరవు ; పో. చూ. అంకాల్. కరవు.

*దా-/*దాన్-. మూ. ద.ద్రా. ధాతువని ఆఁ[3] సూచిస్తుంది. పో.చూ. ఆఁకొను, మొ..

< మూ.ద.ద్రా. *దా/*దాన్ + *కల్.

**ఆఁకళింపు** రూ. చూ. ఆకళింపు. వి. స్తుతి, పొగడ్త.

**ఆఁకవిరితోఁట** చూ. ఆఁక.

**ఆఁకవెట్టు** చూ. ఆఁక.

**ఆఁకారము** రూ. ఆఁకరము. వి. **1.** పట్టుదల. భార. ఆది. 8.200 ; **2.** గర్వము, పొగరు. ఆం. భా. 1.33.

సం. అహంకార-. గర్వం, పొగరు ; ప్రా. అహంకార్. అభిమానం ; పా. అహఙ్కార. స్వార్థం, గర్వం ; నే. అహంకార్ ; గుజ. అహంకార్ ; ఒ. అహంకార; మరా. అహంకార్ , హిం. అహంకార్ ;

క. అహంకార ; త. అంకారమ్ ; తు. అంకార.

< సం. అహఙ్కార-.

**ఆఁకించు** చూ. ఆఁక.

**ఆఁకిడు** చూ. ఆఁక.

**ఆఁకొను** చూ. ఆఁ[3].

**ఆఁకొన్నతనము** చూ. ఆఁ[3].

**ఆఁకొన్నవాఁడు** చూ. ఆఁ[3].

**ఆఁకొంట** చూ. ఆఁ[3].

**ఆఁగాఁకర** రూ.చూ. ఆరగాకర. వి. ముళ్లకాకర.

**ఆఁగికొను** చూ. ఆఁగు.

**ఆఁగు** స. క్రి. **1.** నిషేధించు. భార. ఆది. 8:220 ; **2.** అడ్డగించు, నిరోధించు, ఆటంకపరుచు. భార. విరా. 4.71 ; **3.** నిగ్రహించు, అణచు, భార. శాంతి. 2.277 ; **4.** రాజాజ్ఞచే నిషేధించు. విజ్ఞాన. వ్య. వ. 14 ; **5.** సహించు భరించు. భాగ. 10. పూ. 14 ; **6.** ఆవరించు, ఆక్రమించు. పాండు. 4.208 ; **7.** నివారించు, పోగొట్టు. పాండు. 4 268 **8.** ముట్టడివేయు. ఉ.రా. 2.221 **9.** నిలుపు. శుక. 1.182 అ.క్రి. **1.** మోచు, వహించు. భాగ. 10. పూ 14 ; **2.** నిలబడు, నిలిచిపోవు. మను. 3.60. సీతారా. 3.139 ; **3.** సైచు. ఓర్చు **4.** ఉడుగు, విరమించు ; **5.** కాపాడు.

క. ఆక, ఆను. నిరోధింపబడు, పట్టుకొను, బాధపడు ; 'ఆటు' లో 'ఆ' ; ఆపు. నిరోధం ; తు. బరుని. ఆగు, నిలచు ; త. ఆక. శాంతించు, ఉడుగు ; ఆప్పు. కొయ్య చీల, దాన్యం ; మ, ఆప్పు. చీల, బిరడు ; కుయి. అంగ. అడ్డగించు ; కువి. అంగ్. నిరోధించు ; అప్. ఆటంక పరుచు.

< మూ. ద్రా. *ఆ-/*ఆన్-.

**ఆఁగికొను** స.క్రి. అడ్డుకొను. దశకు. 5.17. క. అంక గొళ్. పట్టుకొను. **ఆఁగుదెంచు** స.క్రి. ఆగిపోవు. పండి. చ. 5.328.

**ఆఁగుదెంచు** చూ. ఆఁగు.

**ఆచ** చూ. ఆను. అపభ్రంశరూపం. వి. పడుగుబల్ల, ఆను మాను, నేతలో పడుగుతోడటానికి వుపయోగించే చట్టం.

**ఆచమానము** వి. ఉపస్పర్శం ; చూపుడువేలు పొడవుగా నిలిపి, పుడిసిట్లో నీరు తీసికొని, ముమ్మారు పుచ్చుకోటం.

సం. ఆచమన ; ఆ + చమ్-. కొంచెం కొంచెంగా తాగు. భోజనాదికాలకు వ్రతాలకు ముందు. పుడిసిటితో నీరు తీను

కొని పవిత్రతకోసం ముమ్మారు పుచ్చుకొను ; ప్రా. ఆయమణం, అచమన. పరిశుభ్రత ; పా. అచమన. నీటితో కడగటం.

నే. అచమన్, అచ్మన్. కొంచెం కొంచెం నీరు త్రాగటం ; ఒ. అఛాంయ ; హిం. అచమన్ ; గు. అచ మన ;

- క. తు. ఆచమన ; త. అచమణమ్ ; మ. అచ మనమ్. భోజనానంతరం నోరు కడుక్కోటం.

< నం. ఆచమన-.

**ఆచామ** వి. ఒకరకం మామిడి.

**ఆచారము** వి. చాదస్తం.

నం. ఆచార-. అనుష్ఠానం, సంప్రదాయం, ప్రవర్తన ; ప్రా. ఆచార్, ఆయార్ ; పా. అచార ; నే. ఒ.గు.మరా. ఆచార ; హిం. ఆచార్ ;

క. ఆచార ; త. ఆచారమ్.

< నం. ఆచార-. అర్థవిపరి.

**ఆచారి** వి. **1.** పూజారి, వైష్ణవుడు ; **2.** వంటబ్రాహ్మడు ; **3.** కమసాలి.

నం. ఆచారి. ఆచారవంతుడు ; ఆచార్య. గురువు ; ప్రా. ఆచారిఅ, ఆచారియ. ఆచారవంతుడు ; పా. ఆచారిన్ ; నే. హిం. ఆచారి. ఆచారవంతుడు. ఒ.గు. ఆచార్య ; మ. ఆచారి. వంటవాడు.

క. ఆచారి, ఆచారవంతుడు, వంటబ్రాహ్మడు, కమ సాలి, పూజారి ; త. ఆచారి. మాధ్వుడు, శ్రీవైష్ణవుడు, కమసాలి ; మ. ఆచార్యన్. ఆచారవంతుడు, ఆదర్శ ప్రాయుడు ; వేదగురువు, గరిడీ గురువు, వడ్రంగి ; కొలా. అచ్చరి. వంటవాడు.

< నం. ఆచారిన్.

**ఆచుకావలి** రూ. చూ. అచ్చు కావలి.

**ఆచుకొను** రూ. అచ్చుకొను. చూ. అచ్చు[3]. అ.క్రి. **1.** పూచీ పడు ; **2.** దండుగ చెల్లించు.

**ఆచూకి** రూ. ఆచోకి. వి. పోబడి, జాడ.

హిం. ఉ. ఆచూక్. విణ. స్పష్టం, నిర్దిష్టం ; క్రి. విణ. స్పష్టంగా.

< ఉ. అచూక్. అర్థవిపరి.

**ఆచోకి** రూ. చూ. ఆచూకి.

**ఆజరెంటు** చూ. హాజరు. క్రి. విణ. సిద్ధంగా.

**ఆజాదా** వి. స్వాధీనత.

హిం. గు.ఉ. పార. అర. ఆజాద్. స్వాతంత్ర్యం.

< ఉ. ఆజాద్.

**ఆజీలు** రూ. చూ. హాజరు. విణ. సిద్ధం, సన్నిధానం. పారి. 3.163.

**ఆజీలుకూలి**. వి. సంవత్సరమంతా ఒకరైతు దగ్గర సిద్ధంగా ఉండి కూలిపని చేసేవాడు.

**ఆజీలుకూలి** చూ. ఆజీలు.

**ఆజుబాజు** అవ్య. చుట్టూ, సమీపంలో.

పో. చూ. నే. బాజు. చేయి ; హిం. ఆస్‌పాస్. నలువంకలు ; గు. ఆజుబాజు ; మరా. ఆజుబాజూస. దగ్గర్లో ; ఉ. ఆస్‌పాస్. ఇరుగు పొరుగు ; పో. చూ. బాజు. చేయి. సాన్నిహిత్యం, చుట్టుపక్కల ; పో.చూ. పార. బాఝూ. చేయి ;

క. ఆసుపాసు. సమీపంలో ; తు. ఆస్‌పాస్.

< మరా. ఆజుబాజూస.

**ఆజ్మాయిషి** రూ.చూ. అజ్మాయిషి. వి. పెత్తనం, పర్యవేక్షణ.

**ఆఁచి** చూ. ఆచు[1]. అవ్య. ఆఁచుయొక్క క్త్వార్థకరూపం.

**ఆఁచికొను** స.క్రి. అపహరించు, దోచుకొను. హరి.ఉ. 6.126, భాగ. 8.297. **ఆఁచికోలు** వి. అపహరణ, ఆక్రమణ.

**ఆఁచికొను** చూ. ఆఁచి.

**ఆఁచికోలు** చూ. ఆఁచి.

**ఆఁచు**[1] రూ. నాఁచు. స.క్రి. అపహరించు.

**ఆఁచు**[2] చూ. ఆఁగు ధాతుప్రేరణార్థకం. స. క్రి. ఆపు, ఆగునట్లుచేయు, అణచు. లోబరచుకొను. కళా.పీఠి. 76. ఒకేఒక ప్రయోగం కన్పిస్తున్నది. ఇక్కడ కూడా ఆఁచు : అపహరించు అనే అర్థం చెప్పవచ్చు. పో.చూ. నాఁచు.

**ఆట**[1] చూ. ఆడు. వి. **1.** నృత్యం. భార.విరా. 1.288 ; **2.** మునగటం, స్నానం చెయ్యటం. హరి.పూ. 5.175 ; **3.** క్రీడ. నృసింహ. 2.90 ; **4.** విహారం. రామా. 3.99 ; **5.** నువ్వులు చెరకు మొ. వాటిని గానుగలో వేసి తిప్పటం. భాను. 2 ; **6.** జూదం.

క. ఆటు. కదలిక, క్రీడ, నృత్యం, జూదం మొ. ; కొడ. అడ్. కదలు, నర్తించు ; తు. అటు. క్రీడ ; త. ఆట్టు, ఆట్టం. కదలు, ఊగు, ఊపు, నర్తించు మొ., కదలిక, క్రీడ, నృత్యం మొ. ; మ. ఆట్టం. కదలిక, క్రీడ, నృత్యం, నూనె తీయటం, స్నానం చేయటం మొ. ; అట్టు ; కో. అడ్. కదలు, నర్తించు, క్రీడించు మొ. ; తొద. ఒడ్ ; కొలా. అడ్. క్రీడించు ; నా. అడ్.

< మూ.ద్రా. *ఆట్.

**ఆటకత్తియ** రూ. ఆటకత్తె. వి. నర్తకి, నటి. **ఆటకత్తె** రూ.చూ. ఆటకత్తియ. వి. నర్తకి, నటి. **ఆటకఱ్ఱ** వి. సిరి; ఏతంలో మనిషి తొక్కే లేదా లాగే ఏటవాలు కొయ్య: **ఆటకాఁడు** వి. **1.** నటుడు, నర్తకుడు. ప్రభా. 1.106 ; **2.** ఆటలలో నేర్పరి ; **3.** బొమ్మరాట, బొమ్మలాట మొ. చూపే వాడు. **ఆటకాయ** వి. సోమరి, క్రీడాసక్తుడు. **ఆటకొలను** వి. క్రీడాసరస్సు. పె.శకు. 1.51. **ఆటగీము** వి. విహారగృహం. అచ్చ.రా. 1.6. **ఆటగెడ** వి. తలుపురెక్కల్లో ఒకదానికి బిగించిన పంగటిలిన కొయ్య, రెండోదానికి కదలటానికి వీలుగా వున్న కొయ్యముక్కగల గడియ. **ఆటగొఱ్ఱు(ఱ్ఱు)** వి. భూమి దున్నే గొర్రు (నాగలితో దున్నిన తరువాత విత్తటానికి ముందు పెళ్లలు నలగటానికి గొర్రు దున్ను తారు), మామూలుగా మూడు కర్రలుగల గొర్రు. **ఆటచేడియ** వి. నర్తకి, వేశ్య, నీలా. 1.40. **ఆటడిగ్గియ** వి. క్రీడా దీర్ఘిక, క్రీడార్థమైన నడబావి. రామా. 5.77. **ఆటతిప్ప** వి. క్రీడాపర్వతం, కృతకాద్రి. అచ్చరా. 5.95. **ఆటతెఱవ** వి. నర్తకి, వేశ్య. పరమ. 2.31. **ఆటతోఁట** వి. ఉద్యాన వనం. భార.అర. 7.9, రామా. 3.99. **ఆటది** వి. వేశ్య

నర్తకి. క్రీడా. 223. **ఆటపట్టు** వి. 1. విహారస్థలం. శృం.నై. 2.49 ; 2. వాసస్థానం. భీమ. 3.155, వసు. 1.94 ; 3. క్రీడాస్థానం. వసు. 1.94 ; 4. నాట్యస్థానం. **ఆటపాక** వి. నర్తనశాల, నాటకశాల. **ఆటప్రాయము** వి. బాల్యం, ఆడుకునే వయస్సు. **ఆటమామ** వి. సిడె, ఏతంలో మనిషి తొక్కే లేదా లాగే ఏటవాలు కొయ్య. **ఆటరి** వి. నర్తకుడు, నర్తకి. ఆం.భా. 1.129. **ఆటలమ్మ** రూ. ఆటాలమ్మ, ఆట్లమ్మ. వి. మశూచిజాతి వ్యాధి. పో.చూ. త. అమ్మై. మశూచి, ఆటలమ్మ మొ. ; అమ్మైముత్తు. మశూచికం పొక్కు (ఆడుతూ ఆడుతూ ఉండగా తక్కిన పిల్లలనుంచి సంక్రమించే వ్యాధి, దీని అధిదేవతనే ఆటలమ్మ అంటారు, ఆమె చిన్నమ్మవారు. పెద్దమ్మవారు మశూచి. **ఆటలాట** ఆటలు + ఆట. చూ. ఆటలాడు. వి. ఆట, క్రీడ. **ఆటలాడు** (ఆటలు + ఆడు) అ. క్రి. ఆడుకొను. **ఆటవాఁడు** వి. నటుడు. ప్రబా. 1.108, రామా. 6.18. **ఆటవిడుపు** వి. ఆడుకోవటానికై పిల్లలను విడిచిపెట్టటం. ఉరా. 1.137, కువచ. 4.101. **ఆటవెలఁది** వి. 1. నర్తకి. ప్రబా. 1.57 ; 2. వేశ్య ; 3. ఒకరకం పద్యం. **ఆటాడు** అ. క్రి. 1. ఆడు ; 2. నటించు, నర్తించు ; 3. నూనెతీయు. **ఆటాలమ్మ** రూ.చూ. ఆటలమ్మ. **ఆట్లమ్మ** రూ.చూ. ఆటలమ్మ.

**-ఆట²** (కొన్నిచోట్ల) ఆటము. పని అనే అర్థంలో కృత్ప్రత్యయంగానూ, తద్ధితప్రత్యయంగానూ ప్రయుక్తం: పోరు- ఆట. పోరాట.

క. -అట. (హోరాట మొ.) తద్ధితప్రత్యయం ; తు. -అట ; త. మ. అట్టమ్.

<ఆడు.

**-ఆటము** ప్రత్య. ; మాట్- ఆటము. వివాదం. భాగ. 8.320 ; బొట్ప- ఆటము. పెద్దశేక. సరస. 5.89 ; మింద్- ఆటము. వ్యభిచారం. దశకు. 5.58.

**ఆట³** వి. 1. పలకటం. భార.విరా. 5.182 ; 2. నింద, దూఱు. నృసింహ. 2.90 ; 3. గేలి, పరిహాసం. ఆం.భా. 1.139.

క. ఆట. పలుకు, ధ్వని.

<ఆడు.

**ఆటకదాలు** రూ.చూ. ఆట్రగడలు. వి.బ.వ. ధాన్యవిశేషం.

**ఆటకత్తియ** చూ. ఆట¹.

**ఆటకత్తె** చూ. ఆట¹.

**ఆటకత్ర** చూ. ఆట¹.

**ఆటకాఁడు** చూ. ఆట¹.

**ఆటకాయ** చూ. ఆట¹.

**ఆటకొలమ** చూ. ఆట¹.

**ఆటగడలు** రూ.చూ. ఆట్రగడలు. వి.బ.వ. ధాన్యవిశేషం.

**ఆటగీము** చూ. ఆట¹.

**ఆటగెద** చూ. ఆట¹.

**ఆటగొఱ్ఱు(ఱ్ఱు)** చూ. ఆట¹.

**ఆటంకపఱచు** చూ. ఆటంకము.

**ఆటంకము** వి. నిర్బంధం, అడ్డంకి, నిరోధం.

పో.చూ. సం. ఆతంక. వ్యాధి, జ్వరం, బాధ, భయం; ప్రా. ఆయంక. విచారం, వ్యాధి ; పా. ఆతంక. అనారోగ్యం, వ్యాధి.

క. ఆతంక (ఆటంక). నిర్బంధం, అడ్డంకి, నిరోధం ; త. ఆతంకమ్. వ్యాధి, భయం ; మ. ఆతంకమ్. అడ్డు, హాని.

<సం. ఆతంక-.

**ఆటంకపఱచు** స. క్రి. అడ్డగించు, నిరోధించు. క. ఆతంకిసు. అడ్డగించు, వ్యతిరేకించు.

**ఆటచేడియ** చూ. ఆట¹.

**ఆటతిప్ప** చూ. ఆట¹.

**ఆటతెఱవ** చూ. ఆట¹.

**ఆటతోఁట** చూ. ఆట¹.

**ఆటదిగ్గియ** చూ. ఆట¹.

**ఆటది** చూ. ఆట¹.

**ఆటపట్టు** చూ. ఆట¹.

**ఆటపాక** చూ. ఆట¹.

**ఆటప్రాయము** చూ. ఆట¹.

**ఆటమామ** చూ. ఆట¹.

**-ఆటము** చూ. -ఆట².

**ఆటరి** చూ. ఆట¹.

**ఆటలమ్మ** చూ. ఆట¹.

**ఆటలాట** చూ. ఆట¹.

**ఆటలాడు** చూ. ఆట¹.

**ఆటవాఁడు** చూ. ఆట¹.

**ఆటవిడుపు** చూ. ఆట¹.

**ఆటవెలఁది** చూ. ఆట¹.

**ఆటాడు** చూ. ఆట¹.

**ఆటాడుట** చూ. ఆట¹.

**ఆటార్నె** ని. వార్నెకాడు ; బండి పోలు కాడును జువ్వాయి మోకుకు అతికేకాడు.

**ఆటాలమ్మ** చూ. ఆట.

**ఆటు¹** పో.చూ. అడుచు. వి. 1. అడుపు, దెబ్బ, వ్రేటు, నిర్వ. 7.52, భార. అను. 5.10; 2. కురుపు మొ. వాటిమీద నొక్కినట్లు కలిగే బాధ. భార. కర్ణ. 1.213.

క. అడి. కొట్టటం, దెబ్బ ; త. అటి. దెబ్బ, వ్రేటు, గాలిదెబ్బ; మ. అడి.

<మూ.ద్రా.* అట్-.

**ఆటు²** వి. 1. నైచ్యం, లోకువ. వి. పు. 3.86 ; 2. (కెరటం.) తగ్గటం. ఉ. హరిశ్చ 2.128.

క. ఆఱ్. వెడలిపోవు, ఆరిపోవు, చల్లబడు, తగ్గు ; త. ఆఱు. ఉపశమింపజేయు, తొలగించు ; మ. ఆఱుక. చల్లబరచు, ఉపశమింపజేయు. ఇదికూడ ఆటు¹కు అభిన్నమే కావచ్చు.

**ఆటుపోటు** వి. 1. దుఃఖం, ఆకలి ; 2. సముద్రపు కుంగు పొంగు ; 3. శరీరంలో పోటు, పొడుస్తున్నట్లు నొప్పి. **ఆటుబోటు** వి. సముద్రపు కుంగుపొంగులు. ఉ. హరిశ్చ. 2.128.

**ఆటుపోటు** చూ. ఆటు².

ఆటుప్పు వి. భూమినుంచి తవ్వితీసిన ఉప్పు.
ఆటుబోటు చూ. ఆటు[2].
ఆటువారము పో.చూ. ఆయవారము. వి. భిక్షాటనం.
ఆటె చూ. అట్టె[1].
అట్టె రూ. అట్టె[2]. క్రి.విశ. ఎక్కువ, బాగా (వాడికి అట్టె తెలియదు).
అట్టాశ్రీ స్తంభం వి. ఎనిమిది పలకల స్తంభం.
నం. అష్ట-ఎనిమిది ; ప్రా. పా. అట్ఠ, హిం.గు.మరా. ఉ. ఆఠ్. ఎనిమిది, సిం. ఆఠా.ఎనిమిది ; సింహ. అట ; క. అష్ట. ఎనిమిది.
<ఉ. ఆఠ్.
అట్రగడములు రూ.చూ. అట్రగడలు. వి. ధాన్యవిశేషం.
అట్రగడలు రూ. అట్రగడములు. అట్రగడ్డలు, అట్రగడాలు, ఆటకడాలు, ఆటగడలు ; పో.చూ. అక్కుళ్లు. వి. బ.వ. ధాన్యవిశేషం.
అట్రగడాలు రూ.చూ. అట్రగడలు. వి. ధాన్యవిశేషం.
అట్రగడ్డలు రూ.చూ. అట్రగడలు. వి. ధాన్యవిశేషం.
అట్లమ్మ చూ. ఆట[1].
ఆట్లఁడు రూ చూ. ఆట్లాఁడు. వి. దుర్మార్గుడు.
ఆట్లాఁడు రూ. ఆట్లఁడు.వి. నీచుడు ; ఆట-ల-వాడు అనుదానికి సంక్షిప్తరూపం.
ఆఠకము వి. ధాన్యాదుల కొలత ; నాలుగు కుంచాల ప్రమాణం, తూము.
నం. ఆఢకమ్. పరిమాణ విశేషము, తూము-నాలుగు కుంచాల కొలదిది.
<నం. ఆఢక-.
ఆడ[1] చూ. ఆ[3].
ఆడ[2]- రూ.చూ. ఆఁడు[1], ఆఁడు[4]. సమాన పూర్వపదంగానే ప్రయుక్తం. వి. స్త్రీ. (ఆడ-, మగ-.) ; విశ. స్త్రీ సంబంధి.
ఆడఅటికమామిడి చూ. అటికమామిడి. ఆడకంట్లది వి. పిరికిది. ఆడగూతురు (-కూతురు) రూ.చూ. ఆఁడుకూఁతురు. వి. స్త్రీ. ఆడతనము వి. స్త్రీత్వం, దౌర్బల్యం. ఆడది రూ ఆఁడుది. వి. 1. స్త్రీ ; 2. స్త్రీ జాతిపక్షి, జంతువు. ఆడ పడుచు రూ.చూ. ఆఁడుఁబడుచు. ఆడపాప రూ. ఆడిపాప. వి. దాసి, చెలికత్తె. ఆడపెత్తనము వి. స్త్రీ అధికారం. ఆడ బడుచు (-పడుచు). రూ.చూ. ఆఁడుఁబడుచు. ఆడబిడ్డ వి. ఆఁడుఁబడుచు. ఆడబొట్టి రూ.చూ. ఆఁడుబొట్టి. వి. ఆఁడుఁ బడుచు. ఆడబొట్టె రూ.చూ. ఆఁడుబొట్టి. వి. ఆఁడుఁబడుచు. ఆడమనిషి వి.స్త్రీ. ఆడముండ రూ.చూ. ఆఁడుముండ. వి. అభాగ్యజీవి.
ఆడఅటికమామిడి చూ. ఆడ[2].
ఆడకఱ్ఱ వి. మర వాసంలో తగిలించే రంధ్రంగల వాసం.
ఆడకాడ చూ ఆ[3].
ఆడగూతురు చూ. ఆడ[2].
ఆడంగి- చూ. ఆఁడు[1]. రూ. ఆఁడంగి. విశ. ఆడలక్షణాలుగల.
క. ఆడంగి. స్త్రీ ; తు. ఆడె. పిరికి.
<ఆడ+నం. అంగి. ఆడదాని అవయవాల్లాంటి అవయవాలు కలవాడు.
ఆడంగిఅబ్బవ్వ వి. ఆడలక్షణాలుగలవాడు. ఆడంగి మాటలు వి. బ.వ. ఆడలక్షణాలుగల మాటలు. ఆడంగి రేకలవాడు ఆడంగివాడు. ఆడంగిలెంక రూ. ఆడంగిలేకి. వి. ఆడంగివాడు. ఆడంగిలేకి రూ.చూ. ఆడంగిలెంక. ఆడంగి లేకివాఁడు వి. ఆడంగివాడు. ఆడంగులు రూ. ఆఁడంగులు. వి.బవ. స్త్రీలు. వరాహ. 11.103.
ఆడంగిఅబ్బవ్వ చూ. ఆడంగి.
ఆడంగి మాటలు చూ. ఆడంగి.
ఆడంగిరేకలవాఁడు చూ. ఆడంగి.
ఆడంగిలెంక చూ. ఆడంగి.
ఆడంగిలేకి చూ. ఆడంగి.
ఆడంగిలేకివాడు. చూ. ఆడంగి.
ఆడంగులు చూ. ఆడంగి.
ఆడచామంతి వి. అడవిచేమంతి (Helictercsisora).
ఆడతనము చూ. ఆడ[2].
ఆడది చూ. ఆడ[2].
ఆడపడుచు చూ. ఆడ[2].
ఆడపాప చూ. ఆడ[2].
ఆడపెత్తనము చూ. ఆడ[2].
ఆడబడుచు చూ. ఆడ[2].
ఆడబద్ద వి. ఆడకఱ్ఱ.
ఆడబందు వి. పిడచలమీద తిరిగే ఇనుపబద్దీ, రేకుచుట్ట.
ఆడబిడ్డ చూ. ఆడ[2].
ఆడబుర్కిడి వి తెల్లజువ్వి (Ehretia laevis).
ఆడబొట్టి చూ. ఆడ[2].
ఆడబొట్టె చూ. ఆడ[2].
ఆడమనిషి చూ. ఆడ[2].
ఆడమానము చూ. అడమానము. వి. తాకట్టు.
ఆడముండ చూ. ఆడ[2].
ఆడలంకి వి. ఆడకఱ్ఱ.
ఆడవణ్ణు వి. ప్రభువు, అధికారి. గోమంగ్గల ఆడవణ్ణైన వీర చోడవై గ్రావనశ్రేష్టి. ś 11.10.69, ४. 1034.
ఆడవాసం వి. ఆడకఱ్ఱ.
ఆడశ్యామలి వి. ఆడచామంతి (Helicteres isora).
ఆడాడ చూ. ఆ[3].
ఆడారి విశ. ఆడంగి.
<ఆఁడు.
ఆడాలు రూ. ఆఁడాలు. వి. వృక్ష విశేషం అడియాలు చెట్టు.
పో.చూ. క. ఆడలు. కంచె వెయ్యటానికి ఉపయోగించే పొద ; మొదట్లో బ్రెజిల్ నుంచి వచ్చి ఇప్పుడు మన దేశంలో సర్వసాధారణంగా ఉపయోగించబడుతున్నది (Jatropha curcas).
ఆడి[1] వి. అవధి, హద్దు
క. తు.త.మ. ఆణి. అవధి, హద్దు.
ఆడి[2] వి. గానుగపట్టె.
ఆడి[3] రూ.చూ. ఆణి[4]. వి. నూది.
ఆడి[4] రూ.చూ. ఆడేలు. వి. ఒక జాతి దాతు.
ఆడిక చూ. ఆడు[3].

**ఆడికపడు** చూ. ఆడు[2].
**ఆడికొను** చూ. ఆడు[2].
**ఆడికోరలు** వి. బాలక్రీడా విశేషం.
**ఆడికోలు[1]** చూ. ఆడు[2].
**ఆడికోలు[2]** వి. కప్పం. పన్ను.
త. అఱైకోల్. శిస్తు, కప్పం; అఱై. ఏలేట.
**ఆడిగ** వి. బండి చక్రంలోని నిలువు పట్టె.
క. అడికె, అడిగ. కదలు; తు. అడేవుని. కదలు. కంపించు; త.మ. అట్టం. కంపం.
**ఆడిగనట్టం** వి. ఏడుకోలు, చక్రం, దోనెమొద్దు పోగా మిగిలిన బండి చక్రం.
**ఆడిగనట్టం** చూ. ఆడిగ.
**ఆడితప్పనివాఁడు** చూ. ఆడు[2].
**ఆడితప్పు** చూ. ఆడు[2].
**ఆడితి** రూ.చూ. అతితి. వి. కొలత, నమూనా.
**ఆడిపాప** చూ. ఆడ[2].
**ఆడిపోసికొను** చూ. ఆడు[2].
**ఆడిపోసుకొనుట** చూ. ఆడు[2].
**ఆడివంగమ్మ** పో.చూ. ఆఁడు. వి. ఆడంగివాడు.
**ఆడు[1]** అ.క్రి. **1.** చలించు, కదలు. భార.ఆది. 5.170; **2.** మునుగు, స్నానంచేయు. భార.ఆది. 7.41; **3.** నర్తించు. భార. సభా. 2.31; **4.** (అవయవాదులు స్వకార్యాల్లో) ప్రవర్తిల్లు. భార.ఉద్యో. 4.150; **5.** సంచరించు, తిరుగు, విహరించు. భార. భీష్మ. 3.355; **6.** క్రీడించు. భార. కర్ణ. 1.34; స.క్రి. సలిపివేయు. హర. 1.22; అవ్య. కొన్నిపదాలకు అనుప్రయుక్తమయ్యే ధాతూత్పాదక ప్రత్యయం: ముద్దులాడు, కొనియాడు.
క. ఆడు. కదలు, ఈఁగు, క్రీడించు, నర్తించు, జలక్రీడలాడు; తు. ఆడుని. కదలు, ఈఁగు, వణకు; త. ఆటు. ఈఁగు, నర్తించు, జలక్రీడలాడు; మ. ఆటుక. కదలు, ఈఁగు, కంపించు, నర్తించు, తీర్థమాడు; అట్టుక. ఈఁగు, నూనెతీయు, వేటాడు, పారద్రోలు; కోట. ఆడ్. కదలు, కంపించు; తొద. ఓడ్, ఓట్; కువి. ఆడినై. కలిగించు; కొలా. అఢ్. కదలు, కంపించు, నర్తించు; అడ్. క్రీడించు.
<మూ.ద్రా. *ఆట్-.
**ఆడు[2]** స.క్రి. **1.** పలుకు, వచించు, చెప్పు. భార. భీష్మ. 3.31; **2.** నిందించు, దూరు. భార. సభా. 1.21; **3.** నువ్వులు మొ. వానిని యంత్రంలో నలుగునట్లుచేయు. హర. 1.22; **4.** అను, పాడు. విక్ర. 8.62.
క. ఆడు. అను, పలుకు, నిందించు; పో.చూ. అల్. అరచు; అలిసు. వినిపించు, అరచు; త. ఆటు. చెప్పు; పో.చూ. అలు. ధ్వనిచేయు, అరచు; కొలా. అఢ్. మాట్లాడు.
<మూ.ద.ద్రా. *ఆట్-.
**ఆడిక** వి. **1.** బాస, ప్రతిజ్ఞ. శివరా. 3.77; **2.** నింద, అపవాదం. వసు. 1.107. **ఆడికపడు** అ.క్రి. దూరుపడు, నిందపడు. శై. భా. 8.114. **ఆడికొను** రూ.చూ. ఆడుకొను. స.క్రి. నిందించు. **ఆడికోలు[1]** వి. నింద. హంస. 5.267. **ఆడితప్పనివాఁడు** వి. చెప్పిన ప్రకారం చేసేవాడు. **ఆడితప్పు** అ.క్రి. మాటతప్పు, ఒక మాట చెప్పి మరొకటి చేయు. **ఆడిపోసికొను** అ.క్రి. నిందించు, దూరు. **ఆడిపోసికొనుట** వి. నిందించటం, తిట్టటం. **ఆడుకొను** రూ. ఆడికొను స.క్రి. **1.** చెప్పు, పలుకు. కుచేల. 143; **2.** దూరు, నిందించు. వాల్మీ. 3.57. **ఆడుగోలు** వి. ఒప్పందం. **ఆడుట** వి. క్రీడ, ఆట.
**ఆడు[3]** పో.చూ. నాడు, నాటు. స.క్రి. నాటు, గుచ్చు. భార. ద్రోణ. 4.129, 189.
క. నడు, నెడు. గుచ్చు, నాటు: నాటు, నాంటు. గుచ్చు, గుచ్చుకొను: తు. నడు, నాటు, నాటుని. గుచ్చు, గుచ్చుకొను; త. నటు. నిలుపు, నిలబెట్టు; నాట్టు. నాటు, గుచ్చు; మ. నటుక, నాట్టుక. కోట. నడ్.
నాడులో నకారలోపం. చూ. నాడు, నాటు.
<మూ.ద.ద్రా. *నాట్-. అ.క్రి.; *నాట్ట్-. స.క్రి.
**ఆడుగొవ్వు** వి. మిరప మొక్కలు మొ. వాటి గుంట.
**ఆడు[4]** రూ.చూ. ఆఁడు[1]. విశే. స్త్రీ సంబంధి.
**ఆడుకొల** వి. స్త్రీ హత్య, స్త్రీ హత్యాపాతకం. **ఆడుచందము** రూ.చూ. ఆఁడుచందము. వి. ఆడరూపు. స్త్రీ వేషం. **ఆడుతోడు** రూ.చూ. ఆఁడుతోడు. వి. **1.** తోడబుట్టినది, సోదరి; **2.** స్త్రీ సహాయం. **ఆడుది** రూ.చూ. ఆఁడుది. వి. స్త్రీ. **ఆడుబిడ్డ** రూ.చూ. ఆఁడుబిడ్డ. వి. **1.** కూతురు; **2.** భర్త సోదరి. **ఆడుమాటలు** వి. స్త్రీ మాటలు, స్త్రీ మాటలవంటి మాటలు. **ఆడుముండ** రూ.చూ. ఆఁడుముండ. వి. నీచ స్త్రీ. **ఆడుమొర** రూ.చూ. ఆఁడుమొఱ. వి. ఆడుదాని మొర. **ఆడుపీరు** వి. ఆడఊరు, పీరులు లేని ఊరు.
**ఆడుకులు** వి. ఒక రకం చెట్టు. పృథుక వృక్షం.
పో.చూ. సం. అథకీ. కంది, అడవి కందితీగ; ప్రా. అథఈ. అడవిచెట్టు.
**ఆడుకొత్తుబాగలు** చూ. అడకొత్తు. వి. వక్కలు.
**ఆడుకొను** చూ. ఆడు[2].
**ఆడుకొల** చూ. ఆడు[4].
**ఆడుగొవ్వు** చూ. ఆడు[3].
**ఆడుగోలు** చూ. ఆడు[2].
**ఆడుట** చూ. ఆడు[2].
**ఆడుచందము** చూ. ఆడు[4].
**ఆడుతోడు** చూ. ఆడు[4].
**ఆడుది** చూ. ఆడు[4].
**ఆడుబిడ్డ** చూ. ఆడు[4].
**ఆడుమాటలు** చూ. ఆడు[4].
**ఆడుముండ** చూ. ఆడు[4].
**ఆడుమొర** చూ. ఆడు[4].
**ఆడువరి** రూ.చూ. అడువరి. వి. అలంగం, వప్రం.
క. అళువేరి. చుట్టూ అగత్తగల కోటగోడ; అళ్వేరి.

పో.చూ. ఆణు$^{3}$.

**ఆడువారలు** రూ.చూ. ఆళ్వారు. వి. బ.వ. ద్రావిడ ప్రబంధ కర్తలగు పన్నెండుగురు విష్ణుభక్తులు.

**ఆడువారు** రూ.చూ. ఆళ్వారు. వి. ద్రావిడ ప్రబంధ కర్త. క్రీ.శ. 719–755. అహరనకర శాసనం.

**ఆడువాళ్ల** రూ.చూ. ఆళ్వారు. వి. బ.వ. ద్రావిడ ప్రబంధ కర్తలగు పన్నెండుగురు విష్ణుభక్తులు.

**ఆడుపీరు** చూ. ఆడు$^{4}$.

**ఆడె**$^{1}$ వి. ఆరెపూవు (Barhinia pccemosa).

**ఆడె**$^{2}$ వి. కాకితంలో ఒక భాగం, టావు. ఆం.భా. 2.188.

క. హాళె. పోకపట్ట, కాగితం, పుస్తకంలోని పుట, ఆకు. మొ.; తు. పాళమ్; త. పాళై; మ. పాణు, పాళ.

<క. హాళె; 'హ' లోపం.

**ఆడెబలు** రూ.చూ. అగడపలు. వి. బ.వ. 1. మేఘమాల. ఆం.భా. 1.78; 2. మెట్లుమెట్లుగావున్న మబ్బు దొంతర్లు. అగడపలులో 'గ' లోపం.

**ఆడెలు**$^{1}$ రూ.చూ. ఆడేలు. వి. 1. గుడ్లగూబ. సుద. 3.194; 2. ఒక జాతి బాతు; 3. తోక ఆడించే ఒక జాతి పక్షి.

**ఆడెలు**$^{2}$ రూ.చూ. అగడపలు. వి. బ.వ. మబ్బు దొంతరలు (ఆడెబలుయొక్క సంక్షిప్త రూపం).

**ఆడేలి** రూ.చూ. ఆడలవిటల.

**ఆడేలు** రూ. ఆడి$^{4}$, ఆడెలు$^{1}$. వి. ఒక జాతి బాతు. మార్క. 2.8.

సం. ఆడిః. జలపక్షి; ఆటి, ఆతిః; ప్రా. ఆడి. ఒక జాతి పక్షి, ఒక జాతి చేప;

క. ఆడేలు. గుడ్లగూబ; అండెగ; పో.చూ. త. అంతై; పో.చూ. మ. అంత. విషజంతువు.

<ఆడ్(ఉ)-ఏఀలు; చూ. పొట్టేలు, తొడేలు, తాబేలు మొ.

**ఆర్డ్లపట్టు** చూ. ఆర్డ్లు.

**ఆర్డ్లు** రూ.చూ. ఆళ్లు. వి. బ.వ. ధాన్య విశేషం, ఆరిగలు.

**ఆర్డ్లపట్టు** రూ.చూ. ఆళ్లపట్టు. వి. ఒక రకం ధాన్యం పండే పొలం.

**ఆడ్వాని** రూ.చూ. ఆడ్వారు. వి. ప్రభువు: విన్నగనాడ్వాని. విష్ణువు. ద.హిం.శా. 4.1800.

**ఆడ్వారు** రూ. ఆడ్వాని. వి. ప్రభువు: విన్నకనాడ్వారి. విష్ణుదేవుడు. ద.హిం.శా. 5.16.

క. అళ్మ, అణ్మ, అణ్బ. పాలకుడు; అణ్డారి. ప్రభువులు; త. అళ్వాన్. ప్రభువు, యజమాని; అళ్వార్; మ. అణ్వార్. ప్రభువు, యజమాని: కోట. అణ్. పాలించు; తొద. ఓళ్. పాలించు.

<త. ఆళ్వాన్.

**ఆణంగి** రూ.చూ. ఆడంగి. వి. స్త్రీ.

**ఆణంగులు** రూ.చూ. ఆడంగులు. వి. స్త్రీలు.

**ఆణంగులు** చూ. ఆణంగి.

**ఆణతిగామ** చూ. ఆనతి, శాసకుడు.

**ఆణము** వి. మాంసరసం. ఆం.భా. 2.252.

పో.చూ. క. అడగు. మాంసం; త. మ. ఆణమ్. దారు;

<త. ఆణమ్; <మూ.ద.ద్రా. *ఆణ్-అమ్.

**ఆణి**$^{1}$ రూ. ఆణి$^{2}$. వి. 1. గుండ్రన. భార.విరా. 5.386; 2. గుండ్రని ముత్యం. విక్ర. 1.50.

క. అణి < అటి. గుండ్రని; త. ఆటి. వలయం; మ. ఆటి. గుండ్రన.

<మూ.ద్రా. *ఆట్.

**ఆణిపూస** వి. ముత్యం. కళా. 3.4. ఇక్కడ 'ఆణి' అనేది అణి$^{2}$ శ్రేష్ఠార్థంలోగాని, ముత్యపుచిప్పలో ముత్యం ముఖ్యాంగం కాబట్టి, అణి$^{3}$ ముఖ్యాంగమనే అర్థంలోగాని వాడబడి వుండవచ్చు.

**ఆణి**$^{2}$ విణ. ప్రశస్తం, శ్రేష్ఠం. ఆం.భా. 3.15, యయా. 4.81.

క. అణి, అణి, అణ్ణ, అణ్ణె. శ్రేష్ఠత్వం, ఆధిక్యం; ఉత్కృష్టత; త. అణి.

<మూ.ద్రా. *ఆణ్.

**ఆణి**$^{3}$ రూ. ఆణీ$^{1}$ వి. మర్మం, ఆయువుపట్టు.

**ఆణికాఁడు** వి. ఆప్తమిత్రుడు, మర్మజ్ఞుడు, గాఢమైన పరిశీలనాదృష్టి గలవాడు. **ఆణిపోటు** వి. మర్మావయవాల్లో సలుపు, ఆయువుపట్టున పొడిచిన పోటు.

**ఆణి**$^{4}$ రూ. ఆడి$^{3}$. వి. సూది, మేకు.

సం. అణిః, అణీ. సాయిమేకు; పా. అణి. మేకు, సాయిమేకు, గడియ;

క. అణి. సాయిమేకు, మేకు, కత్తిఅంచు, ఆధారం, రక్షణ మొ.; తు. అణి. మేకు; త. అణి. మేకు, ఆధారం; మ. అణి.

<మూ.ద.ద్రా. (<) *అణ్-.

**ఆణికాడు** చూ. ఆణి$^{3}$.

**ఆణిపాణి** వి. స్వచ్ఛమైన నీరు. శృం.నై. 6.55.

హిం.ఉ. పానీ. నీరు.

<ఆణి$^{1}$ + ఉ. పానీ.

**ఆణిపూస** చూ. ఆణి$^{1}$.

**ఆణిపోటు** చూ. ఆణి$^{3}$.

**ఆణిమ** వి. ఆధిక్యం, ఒజ్జబంతి.

పో.చూ. క. అళుంబ. ఆధిక్యం, గొప్పతనం; పో.చూ. త. అయివమ్.

**ఆణియ** రూ. ఆణె, ఆనియ, ఆనె. వి. దద్రురోగం.

క. అణె. బీట; ఆణెబిడు. పగులు, బీటవిచ్చు; ఆణిసు. వేడికి బీటవిచ్చు; తు. అణి, అరికాళ్లల్లో వచ్చే చర్మవ్యాధి; త. అణి. పుండుమొన; మ. అణి. కురుపు కుదురు.

బహుశః < క. అణె.

**ఆణియము** రూ.చూ. ఆణెము$^{2}$. వి. 1. గ్రామం; 2. మాగాణి భూమి; 3. సరిహద్దు.

**ఆణీ**$^{1}$ రూ.చూ. ఆణి$^{3}$. వి. మర్మావయవం.

**ఆణీ**$^{2}$ రూ.చూ. ఆణి$^{1}$. విణ. గుండ్రని. కృష్ణ.శ. 16.

**ఆణె** రూ.చూ. ఆణియ. వి. దద్దురు, బొబ్బ. ఆం.భా. 2.181.

**ఆణెము**$^{1}$ చూ. ఆణి$^{2}$. 1. మంచి వంశం; 2. పశువులు మొ; వాటి మంచి సంప్రదాయం, మంచి కులం.

పో.చూ. నాడెము, నాడెము మొ.

**ఆడెము**[2] రూ. ఆడియము. వి. రాష్ట్రం, దేశం. ఆం.బా. 2.7.

పో.చూ. క. మాగణి, మాగణె. జిల్లాలో గానీ తాలూకాలో గానీ ఒక ప్రాంతం ; పో.చూ. తు. మాగణె ; పో.చూ. త. మాకాణమ్. జిల్లా, రాష్ట్రం, తాలూకాలో కాణమ్. జిల్లా, రాష్ట్రం. తాలూకాలో ఒకే కరణంక్రింద ఉన్న పెక్కు గ్రామాలుగల ప్రాంతం.

సం. అణి. ఇంట్లో మూల, సరిహద్దు ;

ఒ. అణి. సరిహద్దు ; హిం. అణి.

<సం. అడి-.

**ఆంక్ష** రూ.చూ. ఆంక్ష. వి. వెలి, బహిష్కారం.

**ఆండ** రూ.చూ. హండా. వి. పెద్ద పాత్ర.

**ఆండా** రూ.చూ. హండా. వి. పెద్ద పాత్ర.

**ఆండారి** వి. శైవుల పేర్లకు చివర చేరే ఒక గౌరవ వాచక ప్రత్యయం. బసవ. 4.965 వం.

క. ఆండారి. పాలకులు, యజమానులు ; ఆండి. శైవ పరివ్రాజకుడు ; త. ఆంటార్. (గౌరవ సూచకం. బ.వ. యజమాని, ప్రభువు, దేవతలు; ఆంటు. పాలకుడు; పో.చూ. ఆళ్వార్. పరమప్రభువు, భగవంతుడు ; మ. ఆంటి. సన్యాసి, సుబ్రహ్మణ్యస్వామి భక్తుడు.

<మూ.ద్రా. *ఆణ్-ట్. ఆర్ (<*ఆళ్-న్త్-).

**ఆణ్డు** చూ. ఏడు. వి. సంవత్సరం.

<ఏడు.

**ఆండుమారి** రూ.చూ. ఆఁడారి.

**ఆణ్డువాణ్డు** రూ.చూ. ఆళ్వారు. వి. ద్రావిడ ప్రబంధకర్తలు.

**ఆంద్రెన్ప** వి. 1. గారాబంగా పెరిగే పిల్లలు చేసే అల్లరి ; 2. సెంకెతనం.

ఒ. ఒండిరా. పౌరుషం, సాహసం ; పో.చూ. అంటు. పొగరుబోతుతనం, ఉద్రేకం ;

త. అన్తు. పూర్తిగా నిండిన, విస్తరించిన, అంతరించిన, అగన. విస్తృతి.

**ఆఁటది** రూ.చూ. ఆఁడుది. విరళప్రయోగం. వి. స్త్రీ. భాగ. 9.408, ద్వి. హరిశ్చ. ఉ. 2407.

**ఆఁటు** చూ. ఆటు. అ.క్రి. 1. చాలు. కాశ. 3.265 ; 2. తాళు, ఓర్చు. ప్రభా. 2.59 ; 3. సమృద్ధిగానుండు. యయా. 1.94.

క. ఆజ్. చాలు, సమర్థమగు, తాళు, ఓర్చు ; త. అణ్ణు. చాలు, ఓర్చు, భరించు. అట్టాల్. సమృద్ధిమైన ; అట్టి. విశాలమైన, మేలైన ; మ. అణ్ణుక. వృద్ధిపొందు.

<మూ.ద్రా. *ఆట్-.

**ఆఁటుబడి** చూ. ఆఁటు. ఆటి రావటం, సరిపోవటం.

**ఆఁటుమాటు** వి. కలగలుపు.

**ఆఁటుబడి** చూ. ఆఁటు.

**ఆఁటుమాటు** చూ. ఆఁటు.

**ఆఁడారి** చూ. ఆఁడు[1].

**ఆఁడాలు** రూ.చూ. ఆడాలు. వి. వృక్ష విశేషం.

**-ఆఁడి** పో.చూ. -ఆఁడు[1]. అవ్య. కొన్ని బహువచనాంతాలకు స్త్రీత్వంలో వచ్చే మతుబర్థక ప్రత్యయం. వగలాఁడి, కులుకులాఁడి మొ.

క. -అడి, -అళి. ఆడటం, చెయ్యటం అనే అర్థం ఇచ్చే నామాంత ప్రత్యయం. ఓదాళి. చదువరి ; జూదాళి. జూదరి ; పో.చూ. త. -అట్టి. స్త్రీలింగ, ఏ.వ. నామాంత ప్రత్యయం ; -అళ్. స్త్రీలింగం. ఏ.వ. నామ క్రియాంత ప్రత్యయం.

<మూ.ద్రా. *అళ్.

**ఆఁడు**[1] రూ.ఆడ[3], ఆడు[4]. పో.చూ. ఆలు. విశ. స్త్రీ సంబంధి.

పో.చూ. త. అట్టి. స్త్రీ ; -అళ్. స్త్రీలింగ ఏ.వ. ప్రత్యయం ; గోం. అర్. స్త్రీ ; కుఇ. అస. స్త్రీ ; కువి. అజ. స్త్రీ ; ఆడి. భార్య.

<మూ.ద్రా. *ఆంట్-< *అళ్-న్త్-.

**ఆఁటది** రూ.చూ. ఆఁడుది. వి. స్త్రీ. భాగ. 9.408, ద్వి. హరిశ్చ. ఉ. 2407. **ఆఁడారి** రూ. ఆండుమారి. విశ. స్త్రీ లక్షణంగల ; వి. **ఆడంగివాడు** త. ఆణ్మారి. మగ లక్షణాలుగల ఆడది, మగరాయుడు, గయ్యాళి. **ఆఁడుకట్టు** రూ.చూ. ఆఁడుఁగట్టు. వి. స్త్రీ వస్త్రధారణ పద్ధతి. **ఆఁడు కూఁతురు** రూ. ఆడగూతురు, ఆఁడుఁగూఁతురు. వి. స్త్రీ. **ఆఁడుగుతి** వి. యోని. **ఆఁడుఁగట్టు** (-కట్టు) రూ. **ఆఁడుకట్టు** వి. స్త్రీ వస్త్రధారణ పద్ధతి. భార.విరా. 1.228. **ఆఁడుఁగాన్పు** (-కాన్పు). వి. కూతురు. రాజవా. **ఆఁడుఁగూచి** (-కూచి). వి. గయ్యాళిది. శుక. 3.20. **ఆఁడుఁగూఁతురు** (-కూఁతురు). రూ.చూ. ఆఁడుకూఁతురు వి. స్త్రీ. శివ.సా. 417. **ఆఁడుఁగొల** (-కొల) రూ. ఆడుకొల. వి. 1. స్త్రీ హత్య. ద్వి.ప్రభు. 2.31 ; 2. స్త్రీహత్యా పాతకం. **ఆఁడుచందము** రూ. ఆడు చందము. వి. స్త్రీ రూపు. భార.విరా. 1.231. **ఆఁడుతోడు** రూ. ఆడుతోడు, ఆఁడుఁదోడు. వి. 1. సోదరి ; 2. స్త్రీ సాయం. **ఆఁడుదారి** రూ. ఆండుమారి. చూ. ఆఁడు[1]. విశ. ఆడంగియైన ; వి. ఆడంగివాడు. త. ఆణ్మారి. పుంస్త్వం గల స్త్రీ. **ఆఁడుది** రూ. ఆడది, ఆఁటది. వి. స్త్రీ. **ఆఁడుదొంగ** వి. దొంగయైన ఆడుది. హరిశ్చ. 5.132. **ఆఁడుఁదనము** (-తనము) వి. 1. స్త్రీత్వం, స్త్రీ లక్షణం. భార.విరా. 1.238 ; 2. బలహీనత. **ఆఁడుఁదోడు** (-తోడు) ; రూ.చూ. ఆడుతోడు. వి. 1. సోదరి, సోదరీత్వం. మను. 4.87 ; 2. స్త్రీ సాయం. **ఆఁడుపట్టి** వి. ఆడపిల్ల. హర. 5.40. **ఆఁడువడుచు** రూ.చూ. ఆడుపడుచు వి. బాలిక. **ఆఁడుపాప** వి. బాలిక. **ఆఁడుపిల్ల** వి. బాలిక. **ఆఁడుపుట్టువు** వి. 1. సోదరి ; 2. ఆడజన్మ. **ఆఁడుఁబడుచు** రూ. ఆడపడుచు, ఆడ బడుచు, ఆడుపడుచు. వి. 1. కూతురు. రా.వి. 1.38 ; 2. భర్త సోదరి. **ఆఁడుబిడ్డ** రూ. ఆడుబిడ్డ. వి. 1. కూతురు. కాశీ. 2.53 ; 2. భర్త సోదరి ; 3. బాలిక. **ఆఁడుచీర** వి. ఆడుజాతి చీర. హంస. 4.10. **ఆఁడుబొట్టి** రూ. ఆడబొట్టి, అడబొట్టి, ఆఁడుబొట్టె. వి. భర్త సోదరి. **ఆఁడు బొట్టె** రూ.చూ. ఆఁడుబొట్టి. వి. భర్త సోదరి. **ఆఁడుముండ** రూ. ఆడముండ. వి. నీచస్త్రీ. **ఆఁడుమొత్తము** వి. స్త్రీ సమూహం. భార. స్త్రీ. 2.173. **ఆఁడుమొల** రూ. ఆడుమొల వి. ఆడుదాని మొల. మను. 4.66. **ఆఁడుఁబడుచు** (-పడుచు). వి. 1. కూతురు. రాజవా. 1.38 ; 2. భర్త సోదరి ; 3.

యువతి ; 4. బాలిక. **ఆఁడుఁబాటు** (-పాటు). వి. స్త్రీత్వం. పాండు. 4.273. **ఆఁడుఁబాప**(-పాప). వి. బాలిక. **ఆఁడుఁబుట్టువు** వి. 1. సోదరి. భార.విరా. 2.50 ; 2. ఆడజన్మ. ద్వి. సారంగ. 52 పు. 11 పం.

**-ఆఁడు[2]** అవ్య. మతుబర్థంలో వచ్చే పుంలింగ ఏకవచన ప్రత్యయం ; ముద్దులాఁడు.

క. ఆణ్, ఆళ్. పురుషుడు; ఆళ్. (ఆళు). పుంస్త్వం. తు. ఆణు. బాలుడు, పురుషుడు ; త. ఆణ్ (ఆళ్). పురుషుడు ; మ. ఆణ్ ; కుఇ. ఆంౘ ; కుర. ఆలస. పురుషుడు, భర్త, స్నేహితుడు, సేవకుడు, సైనికుడు ; ఆళ్ ; బ్రా. ఆరే. (బ.వ. అరిౘస) పురుషుడు, భర్త ; అరిమ్. పో.చూ.-అస్క. బ.వ. ప్రత్యయం.

<మూ.ద్రా. *ఆణ్/*ఆళ్.

**ఆఁడుకట్టు** చూ. ఆఁడు[1].
**ఆఁడుకూఁతురు** చూ. ఆఁడు[1].
**ఆఁడుగుణి** చూ. ఆఁడు[1].
**ఆఁడుఁగట్టు** చూ. ఆఁడు[1].
**ఆఁడుఁగొమ్మ** చూ. ఆఁడు[1].
**ఆఁడుఁగూచి** చూ. ఆఁడు[1].
**ఆఁడుఁగూఁతురు** చూ. ఆఁడు[1].
**ఆఁడుఁగోల** చూ. ఆఁడు[1].
**ఆఁడుతోడు** చూ. ఆఁడు[1].
**ఆఁడుదారి** చూ. ఆఁడు[1].
**ఆఁడుది** చూ. ఆఁడు[1].
**ఆఁడుదొంగ** చూ. ఆఁడు[1].
**ఆఁడుఁదనము** చూ. ఆఁడు[1].
**ఆఁడుఁదోడు** చూ. ఆఁడు[1].
**ఆఁడుపట్టి** చూ. ఆఁడు[1].
**ఆఁడుపడుచు** చూ. ఆఁడు[1].
**ఆఁడుపాప** చూ. ఆఁడు[1].
**ఆఁడుపిల్ల** చూ. ఆఁడు[1].
**ఆఁడుపుట్టువు** చూ. ఆఁడు[1].
**ఆఁడుబిడ్డ** చూ. ఆఁడు[1].
**ఆఁడుభీఱ** చూ. ఆఁడు[1].
**ఆఁడుబొట్టి** చూ. ఆఁడు[1].
**ఆఁడుబొట్టె** చూ. ఆఁడు[1].
**ఆఁడుఁబడుచు** చూ. ఆఁడు[1].
**ఆఁడుఁబావ** చూ. ఆఁడు[1].
**ఆఁడుఁబాటు** చూ. ఆఁడు[1].
**ఆఁడుఁబుట్టువు** చూ. ఆఁడు[1].
**ఆఁడుముండ** చూ. ఆఁడు[1].
**ఆఁడుమొత్తము** చూ. ఆఁడు[1].
**ఆఁడుమొఱ** చూ. ఆఁడు[1].

**ఆత** ఛూ.చూ. హాకీ. ని. పన్నె కట్టేటప్పుడు బద్దలు మధ్య పుల్లలను సమంగా ఒత్తే కొయ్యబిళ్ళ

**ఆత్తరము** రూ చూ. ఆత్రము.
**ఆతగాఁడు** చూ. ఆ[3].
**ఆతఁడు** చూ. ఆ[3]
**ఆతమ** చూ. ఆ[3].
**ఆతల** చూ. ఆ[3].
**ఆతలీతలపేయు** చూ. ఆ[3].
**ఆతా** వి. ఇల్లు కట్టే స్థలం.
**ఆతివాసిని** వి. శిష్యురాలు.

సం. అంతేవాసినీ. శిష్యురాలు ; ప్రా. అంతేవాసి(ణీ) ; నే. అంతేబాసీ(నీ).

<సం. అంతేవాసినీ.

**ఆతు** చూ. ఆదు. వి. శష్పాలు, కాలిపెంట్రుకలు.

**ఆతుమ** వి. మనస్సు. కళా. 6.161.

సం. ఆత్మన్, అత్. కదలు ; అన్. ఊపిరిపీల్చు ; వా. పీచు ; ఆత్మన్ ఊపిరి ; ఆత్మ. ఇంద్రియాగోచరం ; ప్రా. అత, ఆత్మ. జీవం, అత్త, అప్ప, అత్త.

<సం. ఆత్మ(న్).

**ఆత్మారాముడు** వి. 1. (రూపొందిన) ఆకలి : 2. తనలో ఉన్న దేవుడు.

పో.చూ. సం. ఆత్మారామ-. ఆత్మానందం ;

హిం. ఆత్మారామ. ఆత్మ, ఆత్మానందం ; గు. ఆత్మారామ. జీవాత్మ, పరమాత్మ.

<సం. ఆత్మారామ-. అర్థ విపరి.

**ఆత్రగాఁడు** చూ. ఆత్రము.
**ఆత్రపడు** చూ. ఆత్రము.

**ఆత్రము** రూ. ఆత్తరము. వి. 1. తొందర. సమీర. 4.148 ; 2. విపత్తు. ఆం.సం.మాన. 59.

సం. ఆతుర. బాధ, జబ్బు, జబ్బుపడిన, బాధపడిన ; ప్రా. ఆవుర. జబ్బు, ఉత్సుకత, దుఃఖం ; పా. ఆతుర. జబ్బు, దుఃఖకరం ; నే. ఆతుర్. జబ్బు ; ఆతురి, ఆతురె. తొందర ; ఒ.గు.మరా. ఆతుర ; హిం. ఆతుర్ ;

క. ఆతుర. జబ్బు ఆందోళన, సంక్షోభం, తొందర ; తు. అౖత. ఉత్సుకత ; త. ఆత్తిరమ్. అసహనం, తొందర ; మ. ఆతురమ్. జబ్బుపడిన, సంక్షోభపడిన.

<సం. ఆతుర-.

**ఆత్రగాఁడు** -కాఁడు. వి. తొందరపడేవాడు. క. ఆతురగార. తొందరపాటు మనిషి ; త. ఆత్తిర క్కారన్, కకూర్తి మనిషి. **ఆత్రపడు** అ.క్రి. తొందరపడు, కలవరపడు. మొల్ల.రా. 1.45. క. ఆతురఆడసు, ఆతురపడసు. తొందరపడు ; త. అత్తిరప్పటు. కలవరపడు.

**ఆత్రెసలు** చూ. అత్తిరసము, అత్రెసము (ఏ.వ.). వి. బ.వ. అరిసెలు, నిప్పట్లు.

**అధ[1]** రూ. ఏద[1]. వి. 1. మనస్సు. ఆం.భా. 1.100 ; 2. వ్యాకులత విచారం. భోజ. 4.

పో.చూ. క. అది. ఆలోచన, శ్రద్ధ, వ్యాకులత, మానసిక క్షోభం, ఆపద ; పో.చూ. త. అతమ్. వ్యాకులత ; అతి. మనోవ్యథ ; పో.చూ. మ. అధి. శ్రద్ధ, వ్యాకులత ;

సం. అధి-. ఆలోచన, శ్రద్ధ, మనోవ్యథ ; ప్రా. అహి. వ్యాకులత, బాధ, మనోవ్యథ ; హిం.పార. యాద్ ; మరా. అధి. వ్యథ, వ్యాకులత ; యాద్, యాది. జ్ఞప్తి.

ఆద < సం. ఆత్మన్.

**ఆదమఱచు** అ.క్రి. 1. నిర్విచారంగా ఉండు. భార.సౌ. 1.51 ; 2. మైమరచు, స్మృతితప్పు, వివశత్వమొందు. ఆము. 4.186. **ఆదమఱపు** వి. పరాకు, ఏమరిపాటు.

**ఆద[2]** వి. పచ్చగా ఎదిగిన పైరు

**ఆద[3]** రూ.చూ. ఆదా.

**ఆదట[1]** వి. 1. ఆసక్తి అపేక్ష. భార.స్త్రీ. 2.9 ; 2. ప్రేమ, అనురాగం. విజ్ఞా. ప్రవ. 141 · 3. భక్తి. మార్క. 7.22 ; 4. వాత్సల్యం, దయ. రం.రా. ఉ. 73 ; 5. సంతృప్తి. హరి.పూ. 7.91 · 6. దర్పం.

సం. ఆదర. గౌరవం, శ్రద్ధ, ఇబ్బంది ; ప్రా. ఆదర, ఆయర. గౌరవం ; ఆతట్ఠ. స్వప్రయోజనం ; పా. ఆదర, ఆదరతా. గౌరవం ; నే.హిం. ఆదర్. గౌరవం · ఒ.గు. మరా. ఆదర.

**ఆదటవోవు** -పోవు. అ క్రి. తనియు, తృప్తినొందు. భార. ఆది. 4.144.

**ఆదట[2]** అవ్య. 1 తరువాత, అనంతరం. ఉత్త. 2.288 ; సానంద. 1 ; 2. చాలా బాగా, పూర్తిగా.

క. ఆదలె. ముఖం, ఆధిముఖ్యం అదమ్, అపతల ; ఆదం. (ఆద్య)+అమ్.

ఆద < అ+(త)దల. మీదట(న్) ముంగట(న్) మొ. వాటి సామ్యాన ఏర్పడి ఉంటుంది.

**ఆదటవోవు** చూ. ఆదట .

**ఆదమఱచు** చూ. ఆద[1].

**ఆదమఱపు** చూ. ఆద .

**ఆదరబాదర** రూ.చూ. ఆదరాబాదరా. వి. తొందర, తొట్రుపాటు.

**ఆదరాబాదరా** రూ. ఆదరబాదర. వి. తొందర, తొట్రుపాటు (ధ్వన్యనుకరణ శబ్దం).

**ఆదరాబాదరాగా** క్రి.విశ. తొందరగా, తొట్రుపాటుగా.

**ఆదరాబాదరాగా** చూ. ఆదరాబాదరా.

**ఆదరికము** వి. దీక్ష. బసవ. 1.8.

క. ఆదరిక. గౌరవించేవాడు, అవసరానికి ఆదుకునే వాడు.

< సం. ఆదర-+తె. ఇక.

**ఆదరువు** వి. ఆధారం, ప్రాపు. కృష్ణ. 4.84, గీతా.వి. 2.126.

సం. అధార. ఆధారం ; ప్రా.పా. ఆధార ; నే.హిం. ఆధార్ ; ఒ.గు.మరా. అధార ,

క. ఆధార ; తు. ఆదార · త. ఆతరువు ; మ. ఆదరమ్, ఆదరవు.

< సం. ఆధార-.

**ఆదలబాదల** పో.చూ. ఆదరాబాదరా. రూ. ఆదాబాదా. వి. తొందర, తొట్రుపాటు.

కుమా. అద్లోబద్లో. మార్పు, పరివర్తనం ; నే.హిం. అదల్ బదల్ ; ఒ. అదలాబదలా ; గు. అదలా బదలి ; మరా. అదలాబదల ; ఉ.పార.అర. అదల్ బదల్, అద్లాబద్లా. ప్రత్యామ్నాయం, మార్పు ఒక వస్తు విచ్చి మరియొకటి పుచ్చుకొనుట ;

పో.చూ. క. అదలుబదలు ; ద్రా. అదలిబదలి.

< ఉ. అదల్‌బదల్.

**ఆదా** రూ. ఆద[3]. వి. ఆదాయం, రాబడి, లాభం.

హిం.ఉ. అదా. బాకీ లేకుండా తీర్చివేయటం, బాకీ లేకపోవటం, పరిశుద్ధం.

< ఉ. అదా.

**ఆదాపరచుట** వి. చెల్లించటం, అప్పు మొ. తీర్చటం.

**ఆదాపరచుట** చూ. ఆదా.

**ఆదాబాదా** రూ. చూ. ఆదలబాదల. అవ్య. తొందరగా, తొట్రుపాటుగా.

**ఆదాబు** వి. నమస్కారం, గౌరవం.

నే. అదబ్. గౌరవం, భయం ; హిం. అదాబ్. ఆచారాలు, నమస్కారం ; మరా. అదబి. గౌరవం ; ఆదాబ. నమస్కారం ; ఉ. అదాబ్. ఆచారాలు, మర్యాద, సౌశీల్యం, నమస్కారం, గౌరవం · పార. ఆదాబ్. మంచిఅలవాట్లు, నరళస్వభావం · అర. అద్బ్. సౌశీల్యం ;

క. అదాబు. గౌరవం, నమస్కారం.

< ఉ. ఆదాబ్.

**ఆదావతు** రూ.చూ. అదావత్. వి. ద్వేషం, శత్రుత్వం.

**ఆది[1]** వి. 1. సుగుణం, విధి ; 2. చైతన్యం ; 3. గుర్తు. జాడ.

**ఆది[2]** రూ.చూ. అతితి. వి. 1. కొలత ; 2. నమూనా.

**ఆది-[3]** సమాసాల్లో పూర్వపదంగా అర్థవిపరి. కల్గిస్తూ ప్రయుక్తం. విశ. మొదటి.

సం. ఆది. మొదలు ; ప్రా. మహా. అ.మా. పా. ఆది-.

< సం. ఆది-.

**ఆదిఆంధ్రులు** వి. బ.వ. ఆంధ్రులలో మొదటివారు, హరిజనులు. **ఆదివెలమలు** వి. బ.వ. వెలమలలో ఒక తెగ.

**ఆదిఅంధ్రులు** చూ. ఆది[3].

**ఆదికొను** రూ. ఆదిగొను. అ.క్రి. మొదలిడు, ఎదుర్కొను, నడువు, మీదపడు, ఎదురుపోవు. భార.విరా. 5.73, ద్రోణ. 5.308.

త. అతి. అశ్వగతి విశేషం, రేచితం.

< ఆది[3] -కొను.

**ఆదిగొను** రూ.చూ. ఆదికొను. అ.క్రి. ఎదుర్కొను. ఉ.హ. 5.251.

**ఆదివెలమలు** చూ. ఆది[3].

**ఆదీకము** వి. లాభం.

సం. అధిక-. ఎక్కువ.

< సం. అధిక-.

**ఆదుకొను** అ.క్రి. 1. కమ్ము. రాఘవ. 4.147 ; 2. ప్రాపగు, ఆధారమగు. చంద్రా. 4.176.

**ఆదుర్దా** వి. భయం, బాధ, దుఃఖం, కష్టార్తి.

సం. ఆతురతా.

మరా. అజూర్దా అజూర్దా. విచారకరం ; అజూర్దగీ.

విచారం ; ఉ. అజుర్ద. విచారకరం ; అజుర్దగీ. బాధ, ఆపద, దుఃఖం ; అజుర్దహ ; పార. అఝుర్దా, అఝుర్దా.

< ఉ. ఆజుర్ద.

ఆదుర్దాపడుట వి. ఇబ్బందిపడటం, కొందరపడటం.

**ఆదుర్దాపడుట** చూ. ఆదుర్దా.

**ఆదూర** చూ. ఆ[5].

**ఆదొండ** రూ.చూ. ఆరుదొండ (Capparis zeylamica).

**ఆద్రెగాణము** వి. **1.** పెద్దగా అరచి మోసగించటం; **2.** అన్యాయం.

**ఆన[1]** వి. **1.** ఒట్టు, తోడు. భార.ద్రోణ. 2.311 ; **2.** ఆజ్ఞ, ఉత్తరువు. కాశీ. 4.37 ; **3.** ప్రమాణం. చెన్న. 3.428. **4.** సాక్ష్యం. శృం.నై. 3.144 ; **5.** కోపం. రాధా. 3.89.

నం. ఆజ్ఞా. ఉత్తరువు, ఆదేశం, అనుజ్ఞ ; ప్రా.పా. ఆణా, అణ్ణా ; అప. ఆణ ; హిం. ఆన్ ; గు. ఆణ్ ; సిం.మరా. సింహ. ఆణ ;

క. ఆణె ; తు. అజి, అణై. ఆజ్ఞ, ప్రమాణం, ఒట్టు, సత్యం ; మ. ఆణ.

< ప్రా. ఆణా.

**ఆనపెట్టు** స.క్రి. **1.** ఆజ్ఞాపించు. ప్రబోధ. 3.39 ; **2.** వేడు. వేంక.శ. 103. **ఆనపాడుచు** రూ. ఆనవొడుచు. స.క్రి. ఆజ్ఞాముద్రవేయు. కళా. 3.193. **ఆనవొడుచు** రూ.చూ. ఆనపొడుచు. స.క్రి. **1.** ఆజ్ఞపెట్టు. హరిశ్చ.ఉ. 1612 ; **2.** ఒట్టుపెట్టు. పల్నా. 2. **ఆనవైచు** అ.క్రి. ఒట్టు పెట్టుకొను ; స.క్రి. ఒట్టుపెట్టు. భోజ. 3.18. **ఆనవోవు** అ.క్రి. ఒట్టుపెట్టుకొను. నిరం. 2.17.

**ఆన-[2]** వి. గుర్తు, జాడ.

పా. అన్నా. విజ్ఞానం.

**ఆనగోలుపోవు** (-కోలుపోవు). అ. క్రి. మాసిపోవు, నశించు. **ఆనవాలు[2]** వి. **1.** గుర్తు, అడియాలం. భార.అశ్వ. 3.95 ; **2.** సంతకం. (ఆన[2]+వ్రాలు). **ఆనవాలుపట్టు** స.క్రి. గుర్తుపట్టు, చిహ్నలవల్ల తెలిసికొను.

**ఆన[3]** క్రి.విశ. క్రీస్తుశకవత్సరసూచకం 'ఆన 1972'. Anno domini అనే లాటిన్ పదం నుంచి పోర్చుగీసు భాషలోనికి ఈ పదం చేరిఉంటుంది.

పో.చూ. త. అన. నిర్దేశార్థక. విశ. అ ;

లాటి. *Anno domini*. క్రీస్తుశకవత్సరంలో ;

పోర్చు. అనో. సంవత్సరం.

< పోర్చు. అనొ (విజయనగర ప్రజలకూ బురతకీచు లకూగల ఒప్పందాల ద్వారా ఒడంబడికల ద్వారా ఇది తెలుగులో చేరి వుంటుంది).

**ఆనక** రూ. ఆనెంక. అవ్య. ఇటుపిమ్మట. తరువాత.

తు. ఆని. ఆరోజు. పో. చూ. త. అ-న-క్-కాల్. అయితే.

పో.చూ. అయినాక, అయినవెనుక, ఆవెనుక.

**ఆనకట్ట** చూ. ఆను[1]. వి. నదికి అడ్డంగా కట్టిన కట్ట.

క. అణెకట్టె, అణెకట్టు ; తు. అణెకట్టు ; త. అణె-క్-కట్టు. ఆనకట్ట, అణై. గట్టు.

మూ.ద.ద్రా. ఆణ్-/* అణ్-.

**ఆనగ** రూ.చూ. ఆనబ. వి. పొలాలగట్టునా, పెరళ్లలోనూ పెంచే తీగెపైరు (Bottle gourd lagemaria volgaris).

**ఆనగోలుపోవు** చూ. ఆన[2].

**ఆనతి** చూ. ఆన[1]. వి. ఆజ్ఞ, అనుమతి. 7 శతా. రామేశ్వరం (కడప) శాసనం, విక్ర. 1.154.

నం. ఆజ్ఞప్తి, ఆజ్ఞ ; ఆజ్ఞప్త. ఆజ్ఞాపించిన ; ప్రా. పా. ఆణత్తి. ఆజ్ఞ ;

క. ఆణతి ; త. ఆణత్తి ; మ. ఆణ.

< ప్రా. ఆణత్తి-.

**ఆనతియిచ్చు** రూ. ఆనతిచ్చు. స.క్రి. ఆజ్ఞాపించు.

**ఆనతియిచ్చు** చూ. ఆనతి.

**ఆనప** వి. సొరపాదు.

**ఆనపకాయ** వి. సొరకాయ.

**ఆనపెట్టు** చూ. ఆన[1].

**ఆనపొడుచు** చూ. ఆన[1].

**ఆనబ** రూ. ఆనగ, ఆనప, ఆనబు, ఆనిగం, ఆనిగెం, ఆనుగ, ఆనుగము, ఆగుగు. వి. సొరకాయ (Cucurbita lagenaria).

నం. అలాబు, అలాబుక, అలాబూ ; ప్రా. అలాఊ. అలాఊ ; అమా. అలాఉ, అలాఊ, లాఊ ; పా. అలాపు, అలాపూ, అలాబు, అలాబ్బు, లాపు, లాబు, లాబుక ; శౌర. అలాపూ ;

త. అలాపు, అలావు, అణకం, అళకం.

< నం. అలాబు-.

**ఆనబు** రూ. చూ. ఆనబ వి. సొరకాయ.

**ఆనమాలు** చూ. ఆనవాలు[2]. వి. గుర్తు.

**ఆనవాటిపొలము** వి. గట్లతగాదాల్లో ఉన్న పొలం, హద్దుల గుర్తులులేని పొలం.

**ఆనవాయితి** రూ. ఆనుమాయితి. వి. ఆచారం, సంప్రదాయం.

నం. అను + అయతిః = అన్వాయతిః. మొదటినుంచి వచ్చినది.

< నం. అన్వాయతి-.

**ఆనవాలు[1]** ఆన + పాలు. రూ. ఆనాలు. వి. మరగకాగినపాలు. శృం. నై. 6.124.

< నాన + పాలు ; చూ. నాను.

**ఆనవాలు[2]** చూ. ఆన[2].

**ఆనవాలుపట్టు** చూ. ఆన[2].

**ఆనవైచు** చూ. ఆన[1].

**ఆనవొడుచు** చూ. ఆన[1].

**ఆనవోవు** చూ. ఆన[1].

**ఆనాది** రూ. ఏనాది, యానాది, యేనాది. వి. దక్షిణదేశంలో ఒక తెగవారు.

త. ఏనాతి. రాజు మంత్రికిచ్చే బిరుదం, సేనాని, సైనికుడు, యోధుడు ;

సం. సేనాధిప- ?, సేనాధినాథ ; ప్రా. సేణాహివై ; పా. సేనాపతి.

? < సం. అనాది-. ఆదితెలియని, పురాతనమైన.

**ఆనాలు** చూ. అనవాలు¹. వి. మరగ కాగినపాలు. రాజవా. 2.127.

**ఆనిక¹** చూ. ఆను¹.

**ఆనిక²** రూ. ఆనికి. చూ. ఆఁటు. వి. తగినంత, అధికం. ఉదా.: అన్నం. 'ఆనికి' రాలేదు. అన్నం సరిపోలేదు.
సం. అనేక; ప్రా. అణిక్క, అణెక్క, అణెక, అణక్క; మరా. అణిక. ఎక్కువ.

**ఆనికి** రూ. చూ. ఆనిక². వి. తగినంత, అధికం.
< మరా, ఆణిక.

**ఆనిగం** రూ. చూ. ఆనబ.

**ఆనిగెం** రూ. చూ. ఆనబ.

**ఆనించు** చూ. ఆను¹.

**ఆనితిచ్చు** రూ.చూ. ఆనతియిచ్చు. స.క్రి. ఆజ్ఞాపించు.

**ఆనివెల** వి. మిధున మాసం.
త. ఆని. తమిళ సంవత్సరంలో మూడోనెల.

**ఆనియ** రూ. చూ. ఆణియ. వి. ఒక విధమైన జబ్బు, ఎర్రని దద్దుర్లు.

**ఆను¹** స. క్రి. 1. ఆశ్రయం చేసికొను. ఆశ్రయించు. భాగ. 9.529; 2. అణచు. నరస. 2.47; 3. అడ్డగించు, నిరోధించు. విజయ. 3.149. కవిక, 3.92; 4. సహించు, ఓర్చు. వసు. 3.175; 5. భారమగు. వసు. 3.37; 6. ఆక్రమించు, కమ్ము. వసు. 2.74, దశా. 2.56; 7. అంటు, తాకు. ఇందు. 1.20. నీలా. 1.109; 8. పొందు. సారంగ. చ. 3.59; 9. వహించు, మోయు. ఉ. హరివ. 2.71, దశా. 2.172; 10. గ్రహించు, పట్టుకొను. దశ. 2.192; అ.క్రి. గోచరమగు, కనబడు.
క. అన్, అను. ఆనుకొను, వంగు, గ్రహించు. భరించు, సహించు తు. ఆనిపుని. వంచు, ఆనుకొనచేయు; త. ఆణ్ణు. తలపైగాని మూపుపైగాని మోయు, సహాయపడు, నడిపించు, దారిచూపు; పో. చూ. మ. అణ. ఆధారం, దిండు; కుఇ. ఏణ్బ. తల ఆన్చు; కురు. అన్న్. ఒరపిడిచే నొప్పించు; మాల్తో. అన్ తెల్. దిండుపై ఆనుకొను.
< మూ. ద్రా. *అన్-.
**ఆనిక¹** వి. 1. ఆనుడు, ఆనుకొనటం. చంపూ. 3.86; 2. దార్ఢ్యం. క. అనికె. పట్టుకోవటం మొ., ఆనుకోవటం, ఊతక్ర. **ఆనించు** స.క్రి. 1. నొక్కు. శశా. 2.94; 2. ఆనునట్లుచేయు, మోపు. **ఆనుకంట్లము** వి. ఒక రకం నంచి. హంస. 5.97. **ఆనుకట్టి** రూ. ఆనుగట్టి. వి. ఊత కోల. చెన్న. బ. 2.29. **ఆనుకొను** స. క్రి. 1. వహించు; మోయు. ఉ. హరివ. 2.71; 2. ఆశ్రయంగా చేసుకొను; 3. తాకియుండు. **ఆనుగట్టి** (-కట్టి). రూ.చూ. ఆనుకట్టి. వి. ఊతకోల. **ఆనుట** వి. ఆనుకోవటం. **ఆనుడుకట్ట** వి. అరుగుకు ఒకవైపున ఆనుకోవటానికి పీటుగా కట్టిన దిండు. **ఆనుడుబిల్ల** రూ. చూ. ఆనుడుబిళ్ల. వి. దిండు, బాలీసు. **ఆనుడుబిళ్ల** రూ. ఆనుడుబిల్ల. వి. దిండు, బాలీసు. **ఆనుపానులు** వి. బవ. పుట్టు పూర్వోత్తరాలు. **ఆనువు** వి. ఆనుడు, ఆనిక, దార్ఢ్యం.

**ఆను²** స.క్రి. 1. తాగు. భార. విరా. 2.98, మను. 1.4; 2. తిను. భార. అను. 1.247, మను. 4.98; 3. విను. భాగ. 10. ఉ. 968, కళా. 4.39; 4. ఆఘ్రాణించు. మను. 5.52; 5. రుచిచూచు. దశా. 2.307; 6. అనుభవించు. అ.క్రి. అంగీకరించు.
త. ఆర్. తిను, తాగు, అనుభవించు;
సం. ఆన. నోరు, ముక్కు, శ్వాస.
< మూ.ద్రా. *ఆ-+-న్ లేదా-ర్.

**ఆనుకంట్లము** చూ. ఆను¹.

**ఆనుకట్టి** చూ. ఆను¹.

**ఆనుకొను** చూ. ఆను¹.

**ఆనుగ** రూ.చూ. ఆనబ.

**ఆనుగము** రూ.చూ. ఆనబ. భార. అను. 3.189.

**ఆనుగట్టి** చూ. ఆను¹.

**ఆనుగు** రూ.చూ. ఆనబ.
అనుగు < అనువు < అనుబు. బహుళః < సం. అలాబు. ఇది తెలుగు 'ఆను' ధాతుజన్య పదం కావచ్చు. నేలకు ఆనుకునేది అనే అర్థంలో.

**ఆనుట** చూ. ఆను¹.

**ఆనుడుకట్ట** చూ. ఆను¹.

**ఆనుడుబిల్ల** చూ. ఆను¹.

**ఆనుడుబిళ్ల** చూ. ఆను¹.

**ఆనుపానులు** చూ. ఆను¹.

**ఆనుపుకాయ** చూ. ఆనబ. వి. సొరకాయ.

**ఆనుబద్ద** వి. పెంకు నున్న పరచటానికి కుమ్మర్లు వాడే వల్చని కొయ్యముక్క.

**ఆనుమాయితి** రూ.చూ. ఆనవాయితీ. వి. ఆచారం, సంప్రదాయం.

**ఆనువు** చూ. ఆను¹.

**ఆనె¹** రూ.చూ. ఆణియ. వి. బొబ్బ, దద్దురు. ఆం.భా. 2.131.

**ఆనె²** వి. కొలికి, వదుగులో కింది పోగులూ పై పోగులూ కలిసే చోటు.

**ఆనెకాగు** వి. నీళ్లు కాచే పెద్ద పొయ్యి.

**ఆనెగుంజ** వి. అడ్డపట్టీలు వేయటానికి ఆధారంగా ఉండే వంగల గుంజ.

**ఆనెం** (క్ర) రూ.చూ. అన్నెము. వి. కోరమాను; ఆనెపు అని పిలువబడే ఒక మొక్క; దీని కొయ్య చిన్న చిన్న పరికరాలను చెయ్యటానికి పనికి వస్తుంది.

**ఆనెంక** రూ.చూ. ఆనక. వి. తరువాత.

**ఆందేలజాల** వి. ఆముదపు గింజమీది చారలాటి చార.
ఆందేల < ఆముదాల < ఆముదముల + జాల.

**ఆందేలబట్ట** ఆముదపు గింజలాగ తెలుపుమీద నల్లటి పొడ.
ఆందేల < ఆముదాల < ఆముదముల + బట్ట.

**ఆఁదోఁక** చూ. ఆఁ¹.

**ఆఁదోఁకగా(న్)** చూ. ఆఁ¹.

**ఆఁదోఁకపాటు** చూ. ఆఁ¹.

**ఆఁదోడు** (-తోడు) రూ.చూ. ఆఁడుఁదోడు. వి. సోదరి. కాళిందీ. 3.102. 'ఆడుతోడు'కు సంక్షిప్త రూపం.

**ఆన్నెము** రూ. అనెవు, ఆనెం. వి. కోరమాను (Antedesma bunis)

**ఆపదెడ్డు** వి. ఆంబోతు.

ఆ[5]+పలి+ఎద్దు ?

**ఆపము** రూ.చూ. అప్పము. వి. భక్ష్య విశేషం.

**ఆపరంజి** రూ.చూ. అపరంజి. వి. బంగారం, మేలిమిబంగారం. మెకంజీ. 106, కలువేపల్లె. 229.

**ఆపసోపాలు** వి. జ్వరాదులవల్ల కలిగే అలసట.

<ఆపు[1]+సోప(మ్) < సం. స్వాప-. నిద్రమత్తు, తిమ్మిరి, పక్షవాతం.

**ఆపసోపాలుపడుట** వి. ఉస్సురుస్సురనటం; అలసటతో గాని, బాధతోగాని నిట్టూర్చటం.

**ఆపసోపాలుపడుట** చూ. ఆపసోపాలు.

**ఆపు[1]** రూ.చూ. ఆఁవు. వి. **1.** నిలుపుదల, అడ్డగింత; **2.** మేకు: **3.** సెలవు; **4.** అంత.

క. అపు. అడ్డు, ఆధారం, ఆశ్రయం.

**ఆపు[2]** వి. దగ్గర, అంచు. ఉదా. కొండలాపున (కొండల దగ్గర, కొండల కింద).

<దాపు; 'ఆఁవు' నుంచి అని బ్రౌ.

**ఆపుకోరా** వి. జలపాత్ర.

కా. అబ్ ఖోర; నే. అమ్ఖోరా; హిం. అబ్ ఖోరహ్; గు. అబఖోరో; ఉ. పార. అబ్ ఖోరహ్.

<ఉ. అబ్ఖోరహ్.

**ఆపురు** రూ.చూ. ఊపిరి. వి. ప్రాణం.

**ఆఫ్సెట్టు** వి. కట్టుబడిలో క్రమంగా తగ్గించే తగ్గింపు, పెంచే పెంపు.

<ఇం. Off-set.

**ఆపె** చూ. ఆ[3].

**ఆపేక్ష** వి. ప్రేమ, కోరిక, ఆశంస. సాహిత్య సమీక్ష. 275.

సం. అపేక్షా. ఎదురు చూచుట, ఆశ, కాంక్షించుట; ప్రా. పా. అపేక్ష; నే. ఒ.హిం.గు. అపేక్షా;

క. అపేక్ష; తు. అపేక్షా.

<సం. అపేక్షా.

**ఆపొవనము** రూ.చూ. ఆపోసనము. భోజ. 6.194.

**ఆపొసావము** రూ.చూ. ఆపోసనము.

**ఆపోక** చూ. ఆపోవు.

**ఆపోవు** ఆ[10]+పోవు. అ.క్రి. సంతృప్తిపడు. భార. ఆది. 8.172, ఉద్యో. 2.32.

పో.చూ. త. అ. వర్దిల్లు; అక్కమ్. కలిమి, లాభం;

**ఆపోక** వి. తృప్తి, తనివి.

**ఆపోవనము** రూ. ఆఫోననము, ఆపొసానము, ఆపోసానము. వి. భోజనానికి ముందు తర్వాత పుడిసిట్లో నీళ్ళుపోసికొని అభిమంత్రించి తాగటం; ఆపోశనం.

సం. అపోశన-. (అపః+అశన); అపోశనమ్. మరా. అపోశన;

క. అపోచనమ్; త. అపోచనమ్. మ. అభోజనమ్.

<సం. ఆపోశన-.

**ఆపోసనమెత్తు** అ.క్రి. అభిమంత్రించి పుడిసిటితో నీటిని తాగు.

**ఆపోవవమెత్తు** చూ. ఆపోసనము.

**ఆపోసావము** రూ.చూ. ఆపోసనము.

**ఆప్కారి** రూ.చూ. ఆబుకారి. వి. కల్లు సారాయిలమీద వేసే పన్ను.

**ఆప్పిల్** వి. సీమరేగుపండు. నీలగిరి యాత్ర. పు. 34.

<ఇం. Apple.

**ఆఫారము** వి. అరచేతుల చొక్కా.

<ఇం. Half-arm.

**ఆఫీసు** వి. కచేరీ, కార్యాలయం.

క. అఫీసు; తు. ఆపీసు; త. ఆఫీస్.

<ఇం. Office.

**ఆఫీసరు** వి. ఉద్యోగస్థుడు. నీలగిరి యాత్ర. పు. 4.

<ఇం. Officer.

**ఆబ[1]** వి. **1.** కనుపాప. ఆం. భా. 2.143: **2.** కనురెప్పల వావు.

సం. ప్రా. పా. ఆభా. కాంతి, రంగు. సౌందర్యం, ప్రతిబింబం;

నే. ఒ. హిం. గు. అభా.

<సం. ఆభా.

**ఆబ[2]** వి. తిండి ఆపిని, పేరాస, ఆత్రం.

పో.చూ. త. అవల్. తీవ్రవాంఛ, అత్యాశ; అవా. దురాశ; అవావు. పేరాసపడు; మ. అవల్. కోరిక; అతిక్క. కోరు; తు. అపుల్. పేరాశపడు.

<మూ.ద్రా. *ఆవ్-.

**ఆబద్ధ** చూ. ఆ[5].

**ఆబలు** రూ.చూ. ఆవాలు. వి.బ.వ. ఆవగింజలు.

**ఆబాదా** చూ. ఆబాదు. వి. వ్యవసాయం, వ్యవసాయదారులు.

**ఆబాదీ** చూ. ఆబాదు ? వి. ఊరి ఉమ్మడి భూమి.

**ఆబాదు** వి. వర్ధమానమైనది, జనసాంద్రతగలది, సాగుచేయబడినది, జనావాసం.

నే. అబాదీ. వ్యవసాయ సంబంధి; ఆబాద్. వ్యవసాయం; ఒ. అబాద్. వ్యవసాయం, వాసయోగ్యం; హిం. ఆబాద్. సారవంతం; గు. ఆబాదా. వాసయోగ్యం; మరా. ఆబాద. స్థిరపడినది, సాగుచేయబడినది; అబాదీ, అబాద. సుఖం, కొత్తఊరు; అబాదాని. సమృద్ధి; ఉ. అబాదీ. ఊరిపట్టు, జనసంఖ్య, సంపద; అబాద్. జనావాసం; ఆబాదాని. ధనవంతమై జనసాంద్రతగల ప్రదేశం, సంస్కృతి; ఆబాద. జనావాసం, సమృద్ధి, సాగుచేయబడిన భూమి, నివాస ప్రదేశం, సంపత్తి; పార. ఆబాద; అర. ఆబాద్. వ్యవసాయం.

క. అబాదు. వర్ధమానమైనది, జనసాంద్రతగలది, సాగుచేయబడినది; త. అపాత్చెయ్. ఒక ప్రదేశంలో వ్యవసాయం పెంపొందించి, దాన్ని జనావాసంచేయు.

<ఉ. ఆబాద్.

**ఆబాదుచేయుట** వి. జనావాసంగా చేయటం. త. అపాత్-చెయ్.

**అబాదుచేయుట** చూ. అబాదు.
**అబి** చూ. అబీ. వర్షాకాలంలో వేసిన వరిపంట.
**అబిర** చూ. అ[3].
**అబిరె** చూ. అ[3].
**అబీ** వి. మాగాణి.
హిం. ఉ. పార. అబీ. జలసంబంధి :
<ఉ. అబీ.
**అబుకారి** రూ. అప్కారి, అబ్కారి. వి. కల్లు, సారాయిలమీద వేసేపన్ను.
నే. అబ్కారి, అబ్కారి ; ఒ. అబకారి, అప్కారి ; హిం. ఉ. అబ్కారీ; గు. మరా. అబకారీ ; పార. అబ్- ; అర. అబ్జర ;
క. అబుకారి, అబుకారి, అబ్కారి.
<ఉ. అబ్కారీ.
**అబురి** రూ. అబోరు[2], అబోరు[2], అబ్రూ, అబ్రూబు, అబ్రూయి. వి. పరువు, ప్రతిష్ఠ.
నే. అబ్రు ; ఒ. అబురు ; హిం. అబరూ, అబ్రు, అబరు, అబ్రు, అబ్రూ ; గు. అబరు ; మరా. అబరూ, అబ్రు, అబ్రు, అబరు ; ఉ. అబ్‌రూ ; పార. అబ్‌రూ, అబ్రూ ;
క. అబురు.
<ఉ. అబ్‌రూ.
**అబువ్వ** రూ.చూ. సాబువ్వ. వి. దేవుని నైవేద్యం.
పో.చూ.క. బువ్వ (బూవ). అన్నం ; బాప. అన్నం ; త. పుకా. ఆహారం.
సామి + బువ్వ > సాబువ్వ > అబువ్వ.
**అబూతి** వి. పెనుతిండి, తిండి. ఆం.బా. 2.260.
<నం. అ + భుక్తి-
**అబూతికాడు** వి. తిండిపోతు.
**అబూతికాడు** చూ. అబూతి.
**అబెయ్య** చూ. అ[3].
**అబోర** రూ.చూ. అమవర. వి. ఆవర, పెరుగుగారె
**అబోదు[1]** రూ.చూ. అబోరు[1]. వి. కలుపుమొక్క.
**అబోదు[2]** రూ.చూ. అబురి.
**అబోతు** చూ. అ[3].
**అబోతురాతు** చూ. అ[3].
**అబోతువేయుట** చూ. అ[3].
**అబోతుసారము** చూ. అ[3].
**అబోరు[1]** రూ.చూ. అబోదు. వి. అవురుదుబ్బు ; రెల్లుగడ్డి తెగకు చెందిన కలుపుమొక్క.
**అబోరు[2]** రూ.చూ. అబురి.
**అబ్కారి** రూ.చూ. అబుకారి. వి. కల్లు సారాయిలపై వేసేపన్ను.
**అబ్రూ** రూ.చూ. అబురి.
**అబ్రూబు** రూ.చూ. అబురి.
**అబ్రూయి** రూ.చూ. అబురి.
**అభాసు** వి. హేత్వాభాసం, అక్రమం, మోటు.
నం.ప్రా.పా. ఆభాస-. హేతువులాగా కన్పిస్తూ హేతువు కానిది, విరుద్ధం ; నే. అభాస్ ; ఒ.హిం.గు. అభాస.
క. అబాస, అబాసు, అబాసు. హేత్వాభాసం, లోటు ; త. అపావమ్ ; మ. అభాసమ్. నీచం, అనర్థం, భ్రష్టం.
<నం. అభాస-.
**అమ్[1]-** రూ.చూ. అ[3]-. విం. గోసంబంధి.
**అంబోతు** రూ. అఁబోతు. వి. అచ్చుపెద్దు. కాన. 1407.
**అమ్[2]** రూ. అమ్ము. వి. ఆహారం, అన్నం. బాలభాష.
**అమ్‌పెట్టు** స.క్రి. అన్నంపెట్టు.
**అమ** రూ.చూ. అవము. వి. (కుమ్మరి కుండలు మొ. కాల్చటాని కేర్పరచిన) కావు, ఆవాపం.
**అమజొన్న** వి. పచ్చజొన్నలో ఒక రకం.
**అమడ** వి. 1. ఎనిమిది మైళ్ళ దూరం. భార.శల్య. 1.74 ; 2. పది మైళ్ళ దూరం.
పో.చూ. క. గావద, గావుద. పది లేక పన్నెండు మైళ్ళ దూరం ; పో.చూ. త. కాత, కావత :
పో.చూ. నం. గవ్యూత, గవ్యూతి. దూరం, కొలత.
**అమడకాయ** వి. గోళ్ళగొండి తెగకు చెందిన ఒక రకం కలుపు మొక్క.
**అమణి** రూ.చూ. అమని[1]. వి. శ్రావణ పూర్ణిమ.
**అమతి** వి. 1. నెలవు ; 2. సంఘటనం.
నం. ఆవృత్తి. సంఘటనము ; పా. ఆవత్తి.
<పా. ఆవత్తి.
**అమతికొల్పు** స.క్రి. నెలకొల్పు. ఉంచు. ద్వి. పరమ. 5.389 వ. 8 పం. **అమతించు[1]** అ.క్రి. పుట్టు, కలుగు. భాగ. 10. ఉ. 270, 340. **అమతిలు** రూ.చూ. అమతిల్లు. అ.క్రి. పుట్టు, కలుగు. **అమతిల్లు** రూ. అమతిలు. అ. క్రి. పుట్టు, కలుగు. యయా. 1.28, కువ.చ. 3.110.
**అమతికొల్పు** చూ. అమతి.
**అమతించు[1]** చూ. అమతి.
**అమతించు[2]** స.క్రి. 1. పిలుచు, ఆహ్వానించు. భార.అర. 6.70, అను. 4.122 ; 2. అర్పించు, విందుచేయు. మార్క. 1.72 ; 3. ప్రకటించు. భాగ. 10. ఉ. 270. 4. గౌరవించు, సమ్మానించు. రంగా.చ. 2.212.
నం. ఆమంత్ర్. పిలుచు. ఆహ్వానించు. అభినందించు ; ప్రా. ఆమంతణం, ఆమంతియ. ఆమంత్రితుడు ; ఆమంత. ఆహ్వానించు ; పా. ఆమంతన. పిలుపు, ఆహ్వానం, అభినందనం ; ఆమంత. ఆమంత్రితుడు ; ఆమంతి. ఆమంత్రించు ; ఒ.హిం. ఆమంత్రణ. ఆహ్వానం.
<నం. ఆమంత్ర్.
**అమతింపు** వి. పిలుపు, ఆహ్వానం, విందు. కలివేల్పు. క.
**అమతింపు** చూ. అమతించు[2].
**అమతిలు** చూ. అమతి.
**అమతిల్లు** చూ. అమతి.
**అమదని** రూ. అమదను, అముదని. వి. రాబడి, దిగుమతి, ఆదాయం.
ఒ.గు. ఆమదాని ; హిం. ఆమదని ; ఉ.పార. ఆమ్దనీ ;
క. అమదు.

<ఉ. ఆమ్దనీ.

**ఆమదవ** రూ.చూ. ఆమదని.

**ఆమదము** రూ.చూ. ఆముదము. వి. **1.** ఆముదంచెట్టు ; **2.** ఆముదంనూనె ; **3.** దండుగ. అర్థవిపరి.

**ఆమదురప్తు** రూ.చూ. ఆమదొరప్తు. వి. ఆదాయవ్యయాలు.

**ఆమదొరప్తు** రూ.. ఆమదురప్తు. చూ. ఆమదని. వి. ఆదాయ వ్యయాలు ; రాబడి, పోబడి.

హిం. ఆమ్‌దరఫ్త్. రాకపోకలు ; ఉ.పార. ఆమ్‌దొరఫ్త్.

<ఉ. ఆమ్‌దోరఫ్త్.

**ఆమవి**[1] రూ. ఆమణి. వి. **1.** వసంతం. కు.సం. 4.186, పారి. 3.51 ; **2.** పంట కోసి జాగ్రత్త పెట్టించటం. ఆం.భా. 3.51 ; అవ్య. అధికంగా. హరి.పూ. 8.91. శేష. 1.92 ; విశే. **1.** అధికం, మిక్కుటం. హర. 3.93 ; **2.** తృప్తికరం. యయా. 4.13.

సం. శ్రావణ-. ఒక నెల పేరు ; శ్రావణీ. శ్రావణ పూర్ణిమ ; ప్రా. సావణ ;

క. అవణి, ఓణమ్. శ్రవణానక్షత్రం ; త. అవణి. శ్రావణం ; మ. అవణి, ఓణం. శ్రవణం ; బ్రా. హామేన్. పంటకోత, పునాసకొన్న ; పో.చూ. హామేన్. వేసంగి.

<సం. శ్రావణీ.

**ఆమవిచెలి** చూ. చెలి. వి. మన్మథుడు. సాంబ.దేవ. 8.

**ఆమవి**[2] వి. భయం, వ్యాకులత.

**ఆమవిచెలి** చూ. ఆమని[1].

**ఆమంద(ము)** చూ. ఆ[5].

**ఆమళ్ళు** వి. ఒక రకం అడవి ధాన్యం.

**ఆమము** రూ.చూ. ఆవము. వి. కుమ్మరి కుండలు మొ. కాల్చటాని కేర్పరచిన కావు, ఆవాపం.

**ఆమవడ** రూ. ఆవడ[2]. ఆమ్‌వడ, ఆబోడ. వి. **1.** పెరుగులో నానవేసిన గారె ; **2.** మజ్జిగపులుసు మొ. వాటిలో నాన వేసిన వడ.

సం. అమ్లమ్. పులుపు ; వట, వటక. నేతిలో వేయించిన గారె ; ప్రా. వడగ ;

క. అమవడె, అంబొడె, ఆంబోడి ; తు. అమ్‌బొడె ; త. అమ్‌వదై.

<సం. ఆమ్ల-+వడ.

**ఆమాని** చూ. అమాని. వి. **1.** ప్రభుత్వయాజమాన్యం ; **2.** ప్రభుత్వయాజమాన్యంకింది భూమి. మెకంజీ. 1. కొండపీడు. 32.

**ఆమాలు** రూ.చూ. అమలు[1]. వి. **1.** ఆచరణ, పరిపాలన, ఆచరణలోకి తేవటం ; **2.** విచారణ ; **3.** స్థానం, పదవి. మెకంజీ. 2. పెదపూడి. పు. 18.

**ఆమావ** రూ.చూ. అమవస.

**ఆమి** చూ. ఆము[1].

**ఆమిక** చూ. ఆము[1].

**ఆమించు** చూ. ఆము[1].

**ఆమిత** రూ.చూ. ఆమెత. వి. విందు, పిలుపు.

**ఆమితి** రూ.చూ. ఆమెత. వి. విందు.

**ఆమిదము** రూ.చూ. ఆముదము.

**ఆమిదెము** రూ.చూ. ఆముదము.

**ఆమినికూలి** చూ. ఆమని[1]. వి. నాట్లపనికూలి, ఊడుపుకూలి.

**ఆమిషము** రూ. హామిషము. వి. రాబడి, ఆస్తి, విలువ, ఉత్పత్తి సాధనాలు, ఉత్పత్తిమొత్తం.

సం. ఆమిష-. మాంసం, ఎర, భోగ్యవస్తువు, భోగం, లాభం ;

క. అమిష. మాంసం, లంచం, కానుక, భోగ్యవస్తువు. కామం, కోరిక, సంభోగం ; త. అమిటుమ్. ఆహారం ; పో.చూ. మ. ఆమిషం. మాంసం.

<సం. ఆమిష-.

**ఆమీన** రూ.చూ. అమీన. వి. కోర్టుగుమాస్తా.

**ఆమీల్** రూ.చూ. ఆమీలు.

**ఆమీలు** రూ. ఆమీల్. వి. అధికారి, పర్యవేక్షకాధికారి. మెకంజీ. 1. కొండవీడు. 2.28.

హిం.మరా.ఉ.పార.అర. ఆమిల్. అధికారి, ఉపాధ్యాయుడు ;

పో.చూ. క. అమిల.

<ఉ. అమిల్.

**ఆము**[1] రూ. హాము. వి. **1.** మదం, గర్వం. భీమ. 2.55 ; **2.** (ఏనుగు) మదజలం. యయా. 1.83 ; క్రి.విశే. అధికంగా, దట్టంగా. రాజవా. 3.84.

సం. అహమ్ ; పా. అహన్ ;

మరా. ఆహమ్.

<?సం. అహమ్. లోపదీర్ఘతలు.

**ఆమి** వి. మదం, గర్వం. సీతావి. 4.21, శతకంఠ. 4.21. **ఆమిక** రూ. హామిక. వి. మదం, గర్వం. విజయ. 5.42. <ఆము[1]+-ఇక. **ఆమించు** అ.క్రి. గర్వించు. దశా. 8.162. <ఆము[1]+-ఇంచు. **ఆముకవియు** అ.క్రి. **1.** మిక్కిలి వ్యాపించు, కమ్ముకొను. రామా. 6.107, పాండు. 2.152 ; **2.** మదమెక్కు, కొవ్వు. విజయ. 3.28, సారంగ.చ. 1.68. **ఆముకొను** అ.క్రి. **1.** బలియు, కొవ్వు. హరి.పూ. 8.91 ; **2.** అలముకొను, వ్యాపించు. ఘటికా. 2.146 ; **3.** గాఢమగు, అధికమగు. సురా. 146 ; స.క్రి. కవియు, పైకొను. కృ.శకు. 3.92. **ఆముటేనుగు** వి. మదపుటేనుగు. రసిక. 1.2. **ఆమునీరు** వి. (ఏనుగు). మదజలం. అచ్చ.రా. 1.7.

**ఆము**[2] వి. ప్రజ.

హిం. ఆమ్. సర్వసామాన్యమైన ; గు. అమ ; మరా. ఆమ్ ; ఉ. అమ్మః, ఆమ్ ; పార. అమ్మహ్ ; అర. ఆమ్మః ;

బ్రా. ఆమ్. (>అర. ఆమ్మ ; పో.చూ. ఆలమ్ ప్రజ, కుటుంబం).

<ఉ. ఆమ్.

**ఆము**[3] స.క్రి. కప్పు, కమ్ము.

<అలము. లోపదీర్ఘతలు.

**ఆముట** వి. కప్పటం, కమ్మటం.

**ఆము**[4] రూ. చూ. ఆవము. వి. (కుమ్మరి కుండలు మొ. కాల్చటాని కేర్పరచిన) కావ, ఆవాపం.

**ఆమువడుగు** వి. ఆవానికి ముందుండే చదునునేల. **ఆముసాల** వి. ఆవం పైనవేసిన పూరిపాక.

<ఆము[4]+సాల <నం. శాలా.

**ఆము**[5] రూ.చూ. నాము. వి. జొన్న మొ. వాటి కొయ్యగాలున చిగిర్చిన మొలక. లేత జొన్నపైరు (ఇది మేసిన పశువులు ఉంగిడి రోగం తగిలి చనిపోతాయి).

**ఆముకవియు** చూ. ఆము[1].

**ఆముకాపు** చూ. ఆము[1].

**ఆముట** చూ. ఆము[3].

**ఆముటేమఁగు** చూ. ఆము[1].

**ఆముదం** వి. సేనం మొన.

**ఆముదవి** రూ.చూ. ఆమదని.

**ఆముదపుచెట్టు** చూ. అముదము.

**ఆముదపులొట్ట** చూ. ఆముదము.

**ఆముదము** రూ. ఆమదము, అమిదం, ఆమిదము, ఆమిదెము, ఆయిదము[2], ఐందమ్. వి. **1.** ఆముదంచెట్టు. కాశీ. 8.284 ; **2.** ఆముదంనూనె. ఆం.భా. 2.258.

క. ఆమండ, అమండ, అవుడల, అవుడ్ల, అవుండ్ల, ఆడలు ; కొడ. అణకెమర, అణకెణ్ణె ; తు. అలుంబుడ, అలుంబుడె ; త. అమణక్కు, ఆమంటుమ్, ఆటుమ్, అతళాయ్ ; మ. అమణక్కు ; కోట. అమండ్ ; తొ. ఒముల్గ్ ; కొలా. ఆమెద, అమెద్ద ;

పో.చూ. నం. అమండ-, ఆమండ(క)-, ఏరండ, పండ ; దే.ప్రా. అమండమ్ ; పా. ఎరండ, ఎలండ ;

హిం. అరండ్. ఎరండ, రేండ.

**ఆముదపుచెట్టు** వి. ఆముదంచెట్టు. **ఆముదపులొట్ట.** వి. ఎండిన ఆముదపు చెట్టు బోదె. **ఆముదాలు** వి. ఆముదం గింజలు.

**ఆముదపులొట్ట** చూ. ఆముదము.

**ఆముదాలు** చూ. ఆముదము.

**ఆముపీరు** చూ. ఆము[1].

**ఆముపడుగు** చూ. ఆము[4].

**ఆముసాల** చూ. ఆము[4].

**ఆమె** చూ. ఆ[3].

**ఆమెత** రూ. ఆమిత, ఆమితి. చూ. ఆమతించు. వి. విందు, భోజనం. భార.అను. 4.122, మను. 2.11.

నం. ఆమంత్ర-. విందుకు పిలుచుట ; ప్రా. అమంతణ ; పా. అమంతరా ;

క. అవుతణ, అవుతన.

<ప్రా. ఆమంత-. అనునాసిక్య లోపం.

**ఆమేజాధారము** చూ. ఆమేజు.

**ఆమేజు** విణ. కలిసిన, వి. కలగలుపు.

హిం. ఉ. అమెజ్. కలిసిన ; పార. ఆమెజ్. కలగల్పు.

<ఉ. ఆమేజ్.

**ఆమేజాధారము** వి. ఒకటికంటె ఎక్కువగా నీటివసరులున్న పొలం (వ్య. వివిధాధారాలు కలది). **ఆమేజుగా** అవ్య. తికమకగా.

**ఆమేజుగా** చూ. ఆమేజు.

**ఆమ్దావబండి** వి. రెండు నొగలబండి.

**ఆంపెట్టు** చూ. ఆమ్[3].

**ఆంబురము** వి. దాడు. వేంక.పంచ. 1.687.

నం. ఆమ్ర-. మామిడిచెట్టు, మామిడిపండు ; అమ్ల-. చింతచెట్టు, పులుపు ; ప్రా. అంబిర (<ఆమ్ర). మామిడిపండు : అంబిల. పులుపు ; అ.మా. అంబిల ; పా. అంబిల ;

క. ఆంబర, ఆమ్రబ. దారు ; త. అంపిరమ్. పులుపు, చింతపండు ; ద్రా. అంబ్, అంబు. మామిడి ;

లా. అమరస్ ; హై.జ. అంప్ఫర.

<ప్రా. ఆంబిర. పులుపు రెంటికీ సామాన్యం కాబట్టి 'అంబిల' లో తారుమారు.

**ఆంబోతు** చూ. ఆమ్[1].

**ఆమ్మ** ఆ+అమ్మ. వి. పెత్తల్లి, పెద్దమ్మ, దొడ్డమ్మ.

**ఆమ్మ** రూ.చూ. ఆమ్[2]. వి. ఆహారం (బాలభాష).

**ఆమ్లా** చూ. అమలు[1]. వి. పరిపాలన.

**ఆమ్లాతు** చూ. అమలు[1]. వి. పరిపాలన.

**ఆమ్వడ** రూ.చూ. ఆమవడ. వి. పెరుగుగారె.

**ఆఁపు** చూ. 'ఆఁగు' ప్రేరణార్థకం. స.క్రి. **1.** ఆగచేయు, నివారించు, అడ్డగించు. భార.సభా. 2.248 ; **2.** తన అధీనంలో ఉంచుకొను. పండి.చ.పురా. 115. వ. ; రూ. ఆపు[1]. వి. **1.** ప్రతిబంధకం. ఇందు. 5.19 ; **2.** ఆపటం, నిలబెట్టటం.

క. అపు (అనివు). ఆధారం, నిరోధం ; త.మ. అప్పు. మేకు.

**ఆఁపువెట్టు** (-పెట్టు). స.క్రి. ఒకరికోసం ఆపిఉంచు, ప్రత్యేకించిఉంచు. వేంక.పంచ. 3.2. **ఆఁపువేయుట** వి. ఆపటం. **ఆఁపుసేయు** (-చేయు). స.క్రి. **1.** బంధించు, కట్టివేయు. అని. 3.120 ; **2.** నిరోధించు, ఆటంకపరచు ; **3.** నిలిపిఉంచు.

**ఆఁపువెట్టు** చూ. ఆఁపు.

**ఆఁపువేయుట** చూ. ఆఁపు.

**ఆఁపుసేయు** చూ. ఆఁపు.

**ఆఁబిడ్డ** చూ. ఆఁ[1].

**ఆఁబసి** చూ. ఆఁ[1].

**ఆఁబెచ్చు** చూ. ఆఁ[1].

**ఆఁబెయ్య** చూ. ఆఁ[1].

**ఆఁబెరుగు** చూ. ఆఁ[1].

**ఆఁబేయ** చూ. ఆఁ[1].

**ఆఁబోతు** చూ. ఆఁ[1].

**ఆఁబోతురవుతు** చూ. ఆఁ[1].

**ఆఁబోతుసొరము** చూ. ఆఁ[1].

**ఆయ** చూ. అయ్య. అవ్య. అవును. చిత్తం.

**ఆయక** చూ. ఆ[3].

**ఆయకట్టు** చూ. ఆయము[2].

**ఆయకము** రూ. ఆహకము. వి. 1. కుదువ, తాకట్టు; 2. కుదువపెట్టిన ఆస్తి.

సం. ఆయ-. ఆదాయం. పా.? ఆయ. పన్ను, లాభం, ఆదాయం;

పో.చూ. త. అయక్కమ్. మొత్తం సంఖ్య.

<సం. ఆయక-.

**ఆయకాఁడు** చూ. ఆయము[2].

**ఆయకుడుము** వి. ఆవిరి కుడుము.

**ఆయక్క** చూ. ఆ[3].

**ఆయగము[1]** వి. గజాశ్వాదులమీద పరచే చిత్ర కంబళం. కు. సం. 8.25, 12.784.

సం. అజికమ్. మేకల మంద; అజ-. మేకలకు సంబంధించిన; ప్రా. అయ, అయగ. మేక బొచ్చుతో తయారుచేసిన వస్త్రం; అ.మా. అయగ;

క. అజిక. మేకల మంద.

<ప్రా. అయగ-.

**ఆయగము** రూ.చూ. ఆయుగము. వి. కత్తిపిడి. కు.సం. 8.25.

**ఆయతము** రూ. ఆయిత, ఆయితము, ఆయిత్తము. వి. 1. సాహస కృత్యం; 2. ప్రయత్నం.

సం. ప్రా. ప. ఆయత్త. ఆధీనం, సిద్ధం;

హిం. అయత్త;

క. ఆయత్త. సిద్ధం; త. మ. అయత్తమ్.

<సం. ఆయత్త-.

**ఆయతి** చూ. ఆయము[2]. వి. 1. శరీరంలో ముఖ్యాంగం; 2. రాబడి; 3. జ్యేష్ఠాదిమాన చతుష్టయం, కందాయం.

సం. ఆయతి. నిడుపు, ప్రభావం, భవిష్యత్కాలం, ఫలదానకాలం, ప్రాపణం, కూడిక, పని; పా. ఆయతి. ఆయామం, నిడుపు; ఒ. అయతి, అయత్తి. విస్తారం.

<సం. ఆయతి. అర్థవిపరి.

**ఆయతికాఁడు** వి. రాజాదాయ రక్షకుడు, కోశాధ్యక్షుడు. భార. శాంతి. 2.368, ఆము. 4.218.

**ఆయతికాఁడు** చూ. ఆయతి.

**ఆయది** చూ. ఆ[3].

**ఆయన్** చూ. ఆవు. వి. గొర్రెల కాపరి.

త. అయన్. గొర్రెల కాపరి; మ. ఆయన్. ఆవుల కాపరి, వైశ్యుడు.

<త. ఆయన్.

**ఆయవ** చూ. ఆ[3].

**ఆయవ** చూ. ఆ[3].

**ఆయవఱచు** చూ. ఆయము[2].

**ఆయపిల్లు** చూ. ఆయము[1].

**ఆయంపాయం** వి. అండదండ, రక్షణ.

**ఆయమ** చూ. ఆ[3].

**ఆయము[1]** వి. 1. మర్మస్థానం, ఆయువుపట్టు. భార. విరా. 2.347, పాండు. 3.53; 2. మర్మం, రహస్యం. కళా. 1.40; 3. వివరాలు; 4. గది, అంతఃపురపు కావలి వాడు; 5. ఆభరణం; 6. వయస్సు.

క. అయ. లోపలి భాగం, రహస్యం, మర్మం, మర్మావయవం, వివరాలు, శరీర భాగం. రొమ్ము; త. ఆయం. రొమ్ము.

పో.చూ. సం. ఆయుస్. శక్తి, ఆరోగ్యం, ఆయుర్దాయం; ఆయ. అంతఃపురం కావలివాడు.

<సం. ఆయ-.

**ఆయపిల్లు** వి. గది, లోపలి గది. **ఆయిల్లు** వి. ఇంటి మధ్య గది.

**ఆయము[2]** వి. గ్రామ వృత్తులవారికి కల్లంలో మామూలుగా ఇచ్చే ధాన్య భాగం. అర్థవిపరి.

సం. ప్రా. పా. ఆయ-. ప్రాప్తి, లాభం, రాబడి; నే. హిం. ఆయ;

పో.చూ. క. అయ్, అయి, ఆయు, ఆదు. అయ్దు, అయ్కుళి; తు. ఆయ. ప్రాప్తి. త. ఆయమ్. ఆదాయం. లాభం; మ. ఆయమ్. పో.చూ. ఆయ్క.

<సం. ఆయ-.

**ఆయకట్టు** వి. 1. శాశ్వత కర నిర్ణయం. హంస. 4.29; 2. ధర, ప్రమాణం, నిర్ణీత సంఖ్య; 3. భూపరిమితి, భూవైశాల్యం, పొలంలోని వివిధ భూసారాల వివరం; 4. ఒక గ్రామంలోగానీ, చెరువు కిందగానీ ఉన్న సాగు భూమి. క. ఆయక్కట్టు. ప్రామాణిక స్థితి, అనుగుణ్యం, ఔచిత్యం, ఒక గ్రామంలోగానీ చెరువు కిందగానీ ఉన్న సాగుభూమి; అయ. కొలత; తు. ఆయకట్టు, ఆయికట్టు; త. ఆయక్కట్టు. ఒక చెరువు కింది సాగుభూమి, ఒక గ్రామంలో ఉన్న భూపరిమాణం, కపటోపాయం, అసత్య ప్రకటన; మ. ఆయకెట్టు. శాశ్వతకర నిర్ణయం, పన్ను అంచనా పట్టిక. <సం. ఆయ-+తె. కట్టు. (ఆదాయ నిర్ణయం). **ఆయకాఁడు** వి. తాను రైతుకు చేసిన సేవకు ప్రతిఫలంగా కళ్లంలో ధాన్యం కొలుచుకునే చాకలి, మంగలి, వెట్టి మొ. గ్రామోద్యోగి. క. ఆయగార. వంశ పారంపర్యంగా ఉండే గ్రామోద్యోగి; పో.చూ. అయి; అయ్. పోగుచెయ్యటం; అయ్కుళి, అయికుళి. బిచ్చగాడు, ఎంపిక, త. ఆయక్కారమ్. పన్ను వసూలు చేసేవాడు;

పా. ఆయకమ్మిక. కోశాధికారి. **ఆయవఱచు** స.క్రి. సాగుబడిచేయు.

**ఆయమ్మ[1]** చూ. ఆ[3]

**ఆయమ్మ[2]** చూ. ఆయా[2].

**ఆయయి** చూ. ఆ[3].

**ఆయర్లు** (-అర్లు). పో.చూ. అరులు. వి. వాత్సల్యం.

ఆ-య్-అరులు. ఆ. స్వార్థంలో నిర్దేశార్థకం.

**ఆయలె** రూ. ఆయలే. అవ్య. అనాదర సూచకం. ఆము. 5.133, దశా. 4.120.

< ఆయతే < ఆయెతే < ఆయెన్ + తే: ఆయితే మానెలే.

**ఆయలే** రూ.చూ. ఆయలె. అవ్య. అనాదర సూచకం.

**ఆయవారపుసంచి** చూ. ఆయవారము.

**ఆయవారము** రూ. ఆయివారము, ఆయువారము. వి. ముష్టి

ఎత్తుకోటం, పిడికెడు దోసెడు బొప్పున ధాన్యం అడుక్కోటం. భాగ. 7.410.

నం. యాయావర-. నిరర్థకంగా తిరగటం, బిచ్చగాడు ; హిం. యాయావర ;

క. యాయవర, యాయావర. బిచ్చం, బిచ్చగాడు.

<నం. యాయావర-.

ఆయవారపుసంచి వి. బిచ్చగాడి జోలె. త్రై. భా. 7.197.

**ఆయమంకము** వి. పన్నులవల్ల వచ్చే ఆదాయం.

నం. ఆయ-. (ఆదాయం)+తె. సుంకము <నం. శుల్కమ్.

**ఆయా**[1] చూ. ఆ[3].

**ఆయా**[2] వి. దాది, దాసి, సేవకురాలు.

నే. హిం. ఆయా. దాది ; అ. బెం. ఒ. గు. మరా. అయ ; సిం. ఆయ, అఈ ; ఉ.పార.అర. దాయ. మంత్రసాని, దాది ; కొంకణి. ఆయ ;

ఆంగ్లో ఇండి. *ayah* ; ఇం. *ayah*. దాది ; పోర్చు. *aia* ; ఇండోపోర్చు. *daia*. మంత్రసాని.

<పోర్చు. Aia.

ఆయమ్మ[2] వి. దాది, దాసి.

**ఆయాయి** చూ. ఆ[3].

**ఆయి**[1] వి. గాయం, బాధ. బాలభాష.

నం. ఆధి. దురదృష్టం, ఆపద ; ప్రా. అహి. మానసిక వ్యధ ; అప. ఆయ. ఆపద.

<ప్రా. ఆహి.

**ఆయి**[2] రూ.చూ. అయ్యి. వి. నెయ్యి. బాలభాష.

**ఆయి**[3] వి. యుక్తవయస్సు, జీవశక్తి, ఓజస్సు.

నం. ఆయు-. సజీవం, చరం, జీవితం, జీవితకాలం ; ప్రా. ఆఉ, ఆయు. జీవితం ; అమా. ఆయ. (ఆత్మన్) ; అత్మ. జీవితం ; ఆయు. జీవితం ;

గు. ఆయ. ధైర్యం, బలం.

<ప్రా. ఆయు.

**-ఆయి**[4] ప్రత్య. ఆదర ద్యోతకమైన స్త్రీవాచక ప్రత్యయం. అమ్మ+ఆయి. అమ్మాయి, గంగ+ఆయి. గంగాయి, మొ. చిత్ర. భా. పీఠిక. 24.

క. ఆయ్, అయ, అయి. తల్లి ; తు. అయ ; త. ఆయ్, ఆయాళ్, ఆయి, యామ్. తల్లి; పో.చూ. తాయ్; మ. తాయి ; గో. యాయి ; కొండ. ఆయ ; కుఇ. అజి, ఇఅ, ఇజ, ఇజాలి, ఐఅ, ఐఅలి. తల్లి, స్త్రీ ; కువి. ఇజి, త్య. తల్లి ; ఐఅ. స్త్రీ ; పర్జి. అయల్. స్త్రీ, భార్య. ఇయ. తల్లి ; కొలా. అయ్ ; నా. ఆయ్మ ; ఒల్లా. ఆయ. తల్లి ; అయల్. స్త్రీ, భార్య ; కురు. అయంగ్, ఆయో; తల్లి ; యో. ఫలానావాని తల్లి ; మాల్తో. అయ్యు. నా తల్లి ; బ్రా. అఈ. తల్లి, సోదరి, కుమార్తె, పూజ్యస్త్రీ సంబోధన.

<మూ.ద్రా. *ఆయ్.

**ఆయి**[5] చూ. ఆవి. వి. ఆవిరి.

**ఆయిటి** వి. బూరుగుచెట్టు (Erodendron anfractuosum). ఆవిరివలె తేలిపోయే పింజెలుకలది-అని కావచ్చు.

ఆయిటిదూది వి. బూరుగుదూది. ఆము. 6.62.

**ఆయిటిదూది** చూ. ఆయిటి.

**ఆయింట** వి. తెల్లటి పూలుపూసే ఒక రకం కలుపుమొక్క. (Gyanandropsis pentaphylla).

**ఆయిత** రూ.చూ. ఆయతము. వి. సిద్ధం.

**ఆయితము** రూ.చూ. ఆయతము. విఽ. సిద్ధం. భార.ఉద్యో. 1.49.

**ఆయితి** రూ.చూ. ఆయితు.

**ఆయితు** రూ. ఆయితి, ఆయిత్తు, ఐతి. విఽ. 1. తగినది. చెన్న. బసవ. 4.334 : 2. సాధ్యం.

క. ఆయత. ఔచిత్యం ; అయత్త. సిద్ధం.

<క. ఆయత.

**ఆయిత్తపడు** చూ. ఆయిత్తము.

**ఆయిత్తపాటు** చూ. ఆయిత్తము.

**ఆయిత్తము** రూ.చూ. ఆయతము. విఽ. సిద్ధం.

ఆయిత్తపడు అ.క్రి. సిద్ధపడు, ఆయిత్తపాటు వి. సిద్ధంగా ఉండటం. వరమ. 2.

**ఆయిత్తు** రూ.చూ. ఆయితు. విఽ. యుక్తం, సాధ్యం.

**ఆయిదము**[1] వి. కత్తి. మొ. యుద్ధ సాధనం.

నం. ఆయుధ-. అస్త్రం. సాధనం ; ప్రా. అ.మా. ఆఉహమ్ ; పా. ఆవుధ ; అప. ఔహు ;

తు. ఆయిద ; త. ఆయుతమ్.

<నం. ఆయుధ-.

**ఆయిదము**[2] రూ.చూ. ఆముదము.

**ఆయిదారు** చూ. వాయిదార్. వి. మేకు మొన.

**ఆయిందా** చూ. అయింద. క్రి.విఽ. ఇకముందు, ఇప్పటినుండి, వచ్చేసారి.

హిం. ఆయిందా. భవిష్యత్తు ; ఉ. ఆయందా, ఆయిందా ; పా. ఆయంద, ఆయింద.

<ఉ. ఆయందా.

**ఆయిబు** వి. వెన్నుగాడి మొ. పోటీ, నూల.

హిం. ఉ. అర. ఐబ్. దోషం ; పార. ఐబో. దోషం.

**ఆయిలింపొయ్యి** వి. ఒకేద్వారం, ఆరు రంధ్రాలున్న జంట పొయ్యి.

**ఆయిల్లు** చూ. ఆయము. వి. ఇంటి మధ్యగది.

**ఆయివారము** రూ.చూ. ఆయవారము. వి. ముష్టి.

**ఆయీ** వి. పూజ్యురాలు.

**ఆయీనజమా** చూ. జమా. వి. మొత్తం.

పో.చూ. నం. ఆయన-. మార్గం ; ప్రా. ఆయణ. ప్రాప్తి, లాభం, నిర్ణయం ; పా. ఆయన. మార్గం. గమ్యం :

హిం. ఐన్. వాస్తవం, పూర్తి ;

పో.చూ. ఉ. అజ్మ ఆఈన్. మొత్తం; పార. ఆయీన్. నిర్ణయం, విధం.

పో.చూ. క. జమా, జమె. రాబడి, ప్రోగుచేయబడినది.

<ఉ. అఈన్+జమా.

**ఆయుదము** చూ. ఆయిదము[1]. వి. కత్తి మొ. యుద్ధసాధనం.

**ఆయుగము** రూ. ఆయగము[2]. వి. కత్తిపిడి. కు.నం. 9.224.

పో.చూ. సం. ఆయోగ. ఖడ్గాలంకారం; పో.చూ. ప్రా. ఆఓగ్గ, ఆఓగ. సాధనం;

క. ఆయుగ (<సం. ఆయోగ-) కత్తిపిడి; పొన్నా యుగ. బంగారు కత్తిపిడి.

<సం. ఆయోగ-.

**ఆయువారము** రూ.చూ. ఆయవారము. వి. ముష్టి.

**ఆయుష్కర్మము** వి. క్షురకర్మ, క్షౌరము.

సం. ఆయుస్ + సం. కర్మన్. ఆయుర్వృద్ధికోసం చేసే పని. నిత్యం క్షౌరం చేసుకోవటంవల్ల ఆయుర్దాయం పెరుగుతుందని నమ్మకం;

క. ఆయుష్కర్మ.

<సం. ఆయుష్కర్మ-.

**ఆయుష్కర్మశాల** వి. మంగలిదుకాణం. <సం. ఆయుష్కర్మశాలా. **ఆయుష్కర్మాగారము** వి. మంగలిదుకాణం. <సం. ఆయుష్కర్మాగార-.

**ఆయుష్కర్మశాల** చూ. ఆయుష్కర్మము.

**ఆయుష్కర్మాగారము** చూ. ఆయుష్కర్మము.

**ఆయ్యె** చూ. అ[3].

**ఆర్-** రూ.చూ. ఆఱు[3]. విశే. సమస్త పదాల్లోమాత్రమే హల్లుకు పూర్వం ప్రయుక్తం.

**ఆర్గురు** రూ.చూ. ఆఱుగురు. వి. ఆరుమంది మనుష్యులు. భాగ. 10, పూ. 151. **ఆర్నెల్లు** వి. ఆరు నెలలు. కాశీ. 5.262. **ఆర్మడి** వి. అయోమయం, తబ్బిబ్బు. **ఆర్మూడు** వి. ఆరు మూడు కావటం, క్షీణించటం. **ఆర్వురు** రూ.చూ. ఆఱుగురు. **ఆర్వేలవారు** రూ. ఆఱువేలవారు. వి. పూర్వం రాజోద్యోగాల్లో నియుక్తులైన ఒక తెగ తెలుగు బ్రాహ్మణులు. ఉ.రా. 1.27. క. ఆర్వేలి. తెలుగు దేశంలో ఒక ఊరి పేరు; ఆర్వేలి బ్రాహ్మనరు; ఆ ఊరియందలి ఒక తెగ స్మార్త బ్రాహ్మణులు; శాస్త్రేయులు.

**-ఆర** రూ.చూ. ఆరా[4]. అవ్య. సంబోధనలో అంతాగమం (బ.వ.).

**-ఆర(న్)** ఆరు[1] ధాతువుయొక్క తుమున్నర్థక రూపం, కొన్ని విశేష్యాలకు అంతాగమంగా వచ్చే ప్రత్యయం. అవ్య. ఎక్కువగా, నిండా, తృప్తికరంగా: కన్నార(న్), కన్నులార(న్). భార.ద్రోణ. 2.254.

క.తు. త. ఆరె. నిండా, పూర్తిగా.

**ఆరం**[1] వి. రాళ్ళను చెక్కే ఉలి.

**ఆరం**[2] వి. సుంకు, కంకిగింజలమీద నూగునూగుగా పట్టిన పూత.

**ఆరక** రూ.చూ. ఆరిక. వి. సస్యవిశేషం.

**ఆరకాటి** రూ. అర్కాటి, ఆర్కాటి. వి. కర్ణధారుడు, ఓడ నడిపేవాడు.

త. ఆఱు-కాట్టి. మార్గదర్శకుడు; ఆఱు-. మార్గం. కాట్టి. దర్శకుడు; మ. ఆఱు. మార్గం; కాట్టుక. చూపు.

<త. ఆఱుకాట్టి.

**ఆరగాకర** రూ. ఆఁగాఁకర. వి. ముళ్లకాకర (Momordica dioica).

<సం. ఆర-(సూది) + కాకర.

**ఆరహూళ్లు** వి. కేరతిండ్లు ('అరకూళ్లు'కు అపరూపం కావచ్చు).

పో.చూ. క. అర హొట్టె. తనివి తీరని తిండి, అరతిండి; పో.చూ. తు. అరెబంజి; పో.చూ. త. ఇరైవయిఱు.

<అర (సగం) + కూళ్లు (తిండ్లు).

**ఆరగట్టు** రూ.చూ. ఏరుకట్టు. వి. అరక కట్టటానికి ఉపయోగించే పగ్గాలు, పట్టెళ్లు, మోకు, వారిజె, చెలకోల మొ. వాని గుది లేదా కట్టు.

**ఆరగించు** స.క్రి. 1. భుజించు. దార.విరా. 3.229; 2. తాగు. హరి. పూ. 5.237; 3. మింగు. భీమ. 4.72.

సం. ప్రా.పా. అహార-. ఆహారం;

క. ఆర. <సం. అహార-. తిండి; ఆరొగిసు, ఆరోగిసు. తిను; ఆరోగణె, ఆరోగణ. తిండి, తినటం; తు. ఆర. తిండి; పో.చూ. త. ఆర్. తిను, తాగు; కువి. హారోమి. తిండి.

**ఆరగింత** వి. ఆరగింపు. ఆం.భా. 2.260. **ఆరగింపు** వి. 1. విందు. ద్వి. పరమ. 6.455 పు. 10 పం., పరమ. 6.199; 2. భోజనం. ఆం.భా. 2.260; 3. దేవతా నివేదనం, నైవేద్యం.

**ఆరగింత** చూ. ఆరగించు.

**ఆరగింపు** చూ. ఆరగించు.

**ఆరంగ** విశే. ఒకరకమైన పోకచెక్క.

త. అరంగమ్‌పాక్కు. ముక్కలుగా చేసి వండిన పోక చెక్క.

<త. ఆరంగమ్.

**ఆరంగచెక్క** వి. ఒకరకం పోకచెక్క. **ఆరంగపువక్క** వి. మేలిరకం పోకచెక్క. **ఆరంగాలు** వి. బ.వ. ఒకరకం పోకచెక్కలు.

**ఆరంగచెక్క** చూ. ఆరంగ.

**ఆరంగపువక్క** చూ. ఆరంగ.

**ఆరంగాలు** చూ. ఆరంగ.

**ఆరజము**[1] రూ. ఆర్జము[1]. వి. వాద్యవిశేషం. భాగ. 10. ఉ. 814.

సం. రంజ- వాద్యవిశేషం; ప్రా. అరజ్జఅమ్;

<ప్రా. ఆరజ్జఅమ్.

**ఆరజము**[2] రూ. ఆర్జము[2]. విశే. మనోజ్ఞమైనది, సొగసైనది. వేంక.పంచ. 3.51, మను. 6.32; వి. 1. కలధ్వని, అవ్యక్త మధుర ధ్వని. మను. 3.111; 2. దుర్విలాసం. పాండు. 3.12, విప్ర. 5.25; 3. లీల, విలాసం. శుక. 2.110, 4.26.

సం. ఆరంజక-. పూర్తిగా అనుభవయోగ్యమైన;

క. ఆరజి. కోరిక, వాంఛ.

<సం. ఆ-రంజ్-. పూర్తిగా సంతోషపెట్టు (అనునాసిక లోపం).

**ఆరంజోతి** రూ.చూ. అరంజోతి. వి. 1. వశిష్ఠుని భార్య; 2. అరుంధతీ నక్షత్రం.

**ఆరట** పో.చూ. ఊరట. వి. విశ్రాంతి, విరామం.

**ఆరటపడు** చూ. ఆరటము.

**ఆరటపఱచు** చూ. ఆరటము.

**ఆరటపాటు** చూ. ఆరటము.

**ఆరటపెట్టు** చూ. ఆరటము.

**ఆరటము** రూ. ఆరాటము, ఆరాట. వి. పరితాపం, దుఃఖం. బాధ. భార.ఆ(శ. 2.163.

క. ఆఱాటు, ఆఱటు. రోగి వ్యాకులత ; త. ఆరాట్టమ్. తీవ్రమైన రోగ బాధ ;

పో.చూ. సం. ఆరట-. అరవటం, ధ్వని చెయ్యటం : ఆరటి. ధ్వని, గర్జన ; పో.చూ. ప్రా. ఆరడ. అరచు. అగడియమ్. అరుపు, ఏడ్పు.

**ఆరటపడు** అ.క్రి. సంతాపపడు, బాధపడు. పె.శకు. 3.166. **ఆరటపఱుచు** స.క్రి. బాధపెట్టు. వా.రా. 1.81. **ఆరటపాటు** వి. సంతాపం, బాధ, దుఃఖం. వి.పు. 7.8. **ఆరటపెట్టు** స.క్రి. బాధపెట్టు. భార.ద్రోణ. 4.204. **ఆరటించు** అ.క్రి. బాధపడు. సారంగ. చ. 3.29.

**ఆరటించు** చూ. ఆరటము.

**ఆరడము** పో.చూ. ఆరటము. వి. ఉత్సాహం. పూనిక. ఉ. హరి. 4.22.

పో.చూ. త. ఆర్వమ్. ప్రేమ, కోరిక, భక్తి.

**ఆరడి** రూ.చూ. ఆఱడి. వి. 1. నింద, దూరు ; 2. వ్యర్థం.

**ఆరణపక్కి** రూ.చూ. నారణపక్కి. వి. కొంగ.

**ఆరణాలు** వి. వేద భాగాలు, ఆరణ్యకాలు ; అరణ్యములందు చెప్పబడినవి లేదా అరణ్యములందు చదువదగినవి. శివరా. 3.14.

సం. ఆరణ్యకమ్. వేదభాగం ; ప్రా. ఆరణ్యగం, ఆరణ్ణయం, ఆరణ్ణ. అమా. ఆరణియ, ఆరణ్ణగ, ఆరణ్ణయ. వానప్రస్థుడు లేక సన్యాసి ; పా. ఆరఞ్ఞక ;

క. ఆరణ, ఆరణ్యక. వేదభాగం ; త.మ. ఆరణమ్.

<సం. ఆరణ్య(క)-.

**ఆరంటాకి** చూ. ఆరం[1]. వి. రాతిని చెక్కే ఉలి.

**ఆరతి** రూ. ఆర్తి, ఆళతి[2], హారతి. వి. నివాళి, నీరాజనం. వసు. 1.158.

సం. ఆరాత్రికమ్. నివాళి ; ప్రా. ఆరత్తియమ్ ;

కా.కు.మా. ఒ. సిం. ఆరతి ; నే. ఆరతి ; అ. పం. ఆర్తి ; బె. ఆర్తి ; హిం. గు. మ. ఆరతి, ఆర్తి ;

క.తు. ఆరతి, ఆర్తి ; త. ఆరత్తి, ఆలత్తి.

<ప్రా. ఆరత్తియ-.

**ఆరతికర్పూరము** వి. నివాళి ఇవ్వటానికి ఉపయోగించే కర్పూరం. క. ఆరతికర్పూర ; తు. ఆరతికర్పుర.

**ఆరతికర్పూరము** చూ. ఆరతి.

**ఆరదొండ** రూ.చూ. ఆరుదొండ.

**ఆరపెట్టుట** చూ. ఆరు[6].

**ఆరపోయుట** చూ. ఆరు[6].

**ఆరబము**[1] రూ.చూ. ఆరంబము[1]. వి. ప్రారంభం.

**ఆరబముసేయు** (-చేయు). అ.క్రి. స.క్రి. మొదలుపెట్టు. వి. పు. 3.279.

**ఆరబము**[2] రూ. ఆరంబము[2]. వి. 1. తొలకరిపైరు ; 2. పైరు. వి. పు. 2.106, హళ. 3.8, భీమ. 3.143.

సం. ఆరంభ-. ప్రారంభం, తొలకరిపైరు ;

క. ఆరంబ, ఆరంబు. సాగు (?<ఆర్-) ; ఆర్. ఆరు, ఏరు. కాడికట్టిన జోడెద్దులు.

బహుశః <సం. ఆరంభ-.

**ఆరబముసేయు** చూ. ఆరబము[1].

**ఆరము** రూ.చూ. ఆరాము. వి. తోట, ఉద్యానవనం.

**ఆరంబము**[1] రూ. ఆరబము[1] వి. ప్రారంభం, ప్రయత్నం.

సం. ఆరంభ-. ప్రారంభం, మూలం, తొందర, వేగం ; ప్రా. ఆరభ-, ఆరంభ, ఆరబ్భ ; పా. ఆరంభ-, ఆరబ్భ ;

క. ఆరంబ, ఆరంభ ; త. ఆరంపమ్ ; మ. ఆరంభమ్.

<సం. ఆరంభ-.

**ఆరంబము**[2] రూ.చూ ఆరబము[2]. వి. వ్యవసాయం.

**ఆరయు** రూ. అరయు. స.క్రి. 1. ఆలోచించు, విచారించు, పరిశీలించు. భార.ఆది. 1.25 ; 2. కాపాడు, కనిపెట్టిచూచు. భార.ఆది. 4.250 ; 3. వెదకు. భార.ఆది. 6.171 ; 4. చూచు. కళా. 2.14 ; 5. కనుగొను, తెలిసికొను. చెన్న. 2.211.

క. ఆరయ్, ఆరయు, ఆరయ్యు, ఆరై. వెదకు, శ్రద్ధవహించు, పోషించు ; తు. ఆరైసుని. ఎదురుచూచు ; ఆరైకె. రక్షణ ; పో.చూ. ఆరంయుని. వెదకు, ఎదురుచూచు ; ఆరంతుని. స్పృశించు, పట్టుకొను ; త. ఆరాయ్. పరీక్షించు, వెదకు, పరిశోధించు ; మ. ఆరాయ్క ; కొంత. రేయ్.

<మూ.ద.ద్రా. *ఆర్ + *ఆయ్.

**ఆరరంగు** వి. పసుపురంగు.

సం. ఆర, ఆరమ్. ఇత్తడి. ప్రా. ఆరా ;

క. ఆర ; త. ఆరకూటు.

<సం. ఆర + రంగు.

**ఆరరే** అవ్య. ఆశ్చర్యప్రశంసాద్యర్థకం. శ్రీరంగ. 4.962.

సం. అరరే. వేగిరపాటును తెలిపే నీచపురుష సంబోధన ; అప. అరిరి, అరెరె, అరరి. మరా. అరర, అరరే, అరే ;

క. అరరె(అరె-అరె).

<సం. అరరే.

**ఆరళ్లు**[1] రూ.చూ. అళ్లు 'అరె' బ.వ. వి. ధాన్యవిశేషం. హంస. 4.128.

**ఆరళ్లు**[2] చూ. ఆఱడి. వి. నిందలు, బాధలు.

**ఆరవేయుట** చూ, ఆరు[6].

**ఆరవేరము** రూ.చూ. ఆరివేరము. 1. వైరం ; 2. కలహం. క్రీడా. 287.

**ఆరా**[1] వి. గురుతు, జాడ.

ఉ. ఆరా. తెలిసికొను, జాడతెలియు ; పార. ఆరా. అభిప్రాయాలు, సిద్ధాంతాలు.

<ఉ. ఆరా.

**ఆరాతీయు** స.క్రి. జాడతీయు.

**ఆరా**[2] వి. చువ్వ.

**ఆరా**[3] అవ్య. సుమారు, దగ్గర, దరిదాపు.

ఒ. అరా. దగ్గర.

<ఒ. అరా.

**-ఆరా**[4] రూ. ఆర. సంబోధనంలో అంతాగమం. వరహ. 10.35.

**ఆరాజులు** వి. ఎలుకలు (వృత్తిపరమైన సాంకేతిక పదం).

**ఆరాట** రూ.చూ. ఆరటము. వి. దుఃఖం, వ్యాకులత.

**ఆరాటము** రూ.చూ. ఆరటము. వి. దుఃఖం, వ్యాకులత. కళా. 4.50. **ఆరాటించు** అ.క్రి. తపించు, సంతాపపడు. విష్ణు. 1.147.

**ఆరాటించు** చూ. ఆరాటము.

**ఆరాతీయు** చూ. ఆరా[1].

**ఆరాద** వి. అనూరాధ నక్షత్రం.

సం. అనూరాధా. ఒక నక్షత్రం.

<సం. అనూరాధా.

**ఆరాధ్యులు** వి. బ.వ. లింగధారులైన శైవ బ్రాహ్మణగురువులు. కృష్ణ. 2.6.

పో.చూ. సం. ఆరాధ్య-. ఆరాధింపదగిన; ప్రా. ఆరజ్ఝ.; నే. బ. హిం. గు. ఆరాధ్య;

క. ఆరాధ్య. శైవబ్రాహ్మణులు; త. ఆరాత్తియర్, ఆరాత్తిరియర్. లింగధారులైన బ్రాహ్మణులు.

<సం. ఆరాధ్య-. అర్థవిపరి.

**ఆరామము** రూ. ఆరము, ఆరియము, ఆరెము[1]. వి. తోట, ఉద్యానవనం.

సం. ఆరామ-. సంతోషం, తోట; ప్రా. ఆరామ. తోట: అప. ఆరావ; అ.మా. పా. ఆరామ.

క. ఆరవె; త.మ. ఆరామమ్.

<సం. ఆరామ-.

**ఆరి**[1] రూ.చూ. ఆరె[2]. వి. బొట్టె, కోడి కాలి వెనుకపక్కనుండే వాడియైన గోరు.

**ఆరి**[2] పో.చూ. ఆరె[1]. వి. ఒకానొక చెట్టు.

**ఆరి**[3] రూ.చూ. ఆరిక. వి. సస్యవిశేషం.

**ఆరి**[4] వి. గ్రామసీమలు.

**ఆరిక** రూ. ఆరక, ఆరి[3], ఆరికె[1], ఆరుక, ఆరుగ, ఆరుగు, ఆరువు. బ.వ. చూ. ఆళ్లు. వి. సస్యవిశేషం (Pasapalum scrobiculatum). వేంక.పంచ. 1.687.

క. ఆరికె, హారక, హారకు; త. ఆరియమ్.

<మూ.ద.ద్రా. *ఆర్- ఇయ- లేదా ఆర్- ఇక-.

**ఆరికె**[1] రూ.చూ. ఆరిక.

**ఆరికె**[2] వి. గంజి పెట్టటానికై చుట్టిన పడుగు.

**ఆరిచుట్ట** వి. బండిచక్రం తయారీలో వాడే వంపు కొయ్య.

**ఆరితి** వి. బాధ. కువల. 4.74.

సం. ఆర్తి. బాధ; ప్రా. అట్టి, అత్తి; పా. అట్టి. ఇబ్బు;

క. ఆర్తి (అర్తి); త.మ. ఆర్తి; తు. అరతి, అర్తి.

<సం. ఆర్తి.

**ఆరితీరినవా(డు** చూ. ఆరితీరుట.

**ఆరితీరుట** వి. సంపూర్ణత్వం పొందటం, అర్హతపొంది ఉండటం.

పో.చూ. త. అరి. సామర్థ్యం, సౌందర్యం.

ఆరితీరినవా(డు వి. సమర్థుడు, నిపుణుడు.

**ఆరితేఱు** చూ. ఆరితీరుట. అ.క్రి. సమర్థుడగు, నిపుణుడగు, దిటవగు. విజయ. 3.27, హంస. 5.110.

పో.చూ. త. అట్టు. శక్తివంతమగు, సాధ్యమగు. ఆరు[1]+ఇ+తేఱు, తేరు. 'నరతేరు' మొ. వాటిలోవలె అంతాగమం.

**ఆరిందా** వి. 1. కూలివాడు, మోతకూలీ, అడితిదారుడు; 2. సమర్థుడు; 3. పెద్దమనిషి, అనుభవశాలి.

ఉ. ఆరిందా. కూలివాడు.

<ఉ. ఆరిందా. అర్థవిపరి.

**ఆరిపువ్వు** పో.చూ. ఆరె[1]. వి. ధాతకీపుష్పం (Grislea tomentosa).

**ఆరిమోని** రూ. ఆర్మోనీ. వి. పియ్యానిపెట్టె. హార్మోనియం.

పోర్చు. ఆర్మోని; స్పా. ఆర్మోనియో; ఫ్రెం ఆర్మోని.

<పోర్చు. ఆర్మోనీ.

**ఆరియము** రూ.చూ. ఆరాము. వి. తోట, ఉద్యానవనం.

**ఆరివేరపు(దపసి** చూ. ఆరివేరము.

**ఆరివేరము** రూ. ఆరవేరము, ఆర్వేరము. వి. 1. కలహం, వైరం. పారి. 1.44; 2. చింత, మనఃక్షోభం. వైజ. 4.66, శుక. 2.563.

క. అరవార. పెద్దఅరుపు; అర్. బిగ్గరగా అరచు; తు. అరబాయ్, అరబాయి. పెద్దకేకలు; అరవారం. కేకలుపెడుతున్న జనం; త. అరవారం. దుఃఖం, పెద్ద కేక, కోలాహలం;

సం. వైర-. కలహం; ప్రా. వేర-.

<ఆరు[1]+ఇ+ప్రా. వేర-.

ఆరివేరపు(దపసి (-తపసి). వి. నారదుడు, తగువుల మారి దేవముని. పారి. 1.44.

**ఆరు**[1] అ.క్రి. 1. నిండు, పూర్ణమగు. భార.ఆది. 2.83; 2. ఒప్పు. భార.ద్రోణ. 1.124; 3. కలుగు, జనించు. భార.ద్రోణ. 3.21; 4. అతిశయించు. భార.స్త్రీ. 2.147.

క. ఆర్. నిండు; అరు. వి. సంపూర్ణత, విస్తారం; క్రి.విశే. నిండుగా; తు. ఆయని. ఉబ్బు, ఉబ్బించు; త. అర్. నిండు, తనియు, సంపూర్ణత; మ. అర. నిండుగా; కుఇ. సార్. అదనం, అదనంగాఉండు; కువి. హార్. ఉండు; కొలా. ఏరాద్. చాలినంత; నా. ఏరాల్; మాల్తో. ఏగర్. నిండియుండు.

<మూ.ద.ద్రా. *ఆర్- <మూ.ద్రా. *చార్-.

**ఆరు**[2] పో.చూ. ఆరె[1]. వి. హిమాలయాల్లో ఉండే ఒకానొక ఓషధి.

పో.చూ. సం. ఆరుక. హిమాలయాల్లో పెరిగే ఒక ఓషధి; కా. ఓరు; కుమా. ఆడు; నే. ఆరు; హిం.పం. ఆడు; ల. ఆడు-దాడు;

పో.చూ. క. ఆరె. ధాతుపుష్టిక; తు. ఆరె. నల్లచేవ మాను; పో.చూ. త. ఆర్, ఆరై. ఒకరకం కూరాకు; అరమ్. ఒకానొక చిన్నమొక్క.

<మూ.ద.ద్రా. *ఆర్-.

**ఆరు**[3] రూ.చూ. నారు. వి. రోమావళి, నూగారు. భార.విరా. 1.245, శృం.నై. 2.15.

**ఆరు**[4] జంటపదాల్లో పూర్వపదంగా ప్రయుక్తం. పో. చూ. ఆర్చు వి. 1. రవ్వ, నింద. అహ. 3.33 ; 2. అల్లరి.

**ఆరుదూఱు** (-దూఱు. నింద). వి. రవ్వ, నింద, అల్లరి. ఆం.దా. 1.115, అహ. 3.46. **ఆరుపోరు** (-పోరు. యుద్ధం). వి. ఎడతెగని కలహం. వ్య. తిట్టటం కొట్టటం.

**ఆరు**[5] రూ.చూ. ఆఱు[2]. విజ. ఆరునంఖ్య.

**ఆరునొక** విజ. ఏడు. **ఆరున్నొక(క్క)టి** రూ. ఆరొకటి. విజ. ఏడు. ఎంచునపుడు కొలుచునపుడు ఏడు అనుట రోదనాన్ని సూచిస్తుందని, ఆరు, ఆరున్నొకటి, ఎనిమిది అని లెక్కిస్తారు. **ఆరుపలము** వి. ఆరు పలాలు, ముప్పావ సేడు. **ఆరుమూఁడు** రూ.చూ. ఆఱుమూఁడు. వి. చెడటం, భగ్నంకావటం. **ఆరొకటి** రూ.చూ. ఆరున్నొకటి. విజ. ఏడు.

**ఆరు**[6] రూ.చూ. ఆఱు[1]. అ.క్రి. ఎండు.

**ఆరపెట్టుట** వి. ఎండపెట్టటం. **ఆరపోయుట** వి. ఎండ పొయ్యటం. **ఆరవేయుట** వి. ఎండవెయ్యటం. **ఆరుదల** వి. ఎండటం, తడి ఆరటం. **ఆరుపదును** వి. కొద్దిగా ఆరిన స్థితి. **ఆరువాళ్లు** రూ.చూ. ఆఱువాళ్లు. వి. నగం ఉడికించి ఎండబెట్టిన వడ్లు.

**ఆరు**[7] వి. నాగలి చివర కర్రు బిగించే భాగం.

**ఆరుపాది** వి. ఆరులో కర్రు బిగించటానికి తొలిచిన గాడి.

**ఆరు**[8] గుద్దలి మొ. వాటికి వేసిన ఇనపపలుగు.

**ఆరు**[9] చూ. అఱ్ఱు[2]. వి. ఎద్దు మొ. వాటి మెడమీది పుండు.

**ఆరుక** రూ.చూ. ఆరిక. వి. సస్యవిశేషం.

**ఆరుగ** రూ.చూ. ఆరిక. వి. సస్యవిశేషం.

**ఆరుగాలము** క్రి.విజ. ఏడాది పొడవున, ఎల్లప్పుడు.

<ఆరు[1]+సం. కాల-.

**ఆరుగు** రూ.చూ. ఆరిక. వి. సస్యవిశేషం.

**ఆరుచు** 'ఆరు[1]' ధాతుసకర్మకరూపం. రూ. చూ. ఆర్చు[2]. వి. 1. ఆడించు, కదిలించు. భార. విరా. 4.217 ; 2. విసరివేయు.

**ఆరుదల** చూ. ఆరు[6].

**ఆరుదూఱు** చూ. ఆరు[4].

**ఆరుదొండ** రూ. అరదొండ, అరుదొండ, ఆరదొండ, ఆదొండ. వి. అడవిదొండ. (Capparis horrida).

క. అరుదణి, ఆరుదొండ ; త. అతొంఱై, అఱు తొంఱై. ముళ్లతీగె.

<ఆరు[1]+దొండ.

**ఆరుద్ర** వి. 1. ఆరుద్రా నక్షత్రం ; 2. జ్యేష్ఠమాసంలో వచ్చే కార్తె.

సం. ఆర్ద్రా-. ఆరుద్రా నక్షత్రం ; మరా. ఆర్ద్రా ; గు. ఆర్ద్ర ;

క. ఆరిద్ర, ఆర్ద్రె ; తు. ఆద్రె, అర్ద్రె; త. అరుత్తిరై.

<సం. ఆర్ద్రా.

**ఆరుద్రచీర** వి. తమలపాకుకు ఆరుద్రకార్తెలో పట్టే తెగులు. **ఆరుద్రపురుగు** వి. తొలకరివానల తర్వాత కని పించే ఎర్రటి పురుగు, ఇంద్రగోపం. క. ఆరిద్రపుఱు. ఆర్ద్రకార్తెలో కనిపించే పురుగు.

**ఆరుద్రచీర** చూ. ఆరుద్ర.

**ఆరుద్రపురుగు** చూ. ఆరుద్ర.

**ఆరునొక** చూ. ఆరు[5].

**ఆరున్నొక(క్క)టి** చూ. ఆరు[5].

**ఆరుపదును** చూ. ఆరు[6].

**ఆరుపలము** చూ. ఆరు[5].

**ఆరుపు** రూ.చూ. ఆర్పు. వి. 1. జంతువుల అరుపు, కూత ; 2. యుద్ధవీరుల సింహనాదం.

**ఆరుపాది** చూ. ఆరు[7].

**ఆరుపోరు** చూ. ఆరు[4].

**ఆరుమున్నూరుకాలము** క్రి.విజ. ఎల్లప్పుడు.

**ఆరుముళ్లు** చూ. ఆరుమూడు. 1. కష్టాలు, చిక్కులు ; 2. వ్యర్థం.

**ఆరుమూఁడు** చూ. ఆరు[5].

**ఆరులు** చూ. ఆరిక. వి. ధాన్యవిశేషం.

**ఆరుళ్లు** రూ.చూ. ఆఱువాళ్లు. వి. నగం ఉడికించి ఎండబెట్టిన వడ్లు.

**ఆరువాళ్లు** రూ.చూ. ఆఱువాళ్లు ; చూ. ఆరు[6].

**ఆరువాసి** వి. కొంత ఆరి పరిమాణం తగ్గిన ధాన్యాదుల లక్షణం.

క. ఆఱువాసి. వడ్లు మొ. ఎండటం.

**ఆరువు** రూ.చూ. ఆరిక. వి. సస్యవిశేషం. ద. హం. కా. 4.1348.

**ఆరుషేయము** వి. ఋషిప్రోక్తం. పలడి. చ. 4. పు. 286 పం.

సం. ఆర్షేయ-. ఋషి సంబంధమైన.

<సం. ఆర్షేయ-.

**ఆరె**[1] వి. ధాతకి. ద్వి.శ.సా. 2.661 పం. (Banhinia Spicata).

క. తు. ఆరె ; త. ఆర్, ఆరమ్, ఆరై ;

పో.చూ. సం. ఆలు, ఆలుక, కాంచనార, కాంచ నాల, కుదార, కుదాల, కుద్దాల, కోవిదార.

**ఆరె**[2] రూ. ఆరి[1] వి. 1. బొట్టె, కోడి కాలివెనుక పక్కనుండే వాడియైన గోరు. దశకు. 9.80 ; 2. ఆయుధ విశేషం. ఉ.హరి. 6.66 ; 3. చెప్పులుకుట్టే సూది. ఉ. హరిశ్చ. 4.156.

సం. ఆరా. చెప్పులుకుట్టే సూది ; ప్రా. ఆరా. ఇనుప చువ్వ ; అమా. ఆరా. బండి చక్రం ఆకు ; ములుకోల ; పా. ఆరా. చెప్పులుకుట్టే సూది ; నే. ఆరొ ; బెం. ఆరా. హిం. పం. ల. గు. ఆరి. ఇనుపమేకు ; సిం. ఆర ; మరా. ఆర్, ఆరె, ఆరా. చెప్పులుకుట్టే సూది ;

క. ఆరె ; మ. ఆరమ్ ; కొలా. ఆరు. మునుకోల చివరి ఇనుపముల్లు.

<సం. ఆరా.

**ఆరెగోల** (-కోల) వి. ఏనుగు పక్కలు పొడిచి బెదిరించ టానికి అర్ధ చంద్రాకారంగా ఉక్కుతోచేసిన అలుగుగల వేఱు

దండం, బరిగోల. ఉ.హరి. 4.22. <ఆరె[2]+కోల.

**ఆరె[3]** వి. మహారాష్ట్రుడు. ద్వా. 1.42, ఆం.బా. 2.103.

సం. *ఆర్య*. పూజ్యుడు, విశ్వసనీయుడు ; *ఆర్యకః*. పూజ్యుడు, పితామహుడు ; పా. *అరియ*. ముఖ్యుడు. పూజ్యుడు, ఉత్తముడు ; అ.మా. *అరియ*. పవిత్రుడు, ఆర్యుడు ;

క. *అరె*. మహారాష్ట్రం ; *ఆరెకార, ఆరెయ*. మరాటీ వాడు ; త. *అరియన్*. కిరాతకుడు, విదేశీయుడు, ఆదిమ వాసి ; *ఆరియమ్*. ఆర్యభాష, సంస్కృతం.

**ఆరె[4]** వి. **1.** చక్రం, సారెచక్రం ; **2.** బండి కుండనూ చక్రాన్ని కలిపే కర్ర, ఆకు.

**ఆరెకాలు** వి. బండి చక్రం ఆకు.

**ఆరె[5]** వి. దవడ వాపు.

**ఆరెకాలు** చూ. ఆరె[4].

**ఆరెకుడు** వి. గ్రామ రక్షకుడు, తలారి. భార.ఆది. 4.26, పూర్వ. 2.167.

సం. *ఆరక్షక, ఆరక్షిక*. గ్రామ రక్షకుడు : ప్రా. *అరక్ఖగ-, అరక్ఖిగ, ఆరక్ఖిగొ, ఆరక్ఖియొ, ఆరక్ఖో* ; అ.మా. *ఆరక్ఖ*. అంగరక్షకుడు ; *ఆరక్ఖగ, ఆరక్ఖియ*. రక్షకభటుడు; పా. *ఆరక్ఖిక*. కావలివాడు ;

క. *ఆరెకాఱ, ఆరక్ఖ*. కావలి, రక్షణ.

<ప్రా. ఆరక్ఖక <సం. ఆరక్షక-.

**ఆరెగోల** చూ. ఆరె[5].

**ఆరెద్దులకార్తె** వి. ఆరుద్రకార్తెలో చేసుకునే పండగ (మట్టితో ఎద్దుబొమ్మలు చేసి గుగ్గిళ్లు, పేలపిండి నైవేద్యం పెడతారు).

**ఆరెవ్రట** వి. సారెపలక, సారెలోని ఇరుసువంటి భాగం.

**ఆరెమరాటీలు** వి. తోలుబొమ్మలాడిస్తూ, స్థిరనివాసం లేకుండా దేశదిమ్మరులైన మరాటీవాళ్లు.

**ఆరెము[1]** రూ.చూ. ఆరాము వి. తోట, ఉద్యానవనం.

**ఆరెవడ్లు** పో.చూ. వరి. రూ. ఆర్లెవడ్లు. వి. బ.వ. సూదుల్లాంటి తోకలుగల ఒకరకం వడ్లు.

పో.చూ. త. *అరి*. ప్రాశస్త్యం, ఔన్నత్యం, సౌందర్యం ; *అరమ్*. ముత్యం ; *అర్*. సౌందర్యం.

బహుశః <త. అరి+వడ్లు.

**ఆరివెలగ** చూ. ఆరె-వడ్లు. వి. ఒకానొక మంచిజాతి వెలగ.

**ఆరేటిబాతు** వి. పలువన్నెలుకల అందమైన చిన్న నీటిబాతు (ఇది బాగా ఎగురుతుంది ; ఋతువులనుబట్టి, కోయిల, స్వాతికొంగ మొ. వాటివలె చాలా దూరదేశాలకు కూడా తన జాతిపక్షుల గుంపుతో కలిసిపోతుంది).

**ఆరొకటి** చూ. ఆరు[5].

**ఆరోగణము** రూ. ఆరోగిణము. వి. భోజనం. బసవ. 5. పు. 623 పం., పరమ. 8. పు. 198 పం.

క. *ఆరోగణ, ఆరోగణె*. భుజించటం, భోజనం ; మ. *ఆరోగణమ్*.

<క. ఆరోగణ.

**ఆరోగిణము** రూ.చూ. ఆరోగణము. వి. భోజనం. చెన్న.బ. 4.360.

**ఆర్కాటి** రూ.చూ. ఆరకాటి. వి. కర్ణధారుడు, ఓడ నడిపేవాడు.

**ఆర్గనైజరు** వి. నిర్వాహకుడు.

ఇం. *ఆర్గనైజర్*.

<ఇం. Organiser.

**ఆర్గురు** చూ. ఆర్-.

**ఆర్చి** వి. రెండు దిమ్మెలమీది విలువంపు కట్టడం.

ఇం. *Arch* ; ఫ్రెం. *arche* ; లా. *arcus*. విల్లు,

<ఇం. Arch.

**ఆర్చు[1]** రూ. ఆఱుచు[1]. అ.క్రి. అరచు. బొబ్బరించు, ఘోషించు, భార.ఆది. 4.71, వరాహ. 10.41, ఆము. 5.130.

క. *అమ, అర్, ఆరు, అర్చు*. బిగ్గరగా అరచు ; *ఆరడి*. నింద ; *అరవార*. పెద్దఅరపు ; *అరబు, అరుహ, ఆర్పు, అర్పుటు, అర్బాటు. అర్బు*. పెద్దగా అరవటం ; *అర్బాటిసు*. అరచు. ఘోషించు ; తు. *అర్కని*. ధ్వనిచేయు ; కొడ. *అర*. పెద్ద ధ్వనిచేయు ; త. *అర్*. అరచు ; *అర్పు*. పెద్దధ్వని, అట్టహాసం, సంతోషం ; *అరవారమ్*. పెద్ద ధ్వని, అరుపు, గందరగోళం ; *అరవారి*. ధ్వనిచేయు, అరచు ; మ. *అరకుక్క*. పెద్దగా అరచు ; కో. *అర్* ; గో. *అడానా, అడ్స్, అడాక్, అడాకా*. ఏడ్చు, అరచు ; కుఇ. *అర్ప*. ధ్వనిచేయు, పిలుచు ; కువి. *అర్నై*, పిలుచు ; పర్జి. *అర్*. ధ్వనిచేయు ; కొలా. *అర్*. పిలుచు ; గద. *అర్గ్*. అరచు ; మాల్తో. *అర్*. మేకలను పిలవటం.

<మూ.ద్రా. *అర్-.

**ఆర్చు[2]** రూ. ఆరుచు. స.క్రి. **1.** (యంత్రాదుల్లోపెట్టి) త్రిప్పించు. కు.సం. 2.229 ; **2.** నర్తింపజేయు, ఆడించు. భార.ఉద్యో. 2.21, భార.శాంతి. 1.283 : **3.** (ద్యూతాదుల) నాడించు. భార.ఉద్యో. 3.280 ; **4.** కదలించు. విసరు. హరి.ఉ. 10.50, ఆము. 2.63 ; **5.**. (స్నానాదులు) చేయించు. వరాహ. 7.48, పారి. 2.11.

**ఆర్చు[3]** (ఆడు[2]) ప్రేరణార్థకం. స.క్రి. పలికించు, చెప్పించు భార.విరా. 2.310.

**ఆర్చు[4]** రూ.చూ. అఱుచు[2]. *స.క్రి. **1.** తడిలేనిదిగా చేయు, ఎండబెట్టు. పారి. 2.12 ; **2.** (దీపాదులను) ఆర్పివేయు. శృం.నై. 7.169 ; **3.** ఉపశమిల్లజేయు. సారంగ. చ. 3.185.

**ఆర్జము[1]** రూ.చూ. ఆరజము[1]. వి. వాద్యవిశేషం.

**ఆర్జము[2]** రూ.చూ. ఆరజము[2]. వి. విలాసం. చంపూ. 3.67.

**ఆర్డరు** వి. ఆజ్ఞ.

ఇం. *Order*. వరుస. క్రమం, ఆజ్ఞ, మొ.

<ఇం. Order.

**ఆర్డర్లీ** వి. తైనాతి. బంట్రోతు.

ఇం. *Orderly*. పైఅధికారులకు సందేశముల నందించెడి చిన్న అధికారి, సార్జంటు, అనుపత్రి నౌకరు.

<ఇం. Orderly.

**ఆర్తి** రూ.చూ. ఆరతి. వి. నివాళి.

**ఆర్ద్ర** చూ. ఆరుద్ర పురుగు. వి. ఇంద్రగోపం. ఆర్ద్రకార్తెలో కన్పించే ఎర్రటి పురుగు.

**ఆర్ద్రగణపతి** వి. పసుపువినాయకుడు.

ఆర్ద్ర<సం. హరిద్ర- లేదా ఆర్ద్ర- తడి: (తడి) పసుపుతో చేసిన వినాయకుడు.

**ఆర్న** వి. బండినొగమీది చెక్క.

**ఆర్నెల్లు** చూ. ఆర్-.

**ఆర్పించుట** చూ. ఆర్పు(ట).

**ఆర్పు** చూ. ఆర్పు[1]. రూ. ఆరువ, ఆఱుప. వి. అరువ, కేక. ఉ.హరి. 3.25, భీమ. 4.191.

**ఆర్పు(ట)** చూ. ఆర్పు[4]. వి. ఆర్పివేయటం ('వేయు' అనే సహాయక క్రియతోకూడా ప్రయుక్తం).

**ఆర్పించుట** వి. ఆర్పి వేయించటం.

**ఆర్బటము** రూ.చూ. ఆర్భటము. వి. 1. ధ్వని, చప్పుడు; 2. ఆర్పు మొ. వాటితో గూడిన విజృంభణం.

**ఆర్బాటము** రూ.చూ. ఆర్భటము.

**ఆర్భటము** రూ. ఆర్బటము, ఆర్బాటము, ఆర్భటి, ఆర్భాటము. పో.చూ. ఆర్పు; వి. (అరపు, కేక, ధ్వని, చప్పుడు)? ఆర్పు మొ. వాటితో గూడిన విజృంభణం వేంక.మా. 3.8.

క. ఆర్బటు, ఆర్భటె. అరపు, పెద్ద ధ్వని; అర్బు. అరపు; అర్. పెద్దగా అరచు; తు. ఆర్బటె. పెద్దధ్వని; త. ఆర్‌ప్పాటమ్. హడావిడి, పటాటోపం, పెద్ద ధ్వని: ఆర్‌ప్పు. గందరగోళం; అర్. అరచు;

సం. ఆరభటః. సాహసికుడు; ఆరభటా. సాహసం, విశ్వాసం, వీరత్వం; ప్రా. ఆరభడమ్. నృత్యవిశేషం; ఆరభటీ. ఒకవృత్తి; పా. ఆరభటి. ఆడంబరం.

<సం. ఆరభట-.

**ఆర్భటి** రూ.చూ. ఆర్భటము. వి. ధ్వని, కేక, విజృంభణము, అతిశయము.

**ఆర్భటించు** వి. 1. ధ్వనిచేయు, కూయు. ఇందు.రా. 3.128; 2. విజృంభించు, వేంక.మా. 1.46; క. ఆర్బటిసు. అరచు.

**ఆర్భటించు** చూ. ఆర్భటి.

**ఆర్భాటము** రూ.చూ. ఆర్భటము. వి. విజృంభణము, అతిశయము. ద్వి.శ.సా. 1.215.

**ఆర్మడా** వి. యుద్ధనావ.

పోర్చు. తచ్చి. *armada*; స్పా. *armada*. సేన, నౌకాదళం; *arma*. ఆయుధం.

బెం. హారామద్. బుడతకీచుల దోపిడీ ఓడ; అర. 'అల్-మదీ-య.'

<పోర్చు. Armada.

**ఆర్మానీ** రూ.చూ. ఆరిమాని. వి. పియ్యానిపెట్టె.

**ఆర్షది** చూ. ఆర్-.

**ఆర్షూడు** చూ. ఆర్-.

**ఆర్యవైశ్యులు** వి. కొందరు తెలుగు కోమట్లు, కళింగవైశ్యులు మొ. వారినుంచి, తమ ఆర్యజాతి వైశిష్ట్య సూచకంగా పెట్టుకొన్న పేరు.

సం. ఆర్య-. వైశ్యుడు, గౌరవనీయుడు, విశ్వాసపాత్రుడు, యజమాని, ప్రభువు; ప్రా. అజ్జి, అరియ, గౌరవనీయుడు; అజ్జి. వైశ్యుడు, ప్రభువు; పా. అరియ, ఆర్యుడు, ప్రభువు, మంచిది, ఆదర్శం; త. అరియవైవియర్. కోమట్లు.

<సం. ఆర్య- వైశ్య-.

**ఆర్లగర్ల** వి. బియ్యం తెల్లగా ఉండే ఒకరకం ఎర్రవడ్లు.

**ఆర్లు** రూ.చూ. ఆళ్లు. వి. ధాన్యవిశేషం.

**ఆర్లెవడ్లు** రూ.చూ. ఆరెవడ్లు. వి. ఒకరకం వడ్లు.

**ఆర్వేరు** చూ. ఆర్-.

**ఆర్వేరము** రూ.చూ. ఆరివేరము. వి. 1. కలహం. అవి. 1.113; 2. ద్వేషం, వైరం. అని. 1.89; 3. అల్లరి. కవిరా. 5.186.

**ఆర్వేలవారు** చూ. ఆర్-.

**ఆఱడి** రూ. ఆరడి. అవ్య. 1. నిష్కారణంగా. భార.ఆర. 4.33, ఉద్యో. 4.385; 2. వ్యర్థంగా, నిష్ప్రయోజనంగా. భార.ఆర. 4.349; 3. దీనంగా. భార.ద్రోణ. 4.270, శాంతి. 1.196; వి. 1. నింద, రట్టు, అపవాదం, అపకీర్తి; 2. హాని, భంగం. మార్క. 4.228; 3. కష్టం, దుఃఖం, బాధ. విక్ర. 1.200; విశ. 1. వ్యర్థం, ప్రయోజనం లేనిది. హరి.ఉ. 7.26; 2. దుష్టం, చెడ్డది. యయా. 3.125; 3. నింద్యం, నీచం. ఉ.రా. 8.81, హంస. 1.127.

క. ఆరడి. (అర్ (బిగ్గరగా అరచు)+అడి). అల్లరి, అపనింద; త. అఱాటి. ద్రిమ్మరి, వ్యర్థుడు; పో.చూ. ఆరాట్టమ్. వేదన; అరట్టు. ఏడ్పు, అరచు;

సం. ఆరట- (<ఆ + రట్). నిరంతరం ధ్వని చేయు; ప్రా. ఆరడియ. అరపు, ఏడ్పు; అ.మా. ఆరడియ సద్ద. పెద్దధ్వని.

**ఆఱడిచేయు** స.క్రి. వ్యర్థంచేయు, నిష్ఫలంచేయు. మను. 3.5. **ఆఱడించు** స.క్రి. మించు, కించుపరచు. రాధికా. 1.23. **ఆఱడిపడు** స.క్రి. 1. ఆరడిపొందు, వ్యర్థతచెందు. రం.రా.బాల. 42 పు. 19 పం.; 2. హానిచెందు, నశించు. రం.రా.కిష్కిం. 215 పు. 18 పం.; 3. నిందచెందు. **ఆఱడిపుచ్చు** స.క్రి. 1. వ్యర్థంచేయు. భార.విరా. 2.258; 2. దుఃఖపెట్టు. నిర్వ. 9.88; 3. భంగపరచు, చెడగొట్టు. హంస. 1.124. **ఆఱడిపెట్టు** రూ. ఆఱడివెట్టు. స.క్రి. 1. వ్యర్థంచేయు; 2. బాధపెట్టు; 3. నిందపెట్టు. **ఆఱడిపోక** వి. 1. నిందపొందటం. నిర్వ. 9.89; 2. వ్యర్థంకావటం. భార.విరా. 3.107. **ఆఱడిపోవు** రూ. ఆఱడివోవు. అ.క్రి. వ్యర్థమగు. శృం.నై. 4.104. **ఆఱడివెట్టు (-పెట్టు)**; రూ. చూ. ఆఱడిపెట్టు. స.క్రి. 1. వ్యర్థంచేయు. వి.పు. 2.233; 2. బాధపెట్టు. కవిరా. 5.210; 3. నిందపెట్టు. అచ్చ.రా. 2.25. **ఆఱడివోవు (-పోవు)**; రూ.చూ. ఆఱడిపోవు. 1. చెడు, భగ్నమగు. నిర్వ. 2.24, భార.ద్రోణ. 2.284; 2. వ్యర్థమగు, నిష్ఫలమగు. భార.అశ్వ. 3.59.; 3. చచ్చు. భార.ఆశ్ర. 1.154.

**ఆఱడిచేయు** చూ. ఆఱడి.

**ఆఱడించు** చూ. ఆఱడి.

**ఆఱడిపడు** చూ. ఆఱడి.

**ఆఱడిపుచ్చు** చూ. ఆఱడి.

**ఆఱడిపెట్టు** చూ. ఆఱడి.

**ఆఱడిపోక** చూ. ఆఱడి.
**ఆఱడిపోవు** చూ. ఆఱడి.
**ఆఱడివెట్టు** చూ. ఆఱడి.
**ఆఱడివోవు** చూ. ఆఱడి.
**ఆఱవ** చూ. ఆఱు[2].
**ఆఱాపు** వి. శేక.
**ఆఱు**[1] రూ. ఆరు[6] అ.క్రి. 1. తీఱు, ఉపశమిల్లు, నశించు. భార.ఆది. 4.19 ; 2. పోవు, మలగు, చల్లారు. భార.భీష్మ. 1.198 ; 3. క్షీణించు, తగ్గు. నృసిం. 1.68, శృం.నై. 3.116 ; 4. (స్వేదాదులు) తడి ఆరిపోవు. హర. 2.103 ; 5. నిర్ద్రవమగు, శుష్కమగు, ఎండు. ఆము. 2.46, ఉ.రా. 3.178.

క. ఆఱు. ఎండు, మాను ; అఱ్, ఆఱ్. ఎండు ; కొడ. అర్. ప్రవాహం, (బట్ట) ఎండు ; ఆట్. ఎండు ; అర. (నీరు) ఎండిపోవు ; తు. ఆరుని. పెరుగు, ఎండు ; అజాని. ఎండు ; త. ఆఱు. చల్లారు, మానుపట్టు, అణగారు ; పో.చూ. ఆఱ్ఱు. (జట్టు) తడిఆరు. ఉపశమింప చేయు ; మ. ఆఱుక. అ.క్రి. ఎండు, మాను ; ఆఱ్ఱుక. స.క్రి. ఎండబెట్టు ; కోట. ఆర్-. మాను, ఎండిపోవు ; తొ. ఓఱ్, ఓట్, అఱ్. ఎండు ; గోం. అర్. చల్లారు ; కువి. ఆజ. చల్లబడు ; ఆస్పు. చల్లబరచు ; పర్జి. ఏద్. చల్లారు ; కొలా. ఆర్-, అర్-ట్. ఎండు ; ఆర్-ఎస్. ఎండబెట్టు ; అర్తపన్. పక్వమైన పండు ; నా. అర్. ఎండు ; కురు. అర్ర్-అనా. ఎండలో ఆరబెట్టు.

<మూ.ద్రా. *ఆట్-.

**ఆఱువాళ్లు** రూ. ఆరుళ్లు, ఆరువాళ్లు. వి. నగం ఉడికించి ఎండబెట్టిన వడ్లు.

**ఆఱు**[2] రూ. ఆర్-, ఆరు[5]. విశే. ఐదునొకటి, ఆరుసంఖ్య. క్రీ.శ. 649. మాచెర్ల శాసనం.

క. ఆఱు, అఱు ; కొడ. అరి ; తు. ఆజి ; త. అఱు, అఱు ; మ. ఆఱు ; కొద. ఒఱ్ ; గోం. సారుంగ్, సార్క్, సారుంగ్-చా ; కువి. సజ్గి ; కొలా. ఆర్ ; మూ.మ.ద్రా. *చాత్.

<మూ.ద.ద్రా. *ఆఱ్-. <మూ.ద్రా. *చాత్.

**ఆఱవ** విశే. ఐదునొకటవ. **ఆఱుగురు** రూ. ఆఱువురు, ఆర్గురు, ఆర్వురు ; (-గురు. మహన్మహత్యర్థక బ.వ. ప్రత్యయం). వి. ఆరుమంది. క. ఆఱువర్, ఆర్వర్ ; త. అఱువర్. **ఆఱుపలము** వి. ఆరుపలాలు, ముప్పావ సేరు ; పలం అంటే 10 పగోడాల ఎత్తు. ఆం.భా. 2.269. **ఆఱుము** వి. ఆరు తూముల ప్రమాణం. <ఆఱు + తూము ; తూము > దుము > ము (సంగ్రహరూపం). **ఆఱుమూఁడగు** అ.క్రి. 1. క్షీణమగు ; 2. వ్యత్యస్తమగు. ఆం.శ. 6. **ఆఱుమూఁడు** రూ. ఆరుమూఁడు. వ్య. ఆరు సంఖ్య మూడు కావటం. వి. క్షీణత్వం, వ్యత్యాసం, భంగం, తబ్బిబ్బు, ఆశాభంగం, విఘ్నం. **ఆఱుమూఁడుచేయు** వ్య. ఆరును మూడుగా చేయు. స.క్రి. 1. భగ్నం చేయు. కలు.శ. 29 ; 2. చెరగొట్టు ; 3. క్షీణింప జేయు ; 4. తార్మారుచేయు. **ఆఱుమోములవేల్పు** వి. ఆరు ముఖాలు గల దేవుడు, కుమారస్వామి. క. ఆఱుమొగ ; త. అఱుముకం, అఱుముకన్, అఱుముక. సుబ్రహ్మణ్యస్వామి. **ఆఱువురు** రూ.చూ. ఆఱుగురు. వి. ఆరుమంది. **ఆఱువేలవారు** రూ.చూ. ఆర్వేలవారు. వి. పూర్వం రాజోద్యోగాల్లో నియుక్తులైన ఒక తెగ తెలుగు బ్రాహ్మణులు. **ఆఱుస** వి. ఆరు కుంచాల ప్రమాణం ఆం.భా. 2.271.

**ఆఱు**[3] రూ.చూ. నారు. వి. నూగారు, రోమావళి (కృతక ప్రామాణిక రూపం).
**ఆఱుగురు** చూ. ఆఱు[2].
**ఆఱుచు**[1] రూ.చూ. ఆర్చు[1]. అ.క్రి. అరచు.
**ఆఱుచు**[2] రూ. ఆర్చు[4]. స.క్రి. 1. ఉపశమింపజేయు ; 2. తడి లేకుండజేయు, తడియార్చు. సానం. 5.166 ; 3. నశింపజేయు.
**ఆఱుపలము** చూ. ఆఱు[2].
**ఆఱుపు** రూ.చూ. ఆర్పు. వి. 1. యోధుల సింహనాదం, బొబ్బరింత. యయా. 3.19 ; 2. కూత, జంతువుల ధ్వని.
**ఆఱుము** చూ. ఆఱు[2].
**ఆఱుమూఁడగు** చూ. ఆఱు[2].
**ఆఱుమూఁడు** చూ. ఆఱు[2].
**ఆఱుమూఁడుచేయు** చూ. ఆఱు[2].
**ఆఱుమోములవేల్పు** చూ. ఆఱు[2].
**ఆఱువ** వి. సీమ, ఎల్ల, సరిహద్దు.

తు. అయ. హద్దు, ఎల్ల ; త. అఱు. నది, వాగు, పక్క, తోవ.

**ఆఱువాళ్లు** చూ. ఆఱు[1].
**ఆఱువురు** చూ. ఆఱు[2].
**ఆఱువేలవారు** చూ. ఆఱు[2].
**ఆఱుస** చూ. ఆఱు[2].
**ఆఱె** వి. దవడ వాపు.
**ఆఱ్లుపట్టు** చూ. ఆఱ్లు.
**ఆఱ్లు** రూ. ఆడ్లు, ఆరళ్లు, ఆర్లు, ఆళ్లు. వి. బ.వ. ధాన్య విశేషం, ఆరిగలు.

**ఆఱ్లుపట్టు** రూ. ఆడ్లపట్టు. వి. ఒక రకం ధాన్యం పండే పొలం.

**ఆల** వి. ఆలిచిప్ప, ముత్తెపు చిప్పవంటి ఒక విధమైన గుల్ల.

త. ఆళి. గుల్లచేప ; పో.చూ. మ. ఆవి. వరగండ్లు, గుల్లచేప ; దీన్ని 'ఆలిచిప్ప' అనే అంటారు, కాని, 'ఆల' అనేది పూర్వ రూపమనే ఊహతో 'ఆలచిప్ప' నుంచి, 'ఆల'ను విడదీసి, బ్రౌనుదానికి అర్థం ఇచ్చారు.

<మూ.ద్రా. *ఆళ్-.

**ఆలచిప్ప** రూ. ఆలిచిప్ప, ఆలుచిప్ప. వి. ముత్తెపు చిప్ప వంటి ఒక విధమైన గుల్ల.

**ఆలకఁబోతు** వి. తోకలేని కోతి.
**ఆలకావరి** చూ. ఆలు[1].
**ఆలకాపు** చూ. ఆలు[1].
**ఆలకి** వి. నిస్సహాయుడు.

పో.చూ. సం. అలక్ష్య. కానరానివాడు ; ప్రా.

అలక్షియ. తెలియరానివాడు; అ.మా. అలక్షనయా. నిర్లక్ష్య ప్రలాపం; పా. అలక్షిక. దురదృష్టం; అలక్ష్మీ; నే. ఒ.హిం. అలక్ష్య; గు. అలకిత;

క. అలక్ష్య.

<ప్రా. అలక్షియ-.

**ఆలకించివిను** చూ. ఆలకించు.

**ఆలకించు** పో.చూ. ఆలించు. స.క్రి. విను, చెవియొగ్గు. విక్ర. 1.128.

నం. ఆ+లక్ష్. గ్రహించు, చూచు; ప్రా. ఆలక్షియ. తెలిసినది.

<నం. ఆలక్ష్+ఇంచు.

**ఆలకించివిను** స.క్రి. శ్రద్ధగావిను. చంద్రా. 4.59.

**ఆలగావరి** చూ. ఆలు[1].

**ఆలగోడుబాలగోడు** చూ. ఆలు[1].

**ఆలగోలుబాలగోలు** చూ. ఆలు[1].

**ఆలంకి** వి. బాలక్రీడా విశేషం; ఇద్దరు పిల్లలు చేతులు కలిపి నురొకటిన్ని ఆ చేతులమధ్య పల్లకీలోలాగా కూచోపెట్టి మోసే ఆట. కాశ. 3.33; **2.** కుర్చీవంటి పల్లకి.

పో.చూ. నం. పర్యంక, పల్యంక. మంచం. పడక; ప్రా. పల్లంక, పలిఅంక. పల్లకి. పడక; అ.మా. పల్లంక, పల్లంగ. మంచం, పడక; పలిఅంక, పలియంక, పలిన్యంక, పలియంకఅ; మాగ. పలియంక; పా. పల్లంక. కానికపట్టు వేసుక్కూర్చోటం. పడక;

తు. పల్లెంకి. దానికపట్టు వేసుక్కూడోటం, పడక.

<పా. పల్లంక.

**ఆలంకిగుడి** వి. బాలక్రీడా విశేషం. రాజవా. 2.23. **ఆలంకులు** వి. బాలక్రీడా విశేషం, ఆలంకిగుళ్లు. విష్ణుపు. 7.211, హర. 3.186.

**ఆలంకిగుడి** చూ. ఆలంకి.

**ఆలంకులు** చూ. ఆలంకి.

**ఆలంగీరు** రూ. అలంగీరు. వి. విశ్వవిజేత.

ఉ. ఆలమ్‌గీర్. విశ్వవిజేత; ప్రా. ఆలమ్‌గీర్.

<ఉ. ఆలమ్‌గీర్.

**ఆలంగ్రావు** చూ. ఆలు[1].

**ఆలచిప్ప** చూ. ఆల.

**ఆలతి** రూ. ఆలత్తి, ఆళతి[1]. వి. రాగాలాపం. కు. సం. 4.468, దశకు. 9.38.

నం. ఆలపతి. సంభాషించు; ప్రా. ఆలత్త. <నం. ఆలప్త. ఆలపింపబడిన; పా. ఆలపతి. భాషించు; అప. ఆలత్త [*ఆలప్త, ఆలపిత]. నే. అలాప్, ఆలాప్; అ. ఆలాప్; ఒ. ఆలాప; హిం. అలాప్, ఆలాప్; గు. ఆలాప.

క. ఆళతి, అణతి; త. ఆళత్తి.

<నం. ఆలపతి.

**ఆలత్తి** రూ.చూ. ఆలతి. వి. రాగాలాపం.

**ఆలవ** చూ. ఆలించు. వి. వినటం, ఆలకించటం.

**ఆలవపాలవ** వి. రక్షణ, భద్రత; వ్యు. ఆలకించటం, ఆదరించటం.

**ఆలవపాలవ** చూ. ఆలవ.

**ఆలవదములు** చూ. ఏల[2]. వి. బ.వ. ఏలపాటలు, శృంగార పదాలు. శుక. 2.190.

**ఆలపాల** వి. ఎర్రమల్లితీగ, సీకామనోహరం (Pergularia pallida).

**ఆలపుచ్చు** చూ. ఆలము[2].

**ఆలపుటాలము** చూ. ఆలము[2].

**ఆలపాయి** రూ.చూ. ఆలె పొయ్యి. వి. గూడుపొయ్యి.

**ఆలపోతు** చూ. ఆలు[1].

**ఆలబుక్కుడు** చూ. ఆరబుక్కిడి.

**ఆలబొద్దుచుక్క** చూ. ఆలు[1].

**ఆలమంద** చూ. ఆలు[1].

**ఆలము[1]** వి. యుద్ధం. భార. విరా. 5.62.

నం. హేర-. యుద్ధం. హల-, కలహం, అడ్డంకి, వివాదం, ఆటంకం; ప్రా. హేరా. దెబ్బ.

పో.చూ. త. అలమ్. నాగలివంటి ఆయుధం; అళ్. యోధుడు. అణ్. మగటిమి. ధైర్యం; అట్కై. విజయం, ధైర్యం;

<నం. హల-.

**ఆలము[2]** పో.చూ. ఆలి[1]. **1.** అలక్ష్యం. ఉపేక్ష. అనాదరం. భార.విరా. 2.253; శాంతి. 4.581; **2.** వినోదం, భార. అశ్వ. 4.114; విఋ. అసత్యం. బసవ. 5 పు. 524 పం.

పో.చూ. త. చాలల్. నింద; నాణ్. తప్పిదం, గర్వం, కల్పన, నేర్పు; నాణ్మై. వైవిధ్యం, ఆత్మవంచన, తప్పిదం; నాణమ్. నింద.

**ఆలపుచ్చు** స.క్రి. ఉపేక్షచేయు, అనాదరం చేయు. తిరస్కరించు. పండి. చ. 4.306; **ఆలపుటాలము** వి. వినోదంకోసం చేసే యుద్ధం. భార.అశ్వ. 4.114. **ఆలము సేయు** స.క్రి. ఉపేక్షించు, ఉపేక్షసేయు. భార.విరా. 2.160.

**ఆలము[3]** వి. ప్రపంచం.

హిం.గు.మరా.ఉ.పార.అర. ఆలమ్. ప్రపంచం.

<ఉ ఆలమ్.

**ఆలముసేయు** చూ. ఆలము[2].

**ఆలమెకము** వి నక్క.

నం. ఆల-, వంచన; మెకము (<నం. మృగ-), మోసగించే జంతువు.

**ఆలంపనాహో** రూ. అలంపనా, ఆలంపనాహ్. వి. బిరుదనామం, జగద్రక్షకుడు.

ఉ.పార. ఆల్‌మ్‌పనాహ్. జగద్రక్షకుడు; అర. ఆల్‌మ్. ప్రపంచం; గు.హిం. ఆల్‌మ్.

<ఉ. ఆలంపనాహ్.

**ఆలరి** ఆల+అరి; -అరి మతుప్ ప్రత్యయం; పో.చూ. ఆలము[1]. వి. **1.** దుస్స్వభావుడు, దుష్టుడు. భార.ఆది. 7.213, శివరా. 3.105, భాగ. 3.380; **2.** అవివేకి, మూర్ఖుడు. భోజ. 4.25; **3.** అనాథ, భర్తృహీన. చెన్న. 4.315, పీర. వి. 4.112; విఋ. దిక్కులేని.

పో.చూ. త. ఆళం. సింహం ; అంటి. పసుపుగుడ్డలు కట్టుకునే జంగమ భిక్షుకుడు, జంగందేవర ; పో.చూ. మరా. అల్లడ. తుంటరి. అనుభవం లేని, తెలివితక్కువ.

**ఆల-రేడు** చూ. ఆలు[1].

**ఆల-ఱేఁడు** చూ. ఆలు[1].

**ఆలలు** వి. వరసగావుండే మూడు చుక్కలు.

పో.చూ. సం. ఆలి-. వరుస.

**ఆలవ** రూ.చూ. ఆళగ. వి. ఉడుమును పోలిన ఒక జంతువు, శల్యకం.

**ఆలవట్టము** రూ. ఆలావట్టము. వి. 1. వస్త్రంతో చేయబడిన గుండ్రటి విసనకర్ర. నిర్వ. 8.62, భార.స్త్రీ. 2.38 ; 2. గుండ్రటి విసనకర్రలాగా ఉండి, రాజాదులకు ఎండ తగుల కుండా పట్టే ఒక సాధనం. విజయ. 1.143.

సం. ఆలావర్త-. వస్త్రంతో చేయబడిన విసనకర్ర : క. ఆలవట్ట ; త. ఆలవట్టం.

<సం. ఆలావర్త-.

**ఆలసము** వి. ఆలస్యం, జాగు.

సం. ఆలస్య-. మాంద్యం, సోమరితనం, ఆలస, అ-లస-. సోమరి ; ప్రా. ఆలస్సమ్. జాగు, సోమరితనం ; అ.మా. ఆలస్సమ్, ఆలసియ. సోమరితనం, నిర్లక్ష్యం ; పా. ఆలస్సమ్ ; కా. ఆలిస ; నే. ఆలస్య, ఆలస ; ఒ. ఆలస. ఆలస్య : హిం. ఆలస ; పం. ఆల్‌సీ ; గు.జ. ఆలస్య ; మరా. ఆల్‌సీ ;

క. ఆలస. సోమరిపోతు. ఆలసు. బద్ధకం ; త. ఆలాచియామ్. జాగు, సోమరితనం, నిర్లక్ష్యం.

<ప్రా. ఆలస్స-.

**ఆలాకు** వి. వ్యర్థం.

**ఆలాగంటి** చూ. ఆ[3].

**ఆలాగు** చూ. ఆ[3].

**ఆలాటి** చూ. ఆ[3].

**ఆలాపన** వి. 1. ఒక విషయాన్ని గూర్చిన ఎడతెగని ఆలోచన ; 2. జ్వరంలో పలవరించటం.

సం. ఆలాపన-. సంభాషణ ; ప్రా. ఆలావ ; పా. ఆలాపనా ; నే. అలాప్, ఆలాప్ ; ఒ. ఆలాపన, ఆలాప ; గు. ఆలాప ; హిం. ఆలాపనా, అలాపనా ;

క. ఆలాపనే. సంభాషణ, రాగాలాపన ; త. ఆలాపనమ్.

<సం. ఆలాపన-. అర్థ విపరి.

**ఆలాయము**[1] పో.చూ. వాలయము. వి. సిద్ధం, యుక్తం ; విశ. సిద్ధమయిన. చూ. వాలాయము.

**ఆలాయము**[2] వి. పాత్రం, ఆశ్రయం.

సం. ఆలయ-. ఇల్లు, ఆశ్రయం ; ప్రా. ఆలయ ; పా. ఆలయ ; ఒ.గు. ఆలయ ; హిం. ఆలయ్.

<సం. ఆలయ-.

**ఆలావట్టము** రూ.చూ. ఆలవట్టము. వి. గుడ్డతోగానీ తాటాకుతో గానీ చేయబడ్డ విసనకర్ర.

**ఆలాహిదా** రూ.చూ. అలాహిదా. విశ. ప్రత్యేకం.

**ఆలి**[1] పో.చూ. నాలి. విశ. హీనం. నిర్వ.రా. 5.103. వి. పరిహాసం, గేలి. నిర్వ. 6.9.

క. ఆటి. అలక్ష్యం, ద్వేషం. అవమానం ; ఆటిగోళ్. అగౌరవించు, అణచు ; పో.చూ. త. ఏళితమ్, ఏళనమ్. పరిహాసం ; మ. ఏళితమ్ ; తె. ఎల్లిదము.

సం. ఆలి-. విశ. నిరుపయోగమైన, నిరర్థకమైన.

బహుశః <సం. ఆలి-.

**ఆలిగొను** స.క్రి. పరిహసించు, తక్కువచేయు. కిర్పరుచు: నిర్వ.రా. 5.134 ; భార.విరా. 4.18 ; భా.రా.అర. 2.383. **ఆలితనము**[1] వి. హీనత్వం, దైన్యం. భార.శల్య. 2.85. **ఆలిఁబుచ్చు** -పుచ్చు. స.క్రి. అవమానపరచు. పండి. చ. 4.306 వు. **ఆలిసేయు** (-చేయు). 1. క్షీణింప జేయు, చెరచు. పాడుచేయు. కు.సం. 4.409 ; 2. అనాదరంచేయు, తిరస్కరించు, దూషించు, నిందించు. పండి. చ. 1.77 వు., బసవ. 4.955 పం. ; 3. ఎగతాళి చేయు, తక్కువచేయు. సిం.ద్వా. 4.210.

**-ఆలి**[2] 'వలయును' యొక్క సంక్షిప్తరూపం. అవ్య. అవశ్యార్థంలో క్రియానుబంధం. ఉదా. : చెయ్యాలి, వినాలి.

**ఆలిగొను** చూ. ఆలి[1].

**ఆలిచిప్ప** రూ.చూ. ఆలచిప్ప. వి. ముత్తెపుచిప్ప వంటి ఒక విధమైన గుల్ల.

పో.చూ. క. ఆలికల్. వడగల్లు ; త. ఆలి. గుల్లచేప.

**ఆలించి-విను** చూ. ఆలించు.

**ఆలించు** పో.చూ. ఆలకించు. స.క్రి. 1. విను. భార.అర. 2.88 ; 2. ఆదరించు. విక్ర. 1.42, జై.భా. 4.126.

క. ఆలిసు, ఆలయిసు, ఆలయిసు. విను, వినిపించు ; త. ఆలు. ధ్వనిచేయు, అరచు ; పో.చూ. అల్. అవును.

<మూ.ద.ద్రా. *అల్-.

**ఆలించివిను** స.క్రి. శ్రద్ధగావిను. భార.అశ్వ. 1.90.

**ఆలితనము**[1] చూ. ఆలి[1].

**ఆలితనము**[2] చూ. ఆలు[2].

**ఆలిఁబుచ్చు** చూ. ఆలి[1].

**ఆలిసేయు** చూ. ఆలి[1].

**ఆలు**[1] ఆ[5]+లు బ.వ. ; చూ. ఆ[5]. వి. ఆవులు.

**ఆలకాపరి** రూ. ఆలగాపరి. వి. 1. పశువులకాపరి, గోపాలుడు. నా.పంచ. 3.301 ; 2. కృష్ణుడు. నీలా. 1.109. <ఆలు+కాపు+-అరి. **ఆలకాపు** రూ. ఆలఁగాఁపు. వి. పశువులకాపరి, గోపాలుడు. <ఆల+కాపు. **ఆలగాపరి** (-కాపరి). వి. పశువులకాపరి, గోపాలుడు. బహుళా. 2.61. <ఆల+కాపు+-అరి. **ఆలగోడుబాలగోడు** రూ. ఆలగోలుబాలగోలు. వి. ఏడుపులు, పెడబొబ్బలు. **ఆలగోలుబాలగోలు** రూ.చూ. ఆలగోడుబాలగోడు. వి. ఏడుపులు, పెడబొబ్బలు. **ఆలఁగాఁపు** రూ.చూ. ఆలకాపు. వి. పశువులకాపరి, గోపాలుడు. **ఆలపోతు** వి. ఎద్దు. ఉ.హ. 2.180. <ఆల+పోతు. **ఆలపొద్దుచుక్క** మేత చాలించి ఆవులు ఇళ్ళకు మళ్ళేవేళ కన్పించే చుక్క, శుక్రుడు. <ఆల+ప్రొద్దు+చుక్క. **ఆలమంద** వి. దగ్గర దగ్గరగా ఉండే నూరు చుక్కల గుంపు, శతభిష: అర్థవిపరి. **ఆలరేడు** రూ.చూ. ఆలఱేఁడు. వి. ఆబోతు. **ఆలఱేఁడు**

రూ. ఆలరేరు వి. అదోతు. నంది. పండి.చ. 5.372 వు.
<ఆల+జేరు.

**ఆలు**[2] బ.వ. ఆంధ్రు. వి. **1.** భార్య. భార.ఆది. 3.174, అశ్వ. 5.69 ; **2.** స్త్రీ. కు.సం. 6.672.

క. అవళు. ఆమె ; తు. అళు ; పో.చూ. త. ఇల్-ల్-అళ్. ఇల్లాలు ; మ. ఆళ్. స్త్రీ ; గోం. ఆలోఁజ. బాలిక ; పో.చూ. కుఇ. ఐఆలి. తల్లి, స్త్రీ ; పో.చూ. పర్జి. అయల్. స్త్రీ. భార్య ; పో.చూ. గద. అయల్. స్త్రీ ; పో.చూ. కొలా. అయ్ (?ఆయ్). వి (పలానావాడి) తల్లి ; కురు. ఆలీ. యువతి, భార్య.

<మూ.ద్రా. *ఆళ్.

**ఆలితనము**[2] వి. భార్యాత్వం. రామవ. 2.83 ; **ఆలు మగలయాట** ని. భార్యాభర్తలుగా అభినయిస్తూ బాలిక లాడుకొనే ఒక ఆట. దశా. 9.81.

**ఆలు**[3] వి. బంగాళదుంప.

సం. ఆలు-, ఆలుక ; ప్రా. ఆలుఅ ; పా. ఆలు, ఆలుక ; కా. ఆలూ ; నే.అ.బెం. ఆలు ; ఒ.హిం.పం.ల. మరా.ఉ. ఆలూ ; పార. ఆలూచహ్ ; అర. ఆలు.

< ఉ. ఆలూ. సంస్కృత 'ఆలు' శబ్దజన్యమని కొందరు.

**ఆలుగడ్డ** వి. ఉర్లగడ్డ, బంగాళదుంప.

**ఆలు**[4] వి. **1.** ఒకసారి ఏకిన దూది ; **2.** మరాను.

**ఆలుగ** రూ.చూ. ఆళుగ. వి. ఉడుమును పోలిన జంతువు, శల్యకం.

**ఆలుగడ్డ** చూ. ఆలు[3].

**ఆలుగోడ** వి. దూలాలు మోసే గోడ.

బహుశః <ఆను+గోడ.

**ఆలుచిప్ప** రూ.చూ. ఆలచిప్ప. వి. ముత్తెపుచిప్ప వంటి ఒక విధమైన గుల్ల.

**ఆలుడి** రూ.చూ. ఆలుడు. వి. మంచినడవడి, శీలం. ఆం.దా. 1.136.

**ఆలుడు** రూ. ఆలుడి. వి. సత్ప్రవర్తన.

పో.చూ. క. ఆళ్తన, అళుతన. సేవ, పాలన, అధికారం, పరాక్రమం ; పో.చూ. త. ఆళ్. పోషించు ; వి. భక్తుడు, సమర్థుడు, పౌరుషవంతుడు ; ఆళాతమ్. ప్రసిద్ధుడు.

**ఆలుదూలం** వి. తల్లిదూలానికి పక్కగదిలో వేసిన దూలం.

**ఆలుమగలయాట** చూ. ఆలు[2].

**ఆలువ** రూ.చూ. ఆళుగ. వి. ఉడుమును పోలిన జంతువు, శల్యకం.

**ఆలువరి** రూ.చూ. ఆళువరి. వి. కోట చుట్టూవేసిన మట్టిదిమ్మ. క్రీడా. 115.

**ఆలె** వి. చెరుకుగానుగ.

క. ఆలె, ఆలెగాణ. చెరుకురసం తీసే గానుగ ; తు. ఆలె ; త. ఆలై ; మ. ఆల. నూనెమర, కంసాలికొట్టు.

బహుశః <క. ఆలె.

**ఆలెకహొయ్యి** రూ.చూ. ఆలెహొయ్యి. వి. గూడుహొయ్యి.

**ఆలెగా(డు**[1] చూ. బ.వ. ఆస్లేకారులు. వి. పాలెగాండ్ల కింది కొలువుగాడు.

**ఆలెగా(డు**[2] వి. వీధులు మొ. ఊడ్చేవాడు.

ఉ.పార.హిం. హలాల్‌ఖోర్. పాకీవాడు.

<ఉ. హలాల్(ఖోర్)+కా(డు.

**ఆలెహొయ్యి** రూ. ఆలహొయి, ఆలెకహొయ్యి, ఆలెప్రొయ్యి, ఆలేహొయ్యి. వి. ఒకేసారిగా నాలుగైదు పాత్రలు వేరు వేరుగా పెట్టి వండటానికి ఏర్పరచిన గూడులాంటి హొయ్యి.

ఆలె < సం. ఆలయ -పాత్ర + హొయ్యి ; లేదా <సం. ఆలి- వరుస ; పాత్రల వరుసను బట్టి వచ్చి ఉండవచ్చు.

**ఆలెప్రొయ్యి** (కృతక ప్రామాణికం). రూ.చూ. ఆలెహొయ్యి. వి. గూడుహొయ్యి.

**ఆలేకాగు** వి. ఆలెహొయ్యిలో పెట్టిన పాత్ర.

<ఆలె+కాగు.

**ఆలేహొయ్యి** రూ.చూ. ఆలెహొయ్యి. వి. గూడుహొయ్యి.

**ఆలోన** ఆ[3] + లోన ; ఆ + లోన్ (ఉ) -అ(న్). అవ్య. అంతలో.

**ఆల్తి** రూ.చూ. అళితి. వి. కొలత, నమూనా.

**ఆల్బుక్రపండు** వి. ఒక రకం పుల్లటి పండు.

ఒ. ఆలూబొఖారా ; హిం.ఉ.పార. ఆలూబుఖారా ; త. ఆల్బుకోరా.

<ఉ. ఆలూబుఖారా+పండు.

**ఆళతి**[1] రూ.చూ. ఆలతి. వి. రాగాలాపన. వరాహ. 4.130.

**ఆళతి**[2] రూ.చూ. ఆరతి. వి. నివాళి, నీరాజనం. బసవ. 3.401.

**ఆళితము** రూ.చూ. అళితి. వి. ధర, కొలత.

**ఆళితి** రూ.చూ. అళితి. వి. కొలత, నమూనా.

**ఆళీ** రూ.చూ. అళితి. వి. కొలత, నమూనా.

**ఆళుగ** రూ. ఆలవ, ఆలుగ, ఆలువ, ఆళువ. వి. ఉడుమును పోలిన జంతువు. శల్యకం.

క. ఆళువె; కొడ. వెళ్ళువె ; తు. అళంకు, అలంకు; త. అయుంకు, అళుంకు, నళుంకు ; మ. అళ్లువన్.

**ఆళుతనము** వి. ప్రభుత్వం, అధికారం. భా. రా. అర. 2.371.

క. అళుతన, ఆళ్తన. ప్రభుత్వం. అధికారం, సేవ ; త. ఆట్చి. ప్రభుత్వ యాజమాన్యం.

<క. ఆళుతన-.

**ఆళులు** వి. బ.వ. సేవకులు, భటులు. కు.సం. 11.616.

క. ఆళు. సేవకుడు, సైనికుడు, వార్తాహరుడు ; తు. ఆళి. సేవకుడు ; త. ఆళ్. సేవకుడు, బానిస ; మ. ఆళ్.

బహుశః <క. ఆళు.

<మూ.ద.ద్రా. *ఆళ్.

**ఆళువ** రూ.చూ. ఆళుగ. వి. ఉడుమును పోలిన ఒక జంతువు, శల్యకం. రం.రా. 4.212 వు. 22 పం.

**ఆళువరి** రూ. అలవరి, అళువరి, ఆడువరి, ఆలువరి. వి. కోట చుట్టూ వేసిన మట్టిదిమ్మ, వప్రం. ఉ.హ. 2.92.

క. ఆళ్వరి, అళువేరి. వప్రం ; అళ, అళె, అళ,

ఆళి, అళు ; త. అళ్వారి. చెరువుగట్టుమీది దోవ.

**ఆళువారు** రూ.చూ. ఆళ్వారు. వి. విష్ణుభక్తుడు. ద్రావిడ ప్రబంధ కర్త. పరమ. 4.218.

**ఆళ్మఘూణము** (అళ్ + మాఘూణము). వి. కింది ఉద్యోగులు, బంట్రోతులు వగైరా.

క. ఆళ్. సేవకుడు, సైనికుడు, వార్తాహరుడు, చదరంగపు పావు ; మాగాణి ; ఒక జిల్లాలోగానీ తాలూకాలోగానీ కొంత ప్రదేశం ; త. ఆళ్మకాణమ్. ఒక పనికోసం ఒక చోట చేరిన సేవకుల సమూహం ; మ. అళ్. సమర్థుడు, సేవకుడు, దాసిన ; మాకణి. ఒక జిల్లాలో కొంత ప్రదేశం.

< త. ఆళ్మకాణమ్.

**ఆళ్లకోవ** వి. ఒక జాతి కాకి.

పో.చూ. త. అంటుంకాక్కై. ఒక జాతి కాకి.

బహుశః < ఆళ్లు-అ + కోన < సం. కోశ. ధాన్యాగారం ; ధాన్యం దొంగిలించటంవల్ల కాకికి ఆపేరు వచ్చి ఉండవచ్చు.

**ఆళ్లు** రూ.చూ. ఆల్లు. చూ. ఆరిక. వి. బ.వ. ఆరికలు, కోద్రవం (Paspalum scrobiculatum). శుక. 2.208.

**ఆళ్వారు** రూ. ఆడువారలు, ఆడువారు, ఆడువాళ్లు, ఆళువారు. వి. 1. విష్ణుభక్తుడు. ద్రావిడ ప్రబంధకర్త. పరమ. 4.218; 2. వైష్ణవ పవిత్రతావాచకం. ఉదా. *గరుడాళ్వారు*. పవిత్రుడైన గరుడుడు ; *కోవెలాళ్వారు*. పవిత్రమైన కోవెల, గర్భగుడి.

క. *అడ్వార్*, *ఆళ్వార్*. భక్తులు, పన్నిద్దరు వైష్ణవ వేదాంతుల బిరుదపదం ; త. *అడ్వార్*. ధ్యాన మగ్నుడు, ద్రావిడ ప్రబంధకర్త ; *ఆళ్వార్*. జగత్ప్రభువు, భగవంతుడు ; మ. *అళ్వార్*, *ఆఖువార్*. పన్నిద్దరు వైష్ణవ వేదాంతుల బిరుదపదం ; ప్రభువు, భక్తుడు.

< త. ఆళ్వార్.

**ఆళ్వారుగడ్డ** వి. చిరుగడదుంప, గెనుసుగడ్డ.

**ఆవ**[1] వి. 1. ఆవాలు, సర్షపం. మార్క. 3.202 ; 2. ఆవపిండి ; ఆవాలపిండి కలిపి చేసిన ద్రవపదార్థం. శృం.నై. 6.127, వి. పు. 2.58 ; 3. ఆవచెట్టు (Brassica juncea).

సం. *సర్షప*-. ఆవ ; ప్రా. *సరిసవ*, *సరిస్సవ*. అ.మా. *సరసవ*, *సరిసవ*, *సాసవ* ; పా. *సాసవ* ; అప. *సరిసవ* ;

క. *సాసవె*, *సాసివె* ; తు. *సాసెము*, *దాసెమి* ; త. *ఐయవి* ; కువి. *అవ*.

< *సావ < *సాసవ < ప్రా. సరిసవ < సం. సర్షప-.

**ఆవకాయ** వి. ఆవపిండితో కలిపిపెట్టిన మామిడికాయ పచ్చడి. **ఆవగించు** 1. కూరలకు ఆవపిండి పెట్టు ; 2. పసుపు ఉప్పుతో కలిపి రుద్ది మాంసాదుల్ని భద్రపరుచు. **ఆవగింజ** వి. సర్షపం. **ఆవంత** విశే. కొంచెం. ఆవగింజంత. భార.కర్ణ. 3.288 ; **ఆవపచ్చడి** వి. ఆవపెట్టి చేసినపెరుగు పచ్చడి. **ఆవపిండి** వి. ఆవాలపిండి. **ఆవమామిడికాయ** వి. ఆవపిండి, నూనె, మొ. వాటితో కలిపిపెట్టిన మామిడికాయ ఊరగాయ. **ఆవలు** రూ.చూ. ఆవాలు. వి. బ.వ. ఆవగింజలు. **ఆవాలు** రూ. ఆలలు, ఆవలు. వి. బ.వ. ఆవగింజలు.

**ఆవ**[2] వి. స్మృతి, జ్ఞప్తి.

బహుశః < *యావ (వ్యా) < ఉ. యాద్.

**ఆవపాఱు** స.క్రి. జ్ఞప్తికివచ్చు, తోచు.

**ఆవ**[3] వి. 1. దారవ, పల్లపునేల ; 2. పరిపైరుకు అనువైన భూమి ; 3. కొండలమధ్య ఉన్న సహజ జలాశయం.

త. *అవల్*. పల్లం, సాగుబడి భూమి, చెరువు; *చవళ్* చవుడు.

**ఆవ**[4] రూ.చూ. ఆవి[1]. వి. పంట తెగులు.

**ఆవ**[5] వి. గడ్డివామి, మేట.

**ఆవకాయ** చూ. ఆవ[1].

**ఆవగించు**[1] చూ. ఆవ[1].

**ఆవగించు**[2] రూ.చూ. ఏవగించు. అ.క్రి. విసుగుచెందు.

**ఆవగించు**[3] చూ. ఆవి, ఆవించు. స.క్రి. ఉడుకబెట్టు.

**ఆవగింజ** చూ. ఆవ[1].

**ఆవజకాఁడు** చూ. ఆవజము.

**ఆవజము** వి. ఆరజం, వాద్యవిశేషం. ఆము. 4.35, రామా. 2.89.

సం. ఆతోద్య-. వాద్యవిశేషం ; ప్రా. ఆఒజ్జ; అ.మా. *ఆఒజ్జ*, *ఆఒజ్జమ్*, *అవజ్జమ్* ; ఒ. *అబాజ్*. ధ్వని ; హిం. *ఆవజ్*. వాద్యవిశేషం ; ముండారి. *అఒఆజ్*.

క. *అవ్రజ*. వాద్యవిశేషం ; *అవ్రజిగ*. ఆవజం వాయించేవాడు.

< ప్రా. ఆఒజ్జ-.

**ఆవజకాఁడు** వి. ఆవజం వాయించేవాడు. **ఆవజీఁడు** వి. ఆవజం వాయించేవాడు.

**ఆవజీఁడు** చూ. ఆవజము.

**ఆవటము** విశే. అనుకూలం, వీలైనది. శృం.నై. 7.108, భాగ. 4.136 ; వి. పొందిక.

సం. *ఆవస్థ*, *అవస్థికా*. పరిస్థితుల కనుగుణంగా పొందుపడినది ; అనుకూలమయినది ; ప్రా. *అవట్ఠిఅ*, *అవట్ఠిఅ* ; అమా. *ఆవ్రత్థ*.

< ప్రా. అవట్ఠిఅ.

**ఆవటముచేయు** స.క్రి. 1. సిద్ధంచేయు. భాగ. 10. ఉ. 346 ; 2. పొందుపరుచు. పాండు. 2.229. **ఆవటించు** స.క్రి. 1. కలిగించు, కావించు. దశకు. 7.113 ; 2. వహించు, పూను. ద్వి.పరమ. 6.459 పు. 9 పం ; 3. సంగ్రహించు, సేకరించు. హరి. పూ. 9.102; 4. పొందుపరుచు, సవరించు. పి.శకు. 2.161 ; 5. తిను, భక్షించు. ఉ.రా. 3.191. **ఆవటిలు(ల్లు)** అ.క్రి. 1. పొందుపడు. రా.మా. 8.175 ; 2. కలుగు. ఆం.భా. 3.94.

**ఆవటముచేయు** చూ. ఆవటము.

**ఆవటించు** చూ. ఆవటము.

**ఆవటిలు(ల్లు)** చూ. ఆవటము.

**ఆవడ**[1] వి. అడవి బీర. ఆం.భా. 2.60.

క. *అవడె* ; తు. *అవడ* ; త. *ఆమటి*.

**ఆవడ**[2] రూ.చూ. ఆమవడ. వి. పెరుగు గారె.

**ఆవడి**[1] రూ.చూ. హావళి. వి. ఉపద్రవం, బాధ. అచ్చరా. నుం. 138, ఆం.భా. 2.223.

**ఆవడి**[2] వి. 1. రట్టు, అల్లరి ; 2. వదంతి, వకారు.

**ఆవవాయము** పో.చూ. ఆవ[3]. వి. ఆయవిశేషం.

**ఆవని-** సమస్తంగా మాత్రమే ప్రయుక్తం ; చూ. ఆవల. విశే. బహుళ, రెండు రోజుల ముందు లేదా తరువాత.

**ఆవనిమొన్న** రూ.చూ. ఆవలిమొన్న. వి. అటుమొన్న ; మూడు రోజుల పూర్వం రోజు ; **ఆవనెల్లింటిహి** రూ.చూ. ఆవలియెల్లుండికి. వి. మూడు రోజుల తర్వాతి దినం. <ఆవని (<ఆవలి) + ఎల్లింటిహి (<ఎల్లింటికి).

**ఆవనిమొన్న** చూ. ఆవని.

**ఆవనెల్లింటిహి** చూ. ఆవని.

**ఆవంత** చూ. ఆవ[1].

**ఆవవచ్చడి** చూ. ఆవ[1].

**ఆవపాలు** చూ. ఆవ[2].

**ఆవపిండి** చూ. ఆవ[1].

**ఆవమామిడికాయ** చూ. ఆవ[1].

**ఆవము** రూ. ఆమము. వి. కుమ్మరి కుండలు మొ. కాల్చటానికి ఏర్పరచిన కావు. ఆవాపం. భార. 2.134, ఉ.హ. 3.48.

సం. *అపాక*. కావు ; *ఆవాప*. దొంతరగా పేర్చటం ; ప్రా. *ఆవాగ*, *ఆవాయ*. కుమ్మరి అవం ; అ.మా. *ఆవాఅ*, *ఆవాగ*, *ఆవాయ* ; పా. *ఆవాప* ; నే. *ఆవాల్* ; ఒ. *ఉహ* ; బీ. *ఆవా*, *అఁవాఁ* ; హిం. *ఆవా*, *ఆవాఁ*, *ఆంబాఁ* ; పం. *అవా*, *ఆలీ* ; ల. *అవా*, *ఆలీ* ; మరా. *ఆవ*, *ఆవం*, *ఆవా* ;

క. *ఆమ*, *ఆవి*, *ఆవిగె*, *ఆవ్రగె* ; తు. ఆవె. కుమ్మరావం ; *ఆవెమణ్ణు*. కుమ్మరి మట్టి.

<మరా. ఆవ.

**ఆవరింత** రూ.చూ. ఆవులింత. వి. జృంభణం, ఆవలింత.

**ఆవర్జా** రూ. ఆవర్దా, ఆవార్జా. వి. దినచర్య పుస్తకం, పద్దు పుస్తకం, కాతా పుస్తకం ; జమాఖర్చు పుస్తకం.

సం. *ఆవర్జ్య*. తోసిపుచ్చటం ; నే. *ఆవర్జె*. పునః పరిశీలన, సరిచూడటం, పద్దు పుస్తకం ; మరా. *ఆవర్జా*. పద్దు పుస్తకం ; ఉ. *ఆవర్జా* ; పార. *ఆవారిజ్*.

క. *ఆవర్జా*, *ఆవర్జి*. పద్దు పుస్తకంలో ఒక ప్రత్యేకమైన పద్దు ; త. *ఆవర్జా*. రోజువారీ పద్దు పుస్తకం.

<ఉ. ఆవార్జా.

**ఆవర్దా** మా.చూ. ఆవర్జా. వి. దినచర్య పుస్తకం.

**ఆవల** ఆ[3]+వల ; -వల. పక్క, వైపు. రూ. అవ్వల, అవల, అవుల, ఔల. క్రి.విశే. 1. తర్వాత. భార. భీష్మ. 1.186 ; 2. అవతల. భార. అను. 5.70 ; 3. ఆవైపు. శృం.నై. 2.66 ; విశే. అవతలిది, అన్యం, ఇతరం. భార. ఉద్యో. 4.196.

<మూ.ద్రా.*ఆ (నిర్దేశసర్వ.) + మూ.ద్రా.*వలమ్.

**ఆవలివాఁడు** వి. మూడు రోజుల తర్వాతి రోజు, ఆవలెల్లుండి <ఆ-వల+ఇ+నాఁడు. **ఆవలిమొన్న** రూ. ఆవనిమొన్న. వి. మూడు రోజుల పూర్వం రోజు, అటుమొన్న. ఆం.భా. 1.92. <ఆవల+ఇ+మొన్న. **ఆవలియెల్లుండికి** రూ. ఆవనెల్లింటిహి. వి. మూడు రోజుల తర్వాతి రోజు, ఆవలెల్లుండి. ఆం.భా. 1.92. <ఆవల+ఇ+ఎల్లుండి.

**ఆవలి** రూ.చూ. హావళి. వి. ఉపద్రవం. హరి. 4.124, వసు. 3.126.

**ఆవలించు** రూ.చూ. ఆవులించు. అ.క్రి. 1. జృంభించు. వరాహ. 11.126 ; 2. పగులు, బద్దలగు. పార్వ. 2.101, చంద్రా. 3.85.

**ఆవలింత** రూ.చూ. ఆవులింత. వి. జృంభణం. ద్వి.శ. సా. 1.34 పు. 14 పం, ఆం.భా. 1.141.

**ఆవలివాఁడు** చూ. ఆవల.

**ఆవలింత** చూ. ఆవలించు.

**ఆవలిమొన్న** చూ. ఆవల.

**ఆవలియెల్లుండికి** చూ. ఆవల.

**ఆవలు** చూ. ఆవ[1].

**ఆవళి** రూ.చూ. హావళి. వి. ఉపద్రవం, బాధ. ఉ.హ. 4.124, చమ. 1.25, శ్రీరం. మా. 4.88.

**ఆవాజు** వి. శబ్దం.

హిం. *ఆవాజ్*. స్వరం, శబ్దం ; ఉ. *ఆవాజ్* ; పార. *ఆవా*, *ఆవాజ్*.

<ఉ. ఆవాజ్.

**ఆవాయిసువాయిలు** చూ. అవాయిచువ్వ. వి. బ.వ. ఆకాశ బాణాలు, ఒక విధమైన బాణసంచు.

**ఆవారి** వి. పెద్ద రైతు దగ్గర జీతగాళ్లచేత వ్యవసాయం చేయించేవాడు.

**ఆవార్జా** రూ.చూ. ఆవర్జా. వి. దినచర్య పుస్తకం.

**ఆవాలు** చూ. ఆవ[1].

**ఆవి**[1] రూ. ఆవ[4]. వి. 1. ధ్యానం, ఊపిరి. భార. ఉద్యో. 3.41 ; 2. ఊష్మం, ఆవిరి. పి.శకు. 3.176, ఆము. 4.134 ; 3. తాపం, వేడి. విజయ. 2.53 , 4. సస్యరోగం, చీడ. ఆం.భా. 2.124.

క. *ఆవరి*, *ఆవి*, *ఆవిరి*. వేడి, ఆవిరి ; తు. ఆవి. ఆవిరి ; త. ఆవి. ఊపిరి, నిట్టూర్పు, ఆవలింత, ఆవిరి, పొగ ; అవి. అ.క్రి. నీటిలోగానీ ఆవిరిపైగానీ ఉడుకు ; మ. అవి. ఊపిరి, ప్రాణం, ఆవలింత, నిట్టూర్పు, ఆవిరి ; కో. అయ్వ్. ఆత్మ, ఆవిరి ; తొ. ఒఫ్య్. ఊపిరి, ఆవిరి ; పర్జి. అకుచ్. ఆవిరి.

ఆవులించేటప్పుడు వచ్చే 'ఆవ్' అనే ధ్వని నుంచి వచ్చి వుండవచ్చు.

<మూ.మ.ద్రా. *ఆవ్-.

**ఆవించు** స.క్రి. ఆవిరిపై వండు, ఆవిరితో పక్వంచేయు.

**ఆవి**[2] వి. బైబిలు కథనంలోని అవ్వ, ఆదాము భార్య.

హీబ్రూ. *హవ్వ* ; లా. *ఈవా* ; ఇం. *Eve*.

<హీబ్రూ. Hawwā.

**ఆవించు** చూ. ఆవి[1].

**ఆవిటి** పో.చూ. ఆమని. వి. మృగశిరకార్తె.

**ఆవిటిగాలి** వి. తొలకరిలో వీచేగాలి. **ఆవిటివాన** వి. తొలకరిలోపడే వాన. **ఆవిటివారాలు** వి. దమ్ముల ముందు

జూన్ నెల (మృగశిరకార్తె)లో చేసే గ్రామదేవత పూజ.
**ఆవిటిగాలి** చూ. ఆవిటి.
**ఆవిటివావ** చూ. ఆవిటి.
**ఆవిటివారాలు** చూ. ఆవిటి.
**ఆవిడ** చూ. ఆ[3].
**ఆవిడి** రూ.చూ. హావళి. వి. ఉపద్రవం, బాధ.
**ఆవిడె** చూ. ఆ[3].
**ఆవిరి[1]** చూ. ఆవి[1]. పో.చూ. ఆవుర. వి. 1. ఒకానొక వ్యాధి. పండి. చ. 1.51 వ.; 2. ఊష్మం, ఆవి. ఆము. 2.60.

క. *అవరి, ఆవిరి.* వేడి; మ. *అవతి.* ఊపిరి, ఆవిరి.

<ఆవి[1] + -ఇరి ; -ఇరి ప్రత్యయం.

**ఆవిరి[2]** వి. బిళ్లగడ్డి (Saccharum spontaneum).
**ఆవిలి** వి. 1. బట్టి; 2. మాంత్రికుడు ఉపయోగించే కాచపాత్ర విశేషం.
**ఆవు** చూ. ఆ-[5], ఆఁ-, ఆమ్-[1]. వి. ఆవు, గోవు. భార. అను. 4.22.

క. *ఆవు,* అ. గోవు; అకళ్. ఆవులు; కొ. *అవ్.* ఆవు; త. అ. ఆవు, ఎద్దు; *అన్*; మ. అ. ఆవు; కురు. *ఓయ్.* ఆవు; మాల్తో. ఒయు. ఆవు, ఎద్దు.

<మూ.ద.ద్రా.* ఆ./*ఆన్ <మూ.ద్రా.* ఆ-.

**ఆవులదొడ్డి** వి. శతభిషా నక్షత్రం, దగ్గిరదగ్గిరగా వుండే నూరు చుక్కల గుంపు.

**ఆవుర** వి. ఆవులింతకు అనుకరణం. క్రీడా. 226.

**ఆవురింత** రూ.చూ. ఆవులింత. వి. జృంభణం, ఆవులించటం.

**ఆవురింత** చూ. ఆవుర.
**ఆవురు** అవ్య. 1. ఏడ్పునందలి ధ్వనికి అనుకరణం. భాగ. 10, పూ. 148, పరమ. 2.176; 2. తహతహపాటును తెలిపే ధ్వన్యనుకరణం.
**ఆవురుగడ్డి** రూ.చూ. అవురుగడ్డి. 1. వీరణం; 2. అగురు[2].
**ఆవులదొడ్డి** చూ. ఆవు.
**ఆవులించు** రూ. ఆవలించు. అ.క్రి. 1. వికసించు, విచ్చు. కు. సం. 3.351; 2. నోరు తెరచు. నిర్వ. 4.40, 3. ఆవులింత విడుచు, జృంభించు. భార.ఉద్యో. 1.125; 4. పగులు, బద్దలగు; 5. చనిపోవు.

క. అకళిసు. ఆవలించు, నోరు తెరచు; కొడ. *అవళిచ్ (అవళిచి).* ఆవులించు; తు. *ఆవల్.* ఆవలింత: *ఆవలిదెపిని.* ఆవలించు; త. అవి. అ.క్రి. నిట్టూర్చు, ఆవలించు; *ఆవలమ్.* విచారం, బాధ; మ. ఆలిఖత్. ఆవలించు; కోట. *అవజ్*, తొ. *ఒపుల్య్*; పర్జి. *అవ్.*; *అవ్‌కుడ్.* ఆవలింత; *అకుబ్.* ఆవలించు; గద. *ఆయ్*; ఒల్లా. *అమ్*; కురు. *ఔలఅనా.*; మాల్తో. *అవాలె*; బ్రా. *ఆవానింగ్.*

<మూ.ద్రా. *ఆవళ్.

**ఆవులింత** రూ. ఆవరింత, ఆవలింత, ఆవురింత. వి. జృంభణం. భార.విరా. 1.137, కృ.శ.కు. 2.87.

**ఆవులింత** చూ. ఆవులించు.
**ఆశపాశలు** -పాశ. జంటపదం. వి. బ.వ. ఆశానుబంధాలు. సువచ. 4.61.

సం. *ఆశాపాశ*- ఆశ అనే పాశం.

<సం. ఆశాపాశ-.

**ఆశాగూడు** వి. నగిషీపనిచేసిన గూడు.

అ. *అసా.* అలంకృత దండం; హిం.ఉ. *అసా.* రాజుల ముందు లేదా వివాహ మహోత్సవాదుల ముందు చోపుదారులు ధరించెడి దండం.

**ఆషాఢపట్టి** రూ. ఆషాఢభట్టి. వి. పెళ్లి అయిన తర్వాత తొలి ఆషాఢంలో అత్తవారు అల్లుడికి పంపే కానుకల మొత్తం.
**ఆషాఢభట్టి** రూ.చూ. ఆషాఢపట్టి.
**ఆషాఢభూతి** వి. 1. ఒక వ్యక్తిపేరు. పంచ. 1.224; 2. వంచకుడు, మోసగాడు.

పో.చూ. సం. *ఆషాఢభూతి*-. పంచతంత్రలో ఒక పాత్ర పేరు; *అషాఢ*-. అజేయమైన, *భూతి.* ఐశ్వర్యం కలవాడు; ప్రా. *ఆసాఢభూఇ.* ఒక జైనముని; అ.మా. *ఆసాఢభూఇ, ఆసాఢభూఇ*; మరా. *ఆఖాఢభూతీ*;

క. *ఆషాఢభూతి.* ఒక వ్యక్తి పేరు. మోసగాడు; త. *ఆషాటుపూతి.*

<సం. ఆషాఢభూతి-. అర్థ విపరి.

**ఆషామాషి** రూ. ఆషామూషి. వి. నిర్లక్ష్యం, తేలిక.
**ఆషామూషి** రూ.చూ. ఆషామాషి.
**ఆషూర్‌ఖానా** రూ. ఉసురుఖానా. వి. 1. పీర్లపంజా; 2. సత్రం.

ఉ. *అషూర్, ఆషూరా.* మొహరం నెలలో పదోరోజు; *అషూర్‌ఖానహ్.* పీర్లపంజా; పార. *అషూర్, ఆషూరా.* మొహరం నెలలో పదోరోజు; అర. *అషూర్, ఆషూరా.*

<ఉ. ఆషూర్‌ఖానహ్.

**ఆస[1]** వి. అపేక్ష, కోరిక, అభిలాష, ఇచ్ఛ. భార.విరా. 1.148.

సం. *ఆశా.* అపేక్ష, కోరిక; ప్రా. *ఆస*; అ.మా.పా. *ఆసా*; అప. *ఆసా, ఆస*; కుమా.నే.బెం.హిం.ల.గు. మరా. *ఆస్*; సిం. *ఆస, ఆహ*;

క. *ఆసె, ఆశె*; తు. *ఆసె*; త. *అవై*; మ. *ఆశ.*

<సం. ఆశా.

**ఆసగొను** ఆస + కొను. అ.క్రి. ఆసగలిగియుండు; త. *అవై-కొళ్.* **ఆసగొలుపు** ఆస + కొలుపు. 'ఆసగొను' యొక్క ప్రేరణ; రూ. ఆసగొల్పు. స.క్రి. ఆశకలిగించు. శుక. 4.7. **ఆసగొల్పు** రూ.చూ. ఆసగొలుపు. స.క్రి. ఆశకలిగించు. **ఆసచేయు** అ.క్రి. ఆశకలిగియుండు. దశకు. 9.21. **ఆసపడు** అ.క్రి. 1. ఆసగొను, ఆపేక్షపడు. భార.విరా. 3.90; 2. ఆశ్చర్యపడు. దశకు. 9.45; స.క్రి. కోరు, ఆశించు. భార.కర్ణ. 2.21. క. *ఆసెపడు,* ఆసెపడు. కోరు; తు. *ఆసెబుడు*; త. *అవైప్పడు*; మ. *ఆశ-ప్-పెట్టుక.* **ఆసపాటు** చూ. ఆసపడు. వి. అపేక్ష, కోరిక. భార.అశ్వ. 1.203. త. *అవై.ప్.పాటు.* **ఆసమాలు** అ.క్రి. ఆశవిడుచు, నిరాశచెందు. హరి.పూ. 8.152. **ఆసయుడుగు** అ.క్రి. ఆశవిడుచు, నిరాశచెందు. **ఆసలుడుగు** అ.క్రి. ఆశలువిడుచు. **ఆసవిఱుపు** వి. ఆశాభంగం. శుక. 3.20. **ఆసవేయు** -చేయు

అ.క్రి. ఆశ కలిగియుండు. వి.పు. 6.341. **ఆసాన** శృంగారంలో పునరుక్తం. వి. అధికాశ. పారి. 3.51. **ఆసానలు** వి. బ.వ. గొప్ప ఆశలు ; అధికాశలు. భార.విరా. 5.280, శాంతి. 3.153. **ఆసిచ్చు** న.క్రి. ఆశ కలిగించు. భాగ. 5.185. **ఆసించు** న.క్రి. అపేక్షించు. భార.అశ్వ. 1.36 ; క. ఆశిసు. కోరు, దీవించు ; త. ఆచి. కోరు.

**ఆవ[2]** వి. దిక్కు. ఆం.భా. 1.71.

నం. ఆశా. ప్రదేశం, దిక్కు ;

క. ఆశె, ఆశా, ఆశ, ఆసె ; త. అవై ; మ. ఆస.

<నం. ఆశా.

**ఆవకప్పెరగాడు** వి. పక్షి విశేషం ; గుండుములుపుగాడు పిట్ట. బహుశః <ఆవ-(ఆశ)+కప్పెర-(పాత్ర)+-కాఁడు (కలవాడు) ; పేరాసగల పక్షి.

**ఆవగొమ** చూ. ఆవ[1].

**ఆవగొలుపు** చూ. ఆవ[1].

**ఆవగొల్పు** చూ. ఆవ[1].

**ఆవచేయు** చూ. ఆవ[1].

**ఆవతప్పడాయి** వి. పక్షివిశేషం ; పెద్దతల ఎర్రటి శరీరంమీద తెల్లటి మచ్చలుగల పక్షి : ఏమాత్రం అలికిడి అయినా ఏ ఆకు చాటునో నక్కుతుంది.

<ఆవ+తప్పు+డాయి ; పిరికితనాన్నిబట్టి ఈ పేరు వచ్చివుంటుంది.

**ఆవత్తి** వి. ప్రేమ, అపేక్ష.

నం. ఆసక్తి- .తత్పరత్వం, అపేక్ష ;పో.చూ. ఆసత్తి. సాన్నిహిత్యం ; ప్రా.అ.మా.పా. ఆసత్తి ;

త. అచత్తి (<ఆ-సక్తి-).

<నం. ఆసక్తి-.

**ఆవపవిత్రము** చూ. ఆవవము. వి. ఆవవంలో పుట్టే ఒక విధమయిన వ్యాధి.

**ఆవవము** వి. గుదం.

నం.పా. ఆసన-. కూర్చోటం, పీటం ; ప్రా. ఆసణ ; అ.మా. ఆసణ, ఆసన ;

త. ఆచనమ్. గుదం, మలాశయం.

<నం. ఆసన-. అర్థ విపరి.

**ఆవవడు** చూ. ఆవ[1].

**ఆవపాటు** చూ. ఆవ[1].

**ఆవపాతకు(డు** వి. ఆశపోతు, పిసినిగొట్టు. చూ. ఆవ[1].

పో.చూ. సం. ఆశా. ఆశ.

<నం. ఆశాపాతక-. వ్యు. లోభంవల్ల పాపి.

**ఆవమాలు** చూ. ఆవ[1].

**ఆవము** వి. బియ్యపు పిండితో చట్టిలో కాల్చిన దోసె వంటి తినుబండారం ; ఇది మధ్య లావుగా వుంటుంది ; ఆపము.

**ఆవయుదుగు** చూ. ఆవ[1].

**ఆవరా** రూ. ఆశ్రా. వి. రక్షణ, ఆధారం.

నం. ఆశ్రయ-. స్థానం, నివాసం, ఆధారం ; అమా. ఆసయ. ఇల్లు ; ఆశ్రా. తగినచోటు ; కా. ఆసర ; నే. ఆస, ఆశ్రా, ఆశ్రస, ఆశ్రా. ఆశ, రక్షణ ; బెం. ఆస, ఆశ్రా. బీ. పం. ఆస, ఆశ్రా ; సిం. ఆసర, ఆసిణ ; మరా. ఆసరా ; కుమా. ఆశ్రా ; హిం. ఆసరా. జలాధారం కింది భూమి ; గు. ఆసరొ ; ఉ. ఆస్రా. నమ్మకం, రక్షణ, ఆధారం ;

క. ఆసర, ఆసరె. ఆధారం, రక్షణ, సహాయం.

<ఉ. ఆస్రా.

**ఆవరాకవులు** వి. ఆవరాతో కూడిన కవులు. **ఆవరాదారు(డు)** వి. అండగలవాడు. <ఉ. ఆస్రాదార్. **ఆవరాపక్తా** వి. కవులుకుకాక, భూమి ఖామందు ఖర్చుమీద పాలికి సాగుచెయ్యటం. **ఆవరాశిష్టు** వి. ఒక నియతమయిన సొమ్ము.

**ఆవరాకవులు** చూ. ఆవరా.

**ఆవరాదారు(డు)** చూ. ఆవరా.

**ఆవరాపక్తా** చూ. ఆవరా.

**ఆవరాశిష్టు** చూ. ఆవరా.

**ఆవరు** అ.క్రి. అలయు. పి. శకు. 3.191.

క. అసుర్, ఆసళ్, ఆసఱ, ఆసఱు. అలయు, అలసట ; తు. అసర. అలసట, దప్పి ; అసరాపుని. దగగొను ; పో.చూ. త. అయర్, అచర్. సొమ్మసిల్లు ; మ. అశతి. అలయు, మాంద్యం, మత్తు, మరవు.

**ఆవలుదుగు** చూ. ఆవ[1].

**ఆవవిలువు** చూ. ఆవ[1].

**ఆవసేయు** చూ. ఆవ[1].

**ఆసాది** వి. 1. మాదిగ, చెప్పులు కుట్టేవాడు. ఆం.భా. 2.287 ; 2. గ్రామ దేవతను పూజించే పూజారి. క్రీడా. 147.

నం. ఆసాదీ. దగ్గరకు తీసుకుపోయేవాడు (దేవత దగ్గరకు పూజారిలాగా) ; ఈ పూజారులు మాదిగ కులం వారు ; కాబట్టి ఆసాది, మాదిగ అనే అర్థంలో రూఢి అయింది.

<నం. ఆసాదీ.

**ఆసాది-ఇనాము** చూ. ఆసాది. వి. గ్రామదేవత ముందు తప్పెట వేసేవాడి కిచ్చే ఇనాము.

<ఆసాది+ఉ. ఇనామ్.

**ఆసాను** విణ. తేలిక, సుకరం, అనువు ; వి. ఆధారం, అండ.

నే. ఆసాని. తేలిక, సౌకర్యం ; ఒ. ఆసాన్ ; హిం. ఆసాన, ఆసాని. నిజాయితీ, ఆర్జవం ; ఉ. ఆసాన్. తేలిక ; ఆసాన. అనువు, ఆర్జవం, నిజాయితీ, మార్దవం ; ఆసానియత్. పార. ఆసాన్, ఆసాని.

<ఉ. ఆసాన్.

**ఆసామి** వి. ఒక మనిషి, మద్దాయి, కవులుదారు, పాలికాపు, రైతు.

నే. ఆసామి. అధమర్ణుడు ; ఒ. గు. మరా. పార. ఆసామీ. ఒక మనిషి ; ఉ. అసామీ, ఆసామీ. ఒక వ్యక్తి ; అర. అసామి, అసామీ. అధమర్ణుడు, అపరాధి ;

క. తు. ఆసామి. ఒక మనిషి ; త. అచామి. ఒక మనిషి ; అసామి. ఒక మనిషి, ప్రతినిధి.

<ఉ. అసామీ.

**ఆసాన** చూ. ఆవ[1].

**ఆసానలు** చూ. ఆవ[1].

< క. ఇండె.

**ఇండె**[2] రూ. ఇండి[1], ఇందు[6], ఇండె, ఎండె ; చూ. ఇడియు. వి. **1.** ఎముక, కీలు. కవిక. **4.113** ; **2.** చీలిక ; **3.** ముసుము.

పో.చూ. క. ఐడె. పగులు, బీట, తునక, ముక్క ; త. ఐణై. కలయిక, చేరిక, కలియు, చేరు ; పో.చూ. మ. ఐణొక్క. కలియు, జతగూడు.

< మూ.ద.ద్రా. *ఇణ్-.

**ఇండెవాయు** (-పాయు) అ.క్రి. చీలు, పగులు. **ఇండెవాఱు** (-పాఱు). అ.క్రి. బీటలువారు, చీలు, పగులు.

**ఇండెక్సు** వి. సూచిక, జాబితా, పట్టీ.

ఇం. *Index*. సూచిక, విషయసూచిక.

< ఇం. Index.

**ఇండెంటు** వి. కావలసిన వస్తువుల పట్టీ.

ఇం. *Indent*. కావలసిన సరకులకై వ్రాసిన చీటి.

< ఇం. Indent.

**ఇండెవాయు** చూ. ఇండె[2].

**ఇండెవాఱు** చూ. ఇండె[2].

**-ఇఁడి** రూ.చూ. ఇండి[2]. అవ్య. వినార్థక సూచక ప్రత్యయం : ముక్కిఁడి. ముక్కులేనివాడు ; సిగ్గిఁడి. సిగ్గులేనివాడు.

**ఇతకరి** చూ. ఇతము. విణ. హితముచేయువాడు, హితమైనది. భార. అను. **1.297.**

< సం. హితకారీ.

**ఇతగాడు** రూ.చూ. ఈతగాఁడు ; చూ. ఇతఁడు.

**ఇతగాఁడు** రూ.చూ. ఈతగాఁడు ; చూ. ఇతడు. సర్వ. వీడు, ఈ పురుషుడు.

**ఇతఁ(ం)డు** రూ.చూ. ఈతఁడు వి. వీడు, ఈ పురుషుడు, ఈ పూజ్యుడు. భార.ఆది. **6.44.**

**ఇతను** రూ.చూ. ఈతఁడు.

**ఇతము** రూ. ఇతవు. వి. **1.** మేలు, మంచి, ప్రయోజనం. కళా. **3.61** ; **2.** అభీష్టం, కోరిక ; **3.** స్నేహం.

సం. హిత-. ఉంచబడినది, నెలకొల్పబడినది, మంచి, మేలు, చక్కనిది, తగినది, అనువు, వీలు, ప్రియం, స్నేహం ; ప్రా. హిఅమ్ (హిత). శ్రేయస్సు, సుఖం, అదృష్టం, అనుకూలం, ఉపయోగకరం ; పా. హిత-. ఉపయోగకరం, తగినది, ప్రయోజనం, స్నేహం ;

త. ఐతమ్ (< హిత). శ్రేయస్కరం, అనువు, అనుకూలం, తెలివి, సలహా, మంచిమాట ; మ. ఐతమ్. తగినది, ఇంపైనది, ఇతవు, ఇంపు.

< సం. హిత-.

**ఇతముంగతీగె** వి. అడవిఉలవ, వెర్రిఉలవ (Dolichos falcatus).

**ఇతవరి** చూ. ఇతవు.

**ఇతవు** రూ.చూ. ఇతము. వి. **1.** ఇష్టం, ప్రీతి. చంద్రికా. **4.128** ; **2.** మంచిసలహా ; విణ. మంచి, ప్రయోజకరం, అనుకూలం. భార.అను. **5.206**, అహ. **1.111.**

త. ఐతవు. ఇంపైనది, మంచినడవడి.

**ఇతవరి** రూ.చూ. హితవరి. వి. హితం కోరేవాడు, మేలు కోరేవాడు, శ్రేయోభిలాషి. క. ఐతబారి. నమ్మదగినవాడు.

< ఇతవ + -అరి. **ఇతవుఁడు** వి. స్నేహితుడు. భార.ఉద్యో. **4.240.**

**ఇతవుఁడు** చూ. ఇతవు.

**ఇతిబార్** రూ.చూ. ఎతుబారీ. వి. నమ్మకం.

**ఇత్తగిల్చు** స.క్రి. పడవేయు, పారవేయు.

**ఇత్తడి** రూ.చూ. ఇత్తళి. వి. లోహ విశేషం. ఆము. **6.6**, సుమతి. **14.**

**ఇత్తళి** రూ. ఇత్తడి. వి. లోహ విశేషం. ఆము. **6.6.**

సం. పిత్తల-. ఇత్తడి, కంచు ; పిత్తలి ; ప్రా. పిత్తలం. లోహ విశేషం ; హిం. పీతల్. ఇత్తడి ; మరా. పితళ.

క. ఐత్తళె, ఐత్తాళె, హిత్తళి, హిత్తళె, హిత్తాళె, పిత్తల. ఇత్తడి ; తు. హిత్తాళి, పిత్తలె ; త. పిత్తళై ; మ. పిచ్చళ. ఇత్తడి, రాగి తగరం కలిపిన మిశ్రమం ; కువి. పిత్తడ ; కోలా. పితల్, పిత్తల్.

< క. హిత్తళి.

**ఇత్తికఱ్ఱ** వి. మగవాళ్ళు మెళ్ళోవేసుకునే కంటె.

**ఇత్తికాయ** రూ. ఇత్తిరిగాయ. వి. గొల్లి, యోనిశీర్షం.

పో.చూ. క. ఐతి, ఐత్తి. స్త్రీలింగ ప్రత్యయం.

ఇత్తి < ప్రా. ఇత్థి, ఇత్థీ < సం. స్త్రీ + కాయ.

**ఇత్తిగ** చూ. ఇరు ; రూ. ఇత్తుక, ఇద్దుగ, ఇరుతిగ, ఇఱ్ఱిగ. సర్వ. **1.** రెండు మూళ్ళు, ఆరు (పో.చూ. తిగ), వి. పాచికమీది మూడు బొట్ల జత, దుందుభి. కళా. **3.131**, చంపూ.రా. **3.6** ; **2.** ఆరు. ఆం.భా. **306.**

< ఇర్ + తిగ < ప్రా. తిగ < సం. త్రిక-.

**ఇత్తిరిగాయ** రూ.చూ. ఇత్తికాయ.

**ఇత్తుక** రూ.చూ. ఇత్తిగ. వి. ఆరు.

**ఇది** రూ. ఇద్ది. సర్వ. **1.** సమీప వస్తువు. భార.ఆది. **5.85** ; **2.** ఈమె. భార.విరా. **1.103.**

క. ఐదు, ఐతు. మొ. ఇది, ఈ ; విణ : ఈ ; తు. ఉందు. ఇది ; విణ. ఈ ; త. ఐతు. ఇది ; మ. ఐతు, ఐదు. ఇది ; గోం. ఐద్ ; కుఇ. ఈ ; పర్జి. ఐద్ ; కొలా. ఐ. ఇది ; ఈ. ఈ ; ఈపడ్. ఈవిడు ; ఐమ్, ఐమ్‌ద్. వీడు ; ఐవ్‌ర్. వీడు ; ఒల్లా. ఐద్ ; బ్రా. ఓ. ఇది, ఈ, అది, ఆ, వాడు, ఆమె.

< మూ.ద్రా. *ఇత్-.

**ఇదిగాక** (-కాక). క్రి. విణ. **1.** దీనికితోడు. దశా. **2.142** ; **2.** ఇదికాకుండా. **ఇదివరకు** క్రి. విణ. **1.** ఇంతవరకు ; **2.** ఇంతకుముందు. **ఇదివరదాక** క్రి. విణ. **1.** ఇంతవరకు ; **2.** ఇంతకుముందు.

**ఇదిగాక** చూ. ఇది.

**ఇదిగొ** రూ.చూ. ఇదిగో. అవ్య. **1.** ఇదే, ఇక్కడే, ఇటుచూడు (సమీప వస్తువును చూపటానికి, ఎదుటివాణ్ని అభిముఖీకరించుకోటానికి ఉపయుక్తం) ; **2.** ఇప్పుడే. కువ.చ. **4.194.**

**ఇదిగో** రూ. ఇగో, ఇదిగొ, ఇదుగో. అవ్య. **1.** ఇదే, ఇక్కడే. ఇటుచూడు (సమీప వస్తువును చూపటానికి, ఎదుటివాణ్ని అభిముఖీకరించకోటానికి ఉపయుక్తం) ; **2.** ఇప్పుడే.

క. ఐద, ఐదా, ఐదె, ఐదో, ఐధకొ, ఐదుకొ,

ఐదుగా, ఐదిగో, ఐకా, ఐకో, ఐక్కో, ఐగో, ఎకా, ఎకో. ఇదిగో; తు. ఐంద, ఐందా, ఉందా. ఇదిగో; త. ఐతో (<ఐతు+ఓ). ఇదిగో; ఐత. ఇటుచూడు; పో.చూ. ఐత్తై. విధ్యర్థకైకవచనాలకు పద్యాల్లో పాదపూరణార్థం వచ్చే ప్రత్యయం; ఐంతా. ఇదిగో; ఐతోల్, ఐతోలి. ఇటు, ఇక్కడ; మ. ఐతా. ఇదిగో; గోం. ఐదా. ఇప్పుడే; పో.చూ. ఈతల్, ఈతోల్, ఐతోణా, ఈతోడ్. ఇట్లా; 'అతోల్'కు వ్యతిరేకం; పో.చూ. పర్జి. ఐదొడ్. ఈ దిక్కున; బ్రా. ఈరా. ఇదిగో, ఇటు చూడు.

ఇది+ఓ.

**ఇదివరకు** చూ. ఇది.

**ఇదివరదాక** చూ. ఇది.

**ఇదుగో** రూ.చూ. ఇదిగో. అవ్య. సమీపవస్తు నిర్దేశకం.

**ఇదె** చూ. ఇది. అవ్య. 1. ఇదిగో. భార.విరా. 4.263; 2. ఇప్పుడే. భార.ఉద్యో. 3.69.

<ఇది+ఎ.

**ఇద్దఱు** చూ. ఇరువురు. వి. ఇద్దరు మనుష్యులు. భార.ఆది. 6.297, భీష్మ. 1.288, భా.రా. యు. 1975.

కొలా. ఐద్దర్. ఇద్దరు మనుష్యులు; నా. ఐద్దర్; బ్రా. ఐరట్. రెండు; ఐరా. (విణ).

<మూ.ద్రా. *ఇర్ (?).

**ఇద్ది** రూ.చూ. ఇది. వి. ఇది. కేయూర. 3.41.

త. ఐత్-త్-ఐ. ఇది (ద్వితీయావిభక్తి); పర్జి. పో. చూ. ఐత్తు. ఈ దిక్కున.

**ఇద్దుగ** రూ.చూ. ఇత్తిగ. వి. పాచికమీది రెండు బొట్ల జత. ఉ.హ. 3.121.

క. ఐద్దుగె. జూదంలో పాచికమీది రెండు బొట్ల జత.

<ఇర్+దుగ (<సం. ద్విక-).

**ఇద్దుము** రూ.చూ. ఇరుదూము. వి. 1. రెండు తూముల ప్రమాణం. దశా. 5.103; 2. భూమికొలత (i. 20 కుంటలు లేదా ⅛ ఎకరం; ii. 4 ఎకరాలు; iii. 32 కుంటలు లేదా 80 సెంట్లు; iv. 2 ఎకరాలు.)

< ఇర్+ *తుము (< తూము). వర్ణసమీకరణం.

**ఇద్దోట** వి. కాపుడిగిన తోట.

**ఇన్-** రూ. చూ. ఇరు. విణ. రెండు.

**ఇమ్నూఱు** రూ.చూ. ఇరునూఱు. వి. రెండు వందలు. శృం.నై. 6.72. క. ఇన్నూఱు. **ఇన్మడి** రూ.చూ. ఇనుమడి. విణ. రెట్టింపు, ఇబ్బడి. **ఇన్మడించు** రూ.చూ. ఇనుమడించు. అ.క్రి. రెట్టింపగు, ఇబ్బడి అగు. **ఇన్మాఱు** రూ.చూ. ఇనుమాఱు. విణ. రెండు మార్లు. భార. అను. 3.284.

**ఇనప-** రూ. చూ. ఇనుప-.

**ఇనపయెద్దు** రూ.చూ. ఇనుపయెద్దు. వి. గొర్రెలు, మేకలు. ద. హిం. శా. 4 సం. 1186 సెం.

**ఇనమదార** వి. ఆకు కప్పునకు పనికివచ్చే ఒక రకం మొక్క.

**ఇనమద్ది** రూ. ఇనుమద్దు. వి. నల్లమద్ది (Terminalia tomentosa).

**ఇనమొద్దు** రూ.చూ. ఇనుమద్ది.

**ఇనామ్** రూ. ఇనాము, ఈనాం, ఈనాము. వి. బహూమానం, మాన్యం.

సే. ఐనామ్. బహుమానం, ప్రతిఫలం, ఐన్-అమ్; హిం. ఐనామ్; గు. మరా. ఐనామ; ఉ. ఐన్[1]అమ్, ఐనామ్; పార. ఐన్[1] అమ్; అర. ఐన్+అమ్; ముండ. ఐలామ్;

క. ఐనాము, ఐనామ; తు. త.మ. ఐనామ్; కో. ఐనమ్; బ్రా. ఐనామ్; ఐనామ్-ఖోర్. భూస్వామి.

< ఉ. ఇన్[1] అమ్.

**ఇనాందార్** వి. జమిందార్ల నుంచి బహుమానం పొందిన వాడు.

ఉ. ఐన్[1]అమ్‌దార్. ఈనాముగలవాడు.

< ఉ. ఇన్[1]అమ్+దార్.

**ఇనాందార్** చూ. ఇనామ్.

**ఇనామతీ** చూ. ఇనాం. వి. బహుమతిగా నియ్యబడ్డ మాన్యం.

పార. ఐన్[1]అమాత్. బ. వ. < ఇన్[1]అమ్; ఉ. ఐనామతి, ఈనాములు.

< ఉ. ఇనామతీ.

**ఇనాము** రూ.చూ. ఇనామ్. వి. బహూమానం, మాన్యం.

**ఇనాయతునామా** వి. తాఖీదు, ఆజ్ఞా పత్రిక.

హిం. ఐనాయత్‌నామా; గుజ. ఐనాయత్; ఉ. ఐనాయత్‌నామహ్; పార. ఐనాయత్‌నామహ్. ఆజ్ఞా పత్రం; అర. ఐనాయత్. ఆజ్ఞ.

< ఉ. ఇనాయత్‌నామహ్.

**ఇవి** రూ.చూ ఇన్ని. సర్వ. ఇవి అన్నీ.

**ఇను-**[1] రూ.చూ. ఇరు (వృత్తియందే ప్రయుక్తం). విణ. 1. రెండు. భార. ఆర. 3.345; 2. రెండురెట్లు. శృం. నై. 8.61.

క. ఐన్. విణ. రెండు. (కొన్ని సంధి సందర్భాల్లో. ఇరు-యొక్క రూ).

< ఇను- < ఇరు-+మడి.

**ఇనుమడి** రూ. ఇన్మడి, ఇబ్బడి, ఇమ్మడి. విణ. రెట్టింపు. భార. ఉద్యో. 4.414; క. ఐమ్మడి, ఐర్మడి, రెట్టింపు; తు. ఐమ్మడి. **ఇనుమడించు** రూ. ఇన్మడించు. అ.క్రి. రెట్టింపగు. భార. స్త్రీ. 2.166, వను. 3.80. **ఇనుమడుంగు** వి. రెట్టింపు. భార. ఆర. 3.345, **ఇనుమనుమడు** వి. మునిమనుమని కొడుకు. **ఇను మనుమరాలు** వి. మునిమనుమని కుమార్తె. **ఇనుమాఱు** రూ. ఇన్మాఱు. క్రి. విణ. 1. రెండుసార్లు. భార. కర్ణ. 3.317; 2. రెండుచాళ్ల పొలం దున్నటం. **ఇనుమిక్కిలి** విణ. అత్యధికం. విజయ. 3.207.

**ఇనుక** రూ.చూ. ఇనుకు[2]. ఆం. భా. 2.239.

**ఇనుకు**[1] రూ.చూ. ఇంకు[1]. అ.క్రి. ఎండిపోవు. మై. 3.91.

**ఇనుకు**[2] రూ. ఇనుక. వి. 1. ఊకతోకూడిన చిన్న ధాన్యం. ఆం. భా. 2.238; 2. జొన్నసజ్జ మొ. వాటి కంకి పొట్టు, బొంత; 3. కంకిపొట్టు వదలని గింజలు.

పో.చూ. త. ఐణుక్కు. పిడికెడు, పట్టెడు; ఐణుంకు. గిలు. కోయు.

**ఇనుప-** రూ. ఇనప-. ఇన్ప-. చూ. ఇనుము ; విశే. 1. ఇనుముకు సంబంధించిన ; 2. ఇనుమువంటి, నల్లని. **ఇనుపకచ్చ** వి. ఇనుపగోచి, ఇంద్రియ నిగ్రహం, బ్రహ్మచర్యం. **ఇనుపకచ్చడము** వి. ఇనుపగోచి, బిగుతైన గోచి. మను. 2.78. **ఇనుపకుందులు** వి. గోడలయందు తలుపులు తిరగటానికి ఏర్పరచిన గుండ్రటి ఇనుప గుంటలు. **ఇనుపగుగ్గిళ్లు** వి. బ.వ. నలుగుడు పడని గుగ్గిళ్లు. **ఇనుపగోచి** వి. బిగుతైన గోచి. **ఇనుపగోలె** రూ.చూ. ఇనుప గోలెము. వేంక. 2.70: **ఇనుపగోలెము** రూ. ఇనుపగోలె. వి. 1. ఇనపకొలిమి. వేంక. 68 ; 2. ఇనుపకుంపటి. **ఇనుపచట్టు** వి. ఇనప ఖనిజపు పొరలుగల కొండ. **ఇనుపచిట్టెము** వి. ఇనపమసటు, మండూరం. **ఇనుపతేలు** రూ. ఇనుపతేలు. వి. నల్లతేలు. **ఇనుపదారి** వి. రైలుమార్గం, ఇనపబద్దెలతో వేయబడ్డ దారి. **ఇనుపముక్కు** వి. ఇనుంవంటి గట్టి ముక్కు. కాశీ. 3.156. **ఇనుపయినుక** వి. ఇనపరజను, ఇనుంపొడి : ఎఱ్ఱగా నగ్నిఁ గాచిన యినుప యినుక గులిక. కాశీ. 3.152.

**ఇనుపకచ్చ** చూ. ఇనుప-.

**ఇనుపకచ్చడము** చూ. ఇనుప-.

**ఇనుపకుందులు** చూ. ఇనుప-.

**ఇనుపగుగ్గిళ్లు** చూ. ఇనుప-.

**ఇనుపగోచి** చూ. ఇనుప-.

**ఇనుపగోలె** చూ. ఇనుప-.

**ఇనుపగోలెము** చూ. ఇనుప-.

**ఇనుపచట్టు** చూ. ఇనుప-.

**ఇనుపచిట్టెము** చూ. ఇనుప-.

**ఇనుపతడ** వి. తడ. జానచెట్టు (Grewia triaefolia).

**ఇనుపతేలు** చూ. ఇనుప-.

**ఇనుపదారి** చూ. ఇనుప-.

**ఇనుపముక్కు** చూ. ఇనుప-.

**ఇనుపయినుక** చూ. ఇనుప-.

**ఇనుపయెడ్లు** రూ. ఇనపయెడ్లు, ఇన్పయెడ్లు, ఈనపయెడ్లు, ఈనుపెడ్లు, ఈన్పయెడ్లు. వి. గొర్రెలు, మేకలు, ఎపి. ఇండి. 4.160.

పో.చూ.క. అడు. మేక, మేకపోతు ; తు. ఏడు. మేక ; త. కార్-ఆటు. నల్లమేక ; కార్. నలుపు ; ఆరు. నలుపు ; యాటు. మేక.

< ఇనుప- (నల్లని) + ఎడ్లు.

**ఇనుమడి** చూ. ఇను-1.

**ఇనుమడించు** చూ. ఇను-1.

**ఇనుమడుంగు** చూ. ఇను-1.

**ఇనుమద్ది** రూ. ఇనమద్ది. ఇనమొద్దు ;

ఇనుప- (నల్లని) + మద్ది. వి. నల్లమద్ది (Terminalia tomentosa).

**ఇనుమద్దిచెక్క** వి. నల్లమద్ది చెక్క.

**ఇనుమద్దిచెక్క** చూ. ఇనుమద్ది.

**ఇనుమమడు** చూ. ఇను-1.

**ఇనుమమరాలు** చూ. ఇను-1.

**ఇనుమాఖు** చూ. ఇను-1.

**ఇనుమిక్కిలి** చూ. ఇను-1.

**ఇనుము** రూ. ఇన్ము. వి. ఒక రకం నల్లని లోహం. హరి. పూ. 4.83, కాశీ. 3.152, పి. శకు. 4.47.

త. ఇరుమ్పు. ఇనుము, నల్లటి లోహం ; ఇరుప్పు- (విశే) ; కొడ. ఇరుమ్పు ; మ. ఇరిమ్పు, ఇరుమ్పు ; కో. ఇబ్ ; తొ. ఉబ్ ; కొలా. ఇనుమ్ ; బ.వ. ఇన్ముల్.

< మూ.ద్రా. *ఇరుమ్పు.

**ఇంత** పో.చూ. ఇంక. వి. 1. ఈ కొలదిది, ఈ పరిమాణం కలది. భార. ఆది. 4.97, మను. 2.41 ; 2. ఇది అంతా, ఈ సర్వం. భార. ఆది. 5.28, శాంతి. 4.293 ; 3. ఈ సమయం, ఇప్పుడు. భార. ఉద్యో. 3.185 ; 4. ఈ గొడవ. భార. ఉద్యో. 3.61 ; 5. ఇది. భార. ఉద్యో. 1.88, ఆము. 3.88 ; క్రి. విశే. 1. ఇక్కడ. భార. విరా. 3.195, శాంతి. 6.377 ; 2. ఇంక, ఈమీదట. ఆము. 5.55, కళా. 4.156 ; 3. ఇంచుక, కొంచెము. ఆము. 5.117, వసు. 3.149 ; 4. అధికముగా, ఎక్కువగా. నీలా. 2.62.

క. ఇనితు, ఇనిత్తు, ఇనిసు, ఇష్టు, ఇనితుటు, ఇంతుటు. సమీప వస్తు నిర్దేశకం, ఈ కొలదిది ; కొడ. ఇన్నదె, ఈతరతు. ఈ విధంగా ; తు. ఈతు. కొలదిది ; త. ఇన్నై, ఇన్నైత్తు. ఇంత ; మ. ఇన్న. ఇది, ఇటువంటిది ; పో.చూ. ఇనిస్న. రకం ; కోట. ఇన, ఇనా. ఇంత ; పో.చూ. తొ. ఉతయ్. కొద్ది. కొంచెం ; కుఇ. ఇన్నె. ఈవిధం ; కువి. ఇన్ను. ఈ దిక్కున ; కొలా. ఇనన్. ఈవిధం ; మాల్తో. ఇనొంద్. అంత ; బ్రా. దపున్, దౌన్, దుపున్. ఈవిధంగా.

< మూ.ద్రా. *ఇన్-.

**ఇంతటన్** క్రి. విశే. ఇంతలో. **ఇంతటంతటన్** రూ.చూ. ఇంతటనంతటన్. క్రి. విశే. సమీప ప్రాంతంలో. సారంగ. చ. 3.200. **ఇంతటనంతటన్** రూ. ఇంతటంతటన్. క్రి. విశే. దగ్గరలో. శృం. నై. 1.104 ; < ఇంతటన్ + అంతటన్. **ఇంతదనుక** రూ. ఇంతదాఁక, ఇందనుక, ఇందాఁక. క్రి. విశే. ఇప్పటి వరకు, ఇచ్చటి వరకు. **ఇంతదాఁక** రూ.చూ. ఇంతదనుక. **ఇంతనంతన్** రూ.చూ. ఇంతంతన్. భార. ఆశ్ర. 1.18. **ఇంతనాఁడు** వి. చిన్నప్పుడు. శుక. 1.50. **ఇంతంత** క్రి. విశే. పరిమితంగా. సారంగ. చ. 2.89, వేమ. 2.176. **ఇంతంతటన్** రూ.చూ. ఇంతంతన్. శృం. నై. 4.117. < ఇంతన్ + అంతటన్. **ఇంతంతన్** ఇంతన్ + అంతన్ ; రూ. ఇంతంతటన్, ఇంతనంతన్. క్రి.విశే. దగ్గరలో, ఇక్కడే. భార. శాం. 6.377. < ఇంతన్ + అంతన్. **ఇంతమాత్ర** క్రి.విశే. ఈపాటి. భార. విరా. 1.186. **ఇంతలింతలు** రూ. ఇంతింతలు. వి. చిన్న చిన్న ముక్కలు. భార. ఉద్యో. 3.117. **ఇంతలేసి** క్రి.విశే. ఇంత పరిమాణంకల. భార. ఉద్యో. 2.302. **ఇంతవట్టు** వి. 1. ఈ మాత్రం. భార. ఆర. 4.387 ; 2. ఇది అంతా, సర్వం. భార. ఉద్యో.

3.372, 4.7 ; క్రి.విశ. ఇంత కాలం. హరి. పూ. 7.288. ఇంతవడి (-పడి). క్రి.విశ. ఇంత వరకు, ఇంత కాలం. ఇంతింత విశ. ఈ కొలదివాడు. భాగ. 8.622. <ఇంత +ఇంత. ఇంతింతలు రూ.చూ. ఇంతలింతలు. వి. చిన్న చిన్న ముక్కలు. భార. 5.153. ఇంతియ రూ. ఇంతె, ఇంతే. క్రి.విశ. ఇంత మాత్రం. భార. ఉద్యో. 4.47. ఇంతియ. <ఇంతె <ఇంత+ఎ. ఇంతె రూ.చూ. ఇంతియ. విశ. ఇంత మాత్రం. <ఇంత+ఎ. ఇంతే రూ.చూ. ఇంతియ. విశ. ఇంత మాత్రం. కాశ. శ. 1, దశా. 1.3. <ఇంత+ఏ. ఇంతేకాక విశ. 1. దీనికి తోడు; 2. ఇదికాక. ఇంతేని విశ. ఇంతటి, ఇటువంటి. సావి. 2.97. <ఇంత+-ఏని. ఇందదవు క్రి.విశ. ఇప్పటి వరకు. మల్హ. 2.72. <ఇన్-(ఇంత)+దదవు. ఇందమక రూ. ఇందాక. క్రి.విశ. ఇంత వరకు. విప్ర. 3.84. <ఇన్-(ఇంత)+దనుక. ఇందాక రూ.చూ. ఇందనుక. క్రి.విశ. 1. ఇప్పటి వరకు ; 2. ఇంతకు పూర్వం.

ఇంతటన్ చూ. ఇంత.

ఇంతటవంతటన్ చూ. ఇంత.

ఇంతటంతటన్ చూ. ఇంత.

ఇంతదమక చూ. ఇంత.

ఇంతదాక చూ. ఇంత.

ఇంతవంతన్ చూ. ఇంత.

ఇంతవాడు చూ. ఇంత.

ఇంతంత చూ. ఇంత.

ఇంతంతటన్ చూ. ఇంత.

ఇంతంతన్ చూ. ఇంత.

ఇంతమాత్ర చూ. ఇంత.

ఇంతలింతలు చూ. ఇంత.

ఇంతలేని చూ. ఇంత.

ఇంతవట్టు చూ. ఇంత.

ఇంతవడి చూ. ఇంత.

ఇంతి వి. 1. భార్య, గృహిణి. కు. సం. 7.958 ; 2. ఆడుది, స్త్రీ. వసు. 4.28 ; 3. పెండ్లి కూతురు. ఆము. 6.188 ; 4. చెలికత్తె. ఆము. 5.712.

క. ఇని, ఇనె. మాధుర్యం, ఇంపు, లావణ్యం; ఇనియళ్. ప్రియురాలు, భార్య ; ఇన్ (ఇమ్, ఇఞ్). మాధుర్యం ; ఇతి, ఇత్తి. స్త్రీ, స్త్రీవాచక ప్రత్యయం; పో.చూ. త. ఇనియర్ (<ఇని – తీయని). ఇష్టమైన వారు, సానుభూతికలవారు, ప్రేమగలవారు, యువతులు.

పో.చూ. సం. స్త్రీ. ఆడుది, భార్య ; పెట్ట, పెంటి ; ప్రా. ఇత్థి, ఇత్థి, ఆ, ఇత్థీ. స్త్రీ, భార్య ; అమా. ఇత్థి, ఇత్థికా, ఇత్థియా, ఇత్థీ ; పా. ఇత్థి, ఇత్థి ; నే. తిరియా ; హిం. త్రియా ; పం. తిర్యా ; మరా. అస్తురీ.

<ప్రా. ఇత్థి <స్త్రీ ; అనునాసిక్యం. మూ.ద్రా. ధాతువైన *ఇన్- కు తియ్యనైన అనే అర్థం ఉంది. దానికి స్త్రీ ప్రత్యయమైన -తి చేర్చగా ఇంతి శబ్దం ఏర్పడి ఉండ వచ్చు. ఇంతి అనగా తియ్యనైనదని అర్థం.

ఇంతిజామ్ వి. ఏర్పాటు.

నే. ఇన్తిజామ్. ఏర్పాటుచేయు, బందోబస్తుచేయు ; ఒ. హిం. ఉ. పార. అర. ఇంతిజామ్.

<ఉ. ఇంతిజామ్.

ఇంతింత చూ. ఇంత.

ఇంతింతలు చూ. ఇంత.

ఇంతియ చూ. ఇంత.

ఇంతె చూ. ఇంత.

ఇంతే చూ. ఇంత.

ఇంతేకాక చూ. ఇంత.

ఇంతేని చూ. ఇంత.

ఇంద రూ. ఇందము. అవ్య. ఇదిగో, తీసుకో. ఉ.హ. 1.155 ; వి.ఈ. కోటు.

తు. ఇంద, ఇందా, ఉందా. ఇదిగో, తీసుకో ; త. ఇంతా. ఇదిగో, తీసుకో, చూడు, ఇటురా ; మ. ఇదా. ఇటుచూడు ; మాల్తో. ఇంద. ఇదిగో, తీసుకో ; కొండ. ఉందటి :

ముండా. ఇది, ఇదిమె. తీసుకో.

ఇందకో అవ్య. ఇదిగో, తీసుకో. పండి. చ. మహిమా. 297 వ.

ఇందకో చూ. ఇంద.

ఇందదవు చూ. ఇంత.

ఇందమక చూ. ఇంత.

ఇందము రూ.చూ. ఇంద. క్రి. విశ. ఇదుగో. తీసుకో. భార. విరా. 5.304, రామా. 6.198.

ఇందఱు సర్వ. 1. వీరందరు. భార. ఆది. 4.100, విరా. 5.359 ; 2. ఇంతమంది. భార. విరా. 2.142.

క. ఇనిబర్. ఇంతమంది ; త. ఇన్నై. ఇంత ; ఇంత మంది మనుష్యులు ; పో.చూ. మ. ఇన్ని. ఇది, ఇటువంటి ; కొలా. ఇండర్. ఇంతమంది, పురుషులు ; ఇందల్. ఇంత మంది, స్త్రీలు ; నాయి. ఇంధర్. అంతమంది, పురుషులు.

ఇన్+తఱు ; -తఱు ; పో.చూ. ఇద్దఱు.

ఇందలమందల వి. 1. ఉన్నవిషయములస్థితి ; 2. క్రమమయిన పని తెన్ను.

ఇందలి చూ. ఇందు[3].

ఇందాక చూ. ఇంత. క్రి.విశ. 1. ఇప్పటివరకు. భార. శల్య. 2.66 ; 2. కొంతకాలం క్రితం.

ఇందాపవెల వి. ఆశ్వయుజమాసం, స్వచ్ఛమైన చంద్రకాంతి గలనెల.

సం. ఇందు. చంద్రుడు ; ప్రా. ఇందు ; పా. ఇంద.

<సం. ఇందు-+సం. ఆప- (పొందబడుట)+నెల.

ఇందు[1] చూ. ఇంచు[1]. అ.క్రి. రుచించు, ఇష్టమగు. కాశీ. 1.108.

పో.చూ.క. ఇనిదు. తియ్యనిది ; త. ఇనితు. తియ్యనిది ; మల. ఇన్. తియ్యని, ఇంపైన, అనువైన.

<మూ.ద్రా. *ఇన్-.

ఇందు[2] పో.చూ. ఇముడు. అ.క్రి. ఇముడు, ఒంటబట్టు. యయా 4.155, వేంక. పంచ. 1.247.

ఇందు[3] రూ.చూ. ఇన్టు. క్రి.విశ. 1. ఇక్కడ. భార.ఆది. 4.78. భాగ. 7.157 ; 2. ఈ లోకంలో భార. ఆది. 5.145,

భాగ. 10. ఉ. 1336 ; 3. దీనియందు, వీనియందు, ఈమెయందు, వీరియందు. భార. ఆది. 6.248 ; ఆము. 3.48 ; 4. ఇది (ద్వితీయాది విభక్తులందే ప్రయుక్తం). హై.భా. 5.164, ఆము. 6.28.

క. ఇందు. ఈసారి, ఇవ్వేళ ; కొడ. ఇందు ; పో.చూ. తు. ఇందు, ఉందు. ఇది ; ఇని, ఇన్నె. ఇవ్వేళ ; త. ఇన్ఱు. ఇవ్వేళ ; పో.చూ. ఈంటు. ఇక్కడ, ఈ లోకంలో, ఈజన్మలో, ఈ మార్గంలో, ఇప్పుడు; మ. ఇన్ను. ఈసారి, ఇవ్వేళ ; ఇన్నా. ఇక్కడ ; కొడ. ఉడ్. ఇవ్వేళ ; కోట. ఇంద్య ; ఇందోడ్. ఈనాటినుంచి ; పర్జి. ఇనె, ఇనెన్. ఇవ్వేళ ; ఇని. ఇక్కడ ; కొలా. ఇందెడ్. ఇనెడ్, ఈనెడ్. ఇవ్వేళ ; ఇండి, ఇండే. ఇప్పుడు ; ఒల్లా. ఇనె, ఇనెన్. ఇవ్వేళ ; ఇండి. ఇండే. ఇప్పుడు ; కురు. ఇన్నా. ఇవ్వేళ ; మాల్తో. ఇనె ; బ్రా. ఏనో (అనో).

<మూ.ద్రా. *ఇన్-ఱ్.

ఇందలి (-అలి. లోపల) ; పో.చూ.క. -అలి, -అల్లి. అక్కడ. సప్తమీ విభక్తి (ప్రత్యయం). విశే. ఇందులోపలి, ఇందున్న. భార. విరా. 2.300. ఇందుల (-ఉల. బహుళః లోపల) ; పో.చూ.త. ఉళ్. సప్తమీ విభక్తి ప్రత్యయం. చూ.తె.లో (న్)-. వి. 1. ఈచోటు, ఇక్కడ. భార. ఆది. 4.231, విరా. 1.190 ; 2. ఇందుగల, ఇందున్న. భార. ఆది. 6. 264, శాంతి. 5.17 ; 3. ఇది. హై.భా. 5.133. ఆము. 6.36.

**ఇందు**[4] రూ. ఇండిపి, ఇండుగ, ఇండుగు, ఇండువు, ఇందుగ, ఇందుగు, ఇందుప, ఇందువు, ఇన్నుగ ; చూ. అందుగ. వి. 1. చిల్లగింజ. పాండు. 3.16; 2. చిల్లచెట్టు (Strychnos potatorium).

పో.చూ.క. అందుగు. చిల్లచెట్టు ; చిల్ల ; త. ఇస్తు. పాషాణం, ముష్టిచెట్టు ; ఇల్. చిల్లగింజ ; ఇల్లమ్. చిల్లచెట్టు ; ఇల్లి ; చిల్లమ్.

**ఇందు**[5] రూ. ఇందు. చూ. ఈఁత. వి. ఈతచెట్టు (Phoenix sylvestenis).

**ఇందు**[6] రూ.చూ. ఇండె[2]. వి. ఎముక కీలు.

**ఇందుగ** రూ.చూ. ఇందు[4] వి. చిల్లచెట్టు. ఆం. భా. 2.68.

**ఇందుగు** రూ.చూ. ఇందు[4]. వి. చిల్లచెట్టు. అచ్చ. రా. 5.25.

**ఇందుప** రూ.చూ. ఇందు[4]. వి. చిల్లచెట్టు.

**ఇందుప్పు** వి. రాతిఉప్పు, సైంధవలవణం. ఆం.భా. 2.249.

సం. సింధు-లవణమ్. రాతి ఉప్పు, సింధు దేశపు ఉప్పు ; ప్రా. సెంధవ, సింధవ, సింధవం ; అ.మా. సింధవం ; పా. సింధవమ్.

క. ఇందుప్పు ; తు. సైందుప్పు ; త. ఇంతుప్పు ; మ. ఇంతు, ఇంతుప్పు.

<ఇందు (<సం. సింధు-)+ఉప్పు.

**ఇందుల** చూ. ఇందు[3].

**ఇందువు** రూ.చూ. ఇందు[4]. వి. చిల్లచెట్టు. శివయో. ఉ. 2 ; వాసిష్ఠ రా. 3.32.

**ఇందుస్తానీ** రూ.చూ. హిందుస్తానీ. విశే. హిందూదేశ సంబంధమయిన. ఖడ్గ. 13.

**ఇందె** రూ.చూ. ఇండె[2]. వి. 1. నొక్కు, గాడి, గుర్తు ; 2. బండి పరాన్ని దోనెకు బిగించే చీల.

**ఇంద్రతీగె** వి. లతావిశేషం (Thembergia fragrans).

పో.చూ.త. ఇంతిరవల్లి. ఆకులులేని ఒకరకం తీగె.

<సం. ఇంద్ర-+తీగె.

**ఇంద్రిపుడుములు** పో.చూ. ఇందు[1]. వి. భక్ష్య విశేషం.

**ఇన్నవ** రూ. ఇన్నో. విశే. ఇంత సంఖ్యది.

<ఇన్ని+-అవ.

**ఇన్నాళ్** రూ.చూ. ఇన్నాళ్లు. వి. ఇన్నిరోజులు. విజయ. 3.77, సారంగ. చ. 3.83.

**ఇన్నాళ్ళు** రూ. ఇన్నాళ్ ; ఇన్ని+నాళ్ళు ; చూ. ఇన్ని. వి. ఇన్నిరోజులు. శృం.నై. 3.123.

**ఇన్ని** చూ. ఇందు[3]. రూ. ఇని. వి.బ.వ. సర్వ. 1. ఇవిఅన్నీ. భార. ఆది. 5.242 ; 2. అల్పసంఖ్య గలవి. వరాహ. 12.66 ; 3. అధిక సంఖ్య గలవి. ఉ.రా. 2.97.

క. ఇనితు, ఇనిత్తు, ఇనిసు. సమీపవస్తు నిర్దేశకం ; ఈ. ఈ కొలదిది ; ఇనిబర్. ఇంతమంది ; ఇన్నమ్/ఇన్తమ్. ఇటువంటివాడు, ఇటువంటిది ; ఇనె, ఇన్నె. ఇప్పటివరకు ; తు. ఈతుల. ఇవిఅన్నీ ; త. ఇన్నై (<ఇ-). ఇంత ; ఇన్న. ఇట్టి, ఇటువంటి, తారతమ్య బోధకం ; ఇన్నాన్. ఇటువంటిది, ఇటువంటివాడు ; మ. ఇన్న. ఈ, ఇటువంటి ; కొలా. ఇన్నిజ్. ఇన్ని ; ఇనిగ్. ఇన్నింటిలో.

<మూ.ద్రా. *ఇన్-.

**ఇన్నుగ** రూ.చూ. ఇందు[4]. వి. చిల్లగింజ. ఆం. పారి.

**ఇన్నూరు** చూ. ఇన్-.

**ఇన్నో** రూ.చూ. ఇన్నవ. విశే. ఇంత సంఖ్యది.

**ఇన్ప-** రూ.చూ. ఇనుప-. విశే. ఇనుముకు సంబంధించిన.

ఇన్పగుండు వి. తుపాకీగుండు. కాళిందీ. 3.155.

**ఇన్పగుండు** చూ. ఇన్ప-.

**ఇన్పయెద్లు** రూ.చూ. ఇనుపయెద్లు. వి. గొర్రెలు, మేకలు.

**ఇన్మడి** చూ. ఇన్-.

**ఇన్మడించు** చూ. ఇన్-.

**ఇన్మాఖు** రూ.చూ. ఇనుమాఖు.

**ఇన్ము** రూ.చూ. ఇనుము. వి. ఇనుము. భార.అను. 1.16, 17.

**ఇన్లు** రూ. ఇందు[3]. క్రి.విశే. ఇందుయొక్క ప్రాచీన రూపం. భైరవకొండ శాసనం, 7 వ శతాబ్ది.

**ఇన్‌సాల్వెంటు** వి. దివాలా, దివాలాతీసినవాడు. వి. ఋణగ్రస్తుడు, అప్పులుతీర్చే శక్తిలేనివాడు.

ఇం. *Insolvent*. ఋణగ్రస్తుడు, అప్పులు చెల్లింపశక్తి లేనివాడు.

<ఇం. Insolvent.

**ఇన్‌సాల్వెన్సీ** వి. అప్పులు తీర్చలేని లేమిడి.

ఇం. *Insolvency*. అప్పు చెల్లించ శక్తి లేకుండుట.

<ఇం. Insolvency.

**ఇన్‌స్పెక్టరు** వి. తనిఖీచేసేవాడు, పరిశీలకుడు.

ఇం. *Inspector*. పరిశోధించేవాడు, తనిఖీచేసే-

వాడు, పోలీసు అధికారి.

< ఇం. Inspector.

**ఇన్సాఫ్** వి. న్యాయం.

హిం.అర. ఇంసాఫ్. న్యాయం, నీతి ; ఉ.పార. ఇన్ సాఫ్.

< ఉ. ఇన్సాఫ్.

**ఇపిరి** వి. ముందరికాళ్ళవాపు.

**ఇపుడు** రూ.చూ. ఇప్పుడు. వి. ఈసమయం. శృం.నై. 2.77.

**ఇప్డు** రూ.చూ. ఇప్పుడు. వి. ఈసమయం. భార.అర. 5.432.

**ఇప్ప** వి. మధూకం, ఇప్పచెట్టు (Bassia longifolia). హర. 4.80, ఆము. 1.88.

క. ఇప్పె, హిప్పె ; తు. ఇప్పె ; త. ఇరుప్పై, ఇరుంపై ; ఇలుప్పై, ఇప్పై ; మ. ఇరుప్ప, ఇలిప్ప, ఇరిప్ప ; గోం. ఇడూ ; హిరుక్-మర ; కుఇ. ఇర్పి ; పర్జి. ఇరుప్, ఇర్ప ; కొలా. ఇప్ప, ఇప్పా.

< మూ.ద్రా. *ఇర్ప్-.

**ఇప్పనూనె** వి. ఇప్పగింజలనుంచి తీసిన నూనె. **ఇప్పపిండి** వి. ఇప్పగింజల నుంచి నూనె తీయగా మిగిలిన పిండి. క. ఇప్పహిండి, ఇప్పెయహిండి. **ఇప్పపూరాజనములు** రూ. ఇప్పపూరాజనాలు. వి. శాలిధాన్యం, సువాసనబియ్యం. హంస. 4.128. త. ఇలుప్పై, ఇరుప్పై-ప్-పూవమ్పా. ఇప్పపూవ వాసనగల వడ్లు. **ఇప్పపూరాజనాలు** రూ.చూ. ఇప్పపూరాజనములు. వి. సువాసనబియ్యం. **ఇప్పపూలు** వి. 1. ఒకరకం బియ్యం ; 2. ఇప్పచెట్టుపూలు. **ఇప్పసారాయి** వి. ఇప్పపూలనుంచి తీసిన సారాయి.

**ఇప్పకొయ్యలు** వి. గొర్రుకొయ్యలు, ఆరుద్రానక్షత్రం ; గొర్తి చెక్కల్లాగా వరుసగా ఉండే మూడు చుక్కలు.

**ఇప్పనూనె** చూ. ఇప్ప.

**ఇప్పపిండి** చూ. ఇప్ప.

**ఇప్పపూరాజనములు** చూ. ఇప్ప.

**ఇప్పపూరాజనాలు** చూ. ఇప్ప.

**ఇప్పపూలు** చూ. ఇప్ప.

**ఇప్పసారాయి** చూ. ఇప్ప.

**ఇప్పాట(న్)** చూ. ఇ-[2]. క్రి.విశ. ఈవిధంగా.

**ఇప్పికోలు** చూ. ఇయ్యకోలు. వి. అంగీకారం. అం.ధా. 1.104.

**ఇప్పించు[1]** ఇచ్చు ధాతువుయొక్క ప్రేరణార్థక రూపం. స.క్రి. ఈయజేయు. భార.ఆది. 1.95.

క. ఈసు, ఈయిసు, ఈసు. ఇప్పించు, అనుమతించు; త. ఈవి. ఇప్పించు ; పో.చూ. -ప్పి. ఇ కా రాంత క్రియలపై చేరే ప్రేరణార్థక ప్రత్యయం.

< ఈ-ప్ప్-ఇంచు.

**ఇప్పు** రూ.చూ. విప్పు. స.క్రి. విడుచు, విడదీయు.

**ఇప్పుడు** రూ. ఇపుడు, ఇప్డు, ఉప్పుడు[2]. వి. ఈ సమయం. ఆము. 2.76.

క. ఈహొత్తు, ఈహొత్తు. ఇప్పుడు, ఈసమయం, ఈ రోజు ; ఈగ. ఇప్పుడు, ఈవేళ ; పో.చూ. తు. ఇత్తె ; త. ఇ-ప్-పో-ఴుతు, ఇ-ప్-పోతు ; మ. ఇప్పోళ్. ఇప్పుతే, వెంటనే ; గోం. ఇప్కెతే. ఇప్పుడే ; పో.చూ. కుఇ. ఇవె. ఈసమయం ; పో.చూ. కువి. ఈ. ఇది ; పర్జి. ఇపాట్.

**ఇబ్బట్టు** పో. చూ. ఇబ్బంది[1]. వి. కటువు, గడ్డు, నిష్ఠురం.

త. ఇఴుక్కమ్. గడ్డు (రోజులు): స్తంభన (వ్యాపారం): ఇఴుకు. ఇరుకగు, కఠినమగు.

< ప్రా.తె. *ఇఱ్ + పట్టు.

**ఇబ్బడ** రూ.చూ. ఇబ్బెడ. వి. నల్లమాను (Dalbergia latifolia).

**ఇబ్బడి** రూ.చూ. ఇనుమడి. వి. రెట్టింపు, ద్విగుణం, అధికం. ఉ.రా. 2.240, ఆం.సం.మాన. 42.

క. ఇర్మడి, ఇమ్మడి. రెండురెట్లు, ద్విగుణం ; తు. ఇమ్మడి ; త. ఇరుపటుంకు, ఇరుమటి.

< ప్రా.తె. *ఇర్-బడి < ఇర్-పడి.

**ఇబ్బడిక** వి. ఆధిక్యం. నిరo. 3.61. **ఇబ్బడించు** అ.క్రి. రెట్టింపగు. అప్ప. 4.220 వ. 1 పం ; స.క్రి. ఇనుమడించు < ఇబ్బడి + -ఇంచు[3].

**ఇబ్బడిక** చూ. ఇబ్బడి.

**ఇబ్బడించు** చూ. ఇబ్బడి.

**ఇబ్బంద్రు** చూ. ఇబ్బరు. పో.చూ. ఇరువురు. సర్వ. ఇద్దరు.

**ఇబ్బంది[1]** పో.చూ. ఇక్కట్టు, ఇబ్బట్టు ; చూ. ఇరు. వి. ఇరుకు, ఒత్తిడి, కష్టం.

త. ఇప్పంతి., ఇబ్బంది.

< ప్రా.తె. ఇఱ్ + బంది < సం. బంధీ.

**ఇబ్బందిగాఁడు[1]** (-కాఁడు). వి. కష్టాలు తెచ్చిపెట్టేవాడు. **ఇబ్బందిపడు** అ.క్రి. కష్టపడు. **ఇబ్బందిపని** వి. 1. సందిగ్ధ విషయం ; 2. క్లిష్టమైన విషయం.

**ఇబ్బంది[2]** ఇర్ + బంతి ; చూ. ఇరు. వి. సంకరజాతి జంతువు ; రెండుజాతుల పందులకు పుట్టిన పంది ; విశ. 1. మూర్ఖుడు. బసవ. 3.1140 వం. ; 2. సంకరజాతివాడు. మల్హ. 1.98.

క. ఇబ్బంది. సంకరజాతి, నీచజాతి (< ఇబ్. రెండు) ; త. ఇప్పంతి.

< ఇరు + బంధి (సంబంధించిన). (సం. బంధు-. చుట్టం) లేదా < ఇర్ + పంది. సంకరజాతి జంతువు (పంది. జంతువు) ; పో.చూ. పందికొక్కు, ఎలుగుబంటి.

**ఇబ్బందిగండు[2]** వి. సింహం. **ఇబ్బందిగాఁడు[2]** (-కాఁడు). వి. పెద్దపులికీ, చిరుతపులికీ పుట్టిన పులి ; సంకరజాతి జంతువు. **ఇబ్బందిగుఱ్ఱము** వి. సంకరజాతి గుర్రం.

**ఇబ్బందిగండు** చూ. ఇబ్బంది[2].

**ఇబ్బందిగాఁడు[1]** చూ. ఇబ్బంది[1].

**ఇబ్బందిగాఁడు[2]** చూ. ఇబ్బంది[2].

**ఇబ్బందిగుఱ్ఱము** చూ. ఇబ్బంది[2].

**ఇబ్బందిపడు** చూ. ఇబ్బంది[1].

**ఇబ్బందిపని** చూ. ఇబ్బంది[1].

**ఇబ్బరు** చూ. ఇరు. సర్వ. ఇద్దరు.

క. ఇర్బర్, ఇబ్బర్. ఇద్దరు

< క. ఇబ్బర్.

**ఇబ్బళి** రూ.చూ. ఇబ్బెర. వి. నల్లమాను (Dalbergia latifolia).

**ఇబ్బళిగె** వి. ధాన్యం కొలిచేపాత్ర.

క. ఇబ్బళ్. ఇబ్బడికొలత.

< క. ఇబ్బళి.

**ఇబ్బిడి** రూ. చూ. ఇబ్బెర. వి. నల్లమాను (Dalbergia latifolia).

**ఇబ్బిళి** రూ. చూ. ఇబ్బెర.

**ఇబ్బెర** రూ. ఇబ్బర, ఇబ్బళి, ఇబ్బిడి, ఇబ్బిళి. వి. నల్లమాను (Dalbergia latifolia).

క. ఇబడి, ఇబ్బడి. నల్లమాను; పో.చూ. బిటి, బీటె; పో.చూ.తు. బీటె; పో.చూ. త. ఈట్టి; పో.చూ. మ. ఇరువిల్, ఇరూళ్, ఈట్టి, వీట్టి.

< క. ఇబ్బడి.

**ఇమామ్** వి. ముస్లిం మత గురువు.

ఒ. హిం. ఇమామ్. మతగురువు; గు. ఇమామా; ఉ. పార. ఇమామ్, అర. అమామ్, ఇమామ్.

< ఉ. ఇమామ్.

**ఇమాంబారా** వి. మొహరం పండగ జరుపుకొనే మందిరం. ఉ. పార. ఇమామ్-బారా. దేవాలయం, మసీదు.

**ఇమాంబారా** చూ. ఇమామ్.

**ఇమారతు** రూ. అమారతు. వి. ప్రభుత్వ కార్యాలయం.

నే. హిం. ఉ. అర. ఇమారత్. ప్రభుత్వకార్యాలయం; ఒ. గు. ఇమారత; పార. ఇమరత్, అమారత్.

< ఉ. ఇమారత్.

**ఇమిడిక** చూ. ఇముడు.

**ఇముకలము** వి. కలం, గంటం.

**ఇముకు[1]** ఇమ్+కు; పో.చూ. ఇంబు, ఇముడు. వి. సామీప్యం, ఇరుగు పొరుగు; విశే. పొరుగు, దగ్గర, ఆనుకొని ఉన్న.

< మూ. ద్రా. *ఇమ్-. నివసించు.

**ఇముకు[2]** రూ. చూ. ఇంకు[1]. అ. క్రి. ఎండు, ఇనికిపోవు, కృశించు.

**ఇముడు** అ.క్రి. అడగు, అంతర్భూతమగు. హరి. పూ. 5.227, రా.వి. 1.88; స.క్రి. అణచు, కనబడకుండాచేయు. దశా. 4.109.

పో.చూ. క. ఇంబిడు. ఉంచు; ఇంబుగొళ్. పట్టుకొను; త. ఇమై. తగ్గు, ముడుగు; ఇమిఱ్. బంధించు, ఆపు.

< మూ. ద్రా. * ఇమ్- (నివసించు)+ఉట్-.

**ఇమిడిక** వి. 1. ఇమిడి ఉండటం, అడకం; 2. పొందిక. వేమన. 726. **ఇముడుకొను** అ.క్రి. ఇముడు, పొందుపడు. శువచ. 4.92; స.క్రి. 1. పోషించు, దగ్గర ఉంచుకొని కాపాడు. ప్రబోధ. 5.81; 2. ఇముడ్చుకొను. భాగ. 1.181; 3. దాచు, మరుగుపరచు. కళా. 8.118; **ఇముడుచు** రూ.చూ. ఇముడ్చు. స.క్రి. ఇముడజేయు. శృం. నై. 2.6. **ఇముడ్చు** రూ. ఇముడుచు. స.క్రి. ఇముడజేయు.

**ఇముడుకొను** చూ. ఇముడు.

**ఇముడుచు** చూ. ఇముడు.

**ఇముడ్చు** చూ. ఇముడు.

**ఇమురు** రూ.చూ. ఇగురు[2]. అ.క్రి. ఇంకిపోవు, ఎండిపోవు.

**ఇమురుకొను**. అ. క్రి. ఇంకిపోవు, హరించుకొనిపోవు రం. రా. అయో. 141 పు. 20 పం.

**ఇమురుకొను** చూ. ఇమురు.

**ఇమురుతాడు** వి. పావుచెక్కను గూటానికి బిగించే తాడు.

**ఇంపగొడ్డు** వి. గేదె.

< ఇనుప-+గొడ్డు.

**ఇంపారు** చూ. ఇంపు.

**ఇంపితము** చూ. ఇంపు.

**ఇంపు** రూ. ఇంబు, ఇమ్ము[1]; చూ. ఇంచు[1]. విశే. ప్రియం, ఇష్టం. భార. కర్ణ. 3.216; శృం.నై. 3.131, కళా. 7.92, వి. 1. తీపి, మాధుర్యం. భార. సౌ. 1.228; 2. సంతోషం, ఆనందం. భా.రా. యు. 401; 3. మనోజ్ఞత, విలాసం, అందం, శోభ. మను. 2.27, ప్రభా. 1.57; 4. వినోద కృత్యం. విప్ర. 8.36; 5. ఇచ్ఛ, ఆసక్తి, వలపు. వసు. 3.20, చంద్రా. 5.152, శువ.చ. 2.110; 6. వాత్సల్యం. కాళిందీ. 1.287.

క. ఇంపు, ఇంబు, ఇమ్ము. మాధుర్యం, అనుకూల్యం, ఆనందం, అందం; ఇని, ఇనె. మాధుర్యం, అందం, ఆనందం; ఇమ్, ఇఞ్, ఇజ్, ఇన్, ఈజ్, ఈఞ, ఈన్, ఈమ్. మాధుర్యం, ఆనుకూల్యం; తు. ఇంపు; త. ఇనిప్పు, ఇన్పు, ఇన్పమ్; మ. ఇన్పమ్. ఆనందం; ఇనియ. మధురం.

< మూ.ద.ద్రా. *ఇన్ప్- < మూ.ద్రా. ఇన్-.

**ఇంపారు** అ. క్రి. ఆనందించు, సంతోషించు. పారి. పీఠిక 19; < ఇంపు+ఆరు. **ఇంపితము** వి. ఇంపైనది, రమ్యమైనది < ఇంపు+-ఇతము (బహుశః నామ్నీకరణ ప్రత్యయంకావచ్చు. **ఇంపెసలారు** అ.క్రి. శోభిల్లు. శృం.నై. 8.55. < ఇంపు+ఎసలు+ఆరు. **ఇంపొందు** అ.క్రి. 1. ఆనందించు. భా.రా. యు. 401; 2. ఒప్పు. దశా. 1.8 < ఇంపు + ఒందు. **ఇంపొలయు** మనోజ్ఞమగు, ఒప్పగు. < ఇంపు+ఒలయు.

**ఇంపెసలారు** చూ. ఇంపు.

**ఇంపొందు** చూ. ఇంపు.

**ఇంపొలయు** చూ. ఇంపు.

**ఇంబు** రూ.చూ. ఇంపు. విశే. ఇష్టం, ప్రియం. భార. ఆది. 1.76; వి. 1. ఆనందం. రాఘవ. 2.111, ప్రభా. 1.91; 2. శోభ, విలాసం. మల్ల. వైరాగ్య. 41.

**ఇమ్మడి** రూ.చూ. ఇనుమడి. విశే. రెట్టింపు, ద్విగుణితం. భార. ఆశ్వ. 3.119, కేయూర. 3.208; వి. రెండోవాడు. హర. పీఠి. 7.

క. ఇమ్మడి. రెట్టింపు.

**ఇమ్మడించు** అ. క్రి. ఇనుమడించు, రెట్టింపగు. అహ. 2.28.

**ఇమ్మడించు** చూ. ఇమ్మడి.

**ఇమ్ము[1]** రూ.చూ. ఇంపు. వి. 1. వీలు, అనుకూల్యం. భార.

ఆది. 6.112, శల్య. 2.34 ; 2. సుఖం, ప్రీతి, సంతోషం. భార. ఆది. 6.181 ; 3. ఉపాయం, నీతి. భార. ఉద్యో. 2.34 ; 4. విరివి, వైశాల్యం. హరి. ఉ. 2.158 ; 5. సంతోషం. భాగ. 10. పూ. 1474 ; 6. అవకాశం. వేంక. పంచ. 4.511, ఉ. రా. 2.239 ; 7. ఆశ్రయం. ప్రాభ. పాండు. 1.60, ఉ.రా. 5.140 ; విశే. 1. మనోహరం, ఇంపైనది. భార. ఆది. 1.43 ; 2. స్పష్టం. భార. ఆది. 1.249 ; 3. యుక్తం. భార. ఆది. 7.140 ; క్రి.విశే. పూర్తిగా. భార. ఆర. 1.235.

ఇమ్ముగా(న్) క్రి.విశే. 1. పూర్తిగా. భార. ఆది. 5.249 ; 2. రుచ్యంగా. భార. ఆది. 7.114. <ఇమ్ము +కాన్.

ఇమ్ము[2] వి. 1. స్థానం, చోటు. హరి. పూ. 7.182 ; 2. ఆశ్రయం. ఉ.రా. 5.140 ; 3. ఇల్లు. సీలా. 1.52.

క. ఇంబు, ఇంబ. ఆశ్రయం, నివాసం, చోటు, విరివి, వైశాల్యం ; తు. ఇంబు. చోటు ; పో.చూ. త. ఇరుప్పు, ఇరుప్పిడం. నివాసం.

<మూ.ద్రా. *ఇమ్-. నివసించు.

ఇమ్ముకొను అ.క్రి. 1. కలుగు. కాశీంది. 2.43, రాఘవ. 2.2 ; 2. నివసించు, ఉండు. రాఘవ. 2.2 (రామాయణార్థంలో 'కలుగు' అనీ, భారతార్థంలో 'ఉండు' అనీ ద్వ్యర్థి) ; స.క్రి. ప్రాప్తించు, పొందు. చెన్నమల్లు సీసములు. 23. క. ఇంబుగొళ్. ముట్టడించు, ఆక్రమించు ; పో.చూ. త. ఇంబుకొరు. ఆశ్రయమిచ్చు.
ఇమ్ముదప్పు (-తప్పు). వి. ఇక్కట్టు, కష్టం.

-ఇమ్ము[3] పాదపూరణార్థక ప్రత్యయం. భార. ఆది. 6.277.

ఇమ్ముకొను చూ. ఇమ్ము[2].

ఇమ్ముగా(న్) చూ. ఇమ్ము[1].

ఇమ్ముదప్పు చూ. ఇమ్ము[2].

ఇమ్మెయి చూ. ఇ-[2]. వి. ఈ శరీరం ; క్రి.విశే. ఈ విధంగా.

-ఇయ ప్రత్య. పేర్ల చివర వచ్చే 'అయ్య' శబ్దానికి బదులుగా ఇది ప్రాచీన శాసనాల్లో కన్పిస్తున్నది. పెంటియ, దొడ్డియ, కాటియ, భీమియ మొ. ద.హిం.శా. 977, 990, 995.

ఇయ్య- రూ. ఈయ-. అవ్య. అంగీకార సూచకం. భార. ఆది. 4.141, 6.203.

తు. ఇయ్యె. అవును, అంతే ; పో.చూ. త. ఇయై. అనుకూలించు, రచించు, ఒప్పుకొను, పొసగు, పరిపూర్ణమగు, పోలు ; ఇపై. అంగీకరించు ; పో.చూ. మ. ఇయ. అంగీకరించు, కలియు.

ఇయ్యకొను రూ. ఈకొను, ఈయకొను. స.క్రి. అంగీకరించు, నమ్మతించు. భార. విరా. 3.62, భీష్మ. 1.184 ; అ.క్రి. అంగీకరించు, నమ్మతించు. భార. విరా. 5.7, శల్య. 1.69. ఇయ్యకొలుపు స.క్రి. అంగీకరింపచేయు, ఒప్పించు. భార. ఉద్యో. 1.27, దశకు. 3.74. ఇయ్యకోలు రూ. ఈకోలు, ఈయకోలు. వి. 1. అంగీకారం. భార. ఉద్యో. 2.246, హరి. ఉ. 7.282 ; 2. అనుమతి. ప్రభా. 4.87. ఇయ్యసేయు (-చేయు). అ.క్రి. నమ్మతించు. రాజశేఖర. 3.19.

ఇయ్యకొను చూ. ఇయ్య.

ఇయ్యకొలుపు చూ. ఇయ్య.

ఇయ్యకోలు చూ. ఇయ్య.

ఇయ్యది రూ.చూ. ఈయది. సర్వ. ఈయది.

ఇయ్యన ఇ-[2]+అన[1] ; రూ.చూ. ఈయన. వి. ఈ పురుషుడు. భార. అను. 3.306.

ఇయ్యవి చూ. ఇ-[2] ; ఇయ్యది. ఏ.వ. సర్వ. బ.వ. ఇవి.

ఇయ్యసేయు చూ. ఇయ్య.

ఇయ్యు చూ. ఇచ్చు.

ఇయ్యెడ చూ. ఇ-[2]. క్రి.విశే. ఇక్కడ, ఇప్పుడు.

ఇర్- రూ.చూ. ఇరు. విశే. రెండు.

ఇరాఱు రూ.చూ. ఈరాఱు. సర్వ. రెండు ఆర్లు, పన్నెండు. రుక్మి. 1.48. <ఇర్-(ఉ)+ఆఱు. ఇర్గడ రూ.చూ. ఇరుగడ. వి. రెండు పక్కలు. కాశీంది. 2.175. <ఇర్+గడ. ఇర్తిగ రూ.చూ. ఇత్తిగ. సర్వ. రెండు మూళ్లు, ఆరు. ఇర్పలము రూ.చూ. ఇరుపలము. వి. రెండు పలములు, ఆరు తులాలు. <ఇర్+పలము. అం.భా. 2.269. ఇర్వది రూ.చూ. ఇరువది. సర్వ. ఇరవై. ఇర్వదేను సర్వ. ఇరవై అయిదు. కాశీ. 4.91. <ఇర్+పది+ఏను. ఇర్వురు రూ.చూ. ఇరువురు. సర్వ. ఇద్దరు. దశకు. 2.420.

ఇర రూ.చూ. ఇరువు. వి. స్థానం. భార. ఆది. 1.153.

ఇరక[1] వి. 1. ఇరుకు సందు ; 2. ఒక వైపు మొనదేలిన గుర్తులు వరుసగా దగ్గర దగ్గరగా వేసిన డిజైను ; 3. అంచు నేతలో పడే ఒక రకం గీరలు.

ఇరక[2] వి. ముక్క.

ఇరకటము చూ. ఇరుకు.

ఇరకల్లు చూ. ఇరు.

ఇరకాటము చూ. ఇఱుకటము. వి. చిక్కు, ఇరుకు.

ఇరకాలకట్టె చూ. ఇరు.

ఇరగవల వి. సముద్రంలో చేపలు పట్టే వల.

ఇరగు రూ.చూ. ఇఱుము[2]. అ.క్రి. పొడి అగు.

ఇరచాలు చూ. ఇరు.

ఇరవు రూ.చూ. ఇరేపు. వి. అయిమూల, ఎదురుమూల.

ఇరపొత్తు స.క్రి. లాడులో శారవ రాతిని గోడిగా కరిపించు. <ఇరువు+ఒత్తు.

ఇరలవాండ్లు వి. ఒక అటవిక జాతి, ఏనాదులు.

త. ఇరుళన్. నీలగిరుల్లోనూ, తూర్పు మైదానాల్లోనూ నివసించే ఒక ఆదిమ కిరాత జాతి ; నల్లని శరీర వర్ణాన్ని బట్టి ఆ పేరు వచ్చింది. మ. ఇరుళర్. నల్లవాళ్లు ; ఒక ఆటవిక జాతి.

ఇరవ రూ. ఇరి[2]. వి. నేత నేసేటప్పుడు అచ్చు కర్రలు సులువుగా లేవటానికి మగ్గం మీద దారంతో అడ్డంగా వేలాడదీసిన కొయ్య.

పో.చూ. క. ఇరవు. ఆధారం.

ఇరవగు చూ. ఇరవు.

ఇరవందు చూ. ఇరవు.

ఇరవాయి చూ. ఇరు.

ఇరవారు చూ. ఇరవు.

**ఇరవాలు** చూ. ఇరు.

**ఇరవు** రూ.చూ. ఇరుపు. వి. **1.** స్థానం, యుక్త స్థానం. భార. శాంతి. 5.455, 589; **2.** ఇల్లు, బస. భీమ. 6.52; **3.** స్నేహం; విణ. **1.** అనుకూలం. హరి. ఉ. 3.103; **2.** స్థిరం. భార. అర. 4.234; దశా. 4.933.

**ఇరవగు** అ.క్రి. ఉండు, నెలకొను. శృం.నై. 1.52. **ఇరవందు** రూ.చూ. ఇరవొందు. అ.క్రి. సరిపడు, ఒప్పు. భాగ. 10. పూ. 493. <ఇరవు+అందు. **ఇరవారు** అ.క్రి. నిశ్చలమగు, స్థిరమగు. భా. రా. సుం. 294. **ఇరవుకొను** అ.క్రి. **1.** నివసించు, ఉండు. పాండు. 1.107; **2.** స్థిరపడు. రామరా. 387; **3.** కలుగు, పుట్టు. ప్రభా. 2.57. **ఇరవుకొలుపు** రూ. ఇరవుకొల్పు. స.క్రి. ఇరవుకొనజేయు. రసిక. 6.156. **ఇరవుకొల్పు** రూ.చూ. ఇరవుకొలుపు. స.క్రి. ఇరవుకొనజేయు. చంద్ర రే. 2.13, **ఇరవుపట్టు** వి. ఇల్లు. **ఇరవుపడు** అ.క్రి. **1.** ఉండు, నివసించు, కలుగు, సంభవించు; **2.** ప్రకాశించు. భాగ. 5. 1.44. **ఇరవుపఱుచు** స.క్రి ప్రతిష్ఠించు, నిలుపు. పాండు. 5.154. **ఇరవొందు** రూ. ఇరవందు. అ.క్రి. **1.** సంప్రాప్తమగు. కలుగు. హరి. ఉ. 4.99; **2.** నెలకొను, వసించు. భాగ. 6. 215; **3.** పొలుపారు, ఒప్పు. నరస. 1.29. <ఇరవు+ఒందు.

**ఇరవుకొను** చూ. ఇరవు.

**ఇరవుకొలుపు** చూ. ఇరవు.

**ఇరవుకొల్పు** చూ. ఇరవు.

**ఇరవుపట్టు** చూ. ఇరవు.

**ఇరవుపడు** చూ. ఇరవు.

**ఇరవుపఱుచు** చూ. ఇరవు.

**ఇరవై** రూ.చూ. ఇరు.

**ఇరవొందు** చూ. ఇరవు.

**ఇరషదు** వి. ఉత్తరువు, ఆజ్ఞ.

హిం. *ఇరశాద్*, ఆజ్ఞ, ఉ. అర. *ఇరశాద్*. ఆజ్ఞనిచ్చుట; పార. *ఇరషాద్*. ఉత్తరువు.

<ఉ. ఇర్శాద్.

**ఇరవ**[1] చూ. ఇరు-.

**ఇరస**[2] రూ. ఇసరు. ఇసిరె. వి. వడ్రంగులు కొయ్యమీద సన్నని చెక్కడపు పనులు చేయటానికి వాడే పనిముట్టు.

**ఇరసము** చూ. ఇరు.

**ఇరసాలు** రూ.చూ. ఇర్సాలు. వి. వసూలైన భూమి శిస్తును గ్రామోద్యోగులు ప్రభుత్వానికి జమ కట్టటం.

**ఇరసాలువామా** రూ.చూ. ఇర్సాల్నామా. వి. ప్రభుత్వానికి గ్రామోద్యోగులు జమకట్టిన పన్నుల పట్టిక.

**ఇరసాలువామా** చూ. ఇరసాలు.

**ఇరాకీ** రూ. ఇలాకీ, హిరాకి. వి. **1.** వాహనం, అశ్వం; **2.** వస్త్ర విశేషం.

ఉ. అర. *ఇరాకీ*; పార. *ఈరాక్*. ఇరాకుదేశ సంబంధమైన.

<ఉ. ఇరాకీ.

**ఇరాటము** వి. కమీషను, రుసుం.

**ఇరాఱు** చూ. ఇర్-

**ఇరి**[1] రూ.చూ. ఇటి-[1]. విణ. చిన్న, ఇరుకైన.

**ఇరి**[2] రూ.చూ. ఇరవ.

**ఇరికి** రూ. ఇర్కి, ఇర్కె. వి. నక్కెరు (Cordia myxa).

<సం. *ఇరికా*, వృక్ష విశేషం.

**ఇరిడి** వి. కొండతంగేడు (Mimosa xylocorpa).

**ఇరియంబట్టు** చూ. ఇఱియు. స.క్రి. గట్టిగా పట్టుకొను. మను. 4.163.

<ఇఱియన్+పట్టు.

**ఇరియు** రూ.చూ. ఇఱియు. అ.క్రి. నలగు.

**ఇరివిలి** వి. **1.** పోగరతో చేయబడిన రంధ్రం; **2.** రత్నాదులకు బెజ్జాలు వేసే వజ్రపు పోగర.

పో.చూ క. *ఇఱివు, ఇఱిపు*. కొట్టు, గుచ్చుకొను, మొ.; పో.చూ. త. *ఇఱు*. విరుగు, విరుచు, కృశించు, నశించు, అంతమగు; *ఇరిచల్* (<*ఇరి-*). పగులు, విచ్చు; మ. *ఇరియుక*. తుంచు, మెలివేయు; కుఇ. *ఈర*. చీలిక; పో.చూ. కొలా. *ఇరి*. చించు. నా. *ఇర్*. చినుగు, *ఇర్క్-*. చింపు; మాల్తో. *ఈరె*. నరుకు.

**ఇరు-**వృత్తియందే ప్రయుక్తం. చూ. రెండు; రూ. ఇన్-, ఇను-[1]. ఇర్-, ఈరు-[4]. విణ. రెండు, ఉభయం, భార. విరా. 3.198.

క. *ఇరు, ఈర్*. రెండు, తు. *ఇరు*. మ. *ఇరు, ఇరి, ఈర్*; కో. *ఈర్, ఆడ్*. రెండేళ్లు; *ఇర్వాద్*. ఇరవై. గోం. *ఇరుడ్*. జంట; *మ్రరి ఇరుడ్*. తండ్రి కొడుకులు, *పొరాడ్ ఇరుడ్*. అత్తా కోడళ్ళు; కొండ. *యండి*. రెండు; కుఇ, కువి. *రీ*; పర్జి. *ఇర్*; కొలా. *ఈరర్*. ఇద్దరుస్త్రీలు. నా. *ఇరడ్*. స్త్రీ; ఒల్లా. *ఇర్*. రెండు. కురు. *ఇర్ప్*. ఇద్దరు; మాల్తో. ఇవ్ర్-ఇద్దరు; *ఇస్*. రెండు; బ్రా. *ఇరా*. రెండు.

మూ.ద్రా. *ఈర్-/ *ఇర్-.

**ఇరకల్లు** వి. దిగుడుబావి మెట్లవద్ద నాటిన జంటరాళ్లు. <ఇరు-+కల్లు **ఇరకాలకట్టె** వి. ముళ్లకంపలు మొ. వి. ఎత్తటానికి ఉపయోగించే పంగల కర్ర. **ఇరచాలు** పో.చూ. ఇరవాయి. **ఇరవాయి** పో.చూ. ఇరదాలు, ఇరవాలు. వి. నిలువుగా దున్నిన తర్వాత అడ్డంగా దున్నినచాలు. **ఇరవాలు** వి. నిలువుగా దున్నిన తర్వాత అడ్డంగా దున్నినచాలు; **ఇరవై** రూ.చూ. ఇరువది. **ఇరస**[1] రూ.చూ. ఇరువన. వి. **1.** రెండు కుంచాల ధాన్యం, అరతూము; **2.** ఐదు కుంచాలు; **3.** భూమి కొలత. **ఇరసము** రూ. చూ. ఇరువన. వి. రెండు కుంచాల ధాన్యం. **ఇరుకారు** వి. రెండు ఋతువులు. భీమ. 1.109. **ఇరుకెలకులు** వి. బవ. రెండు పక్కలు; **ఇరుగడ(లు)** రూ. ఇరుగెడ(లు), ఇర్గడ. వి. రెండుపక్కలు. భార. విరా. 5.204. క. *ఇర్కడె, ఇక్కడె*. రెండు పక్కలు. **ఇరుగన్ను** వి. రెండుకళ్లు. రా.వి. 5.71. <ఇరు-+కన్ను. **ఇరుగాలిపసి** (-కాలిపసి); పో.చూ. సం.పశు-. వి. **1.** మానవుడు; వ్య. రెండుకాళ్ల జంతువు. బసవ. 6.575; **2.** అజ్ఞాని. **ఇరుగాలు** (-కాలు) వి. రెండుకాళ్లు. భార. పౌ. 1.152. **ఇరుగురు** రూ.చూ. ఇరువురు. సర్వ.

ఇద్దరు. ఇరుగెవ(లు) రూ.చూ. ఇరుగడ(లు) వి. రెండు పక్కలు. ఆము. 6.125; ఇరుగేలు (కేయి ఏ.వ., కేలు. బ.వ.) వి. రెండు చేతులు. హరి. ఉ. 8.280. క. ఇర్‌కై్క. ఇకె్కయ్. రెండుచేతులు; త. ఇరు-కై. <ఇరు-+కేలు. ఇరుగోరు వి. పంటలో రెండు భాగాలు, భూస్వామి వంతు, రైతువంతు. <ఇరు-+కోరు. ఇరుచక్కి వి. రెండు పక్కలు. హంస. 3.29. ఇరుచక్కియలు వి. రెండుపక్కలు; ఇరుచాలుదుక్కి వి. రెండుసార్లు దున్నిన దుక్కి. ఇరుచెవి వి. రెండోవాడు; వ్య. రెండోచెవి. భీమ. 4.50, ఉ.హ. 5.197. ఇరుచేయి వి. రెండుచేతులు. భార. మౌ. 151. క. ఇర్‌కై్క, ఇకె్కయ్. రెండుచేతులు; త. ఇరు-కై; ఇరుచౌవంచ నర్వ. పది. అచ్చ.రా. 5.17. ఇరుతట్టు -తట్టు. పక్క. వి. 1. రెండుపక్కలు; 2. ఇరకాటం. ఇరుతడి వి. బెట్టనేలకు రెండుసార్లు నీరుకట్టటం. ఇరుతిగ తిగ. మూడు; రూ.చూ. ఇత్తిగ. నర్వ. రెండుమూళ్ళు; ఆరు. ఇరుదంతి వి. రెండు దంతాల ఏనుగు. ఇరుదల గ్రుడ్డు కావపు పక్షి. గుడ్డునుంచి పుట్టినది. వి. రెండుతలల పక్షి, గండభేరుండ పక్షి అచ్చ. రా. 34. <ఇరు-+తల-గ్రుడ్డు కానుపు. ఇరుదలదొర వి. అగ్నిదేవుడు. <ఇరు-+తల-దొర. ఇరుదల దొరతేజి వి. మేక; వ్య. అగ్నిదేవుని వాహనం. ఇరుదలపాము వి. రెండుతలలపాము. క. ఇర్‌తలెహావు; త. ఇరుతలైమణియన్. <ఇరు-+తలపాము. ఇరుదలపులుఁగు వి. రెండు తలల పక్షి. గండభేరుండ పక్షి. < ఇరు- + తల-పులుఁగు: ఇరుదూము దూము. పరిమాణవాచి; రూ. ఇద్దుము. వి. రెండు దూములు. < ఇరు-+దూము. ఇరుదెగలు వి. బ.వ. రెండు పక్షాలు. ఉ.రా. 2.61. < ఇరు- + తెగలు. ఇరుదెఱఁగు వి. రెండు విధాలు. కవిజనా. సంజ్ఞా. 11. <ఇరు-+తెఱఁగు. ఇరునాలుగు నర్వ. ఎనిమిది. వ్య. రెండు నాలుగులు. ఇరునూఱు రూ. ఇన్నూరు. నర్వ. రెండు వందలు. ఉ.రా. 7.46. క. ఇన్నూఱు; తు. ఇర్నూదు; త. మ. ఇరునూఱు. ఇరుపక్కలు రూ. ఇరుప్రక్కలు. వి. రెండు పక్కలు. ఇరుపక్కియలు వి. రెండు పక్కలు. భార. అర. 1.306. ఇరుపదియదివిను నర్వ. ఇరవై అయిదు. ఇరుపరుపునేల రూ. ఇరుపర్వునేల. వి. రెండు కోనుల దూరం; వ్య. రెండు పరుగుల దూరం. ఇరుపర్వునేల రూ.చూ. ఇరుపరుపునేల. వి. రెండు కోనుల దూరం. ఇరుపలము పో.చూ. ఇల్లము; రూ. ఇరువలము, ఇర్వలము వి. రెండు పలాలు, ఆరు తులాలు. ఇరుపీనుఁగు వి. రెండు శవాలు భార. భీష్మ. 2.209. ఇరుపుట్టి వి. రెండుపుట్లు (ధాన్యం). ద. హిం.శా. 4.978. ఇరుపూటలు వి. బ.వ. రెండు పూటలు. ఇరుప్రక్కలు రూ.చూ. ఇరుపక్కలు. వి. రెండు పక్కలు. ఇరుప్రొద్దు వి. రెండు పూటలు. భార. శాంతి. 4.368. ఇరుబగులు వి. రెండు పక్కలు. <ఇరు-+పగులు. ఇరుబరులు వి. బ.వ. రెండు పక్కలు. కాశీ. 4.181; ఇరుభాగము వి. ప్రభుత్వానికి కొంత రైతుకి కొంత చెందే భాగం, దీన్ని ఇరుభోగం అని కూడా అంటారు. ఇరుమయిలు రూ. ఇరుమెయిలు. వి. రెండు పక్కలు. ఆం. శా. 3.25. ఇరుమాఱు క్రి. విశే. రెండుసార్లు. హంస. 3.30. ఇరుమూడు నర్వ. ఆరు; రెండుమూళ్లు. మను. 5.16. త. ఇరుమూన్ఱు. ఇరుమెయిలు రూ.చూ. వి. ఇరుమయిలు. రెండు పక్కలు. ఇరుమేను వి. రెండు శరీరాలు. భార. ద్రోణ. 5.295. ఇరుమేరలు వి. బ.వ. రెండు పక్కలు. ఇరుమొయిలు వి. రెండు మేఘాలు. ఇరుఁబుట్టువు (-పుట్టువు). వి. 1. ద్విజన్ముడు, బ్రాహ్మణుడు. అచ్చ. రా. 1.106; 2. పక్షి: మొదట గుడ్డుగా తర్వాత పిల్లగా పుట్టినది; 3. పల్లు, రెండుసార్లు పట్టేది. ఇరువంక వి. 1. రెండు పక్షాలు. శృం.నై. 2.84; 2. రెండు పక్కలు. వసు. 1.6. ఇరువంద్రు (-వంద్రు). నర్వ. ఇరవైమంది. ఇరువది (-వది) రూ. ఇరవై, ఇరువయి, ఇరువై, ఇర్వది. నర్వ. ఇరవై; రెండు పదులు. ఉ.రా. 3.208. క. ఇర్పత్తు, ఇప్పత్తు; తు. ఇరువ; త. ఇరుపతు; మ. ఇరువత్తు, ఇరివదు. < మూ.ద్రా. *ఇరువక్- ఇరువయి (-వయి). రూ.చూ. ఇరువది. నర్వ. ఇరవై. ద. హిం. శా. 4.661. ఇరువతియ (-వతియ). వి. రెండుముక్కలు. భార. కర్ణ. 1.96. ఇరువలము రూ. చూ. ఇరుపలము. వి. రెండు పలాలు, ఆరుతులాలు. ఇరువాఁగు వి. ఉభయపక్షాలు. భార. విరా. 3.198. ఇరువాఁదికైదువు వి. రెండువైపులా వాడి గల కత్తి. చంద్రికా. 4.107. ఇరువాయ రూ. ఇరువాయం. వి. రెండుపాయలు. శృం. నై. 1.51. < ఇరు-+పాయ. ఇరువాయం రూ. చూ. ఇరువాయ. వి. రైతుకూ ప్రభుత్వానికీ చెందవలసిన రెండు భాగాలవంటి. ఇరువాయికట్టు (వాయి, కోవ, కట్టు, ఆపు). వి. మలమూత్ర బంధరోగం. ఇరువాయిపక్కి వి.గండభేరుండపక్షి. ఇరు-+వాయి (నోరు) +పక్కి. ఇరువాయువు వి. మూత్ర కృచ్ఛ్రం, ఉచ్చకట్లు. పో.చూ. ఇరువాయికట్టు. ఇరువురు రూ. ఇరుగురు, ఇర్వురు. నర్వ. ఇద్దరు. భార.ఆది. 2.10. <మూ.ద్రా. *ఇర్-వర్. ఇరువున కుంచ(ము) > కున > ఉన > వున; పో.చూ. ముక్కున; రూ. ఇరన[1], ఇరనము, ఇరున. వి. రెండు కుంచాలు. (కుంచం అంటే కొన్ని ప్రాంతాల్లో రెండు శేర్లు, కొన్ని ప్రాంతాల్లో నాలుగుశేర్లు). ద. హిం. శా. 1015. ఇరువై రూ.చూ. ఇరువది. నర్వ. ఇరవై. కాశీ. 1.53, నరన. 2.50. ఇరువు రూ. చూ. ఇరువున. వి. రెండు కుంచాలు. దశకు. 10.105. ఇరునత నర్వ. పద్నాలుగు, రెండేళ్ళు. అచ్చ. రా. 6.57. < ఇరు- + నత. <నం. నప్తన్-. ఇరునందెరుగకుండ క్రి.విశే. రహస్యంగా; వ్య. ఇటునంద వాళ్ళకూ అటు నందువాళ్ళకూ తెలియకుండా. ఇరుసెవి వి. రెండో మనిషి; వ్య. రెండో చెవి వాడు. ఉ. హ. 5.197. < ఇరు-+చెవి. ఇరుసేయి వి. రెండు చేతులు. భార. అను. 4.102 < ఇరు-+చేయి.

ఇరుకటము చూ. ఇరుకు.

ఇరుకాటము చూ. ఇరుకు.

ఇరుకారు చూ. ఇరు.

ఇరుకికొను రూ.చూ. ఇరుకు.

ఇరుకించు చూ. ఇరుకు.

ఇరుకించుకొను చూ. ఇరుకు

**ఇఱుకు** రూ. చూ. ఇఱుకు. విఙ. సంకుచితం, విశాలంకానిది ; వి. సంకుచిత స్థలం, ఇరుకుచోటు ; స.క్రి. 1. ఇముడ్చు ; 2. రెంటి సందున నొక్కిపట్టు, బిగియబట్టు. అ.క్రి. ఇముడు, అణగు.

**ఇఱకటము** రూ.చూ. ఇఱుకటము. వి. ఇరుకుచోటు. **ఇఱుకటము** రూ.చూ. ఇఱుకటము. వి. ఇరుకుచోటు. **ఇఱుకాటము** రూ.చూ. ఇఱుకటము. వి. ఇరుకుచోటు. **ఇఱుకికొను** రూ.చూ. ఇఱుకికొను. స.క్రి. ఇరికించు, లోనికి దొప్పించు, చిక్కులలో పెట్టు. **ఇఱుకించు** రూ. చూ. ఇఱికించు. స.క్రి. ఇరికించు, దొప్పించు. **ఇఱుకించుకొను** స. క్రి. ఇరికించు కొను, దొప్పించుకొను. **ఇఱుకుకొను** రూ.చూ. ఇఱికికొను. అ.క్రి. 1. చోటుచేసికొను ; 2. చిక్కుపడు. **ఇఱుకుమాను** రూ. చూ. ఇరుకుమ్రాను. వి. పంగలగుంజ. **ఇఱుకుమెడ** వి. పొట్టిమెడ. **ఇఱుకుమ్రాను** రూ. ఇరుకుమాను. వి. పంగల గుంజ (గొడ్లులోపలికి రాకుండా మనుషులు మాత్రమే దావటానికి వీలుగా దొడ్డిదోవకు అమర్చే పంగలగుంజ). **ఇఱుక్కొను** రూ.చూ. ఇఱికికొను. అ.క్రి. 1. చోటుచేసికొను ; 2. చిక్కుకొను.

**ఇఱుకుకొను** చూ. ఇఱుకు.

**ఇఱుకుమాను** చూ. ఇఱుకు.

**ఇఱుకుమెడ** చూ. ఇఱుకు.

**ఇఱుకుమ్రాను** చూ. ఇఱుకు.

**ఇఱుకెలకులు** చూ. ఇఱు.

**ఇఱుక్కొను** చూ. ఇఱుకు.

**ఇఱుగడ(లు)** చూ. ఇఱు

**ఇఱుగమ్మి** చూ. ఇఱు.

**ఇఱుగాలివసి** చూ. ఇఱు.

**ఇఱుగాలు** చూ. ఇఱు.

**ఇఱుగిల్లు** చూ. ఇఱుగు.

**ఇఱుగు** రూ.చూ. ఇరువు. వి. పక్క, సామీప్యం. అష్ట. మ. క. 2.118 పు. 11 పం ; పక్కఇల్లు. వేమన. 408 ; విఙ. పక్కనున్నది. **ఇఱుగిల్లు** వి. పక్కయిల్లు. < ఇఱుగు + ఇల్లు. **ఇఱుగుపొరుగు** రూ. ఇరుపుంపొరుపు. వి. 1. చుట్టు పక్కలు ; 2. ఇంటికి ఇరుపక్కల నున్నవారు. **ఇఱుగు పొరుగులు** వి. బ.వ. ఇంటికి ఇరుపక్కలనున్నవారు. రాధా. 1.32.

**ఇఱుగుడు** రూ. ఇరువుడు. వి. శింశుపావృక్షం, చేవ, జిత్రేగి (Dalbergia sisso). అచ్చ. రా. 531.

క. ఇరుగుండి. శింశుపావృక్షం ; పో.చూ.త. ఇరువేల్, ఇరుళ్ వేల్ ; మ. ఇరువిళ్, ఇయూళ్.

పో.చూ.సం. కుటు-. చెట్టు.

**ఇఱుగుపొరుగు** చూ. ఇఱుగు.

**ఇఱుగుపొరుగులు** చూ. ఇఱుగు.

**ఇఱుగురు** చూ. ఇఱు.

**ఇఱుగెడ(లు)** రూ.చూ. ఇఱు.

**ఇఱుగేలు** చూ. ఇఱు.

**ఇఱుగోరు** చూ. ఇఱు.

**ఇఱుచక్కి** చూ. ఇఱు.

**ఇఱుచక్కియలు** చూ. ఇఱు.

**ఇఱుచఁబడు** చూ. ఇఱుకు. అ.క్రి. కుదియబడు. క్రీడా. 45.

క. ఇఱ, ఇఱ్, ఇఱు. ఇరుకు ; పో.చూ.త. ఇఱు. అంతమగు, దుర్బలమగు, సీరసించు ; ఇటిపల్. నూక ; ఇటి. పగులు, విచ్చు, శిథిలమగు, ముక్కలగు, నిశ్చేష్ట మగు.

< ఇఱుచు- + అ$^{7}$(న్) + పడు.

**ఇఱుచాలుదుక్కి** చూ. ఇఱు.

**ఇఱుచు** రూ.చూ. విఱుచు. స.క్రి. కుళ్లగించు.

**ఇఱుచెవి** చూ. ఇఱు.

**ఇఱుచేయి** చూ. ఇఱు.

**ఇఱుచౌవంచ** చూ. ఇఱు.

**ఇఱుతట్టు** చూ. ఇఱు.

**ఇఱుతడి** చూ. ఇఱు.

**ఇఱుతిగ** చూ. ఇఱు.

**ఇఱుదంతి** చూ. ఇఱు.

**ఇఱుదల్రగుడ్డుకామువు** చూ. ఇఱు.

**ఇఱుదలదొర** చూ. ఇఱు.

**ఇఱుదలదొరతేజి** చూ. ఇఱు.

**ఇఱుదలపాము** చూ. ఇఱు.

**ఇఱుదలపులుఁగు** చూ. ఇఱు.

**ఇఱుదూము** చూ. ఇఱు.

**ఇఱుదెగలు** చూ. ఇఱు.

**ఇఱుదెఱఁగు** చూ. ఇఱు.

**ఇఱువాలుగు** చూ. ఇఱు.

**ఇఱునాలు** చూ. ఇఱు.

**ఇఱుపక్కలు** చూ. ఇఱు.

**ఇఱుపక్కియలు** చూ. ఇఱు.

**ఇఱుపరపువేల** చూ. ఇఱు.

**ఇఱుపర్వువేల** చూ. ఇఱు.

**ఇఱుపలము** చూ. ఇఱు.

**ఇఱుపీఁపుఁగు** చూ. ఇఱు.

**ఇఱుపుట్టి** చూ. ఇఱు.

**ఇఱుపేద** రూ.చూ. నిఱుపేద. వి. అతిదరిద్రుడు, మిక్కిలి పేద వాడు.

**ఇఱుప్రక్కలు** చూ. ఇఱు.

**ఇఱుప్రొద్దు** చూ. ఇఱు.

**ఇఱుబగులు** చూ. ఇఱు.

**ఇఱుబరులు** చూ. ఇఱు.

**ఇఱుభాగము** చూ. ఇఱు.

**ఇఱుమయిలు** చూ. ఇఱు.

**ఇఱుమాల్లు** చూ. ఇఱు.

**ఇఱుమూఁడు** చూ. ఇఱు.

**ఇఱుమెయిలు** చూ. ఇఱు.

**ఇఱుమేను** చూ. ఇఱు.

**ఇఱుమేరలు** చూ. ఇఱు.

**ఇఱుమొయిలు** చూ. ఇఱు.

**ఇఱుఁబుట్టువు** చూ. ఇఱు.

**ఇరులగొంగ** చూ. ఇరులు[1].

**ఇరులదాయ** చూ. ఇరులు[1].

**ఇరులు[1]** రూ. ఇర్లు. వి. చీకటి. నిర్వ. 3.55, విక్షా. ప్రా. 105, శృం.నై. 3.90 ; విశ. నల్లని. ఆము. 4.135.

క. ఇరుళ్, ఇరుళు, ఇరళు. రాత్రి ; కొడ. ఇరు, ఇరుంబు. ఇనుము ; తు. ఇర్లు. రాత్రి ; త. ఇరుళ్ (<ఇరు-మై). చీకటి, నలుపు ; మ. ఇరుళ్. చీకటి, నలుపు ; ఇరు. చీకటిపడు ; ఇరుట్టు. చీకటి ; కోట. ఇబ్. ఇనుము ; తొ. ఉబ్. నూరి ; కుఇ. సింగ. బొగ్గు ; ప్రెసిఎ. పొగమసి; బ్రోబి. మసి, నల్లని ; కువి. రింగల. బొగ్గు ; రోయ. మసి ; పర్జి. చిరుజ్. బొగ్గు; కొలా. చిరుమ్. కారుచీకటి ; ఒల్లా. సిర్డట్. నల్లని, తువ్వుపట్టిన.

<మూ.ద.ద్రా. *ఇరుళ్ <మూ.ద్రా. *చిక్-.

**ఇరులగొంగ** రూ. ఇర్లగొంగ. వి. 1. సూర్యుడు ; వ్యు. చీకటికి శత్రువు. నీలా. 3.45 ; 2. చంద్రుడు ; 3. అగ్ని. **ఇరులదాయ** (వాయ. శత్రువు). వి. సూర్యుడు. శృం.నై. 8.201. **ఇరులుకొను** అ.క్రి. 1. చీకటికమ్ము, భయం గొలుపు. మను. పీఠి. 12 ; 2. దట్టంగా వ్యాపించు, ఆము. 5.139.

**ఇరులు[2]** రూ. ఇడులు : చూ. ఇడియు. అ.క్రి. వగులు, పొడి యగు.

**ఇరులుకొను** చూ. ఇరులు[1].

**ఇరువంక** చూ. ఇరు-.

**ఇరువంద్రు** చూ. ఇరు-.

**ఇరువది** చూ. ఇరు-.

**ఇరువయి** చూ. ఇరు-.

**ఇరువఱియ** చూ. ఇరు-.

**ఇరువలము** చూ. ఇరు-.

**ఇరువాఁగు** చూ. ఇరు-.

**ఇరువాఁడికైదువు** చూ. ఇరు-.

**ఇరువాయ** చూ. ఇరు-.

**ఇరువాయం** చూ. ఇరు-.

**ఇరువాయికట్టు** చూ. ఇరు-.

**ఇరువాయివక్క** చూ. ఇరు-.

**ఇరువాయువు** చూ. ఇరు-.

**ఇరువు** రూ. ఇర, ఇరవు, ఇరుగు. చూ. ఇక్క. వి. 1. చోటు, స్థానం. యయా. 4.26 ; 2. పొరుగువాడు. భీమ. 5.89 ; 3. పక్క. నిర్వ. 2.20 ; 4. పొరుగిల్లు ; 5. స్థిరం ; 6. మగ్గంలో దోనెకు దండెకు మధ్యభాగం ; 7. ఆధారం.

క. ఇరవు, ఇరవు. ఉనికి, స్థితి, ఆధారం, పద్ధతి ; కొడ. ఇర్. ఉండు ; తు. ఇప్పుని. ఉండు, నివసించు ; త. ఇరుప్పు. ఆసనం, పిరుదులు, నివాసం, స్థితి ; ఇరుత్తు. కూర్చోబెట్టు ; ఇరువు (ఇరులి). ఉండు, కూర్చొను ; మ. ఇరిప్పు. స్థితి, నివాసం ; ఇరిప్పిటు. నివాసం, స్థానం ; కోట. ఇగ్. ఉండు ; తొద. ఉర్- (ఉ). కూర్చొను ; కుఇ. రిన్ద (లిన్ది). స్థిరంగా ఉండు.

<మూ.ద్రా. *ఇర్-. వసించు.

**ఇరువుకొను** అ.క్రి. నివసించు, ఉండు, స్థిరపడు. **ఇరువుకొండి** వి. అచ్చుగుదులు తగిలించే ఇనపకొండి, కొక్కెం. **ఇరువుచెక్రం** మగ్గంమీద అచ్చుగుదులు తగిలించే కొయ్య కప్పి. **ఇరువుపడు** అ.క్రి. స్థిరపడు. **ఇరువుంబొరువు** రూ.చూ. ఇరుగుపొరుగు. విశ. ఇంటికి రెండు పక్కలా ఉన్నఇళ్ళు.

**ఇరువుకొను** చూ. ఇరువు.

**ఇరువుకొండి** చూ. ఇరువు.

**ఇరువుచెక్రం** చూ. ఇరువు.

**ఇరువుడు** రూ.చూ. ఇరుగుడు. వి. శింశుపావృక్షం.

**ఇరువుపడు** చూ. ఇరువు.

**ఇరువుంబొరువు** చూ. ఇరువు.

**ఇరువుడ** చూ. ఇరు-.

**ఇరువువ** చూ. ఇరు-.

**ఇరువై** చూ. ఇరు-.

**ఇరువ** చూ. ఇరు-.

**ఇరువత** చూ. ఇరు-.

**ఇరువందెరుగకుండ** చూ. ఇరు-.

**ఇరుసాలు** రూ.చూ. ఇర్సాలు. వి. గ్రామోద్యోగులు ప్రభుత్వా నికి భూమిశిస్తు జమకట్టడం.

**ఇరుసాలుచేయు** స.క్రి. ప్రభుత్వానికి భూమిశిస్తు జమకట్టు.

**ఇరుసాలుచేయు** చూ. ఇరుసాలు.

**ఇరుసు** వి. 1. బండియొక్క అక్షం ; 2. ఏతపు మాను కింది నడిమి అడ్డుకొయ్య ; 3. భూమి అక్షం.

క. ఇరసు, ఇఱసు, ఇరచు, ఇరిచు, ఇర్చి, ఇర్చు. ఇరుసు ; త. ఇరుచు. బండి అక్షం, వెదురు ; ఋజుత్వం, సూటి ; ఇరుత్తు. స్థిరపరచు, ఆధారమగు.

**ఇరుసెవి** చూ. ఇరు-.

**ఇరుసేయి** చూ. ఇరు-.

**ఇరేవు** రూ. ఇరవు, ఉరవు[1]. వి. ఎదురుమూల, అయి మూల.

**ఇర్కి** రూ.చూ. ఇరికి. వి. నక్కెరు.

**ఇర్కె** రూ.చూ. ఇరికి.

**ఇర్గడ** చూ. ఇర్-.

**ఇర్తిగ** చూ. ఇర్-.

**ఇర్వలము** చూ. ఇర్-.

**ఇర్ర** రూ.చూ. ఇఱ్ఱియ. వి. పక్క.

**ఇర్రింక** చూ. ఇఱి[2]. వి. మగలేడి.

**ఇర్రింకచూపులు** వి. లేడిచూపులవంటి బిత్తరిచూపులు. కవిక. 3.248.

**ఇర్రింకచూపులు** చూ. ఇర్రింక.

**ఇర్రించు** రూ.చూ. ఇఱియించు. స.క్రి. తాడు మొ. వాటితో బిగించికట్టు.

**ఇర్లగొంగ** చూ. ఇర్లు.

**ఇర్లవేఁటకాఁడు** చూ. ఇర్లు.

**ఇర్లు** రూ.చూ. ఇరులు. వి. చీకటి. వసు. 6.4.

**ఇర్లగొంగ** రూ.చూ. ఇరులగొంగ. వి. సూర్యుడు. అచ్చ. రా. 5.19. **ఇర్లవేఁటకాఁడు** వి. సూర్యుడు. అచ్చ.రా.2.42. **ఇర్లుకొను** అ.క్రి. చీకటిపడు. కు.సం. 3.261. <ఇర్లు+ కొను.

**ఇర్లగొము** చూ. ఇర్ల.
**ఇర్వది** చూ. ఇర్-.
**ఇర్వదేము** చూ. ఇర్-.
**ఇర్వురు** చూ. ఇర్-.
**ఇర్సాలు** రూ. ఇరసాలు, ఇరుసాలు. వి. వసూలైన భూమి శిస్తును గ్రామోద్యోగులు ప్రభుత్వానికి జమకట్టడం.
హిం. ఉ. అర. ఇర్‌సాల్. పంపటం; మరా. ఇర్సాల;
క. ఇరసాలు. ప్రభుత్వ కోశాగారంలో డబ్బు కట్టడం; పో.చూ. రిసాలు, రిసాలె, అశ్వదళం; తు. ఇర్‌సాలు, రిసాలు. డబ్బు చెల్లించటం, గ్రామాధికారులు భూమిశిస్తు ప్రభుత్వ కోశాగారంలో చెల్లించడం; త. ఇరుచాల్; మ. ఇరుసాల్, ఇరిసాల్.
<ఉ. ఇర్‌సాల్.
**ఇర్సాలునామా** రూ.చూ. ఇర్సాల్నామా. వి. ప్రభుత్వానికి చెల్లించవలసిన శిస్తు మొత్తాలలెక్క. **ఇర్సాల్నామా** రూ. ఇరసాలునామా, ఇర్సాలునామా. వి. ప్రభుత్వానికి చెల్లించవలసిన శిస్తు మొత్తాలపట్టీ. ఉ. ఇర్సాల్‌నామా. శిస్తు మొత్తాలపట్టీ; త. ఇరుచాల్‌నామా. <ఉ. ఇర్సాల్‌నామా.
**ఇర్సాలునామా** చూ. ఇర్సాలు.
**ఇర్సాల్నామా** చూ. ఇర్సాలు.
**ఇర్సాల్వెంటు** వి. అప్పులు తీర్చలేనివాడు, దివాలా తీసినవాడు;
ఇం. *Insolvent.* అప్పు తీర్చలేనివాడు.
<ఇం. Insolvent.
**ఇఱకటము** చూ. ఇఱుకు.
**ఇఱకాటము** చూ. ఇఱుకు.
**ఇఱి-**[1] రూ. ఇరి[1]. (సమాసాల్లో మాత్రమే ప్రయుక్తం) చూ. ఇఱుకు. విశే. 1. బిగి, ఇరుకు, సందులేని. భార. శల్య. 2.416; 2. సన్నము. అచలా. 2.58.
క. ఇఱి. నొక్కు, నొక్కుడు.
**ఇఱిగౌఁగిలి** వి. బిగికౌగిలి. భార. శల్య. 2.416. <ఇఱి+కౌఁగిలి. **ఇఱిగౌను** వి. సన్ననినడుము. అచలా. 2.58. <ఇఱి+కౌను. **ఇఱించు** రూ.చూ. ఇఱియుంచు. స.క్రి. బిగించు. పద్మ. 10.221.
**ఇఱి**[2] రూ. ఇఱ్ఱి. వి. మగజింక. భార. ఆది. 5.49.
పో.చూ.క. ఎరలె, ఎరళె. జింక, దుప్పి; త. ఇరలై. మగ జింక, ఒకరకం దుప్పి.
బహుశః <ఇర్. నల్లనిది, నల్లజింక, కృష్ణసారం.
**ఇఱికి** వి. బాలక్రీడా విశేషం.
**ఇఱికికొను** చూ. ఇఱుకు.
**ఇఱికించు** చూ. ఇఱుకు.
**ఇఱిగౌఁగిలి** చూ. ఇఱి-[1].
**ఇఱిగౌను** చూ. ఇఱి-[1].
**ఇఱించు** చూ. ఇఱి-[1].
**ఇఱియించు** చూ. ఇఱియు.
**ఇఱియు** రూ. ఇరియు. చూ. ఇఱుకు. అ.క్రి. 1. బిగియు. శృం.నై. 4.78; 2. దట్టమగు. ద్వి. హరిశ్చ. ఉ. 2.317; 3. నలుగు, ఒత్తిడివల్ల పగులు లేక అణగు; 4. సన్నమగు. స.క్రి. తాకునట్లుచేయు, అంటనిల్లజేయు. పి.శకు. 3.159.
క. ఇఱి. నొక్కు; తు. ఇరియుని. గట్టిగా నొక్కు; కువి. ఈరి-ఇత్. అడ్డకట్ట కట్టు.
**ఇఱియించు** రూ. ఇఱించు, ఇఱ్ఱించు. స.క్రి. 1. బిగించిపట్టు. ఉ.హ. 1.161; 2. బిగించికట్టు. దశకు. 11.77; 3. బిగించు. కాశీ. 4.32; 4. నశింపజేయు. ఉద్భట. 3.289; **ఇఱియుఁగౌఁగిలి** వి. బిగికౌగిలి. కవిక. 3.226. < ఇఱియు+కౌఁగిలి.
**ఇఱియుఁగౌఁగిలి** చూ. ఇఱియు-.
**ఇఱుకటము** చూ. ఇఱుకు.
**ఇఱుకాటము** చూ. ఇఱుకు.
**ఇఱుకు** రూ. ఇక్కు[1], ఇరుకు. స.క్రి. 1. ఇముడ్చు. భార.ఆది. 2.69; 2. నొక్కిపట్టు, బిగియబట్టు. కు. సం. 2.204, భార. కర్ణ. 2.80; అ.క్రి. 1. రెంటి సందున అదుముడు పడు. హరి. ఉ. 6.9; 2. అణగు, ఇముడు. అచ్చ. రా. 5.31; వి. 1. ఇరుకుచోటు. హరి. ఉ. 7.30; 2. మూల. హరి. ఉ. 7.36; 3. ఇబ్బంది. వేమన. 725; విశే: 1. బిగి, గట్టి. శుక. 1.95; 2. సంకుచితం, విశాలం కానిది.
క. ఇఱుకు, ఇఱకు, ఇఱుంకు, ఇఱంకు, ఇరింకు, ఇఱింకు, ఇరుక్కు. అణగు, అణచు, నొక్కు, బిగియబట్టు, బిగించు, ఇరుకుచోటు, పొద; తు. ఇరియుని. నొక్కు; త. ఇఱుకు. బిగియు, దృఢమగు; ఇఱుక్కు. బిగించు, బిగియగట్టు, దిగగొట్టు, చిక్కబడు; ఇఱుక్కమ్. బిగువు; ఇఱుకల్. సంకోచం; మ. ఇఱుక్కమ్. బిగువు; ఇఱుకుక. బిగియు; ఇఱుక్కుక. గట్టిగాకట్టు, నొక్కిపట్టు; కోట. ఇర్గ్. బిగియు; ఇర్క్. బిగియు, నొక్కు, క్రిక్కిరియు; కుఇ. ఉహ్‌ప. మెలిపెట్టు, నొక్కు; ఉప్‌క. బొనుపు, మెలివేయు; కువి. ఇరిఇత్తలి. అడ్డుకట్టు; పో. చూ. కురు. ఎట్ట్. ఒకచో చిక్కుకొను, దుస్తులు మొ. బిగుతగు; మాల్తో. ఎడ్గ్. మూయు, చెరబెట్టు; ఎడ్గ్‌పా. అడ్డగడియ.
*< మూ. ద్రా. ఇల్+ఉంక్.
**ఇఱకటము** రూ. చూ. ఇఱుకటము. వి. 1. ఇరుకుచోటు; 2. ఇక్కట్టు, చిక్కు, బాధ. **ఇఱకాటము** రూ.చూ. ఇఱుకటము. వి. 1. ఇరుకుచోటు; 2. ఇక్కట్టు, చిక్కు, బాధ. **ఇఱికికొను** రూ. ఇరుకికొను, ఇరుకుకొను, ఇరుక్కొను, ఇఱుకుకొను. అ. క్రి. 1. ఇరుకైన తావులో కూర్చొను; 2. అణగు; 3. చిక్కుకొను. **ఇఱికించు** 'ఇఱుకు' యొక్క ప్రేరణార్థకం. రూ. ఇరుకించు. స. క్రి. ఇముడజేయు, ఇరుకజేయు. క. ఇఱకిసు, ఇఱికిసు, ఇఱుకిసు. నొక్కు, అణచు. **ఇఱుకటము** రూ. ఇరకటము, ఇరుకటము, ఇరుకాటము, ఇఱకటము, ఇఱకాటము, ఇఱుకటము, ఇఱుకాటము. వి. 1. ఇరుకుచోటు. భార.విరా. 5.218; 2. మోసపుమాట. ద్వి. హరిశ్చ. పూ. 1414; విశే. ఇరుకైనది. భార. సౌ. 125. **ఇఱుకాటము** రూ. చూ. ఇఱుకటము. వి. ఇరుకుచోటు, విశే. ఇరుకైనది. **ఇఱుకుకొను** రూ. చూ. ఇఱికికొను. అ.క్రి.

1. నిలుకడయగు; 2. పట్టుకొను. **ఇఱుకుడు** చూ. ఇఱు కటము. వి. బాధకం. పి. శకు. 3.162. **ఇఱుకుపడు** అ.క్రి. ఆరటపడు, సంతాపించు. **ఇఱుకుమెడ** వి. పొట్టిమెడ, అంటుమెడ. **ఇఱుకుమ్రాను** వి. గొడ్లులోనికి రాకుండా మనుషులు నడవటానికి వీలుగా దారికి అడ్డంగా పాతిన వంగల గుంజ. **ఇఱుకువీథి** వి. సన్నని వీధి, సందు.

**ఇఱుకుకొను** చూ. ఇఱుకు.

**ఇఱుకుడు** చూ. ఇఱుకు.

**ఇఱుకుపడు** చూ. ఇఱుకు.

**ఇఱుకుమెడ** చూ. ఇఱుకు.

**ఇఱుకుమ్రాను** చూ. ఇఱుకు.

**ఇఱుకువీథి** చూ. ఇఱుకు.

**ఇఱుగు** రూ. ఇగ్గు[4]. పో.చూ. విఱుగు. అ. క్రి. పరాజయం పొందు.

పో. చూ. త. ఇఱు. విరుగు, అలయు.

**ఇఱుము**[1] వి. మూల, మరుగుచోటు. భాగ. 8.496.

క. ఇఱుంబు. ఇరుకుచోటు, కాఠిన్యం, పారుష్యం; పో.చూ. త. ఇఱుంపు. పొద, గుట్ట.

**ఇఱుము**[2] రూ. ఇరగు. అ.క్రి. పొడియగు.

**ఇఱుముకొను** అ.క్రి. మరుగుపడు, మాయమగు. భా.రా. 5.1080.

**ఇఱుముకొను** చూ. ఇఱుము.

**ఇఱ్ఱి** రూ.చూ. ఇఱి[2]. వి. జింక. భార. ఆది. 5.49.

**ఇఱ్ఱిగోఱజము** వి. కస్తూరి. మను. 4.14. **ఇఱ్ఱిదాల్పుబావ** వి. విష్ణువు. వ్య. చంద్రునిబావ. < ఇఱ్ఱి + దాల్పు-బావ. **ఇఱ్ఱిపోతు** వి. మగ జింక. మను. 4.22.

**ఇఱ్ఱిగోఱజము** చూ. ఇఱ్ఱి.

**ఇఱ్ఱింకు** చూ. ఇఱుకు. వి. మిక్కిలి యింకుట.

క. ఇఱుకు, ఇకు్క. నొక్కు, బిగించు; ఇఱింకు, ఇఱుంకు. నొక్కబడినది.

< క. ఇఱింకు.

**ఇఱ్ఱింకుఁజూపు** (-చూపు). వి. క్రీగంటి చూపు. కవిక. 3.226. **ఇఱ్ఱింకులింకించు** స.క్రి. భయపెట్టు. భీమ. 2.37. < ఇఱ్ఱింకులు + ఇంకు[1] + -ఇంచు. **ఇఱ్ఱింకులింకు** అ.క్రి. 1. కుంగబడు. భీమ. 2.77; 2. నశించు. భీమ. 3.66; 3. మిక్కిలి శుష్కించు, క్షీణించు. ఆము. 4.43; 4. పస్తుండు, ఉపవసించు. ఆము. 4.68; 5. భయపడు < ఇఱ్ఱింకులు + ఇంకు[1]. **ఇఱ్ఱింకులు** (సమాసాల్లో మాత్రమే ప్రయుక్తం). వి. మిక్కిలి యింకుటలు. **ఇఱ్ఱింకులుచేయు** స.క్రి. అణచు. శృం.నై. 7.193.

**ఇఱ్ఱింకుఁజూపు** చూ. ఇఱ్ఱింకు.

**ఇఱ్ఱింకులింకించు** చూ. ఇఱ్ఱింకు.

**ఇఱ్ఱింకులింకు** చూ. ఇఱ్ఱింకు.

**ఇఱ్ఱింకులు** చూ. ఇఱ్ఱింకు.

**ఇఱ్ఱింకులుచేయు** చూ. ఇఱ్ఱింకు.

**ఇఱ్ఱిదాల్పుబావ** చూ. ఇఱ్ఱి.

**ఇఱ్ఱిపోతు** చూ. ఇఱ్ఱి.

**ఇఱ్ఱియ** రూ. ఇఱ. వి. పార్శ్వం, పక్క.

పో. చూ. త. విలై. వీధివక్క, ప్రదేశం, స్థానం, సరిహద్దు, రెక్క, ఈక; మ. విఱుకు. రెక్క. పొలుసు.

**ఇఱ్ఱువి** ఇదంతం. ఆం.భా. 46.51 (ఇది కేతన పరిభాష).

**ఇల్-** రూ.చూ. ఇల్లు[1]. సమాసాల్లో మాత్రమే వస్తుంది. వి. ఇల్లు.

**ఇల్బిడ్డ** వి. దాసి. < ఇల్- + బిడ్డ. అర్థవివరి. **ఇల్వడి** రూ.చూ. ఇలువడి. మంచినడత. పద్మ. 9. **ఇల్వరుస** రూ. చూ. ఇలువరుస. ఇంటివంతు, ఇంటివారీగా, ఇంటి ఆధారం. **ఇల్వేలుపు** రూ.చూ. ఇలువేలుపు, పండి. చ. దీక్షా. 3. వ.

**ఇలకరించు** రూ.చూ. ఇలుకరించు. స.క్రి. పళ్లు బిగించు.

**ఇలకఱచు** రూ. ఇల్కఱచు, ఈలకరచు, ఈలకఱచు, ఈల్కఱచు. అ.క్రి. బిగబట్టు. భా. రా. 5.702; అ.క్రి. మీది పండ్లు కింది పండ్లతో గదియ బిగించు. ఆము. 5.13.

త. ఇళై. గ్లానిచెందు, అలసటచెందు, ఓటమి చెందు, వెనుచూపు; ఇళైప్పు. అలసట, గ్లాని, నిరాశ; ఇళకు. అలసటచెందు; మ. ఇళవ్పల్. అలసట; కోట. ఎళ్వ్- (ఎళ్-), ఇళ్. ఎగశ్వాస.

**ఇలకోడి** రూ. ఈలకోడి. చూ. ఈల పురుగు. వి. కీచురాయి, చిమ్మట.

త. చిల్వంటు, చిల్లయ్. చిమ్మట; చిల్వంటు, చిల్విటు, చిల్లీటు, చిల్లి, చిల్లాఱు. కీచురాయి; చిల్. గోల, చప్పుడు; చిలుకటు. గోలపెట్టు; చిలయ్. ధ్వనించు, ప్రతిధ్వనించు; మ. చిల. చప్పుడు; చిలిక్క. బిగ్గరగానవ్వు; చిలెక్క. గడబిడచేయు, కిచకిచమను; చిల్విటు, చిలీటు, చీటు. కీచురాయి; పర్జి. చిల్గి. కీచురాయి.

ఇల (చప్పుడు) + కోడి (కీటకాలను సూచించే ప్రత్యయం); పో.చూ. త. చువర్-క్-కోటి. కీచురాయి.

< చిల (< మూ. ద్రా. *చిళ్.) + కోడి.

**ఇలటము** చూ. ఇల్లు[1]. రూ.చూ. ఇల్లటము. పండి.చ. పురా. 98.

**ఇలతయేసు** వి. అభ్యర్థన.

మ. ఇల్తిమాస్. వినతి;

హిం. ఇల్తిమాస్. నివేదన, అభ్యర్థన; ఉ. ఇల్తిమాస్. ప్రార్థనచేయు; పార. అర. ఇల్తిమాస్. అభ్యర్థన;

**ఇలంత** చూ. ఇల్లింద.

**ఇలంతీరు** వి. ఒక రకం ముళ్లకంప.

**ఇలపావ** వి. కత్తిమొనవలె కోసుగా ఉండే చేప కొమ్ము. మంత్రించడానికి వాడే చేప కొమ్ము.

ఇల్లవ. ఒకరకం చేప; పాయ. ఖండం.

**ఇలపీట** వి. కత్తిపీట.

సం. ఈలి, ఈలీ. ఆయుధ విశేషం; ప్రా. ఇలీ. వస్త్రవిశేషం; పా. ఇలీ. ఒకరకం కత్తి; హిం. ఈలీ, ఈలి, ఇలీ. చిన్నకత్తి.

< ప్రా. ఇలీ + పీట.

**ఇలవ** చూ. ఎరివ. వి. రావిచెట్టువంటి ఒకరకం చెట్టు.

**ఇలవరము** రూ. ఇడవారం, ఇలారము, ఇలారు, ఇలువరము

ఇలువారము, ఇల్లారీ, ఇల్లారు. వి. **1.** గడ్డితో చేయబడిన బుట్ట; **2.** గుండ్రంగా వేసిన పశువుల కొట్టం; **3.** ఒక చోటినుండి మరొక చోటికి తీసుకుపోవటానికి వీలయ్యే గుడిసె; **4.** వలయాకారం; **5.** పైరు రక్షణ కోసం చేను చుట్టూ తడికలతో కట్టిన కంచె; **6.** గుండ్రటి పెంకుకప్పు; **7.** గరిసెల మీద, గుమ్మిలమీద పెట్టే గడ్డిమూత.

క. ఎఱకిల్, ఎఱకె. కప్పు. కప్పు కుపయోగించే గడ్డి మొ.; త. ఇఱవారమ్, ఇఱవాణమ్. ఇంటి ముంజూరు; ఇఱవు. లోపలివైపు; వాలుగా ఉన్న కప్పు లోపలి భాగం, ముంజూరు; ఇఱై. వాలుగానున్న కప్పు లోపలి భాగం, ఇంటి ముంజూరు; వారమ్. కొండవాలు, లేదా చరియ; కొడ. ఎఱకి. ముంజూరు; మ. ఇఱ, ఇఱకాలి, ఇఱయత్తమ్. ఇంటిముంజూరు; ఇఱమ్పు. ముంజూరు; ఎక్కుటకు, దిగుటకు అలవికాని (కొండ మొ.) నిటారైనచోటు; ఇఱవారమ్. పంచపాళి; కొలా. రేప. కొండ యొక్క దిగుపచరియ.

ఇలవేలుపు చూ. ఇలు[1].

ఇలవేల్పు చూ. ఇలు[1].

ఇలా[1] చూ. ఇ[2]. క్రి.విణ. ఈవిధంగా.

ఇలా[2] వి. ధ్యాస, చింత. స. క్రి. ఒక పనిలో మనస్సును లగ్నం చేయు.

ఉ. విలా. ఆస్థ, శ్రద్ధ. అర. విలా. శ్రద్ధ, ఆకాంక్ష.

< ఉ. విలా.

ఇలాకా రూ. ఇలాకె, ఇలాఖా, ఇల్యాకీ. వి. **1.** సంబంధం; **2.** అధికారానికి లోబడి ఉండే ప్రదేశం; **3.** స్వాధీనం; **4.** ఉంపుడుగత్తె; **5.** అక్రమ సంబంధం; **6.** పరాధీనత; **7.** శాఖ.

నే. ఇలాక, ఇలాఖా. రాష్ట్రం. ప్రాంతం, జిల్లా, అధికారం, అధికారానికి లోగానున్న ప్రాంతం; ఇలాకా. దేశం; మ. రా. ఇలాఖా. హక్కు, కుటుంబం, రాష్ట్రం, పరగణా; హిం. ఉ. పార. ఇలాకా. బంధుత్వం, సంబంధం, జమిందారీ; అర. అలాక్, ఇలాకా;

క. ఇలాఖె. హక్కు, సంబంధించిన, పట్టణానికి చేరువలో వున్న గ్రామం, అధికారానికి లోబడిన ప్రదేశం, స్వాధీనం, శాఖ, జిల్లా పరగణా; తు. ఇలాకె. శాఖ; త. ఇలాకా. జిల్లా, అధికారానికి లోబడిన ప్రాంతం, శాఖ.

< ఉ. ఇలాకా.

ఇలాకాచేయు అ.క్రి. స్నేహంచేయు. ఇలాకాదారులు వి. ఆశ్రితులు. ఇలాకాపుచ్చుకొను స.క్రి. పరిగణించు, పూచీ తీసుకొను, బాధ్యత వహించు. ఇలాకావాండ్లు వి. ఆశ్రితులు. ఇలాకావాళ్లు వి. ఆశ్రితులు.

ఇలాకాచేయు చూ. ఇలాకా.

ఇలాకాదారులు చూ. ఇలాకా.

ఇలాకాపుచ్చుకొను చూ. ఇలాకా.

ఇలాకావాండ్లు చూ. ఇలాకా.

ఇలాకావాళ్లు చూ. ఇలాకా.

ఇలాకీ రూ.చూ. ఇరాకీ. వి. ఇరాక్ దేశంనుండి కొనిరాబడ్డ వస్తువిశేషం; వస్త్రవిశేషమనే అర్థంలో ప్రకృత ప్రయోగం. హంస. 5.356.

ఇలాకె రూ.చూ. ఇలాకా.

ఇలాఖా రూ.చూ. ఇలాకా.

ఇలాటి చూ. ఇ[2]. విణ. ఇటువంటి.

ఇలాతి రూ.చూ. విలాతి. వి. విదేశం.

ఇలాతికాయ వి. వేరు సెనగకాయ. బహుశః ఇతర దేశాల నుండి కొని రాబడ్డది గనుక ఈ పేరు వ్యవహారంలో స్థిరపడి ఉంటుంది.

ఇలాతికాయ చూ. ఇలాతి.

ఇలాయ రూ.చూ. ఇలాయీ. వి. చుట్టూ వత్తులు వేసే దివిటీ.

ఇలాయి రూ.చూ. ఇలాయీ. వి. ఒక రకం దివిటీ. హంస. 3.23, రంగా. 3.145.

ఇలాయిజలాయి వి. బాధ్యత లేకుండా సోమరిగా తిరుగువాడు.

ఇలాయీ రూ. ఇలాయ, ఇలాయి, విలాయి. వి. ఒకరకం దివిటీ. రంగా. 3.145.

ఒ. హిం. ఉ. ఇలాహీ. పునీతం, దాతృత్వం; పార. ఇలహీ. భగవత్సంబంధమైన.

< ఉ. ఇలాహీ.

ఇలాయీబుడ్డి వి. ఒక రకం దివిటీ, దీపం బుడ్డి.

ఇలాయీబుడ్డి చూ. ఇలాయీ.

ఇలారము రూ.చూ. ఇలవరము. గోడలులేని ఎత్తుడు గుడిసె.

ఇలారు రూ.చూ. ఇలవరము, గుడిసె.

ఇలాలు వి. ఒక రకం దివిటీ.

మరా. ఉ. అర. హిలాల్. దివిటీ;

క. ఇలాల్, ఇలాలి. పర్వదినాల్లో ఉపయోగించే దివిటీ; తుళు. ఇలాల్, హిలాల్.

< ఉ. హిలాల్.

ఇలాసం వి. మేకులోని పదునైన అంచు.

ఇలాసము వి. బేదిక వేసుకోవటం.

ఇలి[1] వి. ఎంగిలి మెతుకు. శృం. నై. 7.52.

సం. ఇడా. ఆహారం; ఇరా. త్రాగదగిన ఆహార విశేషం; ఇలా, ఇళా; ప్రా. ఇలియా. పంచదార, అన్నముతో చేసిన ఆహార విశేషం;

క. ఇళె. ఆహారం.

< ప్రా. ఇలియా. అర్థవిపరి.

ఇలి[2] చూ. ఎలుక. వి. ఎలుక.

క. ఇలి, ఎలి. ఎలుక; కొడ. ఎలి; తుళు. ఎలి, ఇలి; త. ఎలి. ఎలుక, పందికొక్కు; మ. ఎలి; కోట. ఎయి; తొద. ఎశ్వ; గోం. అల్లి; కొండ. ఎల్క; కుఇ. ఒడ్రి; కువి. దండిహిరెలి. పందికొక్కు; పర్జి. ఎల్. ఎలుక; కొలా. ఎల్క; నాయకి. ఎల్క; బ్రా. హల్.

< మూ.ద్రా. *ఎల్.

ఇలింద రూ.చూ. ఇల్లింద. వి. ఇంద్రవల్లి (Diotpyroschlorxylon).

ఇలిపాషాణము రూ. ఉల్లిపాషాణము. వి. ఎలుకలు పట్టే బోను;

< ఇలి. + సం. పాషాణ-. రాయి; విషం అని అర్థవిపరి.

ఇలివెంద రూ.చూ. ఇల్లింద. వి. ఇంద్రవల్లి (a tree,

Diospyroschloroxylon).

**ఇలు**[1] రూ.చూ. ఇల్లు[1]. వి. **1.** ఇల్లు. భార. ఆది. 6.180; **2.** గృహకృత్యం. మను. 1.53, నిర్వ. రా. 9.52; **3.** కుటుంబం.

**ఇలవేలుపు** రూ.చూ. ఇలువేలుపు. **ఇలవేల్పు** రూ.చూ. ఇలువేలుపు. **ఇలుకూచి** వి. ఇల్లు విడువనిది. **ఇలుజట్టు** వి. (దయ్యాన్ని పారదోలటానికి) ఇంటిచుట్టు తిరగటం. <ఇలు + చుట్టు. **ఇలుదొర** వి. ఇంటి యజమాని. ఆం.భా. 2.176. **ఇలువింపరము** వి. నూతన వధూవరుల గృహ ప్రవేశం. **ఇలువింపుట** వి. నూతన వధూవరుల గృహ ప్రవేశం. **ఇలువట్టు** పో.చూ. ఇంటిపట్టు. వి. **1.** ఇంటి స్థలం. హరి. ఉ. 1.36 ; **2.** నివాస స్థలం. త. పట్టు. ఒకని అధీనంలో ఉన్న స్థలం; అనేక గ్రామాలు గల దేశ భాగం. **ఇలుపాడు** వి. నివేశనం. **ఇలుతే(డు** వి. ఇంటి యజమాని. సీలా. 8.56. **ఇలువడి** రూ. ఇల్వడి. వి. **1.** మంచి నడవడి. భార. అను. 1.285, విక్ర. 7.152 ; **2.** కులీనత, మంచి వంశంలో పుట్టటం. భార. శాంతి. 3.108 ; **3.** పాతి వ్రత్యం. భార. అను. 1.285 ; **4.** అభిమానం. పో.చూ. త. ఏటి. నడవడి. **ఇలువరుస** రూ. ఇల్వరుస. వి. **1.** ఇంటి వంతు. భార. ఆది. 6.264 ; **2.** కుల మర్యాద. భాగ. 9.382 ; **3.** పాతివ్రత్యం, మంచి నడత, అభిమానం, వంశానుక్రమం. **ఇలువిందు** వి. అతిథి. బసవ. 1831. **ఇలువేలుపు** రూ. ఇలవేలుపు, ఇలవేల్పు, ఇలువేల్పు, ఇల్వేలుపు. వి. ఇంటి వేలుపు. కళా. 1.2. **ఇలువేల్పు** రూ.చూ. ఇలువేలుపు. హరి. ఉ. 9.47.

**-ఇలు**[2] రూ.చూ. -ఇల్లు[2]. కొన్ని ధాతువులపై చేరే అంతాగమం. ఉదా. : రంజిలు, రాగిలు.

**ఇలుకరించు** ఇలుక్ + (ర్) + ఇంచు. రూ. ఇలకరించు. చూ. ఇలకఱచు. స.క్రి. ఇగిలించు, తెరచు. వరాహ. 10.30.

త. ఇళి. నవ్వు, అవహసించు, ఇగిలించు ; మ. ఇళి. తృణీకారంతో కూడిన ఇగిలింపు ; ఇళిక్క. ఇగిలించు ; ఇళిప్పు. ఇగిలించటం.

<మూ.ద.ద్రా. ఇళ్.

**ఇలుకు** రూ. ఇలుక్కు. వి. బెణకు, తొలగు. అ.క్రి. బెణకు. బహుళా. 3.29.

క. ఇలికు. నలగగొట్టు ; ఇలుకు, ఉళుకు, ఉళుక్కు, ఉలుకు, ఉలకు, ఉలుక్కు. బెణకు ; పో.చూ. ఉలకు, ఉలుకు, ఉల్కు, ఉళుక్కు. కంపించు, వణకు, గందరగోళపడు ; తు. ఉళుకుని, ఉలుకుని, ఉల్కుని. బెణకు ; ఉలుకు. బెణకు ; త. ఉళుక్కు. బెణకు, స్థానభ్రంశమగు, పట్టుదప్పు ; వి. బెణుకు ; ఉళై. అవయవాల్లో నొప్పిపట్టు ; ముళుక్కు. బెణుకు, కండరాలు పట్టుతప్పు, వేళ్ల పట్టు తప్పు ; ముళి. బాధపడు, విరుగు, వగుఱు ; మ. ఉళుక్కుక. స్థాన భ్రంశమైన, పట్టు తప్పిన ; ముళుక్కు ; కొద. తిక్- (తిక్య్-). బెణకు.

<మూ.ద్రా. *చుళ్-.

**ఇలుకూచి** చూ. ఇలు[1].

**ఇలుగు** రూ.చూ. సీలుగు స.క్రి. సీలుగు, చచ్చు. శార. శల్య. 1.51, భా.రా. 4.266.

**ఇలుజట్టు** చూ. ఇలు[1].

**ఇలుదొర** చూ. ఇలు[1].

**ఇలువింపరము** చూ. ఇలు[1].

**ఇలువింపుట** చూ. ఇలు[1].

**ఇలువట్టు** చూ. ఇలు[1].

**ఇలుపాడు** చూ. ఇలు[1].

**ఇలుతే(డు** చూ. ఇలు[1].

**ఇలువడి** చూ. ఇలు[1].

**ఇలువరము** రూ.చూ. ఇలవరము. వేంక. పంచ. 4.416.

**ఇలువరుస** చూ. ఇలు[1].

**ఇలువారము** చూ. ఇలవరము.

**ఇలువిందు** చూ. ఇలు[1].

**ఇలువేలుపు** చూ. ఇలు[1].

**ఇలువేల్పు** చూ. ఇలు[1].

**ఇల్కఱచు** రూ.చూ. ఇలకఱచు.

**ఇల్కు** రూ.చూ. ఇలుకు. అ.క్రి. బెణకు, తొలగు. వి. బెణకు, తొలగడం. బహుళా. 3.29.

**ఇల్పిర్త** చూ. ఇల్.

<ఇల్ (<ఇలు[1]) + బిర్త. అర్థవివరి.

**ఇల్ల** అవ్య. వ్యతిరేకార్థకం, లేదు. పి.శకు. 1.50, చంద్ర. 2.29.

క. ఇల్ల. ప్రథమ పురుష వ్యతిరేకార్థక రూపం ; ఇది మూడు పురుషలయందు, రెండు లింగాల్లోను, రెండు వచనాల్లోను, వాడబడుతోంది ; లేదు ; పో.చూ. ఇలి. లేకపోవటం ; ఇల్లా యొక్క సంక్షిప్త రూపం ; ఇల్ల యొక్క మామూలు సంక్షిప్త రూపం. ఇల్ ; తు. ఇజ్జీ. లేదు ; ప్రవేశించ లేదు ; మ. ఇల్ల. ప్రవేశించదు, అక్కడ లేదు ; త. ఇల్లై. లేదు ; మ. ఇల్ల- ప్రవేశించదు, అక్కడ లేదు ; గోం. హల్, హిల్లె. లేదు, కాదు ; కుఇ. సిడ. లేదు ; కువి. హిల్లె ; పర్జి. చిల. లేనిది ; పో.చూ.మాల్తో. చిలె. నిషేధించటం ; కొంద. సిలె. లేదు.

<క. ఇల్ల <మూ.ద.ద్రా *ఇల్ <మూ.ద్రా. *చిల్.

**ఇల్లటకాడు** చూ. ఇల్లు[1].

**ఇల్లటపుటల్లు(డు** చూ. ఇల్లు[1].

**ఇల్లటము** చూ. ఇల్లు[1]. రూ. ఇలటము, ఇల్లంట్రము, ఇల్లరకము, ఇల్లటికము, ఇల్లాటము. వి. అల్లుడు అత్తవారింట్లో చేసే కాపురం. హర. 5.4, నిరంకు. 1.6.

త. ఇల్లఱమ్. గృహజీవనం ; పో.చూ. అఱమ్. అన్ని వర్ణాలవారు ఆచరించవలసిన విధులు.

**ఇల్లడ** రూ. ఇల్లడము, ఇల్లెడ. **1.** అడిగినప్పుడు తిరిగి ఇచ్చే పద్ధతిని ఇంకొకరిదగ్గర దాచిన ధనాదికం. భార.సభా. 1.163, ఆశ్వ. 1.93, ఆము. 5.135 ; **2.** అప్పగింత ; **3.** కాపురము ; **4.** ఏలుబడి.

క. అడ. తాకట్టు ; అడవు ; త. ఇల్లడై. జాగ్రత్త కోసం ఇంట్లో దాచియుంచిన వస్తువు, తాకట్టు ; అడై. కుదువపెట్టినది, దాచటానికంగీకరించినది.

**ఇల్లడధనము** వి. కుదువపెట్టిన సొమ్ము. మార్క. 2.118.

ఇల్లడమావిడి వి. ఇల్లడగా ఉంచబడిన స్త్రీ. వి.వు. 5.151. ఇల్లడయిడు స.క్రి. దాచియుంచు. భార.సభా. 27, ఆ.క్ర. 1.93. ఇల్లడవెట్టు స.క్రి. కుదువయుంచు, భద్రంగా దాచి అడిగిన వెంటనే ఒప్పగించమని యిచ్చు. భార.విరా. 2.211, వి.క. 7.622. <ఇల్లడ+పెట్టు. ఇల్లడసొమ్ము వి. కుదువపెట్టిన సొమ్ము, దాచిన ఆస్తి. భార.అర. 4.294.

ఇల్లడధవము చూ. ఇల్లడ.

ఇల్లడమావిడి చూ. ఇల్లడ.

ఇల్లడము రూ.చూ. ఇల్లడ.

ఇల్లడయిడు చూ. ఇల్లడ.

ఇల్లడవెట్టు చూ. ఇల్లడ.

ఇల్లడసొమ్ము చూ. ఇల్లడ[1].

ఇల్లంత్రము చూ. ఇల్లు[1]. రూ.చూ. ఇల్లటము.

ఇల్లంద చూ. ఇల్లింద. వి. ఇంద్రవల్లి.

ఇల్లము చూ. ఇరుపలము. వి. రెండు పలాల బరువు.

ఇల్లరకము చూ. ఇల్లు[1]. రూ.చూ. ఇల్లటము.

ఇల్లరి చూ. ఇల్లు[1].

ఇల్లరికము రూ. అల్లరికము. చూ. ఇల్లు[1]. చూ. ఇల్లటము.

ఇల్లలికము చూ. ఇల్లు[1]. రూ.చూ. ఇల్లటము.

ఇల్లవ రూ.చూ. ఇల్లెము. వి. ఒకరకం చేప.

ఇల్లా వి. ఒక ఆట గెలుపు.

ఉ.అర. ఇల్ల. ప్రతిజ్ఞ. శపథం.

ఇల్లాకు చూ. ఇల్లు[1].

ఇల్లాటము చూ. ఇల్లు[1]. రూ.చూ. ఇల్లటము.

ఇల్లాటి రూ.చూ. ఈలాటి. చూ. ఇ[2].

ఇల్లాపె చూ. ఇల్లు[1].

ఇల్లామల్లి పో.చూ. ఇల్ల. వి. కొండెగాడు. పిశునుడు, చాడీకోరు. హర. 7.125.

క. ఇల్లామల్లి. చాడీ. వెన్నుపోటు, అల్లరిపిల్ల; త. ఇల్లాతతుమ్-పొల్లాతతుమ్. అసత్య ప్రచారం; మ. ఇల్లాతవాక్కుకళ్. కల్లమాటలు.

<క. ఇల్లామల్లి.

ఇల్లామల్లితనము వి. వదరుబోతుతనం, కొండెగానితనం. క. ఇల్లామల్లితన. ఇల్లామల్లిసుద్దులు వి. కొండెపు మాటలు.

ఇల్లామల్లితనము చూ. ఇల్లామల్లి.

ఇల్లామల్లిసుద్దులు చూ. ఇల్లామల్లి.

ఇల్లాయము చూ. ఇల్లు[1]. వి. ఇంటిపన్ను.

<ఇల్లు+సం. ఆయ-.

ఇల్లాయి వి. ఒకరకం కలుపుమొక్క.

ఇల్లారీ చూ. ఇలవరము. వి. పెద్దమూత; గవాక్షి మూత కావచ్చు.

ఇల్లారు రూ.చూ. ఇలవరము. వి. 1. గవాక్షిని మూసే గంప; 2. ఇంటిపైభాగంలో ధాన్యం నిలవచేసుకోవటానికి రాతితో కట్టిన కొట్టు.

ఇల్లాలితనము చూ. ఇల్లు[1].

ఇల్లాలు చూ. ఇల్లు[1].

ఇల్లి పో.చూ. ఇల్ల. వి. నిరాహారం. ఉపవాసం. ఆం.భా. 2.175.

ఇల్లిగ్గులు పో.చూ. ఇగ్గు[3]. వి. 1. తగ్గుదల. ఉ.హ. 5.166; 2. మిక్కిలి వెనుదీయటం.

క. ఇళంగు. దిగటం, కిందికి రావటం; ఇళియబిఋ. ఇళియనూకిసు. కిందికి పడటం; ఇళికె. దిగటం; ఇళుకు, ఇఋకు. కిందికి పోవటం; తు. ఇళి, ఇళి; త. ఇళంగు.

ఇగ్గు<తు. ఇళి(గు), *ఇలి(గు).

ప్రా.తె. *ఇలిగు+ప్రా.తె. *ఇగ్గు; ప్రా.తె. *ఇళిగు-, *ఇగ్గు లకు. కిందికొరగటం అని అర్థం.

ఇల్లింత రూ.చూ. ఇల్లింద. వి. పులిచేరుచెట్టుమాదిరి ఒకరకం చెట్టు; దనిలిపురుగులు దీని ఆకులు తింటాయి.

ఇల్లింద రూ. ఇలంత. ఇలింద, ఇలివెంద, ఇల్లింత, ఉళింద, ఉల్లింద్ర, ఉల్లెందు. వి. ఇంద్రవల్లి.

ఇల్లిముక్కు వి. పగిలి నెత్తురుకారే ముక్కు.

పో.చూ. క. జిల్లి. చిన్న కంత. త. ఇల్లిముక్కు. ముక్కునుంచి నెత్తురు కారటం, చిల్లిముక్కు, ముక్కుకొన. చిల్లిముక్కుఱై. ముక్కులోనుంచి నెత్తురు కారటం; మ. చిల్లి. కంత.

ఇల్లింపులు చూ. ఇల్లు[1].

ఇల్లిసె వి. చేప.

సం. ఇల్లిశ, ఇల్లీశ. ఒకరకం చేప; నే. హిల్సా. ఒ. హిం. ఇల్లిశ, ఇల్లిశి. హిల్సా అనే చేప. అర. ఇలిష్.

<సం. ఇల్లిశ-.

ఇలు[1] రూ. ఇలు, ఇల్. వి. 1. ఇల్లు, వాసస్థలం. భార.ఆది. 4.194. 2. ఇంటిపని. విజ్ఞా.వ్యా. 80; 3. కుటుంబం, కులం, వంశం. కవిరా. 3.133; 4. రాశిచక్రంలో గడి; 5. లెక్కలలో చోటు, గడి; 6. పన్నె దండెలకు బిగించిన పల్లల మధ్య వెలితి; 7. చదరంగపు గడి; 8. మంచము నేతలో గడి, అనుపోసిన నూలులో పైకి కిందికి వచ్చిన రెండు పోగుల మధ్యగడి.

క.తు.గోం. ఇల్. ఇల్లు; కొడ. ఇల్-అవ్రన్. సంబంధి. త. ఇల్. చోటు, ఇల్లు, కుటుంబం, నక్షత్ర సముదాయం; ఇల్లకం, ఇల్లమ్, ఇల్లిటమ్. ఇల్లు; మ. ఇల్, ఇల్లమ్. ఇల్లు; కొండ. ఇలు, ఇలు్క; కుఇ. ఇడు; కువి. ఇల్లూ, ఇల్క. బ.వ.; ఇల్లు; పర్జి. ఇల్‌పాది. ఇంటి కప్పు; కొలా.నా. ఎల్ల. ఇల్లు.

<మూ.ద్రా. *ఇల్.

ఇలటము వి. అల్లుడు అత్తవారింట్లోనే ఉండిచేసే కాపురం. పండి. చ. 2.98 పు. ఇల్లటకాడు రూ.చూ. ఇల్లటము. వి. అత్తవారింట్లో వుండే అల్లుడు. ఇల్లటపుటల్లుడు చూ. ఇల్లటము. వి. అత్తవారింట్లో వుండే అల్లుడు. వి.క. 7.161, కళా 4.60. ఇల్లటము వి. అల్లుడు అత్తవారింట్లో చేసే కాపురం. ఇల్లంత్రము రూ.చూ. ఇల్లటము. ఇల్లరకము రూ. చూ. ఇల్లటము. ఇల్లరి వి. ఇంటి పన్ను. అం.భా 2.192. ఇల్లరికము రూ.చూ. ఇల్లటము. ఇల్లలికము వి. ఇల్లటము. ఇల్లాకు వి. ఇంటి

పెరడు. ఇల్లాటము వి. ఇల్లటము. ఇల్లాపె వి. 1. గృహ యజమానురాలు. మల్లభూ. వై. 21 ; 2. భార్య. <ఇలు + ఆపె. ఇల్లాయము వి. ఇంటిపన్ను. ఇల్లాలితనము ఇల్లాలు + ఇ-తనము. వి. పాతివ్రత్యం. అహల్యా. 3.39. ఇల్లింపులు చూ. ఇలునింపడము, ఇలునింపట. వి. నూతన వధూవరుల గృహప్రవేశం. ఇల్లాలు రూ. ఇల్లుటాలు. వి. 1. గృహిణి. హర. 7.125 ; 2. స్త్రీ ; 3. పతివ్రత ; 4. భార్య. ఇల్లు + ఆలు. త. ఇల్లాళ్. భార్య. గృహ యజమానురాలు. ఇల్లుటాలు రూ.చూ. ఇల్లాలు. వి. భార్య, స్త్రీ. నీలా. 1.71.

-ఇల్లు[2] రూ. -ఇలు[2]. ప్రత్య. కొన్ని ధాతువులపై చేరే అంతాగమం. ఉదా. రంజిల్లు, రాగిల్లు.

ఇల్లుటాలు చూ. ఇల్లు[1].

ఇల్లెడ రూ.చూ. ఇల్లడ.

ఇల్లెము రూ. ఇల్లవ. వి. ఒకరకం చేప. హంస. 4.187.

ఇల్వడి చూ. ఇల్-.

ఇల్వరున చూ. ఇల్-.

ఇల్వాకి రూ.చూ. ఇలాకా.

ఇల్వేలుపు చూ. ఇల్.

ఇవ రూ.చూ. ఇవము. వి. చలి, శైత్యం. కాశీ. 1.137.

ఇవక పో.చూ. ఇవము, వి. చలి, శైత్యం. ఆం. భా. 1.85.

సం. హిమక. చలి, తేమ, చెమ్మ, మంచు.

<సం. హిమక-.

ఇవతల (తల. పక్క) రూ.చూ. ఈతల. క్రి.విశ. 1. ఈవలి కాలం. రాధా. 3.57 ; 2. ఈవలిఒడ్డు. ఆం.భా. 1.155 ; 3. ఈవలి ప్రదేశం.

ఇవతళించు చూ. ఇవము.

ఇవతాళించు చూ. ఇవము.

ఇవతాళింపు చూ. ఇవము.

ఇవపుగుబ్బలి చూ. ఇవము.

ఇవము రూ. ఇగము, ఇవ, ఈము. వి. 1. శైత్యం, చల్లదనం. కాశీ. 1.137 ; 2. మంచు. నీలా. 3.45 ; విశ. చల్లనిది. ఆం.భా. 1.80.

సం. ప్రా. పా. హిమ-. చలి, మంచు ;
క. హిమ ; త. మ. ఇమయ్.

<సం. హిమ-.

ఇవతళించు రూ. ఇవతాళించు. అ.క్రి. చల్లనగు. శీతలమగు. కవిక. 3.222. ఇవతాళించు రూ.చూ. ఇవతళించు. అ.క్రి. 1. చల్లనగు. శృం.నై. 3.34, ప్రబోధ. 3.46 ; 2. గడ్డకట్టు. హర. 4.14. ఇవతాళింపు చూ. ఇవతాళించు. వి. చల్లదనం, శైత్యం. ఆం.భా. 1.81. ఇవపుగుబ్బలి చూ. ఇవము. వి. హిమాలయ పర్వతం. వేంక. పంచ. 2.27. ఇవముకొను రూ. ఇవముగొను. అ.క్రి. 1. కొంకరలుపోవు, చలిచే బాధపడు. కాశీ. 6.44, పాండు. 4.5 ; 2. తడియు. ఇవముగొను (-కొను) రూ.చూ. ఇవముకొను. అ.క్రి. 1. తడియు. కళా. 4.80, యయా. 1.116 ; 2. తేమచే నిండు. ఇవముమేవరి వి. సూర్యుడు. అచ్చ. రా. 6.311 (వ్యు. మంచును తినేవాడు). < ఇవము + మేవు + -అరి. ఇవముసూడు వి. సూర్యుడు. వ్యు. మంచుకు శత్రువు. అచ్చ. రా. 4.39.

ఇవముకొను చూ. ఇవము.

ఇవముగొను చూ. ఇవము.

ఇవముమేవరి చూ. ఇవము.

ఇవముసూడు చూ. ఇవము.

ఇవరమామిడి రూ.చూ. ఇవురుమామిడి. వి. తమాలవృక్షం.

ఇవల రూ.చూ. ఈవల. క్రి. విశ. 1. ఈవైపు. భార. అశ్వ. 1.63 ; 2. ఇటుపిమ్మట. భార. అను. 2.110.

<ఈవలను.

ఇవాయి వి. వికారపు చేష్టలు.

ఇవి ఏ.వ. ఇది ; రూ. ఇవ్వి. సర్వ. బ.వ. ఈ వస్తువులు.

క. ఇవు. ఈ వస్తువులు ; తు. ఇంబు ; ఉంబు ; త. ఇవ్, ఇవై ; మ. ఇవ ; గోం. పర్జి. ఇవ్ ; కుఇ. ఈవి ; కువి. ఈవతి ; నా. ఇదవ్.

<మూ.ద్రా. *ఇవ్-.

ఇవిరించు చూ. ఇవురు[1].

ఇవుకు పో.చూ. ఈకువ. విశ. తడి, బురద, తేమ.

ఇవుర(బాఱు చూ. ఇవురు[2].

ఇవురించు చూ. ఇవురు[2].

ఇవురిపోవు చూ. ఇవురు[2].

ఇవురు[1] రూ.చూ. చిగురు. వి. చిగురు, మొగ్గ, మొలక. ఆము. 5.111.

ఇవిరించు రూ.చూ. చిగిరించు. అ.క్రి. 1. చిగురించు ; 2. ఎర్రనగు. ఇవురుచు[1] రూ.చూ. చిగురుచు. అ.క్రి. చిగిరించు, అంకురించు, మొలకెత్తు. ఇవురు(బోణి (-బోడి) (?) రూ. చూ. చిగురు(బోణి. వి. స్త్రీ (వ్యు.) చిగురువలె మనోజ్ఞురాలు. కృ. శకు. 2.70. ఇవురొత్తు రూ.చూ. చిగురొత్తు. అ. క్రి. అంకురించు, పొడచూపు. వేంక. పంచ. 3.301. ఇవుర్చు[1] రూ.చూ. చిగురుచు. అ.క్రి. అంకురించు.

ఇవురు[2] రూ. చూ. ఇగురు[2]. అ. క్రి. 1. ఎండు, వట్టు, కృశించు. భార. భీష్మ. 1.193, శల్య. 2.399 ; 2. లీనమగు, నక్తమగు. భార. శాంతి. 6.117.

ఇవుర(బాఱు (-పాఱు) అ.క్రి. ఇగిరిపోవు, ఇంకు. భార. ద్రోణ. 2.126. ఇవురించు రూ.చూ. ఇగిరించు[2]. స.క్రి. ఎండించు. ఇవురిపోవు అ. క్రి. ఆవిరియగు, ఎండిపోవు. ఇవురుచు[2] రూ. చూ. ఇగురుచు[2]. అ. క్రి. ఆవిరియగు. ఇవురువంటకము రూ. చూ. ఇగురువంకటము. వి. అత్తెసరు అన్నం. ఇవుర్చు[2] రూ.చూ. ఇగురుచు[2]. అ.క్రి. ఆవిరియగు. ఇవుర్వంటకము రూ.చూ. ఇగురు వంటకము. వి. అత్తెసరు అన్నం.

ఇవురు[3] రూ.చూ. చిగురు. వి. పంట చిగురు.

ఇవురుచు[1] చూ. ఇవురు[1].

ఇవురుచు[2] చూ. ఇవురు[2].

ఇవురు(బోణి చూ. ఇవురు[1].

ఇవురుమామిడి రూ. ఇవరమామిడి. వి. తమాల వృక్షం (Xanthochymus).

ఇవురువంటకము చూ. ఇవురు[2].

ఇసురొత్తు చూ. ఇసురు¹.
ఇసుర్చు¹ చూ. ఇసురు¹.
ఇసుర్చు² చూ. ఇసురు².
ఇసుర్వంటికము చూ. ఇసురు².
ఇసుల రూ.చూ. ఈవల. క్రి. విశే. ఈ పక్క, ఈవైపు.
ఇసులుచు రూ.చూ. ఇగులుచు. అ.క్రి. (పళ్లు) ఇగిలించు.
ఇసుల్చు రూ.చూ. ఇగులుచు. అ.క్రి. (పళ్లు) ఇగిలించు.
ఇస్వల రూ.చూ. ఈవల. క్రి. విశే. 1. ఈ వక్షం, ఈ పక్క. కాశీ. 1.109 ; 2. ఇటు, ఈవైపు. దశా. 2.101.
ఇస్వి రూ.చూ. ఇవి. సర్వ. బ.వ. ఈ వస్తువులు.
ఇశరం వి. అర్ధం, పొట్టిగా ఉండే భాగం.
ఇషారా వి. సైగ. జాడ, సూచన.
నే. ఒ. ఇసారా. గుర్తు ; హిం. ఇశారా. గుప్తప్రేరణం, గుర్తు ; గు. ఇషారత, ఇషార్, ఇసారత, ఇసారో. గుర్తు, సంకేతం ; మరా. ఇశారత్, ఇశారా : అర. పార. ఇషారహ్ ; ఉ. ఇశారహ్.
< ఉ. ఇశారహ్.
ఇషికరాశి రూ.చూ. ఇసుకరాసి. వి. కుంకుడు జాతిచెట్టు.
ఇషిరాషి రూ.చూ. ఇసుకరాసి. వి. కుంకుడు జాతిచెట్టు.
ఇషువంటి రూ.చూ. ఇటువంటి. విశే. ఈరకమైన.
ఇష్ర్మాక రూ.చూ. ఇష్మ్రా. వి. మరమేకు.
ఇష్తిహారునామా రూ. చూ. ఇస్తిహారునామా. వి. ప్రకటన పత్రం.
ఇసక రూ.చూ. ఇసుక. వి. ఇసక.
ఇసకజల్లెడ వి. ఇసకజల్లించే పనిముట్టు. ఇసకతర వి. ఇసకనేల, మట్టిలో ఇసుక పొరలు పొరలుగా గల నేల. ఇసకపార వి. ఇనపరేకుకు బదులు పల్చని చెక్క బిగించబడి ఇసక తవ్వడానికి ఉపయోగించే పార. ఇసకబెండ వి. ఇసకనేలలో పెరిగే కలుపుమొక్క. ఇసకరాయి వి. కారు రాయి, బొంతరాయి, మస్టురాయి.
ఇసకజల్లెడ చూ. ఇసక.
ఇసకతర చూ. ఇసక.
ఇసకదాసరి రూ. ఇసుకదాసరి. వి. ఇసకదొంతికూర, ఒక రకం కూరాకు.
ఇసకదొంతికూర చూ. ఇసకదాసరి. వి. శాక విశేషం.
ఇసకపార చూ. ఇసక.
ఇసకబెండ చూ. ఇసక.
ఇసకరాయి చూ. ఇసక.
ఇసకరాసి వి. తగడచెట్టు (Stereospermum chelomoides).
ఇసకారి రూ. చూ. విషకారి. వి. మెట్ట పొలాల్లో పెరిగే ఒక రకం కలుపు మొక్క.
ఇసగడ వి. విసుగు.
< విసుగు + కడ.
ఇసడిలు చూ. ఈసడము. అ.క్రి. విసుగుచెందు. భా.రా. అర. 2.6.
ఇసపగాలచెట్టు రూ.చూ. ఇసపగోలచెట్టు. వి. ఓషధీ విశేషం.
ఇసపగోలచెట్టు రూ. ఇసపగాలచెట్టు. వి. ఓషధీ విశేషం (Plantago ovata, Psyllium).
హిం. ఇస్పగోల్ ; ఉ. పార. ఇస్పఘోల్ ; క. ఇసబుగోలు, విసముగోలు ; తు. ఇసబకుల్ ; త. ఇచపోకల్, ఇస్పఘుల్, ఇస్కోల్ ఇస్పఘుల్.
< ఉ. ఇస్పఘోల్.
ఇసవరతీగె వి. సురుగుడు తీగ, తెల్ల పిప్పలి (Symphorema involucratum).
ఇసర వి. పశువులకువచ్చే ఒక రకం తిక్కరోగం ; శరీరంమీద గుల్ల ఏర్పడడం, పిచ్చిగా తిరగడం ఈ వ్యాధి లక్షణాలు.
< విసరు.
ఇసరు రూ.చూ. ఇరస². వి. వడ్రంగులు కొయ్యమీద సన్నని చెక్కడపు పనులు చెయడానికి వాడే పనిముట్టు.
ఇసి రూ.చూ. ఇస్సీ. అవ్య. జుగుప్సా నిందాద్యర్థకం.
ఇసిరో రూ. చూ. ఇస్సిరో. అవ్య. జుగుప్సా నిందాద్యర్థకం. భార. మౌ. 44.
ఇసిక రూ.చూ. ఇసుక. వి. ఇసక.
ఇసికతెర వి. ఇసకతర. ఇసికరాయి వి. ఇసకరాయి.
ఇసికతెర చూ. ఇసిక.
ఇసికరాయి చూ. ఇసిక.
ఇసిసి వి. ఒకవిధమైన గజ్జి, మామూలు గజ్జికంటె తీవ్రమైనది.
క. ఇసబు. మణికట్టుమీద వచ్చే గజ్జి.
ఇసింపండగ వి. ఉగాది.
హిం. ఇసవి, ఈసవి. 'ఈసాకు' సంబంధించినవాడు, క్రైస్తవుడు : ఈసవిసన్. క్రీస్తు పుట్టినప్పటి నుండి. క్రీ.శ. ; గు. ఇసవి. జీసస్‌కు సంబంధించినది, క్రైస్తవుడు, క్రీ.శ. : మ. రా. ఇసవి. క్రైస్తవుడు. క్రీస్తుశకము ; క. ఇసవి, ఇసవీ, ఇస్వి. క్రైస్తవుడు, క్రీస్తుశకం.
ఇసిరికె వి. ఉసిరి చెట్టు.
ఇసిరె రూ.చూ. ఇరస². వి. కొయ్యమీద నగిషీపని చేయటానికి వాడే పనిముట్టు.
ఇసిరో చూ. ఇసి.
ఇసిటింత విశే. 1. మనోహరం, సొబగైనది. కాశీ. 3.169 ; 2. చంచలం, తరళం. శృం.నై. 8.61, పి.శకు. 3.52.
పో.చూ. క. ఇసు. విసురు, వేయు ; త. ఇచి. లాగు, ఆకర్షించు.
ఇసిటింతలువాఱు (-పాఱు). అ.క్రి. చలించు, అదరు విక్ర. 8.67, హర. 5.511.
ఇసిటింతలువాఱు చూ. ఇసిటింత.
ఇసీ రూ.చూ. ఇస్సీ. అవ్య. జుగుప్సా నిందాద్యర్థకం. భార. శాంతి. 1.117.
ఇసు¹ రూ.చూ. ఇటు.
ఇసు² వి. శిశువు, విద్యార్థి. రామా. 4.6.
సం. శిశు-. పసిబిడ్డ ; ప్రా. సిసు. బాలకుడు.
సిస్స. (< సం. శిష్య-). విద్యార్థి.
< సం. శిశు-.
ఇసుక రూ. ఇసక, ఇసిక, ఉసికె, ఉసుక. చూ. ఇసుము. వి. ఇసక, సికత. కు. సం. 5.516, భీమ. 5.149.
క. ఇసకు, ఉసిగె, ఉసుకు. ఇసక ; కొలా. ఉస్కా ;

గోం. ఉస్కా, ఉస్కె.

ఇసుకగరుములు వి. ఇసక నేలలకూ రేగడి నేలలకూ మధ్యస్థంగా ఉండే నేలలు. ఇసుకతిన్నియ రూ. ఇసుక తిన్నె, ఇసుకదిన్నియ, ఇసుకదిన్నె. వి. ఇసుకదిబ్బ, సైకతం. ఇసుకతిన్నె రూ.చూ. ఇసుకతిన్నియ. వి. ఇసుక దిబ్బ, సైకతం, రాధా. 1.40, పాండు. 2.158. ఇసుకదాసరి రూ.చూ. ఇసకదాసరి. వి. శాక విశేషం. ఇసుకదాసరికూర వి. ఇసుకదొంతికూర, శాకవిశేషం. పో.చూ. త. ఏణలి. <మణల్. ఇసక; మ. అత్తి రిల్లపాల; పో.చూ. హిం. బాలూకాసాగ్. <సం. వాలుకాశాక. సైకతశాకం, ఇసకలో పెరిగే కూరాకు. ఇసుకదిన్నియ (-తిన్నియ): రూ.చూ. ఇసుకతిన్నియ. వి. ఇసకదిబ్బ, సైకతము. ఇసుకదిన్నె (-తిన్నె) రూ.చూ. ఇసుకతిన్నియ. వి. ఇసకదిబ్బ, సైకతము. ఇసుకదిబ్బ వి. ఇసకదిబ్బ. ఇసుకదొండు రూ. ఇసకదొండు. వి. మత్స్య విశేషం, సొరంగి, ఇది మూతితో ఇసకను తొలిచి, అందులో వున్న పురుగులను ఏరి తింటుంది. <ఇసుక + *-తొండు (*తోండు. పైకిలాగు). ఇసుకదొంతికూర వి. శాక విశేషం. ఇసుకదొంతులు చూ. ఇసుకదొండు. వి. బ.వ. మంచినీటి చేపలు. ఇసుకదొందు రూ.చూ. ఇసుకదొండు. వి. మత్స్య విశేషం, సొరంగి. ఇసుకవర (-వర <పట్టి) రూ.చూ. ఇసుకపట్టి. వి. ఇసుకబీడు. ఇసుకవ్ర్ర (-వ్ర్ర <పట్టి) రూ.చూ. ఇసుకపట్టి. వి. ఇసుకబీడు. ఇసుకవట్టి రూ. ఇసుకపర, ఇసుకప్రర. వి. ఇసుకబీడు. ఇసుకపాతర వి. పాడుబడ్డ నేల (?) ... వైజ. వి. ఇసుకవుట్టి వి. మట్టగుడిసె జాతికి చెందిన తెల్లటి చిన్న మంచినీటి చేప. ఇసుకవుల కండము వి. మత్స్యంధిక, కండ చక్కెర. ఇసుకబేలు వి. ఒకానొక తీగె. ఇసుకమ్రాను వి. వృక్ష విశేషం, ఉలిబరి, వరుణం, నదీ తీరాల్లో ఇసుక నేలల్లో పెరిగే చెట్టు (Ctataeva religiosa). ఇసుకరాజనములు వి. ఇసక రేణువుల్లాంటి సన్నటి గింజలు గల ధాన్య విశేషం. హంస. 4.128. ఇసుకరాయి చూ. ఇసకరాయి. వి. కారురాయి, బొంతరాయి, మస్తురాయి. ఇసుకరాని రూ. ఇషికరాశి, ఇషిరాషి. వి. కుంకుడు జాతి చెట్టు (Erioglossum rubiginosa).

ఇసుకగరుములు చూ. ఇసుక.
ఇసుకతిన్నియ చూ. ఇసుక.
ఇసుకతిన్నె చూ. ఇసుక.
ఇసుకదాసరి చూ. ఇసుక.
ఇసుకదాసరికూర చూ. ఇసుక.
ఇసుకదిన్నియ చూ. ఇసుక.
ఇసుకదిన్నె చూ. ఇసుక.
ఇసుకదిబ్బ చూ. ఇసుక.
ఇసుకదొండు చూ. ఇసుక.
ఇసుకదొంతికూర చూ. ఇసుక.
ఇసుకదొంతులు చూ. ఇసుక.
ఇసుకదొందు చూ. ఇసుక.
ఇసుకవర చూ. ఇసుక.
ఇసుకవ్ర్ర చూ. ఇసుక.
ఇసుకవట్టి చూ. ఇసుక.
ఇసుకపాతర చూ. ఇసుక.
ఇసుకవుట్టి చూ. ఇసుక.
ఇసుకవులకండము చూ. ఇసుక.
ఇసుకబేలు చూ. ఇసుక.
ఇసుకమ్రాను చూ. ఇసుక.
ఇసుకరాజనములు చూ. ఇసుక.
ఇసుకరాయి చూ. ఇసుక.
ఇసుకరాని చూ. ఇసుక[1].
ఇసుకొల్పు అ.క్రి. కుక్కను ఉసికొల్పు, కరవటానికి పురికొల్పు.
ఇసుమంత చూ. ఇసుము.
ఇసుమంతలు చూ. ఇసుము.
ఇసుము పో.చూ. ఇసుక. రూ. ఇస్మ. వి. 1. ఇసక. భార. సభా. 2.301; 2. పొడి. ఉ.హ. 3.7.

క. ఉసువు, ఉసుబు, ఉసువ్ర.

ఇసుమంత ఇసుము + అంత. విఐ. చాలా కొద్ది, మిక్కిలి కొంచెం. ఆము. 4.60. ఇసుమంతలు ఇసుము + అంతలు. విఐ. కొద్ది కొద్ది. వి. భార. విరా. 5.35.

ఇసురు[1] రూ.చూ. విసురు. వి. 1. పొడవు; 2. వైశాల్యం; 3. చుట్టు, పెడ; 4. ఎక్కువ.

ఇసుర్రాయి వి. దిమ్మెరాయి.

ఇసురు[2] చూ. విసరు. స.క్రి. త్రిప్పు, విసరివేయు.
ఇసురు[3] చూ. ఇశరా. వి. 1. అడ్డం; 2. పొట్టిగా ఉండే భాగం.

ఇసురుగడి వి. అడ్డగడియ.

ఇసురుగడి చూ. ఇసురు[3].
ఇసుర్రాయి చూ. ఇసురు[1].
ఇసులు పో.చూ. ఇసుక. విఐ. అణువు, సూక్ష్మం, రేణువు; వి. ఇసుక నేల.
ఇసుళ్లు రూ. ఈసలు, ఈసులు, ఈసుళ్లు, ఉసిళ్లు, ఉసుళ్లు, ఈసిళ్లు. వి. బ.వ. రెక్కచెదలు.

క. ఈచల్. రెక్కలుగల చెదపురుగు; త. ఈచల్, ఈయల్; మ. ఈచ్ప. ఈగ.

<మూ.ద.ద్రా. *ఈచల్

ఇసువంటి రూ.చూ. ఇటువంటి.
ఇస్కాలుమళె వి. మరమేకు.

ఇం. Screw;

క. మొళె. మేకు.

<ఇం. Screw + మళె (<క. మొళె).

ఇస్క్రూ రూ. ఇస్క్రూ. వి. మరమేకు.

తు. ఇస్కూరు. మరమేకు; త. స్కూర్-ఆణి, స్కురు-వ్-ఆణి;

ఇం. Screw;

<ఇం. Screw. అజాదిత్వం.

ఇస్తిఫా రూ.చూ. ఇస్తీఫ. వి. రాజీనామా ఇవ్వటం, కొలువు విడిచి పెట్టటం.
ఇస్తిమిరారి రూ.చూ. ఇస్తిమిరారు.

**ఇస్తిమిరారిపట్టా** వి. శాశ్వతకర నిర్ణయపద్ధతి పై ఇచ్చిన పట్టా.

**ఇస్తిమిరారిపట్టా** చూ. ఇస్తిమిరారి.

**ఇస్తిమిరారు** రూ. ఇస్తిమిరారి. వి. 1. అవిచ్ఛిన్నత ; 2. శాశ్వతకర నిర్ణయం ; 3. శాశ్వతకర నిర్ణయపద్ధతిపై ఇచ్చిన పట్టా.

హిం. ఇస్తంరారీ ; ఉ. పార. అర. ఇస్తంరార్ ;

త. ఇస్తిమిరారి, ఇస్తింరార్.

<ఉ. ఇస్తమ్‌రార్.

**ఇస్తియారునామా** రూ.చూ. ఇస్తిహారునామా. వి. ప్రకటన పత్రిక.

**ఇస్తిరి** రూ. ఇస్తిరీ, ఇస్త్రీ. వి. చిన్న ఇనప్పెట్టిలో నిప్పులువేసి ఆ పెట్టితో రుద్ది బట్టలను నునుపు చెయ్యటం. తెలుగునాడు. 11.

నే. ఇస్త్రి. ఇస్త్రీపెట్టె ; మరా. ఇస్తరీ ; హిం. ఇస్తిరీ, ఇస్తరీ, ఇస్త్రి ; ఉ. ఇస్త్రి ;

క. ఇస్త్రి, ఇస్తరి ; తు. ఇస్త్రి ; త. ఇస్తిరి ; మ. ఇస్త్రి.

<ఉ. ఇస్త్రీ.

**ఇస్తిరిపెట్టె** వి. బట్టలు సాపుచెయ్యటాని కుపయోగించే పెట్టె. క. ఇస్త్రిపెట్టిగె ; త. ఇస్తిరిప్పెట్టి. **ఇస్తిరిమడత** వి. ఇస్త్రీలోపెట్టే మడత.

**ఇస్తిరిపెట్టె** చూ. ఇస్తిరి.

**ఇస్తిరిమడత** చూ. ఇస్తిరి.

**ఇస్తిరీ** రూ.చూ. ఇస్తిరి. వి. ఇస్త్రీ చెయ్యటం.

**ఇస్తిహారు** వి. ప్రకటన, ప్రకటన పత్రం.

నే. ఇశ్తిహార, ఇత్తిహార్. విజ్ఞాపన, ప్రకటన, ప్రకటన పత్రం ; బెం. పార. ఇష్తిహార్ ; ఒ. అర. ఇశ్తిహార్ ; హిం. ఇశ్తహార్ ; ఉ. ఇశ్తిహార్, ఇష్తిహార్ ;

క. ఇస్తిషార్, ఇస్తిహార్-నామె. లిఖితపూర్వకమైన ప్రకటన ; తు. ఇస్తియరి-హాకుణ. విస్తృత ప్రకటన ; త. ఇస్తియార్. ప్రకటన.

<ఉ. ఇశ్తిహార్.

**ఇస్తిహారునామా** రూ. ఇష్తిహారునామా, ఇస్తియారునామా. వి. లిఖితపూర్వకమయిన ప్రకటన. ఉ. హిం. ఇశ్తిహార్‌నామహ్.

<ఉ. ఇశ్తిహార్‌నామహ్.

**ఇస్తిహారునామా** చూ. ఇస్తిహారు.

**ఇస్తీఫా** రూ. ఇస్తిఫా. వి. 1. రాజీనామా ఇవ్వటం ; 2. కొలువు విడిచిపెట్టటం.

ఒ. ఇస్తఫా. రాజీనామా ; హిం. ఉ. ఇస్తీఫా : మ. ఇస్తఫా ; అర. ఇస్తిఅఫా. క్షమాపణ. <ఉ. ఇస్తీఫా.

**ఇస్తీలా** వి. విజయం.

ఉ. పార. అర. ఇస్తీలా. విజయం.

**ఇస్తువ** రూ. ఇస్తువా, ఇస్తువు. వి. ఆస్తి, భూస్థితి.

మరా. ఇస్తావా. సాగుభూములపై అంతంతకూ పెరిగే శిస్తు లేక కౌలు ; తక్కువ శిస్తుకైన ఒప్పందం ; ఉ. ఇస్తవా, ఉస్తవా. సామ్యం ; అర. ఇస్తివా. సమానం ; పో.చూ.త. ఇస్తవా. సాగుభూములపై క్రమంగా పెరిగే శిస్తు.

<ఉ. ఇస్తవా.

**ఇస్తువా** రూ.చూ. ఇస్తువ. వి. ఆస్తి, భూస్థితి.

**ఇస్తువాకౌలు** వి. ఒక పరిమిత కాలానికి చెందిన భూమి కౌలు.

**ఇస్తువాకౌలు** చూ. ఇస్తువా.

**ఇస్తువు** రూ.చూ. ఇస్తువ. వి. ఆస్తి, భూస్థితి.

**ఇస్తారయము** విఙ. విశాలం.

సం. విస్తార-. వ్యాప్తి, వైశాల్యం, ఆధిక్యం ; ఆయామ. వ్యాప్తి, దైర్ఘ్యం ; ప్రా. విస్సారణ. విస్తీర్ణం ; ఆయామ్. వెడల్పు.

<సం. విస్తార-.

**ఇస్త్రీ** రూ.చూ. ఇస్తిరి. వి. గుడ్డల్ని సాపు చెయ్యటం.

**ఇస్పేటాకులు** చూ. ఇస్పేటు.

**ఇస్పేటాట** చూ. ఇస్పేటు.

**ఇస్పేటు** వి. 1. పేకముక్కల్లో ఒకరకం ; 2. పేక.

క. ఇస్పిటాట. పేకాట ; తు. ఇస్పియు, ఇస్పెయు ; త. ఇస్పేయు. పేకముక్కల్లో ఒకరకం.

ఇం. *Spade*. పేకముక్కల్లో ఒకరకం.

< ఇం. Spade. అజాదిత్వం.

**ఇస్పేటాకులు** వి. పేకముక్కల్లో ఒకరకం. **ఇస్పేటాట** వి. పేకాట. **ఇస్పేటుకాకితాలు** వి. పేకముక్కల్లో ఒకరకం కాకితాలు.

**ఇస్పేటుకాకితాలు** చూ. ఇస్పేటు.

**ఇస్మ్‌వార్** వి. ప్రభుత్వ పత్రాల్లో వరుస క్రమంలో చేసిన వ్యక్తుల పేర్ల ఆరోపం.

**ఇస్మ** రూ.చూ. ఇనుము. వి. ఇనక. మల్హణ. 3.140.

**ఇస్యానా** వి. అనుకూలం, మంచి.

హిం. ఉ. ఇహ్‌సాన్, ఎహ్‌సాన్. మంచి, ఉపకారం ; పార. అర. ఇహ్‌సాన్. మంచి, ఉపకారం.

<ఉ. ఇహ్‌సాన్.

**ఇస్లామ్** వి. మహమ్మదీయ మతం.

హిం. ఉ. పార. అర. ఇస్లామ్ ; మరా. ఇస్లమ్. మహమ్మదీయమతం ;

క. త.మ. ఇస్లామ్. మహమ్మదీయ మతం.

<ఉ. ఇస్లామ్.

**ఇస్సి** రూ.చూ. ఇస్సీ. అవ్య. జుగుప్సా నిందాద్యర్థకం.

**ఇస్సిరో** రూ. ఇసిరో. అవ్య. జుగుప్సా నిందాద్యర్థకం. భార. శల్య. 2.58, మార్క. 1.182. **ఇస్సిస్సి** ఇస్సి+ఇస్సి. అవ్య జుగుప్సా నిందాద్యర్థకం. ప్రబోధ. 2.14. క. ఇస్సిస్సి, ఇస్, ఇస్సి. జుగుప్సా నిందాద్యర్థకం. **ఇస్సిస్సియగు** ఇస్సి+ఇస్సి+అగు. అ.క్రి. అసహ్యమగు, రోత అగు. ప్రబోధ. 2.14. **ఇస్సిస్సిరో** అవ్య. జుగుప్సా నిందాద్యర్థకం. విప్ర. 5.35.

**ఇస్సిరో** చూ. ఇస్సి.

**ఇస్సిస్సి** చూ. ఇస్సి.

**ఇస్సిస్సియగు** చూ. ఇస్సి.

**ఇస్సిస్సిరో** చూ. ఇస్సి.

**ఇస్సీ** ధ్వన్యను. రూ. ఇసి, ఇసీ, ఇస్సి. ఇస్సు. అవ్య. జుగుప్సా నిందాద్యర్థకం. భార. అర. 2.140.

త. ఇస్, ఇస్సి, జుగుప్సా నిందాద్యర్థకం ; తు. ఇస్సి, ఇస్సప్ప ; త. ఇచి-. నొచ్చు, లాగు, సంకోచించు, విడిపోవు ; ఇచిప్ర. పురిటి నొప్పులు.

**ఇస్సు** రూ.చూ. ఇస్సీ. అవ్య. మార్గాయాన సూచకం.

**ఇహ** చూ. ఇఁక. క్రి.విశే. 1. ఇంతకంటె ; 2. ఇటుపిమ్మట.

**ఇహీ** రూ.చూ. ఇహీ.

**ఇహిహి** రూ.చూ. ఇహిహీ.

**ఇహిహీ** రూ. ఇహిహి, ఈహీ. అవ్య. పరిహాస సూచక ధ్వన్యనుకరణం. రామా. 5.148.

**ఇహీ** రూ. ఇహి. అవ్య. పరిహాసనూచక ధ్వన్యనుకరణం. చెన్నబసవ. 4.216.



**ఈ**[1] వి. వర్ణమాలలో నాలుగోవర్ణం. తాలవ్యమై సంవృతమైన నిరోష్ఠ్య దీర్ఘస్వరం ; కువిలో తప్ప అన్ని ద్రావిడ భాషల్లోనూ ఉంది.

< మూ.ద్రా. *ఈ.

**ఈ**[2] రూ. ఇ-[2]. విశే. 1. సమీపవస్తు నిర్దేశక సర్వనామం. భార. విరా. 2.78 ; 2. గడచినది. ఉదా. : ఈ రాత్రి.

క.కొడ.తు.మ.కుఇ.కువి.పర్జి.నా.ఒల్లా.కురు.మాల్తో. ఈ; త. ఇ (హల్లులముందు) ; ఇవ్-. (అచ్చులముందు) ; కోట. ఇ (హల్లులముందు) ; ఈ (అచ్చులముందు) ; తొ. ఇ ; గోం. ఇద్ ; కొలా. ఇ, ఈ ; బ్రా. దా.

< మూ.ద్రా. *ఈ.

**ఈకడ** రూ. ఇక్కడ, ఈడ[1]. క్రి. విశే. ఈచోట, ఇటు. క. ఈకడె. ఇటు ; తు. ఈకడె. **ఈకరణి** క్రి.విశే. ఈ విధంగా. దే.ప్రా. కరణి. సామ్యం. పోలిక. **ఈకె**[2] సర్వ. ఈమె; క. ఈకె. **ఈడ**[1] రూ.చూ. ఈకడ. క్రి.విశే. ఇక్కడ. యయా. 3.151, దశ. 1.176 ; తు. ఇడె, ఈడె. ఇక్కడ ; పో.చూ. మ. ఇవిటమ్, ఇవిటె, ఈడ. **ఈడఁబోవు** రూ. చూ. ఈడఁదోవు. **ఈడఁబోవు** ఈడన్ + పోవు. రూ. ఈడదోవు. అ.క్రి. వెనుదీయు, వెనుకకుపోవు, భార.ఆది. 1.69, విరా. 5.143, శాంతి. 5.548. **ఈడాడ** ఈడ + అడ. క్రి.విశే. ఇక్కడా అక్కడా. రం.రా. అయో. 121 పు. 12 పం. **ఈతగాఁడు** (-కాఁడు) రూ. ఇతగాడు, ఇతగాఁడు. సర్వ. ఇతడు. **ఈతఁడు** రూ. ఇతఁడు, ఇతను, ఈతను. సర్వ. వీడు. శృం.నై. 5.34. **ఈతను** రూ.చూ. ఈతఁడు. వి. ఇతడు. **ఈతల** రూ. ఇవతల. విశే. ఇటు తరువాత. కళా. 2.93, వి. ఇటుపక్క. కాళిందీ. 6.228. **ఈతలాతల** ఈతల + ఆతల. క్రి.విశే. ఇటో అటో, కొంచెం ముందుగానీ వెనుకగానీ. **ఈతలాతలగు** ఈతల + ఆతల + అగు. అ.క్రి. 1. తలకిందగు, తారుమారగు. వరాహ. 11.55 ; 2. ఆలస్యమగు. **ఈపె**[2] సర్వ. ఈమె. ఉ.రా. 8.88. **ఈబిడ** రూ. ఈబిడె, ఈవిడ, ఈవిడె. సర్వ. ఈమె. విజయ. 1.130. < ఈబిడ (< బిడ్డ). **ఈబిడె** రూ.చూ. ఈబిడ. సర్వ. ఈమె. **ఈమె** పో.చూ. ఈయమ. సర్వ. ఈస్త్రీ. ఉ.రా. 1.30. **ఈయకె** సర్వ. ఈమె. **ఈయది** రూ. ఇయ్యది. సర్వ. ఇది. విక్ర. 1.151. < ఈ + అది. **ఈయన** రూ. ఇయ్యన. సర్వ. ఇతడు (గౌరవవాచకం). భార.భీష్మ. 2.252 ; వి. భర్త. యజమాని. **ఈయన** సర్వ. 1. ఈమె ; 2. ఇతడు. **ఈయమ** రూ.చూ. ఈయమ్మ. సర్వ. ఈమె.హరి.ఉ.3.206. **ఈయమ్మ** రూ. ఈయమ. సర్వ. ఈమె. **ఈలా** రూ.చూ. ఈలాగు. క్రి.విశే. ఇట్లా, ఈవిధంగా. **ఈలాగంటి** చూ. ఈలాగు. విశే. ఇటువంటి. **ఈలాగు** రూ. ఇలా, ఈలా. క్రి.విశే. ఇట్లా, ఈవిధంగా. **ఈలాగున** క్రి.విశే. ఈవిధంగా. **ఈలాటి** రూ. ఇలాటి, ఇల్లాటి. విశే. ఇలాంటి. **ఈలోఁగా** క్రి.విశే. ఈమధ్య. < ఈ + లోన్ + కాన్. **ఈవంక** వి. ఇటు. **ఈవిడ** రూ.చూ. ఈబిడ. సర్వ. ఈమె. **ఈవిడె** రూ.చూ. ఈబిడ **ఈవేళ** వి. ఈరోజు. **ఈవైపు** వి. ఇటు.

**ఈ**[3] ఇచ్చు యొక్క సపదాంశం. చూ. ఇచ్చు, ఈయ-. స.క్రి. ఇచ్చు, అనుమతించు, విధ్యర్థకం. ఏ.వ. : పోనీ, కానీ.

< మూ.ద్రా. *చీ.

**ఈ**[4] రూ.చూ. ఇయ్య (సమస్తంగానే ప్రయుక్తం). అవ్య. అంగీకార సూచకం.

**ఈకొను** రూ.చూ. ఇయ్యకొను. స.క్రి., అ.క్రి. అంగీకరించు. రాధా. 1.91. **ఈకోలు** రూ.చూ. ఇయ్యకోలు. వి. అంగీకారం. ఆం.భా. 1.104. **ఈకోలుకాఁడు** వి. అంగీకరింపబడనివాడు.

**ఈ**[5] అవ్య. 1. కొన్ని శబ్దాలకు పుంస్త్వంలో మతుబర్థకంలో వచ్చే ప్రత్యయం అని వ్యాకరణం : అటమటీఁడు, కమ్మటీఁడు ; 2. కొన్ని శబ్దాలకు స్వార్థంలో ప్రయుక్తం అని వ్యాకరణం : కల్లరీఁడు, మొక్కలీఁడు.

**-ఈ**[6] అవ్య. సంప్రార్థంలో మధ్యమ పురుష 'ము,' 'డు' వర్ణకాలకు విభాషగా అనుప్రయుక్తం అని వ్యాకరణం: వినుమీ, వినుఁడీ.

**-ఈ**[7] అవ్య. ప్రశ్నించేటప్పుడు (కి మర్థమైన) 'ఏ' అనే శబ్దానికి అనుప్రయుక్తమైన విశేషార్థాన్ని బోధిస్తుంది : ఏడి, ఏరీ. భాగ. 8.590, ఆము. 6.55.

**-ఈ**[3] అవ్య. ఇకారాంత పదాలకు సంబుద్ధిలో విభాషగా ఆదేశం : హరి, హరీ ; మతి, మతీ.

**ఈకడ** చూ. ఈ[2].

**ఈకరణి** చూ. ఈ[2].

**ఈకువ** పో.చూ. ఈఁకు. వి. తడి, తేమ, ఆర్ద్రత.

పో.చూ. క. ఈర (< నిర్). చెమ్మ, తడి ; కొడ. నీరు. నీళ్లు ; తు. నీరు ; త. ఈర్. తడి, తేమ ; ఈరమ్ (< పో.చూ. నీర) ; పో.చూ. మ. ఈరమ్. తడి ; నీర్. నీళ్లు, తడి ; తొ. ఈరమ్. తేమ ; కోట. నీర్. నీళ్లు ; పో. చూ. కుఇ. నీరు. రసం ; పో.చూ. పర్జి. ఒ. నీర్. నీళ్లు ; కొలా.నా. ఈర్. బ్రా. దీర్. నీళ్లు, ప్రవాహం, రసం.

**ఈకె**[1] చూ. ఈ[3].

**ఈకె**[2] రూ.చూ. ఈఁక. వి. **1.** పక్షిరెక్క, రెక్కలో భాగం ; **2.** ఈకకలం.

**ఈకొమ** చూ. ఈ-[4].

**ఈకోలు** చూ. ఈ-[4].

**ఈకోలుకాఁడు** చూ. ఈ-[4].

**ఈగడ** వి. జాడ, వార్త. పరమ. 5.57, 58 ; ప్రభా. 4.3.

< ఈ + కడ. అర్థ విపరి.

**ఈగడమ్** వి. ఆంబేదారుగా పనిచెయ్యటం.

**ఈగి** రూ. ఈవి. చూ. ఈ-[3]. వి. ఇవ్వటం. భార.ఉద్యో. 3.163 ; త్యాగం, దానం. కు.సం. 8.163.

త. ఈకై. దానం. కల్పవృక్షం.

**ఈగికాఁడు** రూ. ఈవికాఁడు. వి. దాత. **ఈగిచేయి** వి. దానంచేసే చెయ్యి, కుడిచెయ్యి. వసు. 1.34. **ఈగిమాను** రూ.చూ. ఈగిమ్రాను. వి. కల్పవృక్షం. **ఈగిమ్రాను** రూ. ఈగిమాను, ఈవిమాను, ఈవిమ్రాను. వి. కల్పవృక్షం. నరస. 5.19, కువ.చ. 1.46.

**ఈగికాఁడు** చూ. ఈగి.

**ఈగిచేయి** చూ. ఈగి.

**ఈగిమాను** చూ. ఈగి.

**ఈగిమ్రాను** చూ. ఈగి.

**ఈగులకెంపు** చూ. ఈగులు.

**ఈగులు** ఏ.వ. ఈగి. వి. బ.వ. త్యాగాలు, దానాలు.

**ఈగులకెంపు** రూ. ఈవులకెంపు. వి. చింతామణి, కోర్కెలు తీర్చే దేవతా రత్నం. పాండు. 3.158.

**ఈగె** రూ.చూ. ఈఁగ. వి. ఈగ, మక్షికం.

**ఈంగె** రూ.చూ. ఈఁగ. వి. ఈగ.

**ఈఁక** రూ. ఈకె[2], ఈఁకియ, ఈఁకె ; పో.చూ. ఈన. వి. **1.** పక్షి రెక్కలో భాగం. భార. ఉద్యో. 3.298, భా.రా. అర. 2.138 ; **2.** పక్షి రెక్క. ఆం. భా. 2.99.

త. ఈ. రెక్క ; (పో.చూ.) ఈర్. బాణిమట్ట, రెక్క ; ఈర్‌కిల్, ఈర్‌కుౕ. బాణం చివర కట్టబడ్డ ఈక.

**ఈఁకియ** రూ.చూ. ఈఁక. వి. పక్షిరెక్కలో భాగం. ప్రబంధ. 59.

**ఈఁకు** రూ.చూ. ఇంకు[1]. అ.క్రి. ఇనికిపోవు.

**ఈఁకె** రూ. చూ. ఈఁక. వి. పక్షి రెక్కలో భాగం. వేమన. 2150.

**ఈఁగ** రూ. ఈగె, ఈంగె, ఈఁగె, ఈవ, ఈవె. వి. **1.** ఈగ, మక్షికం. వరాహ. 9.123 ; **2.** తుపాకీ చివర గురి చూడటానికి ఏర్పరచిన ఇనపపూస. రంగా. 3.34.

క. ఈచల్. రెక్క. చెదలు ; కొడ. ఈప్. ఈగ ; త. ఈ. ఈగ ; తేన్-ఈ. తేనెటీగ, పేడపురుగు ; ఈచల్, ఈయల్. రెక్కల పురుగులు. మ. ఈచ్చ. ఈగ ; ఈ ; కోట. ఈప్ ; తొద. ఈప్య ; పో.చూ. గోం. పుక్-ఈ. తేనెటీగ. పో. చూ. కుఇ. పూక్-ఇ ; పర్జి. గద. తిన్-ఇ : కొలా. నింగ. ఈగ ; నిజ, నిజా, నిజాల్, నింగా ; నా. నింగ ; కురు. తిన్ + ఈ. తేనెటీగ ; ఏఖా. జోరీగ ; మాల్తో. తెన్ + ఇ- ; బ్రా. హీజ్.

< మూ.ద. ద్రా. *ఈ.

**ఈఁగపులి** వి. సాలెపురుగు, వ్యు. ఈగలపాలిటి పులి. ఆం. భా. 2.87. త. ఈప్పులి. ఈగలను మింగే చిన్న జాతి సాలె పురుగు. **ఈఁగయెంగిలికూర** వి. పుదీనాకు (Mentha genus) త. ఈఎచ్చిర్ కీరై. < ఈఁగ + ఎంగిలి కూర.

**ఈఁగపులి** చూ. ఈఁగ.

**ఈఁగ యెంగిలికూర** చూ. ఈఁగ.

**ఈఁగు**[1] రూ. చూ. నీఁగు. స.క్రి. **1.** పోగొట్టు, తొలగించు. భార. ఆది. 2.84 ; **2.** (అప్పు, పగ మొ.) తీర్చు. భార. ఉద్యో. 2.129 ; **3.** నశించు, క్షీణించు. హరి. 1.23 ; **4.** భంగపడు, నష్టపడు, లోబడు ; **5.** అణగియుండు.

**ఈఁగు**[2] అ.క్రి. **1.** చొచ్చు, ప్రవేశించు. పాండు. 1.150, **2.** దాగు. ఉ.హ. 1.161 ; **3.** వెనుదీయు. రం.రా. యు. 353.

**ఈఁగె** రూ.చూ. ఈఁగ. వి. మక్షికం.

**ఈచ**[1] రూ. ఈన[2] ; చూ. ఈచు. వి. **1.** వంకర. ద్వి.హరిశ్చ. ఉ. 490 ; **2.** శుష్కపదం, వ్యర్థపదం. ప్రబంధ. 16. విశే. **1.** శుష్కించినది, ఎండినది, సన్నగిల్లినది ; **2.** నిష్ఫలం, వ్యర్థం.

క. ఈచు, ఈన్చు. నీరసస్థితి, శుష్కస్థితి ; ఈచు వోగు, ఈన్చువోగు. శుష్కించు, ఎండు.

**ఈచపడు** ఈచ[1] + పడు. అ.క్రి. నిస్సత్త్వమగు. పాండు. 2.204, 4.210. **ఈచవోవు** ఈచ[1] + పోవు. అ.క్రి. **1.** శుష్కించు, ఎండిపోవు, నిస్సత్త్వమగు. ఉ.హ. 2.122 ; **2.** నిష్ఫలమగు. నీతి. సీ. 88. క. ఈచువోగు, ఈన్చు వోగు. నీరసమగు, ఎండు.

**ఈచ**[2] రూ.చూ. ఈఁచ. వి. జొన్నలోనగు వాని కంకికాడ, ఈచ.

**ఈచపడు** చూ. ఈచ[1].

**ఈచవోవు** చూ. ఈచ[1].

**ఈచు** చూ. ఈఁకు. అ.క్రి. (పాడిపశువులు) వట్టిపోవు, ఎండి పోవు.

**ఈచుకపోవు** అ. క్రి. చావుదూడను వేయు, చచ్చిన దూడను ఈను. < -క (< -కొను. ఆత్మనేపదం) + పోవు. **ఈచుకొనిపోవు** అ.క్రి. చావు దూడనువేయు, చచ్చిన దూడను ఈను.

**ఈచుకపోవు** చూ. ఈచు.
**ఈచుకొనిపోవు** చూ. ఈచు.
**ఈజారా** రూ. చూ. ఇజారా. వి. కౌలు, గుత్త.
**ఈంచి** రూ.చూ. ఇంచి[1]. వి. అంగుళం.
**ఈఁచ** రూ. ఈచ[2]. చూ. ఈన. వి. జొన్న మొదలగువాని కంకిజాడ. ఈఁచ. ఆం. బా. 2.236.
**ఈఁజేటి** రూ.చూ. ఇంజేటి. వి. తియ్యకండ. కాశ. 3.151.
**ఈటార్చు** చూ. ఈటు.
**ఈటాఱు** చూ. ఈటు.
**ఈటు** విశ. నిరర్థకం, శూన్యం.

క. ఈడు. పారవేయు; పో.చూ. తు. ఈటు. చెత్తా చెదారంతో కూడిన ఎరువు: త. ఇ(రుప్పో). తగ్గిపోవు, పగిలిపోవు, శిథిలమగు, అంతమగు, లయించు, అంతం, చావు: మ. ఈటిక. బలహీనంగా పెరుగు: విఱు. వినాశం.

< మూ. ద.ద్రా. *ఈట్.

**ఈటార్చు** ఈఁటు+ఆర్చు. స.క్రి. తడిపోవునట్లుచేయు, ఆరబెట్టు. హర. 7.3. **ఈటాఱు** ఈఁటు+ఆఱు[1]. అ.క్రి. నిర్ద్రవమగు, ఎండు. పి. శకు. 3.202. **ఈటువోవు** ఈటు+ పోవు. అ.క్రి 1. శూన్యమగు: 2. వ్యర్థమగు.
**ఈటుబద్ద** వి. రాట్నం బొమ్మగాడిలోనుంచి కదురు దిండు మీదికి అమర్చిన పుల్ల.
**ఈటువోవు** చూ. ఈటు.
**ఈఁడ[1]** రూ.చూ. ఈఁకర.
**ఈఁడ[2]** రూ. ఈడె. వి. 1. ఒక రకం నారింజ, ఎఱ్ఱ కిత్తలి, పారేవతం. శ్రీరం. 2.268; 2. నారింజతొన (Citrusaurantium).

పో.చూ. సం. ఈలి, ఈలికా, ఈలీ. ఒక రకం ఆయుధం: మరా. ఈడ. నిమ్మ: ఇల్లా. కత్తి:

క. ఈళె, ఇల్లె. నారింజ: పో.చూ. కిత్తిళె, దొడ్డిళె, పేరళె మొ.: పో.చూ. ఈళిగె. కొడవలి.

బహుశః < సం. ఈలి-: పండ్లలో తొనలు (ఈళిగె) కొడవలి ఆకారంలో ఉంటాయి కాబట్టి కావచ్చు.

**ఈఁడ[3]** రూ. చూ. ఈఁత[2]. వి. ఈతచెట్టు (Phoenix sylvestris).
**ఈడకమాను** యా. ఈరికెమాను. వి. పొలంలో మట్టి పెళ్లలు నలగటానికి లాగే పంగలమాను.
**ఈడబోవు** చూ. ఈడు[2].
**ఈడఁబడు** చూ. ఈడు[2].
**ఈడఁబోక** చూ. ఈడు[2].
**ఈడఁబోవు** చూ. ఈడు[2].
**ఈడము** రూ.చూ. ఈళము. వి. సింహళ ద్వీపం. రాజవా. 1.49, హంస. 1.112.

**ఈడముపేట** వి. సింహళ ద్వీపవాసులు నివసించే ప్రాంతం.

**ఈడముపేట** చూ. ఈడము.
**ఈడవ** వి. వేరువేరు ప్రదేశాలలో ఉన్న ఒకే భూస్వామి యొక్క సేద్యపు కమతం, భూమి.
**ఈడవిడుచు** చూ. ఈడు[2].
**ఈడాడ** చూ. ఈ[2].
**ఈడాడు** చూ. ఈడు[1].
**ఈడాము** రూ.చూ. ఈళము. వి. సింహళద్వీపం.
**ఈడి[1]** వి. గుంటక తోలేప్పుడు పలుగుకు చుట్టుకున్న గడ్డి గాదం.
**ఈడి[2]** పో.చూ. ఈడిక[4]. సమస్త పదాల్లో పూర్వార్థంగా ప్రయుక్తం. విశ. చిన్న.

**ఈడిబండాడు** స.క్రి. నలగగొట్టు, నాశనంచేయు, చెదగొట్టు. ప్రబు. 2.295. **ఈడిముంత** రూ.చూ. ఈదుముంత. వి. చిన్నముంత, పాలచెంబు. **ఈడిలిక్కి** రూ.చూ. ఈడికెలిక్కి. వి. చిన్నకొడవలి.

**ఈడిక[1]** చూ. ఈడు[2]. వి. 1. విత్తిన తర్వాత దాళ్ల చదును చేసే పనిముట్టు, గుంటక. ఆం.బా. 2.201; 2. గడ్డిబండి. ఆం.బా. 2.201.

<ఈడు[2]+-ఇక.

**ఈడికమాను** రూ. ఈరికెమాను. వి. దాళ్ళు చదునుచేసే పంగల కొయ్య.

**ఈడిక[2]** రూ.చూ. ఈడిగ. వి. 1. (ఈంద్రజాతివాఁడు).
**ఈడిక[3]** చూ. ఈడు[2]. వి. 1. ఈడ్వబడినట్లుగా పని కష్టం అని పించటం, బరువు; 2. సాగకపోవటం.
**ఈడిక[4]** పో.చూ. ఈడి-[2]. వి. సన్నదనం. పల్చన.
**ఈడికమాను** చూ. ఈడిక[1].
**ఈడికెలిక్కి** రూ. ఈడిలిక్కి. వి. చిన్న కొడవలి.

క. ఈళిగె. గడ్డికోయటానికి పనికివచ్చే సాధనం, కాయగూరలు కోయటానికి పనికివచ్చే కత్తి.

సం. ఈళీ. ఒకరకం ఆయుధం.

<క. ఈళిగె. (<సం. ఈళీ)+ తె. లిక్కి.

**ఈడిగ** రూ. ఈడిక[2], ఈడిగె, ఈంద్ర, ఈంద్రి, ఈంద్రిగ. వి. 1. కల్లుగీచే తెగ, గౌండ్లజాతి. వేమన. 2.1639, సురా. 44.

క. ఈడిగ. కల్లుగీచేవాడు; ఈడి. -కల్లు; త. ఇఴవన్. సింహళం నుండి వలసవచ్చి తిరునల్వేలి, తిరువాన్కూరు, మలబారులలో స్థిరపడి, కల్లుగీచి జీవించే ఒక కులం. ద. హిం.శా. ఈయువన్; ఈఴమ్. సింహళం, కల్లు, సారా; మ. ఈఴవన్, ఈఴవన్. సింహళం నుంచి వలసవస్తూ మనదేశానికి కొబ్బరి చెట్టు తెచ్చిన ఒక కులం.

మూ.ద్రా. *ఈట్- (బయటికిలాగు). ధాతుజన్యం కావచ్చు.

**ఈడిగవాఁడు** రూ. ఈడిగెవాఁడు. వి. కల్లుగీచేవాడు, గవుండ్లవాడు.

**ఈడిగవాఁడు** చూ. ఈడిగ.
**ఈడిగిలబడు** చూ. ఈడిగిలు.
**ఈడిగిలఁబడు** చూ. ఈడిగిలు.
**ఈడిగిలు** రూ.చూ. ఈడిగిల్లు. అ.క్రి. ముందుకురానని కూలబడు, చదికిలబడు. ప్రభా. 3.145, సీమంతి. 3.176.

**ఈడిగిలబడు** రూ.చూ. ఈడిగిలఁబడు. **ఈడిగిలఁబడు** ఈడిగిలన్+పడు. రూ. ఈడిగిలబడు, ఈడెలపడు. అ.క్రి. భయాదులచే రానని చదికిలబడు. బా.రా. 3.2.147;

ప్రభా. 5.28.

**ఈడిగిల్లు** రూ. ఈడిగిలు, ఈడ్గిలు ; చూ. ఈడు[2]. అ.క్రి. ముందుకు రానని కూలబడు, చదికిలబడు.

**ఈడిగె** రూ.చూ. ఈడిగ. వి. కల్లుగీచేతెగ, గౌండ్లజాతి.

**ఈడిగెవా(డు** రూ.చూ. ఈడిగవాడు. వి. కల్లుగీచేవాడు, గవుండ్లవాడు.

**ఈడిగెవా(డు** చూ. ఈడిగె.

**ఈడిపించు** చూ. ఈడు[2].

**ఈడిబందారు** చూ. ఈడి[2].

**ఈడిముంత** చూ. ఈడి[2].

**ఈడిలిక్క** చూ. ఈడి[2].

**ఈడు**[1] విశే. 1. అనుగుణం, తగినది. భార. విరా. 1.51, ఉద్యో. 1.14 ; 2. సమానం, సాటి. భార. అను. 2.106 ; 3. శక్యం, తరం. శివ. సా. 9 ; వి. 1. వయస్సు. విక్ర. 1.116, నీలా. 1.52 ; 2. సామ్యం, ఉద్ది. భాగ. 10. పూ. 1351 ; 3. యౌవనం, పెండ్లి వయస్సు. ఆం.భా. 2.117 ; 4. లాకట్టు, కుదువ. ఆం.భా. 2.229 ; 5. పెండ్లిండ్లలో ధనరూపంగా ఇచ్చే కానుక.

క. ఈడు. కలయిక, వృద్ధి, బలం, సంపద, సాధనం, ఆధారం, అండ, యోగ్యత, అనురూప్యం, సామ్యం, సమానం, పరిహారం, కుదువ, హామీ; తు. ఈడు. యోగ్యత, సమానం, కుదువ, హామీ; త. ఈటు. బదులు, పరిహారం, యోగ్యత, సమానం, అనురూప్యం, స్థితి ; ఇణై. సమానత్వం : ఈంటు. కలసివచ్చు ; మ. ఈడు. స్థానం, స్థైర్యం, స్థిరస్థాయిత్వం, కుదువ, సమానం, అనురూపత.

<మూ.ద.ద్రా. *ఈట్-.

**ఈడాడు** స.క్రి. 1. ఎదిరించి, మార్కొను. రం.రా. 3.181; 2. సాటియగు. అము. 1.68. పో.చూ.క. ఈడాడు. పారవేయు, వెదజల్లు, చెదరగొట్టు, విడిచిపెట్టు, వెల్లడిచేయు; త. ఈటాటు. పోటీపడు, కదలిపోవ <మూ.ద.ద్రా. ఈడు + ఆడు. **ఈడుజోడాడు** ఈడుజోడు + ఆడు : పో.చూ. పీడు జోడాడు, ఈడాడు. స.క్రి. ప్రతిఘటించు, మార్కొను. రం.రా. 2.99, ఘటికా. 2.82. **ఈడుజోడు** విశే. సమానం, సాటి. పాండు. 1.46, దశా. 280. **ఈడుపడు** రూ. ఈడ్వడు. అ.క్రి. సమానమగు. సాటియగు. శ్రీరాధా. 2.46. **ఈడువఱచు** స.క్రి. పోల్చు, సాటిచేయు. **ఈడుపాయము** వి. యౌవనం. ఆం.భా. 2.117. **ఈడుపెట్టు** స.క్రి. జోడించు, జతపరచు. **ఈడుమాఱు** అ.క్రి. తలయెత్తు, వర్ధిల్లు. **ఈడుమీఱు** పో.చూ. ఈడేఱు. అ.క్రి. వయసు వచ్చివుండు, యౌవనం వచ్చివుండు. ఆం.భా. 3.94. **ఈడు(బోవు** ఈడున్ + పోవు. అ.క్రి. బయలుదేరు ; ఈడులేని. విశే. సాటిలేని. **ఈడువచ్చు** అ.క్రి. 1. సాటియగు, సమానమగు. కళా. 1.100 ; 2. వయసు వచ్చు, రజస్వలయగు, రజస్వలకానుండు. **ఈడువా(డు** వి. సమానుడు. వరాహ. 6.33. **ఈడుసేయు** ఈడు + చేయు. స.క్రి. పోల్చు, సాటిచేయు. కవిక. 3.28. **ఈడేర్చు** ఈడు + ఏర్చు ; రూ.చూ. ఈడేఱుచు. స.క్రి. 1. నెరవేర్చు, సిద్ధింపజేయు. కళా. 5.211 ; 2. రక్షించు. సారంగ. 3.185, వేంక. పంచ. 1.304, ద్వి. పరమ. 3.175. **ఈడేర్చుకొను** అ.క్రి. కార్యసిద్ధిచేయు, నెరవేర్చుకొను. రామా. 7.7. **ఈడేఱించు** 'ఈడేఱు' ప్రేరణార్థకం. స.క్రి. సిద్ధింపజేయు, అపనయించు. పి. శకు. 4.24. **ఈడేఱు** (-ఎఱు. పొందు, చేరు). అ.క్రి. 1. సాంతమగు, పూర్తియగు. రం.రా. 1 పు. 14 పం. 8 ; 2. సిద్ధించు, వరాహ. 7.105. ఉ.రా. 2.28 ; 3. ధన్యతచెందు, కృతార్థతజెందు. ద్వి. పరమ. 3.175 పు. 11 పం ; 4. సఫలమగు. కళా. 2.64 ; 5. నెగ్గు, నిర్వహించు. 7.471 ; 6. వయసు వచ్చివుండు. యయా. 3.100 ; 7. వర్ధిల్లు, పెరుగు. సారంగ. 3.102, మైరా. 2.142. క. ఈడేఱు. పూర్తిఅగు, సిద్ధించు, వర్ధిల్లు : త. ఈటేఱు. ముక్తిచెందు, రక్షింపబడు. ఈడేఱుచు. రూ. ఈడేర్చు : స.క్రి. 1. ప్రోచు, రక్షించు. వేంక. పంచ. 1.304 ; 2. సిద్ధింపజేయు. **ఈడ్వడు** ఈడు[1] + పడు. రూ.చూ. ఈడుపడు. అ.క్రి. సమానమగు, సరిపడు. ఆము. 1.68.

**ఈడు**[2] చూ. ఈడ్చు. అ.క్రి. పోవు, జారు. భార. అశ్వ. 1.228. స.క్రి. 1. లాగు, పిసుకు. భాగ. 10 పూ. 966, నవనా. 1.40 పు. 6 పం. ; 2. ఉంచు.

క. ఈడు[1]. లాగటం ; ఈఱ్ఱు. లాగు, పీల్చు : త. ఈఱు. లాగు, ఈడ్చు, పొడిగించు, దాచు ; పో.చూ. ఈఱ్ఱు. లాగు, పైకి తీయు.

<మూ.ద్రా. *ఈఱ్. దైటికి లాగు.

**ఈడ(బడు** ఈడన్ + పడు. అ.క్రి. వెనకబడు, పాతపడు. హరి. 7.128. ఈడ(బోక. ఈడన్ + పోక. వి. యుద్ధం నుంచి పారిపోవటం. **ఈడబోవు** రూ.చూ. ఈడ(బోవు. **ఈడ(బోవు** ఈడన్ + పోవు. రూ. ఈడబోవు. అ.క్రి. వెనుదీయు, వెనుకంజవేయు. భార. ఆది. 1.69, విరా. 5.143, శాంతి. 5.548, శివరా. 2.39. **ఈడవిడుచు** స.క్రి. దిగవిడుచు, విడుచు. కు. సం. 7.338, భార. అశ్వ. 1.203. **ఈడిపించు** రూ. ఈడ్పించు. స.క్రి. లాగించు, పొడిగించు. **ఈడుపు** రూ. ఈడ్పు. వి. 1. ఆకర్షణం ; 2. జాగు ; 3. ఎగశ్వాస ; 4. పార్శ్వశూల ; 5. అవయవసంకోచం ; 6. ద్వారపార్శ్వం. **ఈడుపుగఱ్ఱ** ఈడువు + కఱ్ఱ. వి. దొంగ గొడ్లకు మెడకు వేలాడగట్టే బరువు కొయ్య. గుదిబండ. **ఈడుముంత** వి. పాలు పిదికే పాత్ర. **ఈడ్పించు** రూ.చూ. ఈడిపించు. స.క్రి. లాగించు, పొడిగించు. **ఈడ్పు** రూ.చూ. ఈడువు.

**ఈడుగుచాలు** చూ. ఈడు[2]. వి. మొదట దున్నిన చాలు.

**ఈడుచు** రూ.చూ. ఈడ్చు. స.క్రి. లాగు, తిరుగు. ఉ. రా. 2.147.

**ఈడుజోడాడు** చూ. ఈడు[1].

**ఈడుజోడు** చూ. ఈడు[1].

**ఈడుపడు** చూ. ఈడు[1].

**ఈడువఱచు** చూ. ఈడు[1].

**ఈడుపాయము** చూ. ఈడు[1].

**ఈడుపు** చూ. ఈడు[2]. వి. లాగటం.

**ఈడుపుగఱ్ఱ** చూ. ఈడు[2].

**ఈడుపులు** పో.చూ. ఈడ్చు. వి. 1. బుడగల గొలుసు అనే

కర్ణాభరణం; 2. అరనూ డాబీసీ కలిపే దారం.

**ఈదుపెట్టు** చూ. ఈదు[1].

**ఈదుపోతలు** వి. బాధలు.

**ఈదుమాలు** చూ. ఈదు[1].

**ఈదుమీలు** చూ. ఈదు[1].

**ఈదుముంత** చూ. ఈదు[1].

**ఈదు(బోవు** చూ. ఈదు[1].

**ఈదులేవి** చూ. ఈదు[1].

**ఈదువచ్చు** చూ. ఈదు[1].

**ఈదువా(డు** చూ. ఈదు[1].

**ఈదువు** చూ. ఈదు[1]. వి. నమూనా, తీరు, పద్ధతి, విధానం.
త. ఈటు. పద్ధతి, విధానం.

**ఈదుసేయు** చూ. ఈదు[1].

**ఈదె** రూ.చూ. ఈద[2]. వి. 1. ఒక రకం నారింజ, ఎర్ర కిత్తలి; 2. నారింజ తొన.

**ఈదెలవడు** రూ.చూ. ఈడిగిల(బడు. అ.క్రి. లేవటానికి శక్తి లేక కూలబడు.

**ఈదెలి** రూ.చూ. ఇరవలి[1]. వి. 1. జమ్ము, రెల్లు, తుంగ (Rotteleria tinctoria); 2. వట్టివేరు (Andropogon muricatus).

**ఈదేర్చు** చూ. ఈదు[1].

**ఈదేర్చుకొను** చూ. ఈదు[1].

**ఈదేటించు** చూ. ఈదు[1].

**ఈదేఱు** చూ. ఈదు[1].

**ఈదేఱుచు** చూ. ఈదు[1].

**ఈద్గిలబ(డు** చూ. ఈద్గిలు.

**ఈద్గిలు** రూ.చూ. ఈడిగిల్లు. అ.క్రి. వెనుకాడు, ముందుకు రానని కూలబడు, చదికిలబడు.

**ఈద్గిల(బడు** ఈద్గిలన్ + పడు. అ.క్రి. వెలికిలబడు, వెనుకబడు, వెనుకాడు. చెన్నమల్లు. 2.42.

**ఈడ్చు** రూ. ఈడుచు. స.క్రి. 1. లాగు, తిగుచు. భార. ఉద్యో. 3.110; 2. పైకెత్తు, పైకి చేర్చు.
క. ఈఱ్. లాగు; పో.చూ. ఈర్. లాగు; పో.చూ. తు. ఈరుని. రాయు; త. ఈయి. లాగు; ఇఱచ్చు. కించపరచు, వదలిపెట్టు; పో.చూ. ఈర్. లాగు, రంగు వేయు, వ్రాయు. ద.హిం.శా. 3.937; మ. ఇఱక్క. లాగు; ఇఱూక్క; కో. ఇఱ్వ్. నేలపై ఈడ్చు; పో.చూ. ఇవ్. బయటకు లాగు; తొ. ఇష్ఫ్. నేలపై ఈడ్చు; గోం. ఈస్. గీయు; కుఇ. డ్రిప. లాగివేయు, బలవంతంగా ఎత్తికొనిపోవు; కువి. రెస్. ఈడ్చు; రెజ్. లాగు; పర్జి. ఈర్ప్. లాగు; గద. ఈర్. లాగు; కురు. ఈచ్-, ఈస్. లాగు; మాల్తో. ఇచ్. తీసుకుపోవు, అవతలపెట్టు; ఇచ్‌గర్.
<మూ.ద్రా. *ఈఱ్-. వచ్చివేయు, జారిపోవు.

**ఈడ్చుకొనిపోవు** స.క్రి. ముడుచుకొనిపోవు. **ఈడ్చుమాను** చూ. ఈడికమాను. వి. చాళ్ల చదును చేసే పంగల కొయ్య.
**ఈడ్చువా(డు** వి. ఆకర్షించేవాడు, లాగేవాడు.

**ఈడ్చుకొనిపోవు** చూ. ఈడ్చు.

**ఈడ్చుమాను** చూ. ఈడ్చు.

**ఈడ్చువా(డు** చూ. ఈడ్చు.

**ఈడ్డు** చూ. ఈపి. వి. చిన్న పేనుగుడ్డు.

**ఈడ్పించు** చూ. ఈదు[2].

**ఈడ్పు** చూ. ఈదు[2].

**ఈర్వ్యం** రూ. ఇర్వ్య. వి. భూమి, నేల.

**ఈర్వ్యడు** చూ. ఈదు[1].

**ఈంద్ర** రూ.చూ. ఈడిగ. విఱ. కల్లుగీచే తెగ, గవండ్ల జాతి. సురా. 59.
త. ఈఙ్‌ఱు. స.క్రి. ఉత్పత్తిచేయు.
**ఈంద్రది** వి. గవండ్ల స్త్రీ. *ఈంద్రవా(డు.* వి. గవండ్లవాడు.

**ఈంద్రది** చూ. ఈంద్ర.

**ఈంద్రము** వి. పీడనం, బాధ. భాగ. 8.568.
పో.చూ. క. సితఙ్. కోపం; సింటు. రాయు; త. చింటురమ్. విసిగించటం. చింటిరమ్. మురికి, అసహ్యం, అసహ్యమైన మాట. పో.చూ. చింటు. <తాంటు. నిముదు, తట్టు, బాధించు; మ. చింటుక. చిన్న పిల్లలు ఒకళ్ల నొకళ్లు గుంజుకొనటం.
<మూ.ద్రా. *చింట్.
**ఈంద్రముసేయు** ఈంద్రము + చేయు. స.క్రి. పీడించు, బాధపెట్టు, విసిగించు. భాగ. 8.565. **ఈంద్రించు** స.క్రి. పీడించు, బాధించు. కళా. 4.50.

**ఈంద్రముసేయు** చూ. ఈంద్రము.

**ఈంద్రవా(డు** చూ. ఈంద్ర.

**ఈంద్రి** రూ.చూ. ఈడిగ. వి. కల్లు గీచేవాడు.

**ఈంద్రిగ** రూ.చూ. ఈడిగ. వి. కల్లుగీచేవాడు.

**ఈంద్రించు** చూ. ఈంద్రము.

**ఈ(టియ** రూ.చూ. ఇట్టి[1]. వి. కుంతం అనే ఆయుధ విశేషం. అచ్చరా. 6.180.

**ఈ(టె** రూ.చూ. ఇట్టి[1]. వి. బల్లెం.
**ఈ(టెకా(డు** వి. ఈటె పట్టుకొని యుద్ధం చేసేవాడు. రామ. 208. **ఈ(టెసావి** వి. గడమీద సాముచేసే (దొమ్మరి) స్త్రీ.

**ఈ(టెకా(డు** చూ. ఈ(టె.

**ఈ(టెసావి** చూ. ఈ(టె.

**ఈత[1]** రూ.చూ. ఈ(త[1]. వి. ఈదటం.
**ఈతకా(డు** రూ.చూ ఈ(తకా(డు. వి. ఈదేవాడు. **ఈతకాయ[1]** రూ.చూ. ఈ(దు(గాయ. వి. ఈదటానికి సహాయపడే సొరకాయ. క. ఈజుగాయి. -కాయి. **ఈతకొట్టు** రూ.చూ. ఈ(తకొట్టు. అ.క్రి. ఈదు. **ఈతలాడు** రూ.చూ. ఈ(దులాడు. అ.క్రి. 1. ఈదు, తేలు; 2. పెనగులాడు, బాధపడు.

**ఈత[2]** రూ.చూ. ఈ(త[2]. వి. ఈతచెట్టు.
**ఈతకల్లు** వి. ఈతచెట్టు నుంచి తీసిన కల్లు. **ఈతకాయ[2]** వి. ఈతచెట్టుకాయ. **ఈతకొడవలి** వి. ఈతమట్టల్ని కోసే పొడుగాటి కొడవలి. **ఈతచెట్టు** వి. ఈ(తచెట్టు (Phoenix sylvestris). **ఈతవట్ట** వి. ఈతాకు చాప. **ఈతపారాయి**

వి. ఈతకల్లు నుంచి తీసిన సారాయి. క. ఈచలనీరు. కల్లు ; త. ఈచ్చమ్‌చారాయమ్ ; మ. ఐంతచ్చరాయమ్.

**ఈత**[3] రూ.చూ. ఈఁత[3]. వి. ఈనటం.

**ఈతపురుగు** వి. పైరు ఈనేటప్పుడు కంకి మీదపడి నుంకు తిని పోయేపురుగు.

**ఈతకమ్మరోగం** వి. వరితెగులు. ఆకులు పసుపుపచ్చగా మారి ఎండిపోయే వ్యాధి.

**ఈతకల్లు** చూ. ఈత[2].

**ఈతకాఁడు** చూ. ఈత[1].

**ఈతకాయ**[1] చూ. ఈత[1].

**ఈతకాయ**[2] చూ. ఈత[2].

**ఈతకొట్టు** చూ. ఈత[1].

**ఈతకొడవలి** చూ. ఈత[2].

**ఈతగాఁడు** చూ. ఈ[2].

**ఈతచెట్టు** ఈత[2].

**ఈతఁడు** చూ. ఈ[2].

**ఈతమ** చూ. ఈ[2].

**ఈతపట్ట** చూ. ఈత[2].

**ఈతపురుగు** చూ. ఈత[3].

**ఈతల** చూ. ఈ[2].

**ఈతలాడు** చూ. ఈత[1].

**ఈతలాతల** చూ. ఈ[2].

**ఈతలాతలగు** చూ. ఈ[2].

**ఈతసారాయి** చూ. ఈత[2].

**ఈద**[1] రూ.చూ. ఈఁద[1]. వి. గాలి.

**ఈదగాలి** వి. తుప్పరతో వీచే చల్లగాలి.

**ఈద**[2] రూ.చూ. ఈఁద[2]. వి. ఆయుధవిశేషం. కు.నం. 12.5.

**ఈద**[3] వి. ఈతచెట్టు.

**ఈదగాలి** చూ. ఈద[1].

**ఈదగాహ్** వి. జపం చేసుకోవటానికి ఉపయోగించే మందిరం, ప్రార్థనామందిరం. మెకంజీ నం. 251. పు. 24.

హిం. మరా. ఉ. పార. ఈద్‌గాహ్. ఈద్ పండుగ రోజున. ముస్లిములు ప్రార్థన చేసేచోటు : అర. ఈద్. ముస్లిముల పండుగరోజు.

< ఉ. ఈద్‌గాహ్.

**ఈదంబరి** వి. ఒక ఆచారం. పత్తి యేరే ముందు పొలంలో ఆరె చెట్టుకు పూజచేసి భోంచేస్తారు.

నం. హిత. శుభం ; అంబర. దూది, వస్త్రం ; దూది ఏరే ముందు శుభాకాంక్షతో జరిపే పూజ.

బహుశః < నం. హితాంబరి-.

**ఈదర** రూ.చూ. ఈఁదర. వి. తుపానుగా నున్న, తీవ్రమైన.

**ఈదరగాడ్పు** వి. తుప్పరతో వీచే గాలి, తుపానుగాలి. **ఈదరగాలి** రూ.చూ. ఈఁదరగాలి. వి. తుప్పరతో వీచే గాలి, తుపానుగాలి.

**ఈదరకత్తి** వి. మద్దుకత్తి, కంపమండలు నరికే మొద్దుకత్తి.

**ఈదరకాలవ** వి. చెరువుగట్టు ప్రక్క కాల్వ.

**ఈదరగాడ్పు** చూ. ఈదర.

**ఈదరగాలి** చూ. ఈదర.

**ఈదలు** వి. బ.వ. ఉప్పుకొటారులో గోతి పార్శ్వభాగాలు.

పో.చూ. నం. వీధి-. వరస.

< ఈదులు < వీదులు < వీథులు. పదాదివకారం లోపించటం వల్ల యేర్పడిన రూపం కావచ్చు.

**ఈదారా** రూ.చూ. ఇజారా. వి. గుత్త. కౌలు. మెకంజీ నం. 385.1. పు. 89.

**ఈదు**[1] వి. ముస్లింల పండుగ. సిం. నార. 8.

హిం. ఉ. పార. అర. ఈద్. పవిత్రమైనరోజు, ముస్లిముల పండుగ ; మరా. ఈద ;

త. ఈత్తు.

< ఉ. ఈద్.

**ఈదు**[2] రూ.చూ. ఈఁత[2]. వి. ఈతచెట్టు.

**ఈదు**[3] వి. 1. వీధి : 2. గొత్తిచెక్కలమధ్య నందు. అర్థవిపరి·

నం. వీథి. మార్గం ; పా. వీధి-.

< నం. వీథీ-.

**ఈదు**[4] వి. ఈనె, ఆకులోనరం.

**ఈదు**[5] వి. కాయపైర్ల తెగులు, తొల్ల తెగులు.

క. ఈదె, హిప్పి, హీదె. పిప్పి.

< క. ఈదె.

**ఈదుకంకి** వి. కాలుకంకి. **ఈదుపురుగు** వి. పెసరమినుము మొదలయిన కాయపైర్లకు పట్టే పురుగు, కాయలో దూరబడి గింజలు తినే తొల్లపురుగు.

**ఈదుకంకి** చూ. ఈదు[5].

**ఈదుపురుగు** చూ. ఈదు[5].

**ఈదురువాన** వి. ఈదరగాలితో వచ్చేవాన, గాలివాన.

**ఈన** రూ. ఈని. ఈనియ, ఈను[3], ఈనె. వి. 1. ఆకులోనరం ఉ.హ. 2.161 : 2. చీపురుపుల్ల.

పో.చూ.తు. చీంకి, సింకు. కొబ్బరిమట్ట ; త. ఈనై. ఆకులోనరం, చిత్రం యొక్క బాహ్యరేఖ ; ఈనైయెయుతు, ఈనైవాంకు ; పో.చూ. ఈర్. కొబ్బరిఈనె, బాహ్యరేఖ గీయు ; ఈర్‌క్కల్, ఈర్కు. కొబ్బరి ఈనె. పో.చూ.మ. ఈర్‌కల్, ఈకిల్, ఈర్కిళ్, ఈళ్. ఈనె; ఈక్కిలు.

**ఈనపుడక** రూ. ఈనెపుడక. వి. చీపురుపుల్ల ఆకులోనరం. **ఈనపుల్ల** రూ. ఈనెపుల్ల వి. చీపురుపుల్ల.

**ఈనజాడ** ఈన+జాడ. రూ. ఈనిజాడ. చూ. ఈనె. వి. నేతలో రెండు పోగులు తెగినప్పుడు వచ్చిన వెలితి.

**ఈనంజి** వి. కిరసనాయిలు.

**ఈనపయెడ్లు** రూ.చూ. ఇనుపయెడ్లు. వి. గొర్రెలు, మేకలు.

**ఈనపుడక** చూ. ఈన.

**ఈనపుల్ల** చూ. ఈన.

**ఈనము** వి. తక్కువ.

నం. హీన-. తక్కువ, నీచం ; ప్రా. హీణ ; పా. హీన ; త. ఈనమ్. లోటు, తక్కువ, నైచ్యం ; ఈనాయమ్. అగౌరవం, అమర్యాద ; మ. ఈనామాని (ఇనామ్[2], హీనమ్[2]). తక్కువ.

సం. హీన-.

**ఈవరాసి** చూ. ఈనము. వి. 1. చిన్నకుప్ప ; 2. పొట్టు చెరగని ధాన్యం ; 3. తక్కువ రకం ధాన్యం.

< సం. హీనరాశి-.

**ఈవాం** రూ.చూ. ఇనామ్. వి. బహుమతి. మెకంజీ. 80. వ. 3.

**ఈవాము** రూ.చూ. ఇనామ్. వి. బహుమతి, అధికారులు కింది ఉద్యోగులకిచ్చే కానుక.

**ఈవి** రూ.చూ. ఈన. వి. ఈనె.

**ఈవిక** ఈను[1] + -ఇక. చూ. ఈను. వి. దూడను ఈనటం, ఈ(త.

**ఈనికయావు** వి. ఈనటానికి సిద్ధంగా వున్న ఆవు. త. ఈత్తా. అప్పుడే ఈనిన ఆవు.

**ఈవికయావు** చూ. ఈనిక.

**ఈవిజారి** రూ.చూ. ఈనజార. వి. నేతలో రెండు పోగులు తెగినప్పుడు వచ్చే వెలితి.

**ఈవిముగ్గు** చూ. ఈన. వి. వేళ్ల సందుల్నించి ముగ్గు పిండి వదులుతూ గీసిన సమాంతర రేఖలు, ఈన వుల్లలవంటి రేఖల ముగ్గు.

**ఈవియ** రూ.చూ. ఈన. వి. ఆకులోనరం. హర. 2.165.

**ఈను**[1] అ.క్రి., స.క్రి. ప్రసవించు. భార. శాంతి. 1.322, యయా. 1.106 : స.క్రి. **1.** కలిగించు. భార. మహా. 48, మను. 1.5 ; **2.** అమితంగా వెలువడజేయు, వెలువరించు. ఆము. 1.8 ; **3.** కంకివేయు.

క. ఈ, ఈయు, ఈన్, ఈను. ప్రసవించు ; త. ఈన్. ప్రసవించు, కలిగించు ; ఈర్రు ; ఈను. ప్రసవించు: ఈర్రమ్ ; మ. ఈర్రమ్. పశువుల గర్భాశయం ; ఈర్రు. దూడ ; కోట. ఈన్, ఈండ్-. చూడి అగు, గర్భం ధరించు ; తొద. ఈన్, ఈత్. గర్భం ధరించు ; పర్జి. ఈన్-. గింజపట్టు ; బ్రా. హీన్. ఈను.

< మూ. ద్రా. *ఈన్.

**ఈనుపొట్ట** వి. ఏవుకు వచ్చిన వెన్ను.

**ఈను**[2] చూ. వాను. స.క్రి. కుండలుచేయు. తె. 27.

**ఈను**[3] రూ.చూ. ఈన. వి. సన్నగా వల్చగావున్న చూరు, కొడచూరు.

**ఈనుకట్టు** వి. తూర్పార పోసేటప్పుడు మేలురాని దగ్గర పడే పొట్టు, గింజలు కలిసిన భాగం, దండెకట్టు

**ఈనుపెడ్లు** రూ. చూ. ఇనుపమెడ్లు. వి. గొర్రెలు, మేకలు. ద.హిం. శా. 1315.

**ఈనుపొట్ట** చూ. ఈను[1].

**ఈనె** రూ.చూ. ఈన. **1.** ఆకులోనరం. సారంగ. చ. 3.139 ; **2.** చిన్నతుంప. భోజ. 5.22 ; **3.** చీపురుపుల్ల ; **4.** అనుపోసిన నూలులో ఒకటి పైకి ఒకటి కిందికి వచ్చిన రెండు పోగుల దారం ; **5.** పన్నె దండెలకు బిగించిన పుల్లల మధ్య వెలితి ; **6.** సన్నగా పొడుగ్గా ఉండే గీత ; **7.** సన్నటి చీలికబాట ; **8.** నాభి మొదలు గుదస్థానం వరకు నూగారు ననుసరించి ఉండే నరం.

**ఈనెకట్టు** రూ. ఈనెగట్టు. అ.క్రి. ఈనెవలె ఏర్పడు. శుక. 1.425. **ఈనెగట్టు** రూ.చూ. ఈనెకట్టు. అ.క్రి. ఈనెవలె ఏర్పడు. శుక. 1.513. **ఈనెగాజులు** వి. ఆడపిల్లల ఆట. హంస. 3.146. **ఈనెగుజ్జము** వి. పిల్లలాడుకునే ఆట. **ఈనెనాడె** వి. కమ్మినేతలో బొద్దులు పడేట్టు నెయ్యటానికి వాడే చిన్న నాడె. **ఈనెపుడక** వి. చీపురుపుల్ల. **ఈనెపుల్ల** వి. **1.** చీపురుపుల్ల : పన్నెకట్టు బడిలో దండెల మధ్య దువ్వెన పళ్ళ మాదిరిగా వరుసగా కట్టినకలప, జొన్న, గలుగు, వెదురు, కొండచీపురు మొ. వాటిపుల్ల ; **2.** నేత నేసేటప్పుడు పడుగులో తెగిన పోగును దగ్గరకు లాగటానికి వాడే ఇనపముల్లు. **ఈనెపొడుచు** స.క్రి. పన్నె ఈనెలనందులో పోగులుదూర్చు. **ఈనెసందు** వి. పన్నెదండలకు బిగించిన పుల్లలమధ్య వెలితి.

**ఈనెకట్టు** చూ. ఈనె.

**ఈనెగట్టు** చూ. ఈనె.

**ఈనెగాజులు** చూ. ఈనె.

**ఈనెగుజ్జము** చూ. ఈనె.

**ఈనెనాడె** చూ. ఈనె.

**ఈనెపుడక** చూ. ఈనె.

**ఈనెపుల్ల** చూ. ఈనె.

**ఈనెపొడుచు** చూ. ఈనె.

**ఈనెసందు** చూ. ఈనె.

**ఈంత** రూ.చూ. ఈ(త[2]. వి. ఈతచెట్టు.

**ఈందు** రూ.చూ. ఈ(త[2]. వి. ఈతచెట్టు.

**ఈ(త**[1] రూ. ఈత[1], చూ. ఈ(దు[1]. వి. ఈదటం. మను. 2.11. రామలిం. 47.

క. ఈజు, ఈసు, హీజు. ఈదటం ; త. నీత్తు ; పో.చూ. నీత్తమ్. వరద, లోతు, సముద్రం, ఎక్కువ ; మ. నీన్తమ్. ఈదటం.

**ఈ(తకా(డు** రూ. ఈతకా(డు. వి. ఈదేవాడు. భార. ఆశ్వ. 4.167, బసవ. 3.1137 పం. **ఈ(తకొట్టు** రూ. ఈతకొట్టు. అ.క్రి. ఈదు.

**ఈ(త**[2] రూ. ఈచ[3], ఈత[3], ఈదు[3], ఈంత, ఈందు, ఈ(దు[3]. వి. ఈతచెట్టు. కళా. 3.69 (Phoenix sylvetstris). హంస. 4.11, ఆం.భా. 2.79.

క. ఈచల్ (చు), ఈచల, ఈచిల్. ఈతచెట్టు ; తు. ఈచిలు, ఈంచిలు ; త. ఈంతు, ఈచ్చమ్. ఈంచు ; మ. ఈత్త, ఈంతు ; కుఇ. సీత ; పర్జి. చీ(ద్.

పో.చూ.సం. హింతాల- ; ప్రా. హిమ్తాల ; పా. హింతాల హిం. చీ(ద్.

<మూ.ద్రా. *చీన్త్-/ *చీత్-.

**ఈ(తకా(డి** వి. ఈతకల్లు. **ఈ(తకాయ** వి. ఈతచెట్టు కాయ.

**ఈ(త**[3] చూ. ఈను. వి. ఈనటం. రాజవా. 3.45.

క. ఈత ; త. ఈత్తు, ఈన్తల్ ; మ. ఈత్తమ్. పశువుల గర్భాశయం ; ఈత్తు. దూడ.

**ఈ(తకా(డి** చూ. ఈ(త[2].

**ఈ(తకా(డు** చూ. ఈ(త[1].

**ఈతకొట్టు** చూ. ఈ(త[1].

**ఈ(తల** క్రి.విశే. అధికంగా. శృం.మ. 7 వ. 10 పం.

**ఈ(ద**[1] రూ. ఈచ, ఈ(దు[3]. వి. **1.** గాలి. ఉద్భ. 2.260 ; **2.** చలి గాలి.విప్ర. 3.56, అచ్చ. రా. 1.63.

సం. శీత-. చలి, చల్లని ; ప్రా. సీత- ; సిఅ. చలి.

మంచు ; పా. సీత. చలి ;

పో.చూ. త. ఈరమ్. తడి, తేమ, చెమ్మ.

బహుశః <ప్రా. సీత. అనునాసిక్యం సంశయాస్పదం.

**ఈఁదకొమరుఁడు** వి. హనుమంతుడు, భీముడు (వ్యు.) గాలికొడుకు. అచ్చ. రా. 5.99. **ఈఁదగాలి** వి. చలిగాలి, వానతుప్పరతో వీచే గాలి. **ఈఁదమూలి** వి. **1.** హనుమంతుడు. అచ్చ. రా. సుం. 99 ; **2.** భీముడు. వ్యు. గాలి చూలుగా కలవాడు : **ఈఁదతూపు** వి. వాయవ్యాస్త్రం. అచ్చ. రా. 6.265. **ఈఁదపట్టి** వి. **1.** హనుమంతుడు ; **2.** భీముడు. వ్యు. గాలికొడుకు.

**ఈఁద**[2] రూ. ఈద[2]. వి. ఆయుధ విశేషం. కు. సం. 12.786.

పో.చూ. మ. ఈళి. తురుష్క ఖడ్గం, బడిత.

**ఈఁదకొమరుఁడు** చూ. ఈఁద[1].

**ఈఁదగాలి** చూ. ఈఁద[1].

**ఈఁదమూలి** చూ. ఈఁద[1].

**ఈఁదతూపు** చూ. ఈఁద[1].

**ఈఁదపట్టి** చూ. ఈఁద[1].

**ఈఁదర** రూ. ఈదర, ఈదురు. వి. ఎడతెగకుండా తుప్పరతో వీచే గాలి. ఆం.భా. 1.60 ; విశే. తుపానుగా నున్న, తీవ్రమైన.

**ఈఁదరగాడ్పు** వి. తుప్పరతో వీచే గాలి. **ఈఁదరగాలి** రూ. ఈదరగాలి, ఈఁదురుగాలి. వి. తుప్పరతో వీచే గాలి.

**ఈఁదరగాడ్పు** చూ. ఈఁదర.

**ఈఁదరగాలి** చూ. ఈఁదర.

**ఈఁదాడి** రూ. ఈఁదాడు[1]. వి. గిరక తాటిచెట్టు.

<ఈఁత[2]+తాడి.

**ఈఁదాడు**[1] రూ.చూ. ఈఁదాడి. చూ. ఈఁత[2]. వి. పొట్టి తాటి చెట్టు, గిరక తాడి. విజయ. 2.192.

**ఈఁదాడు**[2] చూ. ఈఁదు[1].

**ఈఁదు**[1] అ.క్రి. ఈతకొట్టు, ఈదులాడు. నిర్వ. 8.49, విక్ర. 6.53, సీలా. 1.35 ; స.క్రి. తరించు, దాటు. భార. విరా. 4.213, శృం.నై. 1.108 ; వి. ఈత, ఈదటం.

క. ఈజు, ఈసు. ఈదు ; కొర. మిన్ద్ ; తు. నీన్దుని, ఈమని, ఈజుని ; త. నీన్తు. ఈదు, పొర్లిపోవు ; స.క్రి. తరించు, దాటు, తప్పించుకొను, విడిచి పెట్టు ; వి. సముద్రం ; మ. నీన్తుక. ఈదు ; కోట. నీన్జ్, నిచిడ్ ; తొద. సిజ్-, నీద్ ; గోం. నారీతానా, ఇతరాన ; కొలా. ఈచ్దెజ్, ఈన్ద్.

*నీ-ర్ / *ఈర్ అనే జలార్థక మూల ద్రావిడ పదాలతో సంబంధించినది కావచ్చు.

<మూ.ద్రా. *నీ-న్త్-/*ఈ-న్త్-.

**ఈఁదాడు**[2] ఈదు[1]+ఆడు. అ.క్రి. ఈతకొట్టు. **ఈఁదుఁగాయ** రూ. ఈతకాయ. వి. ఈదటానికి సహాయపడే సొర కాయ. హంస. 4.182. <ఈదు[1]+ఉన్+కాయ. **ఈఁదుఁగొయ్య** వి. తెప్పకొయ్య. హంస. 4.182. <ఈఁదు[1]+ఉన్+కొయ్య. **ఈఁదులాట** వి. ఈదటం. ప్రబంధ. 268. <ఈదు[1]+-లు+ఆట. **ఈఁదులాడు** రూ. ఈతలాడు. అ.క్రి. **1.** వేలాడు. మను. 4.42 ; **2.** ఈతకొట్టు. దశా. 3.176.

**ఈఁదు**[2] రూ.చూ. ఈఁత[2]. వి. ఈతచెట్టు. మను. 4.37.

**ఈఁదు**[3] రూ.చూ. ఈఁద[1]. వి. **1.** చల్లదనం, తడి. కాశీ. 4.96 ; **2.** గాలి. అచ్చ. రా. 5.

**ఈఁదుఁగాయ** చూ. ఈఁదు[1].

**ఈఁదుఁగొయ్య** చూ. ఈదు[1].

**ఈఁదురు** చూ. ఈదు[3]. వి. గాలివాన.

పో.చూ. త. చి. ఉడిచివేయు, బయటికి నెట్టు, నిర్మూలించు, శుభ్రపరచు, పవిత్రీకరించు.

**ఈఁదురుగాలి** రూ.చూ. ఈఁదరగాలి. వి. వానగాలి.

**ఈఁదురుగాలి** చూ. ఈఁదురు.

**ఈఁదులాట** చూ. ఈఁదు[1].

**ఈఁదులాడు** చూ. ఈఁదు[1].

**ఈపి** రూ. ఈపె[1]. చూ. ఈఁగ. వి. **1.** పేనుగుడ్డు, ఈగ మలం. నవ.నా. 5. పు. 244.12 ; **2.** ఆముదపు పూత తినే చిన్న గుండు పురుగులు, పేలు.

క. ఈపి. ఈగమలం, పేనుగుడ్డు ; పో.చూ. ఈర్, ఈరు, సిర్. ఈపి ; కొడ. చిరు ; తు. తిరు ; త. ఈర్ప్పు. ఈపి. శరీరంమీద రేగే పొట్టు, తలమీది చుండు ; ఈర్. ఈపి ; మ. ఈర్. ఈపి ; ఈరుక. రలదువ్వ ; కోట. చిర్. ఈపి ; తొద. తిర్ ; గోం, సిత్. పేను ; సిర్క్. ఈపి ; కువి. హీరు. ఈపి; కొలా. సిర్ ; నా. సిర్ ; కురు. చిర్.

<ఈ (ఈగ)+పె (మలం) : <మూ.ద్రా. *చీర్+*ప్పి.

**ఈపికట్టు** వి. అట్టకట్టిన ఈపి. **ఈపిబంక** వి. పేనుబంక : జొన్న తెగులు, పేను పట్టటంవల్ల ఆకుమీద బంకలాగా ఏర్పడి ఆకు ముడుచుకుపోయె తెగులు.

**ఈపికట్టు** చూ. ఈపి.

**ఈపిబంక** చూ. ఈపి.

**ఈపె**[1] రూ.చూ. ఈపి.

**ఈపె**[2] చూ. ఈ[2].

**ఈపెట్టు** వి. పుండు కుళ్ళిన చోటు.

**ఈబరి** రూ. ఈబిరి. వి. అప్రయోజకుడు, అసమర్థుడు ; విశే. నిరర్థకమైన, నిష్ఫలమైన.

క. ఈబు-. భేదం, అసమానత ; మరా. ఐబ్. దోషం ; ఉ. ఐబ్. దోషం, పాపం, అశుద్ధి ; పార. ఐబ్. నష్టం, హాని ; అర. ఐబ్. దోషం, వ్యసనం, అవమానం, ఆరోపణ, నింద.

బహుశః <క. ఈబు+-అరి.

**ఈబరిగొట్టు** వి. అప్రయోజకుడు, వ్యర్థుడు.

**ఈబరిగొట్టు** చూ. ఈబరి.

**ఈబలు** రూ.చూ. ఊబలు ; పో.చూ. లీబలు. వి. తరకలు, పొల్లు ధాన్యం.

**ఈబిర** చూ. ఈ[2].

**ఈబిడె** చూ. ఈ[2].

**ఈబిరి** రూ.చూ. ఈబరి. విశే. నిరర్థకమైన, నిష్ఫలమైన.

**ఈమిరి** రూ. ఈవిరి ; చూ. ఈము. వి. తడి, తేమ.

**ఈము** రూ.చూ. ఇవము. వి. మంచు, శీతము. ఆం. భా. 180· లోపదీర్ఘతలు.
**ఈమె** చూ. ఈ[3].
**ఈయ-** (సమాసాల్లో మాత్రమే ప్రయుక్తం) రూ.చూ. ఇయ్య-. అవ్య. అంగీకార సూచకం.
**ఈయకొను** రూ.చూ. ఇయ్యకొను. అ.క్రి. అంగీకరించు. **ఈయకోలు** రూ.చూ. ఇయ్యకోలు. వి. అంగీకారం. **ఈయకోలుకాఁడు** రూ.చూ. ఇయ్యకోలుకాఁడు. వి. ఆస నమ్మకుడు.
**ఈయక** చూ. ఈ[3].
**ఈయకొను** చూ. ఈయ.
**ఈయకోలు** చూ. ఈయ.
**ఈయకోలుకాఁడు** చూ. ఈయ.
**ఈయది** చూ. ఈ[3].
**ఈయన** చూ. ఈ[3].
**ఈయవ** చూ. ఈ[3].
**ఈయమ** చూ. ఈ[3].
**ఈయమ్మ** చూ. ఈ[3].
**ఈర[1]** వి. లోపలి కండ, హృదయం లోపలి భాగం.
క. హీర. ప్లీహం కాలేయం వంటి శరీరం లోపలి అవయవం; పో.చూ. త. ఈరల్, ఈరళ్; మ. ఈరల్. కాలేయం; తొద. ఊరప్.
**ఈర[2]** పో.చూ. ఈరె. వి. నూలు వడికే కదురు.
**ఈరకడియము** వి. వీరుల కడియం.
<సం. వీర-+కడియము.
**ఈరకత్తియ** రూ. ఈరకత్తె. చూ. వీరకత్తియ. వి. వియ్యపురాలు.
**ఈరకత్తె** రూ.చూ. ఈరకత్తియ.
**ఈరకాఁడు** రూ.చూ. వీరకాఁడు. వి. 1. వియ్యంకుడు; 2. బావమరిది.
**ఈరంగము** రూ.చూ. వీరంగము. వి. 1. పెద్దగోల; 2. కొమ్ముగాళ్లు జముకులు వాయిస్తూ చేసే వీర నృత్యం.
**ఈరట్టు** వి. సందిగ్ధత.
త. ఈర్-అటి. సందిగ్ధత, పంగ (రెండుగా చీలినది).
<ఈర్-(రెండు)+రట్టు.
**ఈరతార** రూ.చూ. ఈఱతాఱ. వి. 1. తారుమారు; 2. వ్యత్యయం. క్రి.విశ. అక్కడక్కడ, అటూఇటూ, క్రమరహితంగా, తబ్బిబ్బుగా.
**ఈరదాడు** రూ.చూ. వీరతాడు. వి. 'చటాలున' మొలిచి పొలంలో పిట్టల్ని తోలే మొక్క, చెటాల్‌మొక్క.
**ఈరమి** రూ.చూ. ఈరము. వి. తొంపం. తీగలు, ఆకులు మొ. వాటి గుంపు. కళా. 1.62.
**ఈరము** రూ. ఈరమి. ఈఱమి, ఈఱము. వి. పొద, కుంజం. రం.రా. అరణ్య. 150 పు. 30 పం., వేంక.పంచ. 4.271; విశ. సాంద్రం, దట్టం. కవిక. 3.115, విక్ర. 6.71.
క. ఈర. తడి, చెమ్మ; త. ఈర్, ఈరమ్. వి. చెమ్మ, తేమ, చల్లదనం, ఆకుపచ్చ; మ. ఈరవం. చెమ్మ, మురికి.
<మూ.ద్రా. *ఈర్.
**ఈరములువట్టు** ఈరములు + పట్టు. అ.క్రి. పొదల మాటున పొంచివుండి ధనాదుల నపహరించు. భాగ. 6.107.
**ఈరములువట్టు** చూ. ఈరము.
**ఈరలు** చూ. ఈరు[2].
**ఈరవకుట్టు** వి. ఒకరకం కడుపునొప్పి.
త. ఈరల్, ఈరుల్. కాలేయమువంటి లోపలి అవయవం; మ. ఈరల్. కాలేయం; కోట. ఈరుల్; తొద. ఊరుఫ్. కాలేయానికి సంబంధించిన నొప్పి (కావచ్చు).
**ఈరవాని** రూ.చూ. ఈరుపెన. వి. ఈళ్లను ఈర్చే దువ్వెన.
**ఈరస** రూ.చూ. ఈరసము. వి. కోపం, ద్వేషం, అసూయ. భా.రా.యు. 1974.
**ఈరసపడు** అ.క్రి. అసూయచెందు, అసహనపడు. కాశీ. 4.125. **ఈరసించు** అ.క్రి. కోపించు, కుపితుడగు. వేంక. పంచ. 1.488.
**ఈరసపడు** చూ. ఈరస.
**ఈరసమాడు** చూ. ఈరసము.
**ఈరసము** రూ. ఈరస వి. 1. ఓర్వలేకపోవటం, అసహనం. భార.శాంతి. 3.70; 2. ద్వేషం, పగ. భార.శాంతి. 3.25, నృసింహ. 4.26; 3. కోపం. భార.కర్ణ. 2.52. మల్ల.నీతి. 17; 4. చలము, పట్టుదల, మాత్సర్యం. ఉ. రా. 3.101.
సం. ఈర్ష్యా. అసూయ. ప్రా. ఈసా. పగ, ద్వేషం.
<సం. ఈర్ష్యా.
**ఈరసమాడు** ఈరసము+ఆడు. స.క్రి. నిరసించు, తిరస్కరించు. వరాహ. 11.44. **ఈరసమెత్తు** ఈరసము+ఎత్తు. అ.క్రి. అసూయపడు. భార.ఉద్యో. 3.74.
**ఈరసమెత్తు** చూ. ఈరసము.
**ఈరసించు** చూ. ఈరస.
**ఈరాఱు** రూ. ఇరాఱు. వి. రెండు ఆరులు, పన్నెండు. ఆం. సం.మాన. 43.
<ఈర్-+ఆఱు[2].
**ఈరిక[1]** చూ. ఇగురు[1]; రూ. ఈరికె[1]. వి. అంకురం, మొలక· శ్రీ రాధా. 4.298, ఆం.భా. 2.35.
**ఈరికలీను** ఈరికలు+ఈను[1]; శబ్దపల్లవం. అ.క్రి. అంకురించు, మొలకెత్తు. కాళిందీ. 1.306. **ఈరికలుకొను** అ.క్రి. చిగురించు. **ఈరికలెత్తు** ఈరికలు+ఎత్తు[1]. అ.క్రి. చిగురించు, మొలకెత్తు. విక్ర. 1.122, భాగ. 3.507, విజయ. 2.167.
**ఈరిక[2]** రూ.చూ. చీరిక. వి. గుడ్డపీలిక.
**ఈరికమాను** రూ.చూ. ఈడికమాను. వి. బాళ్ళు చదును చేసే పంగలకొయ్య.
**ఈరికలీను** చూ. ఈరిక[1].
**ఈరికలుకొను** చూ. ఈరిక[1].
**ఈరికలెత్తు** చూ. ఈరిక[1].
**ఈరికె[1]** రూ.చూ. ఈరిక[1]. వి. అంకురం, మొలక.
**ఈరికె[2]** రూ.చూ. చీరిక. వి. గుడ్డపేలిక.

**ఈరికెలుచెయ్యడం** వి. ముక్కలుగా చించటం.
**ఈరికెమాను** రూ.చూ. ఈడికమాను. వి. పొలంలో మట్టిపెళ్లలు నలగటానికి లాగే పంగలమాను.
**ఈరికెలుచెయ్యడం** చూ. ఈరికె[2].
**ఈరిబావ** రూ.చూ. ఈరుపెన. వి. ఈపి ఈర్చే దువ్వెన.
**ఈరు**[1] వి. పేనుగుడ్డు. శిక్ష. పాండు. 3.30, ప్రభా. 5.78.
క. ఈర్, ఈరు, సిర్, సిరు. పేనుగుడ్డు; కొడ. చిరు; తు. సిరు, చిరు, తిరు; త.మ. ఈర్; కోట. చీర్. పేనుగుడ్డు; తొద. తిర్. గోం. సి. పేనుగుడ్డు, సిర్క్. (బ.వ.); కువి. హీరు; కొలా. సిర్, చిర్; నాయ. సీర్; కురు. చిర్; బ్రా. ఈరస్. దువ్వెన; ఇరిస్.
<మూ.ద.ద్రా. *చీర్/*ఈర్ <మూ.ద్రా. *చీర్.
**ఈరుపేను** రూ.చూ. ఈర్పేను. వి. పేనుగుడ్డు. **ఈర్పేను** రూ. ఈరుపేను. వి. పేనుగుడ్డు. కాశీ. 6.79.
**ఈరు**[2] ఈవు. ఏ.వ. వి. బ.వ. మీరు. భార.అశ్వ. 2.78.
పో.చూ. క. ఈ. అనిశ్చిత వర్తమాన బోధకమైన మధ్యమ పురుష ఏక వచన ప్రత్యయం; నీమ్. మీరు; తు. ఈరు, ఈరె-. మీరు; ఇనుకులు, ఇఱ్కులు, నిక్కులు; త. ఈర్. మధ్యమ పురుష బహువచన ప్రత్యయం; నీయిర్, బవ. నీర్; మ. నిఙ్ఙళ్. నీవు; గోం. ఇమ్మట్. మీరు; కుఇ. ఈయ-; పర్జి. ఈమ్. మీరు; గద. ఈము. మీరు; ఒల్లా. ఈమ్, ఇమ్-; కువి. మిమ్బు. నీవు; కొలా. ఇమ్-. మిమ్ము; ఇమ్క్. మీరు; బ్రా. నుమ్. మీరు.
<మూ.ద్రా. *నీమ్-.
**ఈరేలు** సర్వ. మీరు.
**ఈరు-**[3] సమాసాల్లో మాత్రమే ప్రయుక్తం. విశ. అల్పం, హీనం.
పో.చూ. త. నీర్. పల్చబడు.
<మూ.ద్రా. *నీర్.
**ఈరువాఱు** చూ. ఈరు[3]. అ.క్రి. వాహ్యాళిపోవు; వి. వాహ్యాళి. <ఈరు+పాఱు. వ్యు. మెల్లని నడక. **ఈరెండ** ఈరు+ఎండ; రూ. నీరెండ. వి. లేతయెండ, కొంచెం యెండ. క్రీడా. 65, పాండు. 4.287. **ఈరెలుఁగు** ఈరు+ఎలుఁగు. వి. హీనస్వరం. పారి. 4.21. **ఈరెలుఁగు వడు** అ.క్రి. హీనస్వరం కలవాడగు, గద్గద కంఠుడగు. హర. 2.48.
**ఈరు-**[4] రెండు శబ్దానికి వృత్తిలో అజాది సంఖ్యావాచకం పరమయ్యేటప్పుడు ఆదేశం; రూ.చూ. ఇరు. విశ. రెండు.
**ఈరుచు** రూ. ఈర్చు. స.క్రి. దువ్వెనతో ఈళ్లను దువ్వివేయు.
క. ఈర్. లాగు, ఈర్చు; ఈరు, సీరు. ఈర్చు; ఈరిసు. ఈర్పించు; పో.చూ. ఈర్. పేనుగుడ్డు; ఈరణిగె. ఈర్పెన; తు. ఈరుని. రుద్దు, ఏరు, తీరు, పేనుగుడ్డు; త. ఈర్. లాగు; మ. ఈరుక. కోయు, చీల్చు, దువ్వు; చిరక్కుక, చిక్కుక. దువ్వు; పర్జి. ఈర్ప్-, ఈర్త్. లాగు; ఈర్చ్-. రుద్దు; మాల్తో. ఈర్చ్. నేలగీరివేయు; కురు. ఈర్చ్. గీరు.

**ఈరువన్నె** రూ.చూ. ఈరుపెన. వి. ఈళ్లు ఈర్చే దువ్వెన.
**ఈరుపెన** రూ. ఈరవాని, ఈరిదాన, ఈరుపన్నె, ఈర్పెన. చూ. ఈరు. వి. ఈళ్లు ఈర్చే దువ్వెన.
క. ఈరణిగె. ఈర్పెన; పో.చూ. హణిగె, అణిగె: దువ్వెన; త. ఈరవలి. ఈర్పెన; ఈర్వాంకి, ఈర్వారి. పో.చూ. ఫనిబ్రై. స్త్రీల కేశాలంకరణ పద్ధతి; పణికెక్క. ముఖంపై జుట్టు సవరించుకోటం; మ. ఈరవలి. చిన్న దువ్వెన.
<ఈరు+పన్నె.
**ఈరుపేను** చూ. ఈరు[1].
**ఈరుమాండ్లగడ్డి** వి. ఒకరకం కలుపు మొక్క. రా. 14.26.
**ఈరువాఱు** చూ. ఈరు-[3].
**ఈరువు**[1] పో.చూ. ఎఱచి. వి. మాంసం. ఆం. నం. తిర్య. 2.18.
**ఈరువు**[2] వి. తగవు, జగడం.
**ఈరె** పో.చూ. ఈర[2]. వి. పంజెను చుట్టి తీసిన నూలు.
*పిరె; చూ. పీర్(ల్) ఉ. వేరుచేయు.
**ఈరెండ** చూ. ఈరు-[3].
**ఈరెలుఁగు** చూ. ఈరు-[3].
**ఈరెలుఁగువడు** చూ. ఈరు-[3].
**ఈరేడు**[1] ఈరు[4]+ఏడు. వి. రెండు ఏళ్లు పద్నాలుగు. భార. విరా. 4.219, వరాహ. 6.103.
**ఈరేడు**[2] వి. శవాలు మొ. వాటిని మోయటాని కుపయోగించే సాధనం, పాడె.
పో.చూ. త. ఈర్. లాగివేయు.
పాడె కట్టేటప్పుడు తాడుతో పద్నాలుగు ముళ్లు వేస్తారు కాబట్టి దీనికి 'ఈరేడు' అనే పేరు వచ్చి వుండవచ్చు.
**ఈరేను** ఈరు-[4]+ఏను. వి. రెండు ఐదులు పది. భార. ఆర. 2.108.
**ఈరైదు** ఈరు-[4]+ఐదు. వి. రెండు ఐదులు పది. భార. శల్య. 1.226.
**ఈరైదుకడలు** వి. పది దిక్కులు. ఈరు-[4]+ఐదు+కడలు.
**ఈరైదుకడలు** చూ. ఈరైదు.
**ఈర్చు** రూ.చూ. ఈరుచు. స.క్రి. ఈళ్లను దువ్వివేయు.
**ఈర్పెన** రూ.చూ. ఈరుపెన. వి. ఈళ్లు ఈర్చే దువ్వెన. ఆం. భా. 2.163.
**ఈర్పేను** చూ. ఈరు[1].
**ఈఱతాఱ** రూ. ఈరతార. విశ. 1. వ్యతిరిక్తం, అనుచితం. భార. ఉద్యో. 4.76; 2. పరుషం, కఠినం. భార. ద్రోణ. 3.43, కృశకు. 3.24; 3. వక్రం, కుటిలం. భార. అశ్వ. 1.108; వి. ఉయ్యాలవలె ఊగటం. భారా. 2.124.
తాఱుమాఱు, తిల్తాల్, గోల్మాల్ ఇత్యాదుల వంటి ధ్వన్యనుకరణ రూపం కావచ్చు.
**ఈఱమి** రూ.చూ. ఈరము. వి. 1. సాంద్రత, తరచు. శృం. నై. 7.193; 2. జొంపం, తీగలు ఆకులు మొ. వాని గుంపు. కళా. 1.62; విశ. సాంద్రం, దట్టం. వి. పు. 1.44.

**ఈఱము** రూ.చూ. ఈరము. విణ. సాంద్రం, దట్టం. విక్ర. 6.71, కవిక. 3.115, వి. పొద, కుంజం. వేంక. పంచ. 4.271.

**ఈల**[1] రూ.చూ. సీల. వి. **1.** వేటగాండ్రు, దొంగలు మొ. వారు సంకేతంగా నోటితో చేసే ధ్వని. ఆం. భా. 1.122, ఆము. 5.68; **2.** చిమ్మటకూత; **3.** ఈలవెయ్యటానికి ఉపయోగించే సాధనం. కాశ. 3.58.

క. చిళి. అనుకరణ ధ్వని; సిళ్. అరుపు, కేక; సిళ్ళు. ఈలవేయటం; తు. ఙసులు; త. ఈవల్. ఈల; చిటక్కై. ఈల, ఈలవేయటం; చిట్; చిట్టి; పో.చూ. చిల్వాట్లు. కీచురాయి; మ. చిళ్. ధ్వని; చిళ్వీయు. కీచురాయి; గోం. ఈఁసి, సీసరి. ఈల; కుఇ. సిసాడి. ఈలవేయటం; కువి. సిసారికిఆలి; పర్జి. చిల్కి; కూత కూసే బుడ్డ కోడి; చిం(గి. కీచురాయి; కొలా. ఙసపాడ్. ఈలవేయు.

<మూ.ద్రా. *చీళ్-.

**ఈలకూఁతలు** వి. బాలక్రీడా విశేషం. వి. పు. 7.208. **ఈలకొట్టు** స.క్రి. ఈలవేయు. **ఈలకోడి** రూ.చూ. ఇలకోడి. వి. కీచురాయి. **ఈలగద్ద** రూ.చూ. ఈల్రగద్ద. వి. **1.** ఒక జాతి డేగ; **2.** లోభి. **ఈల్రగద్ద** రూ. ఈలగద్ద. వి. **1.** ఒక జాతి డేగ. వేంక. పంచ. 1.782; **2.** లోభి. శృం.నై. 7.107. **ఈలపురుగు** ఈలలాంటి ధ్వని చేసే పురుగు. వి. ఇలకోడి, చిమ్మట. **ఈలవిరుచు** అ.క్రి. ఈల వేయు. **ఈలవెట్టు** ఈల[1]+పెట్టు. అ.క్రి. ఈలవేయు. ఆము. 6.73.

**ఈల**[2] పో.చూ. ఈలువు. వి. సిగ్గు, లజ్జ. మను. 3.108.

సం. శీల-. అలవాటు, ఆచారం, శీలం, స్వభావం, నీతి, గుణం; మ. ప్రా. సీల-. స్వభావం, గుణం, ఆచారం; పా. సీల. స్వభావం, నడవడిక, నైతిక ప్రవర్తన, ఆచారం.

<ప్రా. సీల-.

**ఈల**[3] వి. సముద్ర ప్రాంతాలలో నేలను అంటి మొలిచే ఒక జాతి ఉప్పని కూరాకు (Suaeda maritima).

**ఈలకూర** వి. ఒక జాతి కూరాకు. వరాహ. 7.47.

**ఈల**[4] వి. నెపం, మిష, వ్యాజం.

పో.చూ. సం. హేలా. అగౌరవం, అమర్యాద, తిరస్కారం; ప్రా. హీల-. తిరస్కారం, అలక్ష్యం. నింద.

<?ప్రా. హీల-.

**ఈలకత్తి** వి. కూరగాయలు కోసే కత్తి లేక కత్తిపీట.

సం. ఇలీ, ఈలి-, ఈలికా, ఈలీ. ఆయుధ విశేషం; బడిత, చిన్నకత్తి, లిక్కి, లేక కొడవలి; ప్రా. ఈలి. ఆయుధ విశేషం; అ.మా. ఇలీ. రెండువైపుల పదునున్న కత్తి; పా. ఇల్లియ, ఇల్లి. పొట్టి కత్తి.

క. ఈళిగె. కత్తి; ఇలి, ఈలి. ఆయుధ విశేషం, తురుష్కులు ఉపయోగించిన ఒకే వైపు పదునున్న చిన్న కత్తి, బడిత, చిన్నకత్తి, లిక్కి, లేక కొడవలి; ఈలిక, ఈళిగె. లిక్కి, లేక కొడవలి, కూరగాయలు కోసే కత్తి; మ. ఈళి. తురుష్కుల కత్తి, బడిత.

<ప్రా. ఈలి+కత్తి.

**ఈలకరచు** రూ.చూ. ఇలకఱచు. అ. క్రి. బిగబట్టు.

**ఈలకఱచు** రూ.చూ. ఇలకఱచు. అ.క్రి. **1.** ప్రాణాలు బిగపట్టు, పళ్లు బిగించు. భార. కర్ణ. 2.68, వేంక. పంచ. 3.187; భా.రా.యు. 996; **2.** ముడుచుకొను. అం.శ.

**ఈలకూతలు** చూ. ఈల[1].

**ఈలకూర** రూ. ఈల[3].

**ఈలకొట్టు** చూ. ఈల[1].

**ఈలకోడి** చూ. ఈల[1].

**ఈలగద్ద** చూ. ఈల[1].

**ఈలగఱము** చూ. ఇలకఱచు. వి. ప్రాణావశిష్టమై భయపడి నోరు బిగబట్టి ఉండేస్థితి.

**ఈల్రగద్ద** చూ. ఈల[1].

**ఈలపీట** రూ.చూ. ఇలపీట. వి. కత్తిపీట.

**ఈలపురుగు** చూ. ఈల[1].

**ఈలవిరుచు** చూ. ఈల[1].

**ఈలవెట్టు** చూ. ఈల[1].

**ఈలా**[1] వి. శపథం చెయ్యటం. రంగా. 3.75.

ఉ.పార.అర. ఈలా. శపథం చెయ్యటం, ఆజ్ఞాపించటం.

<ఉ. ఈలా.

**ఈలా**[2] చూ. ఈ[2].

**ఈలాగంటి** చూ. ఈ[2].

**ఈలాగు** చూ. ఈ[2].

**ఈలాగున** చూ. ఈ[2].

**ఈలాటి** చూ. ఈ[2].

**ఈలాయి** వి. వంటెకు బదులు నూలు చుట్టుకునే రేకుడబ్బా.

**ఈలిక** రూ.చూ. పీలిక. వి. గుడ్డపేలిక.

**ఈలిటెంకి** చూ. ఈలకత్తి. వి. కత్తివంటి నల్లతోక, శరీరంపైన టెంకెగల చేప, మత్స్య విశేషం.

దీని శరీరంపైన టెంకె (బొచ్చె) ఉంది, తోక కత్తిని పోలి ఉండటంవల్ల ఈ పేరు వచ్చిఉంటుంది.

**ఈలుగు** రూ.చూ. నీలుగు. అ.క్రి. మరణించు, చచ్చు. భార. కర్ణ. 2.398, భా.రా.కిష్కిం. 165, వి. ఒళ్ళు విరుచుకోటం. ఆం.భా. 1.141.

పర్జి. ఈల్-. రాలు; గద. ఈల్, ఈలి. చాచు.

**ఈలుగొయ్యి** వి. వీపుకు ఇరువైపులా ఉండే సుడి, గాటిసుడి.

**ఈలువు** వి. **1.** పాతివ్రత్యం. కు.సం. 10.529; **2.** మానం, చిత్తసమున్నతి. భోజ. 7.113; **3.** కులాచారం. శివరా. 3.117; **4.** సత్ప్రవర్తన, మంచినడవడి. వేంక.పంచ. 4.507; **5.** మనస్సు. వసు. 3.87; **6.** ధైర్యం.

క. ఈలు. అనుబంధం; తు. ఈయరుని, ఈయపుని. సమృద్ధిగా ఉండు; త. ఇయల్. స్వభావం, లక్షణం. గుణం, అర్హత, యుక్తత, సున్నితం, సుకుమారత, ప్రేమ, సత్ప్రవర్తన, జన్మజన్మల అనుబంధం; మ. ఇయల్. తగినది; ఈయలుక. అంగీకరించు.

**ఈలువుగొను** శబ్దపల్లవం, అ.క్రి. చెరచు. బలాత్కరించు. శుక. 2.10. <ఈలువు+కొను. **ఈలువుటాండ్రు** వి.

పతివ్రతలు. భార.ఆర. 7.6, ఆము. 5.70. < ఈలువ + ఆండ్రు. **ఈలువటాలు** వి. **1.** (పతివ్రత అగు) భార్య. భార.ఆర. 7.61; **2.** గుణవంతురాలు. ఆము. 5.70; **3.** పతివ్రత. విజ్ఞా. 1.115. < ఈలువ + ఆలు.

**ఈలువగొమ** చూ. ఈలువ.

**ఈలువటాండ్రు** చూ. ఈలువ.

**ఈలువటాలు** చూ. ఈలువ.

**ఈలోఁగా** చూ. ఈ[2].

**ఈల్కలచు** రూ.చూ. ఇలకలచు. అ.క్రి. ప్రాణాలు బిగపట్టు. భా.రా.యు. 996.

**ఈల్గు** రూ.చూ. నీలుగు. అ.క్రి. చచ్చు. భార.భీష్మ. 2.196; వి. ఒళ్ళు విరుచుకొనటం. ఆం.భా. 1.141.

**ఈళము** రూ. ఈడము, ఈడాము, ఈళాము. వి. సింహళ ద్వీపం. అహ. 1.30.

సం. సింహలః, సింహలా. సింహళద్వీపం; ప్రా. సింఘల, సింహల, సీహల. దేశవిశేషం; అ.మా. సీహల. సింహళం; సీహలి. సింహళదేశపు దాసీకన్య; పా. సీహళ. సింహళం; సీహళదీప, సీహళభాస్స. సింహళీభాష; సీహళక. సింహళదేశ సంబంధి.

క. సింగళ, సింహల, సింహళ, సింహ్వల. సింహళ ద్వీపం; త. ఈళc. సింహళం; ఈటం, చింకలc, ఈదినాటు, ఈఅమంటులం; మ. ఈలిం. బహుళః < త. ఈళం.

**ఈళాము** రూ.చూ. ఈళము. వి. సింహళ ద్వీపం. శక. 1.138.

**ఈవ** రూ.చూ. ఈఁగ. వి. ఈగ. సాం.ని.తిర్య. 83.

**ఈవంక** చూ. ఈ[2].

**ఈవరి** చూ. ఈగి. వి. ఇచ్చేవాడు, దాత. యయా. 5.1.

పో.చూ. క. ఈవుదు. ఇవ్వటం; త. ఈవోన్. దాత. < ఈవి + -అరి.

**ఈవరితనము** వి. దాతృత్వం. యయా. 5.1.

**ఈవరితనము** చూ. ఈవరి.

**ఈవల** రూ. ఇవల, ఇవుల, ఇవ్వల. వి. ఇవతలి ఒడ్డు. సీతారా. 3.39; క్రి.విశ. ఇక్కడ. విక్ర. 5.154.

**ఈవలావలగు** అ.క్రి. వ్యత్యస్తమగు భా.రా.యు. 1319. **ఈవలావలఁజేయు** స.క్రి. ఇట్టట్టుచేయు, తలకిందు చేయు. భా.రా.యు. 263.

**ఈవలావలగు** చూ. ఈవల.

**ఈవలావలఁజేయు** చూ. ఈవల.

**ఈవలి** వి. దాహం.

**ఈవి** రూ.చూ. ఈగి. వి. **1.** ఇవ్వటం, దానం. శృం.నై. 3.53, ఉ.రా. 1.229; **2.** ఈయబడినది, వరం. సీలావి. 2.169, శతకంఠ. 2.169; **3** బహుమాన ద్రవ్యం. చంద్రా. 3.45, 46.

త. ఈవు. ఇవ్వటం, దానం, బహుమానం.

**ఈవికాఁడు** రూ.చూ. ఈగికాఁడు. వి. దాత. **ఈవిమాను** రూ.చూ. ఈగిమ్రాను. వి. కల్పవృక్షం. **ఈవిమ్రాను** రూ.చూ. ఈగిమ్రాను. వి. కల్పవృక్షం. దశా. 4.103; ఉ.రా. 5.208.

**ఈవికాఁడు**[2] చూ. ఈవి.

**ఈవిడ** చూ. ఈ[2].

**ఈవిడె** చూ. ఈ[2].

**ఈవిమాను** చూ. ఈవి.

**ఈవిమ్రాను** చూ. ఈవి.

**ఈవిరి** రూ.చూ. ఈమిరి. వి. **1.** చెమ్మ ఆరని నేల; **2.** చెమ్మ, తడి.

**ఈవు** వి. నీవు. భార.శాంతి. 5.183.

పో.చూ. క. ఈ. అనిశ్చిత వర్తమాన మధ్యమ పురుషైక వచన ప్రత్యయం; తు. ఈ. నీవు; త. ఈ. మధ్యమ పురుష ప్రత్యయం; మ.కోట.కొడ.బ్రా. నీ. నీవు; గోం. ఈమ్మా, ఇమ్మ, నిమా. నీవు; కుఇ. ఈను; వి. కువి. నీనూ, నీను; పర్జి. ఈన్; కొలా. నీవ్; నా. నీవ్; గద. ఈన్; కొండ. నీన్; కురు. నీన్; మాల్తో. నీన్. < ప్రా. తె. *ఈ < *నీ < మూ.ద్రా. *నీన్.

**ఈవులకెంపు** చూ. ఈవులు.

**ఈవులమొదవు** చూ. ఈవులు.

**ఈవులమ్రాను** చూ. ఈవులు.

**ఈవులరతనము** చూ. ఈవులు.

**ఈవులు** చూ. ఈవి. ఏ.వ. వి. బ.వ. దానాలు.

**ఈవులకెంపు** రూ.చూ. ఈగులకెంపు. వి. చింతామణి. **ఈవులమొదవు** వి. కామధేనువు. **ఈవులమ్రాను** వి. కల్పవృక్షం. **ఈవులరతనము** వి. చింతామణి. విజయ. 1.41.

**ఈవె** రూ.చూ. ఈఁగ. వి. ఈగ.

**ఈవేళ** చూ. ఈ[2].

**ఈవైపు** చూ. ఈ[2].

**ఈశావం** వి. ఈశాన్యమూల.

సం. ఈశాన-. వ్యు. శివసంబంధి ఐనవి, దిక్కు.

**ఈశాన్యభూమి** వి. స్మశానం. ఊరికి ఈశాన్యమూలన వుంటుంది కనుక; ఆ దిక్కుకు అధిపతి శివుడు.

సం. ఈశాన్య-. ప్రా గుత్తర దిక్కు.

< సం. ఈశాన్యభూమి-. అర్థవిపరి.

**ఈశ్వరకోర** మిశ్రన. వి. కోరమండలం తీరాన పండే ఒక రకం వడ్లు, ఐదు నెలల పంట. వ్యు. ఈ జాతి బియ్యం ఈశ్వరుడి చేతిలో వుండే కపాలం ఆకారంలో ఉంటాయి కాబట్టి కావచ్చు.

**ఈశ్వరప్రియములు** వి. ఒకరకం వడ్లు. వ్యు. శివుడి కిష్టమైనవని కావచ్చు.

**ఈశ్వరవేరు** మిశ్రన. వి. లతా విశేషం. హంస. 4.12.

సం. ఈశ్వరీ. ఒకరకం చెట్టు, మొక్క.

క. ఈశ్వరబేరు, ఈశ్వరిబేరు. పాము కాట్లకు విరుగుడుగా వాడబడే లతా విశేషం; తు. ఈశ్వరబేరు, ఈసరబేరు; త. ఈచుర-వేర్, ఈచురమూలి(మలై); మ. ఈశ్వరమూల్ల / ఈశ్వరమూలి.

< సం. ఈశ్వర- + వేరు.

**ఈస**[1] రూ.చూ. ఈసు[1]. వి. అసహ్యం, ద్వేషం.

**ఈస**[2] రూ.చూ. ఈచ[1]. విశ. చాలా చిన్న.

**ఈసపోవు** అ.క్రి. చిక్కిపోవు, కృశించు.

**ఈస**[3] వి. నాగటిపోలు, బండిపోలు.

సం. ఈషా. నాగటిపోలు, బండిపోలు ; ప్రా. ఈసా. నాగటిపోలు : పా. ఈసక. పోలుగఱ్ఱ ; ఈసా. నాగటిపోలు, బండిపోలు.

మ. ఈత్తు. నాగటిపోలు.

<ప్రా. ఈసా <సం. ఈషా.

**ఈసకఱ్ఱ** వి. లంగడుకు మొదట అడ్డంగా కట్టే కఱ్ఱ.

**ఈస**[4] చూ. ఏస[2]. విశే. వంపు, వంకర.

**ఈసం** రూ.చూ. ఫీనము. వి. ఒక అణా.

**ఈసకఱ్ఱ** చూ. ఈస[3].

**ఈసడచేయు** చూ. ఈసడము.

**ఈసడము** చూ. ఈసు[1]. వి. నింద, దూరు. ఆం. భా. 1.115. **ఈసడచేయు** స.క్రి. ఈసడించు, నిరసించు. కాళిందీ. 2.39. **ఈసడించు** స.క్రి. **1.** నిరసించు, నిందించు. హరిశ్చ. 4.221, నరస. 1.11 ; **2.** అసహ్యించుకొను, రోయు. పాంచాలీ. 3.47 ; అ.క్రి. విరోధించు, పగబూను. వసు. 4.56. **ఈసడింపు** వి. నిరసన.

**ఈసడించు** చూ. ఈసడము.

**ఈసడింపు** చూ. ఈసడము.

**ఈసదారు** చూ. ఈస[3]. వి. పాలికాపు.

<ఈస[3]+(పార.)-దార్.

**ఈసంతం** వి. విశాలం.

సం. విశ్రాంత-. ఆగినది, శాంతించినది ; ప్రా. విస్సంత, వీస్సంత.

<ప్రా. వీసంత- <సం. విశ్రాంత-.

**ఈసపిట్ట** వి. ఒక రకం చేప.

క. ఈసు[1]. ఈదు.

**ఈసపోవు** చూ. ఈస[2].

**ఈసబడి** పో.చూ. ఈస[3]. వి. కౌలులో ఒకరకం. (భూకామందుకు డబ్బు ఇంత ఇచ్చేట్టు అని ముందుగా నిర్ణయించుకుని చేసే వ్యవసాయం.

**ఈసర**[1] వి. పాముకాటుకు పనిచేసే ఓషధీ విశేషం (Aristolochia indica).

తు. ఈసరబేరు ; త. ఈచురవేర్.

<సం. ఈశ్వర-.

**ఈసర**[2] విశే. అధికం.

కుఇ. ఈసోటి. చాలా యెక్కువ ; ఈసోలి ; కువి. ఈచుర, ఇజ్జోర ; గోం. ఇచ్చోటే ; కొల. ఇచ్చా, ఇచ్చుకు.

**ఈసరపోవు** చూ. ఈస[2]. అ.క్రి. వ్యర్థమగు.

**ఈసరబీసర** క్రి.విశే. నోటికివచ్చినట్లు.

**ఈసరి** వి. పార్వతి.

సం. ఈశ్వరీ. దుర్గ, ఆదిశక్తి.

త. ఈసువరి. పార్వతి.

<సం. ఈశ్వరీ.

**ఈసరుడు** వి. శివుడు.

సం. ఈశ్వర-. ప్రభువు, భర్త, పరమాత్ముడు ; ప్రా. అమా. ఈసర-. శివుడు, ప్రభువు, యజమాని ;

త. ఈసువరన్. నాయకుడు, ప్రభువు, భగవంతుడు, శివుడు ; ఈచ్చురన్, ఈచ్చువరన్.

<ప్రా. ఈసర-.

**ఈసలు** రూ.చూ. ఇసుళ్ళు. వి. రెక్కలుగల చెదలు. ఆం.భా. 2.95.

**ఈసవి** వి. క్రీస్తు శకం.

హిం. ఈసవీ. క్రైస్తవం ; ఉ. ఈసవీ. క్రీస్తు సంబంధించినది, క్రీస్తుశకం ; పార. అర. ఈసవీ.

<ఉ. ఈసవీ.

**ఈసు**[1] రూ. ఈస[1]. వి. **1.** ద్వేషం, పగ. భార. సభా. 1.118 ; **2.** ఓర్వలేమి, అసహనం. భార. అర. 1.383, పారి. 1.133, ఉ. రా. 6.152 ; **3.** కోపం, క్రోధం. భార. అర. 7.149, శృం.నై. 5.68, పాండు. 5.228 ; **4.** చలము, పట్టుదల. భాగ. 3.707 ; **5.** నింద. మను. 4.23.

సం. ఈర్షా, ఈర్ష్యా. అసూయ, ఓర్వలేనితనం, పట్టుదల, ద్వేషం ; ప్రా. ఇస్సా, ఈసా. అసూయ, ద్వేషం, వంచన ; అమా. ఈసా ; పా. ఇస్సా.

<ప్రా. ఈసా <సం. ఈర్షా.

**ఈసుకాఁడు** వి. ఈర్ష్యాళువు, ఉడుకుబోతు. **ఈసువడు** ఈసు[1]+పడు. అ.క్రి. నిందపొందు, దూరుపడు. శివరా. 3.129. **ఈసువాఁడు** పో.చూ. ఈసుకాఁడు. వి. ఈర్ష్యాళువు. భార. ఉద్యో. 4.221.

**ఈసు**[2] చూ. ఈస[3]. వి. **1.** ఏడికఱ్ఱ, నాగటికాడినీ పడితనూ కలిపే పొడుగుకొయ్య ; **2.** నొగ, గొర్రుగుంటక మొ. వాటి దిండుకు బిగించి కాడిమీద మోపే పొడుగు కొయ్యలు.

**ఈసు**[3] పో.చూ. ఈస[2]. వి. పేనని నార.

**ఈసుకాఁడు** చూ. ఈసు[1].

**ఈసులబండి** చూ. ఈస[3]. వి. రెండు నొగలున్న బండి.

**ఈసులు** రూ.చూ. ఇసుళ్లు. వి. రెక్కల చెదలు. ఆం. భా. 2.95.

**ఈసుళ్లు** రూ.చూ. ఇసుళ్లు. వి. రెక్కల చెదలు.

**ఈసువడు** చూ. ఈసు[1].

**ఈసువాఁడు** చూ. ఈసు[1].

**ఈసెప** చూ. ఈచ[1]. వి. నక్కోరు, నీరసపడటం.

**ఈహీ** రూ.చూ. ఇహిహీ. అవ్య. నిరసన సూచక ధ్వన్యనుకరణం.



**ఉ**¹ తెలుగు వర్ణమాలలో అయిదో వర్ణం. సంవృతమై తాలవ్యేతరమైన ఓష్ఠ్య హ్రస్వ స్వరం. అన్ని ద్రావిడ భాషల్లో ఉంది.

<మూ.ద్రా. *ఉ.

**-ఉ**² 'ఉన్ (ఉ)' యొక్క సపదాంశం; రూ.చూ. ఉన్. అవ్య. ద్రు. 1. అపిశబ్దార్థాన్ని తెల్పుతుంది. (క) సముచ్చయార్థాన్ని తెల్పుతుంది. భార. ఆది. 1.12, భార.ద్రోణ. 3.162. (చ) విరోధాన్ని తెల్పుతుంది : కూడ, సయితం, అయినప్పటికీ మొ. భార. ఆది. 5.58, స్త్రీ. 2.155, శృం.నై. 2.82, విజయ. 3.10; 2. కిమర్థకమైన ఏ, ఎవడు, ఎప్పుడు మొదలైన పదాలకు ఒకడు మొదలైన మరికొన్ని పదాలకు అనుప్రయుక్తమై సర్వార్థాన్నిస్తుంది (అప్పుడు వ్యతిరేకార్థక క్రియలతోటే సంబంధించి వుంటుంది). భార. ఉద్యో. 3.118, హర. 4.49; 3. ఆనంతర్యాన్ని తెల్పుతుంది. భార. ఉద్యో. 3.52, ఆము. 5.79; 4. వాక్యాలంకారంగా వుపయోగపడుతుంది. భార. ఆది. 3.95, కాశీ. 2.86.

**-ఉ**³ కొన్ని ధాతువుల మీద వచ్చే కృత్ప్రత్యయమని వ్యాకర్తలు. ఉదా : ఒప్పు + ఉ = ఒప్పు; పలుకు + ఉ = పలుకు; అంటు + ఉ = అంటు. కాని ఒకే ధాతువు విశేషణంగా, విశేష్యంగా, క్రియగా వర్తించటం ద్రావిడ భాషల్లో సర్వసామాన్యంగా ఉంది.

**-ఉక** ప్రత్య. చిఱుత మొదలైన వాటికి స్వార్థంలో వచ్చే తద్ధిత ప్రత్యయం. చిఱుత- చిఱుతుక, పొలతి- పొలతుక.

పో.చూ. క. -కె. తద్ధిత ప్రత్యయం. ఉక, ఉగ. పుంలింగ నామవాచకాలు కావటానికి చేర్చే అంత్య ప్రత్యయం; పో.చూ. త. -కై. కృత్ప్రత్యయం; చెయ్-కై. మొ.

**ఉకార(ం)** వి. 1. నూలు రంగును పీల్చుకోటానికి తయారు చేసిన మిశ్రం; 2. చౌడు సున్నం కలిపిన నీళ్లు.

ఉ.పార.అర. ఉఖార్. సొగాయి, ఒక రకం ఎఱ్ఱని గుడ్డ.

<ఉ. ఉకార్.

**ఉకారగుంజ** రూ. ఊకరగుంజ. వి. రంగులో తడిపిన నూలు లడీలు పిండటానికి నేలలో పాతిన పొడుగు రాట. అర్థవిపరి.

**ఉకారగుంజ** చూ. ఉకార(ం).

**ఉక్క**¹ చూ. ఉక్కు¹. వి. ఊష్మం, ఉబ్బ, ఉమ్మ. రాజ. చ. 3.146, ప్రబంధ. 78.

క. ఉగ, ఉగి, ఉగె. ఆవిరి, వేడి; తు. ఉర్కెలు. చెమటకాయలు; త. ఉరుక్కమ్. ఉమ్మ; పో.చూ. ఉరుక్కు. వేడివల్ల కరుగు, ద్రవమగు; పో.చూ. మ. ఉరుక్కమ్. కరగటం, బాధ; కోట. ఉక్వెజ్. చెమట పట్టు; పో.చూ. గోం. ఉకుడ్, ఉకుడా. నీరు మరిగే వేడి; ఉక్కుడ్. చెమట; కుఇ. ఉర్ప. అ.క్రి. ఉడుకు, తెర్లు, పొంగు, ప్రసరించు, పైకిచిమ్ము, స్రవించు, చెమట పట్టు. వి. మరిగే స్థితి, ఉడక పెట్టటం, చెమట పట్టటం; పర్జి. ఉర్జ్. చెమటపట్టు; ఉరుకుడ్. చెమట; ఊబమ్. చెమట; ఒల్లా. ఉర్జ్; పో.చూ. మరా. ఉకడ్ణె. ఉడుకు, ఉక్కపోవు, వడదెబ్బతిను; పో.చూ. ప్రా. ఉక్కోల. వేడి, ఉమ్మదం.

<మూ.ద.ద్రా. *ఉరుక్క్- <మూ.ద్రా. *ఉర్-.

**ఉక్కపెట్టు** అ.క్రి. గాలి లేక శరీరం తపించు. **ఉక్కపోత** వి. ఉమ్మదం, ఉక్కపోయటం. **ఉక్కపోయు** అ.క్రి. ఉమ్మదంగా ఉండు; స.క్రి. నానబెట్టు.

**ఉక్క**² చూ. ఉక్కు². వి. ధైర్యశాలి, సమర్థుడు, బలవంతుడు.

**ఉక్క**³ రూ.చూ. ఉముక. వి. ఊక.

**ఉక్కట** రూ. ఉక్కడము¹. వి. గర్వం, నిర్లక్ష్యం, మదం. రాజ. వి. 4.55.

సం. ఉత్కట-. అధికం, తీవ్రం; ప్రా. అ.మా. ఉక్కట-. గట్టి, తీవ్రం, విస్తృతం.

<ప్రా. ఉక్కడ-.

**ఉక్కడం**¹ చూ. ఉగ్గము. వి. జడ్డిగపు పిడత కదలకుండా బిగించే తాడు.

క. ఉక్కడ-. చేంగాడుకు బొక్కెన కట్టటానికి చివర బిగించే సన్నని తాడు.

<క. ఉక్కడ.

**ఉక్కడం**² రూ.చూ. ఉక్కెడ¹. వి. 1. చేత్తో నూలు చుట్టే పని ముట్టు; 2. ముతక నూలు చుట్టే పెద్ద పంటె.

**ఉక్కడగించు** చూ. ఉక్కు².

**ఉక్కడగు** పో.చూ. ఉక్కు².

**ఉక్కడచు** చూ. ఉక్కు².

**ఉక్కడము**¹ రూ.చూ. ఉక్కట. విణ. గొప్ప. సారంగ. చ. 1.82.

**ఉక్కడము**² రూ. ఉక్కళము¹, ఉక్కణము. వి. సేనలకై ఉంచిన కావలి. హర. 2.20.

క. ఉక్కడ. సైనిక శిబిరం చుట్టూ తవ్విన అగడ్త, సేనకై ఉంచిన కావలి, కావలి, కావలివాడు ఉండే చావడి; తు. ఉక్కడ, ఉక్కుడ. రెండు పట్టణాల సరిహద్దులో తనిఖీచేసే చోటు; త. ఉక్కళమ్. రాత్రి కావలా, సేనకై

ఉంచిన కావలి, శిబిరం చుట్టూ వున్న కందకం; మ. ఉక్కళమ్. సేనకై ఉంచిన కావలి.

ఉక్కడీఁడు ఉక్కడంగా వచ్చిన బంటు, సేనకు ముందుగా పంపబడ్డ బంటు. శృం.నై. 7.41.

**ఉక్కడీఁడు** చూ. ఉక్కడము[2].

**ఉక్కణఁగించు** చూ. ఉక్కు[2].

**ఉక్కణఁగు** చూ. ఉక్కు[2].

**ఉక్కణఁచు** చూ. ఉక్కు[2].

**ఉక్కణము** రూ.చూ. ఉక్కడము[2]. వి. రక్షణ, సేనలకై ఉంచిన కావలి. నిర్వ. 5.96.

**ఉక్కపెట్టు** చూ. ఉక్క[1].

**ఉక్కపోఁత** చూ. ఉక్క[1].

**ఉక్కపోయు** చూ. ఉక్క[1].

**ఉక్కఁబట్టు** చూ. ఉక్కు[1].

**ఉక్కరి** చూ. ఉక్కు[2].

**ఉక్కఱు** చూ. ఉక్కు[2].

**ఉక్కలుఁడు** రూ. ఉక్కళుఁడు. చూ. ఉక్క[2]. వి. శౌర్య వంతుడు, ధురంధరుడు, నాయకుడు. హరి. పూ. 4.82.

పో.చూ. సం. ఉత్కలః-. ఉత్కల దేశస్థుడు, వ్యాధుడు; పో.చూ. ప్రా. ఉక్కల <ఉత్కట-. తీవ్రం, తీక్ష్ణం, ప్రబలం; పో.చూ. అ.మా. ఉక్కల. వృద్ధియగు; పా. ఉక్కల. భారవాహకుడు.

<ప్రా. ఉక్కల-.

**ఉక్కళము**[1] రూ.చూ. ఉక్కడము[2]. వి. సేనలకై ఉంచిన కావలి, శత్రువుల రాకను కనిపెట్టటానికి ఉంచిన కావలి. నిర్వ. 5.96, శశా. 4.126.

**ఉక్కళము**[2] వి. పట్టణంలోని రాజమార్గం, పట్టణానికి వెళ్ళే రాజమార్గం, రాచబాట. ఆం.భా. 2.9.

సం. ఉపనిష్కర. రాచబాట; ఉత్కట-. శ్రేష్ఠం, అధికం; ప్రా. ఉక్కడ. విణ. బెడద. విశాలం:

క. ఉక్కడ. ఊరి చివరి భాగం, పట్టణం చివరి భాగం.

<ప్రా. ఉక్కడ-.

**ఉక్కళుఁడు** రూ.చూ. ఉక్కలుఁడు. వి. విశ్వాసఘాతకుడు. అర్థవిపరి.

**ఉక్కస** రూ. ఉక్కసము, ఉక్కిస, ఉక్కిసము. వి. 1. ఆయాసం, శ్వాస బాధ. వేంక.పంచ. 4.848; 2. దగ్గు, కాస రోగం (బ్రౌ.).

సం. ఉత్ + కాస-. తీవ్రమైన దగ్గు; ఉత్కాసనమ్. శ్లేష్మంతో కూడిన దగ్గు; ప్రా. ఉక్కాస. దగ్గు; పా. ఉక్కాస.

క. ఉగరిసు. శ్వాస బాధ.

<ప్రా. ఉక్కాస-.

**ఉక్కసము** రూ.చూ. ఉక్కస. వి. దగ్గు, కాస రోగం.

**ఉక్కాడు** చూ. ఉక్కు[2].

**ఉక్కిదము** వి. పరిహాసం, వేళాకోళం.

క. ఉకుక. గర్వం.

పో.చూ. సం. ఉత్క్షిప్త-. విసరివేయబడిన, తిరస్కృత మైన; ప్రా. ఉక్ఖిత్త. తిరస్కరించబడ్డ.

**ఉక్కిరి** పో.చూ. ఉక్క[1]. వి. కూరలోని ఊట, ఊరుపు.

**ఉక్కిరిబిక్కిరి** చూ. ఉక్క[1]. విణ. ఊపిరిఆడనిది. మృ.వి. 3.43; వి. ఊపిరి ఆడకపోవటం, కలత.

**ఉక్కిరె** వి. పుట్టగొడుగువల్ల వచ్చే మిరపతెగులు (Colletotrichum capsici).

ప్రా. ఉక్కరిఅ. ఖండితం.

**ఉక్కిఱ** చూ. ఉక్కు[1]. వి. ఊపిరాడకపోవటం, శ్వాస బాధ.

**ఉక్కివము** వి. 1. కపటం, మోసం, కపటకృత్యం. భార. సభా. 2.130, శాంతి. 2.359; 2. రహస్యం. భార. సభా. 2.123.

సం. ఉత్క్షిప్త. ఉత్పాటితం, ఉన్మూలితం; ఉత్క్షిప. తిరస్కరించు, విసర్జించు; ప్రా. ఉక్ఖివ-. స.క్రి. ఉత్క్షేపించు; పా. ఉక్ఖేప-; అ.మా. ఉక్ఖేవ-;

క. ఉక్కివ, ఉకెక్కివ. కపటం, వంచన; త. ఉకుక్కమ్. లాలూచీ. దేశ్యమని D.E.D. 484. కిట్టెల్ పు. 211.

**ఉక్కివుఁడు** రూ. ఉక్కిఁడు. చూ. ఉక్కివము. వి. 1. దుష్టుడు, క్రూరుడు. భార.ఉద్యో. 2.174; 2. మూర్ఖుడు, బుద్ధిహీనుడు. భార.ఉద్యో. 4.20; 3. కపటి, మోస గాడు. హరి.పూ. 7.157, సమీర. 4.22.

**ఉక్కిష్టము** వి. అనహ్యస్థితి.

సం. ఉత్కృష్ట-. 1. పైకి లాగబడినది; 2. శ్రేష్ఠం, ప్రశస్తం; 3. మిక్కుటం, అధికం; 4. దున్నబడినది; ప్రా. ఉక్కిట్ఠ-. శ్రేష్ఠం; పా. ఉక్ఖిత్త-. పైకి లాగబడిన, లేవదీయబడిన;

క. ఉత్కృష్ఠ. పైకి లాగబడినది, శ్రేష్ఠం, ప్రశస్తం; త. ఉక్కరుట్టమ్.

<సం. ఉత్కృష్ట-; అర్థవిపరి.

**ఉక్కిస** రూ.చూ. ఉక్కస. వి. 1. పొడిదగ్గు, దగ్గు. భార. ఆది. 3.191, విక్ర. 2.155, ఆం.భా. 2.126; 2. శ్వాస బాధ. భాగ. 4.61.

**ఉక్కిసము** రూ.చూ. ఉక్కస. వి. ఉబ్బసం, పొడిదగ్గు, శ్వాస బాధ.

**ఉక్కిఁడు** రూ.చూ. ఉక్కివుఁడు; బ.వ. ఉక్కిలు. వి. 1. మూర్ఖుడు. నిర్వ. 3.11, హరి.పూ. 1.72; 2. క్రూరుడు. భార.విరా. 3.7.

**ఉక్కు**[1] అ.క్రి. 1. నశించు. చచ్చు. రం.రా.యు. 514 పు. 5 పం.; 2. ఉడుకు, గాలిలేక తపించు. చంద్రా. 3.60; 3. గోలీల ఆటలో గోలీని కదిలించి, మళ్లీ అక్కడే పెట్టు.

పో.చూ. క. ఉక్కు. మరుగు. తెర్లు, పొంగు; ఉర్కు. అధికమగు, ఉబుకు; తు. ఉక్కుని. మరుగు, తెర్లు; ఉర్కురుని. అధికమగు, ఉబుకు, ఎక్కువగా కాగు, మరుగు; త. ఉకుక్కు. కుళ్ళు, కృశించు, పొడియగు, థ్వంసించు, నశించు; ఉకు. కృశించు, నశించు, పడు, చెడు, కరుగు, కలగు, థ్వంసించు; మ. ఉకుక్కక. ప్రారంభమగు, ఒరగు, పాసిపోవు; ఉరుకుక్కక. కరగు; పో.చూ. కుఇ. ఊకుథితుంవ. ఉక్కపెట్టు, ఉక్కిపోవు.

<మూ.ద.ద్రా. *ఉర్-ఉక్కు.

**ఉక్కఁబట్టు** ఉక్కన్+పట్టు. స.క్రి. 1. ఉక్కునట్లు పట్టు, ఊపిరాడకుండా పట్టు. భాగ. 6.199, చంద్రా. 2.77; 2. త్యజించు, విడిచిపెట్టు. కాశి. 3.101. **ఉక్కుమడఁగు** అ.క్రి. ఉక్కడగు, చచ్చు, నమయు. **ఉక్కుమడఁచు**[1] స.క్రి. చంపు. భార.విరా. 4.210.

**ఉక్కు**[2] వి. 1. బలం, ప్రతాపం. భార.ఆది. 6.203, విరా. 5.184 . 2. ఔన్నత్యం, గౌరవం. భార.సభా. 2.231 ; 3. మదం, గర్వం, పొగరు. భార.ఉద్యో. 4.216, హరి. ఉ. 1.86 ; 4. వేగం, వడి. పాండు. 5.218 ; 5. అయస్సారం, కాచి శుద్ధంచేసిన ఇనుము. హరి.ఉ. 1.86, విష్ణుమా. 1.63, సాం.ని.స్థా. 65 ; 6. సాహసం, తెగువ. హరి.ఉ. 1.86; విశే. ఘోరం, దారుణం. జై.భా. 3.102.

క. ఉర్కు, ఉక్కు. పొంగు, గర్వం, శక్తి, పరాక్రమం ; తు. ఉర్కరుని, ఉర్కుని. లేచు, పొంగు ; కొడ. ఉక్క్-. తెర్లిపోవు, పొంగు ; త. ఉరుక్కు. అయస్సారం; స.క్రి. కరగు ; విశే. కరిగించినది ; మ. ఉక్కు. బలం, అయస్సారం, కరగు.

<ప్రా.తె. ఉర్క్<మూ.ద.ద్రా. *ఉర్-ఉర్క్< మూ.ద్రా. *ఉర్.

**ఉక్కడఁగించు** ఉక్కు[2]+అడఁగించు. రూ. ఉక్కడఁగు, ఉక్కణఁగించు. స.క్రి. 1. ఉక్కడచు, నిస్సత్త్వం చేయు. భార.ఆది. 1.7 ; 2. చంపు. ప్రబోధ. 1.56 ; 3. నాశనంచేయు. **ఉక్కడఁగు** ఉక్కు[2]+అడఁగు ; రూ. ఉక్కణఁగు. అ.క్రి. బలహీనమగు, నిస్సత్త్వమగు. భార. విరా. 1.212. **ఉక్కడఁచు** ఉక్కు[2]+అడఁచు ; రూ. ఉక్కణఁచు. స.క్రి. 1. నిస్సత్త్వంచేయు. భార.విరా. 2.83; 2. చంపు. మార్క. 6.103 ; 3. నాశనంచేయు. భాగ. 3.33. **ఉక్కణఁగించు** రూ.చూ. ఉక్కడఁగించు స.క్రి. చంపు. వి.పు. 1.13, సీతా.వి. 1.65. **ఉక్కణఁగు** రూ. చూ. ఉక్కడఁగు. అ.క్రి. బలహీనమగు, నిస్సత్త్వమగు, **ఉక్కణఁచు** రూ.చూ. ఉక్కడఁచు. స.క్రి. చంపు. రుక్మా. 5.75. **ఉక్కరి** వి. 1. శౌర్యవంతుడు. అచ్చ.రా.యు. 314 ; 2. ధైర్యశాలి. సాం.ని.మాన. 9. **ఉక్కఱు** ఉక్కు[2]+అఱు. అ.క్రి. 1. దుర్బలమగు, నిస్సత్త్వమగు. భార.అర. 4.12, ఉద్యో. 3.360 ; 2. బెదరు, భయపడు. భార.విరా. 5.143. **ఉక్కాడు** ఉక్కు+ఆడు. అ. క్రి. బలపరాక్రమాలు చూపు. భార.శాంతి. 3.25. **ఉక్కుకడ్డీ** .వి. ఉక్కు కరిగించి పోసిన కడ్డీ. **ఉక్కుకమ్మి** వి. ఉక్కు కరగి పోసిన కడ్డీ. **ఉక్కుకాడ** వి. ఉక్కు కరగించి పోసిన కడ్డీ. **ఉక్కుతీఁగ** వి. వీణ మొదలైనవానికి వేసే ఉక్కు తీగె. **ఉక్కుతునియ** వి. సాహసి, శూరుడు, ఉక్కుముక్కవంటివాడు. భార.ఉద్యో. 2.176. **ఉక్కుతునుక** రూ. ఉక్కుతునక. వి. సాహసి, శూరుడు. **ఉక్కుతున్క** రూ.చూ. ఉక్కుతునుక. వి. సాహసి, శూరుడు. విజయ. 1.10. **ఉక్కునీరు** వి. ఉక్కు కరిగిన ద్రవం. భాగ. 5. 2.157. **ఉక్కుమడఁగు** వి. 1. దుర్బలమగు, నిస్సత్త్వమగు. భార.ఉద్యో. 5.61 ; 2. చచ్చు. **ఉక్కుమడఁచు** స.క్రి. ఉక్కడగజేయు, చంపు. భార.ఉద్యో. 4.216. **ఉక్కుమనిషి** వి. ఎవరికి లొంగనివాడు. వ్య. 'ఉక్కువంటి మనిషి.' **ఉక్కుమిగులు** అ.క్రి. ప్రబలు, అతిశయించు. భార.భీష్మ. 1.138. **ఉక్కుమీఱు** అ.క్రి. ప్రబలు, అతిశయించు. భాగ. 6.260, ఉ.రా. 3.159. **ఉక్కుముక్క** వి. అయస్సారపు ముక్క. **ఉక్కుమెఱయు**. అ.క్రి. ప్రబలు, అతిశయిల్లు. భా.రా.అర. 1.228. **ఉక్కుమున్నము** వి. లోహభస్మం, తుప్పు. **ఉక్కెక్కు** అ.క్రి. బలిష్ఠమగు, దృఢమగు. కాశి. 4.74.

**ఉక్కు**[3] రూ.చూ. హుక్కు. వి. గడ్డగోరు, కిటికీరెక్కలు గాలికి వాలకుండా పట్టి ఉంచే పరికరం.

ఇం. *Hook*. కొక్కెం.

<ఇం. Hook.

**ఉక్కుకడ్డీ** చూ. ఉక్కు[2].

**ఉక్కుకమ్మి** చూ. ఉక్కు[2].

**ఉక్కుకాడ** చూ. ఉక్కు[2].

**ఉక్కుతీఁగ** చూ. ఉక్కు[2].

**ఉక్కుతునియ** చూ. ఉక్కు[2].

**ఉక్కుతునక** చూ. ఉక్కు[2].

**ఉక్కుతున్క** చూ. ఉక్కు[2].

**ఉక్కునీరు** చూ. ఉక్కు[2].

**ఉక్కుమడఁగు** చూ. ఉక్కు[2].

**ఉక్కుమడఁచు** చూ. ఉక్కు[2].

**ఉక్కుమనిషి** చూ. ఉక్కు[2].

**ఉక్కుమిగులు** చూ. ఉక్కు[2].

**ఉక్కుమీఱు** చూ. ఉక్కు[2].

**ఉక్కుముక్క** చూ. ఉక్కు[2].

**ఉక్కుమెఱయు** చూ. ఉక్కు[2].

**ఉక్కురోషము** రూ. ఉక్కురోసము, ఉక్రోషము. వి. అతిగర్వం, అతికోపం.

సం. ఉత్క్రోశ-. కూత, అరుపు, పెద్దధ్వని, చాటింపు.

<సం. ఉత్క్రోశ- ; ఉక్కు[2]+రోషము. మిశ్రమ. అని భ్రాంతి.

**ఉక్కురోసము** రూ.చూ. ఉక్కురోషము.

**ఉక్కుమున్నము** చూ. ఉక్కు[2].

**ఉక్కెక్కు** చూ. ఉక్కు[2].

**ఉక్కెడ**[1] రూ. ఉక్కడం[2]. వి. నూలు వడికే కదురుకున్న నలచదరపు దారపుబంతి.

క. ఉరి<హురి. పురిపెట్టు.

**ఉక్కెడ**[2] రూ.చూ. ఉక్కెఱ. వి. బెల్లం, పిండి కలిపి చేసిన భక్ష్య విశేషం.

**ఉక్కెడం** వి. బిత్తరుకాడు.

**ఉక్కెఱ** రూ. ఉక్కెడ[3]. వి. బెల్లం, పిండి కలిపి చేసిన భక్ష్య విశేషం. కాశీ. 7.185, సుదంతా. 2.125, అప్ప. 2.167.

సం. ఉత్కరికా. పాలు, బెల్లం, నెయ్యి కలిపి తయారు చేసిన ఒక రకం తీపి తినుబండారం ; ప్రా. ఉక్కరియా, ఉత్కరికా ; అ. మా. ఉక్కేర ; శౌర ఉక్కర, ఉక్కేర ; త. ఉక్కారి, ఉక్కారై, ఉక్కళి.

<ప్రా. ఉక్కరియా.

**ఉక్కోలు** క్రి. విశ. ఒక్కుమ్మడి.

**ఉక్కోషము** రూ.చూ. ఉక్కురోషము.

**ఉగ** వి. **1.** బుద్ధి ; **2.** ఊహ.

నం. ఊహ-. వితర్కం, పరీక్షణం, ఆరోపణం ; ప్రా. ఊహ.

<నం. ఊహ-.

**ఉగము**[1] వి. **1.** ఆయువు, యుగం, పురుషాంతరం, రాఘవ. 1.25 ; **2.** ఊపిరి.

నం. *యుగమ్.* ఒక జాతి, తరం, కృతాది ; పా. *యుగం*. పురుషాంతరం, కృతాది.

*క. ఉగ, జుగ ; తు. ఉగ ; త. ఉకం.*

<నం. యుగ-.

**ఉగము**[2] పో.చూ. ఉక్కన. వి. నిట్టూర్పు.

*క. ఉగరిసు.* శ్వాసబాధ.

**ఉగాది** వి. చాంద్రమాన సంవత్సరాది, చైత్రమాసంలో మొదటి దినం. పరమ. ష. 197.

నం. *యుగాది.* యుగారంభం, సృష్ట్యాది ;

*క. ఉగాది.* యుగారంభం, సృష్ట్యాది, సంవత్సరాది ; *తు. ఉగాది.* సంవత్సరాది ; *త. యుకాతి.* యుగారంభం, చాంద్రమాన సంవత్సరాది.

<నం. యుగాది. అర్థవిపరి.

**ఉగాదిపచ్చడి** వి. తెలుగు సంవత్సరాదినాడు వేపపువ్వు, మామిడికాయ ముక్కలు, చింతపండు పులుసు మొ. వాటిని కలిపిచేసే పచ్చడి. **ఉగాదిపండుగ** వి. సంవత్సరాదిపండుగ. **ఉగాదిసంచిక** వి. సంవత్సరాదినాడు ప్రత్యేకంగా వెలువడే పత్రిక. **ఉగాదిసొంగ్యము** వి. ఉగాదిసారె. **ఉగాదిసారె** వి. పెళ్ళయిన స్త్రీకి మొట్టమొదటిసారిగా పెట్టే సారె.

**ఉగాదిపచ్చడి** చూ. ఉగాది.

**ఉగాదిపండుగ** చూ. ఉగాది.

**ఉగాదిసంచిక** చూ. ఉగాది.

**ఉగాదిసొంగ్యము** చూ. ఉగాది.

**ఉగాదిసారె** చూ. ఉగాది.

**ఉగి** చూ. ఉగియు. వి. **1.** ఊట ; **2.** ఊట.

**ఉగియు** చూ. ఉగ్గు[3]. అ.క్రి. స్రవించు, బొట్లు బొట్లుగాపడు, ప్రవహించు. పండి.చ. 4.254 వ.

**ఉగువు** పో.చూ. ఉక్కు[2]. వి. దృఢత, గట్టితనం, నిబ్బరం. వేంక.పంచ. 256.

**ఉగ్గ** పో.చూ. ఉగ్గము. విశ. గట్టి, బిగువైన.

**ఉగ్గఁగట్టు** స.క్రి. బిగించు, బిగియగట్టు. వి.పు. 7.135. **ఉగ్గపోసికొను** స.క్రి. నిశ్చయించుకొను. **ఉగ్గఁబట్టు** స.క్రి. **1.** బిగబట్టు. రాజ.వి. 5.52 ; **2.** నిరోధించు. కాశ. 3.101 ; **ఉగ్గించు**[1] స.క్రి. దట్టంగా నేయు, తరచుగా నేయు.

**ఉగ్గఁగట్టు** చూ. ఉగ్గ.

**ఉగ్గడ** రూ. ఉగ్గడి[1], ఉగ్గడు, ఉగ్గుడు. వి. హద్దు.

*క. ఉక్కడ.* సరిహద్దు, పొలిమేర.

<క. ఉక్కడ.

**ఉగ్గడన** వి. ప్రకటనం, పైకి చెప్పటం. భార.అర. 7.269.

నం. *ఉద్ఘాటన-.* తెరవటం, వెల్లడించటం ; ప్రా. *ఉగ్ఘాడణ-* ; అ.మా. *ఉగ్ఘాడణమ్* ; కు. *ఉఘారనో* ; నే. *ఉఘార్ను.* స.క్రి. విప్పు, వెల్లడించు ; బెం. *ఉఘాన* ; హిం. *ఉఘార్నా* ; పం. *ఉఘార్నా* ; సిం. *ఉఘారణు* ; గు. *ఉఘాడ్వు* ; మరా. *ఉఘాడ్నే* ; సింహ. *ఉగులయు-* ; పార. *ఉగ్ఘాటెతి.* విప్పటం.

<ప్రా. ఉగ్ఘాడణ-.

**ఉగ్గడి**[1] రూ.చూ. ఉగ్గడ. వి. మేర, మర్యాద. ఆం. భా. 2.191.

**ఉగ్గడి**[2] వి. రాళ్ల వరసల మధ్య సందు.

**ఉగ్గడించు** రూ. ఉగ్గళించు, చూ. ఉగ్గడన. స.క్రి. **1.** ప్రకటించు, తెలుపు, చెప్పు. భార. విరా. 1.180, శుక. 1.89 ; **2.** స్తుతించు, ప్రశంసించు. భార. ఉద్యో. 3.212, శృం. నై. 8.85 ; **3.** (మంత్రాదులను) ఉచ్చరించు, పఠించు. శృం.నై. 4.126 ; **4.** నాట్యంలో లయను సూచించే శబ్దాలను పలుకు. శశా. 3.21 ; అ.క్రి. ధ్వనించు, మ్రోయు. పాండు. 2.32.

*క. ఉగ్గడిసు.* నాట్యంలో లయ సూచక శబ్దాలను మాటి మాటికి ఉచ్చరించు ; కేకవేయు ; ప్రతిధ్వనింప జేయు, వెల్లడించు ; *తు. ఉగ్గుని.* గొణుగు.

దేశ్యపదమని D.E.D. 489.

**ఉగ్గడింపు** చూ. ఉగ్గడన. వి. పొగడ్త.

**ఉగ్గడు** రూ.చూ. ఉగ్గడ. వి. హద్దు, మేర.

**ఉగ్గడువు** వి. ఉత్కటం, అధికం. భార. ద్రోణ. 5.195.

నం. *ఉద్ఘట్.* తెరచు, విప్పు, వెల్లడించు ; *ఉద్గాఢ-.* అధికం, మిక్కుటం ; ప్రా. *ఉగ్ఘడ-.* తెరచు, విప్పు ; అ.మా. *ఉగ్ఘాడణ.* తెరవడం ; *ఉగ్గాఢ.* తెరచిన.

*క. ఉగ్గటు, ఉగ్గడ.* అధికం, బాధ, కష్టం.

<ప్రా. ఉగ్గడ- ; ఉత్కట శబ్దభవమని కిట్టెల్.

**ఉగ్గపోసికొను** చూ. ఉగ్గ.

**ఉగ్గము** వి. **1.** చేతితో పట్టుకొని పోవటానికి అనుకూలంగా కుండ మొ. వాటి మూతికి కట్టే తాడు. పరమ. వి. 5.28 ; **2.** పాలు తీయడానికి ఆవు కాళ్లకు వేసే బంధం ; **3.** మడత, చిక్కు ; **4.** ఉరి, అపాయం ; **5.** ప్రాణాంతకమైన కష్టం ; **6.** తరిమెన తాడు అమర్చే చక్రం.

నం. *ఉద్గ్రహ-.* పైకెత్తు, పైనుంచు, స్థాపించు ; *ఉద్గ్రాహ-.* పైకి తీసుకుపోవటం ; ప్రా. *ఉగ్గాహ-.* స.క్రి. పైకి తీసుకుపోవు, పైకెత్తు ; అ.మా. *ఉగ్గాహియ, ఉగ్గాహిఅ* <ఉద్గ్రాహిత. పైకెత్తబడినది.

*క. ఉక్కడ.* వేంకాడుకు బొక్కెన కట్టటానికి చివర బిగించే సన్నని తాడు ; *ఉగ్గ.* పట్టుకోటానికి వీలుగా దేనికైనా కట్టిన దారం లేదా తాడు ; *తు. ఉగ్గి.* కుండ మొ. వాటి ఉగ్గం, పలుపు ; *త. ఉక్కమ్.* (<క. లేదా తె.) పట్టుకోటానికి వీలుగా దేనికైనా కట్టిన దారం లేదా తాడు ; పర్జి. *ఉట్క, ఉత్క.* పగ్గం ; త.మ.క. *ఉరి.* ఉట్టి.

<మూ.ద్రా. *ఉర్- క్-.

**ఉగ్గఁబట్టు** చూ. ఉగ్గ.

**ఉగ్గళించు** రూ.చూ. ఉగ్గడించు. స.క్రి. **1.** గౌరవించు,

కౌగిలించు. గంధ. 59; **2.** పెంచు, పెద్దదిచేయు. అప్ప. **4.149**; అ.క్రి. నర్తించు.

**ఉగ్గళింపు** చూ. ఉగ్గళించు. వి. **1.** వాగ్ధాటి; **2.** పొగడ్త; **3.** నాట్యానుగుణ శబ్దగుంభన.

**ఉగ్గాడు** చూ. ఉగ్గు[3].

**ఉగ్గించు[1]** చూ. ఉగ్గ.

**ఉగ్గించు[2]** పో.చూ. అగ్గించు, ఉగ్గడించు. స.క్రి. భూషించు, ముఖస్తుతిచేయు.

**ఉగ్గిలి** చూ. ఉగ్గము. వి. చేతితో పట్టుకొని పోవటానికి అనుకూలంగా కుండ మొ. వాటి మూతికి కట్టే తాడు.

**ఉగ్గిలిపోయు** అ.క్రి. ఉండ్రాళ్లు మొదలైన పిండి వంటలు చేయటానికి ముందుగా, వరిపిండిని వేణ్ణీళ్ళతో తడిపి ముద్దగాచేసి కొంచెంసేపు ఉంచు.

**ఉగ్గీలబల్ల** పో.చూ. ఉగ్గిలి, ఒగ్గులబల్ల. వి. ఒగ్గులపట్టె; మరామ కట్టుబడిలో పడుగు పోగులు దూర్చే బెజ్జాలుగల రేకుముక్కలు, ఉంగరాలు బిగించిన కొయ్యపట్టె.

**ఉగ్గు[1]** వి. **1.** చనుపాలతోగాని నేతితోగాని రంగరించి వేడిచేసి చిన్నపిల్లలకు పోసే ఆముదం. యయా. **4.25**; **2.** పసిపిల్లలు చేసే అర్థంలేని ధ్వనులు. కావ్యా. **2.68.**

క. ఉగ్గు. అర్థంలేని ధ్వనులు; ధ్వన్యనుకరణం.

**ఉగ్గుఁబాలతోడ** క్రి.విశ. చిన్ననాటి నుంచి, పుట్టినప్పటి నుంచి; ఉగ్గుపాలు త్రాగేనాటి నుంచి.

**ఉగ్గు[2]** పో.చూ. నొక్కు. వి. ముడత, వంపు. కకుత్స్థ. **1.209**; విశ. వంకర. దశా. **4.107.**

త. ఉగు. శిథిలమగు, రాలు.

**ఉగ్గులు** వి. ముడతలుపడ్డ పడుగు పోగులు. **ఉగ్గులువాఱు** ఉగ్గులు+వాఱు. అ.క్రి. మెలిపడు, తబ్బిబ్బగు. **ఉగ్గువడు** ఉగ్గు(లు)+పడు. అ.క్రి. **1.** నొక్కుపడు, ముడతపడు. కవిక. **5.110**; **2.** క్షీణించు, చెడు. కకుత్స్థ. **1.209.**

**ఉగ్గు[3]** స.క్రి. వెదజల్లు, చిలకరించు.

క. ఉగ్గు. చల్లు; తు. ఉగిపుణ, గుప్పుణి, గుప్పుణె. పారబోయు, చల్లు; త. ఉకు. చల్లు, చిమ్ము, చిలకరించు.

<క. ఉగ్గు.

**ఉగ్గాడు** స.క్రి. పాడుచేయు, నాశనంచేయు.

**ఉగ్గు[4]** పో.చూ. ఉగ్గము. వి. **1.** జడ్డిగపు తాళ్లు బిగించటానికి అమర్చిన కొయ్య పలక; **2.** పొడుగాటి బొంగుకు మధ్యలో తడికనుగాని బుట్టనుగాని వేలాడదీసి మోతకు వాడే సాధనం, కోలి.

బహుశః ఉగ్గము నుంచి పశ్చాన్నిర్మాణంవల్ల ఏర్పడ్డ రూపం కావచ్చు.

**ఉగ్గుడు** రూ.చూ. ఉగ్గడ. వి. మేర, మర్యాద.

**ఉగ్గుఁబాలతోడ** చూ. ఉగ్గు[1].

**ఉగ్గులు** చూ. ఉగ్గు[2].

**ఉగ్గులువాఱు** చూ. ఉగ్గు[2].

**ఉగ్గువడు** చూ. ఉగ్గు[2].

**ఉగ్గెత్తు** క్రి.విశ. **1.** పూర్తిగా; **2.** అకస్మాత్తుగా.

ఒక్కెత్తు (ఒకేసారి) యొక్క వికృత రూపం కావచ్చు.

**ఉగ్మలి[1]** వి. **1.** స్త్రీ. బాల. విరా. **2.114**, నిర్వ. **8.75**; **2.** గృహిణి, ఇల్లాలు. కాశీ. **7.135**; **3.** స్నేహితురాలు. కాళిండి. **6.18.**

సం. యుగ్మ-. జంట, జోడు, దంపతులు, మిథునరాశి, యుగం; యుగా. జంట, దంపతులు, ఒకజాతి మనుష్యులు, పురుషాంతరం, యుగం;

క. జూగమ, జూగుమ. జంట, దంపతులు; పో.చూ. త. ఉకమకళ్ . భూదేవి.

<సం. యుగ్మ-+ప్రా.తె. *అల్ <మూ.ద్రా. *అళ్.

**ఉగ్మలి[2]** చూ. ఉగ్గము. వి. కుండలు మొ. పెట్టి వేలాడదీయటానికి అనువుగా తయారుచేసిన వల, ఉట్టి.

**ఉగ్రాణగాఁడు** చూ. ఉగ్రాణము.

**ఉగ్రాణంకొట్టడి** చూ. ఉగ్రాణము.

**ఉగ్రాణము** వి. **1.** సామగ్రులుంచేగది, కొట్టు. విప్ర. **5.6**; **2.** ధనాగారం. జం.శే. **54.**

మరా. ఉగ్రాణమ్. సామానులుంచుకొనే కొట్టు.

క. ఉగ్రాణ. కొట్టు, ధాన్యంకొట్టు, ధనాగారం; తు. ఉగ్రాణ; త. ఉక్కరాణమ్. సరకుల కొట్టు, ధాన్యం కొట్టు.

<మరా. ఉగ్రాణమ్.

**ఉగ్రాణగాఁడు** వి. కొట్టుమీదపెత్తనంగలవాడు. వేఙ. 46. క. ఉగ్రాణిక, ఉగ్రాణి. కొట్టుమీద పెత్తనం గలవాడు, లేక అతని సేవకుడు, ఊరిపెట్టి; తు. ఉగ్రాణి. ఊరిపెట్టి; త. ఉక్కరాణ-క్-కారన్. ఆహారపదార్థాల విషయం చూసేవాడు, కొట్టుమీద పెత్తనం గలవాడు; ఉక్కరాణి. **ఉగ్రాణంకొట్టడి** వి. సరుకులు పెట్టుకొనే గది.

**ఉంకించు** రూ.చూ. ఊంకించు. అ.క్రి. **1.** ఆరంభించు, మొదలిడు. భార.విరా. **3.55**; **2.** సిద్ధముగానుండు, సిద్ధమగు. భార.సౌప్తి. **1.212**; **3.** యత్నించు, పూను. పారి. **1.119**, విజయ. **2.27**; **4.** దూకేటప్పుడు గాలి బిగబట్టి కాలు నిలదొక్కుకొను. ఆము. **1.59.**

**ఉంకింపు** చూ. ఉంకించు. వి. **1.** ప్రయత్నం, పూనిక; **2.** విజృంభణం; **3.** కుప్పించటం, గంతు.

**ఉంకు** అ.క్రి. **1.** పైకెగయు. ఉ.హ. **4.28**; **2.** భయపడు. దశా. **4.142**; **3.** పూను; వి. లోపం. వేమన. **2861.**

**ఉంకుచెండు** వి. బాగా ఎగిరే స్వభావంగల ఒక రకం బంతి. ఉ.హ. 4.28. **ఉంకుటుంగరము** ఉంకు+ఉంగరము. వి. ఒప్పందపుటుంగరం, వివాహానికి ముందు వధూవరులు పరస్పరం సమ్మతించి మార్చుకొనే ఉంగరం. **ఉంకెక్కు** ఉంకు+ఎక్కు. అ.క్రి. జంకు, వెనుదీయు. విజ్ఞా. 3.107.

**ఉంకుచెండు** చూ. ఉంకు.

**ఉంకుటుంగరము** చూ. ఉంకు.

**ఉంకుడు** పో.చూ. ఉంకువ[1]. వి. కట్నం.

**ఉంకువ[1]** రూ. ఉంకువము, ఉంకుపు. వి. కన్యాశుల్కం, ఓలి. భార.ఆది. **8.144**, కు.సం. **7.972**, దశకు. **6.51**, విక్ర. **8.104**, మను. **2.43.**

సం. శుల్క-. వెల, మూల్యం, బహుమతి, సుంకం,

పన్ను, కన్యాశుల్కం ; ప్రా. సుంక-. మూల్యం, పన్ను. కన్యాశుల్కం ; పా. సుంక- ; సుంకియ ;

క. సుంక. సుంకం ; తు. సుంక ; త. చుంకమ్, శుల్కు, చుల్కం. కన్యాశుల్కం ; మ. చుంకం. కన్యాశుల్కం, బహుమతి.

< ప్రా. సుంక- ; దేశ్యమని శ.ర.

**ఉంకువ**[2] రూ.చూ. ఉనుకువ. వి. నివాసస్థలం, ఇల్లు. పద్మ. 2.217.

**ఉంకువ**[3] రూ.చూ. ఊంకువ[1]. వి. స్థిరత్వం, దృఢత్వం. భార. విరా. 3.95.

**ఉంకువము** రూ.చూ. ఉంకువ[1]. వి. కానుక, బహుమతి. ధనాభి. 2.4.

**ఉంకువు** రూ.చూ. ఉంకువ[1]. వి. కట్నం, కన్యాశుల్కం. భార. ఉద్యో. 3.316.

**ఉంకెక్కు** చూ. ఉంకు.

**ఉంగ**[1] రూ. ఉంగె. అవ్య. పసిపిల్లల అవ్యక్త ధ్వని, ధ్వన్యనుకరణశబ్దం. సారంగ.చ. 1.49.

త. ఉంకా.

**ఉంగుంగ** ఉంగ + ఉంగ. అవ్య. పసిపిల్లల అవ్యక్త ధ్వని. సారంగ.చ. 1.49.

**ఉంగ**[2] చూ. ఉగ్గు. వి. పసిపిల్లలకు చనుబాలు, ఆముదం కలిపి యిచ్చే మిశ్రమం. సారంగ.చ. 1.49.

ఉగ్గు పోసేటప్పుడు పిల్లలు చేసే 'ఉంగ' అనే ధ్వని నుంచి ఈ శబ్దం ఏర్పడి వుండవచ్చు.

**ఉంగటము** రూ.చూ. ఉంగుటము. వి. కాలి బొటనవేలు దూర్చుకోటానికి వీలుగా చెప్పుకు అమర్చిన ఉంగరం.

**ఉంగడి** రూ.చూ. ఉంగిడి. వి. నాము, ఆముదపాకు తినటం వల్ల పశువులకు కలిగే ఒక వ్యాధి.

**ఉంగరంవంపు** చూ. ఉంగరము.

**ఉంగరపువెంట్రుకలు** చూ. ఉంగరము.

**ఉంగరపువేలు** చూ. ఉంగరము.

**ఉంగరపుౖవేలు** చూ. ఉంగరము.

**ఉంగరము** రూ. ఉంగ్రము. **1.** ఉంగరంవలె ఉండే గుండ్రని వస్తువు. శృం.నై. 6.108 ; **2.** అంగుళీయకం. హర. 5.44 ; **3.** తోరణాలు కట్టేందుకు ద్వారబంధానికి తగిలించిన కొండి ; **4.** జేపు, తిత్తిలోకి పూర్తిగా పోకుండా చివరి భాగాన్ని ఆపే కొక్కెం. అర్థవిపరి. ; **5.** మోట బొక్కెనపై మోకు తగిలించే ఇనపరింగు. అర్థవిపరి.

సం. అంగులీయక-. వేలికి సంబంధించినది ; అంగులి-. అంగురీ ; ప్రా. అంగులిఅ, అంగులిజ్జక/-గ. ఉంగరం ; అంగులీ ; అ.మా. అంగులిజ్జగమ్. ఉంగరం ; పా. అంగులెయ్యక. వేలికి పెట్టుకునే ఆభరణం, వేలిఉంగరం, అంగులీ ; కా. ఒంగుజు ; షంగ్రి ; హిం. ఉంగలీ ; పం. ఉంగల్ ;

క. ఉంగర, ఉంగుర-. ఉంగరం ; తు. ఉంగిల ; పో.చూ. కుఇ. ఉంగుళి, వి. బ.వ. ; ఉంగులకి. గోరు ; కొలా. ఒంగరమ్, ఒంగెరమ్ ; ఒంగెరా, ఉంగెరమ్. ఉంగరం.

< సం. అంగురీ-.

**ఉంగరంవంపు** వి. గుండ్రటి వంపు. **ఉంగరాలచేయి** వి. అధికారంగల చేయి ; వ్య. ఉంగరాలతో మొట్టే చేయి. **ఉంగరపువెంట్రుకలు** వి. గుండ్రంగా మెలికలు తిరిగిన వెంట్రుకలు, ఉంగరాల జుట్టు. వ్య. ఉంగరాలవంటి వెంట్రుకలు. **ఉంగరపువేలు** రూ.చూ. ఉంగరపుౖవేలు. వి. ఉంగరం పెట్టుకునే వేలు. చిటికెనవేలి పక్కవేలు, అనామిక. **ఉంగరపువ్రేలు** రూ. ఉంగరపువేలు, ఉంగరముౖవేలు. వి. ఉంగరం పెట్టుకొనే వేలు. చిటికెనవేలి పక్కవేలు. అనామిక. శుక.చ. 2.412. **ఉంగరముౖవేలు** రూ.చూ. ఉంగరపుౖవేలు. వి. ఉంగరం పెట్టుకునే వేలు. అనామిక. శుక చ. 2.413. **ఉంగరాలతెగులు** వి. ఆకులు చుట్టుకుపోయే ఉల్లి (ఎఱ్ఱ) గడ్డ తెగులు. **ఉంగరాలపిడెము** వి. కాకిబీర, అల్లుకునే ఒక రకం తీగ (Linaceae hagonia mystax).

**ఉంగరముౖవేలు** చూ. ఉంగరము.

**ఉంగరాలచేయి** చూ. ఉంగరము.

**ఉంగరాలతెగులు** చూ. ఉంగరము.

**ఉంగరాలపిడెము** చూ. ఉంగరము.

**ఉంగిడి** రూ. ఉంగడి ; చూ. అంగిలి. వి. **1.** నాము, ఆముదపాకులు, మొ. తినటంవల్ల వచ్చే పశురోగం ; వణుకు, కడుపుబ్బు, ఊపిరి పీల్చుకోటంలో బాధ ఉంటాయి. భార. విరా. 1.286, ఆం.భా. 2.125 ; **2.** ఊపిరాడని స్థితి.

క. అంగళ, అంగుళ, అంగుళె. ఊపిరి పీల్చుకోటంలో మింగటంలో బాధను కల్గించే అంగిటి రోగం.

**ఉంగిడిగొను** ఉంగిడి + కొను. అ.క్రి. ఉంగిడి జబ్బు కలది అగు. కాశీ. 2.138.

**ఉంగిడిగొను** చూ. ఉంగిడి.

**ఉంగుంగ** చూ. ఉంగ[1].

**ఉంగుటము** రూ. ఉంగటము. వి. కాలి బొటన వేలు. కు.సం. 6.800, నిర్వ. 3.49, వరాహ. 74.

సం. అంగుష్ఠ-. బొటన వేలు ; ప్రా. అంకుట్ఠ ; అ.మా. అంగుట్ఠ, అంగుట్ఠయ ; పా. అంగుట్ఠ, అంగుట్ఠక ; కుమా. ఔంఠొ ; సింహ. అంగుట ;

క. ఉంగుట, ఉంగుష్ఠ, అంగుట. బొటన వేలు, బొటన వేలెడుమేర ; తు. ఉంగుష్ఠ, ఉంగుష్ఠ. బొటన వేలు ; త. అంకుట్ఠమ్ ; మ. అంగుష్ఠమ్ ; కుఇ. ఉంగులి, ఉంగులక. గోరు.

< ప్రా. అంగుట్ఠ-.

**ఉంగె** రూ.చూ. ఉంగ[1]. అవ్య. పసిపిల్లలు ఏడ్చేటప్పుడు చేసే అవ్యక్త ధ్వని. ధ్వన్యనుకరణ శబ్దం. పరమ. 1.125.

**ఉంగ్రము** రూ.చూ. ఉంగరము. వి. **1.** గుండ్రని వస్తువు ; **2.** అంగుళీయకం.

**ఉచితము** విశ. ఊరకే ఇచ్చేది, ధర్మంగా ఇచ్చేది.

సం. ఉచిత-. యుక్తం, తగినది, రమ్యం, అనుకూలం, పరిచితం ; ప్రా. ఉచియ. యోగ్యం, తగినది ;

క. ఉచిత. బహుమతి, పారితోషికం.

< సం. ఉచిత- ; అర్థవిపరి.

**ఉచితముగా** ఉచితము+కాన్. క్రి.విశే. ఊరక, బహుమానంగా, ఖరీదు లేకుండా.

**ఉచితముగా** చూ. ఉచితము.

**ఉచిం్త** రూ.చూ. ఉచ్చింత. వి. ఉచ్చింత చెట్టు.

**ఉచుకరించు** ధ్వన్యను. అ.క్రి. 'సిగ్గు సిగ్గు' అను, ఉచుక్కు మను.

**ఉచుకరింపు** వి. అనాదర, విషాద సూచక ధ్వన్యనుకరణం; ఉచుక్కుమనటం. చంద్రాంగ. 5.152.

**ఉచుకరింపు** చూ. ఉచుకరించు.

**ఉచుక్కు** అవ్య. అనాదర, విషాద సూచక ధ్వన్యనుకరణం. దశా. 1.57, శుక. 3.166; రాజ. వి. 1.76.

**ఉచ్చ** వి. మూత్రం. వేమన. 1030.

క. ఉచ్చె. మూత్రం; కొడ. ఉచ్చె. మూత్రం; తు. ఉర్చుని. దొడ్డికి వెళ్ళు; ఉర్చాటు. ప్రేగుల సడలింపు; కోట. ఉచ్. మూత్రం; పో.చూ. గోం. ఉడ్కానా. ఉచ్చపోయు; ఉడ్క్. ఉచ్చ;

పో.చూ. సం. ఉచ్చార-: ప్రా. ఉచ్చర-: పా. ఉచ్చార- (ఉద్+చర్); అ.మా. ఉచ్చార-.

<మూ.ద్రా. *ఉర్చ్-.

**ఉచ్చకల్లు** వి. మూత్రనాళంలో రాయి అడ్డుపడే ఉష్ణవ్యాధి. **ఉచ్చగిత్త** వి. 1. ఆవుల మూత్రం వాసన చూస్తూ వాటిని వెంబడించే కోడెదూడ; 2. స్త్రీలోలుడు. **ఉచ్చచెలమ** వి. మూత్రాశయం, గర్భాశయం. వేమన. 1029. **ఉచ్చపోయు** అ.క్రి. మూత్ర విసర్జనచేయు. **ఉచ్చబుడ్డ** వి. 1. మూత్రాశయం; 2. ప్రసవకాలంలో శిశువుతో వచ్చే నీటి తిత్తి. **ఉచ్చమల్లి** వి. 1. వ్యభిచారిణి, నగ్నిక. ఉ.హ. 6.182; 2. రోతపుట్టించే స్త్రీ. విక్ర. 7.124, శుక. 3.18.

క. ఉచ్చెమల్లి. వ్యభిచారిణి; పో.చూ. త. మల్లి. లావుపాటి ఆడుది.

**ఉచ్చకల్లు** చూ. ఉచ్చ.

**ఉచ్చగిత్త** చూ. ఉచ్చ.

**ఉచ్చచెలమ** చూ. ఉచ్చ.

**ఉచ్చపోయు** చూ. ఉచ్చ.

**ఉచ్చబుడ్డ** చూ. ఉచ్చ.

**ఉచ్చమల్లి** చూ. ఉచ్చ.

**ఉచ్చాయము** వి. పండుగ విందు.

సం. ఉత్సవ-. ఉద్యమం, ఆరంభం, పండుగ, వేడుక; ప్రా. ఉచ్ఛఅ, ఉచ్ఛవ-; అ.మా. ఉచ్ఛవ. పండుగ;

క. ఉచ్చయ, ఉచ్చవ; తు. ఉచ్చయ; త. ఉఱ్ఱవమ్. తేరుతిరునాళ్ళు, ఉత్సవం, పెండ్లి.

<ప్రా. ఉచ్ఛఅ.

**ఉచ్చి** వి. 1. నడితల. ఆం.భా. 2.145; 2. బ్రహ్మరంధ్రం. ఆం.భా. 2.145; 3. అధికం; 4. శిఖరం.

సం. ఉచ్చ-. అధికమైన, ఉన్నతమైన, ఉత్కృష్టమైన, పొడుగైన, ఎత్తైన; ప్రా. అ.మా. పా. ఉచ్చ;

క. మ. ఉచ్చి. నడితల; త. ఉచ్చి. నడితల, శిరస్సు, అత్యున్నతస్థానం, మధ్యాహ్నరేఖ; పో.చూ. ఉయిర్చ్చి ఎత్తైన, పొడుగైన; ఒసత్తి. పొడుగు; కొడ. ఉస్కియ్. వృక్షాగ్రం.

దీన్ని ద్రావిడ భాషాపదంగా భావించవచ్చు.

**ఉచ్చికెక్కు** ఉచ్చిః(న్)+ఎక్కు. అ.క్రి. అధికమగు, చాలని పించు.

**ఉచ్చికెక్కు** చూ. ఉచ్చి.

**ఉచ్చింత** రూ. ఉచిం్త, ఉచ్చిం్త, ఉచ్చెం్త, ఉస్తె, ఒచ్చింత. వి. అర్కమందారం, తెల్లజిల్లేడు (Solanum trilobaturn). ద్వి. హరిశ్చ. 3.70.

పో.చూ. క. ఉచ్చళె.

**ఉచ్చింతకాయ** వి. ఉస్తెకాయ. **ఉచ్చింతవరుగు** రూ. ఉస్తెవరుగురి. వి. ఉస్తెకాయల వరుగు.

**ఉచ్చింతకాయ** చూ. ఉచ్చింత.

**ఉచ్చింతవరుగు** చూ. ఉచ్చింత.

**ఉచ్చిం్త** రూ.చూ. ఉచ్చింత. వి. అర్కమందారం. యయా. 1.120, భోజ. 4.19.

**ఉచ్చు**[1] చూ. ఉరి. వి. 1. వాగురం, పక్షులు మొ. వాటిని పట్టటానికి పెట్టే ఉరి. యయా. 2.13; 2. నవాడు మగ్గం కట్టుబడిలో పై పట్టెకు కింది కర్రకు అల్లిన పురిదారం.

**ఉచ్చు**[2] అ.క్రి. 1. వెలువడు, పైకివచ్చు. భార. భీష్మ. 3.19, మా. 88; 2. అంకురించు, మొలచు. వరాహ. 9.109; 3. నొచ్చుకొను. భార.ఉద్యో. 3.97; స.క్రి. 1. భేదించు, చీల్చు. మను. 4.47, భార.విరా. 4.60; 2. నాటు. గుచ్చు. ఉ.రా. 4.315; 3. విడుచు, వెలువరుచు. శివసా. 2.73.

క. ఉర్చు. అ.క్రి. బయటివైపునుండి వెల్వడు; స.క్రి. దొచ్చుకొని ప్రవేశించు; ఉచ్చు. దొచ్చికొనిపోవు, బాణమువలె పోవు; తు. ఉరుంబుని, ఉమ్కుని. భేదించు, నాటు; త. ఉరువు. స.క్రి. చీల్చుకొనిపోవు, బాణమువలె దొచ్చికొనిపోవు.

<మూ.ద్రా. *ఊర్-; *ఉర్-అ-.

**ఉచ్చు**[3] రూ.చూ. ఉంచు. స.క్రి. ఉంచు, ఉండునట్లు చేయు.

**ఉచ్చుచ్చిరే** వి. కుక్కను పిలవటంలోని ధ్వనికి అనుకరణం. బసవ. 212. పు. 110 పం.

క. ఉచ్చి. కుక్కలను పిలవటానికి వాడే పదం; త. ఉచ్చ్-ఎన్నల్; ఉచ్చు-క్-కాట్టు. 'ఉచ్చు' శబ్దాన్ని మళ్ళీమళ్ళీ ఉచ్చరిస్తూ ఒక మనిషివైపు గాని లేక ఒక వస్తువవైపు గాని చూపిస్తూ కుక్కను పురికొల్పటం.

**ఉచ్చెం్త** రూ.చూ. ఉచ్చింత. వి. అర్కమందారం.

**ఉజలీబండి** వి. బలి ఇవ్వటానికి పందిపిల్లను అమ్మవారి గుడికి తీసుకొనిపోయే బండి.

పో.చూ. పార.అర. ఉఝియత్. 'ఈదిఅరు' అనే ఉత్సవానికి బలిఇచ్చే గొర్రె.

**ఉజాడ** రూ. ఉజాడు. విశే. నిర్జనం.

సం. ఉత్సర్జన. విడిచిపెట్టటం; ఉత్సృష్ట-. విడువబడినది, ఈయబడినది; ప్రా.దేశీ. ఉజ్జడ-. నిర్జనం; నే. ఉజార్. విశే. నిర్మానుష్యం; కుమా. ఉజాడ్ణొ. నాశనం చేయు; అ. ఉజారబ. పాడుపెట్టు. బీడుపెట్టు

నాశనంచేయు ; బెం. ఉజడ్ ; ఒ. ఉజాడ ; హిం. ఉజాడ్. నిర్జన ప్రదేశం ; ఉజాడ్‌నా. వదలిపెట్టు ; పం. ల.సిం.గు.మరా. ఉజాడ్. నిర్జనప్రదేశం.

<మరా. ఉజాడ్.

**ఉజాడు** గ్రా.రూ. ఉజాడ. విశే. **1.** చెడిపోయిన ; **2.** సిగ్గులేని ; అర్థవివరి.

**ఉజ్జ¹** పో.రూ. ఉజ్జాయింపు. వి. ఊహ, భావన, అభిప్రాయం.

**ఉజ్జగొను** ఉజ్జ+కొను. స.క్రి. **1.** ఊహించు. దశా. 5.146 ; **2.** లక్ష్యంచేయు, సరకుగొను.

**ఉజ్జ²** గ్రా.రూ. ఉద్ది¹. వి. సమానం.

**ఉజ్జగము** పో.రూ. ఉజ్జనము. వి. వివర్జనం.

సం. ఉజ్ఝ్-. విడిచిపెట్టటం ; ప్రా.మూ. ఉజ్ఝిఅ. సిగ్గులేని, మర్యాదలేని ; పా. ఉజ్ఝతి. త్యజించు, విడిచిపెట్టు, పారవేయు.

**ఉజ్జగించు** చూ. ఉజ్జనము. స.క్రి. **1.** విడుచు, వివర్జించు, త్యజించు. భార.శల్య. 1.320 ; **2.** పోగొట్టు. వల్లార్చు. పాండు. 2.29 ; **3.** తోసివేయు, నిరసించు, విజయ. 1.188.

**ఉజ్జగింపించు** ఉజ్జగించుయొక్క ప్రే. స.క్రి. ముగింపించు, సమాప్తినొందించు. పాండు. 2.112. **ఉజ్జగింపు** వి. వివర్జనం. విడుపు. బం.బా. 2.178. **ఉజ్జగిలు** గ్రా.రూ. ఉజ్జగిల్లు. అ.క్రి. తొలగు, పోవు. మను. 5.57 ; **ఉజ్జగిల్లు** గ్రా. ఉజ్జగిలు. అ.క్రి. తొలగు, పోవు. శివరా. 3.62, పాండు. 3.136.

**ఉజ్జగింపించు** చూ. ఉజ్జగించు.

**ఉజ్జగింపు** చూ. ఉజ్జగించు.

**ఉజ్జగిలు** చూ. ఉజ్జగించు.

**ఉజ్జగిల్లు** చూ. ఉజ్జగించు.

**ఉజ్జగొను** చూ. ఉజ్జ¹.

**ఉజ్జన** గ్రా.రూ. ఉజ్జనము. వి. విడిచిపెట్టటం, వదలివేయటం, త్యజించటం.

**ఉజ్జనసేయు** ఉజ్జన+చేయు. స.క్రి. విడుచు. మాని వేయు. కాశీ. 4.31.

**ఉజ్జనము** గ్రా. ఉజ్జన. వి. త్యజించటం, విడవటమ్. విక్ర. 3.112.

సం. ఉజ్ఝనమ్. తొలగించటం. విడిచిపెట్టటం ; ఉజ్ఝ్-; ప్రా. ఉజ్ఝణ, ఉజ్ఝఈ ; అ.మా. ఉజ్ఝణం ; పా. ఉజ్ఝతి. త్యజించు, వదలిపెట్టు.

<సం. ఉజ్ఝన-.

**ఉజ్జనసేయు** చూ. ఉజ్జన.

**ఉజ్జని** గ్రా.రూ. ఉజ్జేని. వి. ఉజ్జయినీనగరం. విక్ర. 2.49 ; శృం.నై. 5.83.

**ఉజ్జా** చూ. ఉజ్జాయించు. వి. అంచనా, ఊహ.

**ఉజ్జాయించు** పో.రూ. అజ్జాయించు. స.క్రి. **1.** ఊహించు ; **2.** సందేహించు, అనుమానించు.

సం. ఊహ్య. తర్క్యం, అధ్యాహార్యం ; మహా. *ఉజ్ఝ-.

**ఉజ్జాయింపు** వి. **1.** ఊహ ; **2.** అంచనా.

**ఉజ్జాయింపు** చూ. ఉజ్జాయించు.

**ఉజ్జి¹** గ్రా.రూ. ఉద్ది¹. వి. జత, సాటి, సమానం.

**ఉజ్జి²** చూ. ఉచ్చుచిచ్చికే. వి. కుక్కపిల్ల.

త. ఉచ్చి. కుక్క.

<త. ఉచ్చి.

**ఉజ్జి** గ్రా.రూ. ఉద్ది. వి. సాటి, సమానం.

**ఉజ్జు** పో.రూ. ఉచ్చు². స.క్రి. పెరుకు, పైకిలాగు.

**ఉజ్జనకల్లు** వి. **1.** అగ్నిపర్వతాలు వెదజల్లగక్కిన రాయి ; **2.** గోడలు నునుపుచెయ్యటానికి రాచే రాయి.

క. ఉజ్జాకల్లు. నునుపుచేసే రాయి ; తు. ఉర్జునాకల్లు ; త. ఉరై. నునుపుచేయు.

<ఉజ్జనకల్లు.

**ఉజ్జేని** గ్రా. ఉజ్జని. వి. ఉజ్జయినీనగరం. దశకు. 3.59.

సం. ఉజ్జయినీ. నగరవిశేషం. విక్రమాదిత్యుని రాజధాని, మోక్షదాయక నగరాల్లో ఒకటి ; ప్రా. ఉజ్జణీ ; ఉజ్జైణీ ; అ.మా. ఉజ్జేణీ ;

క. ఉజ్జైణి ; త. ఉచ్చయిణి ; ఉచ్చని.

<సం. ఉజ్జయినీ.

**ఉజ్జేపన** వి. **1.** వ్రతాదుల ముగింపు ; **2.** వెడలించటం.

సం. ఉద్యాపన-. వ్రతాదుల ముగింపు ; ప్రా. ఉజ్జావణమ్.

<సం. ఉద్యాపన-.

**ఉంచికొను** చూ. ఉంచు.

**ఉంచు** చూ. ఉండు ; చూ. ఉనుచు (ఉండు ధాతువుయొక్క సకర్మక రూపం), ఉచ్చు³. స.క్రి. **1.** ఆపు. నిలుపు, నిరోధించు. భార.భీష్మ. 3.415, కళ. 4.111 ; **2.** నియమించు, ఏర్పరచు. భార.మౌ. 156 ; **3.** నివసింపజేయు. హరి.ఉ. 2.112 ; **4.** స్థాపించు. వసు. 1.64, కృష్ణ. 3.112, నృసింహ. 4.88 ; **5.** వశంలో పెట్టుకొను, చంద్రరే. 1.49 ; **6.** దిగవిడచు. కళా. 1.182 ; **7.** కుదువపెట్టు, న్యాసంచేయు. ఆము. 1.54 ; **8.** ధరింపజేయు, పెట్టు. వసు. 3.31 ; **9.** కూర్చుండబెట్టు. విక్ర. 1.107 ; **10.** అమర్చు. ఇందు. 6.4.

**ఉంచికొను** గ్రా.రూ. ఉంచుకొను. **ఉంచుకొను** గ్రా. ఉంచికొను. స.క్రి. **1.** ఉండునట్లు చేసికొను ; **2.** (వేశ్యాదుల్ని) వశంలో పెట్టుకొను ; **3.** ధరించు, వహించు.

**ఉంచుకొను** చూ. ఉంచు.

**ఉటంకము** వి. సంగ్రహం.

సం. ఉట్టంక-. గీకివేయు, కొట్టివేయు. అర్థవివరి.

<సం. ఉట్టంక-.

**ఉటంకించు** రూ. ఉటెంగించు. స.క్రి. **1.** సంగ్రహంగా తెల్పు ; **2.** ఉదాహరించు ; **3.** ఎత్తిపొడుచు.

**ఉటంకి** గ్రా. ఉటంకు. వి. **1.** నీచుడు, హీనుడు. విప్ర. 4.25 ; **2.** ధైర్యవంతుడు ; **3.** గౌరవగలవాడు ; విశే. తెలివైన, చతురైన.

సం. విటంక-. చెడు, నీచం ;

పో.మా. త. విటంకన్. దురలవాట్లు కలవాడు, జాదుడు, పదరుపోతు, కొండెగాడు.

**ఊటంకితవము** వి. చురుకుతనం, ఉల్లాసం.

**ఊటంకించు** చూ. ఉటంకము.

**ఊటంకితవము** చూ. ఉటంకి.

**ఊటంకు** రూ.చూ. ఉటంకి. వి. నీచుడు. శుక. 3.18.

**ఊటామ** రూ.చూ. ఉతాజే. విశే. ఎత్తు.

**ఊటావలి** వి. ప్రభుత్వ అధికారాన్ని లెక్కచేయకుండా ఆస్తి తాకట్టు పెట్టి తీసుకొన్న డబ్బుకు వడ్డీ చెల్లించకుండా, ఆ ఆస్తిమీద అనుభవించే ఆదాయం, లేదా అద్దె.

క. హుట్టావళి, హుట్టువళి. పంట, పొలంమీద గాని తోటమీదగాని వచ్చే ఆదాయం, పన్నుమీద వచ్చే రాబడి.

< క. హుట్టావళి.

**ఊటింగించు** రూ.చూ. ఉటంకించు. స.క్రి. తగ్గించు, కురచ చేయు, దాటవేయు.

**ఊట్టాడు** రూ.చూ. ఊటాడు. అ.క్రి. త్వరపడు. పాండు. 1.189.

**ఊట్టి**[1] రూ. ఉట్టు[5]. వి. కుండలు మొదలైనవి వేలాడగట్ట టానికి అల్లిన చిక్కం. భాగ. 10 పూ. 810, ద్వి. హరిశ్చ. ఉ. 1760.

క. ఉళి. ఉట్టి, చిక్కం; ఉట్టి, ఒట్టి. ఉయ్యాల చేర్లు కట్టే భాగం; త. ఉఱి. ఉట్టి, చిక్కం; మ. ఉఱి. ఉట్టి, ఉచ్చు; పో.చూ. పర్జి. ఉత్క, ఉటుక. తాడు; ఉతిప్-, ఉతిత్-. వేలాడగట్టు.

< మూ.ద.ద్రా. *ఉత్-.

**ఊట్టికట్టుకొవియూగులాడు** అ.క్రి. 1. అంటిపెట్టుకొని ఉండు; 2. దావకుండు. నీతిచం. నంది. **ఊట్టికట్టుకొవి వ్రేలాడు** అ.క్రి. 1. దావక స్థిరంగా ఉండు. ద్వి. హరిశ్చ. ఉ. 1760; 2. అంటిపెట్టుకొని ఉండు. **ఊట్టితిరుణాళ్ల** వి. గోకులాష్టమి ఉత్సవం.

**ఊట్టి**[2] పో.చూ. ఉట్టి[1]. వి. పొదగా పెరిగే ఒక రకం కంచె మొక్క (Ferreola buxifolia).

**ఊట్టికట్టుకొవియూగులాడు** చూ. ఉట్టి[1].

**ఊట్టికట్టుకొవివ్రేలాడు** చూ. ఉట్టి[1].

**ఊట్టితిరుణాళ్ల** చూ. ఉట్టి[1].

**ఊట్టిపడు**[1] చూ. ఉట్టు[1].

**ఊట్టిపడు**[2] చూ. ఉట్టు[2].

**ఊట్టిపడ్డట్టు** చూ. ఉట్టు[1].

**ఊట్టిపేర్లగడ్డి** వి. తుప్పగా పెరిగే గడ్డి, ఉట్టి చేర్లవంటి కాడలు గల గడ్డి.

**ఊట్టు**[1] రూ.చూ. పుట్టు. అ.క్రి. పుట్టు, కలుగు. వేంక. పంచ. 1.276.

క. పుట్టు, హుట్టు, ఉట్టు. ఉదయించు, పుట్టు, మొల కెత్తు; తు. పుట్టి. పుట్టు; కోట. ఉట్-, ఉచ్-. మొలకలు, పుట్టు; ఊట్చ్-. పుట్టించు.

< క. హుట్టు/ఉట్టు.

**ఊట్టిపడు**[1] అ.క్రి. 1. అకస్మాత్తుగా కలుగు. భాగ. 6.17; 2. ప్రత్యక్షమగు, స్పష్టంగాతోచు. ప్రభా. 1.138. **ఊట్టి పడ్డట్టు** క్రి.విశే. ఊడిపడ్డట్టు, హఠాత్తుగా రాజవా. 2.94.

**ఊట్టు**[2] చూ. ఊఱు, ఉఱియు. అ.క్రి. కారు, స్రవించు. భార. ద్రోణ. 5.205, హర. 6.126.

క. ఊఱు. కారు, స్రవించు, చిమ్ము, చెదజల్లు, నాను; ఒఱె. కారు, చిమ్ము, ప్రవహించు, స్రవించు; ఒఱతె. బుగ్గ, ఊట. తు. ఉజ. నీటిబుగ్గ, ఊట; ఊజాని, ఊసుని. స్రవించు, కారు; త. ఊఱు. పైకి చిమ్ము, ఊరు, స్రవించు; ఊఱ్ఱు. ప్రవాహం, నీటిబుగ్గ, ఊట, చెమ్మ; మ. ఊరుక, ఉఱక్క. కారు; గో. ఊసానా. కన్నీళ్ళు; కుఇ. ఉర్ప్-అ, ఉర్-త్-. కారు, చిమ్ము. చెమర్చు; కోలా. ఊర్. కారు; నా. ఊర్. కారు, ఊరు.

< మూ.ద్రా. *ఉఠ్-.

**ఊట్టిపడు**[2] అ.క్రి. 1. కారు, స్రవించు, పైకి వచ్చు. భాగ. 6.24; శృం.నై. 7.46, పె.శకు. 2.53; 2. అతిశ యించు, పెంపొందు. కళా. 6.159; 3. శీఘ్రంగా వచ్చు, వెంటనే వచ్చు. బహుళా. 3.3, చమ. 3.63; 4. ఊడి పడు, దిగివచ్చు. కాళిందీ. 3.102.

**ఊట్టు**[3] వి. 1. ఉప్పు పండే నేల; 2. బాలక్రీడా విశేషం, ఉప్పట్టు.

**ఊట్టు**[4] రూ. ఒట్టు[4]. పో.చూ. ఒట్టు. వి. (పిల్లల పరిభాషలో) వైరం.

**ఊట్టు**[5] రూ.చూ. ఉట్టి[1]. వి. దిష్టి తగలకుండా దర్వాజాలకు గుమ్మడికాయ వేలాడదీసే చిక్కం.

**ఊత్రవడియము** వి. 1. ఒక రకం వడియం (ఎండబెట్టిన లేక వేపిన పంటకం); 2. అల్పాహారం, తేలికైన ఫలాహారం. రం.రా.పు. 8.1.

పో.చూ. సం. వటక. చిన్నముద్ద, బంతి, ఉండ, మాత్ర, పప్పుధాన్యాదులతో చేసిన భక్ష్యవిశేషం; వటిక. గుండ్రని; వటీ; ప్రా. వటుక. బంతివలె చేసినది, మందంగా ఉన్న ఉండ, గడ్డ;

పో.చూ. క. వటక. చిన్నముద్ద, గుండ్రని ముద్ద, బంతి, పప్పు ధాన్యాదులతో చేసిన గుండ్రని భక్ష్యవిశేషం; వటికె. చిన్నముద్ద, గుండ్రని ముద్ద, బంతి, ఉండ, మాత్ర. వడె. పప్పు ధాన్యాదులతో చేసిన భక్ష్యం; తు. ఒడ; పో.చూ. త. వటకమ్. పిండి మిశ్రము, సువాసన ద్రవ్యాలు, మొ. వాటిని కలిపి గుండ్రని ముద్దగాచేసి ఎండలో ఆరబెట్టి చేసిన భక్ష్యం; వటాయ్; వడై. మినపప్పుతో తయారుచేసిన భక్ష్య విశేషం; గారె; మ. వట.

**ఊత్రవుడియంగా** చూ. ఉత్రవడియము. క్రి. విశే. ఊరక; ఉచితంగా (వడియాన్ని గుటుక్కున మింగేంత తేలిగ్గా అని కావచ్చు).

**ఊట్ల**[1] ఉట్టి. ఏ.వ.; ఉట్లు బ.వ.; ఉట్లు + అ. విశే. ఉట్లకు సంబంధించిన.

**ఊట్లతేరు** వి. ఉట్లపండుగ సమయంలో ఉట్టికట్టే పొడు గాటి జారుడు. **ఊట్లపండుగ** వి. కృష్ణాష్టమి. క. ఉట్లాట. **ఊట్లసంబరము** వి. ఉట్లపండుగ.

**ఊట్ల**[2] పో.చూ. ఉట్లబొద్ది. వి. ఊటాకు (Digitaria marginata).

**ఉట్లతేరు** చూ. ఉట్ల[1].

**ఉట్లపండుగ** చూ. ఉట్ల[1].

**ఉట్లబొడ్డ** రూ.చూ. ఉట్లబొద్ది. వి. ఒక రకం తీగమొక్క.

**ఉట్లబొద్ది** రూ. ఉట్లబొడ్డ. వి. ఒక రకం తీగమొక్క.

**ఉట్లసంబరము** చూ. ఉట్ల[1].

**ఉఠాణి** రూ. ఉటాను. విణ. గొప్పది, ఎత్తైనది. వి. హొదుగు.

నం. ఉత్థాన-. పైకి లేవటం; ప్రా. ఉత్థావెది, ఉత్థాణమ్. లేవటం, ఆరంభించటం; అ.మా. ఉత్థాణమ్. నిలబడటం, లేవటం; పా. ఉత్థాపెతి. లేవు, పైకెత్తు; ఉత్థాన. లేవటం, నిలబడటం, ఆరంభం, సూలం; నే. ఉఠాన్. లేవటం; అ.బెం. ఉఠన్; ఒ. ఉఠాన. సముద్రం. నుంచి మబ్బులగమనం; హిం. ఉఠాన్. లేవటం; సిం. ఉఠాణో. ఉదయం; మ. ఉఠాణూ. వణుకు.

<ప్రా. ఉట్ఠాణమ్<నం. ఉత్థాన-.

**ఉఠాయించు** చూ. ఉఠాణి. న.క్రి. లేవదీయు. మెకంజీ. నం. 48.

ఉ.హిం. ఉఠానా. పైకిలేవు.

<ఉ. ఉఠా(నా)+ -ఇంచు.

**ఉదకబెట్టు** చూ. ఉదుకు.

**ఉదత**[1] రూ.చూ. ఉడుత. వి. వీపున మూడు గీతలు గల జంతు విశేషం, ఉడుత.

**ఉదతభక్తి** వి. (సామెత) లంకకు వారధి కట్టటంలో శ్రీరామునిపట్ల ఉదత చూపిన భక్తి; యథాశక్తి తోడ్పడే భక్తి.

**ఉదత**[2] వి. హొట్టేలుచెక్క, మరమగ్గం నాడెను ఒక సొరుగులో నుంచి మరో సొరుగులోకి నెట్టటానికీ, సొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికీ కింద తోలు ఉంగరం బిగించిన కొయ్య బిళ్ళ.

క. ఉడుత. నడుంచుట్టూ చుట్టుకోవటం.

**ఉదతభక్తి** చూ. ఉదత[1].

**ఉదవ** మత్స్యవిశేషం (Gerres mentosus).

**ఉడాయ** పో.చూ. ఉడాయించు. వి. బడాయి, డాబు.

నం. ఉడ్డాయన-. వి. పైకెగరటం, ఎగరటం; ప్రా. ఉడ్డాణ. గాలిలో తేలిపోవు, ఎగురు; ఉ.హిం. ఉడ్‌నా, ఉడానా. ఎగురు, విమానం మొ. వాటిలో కూర్చొని ఆకాశ మార్గంలో పయనించు.

<ఉ. ఉడానా.

**ఉడాములు** చూ. ఉడాయించు. వి. దాట్లు.

పో.చూ. నం.? ఉడ్డీయనమ్. పైకెగరటం; ఉడ్డాయనమ్. విణ. పైకెగరటం.

**ఉడాయించు** అ.క్రి. పరుగెత్తు.

నం. ఉడ్డాపయతి. ఎగరవేయు; ప్రా. ఉడ్డావ, ఉడ్డావఇ, ఉడ్డావిఅ; కా. వుడావ్వమ్; నే. ఉడాఉన్; బెం.హిం. ఉడానా; పం. ఉడేఁణా; ల. ఉడావణ్; సిం. ఉడాఇణు; గుజ. ఉడావ(వ్రూ, ఉడావవ్రుయ్, ఉడావ్వు; మరా. ఉడవణే. ఎగురు, దుముకు; ఉడవణే. విసురు; ఉ. ఉడానా;

క. ఉడాయిసు. తిరస్కరించు, తృణీకరించు; త. ఉడాయ్. అదృగించు, మోసగించు.

<ఉ. ఉడా(నా)+ -ఇంచు.

**ఉడాయింపు** వి. 1. కుస్తీ, మల్లయుద్ధం. మల్లు. 3.69; 2. పరుగెత్తటం.

**ఉడాయింపు** చూ. ఉడాయించు.

**ఉడి** చూ. ఉడుగు. వి. నాశం, అంతం, వ్యర్థం.

పో.చూ. క. ఉలి. మిగిలినది, శేషం; త. ఒళి. అంతమగు, నశించు, నిర్మూలమగు.

***ఉడివుచ్చు** ఉడి + వుచ్చు. న.క్రి. భంగపరచు, పోగొట్టు. హంస. 1.127. **ఉడిపోనిపల్కులు** ఉడి + పోని పల్కులు. వి. వేదాలు, నాశంలేని వాక్కులు. **ఉడిపోవు** ఉడి+పోవు. అ.క్రి. 1. నశించు. కాశీ. 1.187; 2. వ్యర్థమగు. కాశీ. 6.236; 3. ఎకతెగు, విచ్ఛిన్నమగు. వసు. 1.6; 4. తొలగు, తప్పుకొను. మార్క. 8.195.

**ఉడికించు** చూ. ఉడుకు.

**ఉడికిలించు** చూ. ఉడుకు.

**ఉడికిలు** చూ. ఉడుకు.

**ఉడికిల్లు** చూ. ఉడుకు.

**ఉడిగము** రూ.చూ. ఊడిగము. వి. 1. సేవ, పరిచర్య. వరాహ. 9.126; 2. నమ్రత, అడకువ. అచ్చ.రా. 6.46.

**ఉడిగపుగత్తె** వి. దాసి, సేవకురాలు. కళా. 5.179.

**ఉడిగపుగత్తె** చూ. ఉడిగము.

**ఉడిగించు** చూ. ఉడుగు.

**ఉడిగిపోవు** చూ. ఉడుగు.

**ఉడిగిమడగు** చూ. ఉడుగు.

**ఉడిగిమడుగు** చూ. ఉడుగు.

**ఉడివించు** చూ. ఉడుప[1].

**ఉడివుచ్చు** చూ. ఉడి.

**ఉడిపోనిపల్కులు** చూ. ఉడి.

**ఉడిపోవు** చూ. ఉడి.

**ఉడీ** వి. అబద్ధం.

పో.చూ. క. హుడి. దుమ్ము, పొడి.

**ఉడుక** రూ.చూ. ఉడుక్క. వి. చర్మవాద్య విశేషం.

**ఉడుకాటము** చూ. ఉడుకు.

**ఉడుకాడు** చూ. ఉడుకు.

**ఉడుకు** రూ. ఉడ్కు. అ.క్రి. 1. కాగు, తప్తమగు. వరాహ. 4.34, సీలా. 3.34; 2. పరిపక్వమగు. మను. 4.60; 3. భయదుఃఖాదులచే తాపముచెందు. భార.కర్ణ. 3.33. వి. 1. అంతస్తాపం, విచారం. భార.శల్య. 2.72; 2. బాధ, పీడ. భార.అను. 4.407; 3. వేడి, ఉష్ణత్వం. ఆము. 2.60; విణ. ఉష్ణం. ఆము. 2.49.

గోం. ఉకుడ్-, ఉకుడా (? ఉడక్ వర్ణ వ్యత్యయం చెందటంవల్ల వచ్చి ఉండవచ్చు). మరుగు, కాగు, మరిగే స్థితి; పో.చూ. కెఇకడిఉడ్క. ఉష్ణం; కుఇ. ఉడ్‌గి. అన్నం; కురు. ఉడ్‌తూర్. ఎండవేడివల్ల తాపంచెందు, మరుగు, ఆవేశంలో అలసిపోవు.

<మూ.ద్రా. *ఉట్-.

**ఉడక(బెట్టు** ఉడుకన్ + పెట్టు: స.క్రి. ఉడుకునట్లు చేయు. **ఉడికించు** స.క్రి. 1. ఉడుకునట్లుచేయు ; 2. ఎత్తి పొడుచు. **ఉడికిలించు** ఉడికిలుయొక్క ప్రే. స.క్రి. నొప్పించు, కల్లడపెట్టు, కుతిలపెట్టు. **ఉడికిలు** రూ.చూ. ఉడికిల్లు. అ.క్రి. 1. ఉడుకు, మరుగు ; 2. తపించు, తప్తమగు ; 3. నొచ్చుకొను. **ఉడికిల్లు** రూ. ఉడికిలు. అ.క్రి. 1. ఉడుకు, మరుగు ; 2. తపించు, తప్తమగు ; 3. నొచ్చుకొను. **ఉడుకాటము** వి. ఉడుక్కోవటం, నొచ్చుకోవటం. **ఉడుకాడు** ఉడుకు + ఆడు. అ.క్రి. 1. కాఁగు, మరుగు ; 2. నొచ్చుకొను, దుఃఖించు ; 3. నొప్పించు, ఏడ్పించు. **ఉడుకుజల్లు** అ.క్రి. తొందరపడు ; వ్య. ఉడికే పదార్థం జ్వ్రరు. పరమ. 5.56. **ఉడుకు(బోతు** ఉడుకు + పోతు. వి. 1. ఉడుక్కునే స్వభావం కలవాడు ; 2. ముక్కోపి. **ఉడుకెత్తు** ఉడుకు + ఎత్తు. అ.క్రి. కాగు, వేడెక్కు. భా.రా.యు. 38, దశా. 4.76.

**ఉడుకుజల్లు** చూ. ఉడుకు.

**ఉడుకు(బోతు** చూ. ఉడుకు.

**ఉడుకువ** రూ. ఉడ్కువ. పో.చూ. ఉడుగు. వి. విశ్రాంతి, ఊరట, విరామం. భార.విరా. 5.186.

**ఉడుకెత్తు** చూ. ఉడుకు.

**ఉడుక్క** రూ. ఉడుక, హుడుక, హుడుక్క ; పో.చూ. ఉడుము. వి. చర్మవాద్య విశేషం. చంద్రి. 2.47.

క. హుడుక్కా. ఇసుక గడియారం ఆకారంలో ఉన్న చిన్న డోలు ; తు. ఉడ్కె ; త. ఉటుక్కై, ఉటుక్కు, తుటి ; మ. ఉటుక్క, తుటి. కంజరివంటి చర్మవాద్యం ; కుఇ. టుఱు. వి.బ.వ. టుఱ్క. ఒక రకం డోలు ;

సం. హుడుక్క-. గలగల శబ్దంచేసే గిలక్కాయ, లేదా చిన్న డోలు ; హుడుక్కా. ఒక రకం డోలు ; ప్రా.దేశీ. హుడుక్క. వాద్య విశేషం.

ధ్వన్యనుకరణ ద్రావిడ శబ్దం.

**ఉడుగర** పో.చూ. ఉడుపు[2]. వి. 1. కానుక, బహుమానం. మను. 5.97, అచ్చ.రా.కిష్కిం. 48 ; 2. కానుకగా నీయదగిన సన్నని బట్ట. కువ.చ. 1.46 ; 3. ఎడమెడంగా నేసిన బట్ట.

క. ఉడు. సడుంచుట్టూ చుట్టుకొను ; కొడె. పెళ్లినాడు చదివించే బట్టలు ; తొడు/తొడు-గొడె (-కొడె). పెండ్లి బట్టలు ; తు. ఉడుగెరె, ఉడుగిరె, ఉడుగెరె, ఉడ్పురె. వివాహ సందర్భంగా వధూవరులకిచ్చే బట్టలు ; త. ఉటు. ధరించు ; పో.చూ. కూఱై (<కుఱై). వస్త్రం. తాళి కట్టటానికి ముందు పెండ్లికూతురు ధరించటానికి అత్తమామలు పెట్టిన బట్ట ; కూఱై-య్-ఉటుత్తల్. వరుని సోదరి వధువుకు పెండ్లిబట్టలు కట్టటం ; మ. ఉటు. బట్ట కట్టుకొను ; కూఱ. బట్టలజత, ముతకబట్ట, గుడ్డ ; గోం. ఉహుత్తానా-ఉహుత్ఫి-ఉహుక్కా. లంగా ధరించు ; పర్జి. నూడ్. బట్ట కట్టుకొను ; కొలా. ఉడ్ ; నా. ఉడ్ ; ఒల్లా. నూడ్.

<మూ.ద్రా. *నూట్-.

**ఉడుగు** రూ. ఉడుపు[1]. స.క్రి. మాను, విడుచు, త్యజించు. భార.ఆది. 2.180 ; అ.క్రి. 1. శోషిల్లు, ఇంకు. కు.సం. 6.812 ; 2. దాగుకొను, అణగియుండు. భార.విరా. 1.143 ; 3. ఆగు, విరమించు. భార.ఉద్యో. 4.348 ; 4. ఓడు, పోవు, నశించు, తగ్గు. భా.రా.సుం. 49 ; 5. ముడుచుకొను. కాశీ. 7.153.

క. ఉడుగు, ఉదగు. ముడుచుకొను, అణగు, తగ్గు, భంగమగు, వాడు, అదృశ్యమగు, ఆగు ; పో.చూ. ఉళి. దాగుకొను ; తు. ఒడుంగెలు. చివర ; ఒడుంగెలుని. కాపుఉడుగు ; ఒడుక. చివర ; త. ఒటుంకు. నిర్బంధించు, అణగియుండు, తగ్గియుండు, ఆగిపోవు, ఊరకుండు ; ఒటుక్కు. అణచు, ఆపు, లోగొను ; ఒటిపు. మానుకొనటం ; పో.చూ. ఒళి. దాగుకొను ; స.క్రి. దాచు ; మ. ఒటుజ్ఞుక. చివరకు వచ్చు, మరణించు ; ఒటుక్కుక. పూర్తిచేయు, నాశనంచేయు ; ఒటుక. చివరకువచ్చు ; ఒటువు, ఒటుక్కమ్. చివర ; పో.చూ. ఒళిక్క. దాగుకొను, దాచు ; కోట. ఒడ్గ్-, ఒడ్స్-. నాశమగు, ఒడ్క్-, ఒడ్క్య. కురచచేయు ; తొ. వ్రడ్గ్-, వ్రడ్య్-. అణగియుండు ; వ్రడ్క్- వ్రడ్క్-య్. అణచు. దావగొట్టు ; కుఇ. డూమ్పు. ముడుచుకొనియుండు ; డూప్పు. ముడుచు. కలుపు ; కురు. ఉటుర్. ఆగియుండు, దాగియుండు ; ఉశ్-. స.క్రి. మూయు, అడ్డుకట్టు, అడ్డగించు, నదికి ఆనకట్టకట్టు, మార్గాన్ని అడ్డగించు ; ఉథ్గ్నా. నొక్కు, అణచు, చదునుచేయు, రూపుమాపు, గొంతు పిసికి చంపు ; ఒశొక్నా. రూపుమాపు, కృశింపజేయు, చంపు ; మాల్తో. ఉశ్. పూరించు, నింపు.

<మూ.ద్రా. *ఉక్-/*ఒక్-.

**ఉడిగించు** చూ. ఉడుగు. రూ. ఉడివించు. స.క్రి. 1. ఆపు, మాన్పించు. భార.ఆది. 2.221 ; 2. అణచు. భార.ఆది. 6.294 ; 3. చంపు. హర. 7.164 ; 4. దుర్బలపరచు, పస్తుపెట్టు, వెళ్లగొట్టు ; 5. తొలగించు. **ఉడిగిపోవు** అ.క్రి. వృథాయగు, వ్యర్థమగు. కవిక. 4.113. **ఉడిగిమడ(గు** రూ.చూ. ఉడిగిమడు(గు. అ.క్రి. అడగియుండు, నశించు. భార.శాంతి. 6.86. **ఉడిగిమడు(గు** రూ. ఉడిగిమడ(గు. అ.క్రి. అణగియుండు, లోబడియుండు. భార.విరా. 1.148. **ఉడుగువా(డు** పో.చూ. ఉడు(బోతు. వి. విరాగి.

**ఉడుగువా(డు** చూ. ఉడుగు.

**ఉడు(గో(త** వి. చివరికోత.

<ఉడుగు + కో(త.

**ఉడు(గో(తపిందె** వి. కాపుఉడుగుకాలపు పిందె.

**ఉడు(గో(తపిందె** చూ. ఉడు(గో(త.

**ఉడుచు** 'ఉడుగు' ధాతుప్రే. స.క్రి. 1. నివారించు, ఆపు. భార.ఆది. 6.15 ; 2. నివర్తించు, మరలించు. భార.ఆది. 6.174 ; 3. లయింపజేయు. నృసిం. 1.65 ; 4. విడుచు, వదలిపెట్టు.

**ఉడుత** రూ. ఉడత[1], ఉఱుత. వి. వీపుమీద మూడు చారలు గల జంతు విశేషం, చిక్రోడం. వరాహ. 12.52, ఆం.భా. 2.87, అప్ప. 2.197.

క. ఉడుతె ; త. ఉఱుత్తై ; గోం. వర్ఫె, వర్ఫెతా, వర్ఫెంగ్. చారలున్న చిన్న ఉడుత.

**ఉడుతకు(వ్)ఉడుతభక్తి** వి. శక్తివంచన లేకుండా భక్తితో పాటుపడటం; వ్య. తన శక్తినిబట్టి ఉడుత చూపిన భక్తి. **ఉడుతచార** వి. ఉడత చారలవంటి చారలున్న వస్త్ర విశేషం. **ఉడుతచారంచు** వి. ఉడత చారలవంటి చారలు గల చీర అంచు. **ఉడుతచాఱలు** వి. ఉడుత చారలవంటి చారలుగల వస్త్ర విశేషం. ఆం.బా. 2.154. **ఉడుతభక్తి** వి. యథాశక్తి భక్తితో చేసే సహకారం; వ్య. వారధి కట్టేటప్పుడు శ్రీరామునికి ఉడత చూపిన భక్తి. కుచేల. 1.130.

**ఉడుతకువ్‌ఉడుతభక్తి** చూ. ఉడుత.

**ఉడుతచార** చూ. ఉడుత.

**ఉడుతచారంచు** చూ. ఉడుత.

**ఉడుతచాఱలు** చూ. ఉడుత.

**ఉడుతభక్తి** చూ. ఉడుత.

**ఉడు(దేనెలు** చూ. ఉడుగు. వి. మకరందంలేని పూలు. పండి. చ. 1.89 ష.

**ఉడుపకుక్క** పో.చూ. ఉడుము. వి. ఉడుము మొదలైన జంతువుల్ని వేటాడే కుక్క; ముఖ్యంగా పనిపట్టి వేటాడే కుక్క. మను. 4.51.

**ఉడుపతెగులు** చూ. ఉడుపు[1].

**ఉడుపవేయి** చూ. ఉడుము[1].

**ఉడుపపిల్ల** చూ. ఉడుము[1].

**ఉడుపు[1]** రూ. ఉడ్పు[1]; ఉడుగుయొక్క ప్రే.. చూ. ఉడుగు. స.క్రి. 1. (నోరు. మొ.) మూయించు. కు.సం. 5.547; 2. అణచు. భార. ఉద్యో. 4.341; 3. నిరోధించు. ఉ.హ. 1.89; 4. వదలు. విడుచు. రాఘవ. 4.205; 5. పోగొట్టు, తీర్చు, మాన్చు. ఆము. 1.12.

**ఉడుపతెగులు** వి. పండ్ల చెట్లకు, కాయ పైర్లకు వచ్చే తెగులు; ఆకులు పాలిపోయి, కాయలు పురుగు పట్టి రాలి పోయే తెగులు.

**ఉడుపు[2]** రూ. ఉడ్పు[2], ఉడుపు[3]. వి. వస్త్రాలు, దుస్తులు.

క. ఉడపు, ఉడుపు. వస్త్రములు; త. ఉటుప్పు. గుడ్డ, దుస్తులు; ఉటుక్కై. దుస్తులు; ఉటు. దుస్తులు ధరించు; మ. ఉటుప్పు. వస్త్రాలు; పో.చూ. పర్జి. తుస్డ్ (రవిక మొ.) తొడుగుకొను, నూడ్‌పిప్, నూడ్‌పిట్. దుస్తులు తొడుగు; కొలా. ఉర్. చుట్టుకొను, తొడుగు కొను; తొడ్. తొడుగుకొను; నా. ఉట్. తొడుగుకొను; ఒల్లా. నూడ్. బట్టలు వేసికొను; గోం. ఉహుత్తానా. కోటు తొడుగు; ఉడ్తానా. తొడుగు; ఉడ్. ధరించు.

<మూ.ద.ద్రా. *ఉట్-ప్- <మూ.ద్రా. *ఉట్-/ *నూట్-.

**ఉడుపుకూలి** వి. (వరి మొ.) నాటుకూలి.

<ఉడుప <ఊడుప + కూలి.

**ఉడుము[1]** రూ. ఉఱుము[2]. వి. బల్లి ఆకారంలో ఉండే పెద్ద జంతువు. కాశీ. 2.144.

క. ఉడ, ఉడు. ఉడుము; తు. ఉడు, ఒడు. ఒడ్డు; త.మ. ఉటుమ్పు. ఉడుము; గోం. ఉర్గుమ్-, ఉర్‌యుత్తా, ఉర్‌యుహ్క; కొం. ఉర్పు; ప. ఉడు; కొలా. ఉడుగ్; నా. హుడుగ్.

<*ఉట్-.

**ఉడుపవేయి** వి. ఉడుము క్రొవ్వునుంచి తీసిన చమురు. బసవ. 3.657 పం. **ఉడుపపిల్ల** వి. ఉడుముపిల్ల.

**ఉడుము[2]** వి. వెదురులాగా పొడుగ్గా పెరిగి పుష్పించిన వెంటనే చచ్చిపోయే ఒకానొక తృణ విశేషం; దీని గుజ్జు కాగితాల తయారీకి, ఆకు ఏనుగుల తిండికి, గడ వానకట్టుకు పనికి వస్తుంది (Beesha travencoria).

క. కొడ. ఓటె. రెల్లు; తు. ఓట్టె; త. ఓట్టై; పో.చూ. ఉట్టై; మ. ఓట; కోట. ఓడ్; తొ. వాడ్.

**ఉడు(బోతు** చూ. ఉడుగు. వి. ప్రాపంచిక సుఖాసక్తిలేనివాడు, విరాగి.

**ఉడు(బోతుపిందె** వి. కాపు ఉడిగిన తర్వాత పట్టిన పిందె.

**ఉడు(బోతుపిందె** చూ. ఉడు(బోతు.

**ఉడువలేపు** వి. కుక్క మెడకు కట్టే తాడు లేదా గొలుసు.

**ఉడువు[1]** రూ.చూ. ఉడుగు. స.క్రి. విడుచు, త్యజించు. వేమన. 2.97; అ.క్రి. తీరు, పోవు, నశించు, తగ్గు. సారంగ. చ. 3.164.

**ఉడివించు** రూ.చూ. ఉడిగించు. స.క్రి. 1. మాన్పించు, ఆపు. భార.ఆది. 2.230; 2. అణచు, నశింపజేయు. భార. ఆది. 7.58.

**ఉడువు[2]** రూ.చూ. ఉడుపు[2]. వి. చాకలి దగ్గర నుంచి అద్దెకు తీసుకున్న బట్టలు.

**ఉడువర** పో.చూ. అడ్డనర, పెదనర, నేలనర మొ. వి. వాయసి, కాచిచెట్టు (Solanum migtum).

**ఉడుసు** విశే. బలవత్తరం (తరతమ భేదబోధకం).

పో.చూ. క. ఉఱవు, ఉఱపు, ఉఱుపు. మిగిలిన, మిగులు, నిలువ, నరితూనిక, తూకం; ఉఱసు. మిగిలేట్టు చేయు.

**ఉడైయారు** వి. కుమ్మరివారి పేర్ల చివర పెట్టుకొనే కుల బిరుదం, రాజశ్రేష్ఠుడు.

త. ఉటైయార్. ప్రభువు, యజమాని, కొంతమంది వ్యవసాయదార్ల పేర్ల చివర చేరే బిరుద వాచకం.

<త. ఉడైయార్.

**ఉడ్కు** రూ.చూ. ఉడుకు. విశే. వెచ్చని. విక్ర. 1.78, సిం. ద్వా. 6.118.

**ఉడ్కువ** రూ.చూ. ఉడుకువ. వి. విరతి, ఊరట. భార. విరా. 3.96.

**ఉడ్చు** వి. గుంత్రటి గడ్డ, కురుపు.

క. ఉడమ, ఉడుమ, ఒడుమ. ఒడిసెగడ్డ.

<క. ఉడచు.

**ఉడ్డ** రూ. ఉడ్డా. వి. 1. సమూహం. ప్రబంధ. 788; 2. గుట్ట, తిప్ప, తిన్నె; 3. కంది. పెసర మొ. పైర్లు కోసివేసిన కుప్ప; విశే. నాలుగు సాం.ని. 29.

క. ఉడ్డి, ఒడ్డి, ఒడ్డు. నాల్గు వస్తువుల పోగు లేదా దొంతి; తు. ఒడ్డుణి. పోగుచేయు; ఒడ్డుఅన్. పోగు; పో.చూ. సం. వృద్ధ. పెరిగిన.

<క. ఉడ్డి.

**ఉడ్డకేలుగలా(డు** వి. నాలుగు చేతులు గల వాడు,

విష్ణువు. సాంబ. ని. 4. **ఉర్ధకేలువేలుపు** వి. నాలుగు చేతులుగల దేవుడు, విష్ణువు. **ఉర్ధకేల్దొరబిడ్డ** వి. నాలుగు చేతులుగల దొరబిడ్డ, విష్ణువు. వేంక.పంచ. 1.4. **ఉర్ధకేల్మిడిదొరబిడ్డ** ఉర్ధ + కేలు + మిడి + దొర + బిడ్డ. వి. పన్నెండు చేతులుగల దొరబిడ్డ, కుమారస్వామి. **ఉర్ధబిగదలు** రూ. ఉర్ధబుదగలు. వి. చెంపసరాలు, స్త్రీలు చెవి కొనన ధరించే నాలుగుపేటల హారవిశేషం. హంస. 4.138. **ఉర్ధబుదగలు** రూ.చూ. ఉర్ధబుగదలు. **ఉర్ధబెట్టు** స.క్రి. కోసిన ఆకుల్ని మొదళ్ళుపైకి వచ్చేటట్లు నిలబెట్టు. **ఉర్ధమోము వేలుపు** రూ. ఉర్ధమోమువేల్పు. వి. నాల్గు మొగములుగల దేవుడు, బ్రహ్మ. **ఉర్ధమోమువేల్పు** రూ.చూ. ఉర్ధమోము వేలుపు.

**ఉర్ధకేలుగలాఁడు** చూ. ఉర్ధ.

**ఉర్ధకేలువేలుపు** చూ. ఉర్ధ.

**ఉర్ధకేల్దొరబిడ్డ** చూ. ఉర్ధ.

**ఉర్ధకేల్మిడిదొరబిడ్డ** చూ. ఉర్ధ.

**ఉర్ధబిగదలు** చూ. ఉర్ధ.

**ఉర్ధబుదగలు** చూ. ఉర్ధ.

**ఉర్ధబెట్టు** చూ. ఉర్ధ.

**ఉర్ధమోమువేలుపు** చూ. ఉర్ధ.

**ఉర్ధమోమువేల్పు** చూ. ఉర్ధ.

**ఉర్ధా** రూ.చూ. ఉర్ధ. వి. పోగు, కుప్ప, దొంతి.

**ఉర్ధాచేయు** స.క్రి. రాసినుండి గింజ తేరు.

**ఉర్ధాచేయు** చూ. ఉర్ధా.

**ఉర్ధాడించు** చూ. ఉర్ధు.

**ఉర్ధాడు** చూ. ఉర్ధు.

**ఉర్ధు** (శబ్ద పల్లవంలో పూర్వభాగంగానే ప్రయుక్తం) పో.చూ. ఉడుకు. వి. కలత, క్షోభం, ఉక్కిరిబిక్కిరి.

క. ఉడుకిసు. బిగించు, నొక్కు, విరోధించు, అణచు; త. ఉటుఱ్ఱు ('ఉటల్' యొక్క ప్రే.) బాధించు, హింసించు, రెచ్చగొట్టు, పురికొల్పు.

<ప్రా. తె. *ఉర్ధు.

**ఉర్ధాడించు** ఉర్ధాడుయొక్క ప్రే. స.క్రి. **1.** తిప్పు, చుట్టూ కదిలించు. భాగ. 8.47 ; **2.** కలచు, క్షోభపెట్టు. ప్రభా. 3.70 ; **3.** పీడించు, బాధించు. మల్ల. 2.27 ; **4.** న్యూనపరచు, తక్కువచేయు. ముకుంద. 2.210. **ఉర్ధాడు** అ.క్రి. కలతచెందు, క్షోభించు, తబ్బిబ్బగు. ద్వి. భాగ. 10. **ఉర్ధుగుడుచు** ఉర్ధు + కుడుచు. అ.క్రి. ఊపిరి తిరుగక బాధపడు, ఉక్కిరిబిక్కిరగు. పాండు. 3.150, దశా. 2.398.

**ఉర్ధుగుడుచు** చూ. ఉర్ధు-.

**ఉర్ధోలం** పో.చూ. విడ్డూరము. వి. ఆశ్చర్యం.

**ఉర్ధోలుఁడు** వి. ఉద్ధతుడు.

**ఉర్ధ్వు**[1] రూ.చూ. ఉడుపు[1]. స.క్రి. పోగొట్టు, తీర్చు, మాన్చు. ద్వి. హరిశ్చ. ఉ. 1718.

**ఉర్ధ్వు**[2] రూ.చూ. ఉడుపు[2]. వి. బట్ట, దుస్తు.

**ఉర్ధ్లపల్లంచి** వి. ఆడపిల్లల ఆట.

త. ఉట్టి, ఉత్తై. ఓమనగాయలు; పో.చూ. పల్లాంకుళి. ఓమనగుంటలు.

**ఉఱుజ** రూ. ఉరుజ, ఉడుజు[1], ఉలచ (మీను), ఉలువ. వి. ఒక రకం చేప.

క. ఉఱచిమీను. ఒక రకం చేప ; త. ఉళువై. ఆకు పచ్చని సముద్రపుచేప, గోధుమరంగు మంచి నీటిచేప, పసుపుపచ్చని మంచి నీటిచేప ; ఉళువై. గోధుమ బూడిద రంగు సముద్రపుచేప ; మ. ఉఴు. ఒక రకం చేప ; గోం. వారమీస్.

పో.చూ. సం. ఉలుపిన్. బేడినచేప.

**ఉంట** రూ.చూ. ఉండ. చంద్రా. 1.75, పార్వ. 1.54.

**ఉంటగాలము** వి. సీసపుగుండు కట్టిన ఒక విధమైన గాలం. హంస. 4.184. **ఉంటవిల్లు** వి. ఉండవిల్లు, ఉంతేలు.

**ఉంటగాలము** చూ. ఉంట.

**ఉంటవిల్లు** చూ. ఉంట.

**ఉండ** రూ. ఉంట. వి. **1.** గుళిక, గుండ్రముగా చేయబడిన వస్తువు. నిర్వ. 6.88, పారి. 2.36 ; **2.** ఆకులతో ఉన్న బండిచక్రం. యయా. 5.56, రాజ. వి. 1.31.

క. ఉండె. గుండ్రని వస్తువు, ముద్ద; తు. ఉండె. బంతి; ఉరుండె. గుండ్రని వస్తువు, ముద్ద, బంతి ; ఉరుంటు. గుండ్రని ; త. ఉండై. బంతి ఉండ, గుండ్రని వస్తువు, గోళము, అన్నం ముద్ద, బెల్లంతో కలిపి చేసిన గంజాయి మాత్ర ; ఉరుండై. గుండ్రని వస్తువు, బంతి, ఉండ, అన్నంముద్ద ; ఉరుళై. చక్రం ; ఉరుళ్. దొర్లు, తిరుగు, గుండ్రముగా అగు; మ. ఉండ. బంతి, ముద్ద, గడ్డ. చిన్న ఉండ ; ఉరుళ్. గుండ్రని, చక్రం ; గోం. పో.చూ. సురుండానా, సురుండ్స్, సురుండాక. గుండ్రముగా తిరుగు ; కుఇ. పో.చూ. సుర్పుడి. వంపులుతిరిగిన ; సురి. అర్ధ వర్తులాకారపు పెంకు ;

హిందార్య భాషలలోకి ప్రతిదేయం :

ప్రా. ఉండ, ఉండగ, ఉండయ, ఉండి. ముద్దబంతి, గడ్డ ; అ. మా. ఉండగ, ఉండక. ముద్ద, గడ్డ ; ఉండీ. చిన్న ముద్ద.

<మూ.ద.ద్రా. *ఉరుళ్-ట్/*ఉరుణ్-ట్.

**ఉండకోవి** రూ.చూ. ఉండక్రోవి. వి. గుండ్రని చేతికర్ర, బెత్తం. **ఉండక్రోవి** రూ. ఉండకోవి, ఉండలక్రోవి. వి. **1.** ఘుటికాక్షేపణనాళం, ఒక విధమైన వేట సాధనం. ఉ.హ. 4.22 ; **2.** సన్యాసుల చేతుల్లో ఉండే దండం, లాఠాము ; **3.** పట్టుకొనేచోట గుండ్రంగా ఉండే చేతికర్ర. **ఉండగట్టు** ఉండ + కట్టు. అ.క్రి. ముద్ద అగు, ఉండగా ఏర్పడు. స.క్రి. ముద్దచేయు, ఉండచేయు. **ఉండచీట్లువేయు** అ.క్రి. జోట్లువేయు. **ఉండనూలు** వి. దారపుండ. **ఉండల క్రోవి** రూ.చూ. ఉండక్రోవి. వి. ఒక రకం వేటసాధనం, ఘుటికాక్షేపణనాళం. ఉ.హ. 4.22. **ఉండవిలు** రూ.చూ. ఉండవిల్లు. వి. ఉండలువేసే విల్లు. శృం.నై. 2.97. **ఉండ విల్లు** రూ. ఉండవిలు, ఉండీలు, ఉండేలు. వి. ఉండలువేసే విల్లు. **ఉండవిల్లుబద్ద** వి. ఉండేలుబద్ద. **ఉండమరియ** వి. గుండ్రని ఆకృతిగల ఒకవిధమైన కత్తి. రాజ.వి. 3.65.

**ఉండీలు** రూ.చూ. ఉండవిల్లు. వి. బాణాలకు బదులు ఉండలను లేదా ఇనపగుళ్ళను వేసే విల్లు. **ఉండేలు** రూ.చూ. ఉండవిల్లు. **ఉండేలుదెబ్బ** వి. **1.** ఉండవిల్లుతో కొట్టిన దెబ్బ; **2.** తప్పకోరాని గట్టి దెబ్బ.

**ఉండకోవి** చూ. ఉండ.

**ఉండక్రోవి** చూ. ఉండ.

**ఉండగట్టు** చూ. ఉండ.

**ఉండచీట్లువేయు** చూ. ఉండ.

**ఉండఁజేయు** చూ. ఉండు.

**ఉండనూలు** చూ. ఉండ.

**ఉండలక్రోవి** చూ. ఉండ.

**ఉండవిలు** చూ. ఉండ.

**ఉండవిల్లు** చూ. ఉండ.

**ఉండవిల్లుబద్ద** చూ. ఉండ.

**ఉండసురియ** చూ. ఉండ.

**ఉండి**[1] చూ. ఉండు.

**ఉండి**[2] రూ.చూ. హుండి. వి. **1.** భిక్షాపాత్ర; **2.** ముడుపులు వేయటానికి దేవాలయంలో ముద్రవేసి ఉంచిన పాత్ర, రేక పెట్టె.

**ఉండిగ** రూ.చూ. హుండి. వి. **1.** ముడుపులు వేయటానికి దేవాలయంలో ముద్రవేసి ఉంచిన పాత్ర రేక పెట్టె. శుక. 3.442, **2.** లక్కగూడు.

**ఉండీలు** చూ. ఉండ.

**ఉండు** సపదా. **1.** స్థితమగు. భార.ఆది. 7.166 : **2.** జీవించు. భార.ఆది. 4.221; **3.** ఊరకుండు. భార.ఆది. 8.185, భీష్మ. 1.195; **4.** కొన్నిపట్ల తుమున్నంతముల కను ప్రయుక్తమై 'సిద్ధమగు.' 'అభిముఖంగా ఉండు' అనే అర్థం ఇస్తుంది. భార.అది. 6.247, అశ్వ. 4.259; **5.** ప్రవర్తిల్లు. భార.సభా. 1.31; **6.** నివసించు. విక్ర. 2.244; **7.** కొన్ని పదాల తర్వాత వస్తుంది. (1) సుఖముండు, సంతోషముగా నుండు. భాగ. 10. ఉ. 525. (2) ఉపవాసముండు, పస్తుండు. వరాహ. 9.83; కొలువుండు. సభతీర్చి ఉండు. మను. 1.13; **8.** శేషించు, మిగులు. శృం.నై. 4.64; **9.** ఆగు, నిలుచు. పారి. 1.105; **10.** కొన్నిపట్ల తుమున్నంతముల కనుప్రయుక్తమై భవిష్యదర్థాన్ని సూచిస్తుంది. హర. 2.24, కవిరా. 1.131; **11.** కొన్ని ధాతుజన్యాలైన అవ్యయాలకు అనుప్రయుక్తం. భార.ఆది. 3.24, విక్ర. 3.11, కేయూర. 3.23.

క. *ఉళ్*, *ఒళ్*. ఉండు, కల్గిఉండు, పొందు; *ఉణ్టు*. ఉన్నది; తు. *ఉణ్టు*; త. *ఉళ్*. ఉండు, కలిగిఉండు; *ఉణ్టు*. అన్ని పురుషల్లో అన్ని లింగాల్లో ఏకబహువచనాల్లో 'ఉండు' అనే అర్థంలో వాడబడే సమాపక క్రియ. *ఉణ్మై*. ఉనికి, స్థితి, వాస్తవం, నిజాయితీ, అర్థవం, నిజం; మ. *ఉళ్*. లోపల ఉండు, జీవించు; *ఉణ్టు*. అక్కడ; కోట. *ఒళ్*-. జీవించు, ఉండు; తొద. *విళ్ద్*-. జీవించు, ఒక చోట ఉండు, కల్గియుండు. పో.చూ. గోం. సూస్ధీ-ఊస్ధీ, ఉద్దానా. మోకాళ్ళమీద తలపెట్టి గొంతుకూర్చుండు: *ఉద్ద్*-, *ఉత్స్*-. కూర్చొను. పో.చూ. కోయ. *ఉద్*; పర్జి. *ఉన్ద్*; కొలా. *ఉద్ద్*; నా. *ఉద్ద్*, *ఉద్-ఎఙ్*; ఒల్లా. *ఉంట్*; బ్రా. *ఉట్*. ఉన్నాను; *ఉన్*. ఉన్నాము; *ఉస్*. ఉన్నావు; *ఉరె*. (మీరు) ఉన్నారు; *ఉర్*. (వారు) ఉన్నారు.

<మూ.ద.ద్రా. *ఉళ్-/*ఉఢ్-ట్-.

**ఉండఁజేయు** (-చేయు). అ.క్రి. ఉంచు, ఉంచునట్లు చేయు. -**ఉండి**[1] 'ఉండు' ధాతుక్త్వార్థక రూపం. ప్రత్య. **1.** పంచమీవిభక్తి ప్రత్యయం. భార.ఆది. 5.20, ఆను. 2.118; **2.** మొదలుకొని (అంతనుండి) అనే అర్థాన్ని తెలియజేస్తుంది. ఉ.హ. 5.293; **3.** హేత్వర్థక ప్రత్యయం. అని. 2.137. **ఉండుకొను** అ.క్రి. ఉండు, జీవించు. కాళిందీ. 2.211.

**ఉండుకొను** చూ. ఉండు.

**ఉంతె** చూ. ఉండ. వి. ఊరుమూల దేశం, పిరుదులు.

తు. *పుకుళిదఉర్ణ్తె*. పిరుదులు; *ఉర్ణ్తె*. గుండ్రని వస్తువు.

**ఉండెపోవు** పో.చూ. అంద[1]. అ.క్రి. కాలికి దెబ్బతగిలి కీలు తప్పు.

**ఉండెపోవు** చూ. ఉండె.

**ఉండెము** పో.చూ. ఉండ. వి. చిన్న బురుజు.

**ఉండేలు** చూ. ఉండ.

**ఉండేలుదెబ్బ** చూ. ఉండ.

**ఉంద్ర** రూ. ఉంద్రన, ఉంత్రన, ఉంద్రెన, ఉంద్రెన. వి. తెల్లచండ్ర, వెలిచండ్ర, కదరము (Acacia catecha). వాల్మీ. 2.82, ఆం.భా. 2.48.

**ఉంద్రకంప** వి. ఒక రకం పొద.

**ఉంద్రకము** రూ. ఉంద్రము. వి. మోదకం, ఉడికించిన పిండి ఉండలు చేసి ఆవిరిమీద వండిన భక్ష్యం. ధర్మ. 7.115.

సం. *ఉండేరక*-. పిండిముద్ద, రొట్టె; ప్రా. *ఉండ*-, *ఉండగ*-, *ఉండయ*-. బంతి, గుండ్రని ముద్ద; అ.మా. *ఉండేరియ*. ఒక రకం మిఠాయి.

బహుశః ప్రాకృతంలోని పదాలు ద్రావిడ భాషలనుంచి ప్రతిదేయాలు కావచ్చు; ప్రా. *ఉండ*-<ద్రా. ఉరుండ.

**ఉంద్రకంప** చూ. ఉంద్ర.

**ఉంద్రంచి** పో.చూ. ఉంద్రన. వి. ఒక రకం కలుపుమొక్క.

**ఉంద్రన** రూ.చూ. ఉంద్ర. వి. దుర్వాసనకల ఒక రకం చెట్టు, వెలిచండ్రచెట్టు (Acacia catecha).

ఉంద్రన, ఉంద్రెన రూపాలు లేఖక ప్రమాదాలవల్ల ఏర్పడ్డవి కావచ్చు. తెలుగులో న, న లకు ఎక్కువ పోలిక ఉండటంవల్ల ఉంద్రన, ఉంద్రెన లలోని నకారం నకారమై ఉంటుంది. తెలుగులో ఎంగెన, కొడిన మొ. నకారాంతాలైన చెట్లపేర్లున్నాయి.

**ఉంద్రము** రూ.చూ. ఉంద్రకము. విణ. గుండ్రని; వి. మోదకం (బహువచనంలోనే ప్రయోగం – ఉంద్రాలు).

**ఉంద్రముముక్క** వి. మోదకం. **ఉంద్రాయి** వి. మోదకం. **ఉంద్రాలు** ఉంద్రముయొక్క నిత్య బహువచనం. రూ. ఉంద్రాళ్ళు. వి. బ.వ. మోదకాలు. హర. 6.55, కాశీ. 7.185. **ఉంద్రాళ్ళతద్దె** వి. ఈడూజోడైన భర్త లభించాలని ఉంద్రాళ్ళు నివేదించి భాద్రపద బహుళ తదియనాడు

గౌరీదేవినిగూర్చి బాలికలు చేసే వ్రతం. **ఉండ్రాళ్ళు** రూ. చూ. ఉండ్రాలు. వి. మోదకాలు. హర. 6.55.

**ఉండ్రముముక్క** చూ. ఉండ్రము.

**ఉండ్రదన** రూ.చూ. ఉండ్ర. వి. వెలిచంద్ర. ఆం.బా. 2.48.

**ఉండ్రాయి** చూ. ఉండ్రము.

**ఉండ్రాలు** చూ. ఉండ్రము.

**ఉండ్రాళ్ళతద్ది** చూ. ఉండ్రము.

**ఉండ్రాళ్ళు** చూ. ఉండ్రము.

**ఉండ్రెవ** రూ.చూ. ఉండ్ర. వి. వెలిచంద్ర.

**ఉండ్రెన** రూ.చూ. ఉండ్ర. వి. వెలిచంద్ర.

**ఉతక** రూ. ఉతుక, ఉదక, ఉదుక. వి. తలుపు కుసి తిరగటానికై తలుపుకు కింద అమర్చిన కొయ్య చిప్ప. కవాట మూలాలవాలం. వేమన.

నం. ఉదూఖల-. కొయ్యరోలు, రోలు; ప్రా. ఉఊఖల-, ఉఊహల-, ఉదూఖల; అమా. ఉఊహల; పా. ఉదుక్ఖల, ఉదుక్ఖలిక. తలుపు లోని భాగం, గడప ?;

పో.చూ. క. ఉదూఖల, ఉలూకల. కొయ్యరోలు, రోలు; ఉత్తరంగ. దర్వాజా చట్రపు పై కమ్మి.

<నం. ఉదూఖల-.

**ఉతకతలుపు** వి. రెండువైపులా కుసులున్న ఒంటి రెక్క తలుపు.

**ఉతకతలుపు** చూ. ఉతక.

**ఉతాయింపు** పో.చూ. ఉజ్జాయింపు. చూ. ఉతారు. వి. రమారమి, సుమారు.

**ఉతారా** రూ.చూ. ఉతారు. వి. అంచనా, మదింపు

**ఉతారు** రూ. ఉతారా. పో.చూ. ఉజ్జాయింపు. వి. 1. సుమారు, రమారమి; 2. ఊహ, ఉద్దేశ్యం.

**ఉతికించు** చూ. ఉతుకు.

**ఉతుక** రూ.చూ. ఉతక. వి. తలుపు కుసి తిరగటానికి వీలుగా తలుపు కింద వేసిన కొయ్య చిప్ప.

**ఉతుకించు** చూ. ఉతుకు.

**ఉతుకు** రూ.చూ. ఉదుకు. స.క్రి. 1. మురికి పోవటానికి బట్టలను రాతిమీద వేసి కొట్టు. వైజ. 2.115; 2. బాదు, కొట్టు.

**ఉతికించు** రూ.చూ. ఉతుకించు. స.క్రి. ఉతికేటట్లు చేయు. **ఉతుకించు** 'ఉతుకు' ధాతుప్రే.; రూ. ఉతికించు. స.క్రి. ఉతికేటట్లు చేయు.

**ఉత్కలాడు** స.క్రి. ప్రసవించు, కను.

<ఉతకాలాడు <ఉతకాలు+ఆడు <ఉదకాలు+ఆడు.

**ఉత్త** రూ. ఉత్తి[1]; పో.చూ. వట్టి. విశ. 1. కేవలం. చాటువు; 2. శూన్యం. వేమన; 3. అసత్యం; 4. పని లేనిది; 5. నిరర్థకం.

పో.చూ. త. వెఱు. శూన్యం; వెఱుమై. శూన్యత; వఱుమై. పేదరికం; వఱు. ఎండిపోవు; పో.చూ. మ. వెఱున్. దిక్కులేని, పేద; పో.చూ. పర్జి. ఊద. చెడ్డ, పనికిరాని.

**ఉత్తగుర్రము** వి. రౌతులేని గుర్రం. **ఉత్తప్పుడు** ఉత్త+అప్పుడు. క్రి.విశ. 1. పనిలేనివేళ; 2. మామూలు వేళ. **ఉత్తబిత్తలు** చూ. ఉత్తలబిత్తల. క్రి.విశ. 1. నగ్నంగా, దిసమొలతో; 2. వట్టి చేతులతో. **ఉత్తమాట** వి. అసత్యం, వ్య. ఖాళీమాట. **ఉత్తుత్త** ఉత్త+ఉత్త. విశ. పూర్తిగా వట్టి(ది).

**ఉత్తగుర్రము** చూ. ఉత్త.

**ఉత్తండము** వి. స్త్రీల కంఠాభరణం. హంస. 2.190.

క. ఉత్తండ, ఉత్తండాలు. బంగారు గొలుసు; త. ఉత్తంటుమణి, ఉత్తంటాల్. బంగారు పూసల హారం.

బహుశః. <నం. ఉద్దండ-. ముఖ్యం, ముఖ్యమైన ఆభరణం.

**ఉత్తప్పుడు** చూ. ఉత్త.

**ఉత్తబిత్తలు** చూ. ఉత్త.

**ఉత్తమాట** చూ. ఉత్త.

**ఉత్తరకుమారప్రజ్ఞలు** వి. కొనసాగని మాటలు, డాంబికాలు. వ్య. ఉత్తరుడి ప్రగల్భాలవంటి ప్రగల్భాలు.

**ఉత్తరజందెము** మిశ్రస. రూ. ఉత్తర జన్నిదము. వి. 1. జందెంలాగా వేసుకొనే ముత్యాల హారం. ప్రభు. 148 పు. 15 పం; 2. జందెంతో వేసుకునే మరొక బంగారు పోగుల జందెం; 3. కొత్త జందెం వేసుకొన్న తర్వాత తీసేసిన పాత జందెం. (మొదట దారపు జందెం వేసుకొన్న తర్వాత వెండి, బంగారు జందాలు వేసుకొంటారు. అయితే వాటిని తర్వాత తీసేస్తారు).

<నం. ఉత్తర-+జందెము.

**ఉత్తరజన్నిదము** మిశ్రస. రూ.చూ. ఉత్తరజందెము. వి. జందెం మాదిరిగా వేసుకొనే ముత్యాల హారం. రాజ. వి. 3.34.

**ఉత్తరదొక్కరము** మిశ్రస. వి. మల్లబంధ విశేషం. మల్లు. 3.69.

<నం. ఉత్తర-+దోః+కర-.

**ఉత్తరపాటు** వి. 1. రక్తప్రవాహం; 2. వీరమరణం చెందిన వాని కుటుంబాని కిచ్చిన ఈనాము; 3. రాజ సేవలో గాయపడిన వానికిచ్చే పరిహారం.

త. ఉతిర-ప్-పాటు. ఎక్కువ ఋతు స్రావం; ఉతిరం. రక్తం; పో.చూ. ఉరత్త-క్-క్కాణిక్కై. యుద్ధ వీరుల కిచ్చే బహుమానం; ఉరత్త-మాణియం. యుద్ధంలో పనిచేసినందు కిచ్చే మాన్యం, ఈనాము.

<త. ఉతిర-ప్-పాటు.

**ఉత్తరఫిర్యాదుదారు** మిశ్రస. వి. పై న్యాయాధిపతి వద్ద ఫిర్యాదు చేసినవాడు. వ్య. ఫిర్యాదుచేసే ప్రతివాది.

నం. ఉత్తర-. తర్వాత, ఆపైన.

<నం. ఉత్తర-+ఉ. ఫిర్యాదార్.

**ఉత్తరము** వి. 1. జాబు. కువ.చ. 4.203; 2. లిఖితపూర్వకమైన ప్రత్యుత్తరం.

నం. మరా. ఉత్తర-. వి. జవాబు; నే. ఉత్తర, ఉతరా, జవాబు, వంక, సాకు, వాదం;

క.తు. ఉత్తర ; త.మ. ఉత్తరమ్ ; జవాబు, ఉత్తరువు, జాబు.

<నం. ఉత్తర-.

**ఉత్తరశివాయి** మి|శ్రమ. వి. ముందుగా ఆ|క్రమించి పట్టాకోసం దరఖాస్తు పెట్టుకొన్న భూమి. చూ. శివాయి.

నం. ఉత్తర-. అనుసరించు, వెంబడించు.

<నం. ఉత్తర + ఉ. శివాయ్.

**ఉత్తరసర్కారులు** మి|శ్రమ. చూ. సర్కారులు. వి. ఆం|ధ్ర దేశంలోని ఉత్తర జిల్లాలు ; శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, గుంటూరు, కృష్ణా.

<నం. ఉత్తర- + ఉ. సర్కార్(లు).

**ఉత్తరసాల** రూ.చూ. ఉత్తరాషాఢ. వి. పద్యమానంలో వచ్చే ఉత్తర కార్తె.

**ఉత్తరాచి** వి. కామంచి చెట్టు (Helictrus isord).

**ఉత్తరాజి** రూ.చూ. ఉత్తరాని. వి. 1. అడ్డపట్టె ; 2. కడప ; 3. ద్వారబంధం పట్టె, నాగవానం.

**ఉత్తరాది** రూ.చూ. ఉత్తరాని. వి. 1. అడ్డపట్టె ; 2. కడప ; 3. ద్వారబంధం పట్టె, నాగవానం.

**ఉత్తరాని** రూ. ఉత్తరాజి, ఉత్తరాది. చూ. ఉత్తరానులు. వి. 1. అడ్డపట్టె ; 2. కడప ; 3. ద్వారబంధం పట్టె, నాగవానం.

**ఉత్తరానులు** వి. తలుపు తిరగటానికి ఆధారంగా కింద, మీద అమర్చిన ఇనుపకుసులు.

<నం. ఉత్తర-(మీది) + అను <నం. అన-ఆధారం.

**ఉత్తరిగ** రూ.చూ. ఉత్తరిగము. వి. హార విశేషం. హరి. 404.

**ఉత్తరిగము** రూ. ఉత్తరిగ. వి. 1. ఉత్తరీయం ; 2. జందెం లాగా వేసుకొనే బంగారుహారం.

నం. ఉత్తరీయ-. పైపంచె ; ఉత్తరీయక ; |పా. అ.మా ; ఉత్తరిజ్జ-, ఉత్తరీయ ; పా. ఉత్తరీయ ; హిం. ఉత్తర్యా ; మరా. ఉత్తరీ. అపరకర్మలు చేసేటప్పుడు పైన వేసుకొనే బట్ట ;

క. ఉత్తరిగె. ఉత్తరీయం ; తు. ఉత్తరిగె ; త. ఉత్తరియమ్, ఉత్తరీయమ్.

<నం. ఉత్తరీయక-.

**ఉత్తరిగె** వి. హారవిశేషం. |పబంధ. 605, అం.భా. 2.149.

క. ఉత్తరిగె. ఉత్తరీయం.

<క. ఉత్తరిగె. అర్థవిపరి.

**ఉత్తరించు** స.|క్రి. 1. ఖండించు, నరకు. ఉ.హ. 4.28 ; 2. తెగడు, తిరస్కరించు. పాండు. 3.179.

నం. ఉత్తరతి. బయటికి వచ్చు, తప్పించుకొను ; పా. ఉత్తరతి. దాటు, ఆవరించు.

<నం. ఉద్ + తర్ (<నం. తౄ) + -ఇంచు³. అర్థ విపరి.

**ఉత్తరువు** వి. ఆజ్ఞ, అనుమతి, సెలవు. రాజ. వి. 5.13, శుక. 3.587.

నం. |పా. ఉత్తర-. జవాబు, |పత్యుత్తరం ; నే. ఉత్తర్, ఉత్తరా, ఉతరా. జవాబు, పొత్తు, వాదం ;

త. ఉత్తరవు. ఆజ్ఞ, సెలవు, జవాబు, |పత్యుత్తరం ; ఉత్తరమ్, ఉత్తారమ్ ; మ. ఉత్తరవు. ఆజ్ఞ, సెలవు ; ఉత్తరమ్. సెలవు.

<నం. ఉత్తర-.

**ఉత్తరేణి** రూ. ఉత్తరేణు, ఉత్తరేను. వి. ఉత్తరేనిచెట్టు (Achyranthus aspera).

క. ఉత్తరణి, ఉత్తరణె, ఉత్తరాణి, ఉత్తరేణి ; తు. ఉత్తరణె.

**ఉత్తరేణు** రూ.చూ. ఉత్తరేణి.

**ఉత్తరేను** రూ.చూ. ఉత్తరేణి.

**ఉత్తరౌతు** వి. కట్టుబడికి పనికివచ్చే ఒక రకం రాయి.

**ఉత్తలపడు** చూ. ఉత్తలము.

**ఉత్తలపాటు** చూ. ఉత్తలము.

**ఉత్తలపెట్టు** చూ. ఉత్తలము.

**ఉత్తలము** వి. 1. కలక, కాలుష్యం. నిర్వ. 2.98 ; 2. సంక్షోభం. భార.విరా. 2.36 ; 3. పరితాపం. భార.ఆర. 7.210, వసు. 4.25 ; 4. సం|భ్రమం, తత్తర. భాగ. 6.378. ఆం.భా. 1.140 ; 5. భీతి, బెదురు. ఆం.భా. 1.183 ; 6. తారుమారు.

నం. ఉద్ + తల-; ఉత్తల-. నేలమీదనుంచి తొలగింపబడినది, ఆధారం లేనిది.

<నం. ఉద్ + తల-.

**ఉత్తలపడు** అ.|క్రి. 1. పరితపించు, దుఃఖించు. భార. విరా. 5.288 ; 2. క్షోభించు, కలతచెందు. భార.భీష్మ. 2.267 ; 3. త్వరపడు. హరి.పూ. 7.112, రం.రా.అర. 174 పు. 9 పం. ; 4. తారుమారగు. పీఠి. 25, భోజ. 4.77. **ఉత్తలపాటు** వి. 1. కలత, సంక్షోభం. భార.భీష్మ. 2.372, కళా. 3.178 ; 2. పరితాపం, దుఃఖం. శృం.నై. 2.36. **ఉత్తలపెట్టు** స.|క్రి. 1. పరితపింపజేయు, బాధపెట్టు. భార.|ద్రోణ. 2.8, శాంతి. 2.281 ; 2. తలకిందుచేయు, తారుమారుచేయు. **ఉత్తలమొందు** అ.|క్రి. కలతనొందు, వ్యాకులపడు.

**ఉత్తలమొందు** చూ. ఉత్తలము.

**ఉత్తపెల్ల** వి. ఒక రకం కలుపుమొక్క.

**ఉత్తి**[1] రూ.చూ. ఉత్త. విశ. వట్టి(ది), అసత్యమైన.

**ఉత్తి**[2] రూ.చూ. ఉద్ది[1]. వి. ఈడు, జోడు. వై.భా. 1.95.

**ఉత్తు(డు** వి. అర్హుడు, తగినవాడు. భార.అను. 2.105, వి|క్ర. 1.94, భోజ. 4.384.

నం. యుక్త-. తగినవాడు, తగినది ; |పా. అ.మా. జుత్త. పా. యుత్త, యుత్తక.

<నం. యుక్త-.

**ఉత్తుత్త** చూ. ఉత్త.

**ఉత్ప్రతీతగాడు** వి. ఒకడు చెప్పే |పతిమాటకు తల ఊపేవాడు. తథాస్తు అనేవాడు.

**ఉత్సాయమందిరం** వి. ఉత్సవ సమయాల్లో వాడే చిన్న తేరు.

<నం. ఉత్సవమందిర-.

**ఉదక** రూ.చూ. ఉతక. వి. తలుపు కుసి తిరగటానికి తలుపు కింద అమర్చిన కొయ్య చిప్ప.

**ఉదయరాగపట్టులు** మి(శ్ర. వి. వస్త్ర విశేషం. సిం. ద్వా. 3.206.

క. ఉదయరాగపటి. ఒక రకం చీర.

<సం. ఉదయరాగ-+పట్టులు

**ఉదరగొట్టు** చూ. ఉదరు.

**ఉదరదోలు** చూ. ఉదరు.

**ఉదరపాటు** చూ. ఉత్తరపాటు. వి. 1. రక్త (ప్రవాహం; 2. వీరమరణం చెందినవాని కుటుంబానికిచ్చిన ఈనాము; 3. రాజసేవలో గాయపడినవానికిచ్చే పరిహారం.

**ఉదరిపడు** చూ. ఉదరు.

**ఉదరిపాటు** చూ. ఉదరు.

**ఉదరు** రూ. ఉదురు. అ.(క్రి. 1. కోపించు. భార.ఆది. 4.201; 2. కదలు, చలించు. కు.సం. 5.630; 3. భయ(క్రోధాదులచే కంపించు. రం.రా. యుద్ధ. 377 పం; 4. అదరు. హరి.పూ. 7.177; 5. విజృంభించు. భాగ. 8.719; 6. భయపడు. ద్వి.హరిశ్చ.పూ. 416 పం.; వి. ఉద్ధతి. ఉదుటు. కు.సం. 12.788.

క. ఒదఱు. కదలు, వణకు; తు. ఉదెఫ్రని. బాపు, వణకు; త. ఉతఱు. వణకు. వణకించు, తోసివేయు, త్యజించు; మ. ఉతఱుక. కలవరపడు. కంపించు; గద. ఒల్లా. ఉదుర్వ్-. కంపించు.

**ఉదరగొట్టు** స.(క్రి. అదరగొట్టు, బెదరగొట్టు. **ఉదరదోలు** స.(క్రి. పారదోలు. **ఉదరిపడు** రూ. ఉదిరిపడు. అ.(క్రి. అదరిపడు, తుళ్లిపడు. ఉలికిపడు. భార.ఆది. 6.21. **ఉదరిపాటు** వి. 1. అదరిపాటు, ఆకస్మికత్వం. విష్ణుమా.పూ. 1; 2. ఉలికిపాటు. ఉ.రా. 3.347.

**ఉదలు** స.(క్రి. విడుచు, వదలు.

పో.చూ. క. ఉదిర్. పడు, రాలు; తు. ఉ(దు; ఉ(దుని. ఉ(దుఱు, ఉ(దుణె; త. ఉతిర్. చెట్లపండ్లను, ఆకులను రాల్చు, దులుపు, రాలగొట్టు, ఒలుచు, ఊడగొట్టు, పగులు, రాలు, నశించు; మ. ఉతిరుక. పడు, రాలు.

<మూ.ద్రా. *ఉత్-(అల్).

**ఉదలుచు** రూ. ఉదల్చు. చూ. ఉదలు. స.(క్రి. వదలు, విడుచు. భార.విరా. 2.348.

**ఉదల్చు** రూ.చూ. ఉదలుచు. స.(క్రి. 1. విదిలించు, విడిపించు. భార.అర. 6.190.

**ఉదస్తు** వి. దేశబహిష్కృతుడు, అవమానితుడు.

సం. ఉదస్త-. (దేశ)బహిష్కృతుడు.

<సం. ఉదస్త-.

**ఉదిమంజ** వి. ఒకరకం చెట్టు (Gardemia turgida).

**ఉదియ** రూ.చూ. ఉద్దియ. వి. (ప్రయత్నం. భారా.అర. 2.133.

**ఉదియగొను** ఉదియ+కొను. అ.(క్రి. (ప్రయత్నించు. భార.అర. 2.137.

**ఉదియగొను** చూ. ఉదియ.

**ఉదిరి** విశ. మేలిమి. అగ్నిలో శుద్ధిచేయబడినది. పాండు. 4.31; వి. మేలిమిబంగారం. పాండు. 1.198.

సం. రుధిర-. రక్తం, రక్తవర్ణం; పా. రుధిర. రక్తం; త. ఉతిరం. రక్తం.

<సం. రుధిర-. అర్థవిపరి.

**ఉదిరిగొను** ఉదిరి + కొను; చూ. ఉదిరి. అ.(క్రి. తపించు, పరితపించు. ఉ.హ. 5. **ఉదిరిమల** వి. బంగారుకొండ, మేరుపర్వతం. రాజ.వి. 2.79.

**ఉదిరిగొను** చూ. ఉదిరి.

**ఉదిరిపడు** చూ. ఉదురు.

**ఉదిరిమల** చూ. ఉదిరి.

**ఉదిల** చూ. ఉదిలు. వి. 1. అధైర్యం. ఆం.భా. 1.188; 2. చలనం; 3. పరితాపం.

**ఉదిలకొను** అ.(క్రి. 1. వణకు. చలించు. భార.ఆది. 2.21, విరా. 2.83; 2. సం(భ్రమించు, త్వరపడు. హరి.పూ. 3.252, 64; 3. (ప్రసరించు, వ్యాపించు. హర. 6.58; 4. అతిశయించు. శేయూ. 4.7.

**ఉదిలకొను** చూ. ఉదిల.

**ఉదిలము** చూ. ఉదిలు. వి. నిరుత్సాహం, అధైర్యం.

**ఉదిలు** పో.చూ. ఉదరు. అ.(క్రి. కదలు, చలించు: భీమ. 4.61.

**ఉదుక** రూ.చూ. ఉతక. వి. తలుపు కుసి తిరగడానికి తలుపు కింద అమర్చబడ్డ కొయ్యచిప్ప. ఆం.భా. 2.22.

**ఉదుకు** రూ. ఉతుకు. స.(క్రి. 1. బాదు, కొట్టు. బా.యు. 680; 2. నశింపజేయు, పోగొట్టు. భీమ. 6.17; 3. మురికిపోవటానికి బట్టలను రాతిమీదవేసి కొట్టు. ఆము. 1.88, మను. 1.54.

క. ఒదె, ఒది. తన్ను. పొడుచు, తొక్కు; త. ఉతై. తన్ను, బాదు, కొట్టు; తుతై. నొక్కు; మతై. తన్ను; పో. చూ. తువై. గుడ్డలు ఉతికినట్లు ఉదుకు. అణచు, దంచు, మ. ఉతయుక. తన్ను; ఉతవి. తన్నటం; ఉతప్పు. కొట్టటం; పో.చూ. పలక్కుక. బాదు, ఉతుకు, రుద్దు; గో. సుహ్క్, సుక్క్. ఉతుకు; పో.చూ. కుఇ. జోగ; కొలా.నా. సుత్క్; మాల్తో. ఉతెస్-, ఉసెత్. తన్ను.

<మూ.(ద్రా. *చుత్-.

**ఉదుటారు** చూ. ఉదుటు.

**ఉదుటు** రూ.చూ. అదటు. వి. 1. ఉద్ధతి, గర్వం. హరి.ఉ. 10.90; 2. సీటు, విలాసం. దశా. 2.66, ఐందు. 5.79; 3. దార్ఢ్యం. వేంక.పంచ. 2.56, శుక. 3.555; విశ. 1. నిక్కినది. ఆము. 2.10; 2. ఉద్ధతం. సారంగ.చ. 1.122; 3. సుందరం. హంస. 5.157.

పో.చూ. త. ఉతి. ఉప్పొంగు, పెద్దదగు.

**ఉదుటారు** అ.(క్రి. తుళ్ళిపడు. కాళిందీ. 2.95. **ఉదుటుతనము** వి. ఉద్ధతి. **ఉదుటెక్కు** అ.(క్రి. ఉదుటునొందు. విజృంభించు. ఆము. 6.105.

**ఉదుటుతనము** చూ. ఉదుటు.

**ఉదుటెక్కు** చూ. ఉదుటు.

**ఉదురు** రూ.చూ. ఉదరు. అ.(క్రి. 1. భయపడు, బెదరు. అష్టమ.క. 5.22, 221; 2. పారిపోవు. కళా. 6.265; 3. వణకు, కంపించు. ఉ.రా. 6.169; 4. గర్వించు; వి. ఉద్ధతి, గర్వం. కు.సం. 6.99.

**ఉదిరిపడు** రూ.చూ. ఉదరిపడు. అ.క్రి. అదరిపడు. దశా. 4.71. **ఉదురుమిదుకు** చూ. ఉదురు. వి. 1. ఉద్ధతుడు. హర. 5.10 ; 2. దుష్టుడు. కకుత్ప్థ. 5.87.

**ఉదురుమిడుకు** చూ. ఉదురు.

**ఉదూదర్** వి. పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగా పాతిన రాయి, హద్దురాయి.

హిం. ఉ. హుదూద్. హద్దులు ; పో.చూ. గు.మరా. హద్ద్ ;

<ఉ. హుదూద్.

**ఉద్ద** రూ. ఉద్దము[1]. క్రి. విశ. మిక్కిలి ; విశ. ఎత్తైన, పొడవైన.

సం. ఊర్ధ్వ-. పైది, ఉన్నతం ; ప్రా. ఉద్ధ-. పైకి ; పా. ఉద్ధ.

క. ఉద్ద, ఉద్ది, ఉద్దు. ఎత్తు,పొడవు, లోతు.

<ప్రా. ఉద్ద.

**ఉద్దడ** వి. మల్లబంధ విశేషం. ఆయుధపు వినురుల్లో ఒకటి. మల్లు. 3.69, ప్రబంధ. 78.

సం. ఉద్ధృత-. పైకెత్తబడినది ; ప్రా. ఉద్దడ-.

<ప్రా. ఉద్దడ-.

**ఉద్దనవు** రూ.చూ. ఉద్దర. వి. 1. వడ్డీలేని అప్పు ; 2. కుదువ.

**ఉద్దము[1]** రూ.చూ. ఉద్ద. విశ. పొడవైన, ఎత్తైన ; వి. 1. పొడవు, ఎత్తు ; 2. పశువుల ఊర్ధ్వకాయం.

**ఉద్దము[2]** పో.చూ. ఉద్ది[1]. వి. చెప్పు, పాదరక్ష. సిం.ద్వా. 1.83, సాం.ని. 44, ఆం.భా. 2.298.

సం. ఉద్వాహ-. మోపటం, పైకెత్తటం ; ఉద్వాహి. మోసేది, పైకెత్తేది ; ప్రా. ఉద్దాయ-, ఉద్దాహ-.

<ప్రా. ఉద్దాయ-.

**ఉద్దర** రూ. ఉద్దనవు, ఉద్దరువు. వి. తాకట్టు, కుదువ. ఆం.భా. 2.229.

సం. ఉద్ధార. అప్పు తీర్చటం, చెల్లు, వడ్డీలేని అప్పు, ఆస్తి రాబట్టుకోవటం ; ప్రా. ఉద్దార-. అప్పుగా ఇవ్వటం ; పా. ఉద్దార-. పన్ను, అప్పు, శిస్తు ; నే. ఉద్దార్, ఉధార్, ఉధారో. అప్పు ; కుమా. ఉధారో ; ఒ. ఉధార ; హిం. ప. ఉద్దార్ ; ల. ఉధారా ; గు. ఉధారొ. అప్పులెక్క ; మరా. ఉధార్. అప్పుగా కొనటం, అమ్మటం ; ముండా. ఉధార్. అప్పు.

క. ఉద్దారి, ఉదరి, ఉద్రి. అప్పుగా కొన్న వస్తువుల కింద ఇవ్వవలసిన డబ్బు ; తు. ఉదారు, ఉద్దరి ; త. ఉత్తర-వాతమ్. హామీ, జామీను, పరిహారం ; మ. ఉత్తర-వాతమ్. బాధ్యత, హామీ ; గోం. ఉధర్ ; కువి. ఉధర.

<ప్రా. ఉద్దార-. దేశ్యమని కాంబెల్.

**ఉద్దరము** వి. మూడు (విశ్వ బ్రాహ్మల పరిభాష).

**ఉద్దరి (-దరి)** పో.చూ. ఉల్ల. వి. 1. నిట్రంగా ఉన్న ఒడ్డు, కత్తెర ఒడ్డు ; 2. నది రెండు గట్లకు మధ్య భాగం.

ఉల్. నాతి దూరం, నాతి సమీపంకాని స్థలాన్ని తెలియజేసే నిర్దేశార్థక ద్రావిడ ధాతువు.

**ఉద్దరువు** రూ.చూ. ఉద్దర. వి. 1. తాకట్టు, కుదువ. పి.శకు. 1.78 ; 2. వెయ్యబోయే పైరు తాకట్టు.

**ఉద్దవడి** రూ. ఉద్దవిడి. పో.చూ. ఉద్ద. క్రి.విశ. 1. అత్యంతం, మిక్కిలి. కు.సం. 3.275 ; 2. వడిగా, అతివేగంగా. బో.జ. 7.17.

సం. ఉద్ధావ-, ఉద్ధావతి. పరుగెత్తిపోవు. టర్నర్. 2019 ; ప్రా. ఉద్ధా, ఉద్ధాఅ, ఉద్ధాఇ, ఉద్ధావణ-, ఉద్ధావణా. ప్రబల ప్రవృత్తి. శీఘ్ర కార్యసిద్ధి, దూర గమనం.

కుఇ. ఉతె, ఉదె. తొందరగా, శీఘ్రంగా, వెంటనే.

<ప్రా. ఉద్ధా + వడి.

**ఉద్దవిడి** రూ.చూ. ఉద్దవడి. క్రి.విశ. 1. శీఘ్రంగా, వెంటనే. భార.విరా. 3.120 ; 2. అత్యంతం, మిక్కిలి. శృం.నై. 2.45.

**ఉద్దానము** వి. ఫలవృక్షాదులున్న వనం.

సం. ఉద్యాన-. వనం, తోట, విహార యోగ్యమైన స్థలం.

<సం. ఉద్యాన-.

**ఉద్దారి** రూ.చూ. ఉద్దారు(డు. వి. అధికారి, ఉద్యోగి.

**ఉద్దారు(డు** రూ. ఉద్దారి. వి. ఉద్యోగి, అధికారి. శుక. 2.426.

హిం. ఉ. పార. ఓహ్‌దాదార్. అధికారి.

<ఉ. ఓహ్‌దాదార్.

**ఉద్దాలు** చూ. ఉద్దము[2]. వి. చెప్పులు. హంస. 3.121.

<ఉద్దములు ; లోపదీర్ఘతలు.

**ఉద్ది[1]** రూ. ఉజ్జ[2], ఉజ్జి[1], ఉజ్జీ, ఉత్తి[3]. విశ. సమానం, సాటి. విశ./వి. 1. ప్రతిస్పర్ధి, ఎదిరి. విజ్ఞా. 2.119, శృం.నై. 1.26; 2. యమళం, జంట. పారి. 3.38 ; వి. 1. సాంగత్యం, చెలిమి. కాశీ. 4.81 ; 2. జత, జట్టు. శశా. 5.21, పరమ. 4.100 ; 3. బాలక్రీడా విశేషం. అష్టమ. క. 1.50 పు. 26 పం ; 4. ఉజ్జీ, పోటీవాడు.

తు. ఉద్రి. ఉజ్జీ, జత ; త. ఉత్తి (<తె.). ఉజ్జీ ; ఉన్తి, ఉయి. కలియు, కలిసి ఉండు, ప్రేమించు, పోలు.

**ఉద్దికా(డు** వి. 1. జతగాడు, ప్రత్యర్థి. భల్లా. 5 ; 2. చెలికాడు. అచ్చ.రా. 5.57. **ఉద్దిగొను** ఉద్ది[1] + కొను. అ.క్రి. జతగూడు. భాగ. 10. పూ. 1082. **ఉద్దిచేయు** స.క్రి. జతచేయు, కూర్చు. కాశీ. 7.88. **ఉద్దించు** అ.క్రి. పోటీచేయు, ప్రతిఘటించు, ప్రతిస్పర్ధించు. ఉ.హ. 2.146, కాళ. 3.33 ; స.క్రి. 1. పోటీకి పిలుచు. బసవ. 5.454 ; 2. జతగూర్చు. భాగ. 10. పూ. 780. **ఉద్దీ(డు** వి. జతకాడు, చెలికాడు. శేష. 3.

**ఉద్ది[2]** వి. 1. కాలెం, గూడ మొ. వాటితో తోడిన సీరు పొర్లి పోకుండా దోనె మొదట ఎత్తుగా కట్టిన కట్ట, మల్లం ; 2. కపిలబావి గట్టున కాలవ తవ్వేందుకు ఎత్తు చేయబడిన ప్రదేశం.

క. పొలంలో నీళ్ళు నిల్వటానికి వేసే చిన్న కట్ట.

బహుశః 'ఉద్దరి'లోని అక్షర లోపంవల్ల ఏర్పడి ఉంతవచ్చు (ఉద్దరి. మధ్య కట్ట).

**ఉద్ది[3]** రూ.చూ. ఉద్దు. వి. మినుములు.

**ఉద్దికా(డు** చూ. ఉద్ది[1].

**ఉద్దిగొను** చూ. ఉద్ది[1].

**ఉద్దిచేయు** చూ. ఉద్ది[1].

**ఉద్దించు** చూ. ఉద్ది[1].

**ఉద్దిరి** వి. కొండ చీపురు చెట్టు (Grewia salvifolia).

**ఉద్దియ** రూ. ఉదియ. వి. యత్నం.

నం. ఉద్యమ-. సన్నాహం, ప్రయత్నం ; ప్రా. అ.మా. ఉజ్జమ, నే. ఉద్దిమ్, ఉద్యమ్. ప్రయత్నం, పని ; ముండా. ఉదామ్. పని, వర్తకం ; ఉద్దర, ఉధార్. అప్పు.

క. ఉద్దమి, ఉద్దమె, ఉద్దిమి, ఉద్దిమె, ఉద్యమె. వర్తకం, వ్యాపారం, వృత్తి, పైకెత్తటం, పూనుకోవటం, గట్టి ప్రయత్నం, పట్టుదల, శ్రద్ధ ; తు. ఉద్యమె. వర్తకం, వ్యాపారం, వృత్తి.

<నం. ఉద్యమ-.

**ఉద్దియచేయు** ఉద్దియ + చేయు. అ.క్రి. ప్రయత్నించు. శృం.నై. 8.17.

**ఉద్దియచేయు** చూ. ఉద్దియ.

**ఉద్దీడు** చూ. ఉద్ది[1].

**ఉద్దు** రూ. ఉద్ది[3]. వి. మినుములు. పాండా. 4.47.

క. ఉద్దు. మినుములు ; ఉర్దు ; తు. ఉర్దు ; త. ఉళుంతు ; మ. ఉఴున్ను ; కొలా. ఉరుందె ; నా. ఉరుందల్ ; ప్రా. ఉడిద.

బహుశః <క. ఉద్దు.

**ఉద్దుపప్పు** వి. మినపప్పు. **ఉద్దుపొడి** వి. మినప్పిండి. **ఉద్దులు[2]** వి. బ.వ. మినుములు.

**ఉద్దుపప్పు** చూ. ఉద్దు.

**ఉద్దుపొడి** చూ. ఉద్దు.

**ఉద్దులు[1]** పో.చూ. ఉద్ది[1]. వి. బాలక్రీడా విశేషం. అష్టమ.క. 1.50 పు. 26 పం.

**ఉద్దులు[2]** చూ. ఉద్దు.

**ఉద్దులు[3]** వి. 1. బండిచక్రంలోని పట్టెలు ; 2. పరంలోని పట్టెలు.

క. ఉద్దిగె. బండిపట్టె.

**ఉద్దేశించు** స.క్రి. భావించు, తలచు, అభిప్రాయపడు, సంకల్పించు. బసవ. 3.466 పం.

నం. ఉద్దేశ-. నిరూపణం ; ప్రా. ఉద్దేసి. స.క్రి. సంకల్పించు, భావించు ; ఉద్దేస. నామ నిర్దేశపూర్వక వస్తు నిరూపణం, లక్ష్యం, ఉపదేశం ; అ.మా. ఉద్దేస. సామాన్య కథనం, ఉపదేశం ; పా. ఉద్దేశ. నిరూపణం.

<నం. ఉద్దేశ- + -ఇంచు[3].

**ఉద్దోరటి** వి. 1. సంవత్సరమంతా ఒకే రైతుదగ్గర కూలిపని చేసేవాడు ; 2. కూలీలమీది మేస్త్రీ.

**ఉనాకి** రూ.చూ. ఊనాకి. విశ. బలంలేని, బక్కపల్చని, జబ్బుగా ఉన్న.

**ఉనాని** రూ.చూ. ఊనాకి. విశ. బక్కపల్చని, బలహీనమైన.

**ఉనికి** రూ. ఉన్కి. చూ. ఉండు. వి. 1. దశ, అవస్థ. భార. ఆది. 3.180 ; 2. ఉండటం. భార.విరా. 1.128 ; 3. నివాసం, స్థానం. చంద్రా. 6.107 ; 4. జీవనం, బతుకు. సారంగ.చ. 3.231.

**ఉనికిపట్టు** వి. నివాసం, ఇల్లు, నెలవు. భార.ద్రోణ 3.133, ఉ.రా. 5.140.

**ఉనికిపట్టు** చూ. ఉనికి.

**-ఉన్(ఉ)** రూ. ఉ[2]. ప్రత్య. 1. కూడా (వాడును) ; 2 అయినప్పటికీ (పెళ్ళికయును) ; 3. వెంటనే (పోవటయును) ; 4. పాదపూరణార్థం (లేకయును).

**ఉనుక** రూ.చూ. ఊక[1]. వి. వరిపొట్టు.

**ఉనుకబట్టి** రూ.చూ. ఊకబట్టి. వి. పొట్టుబట్టీ, కాల్చుటకు వరిపొట్టువంటివి వాడే ఇటికబట్టి.

**ఉనుకబట్టి** చూ. ఉనుక.

**ఉనుకువ** రూ. ఉంకువ[3]. పో.చూ. ఉండు. వి. ఉనికి, నివాసం, నెలవు.

**ఉనుకువగొను** ఉనుకువ + కొను. అ.క్రి. నెలకొను. పాండు. 4.236.

**ఉనుకువగొను** చూ. ఉనుకువ.

**ఉనుచు** రూ.చూ. ఉంచు. స.క్రి. 1. ఉండునట్లుచేయు. భార. భీష్మ. 3.415 ; 2. నియమించు. భార.మౌ. 1.156 ; 3. ఉంచు. హరి.ఉ. 2.112 ; 4. స్థాపించు, నెలకొల్పు. కృష్ణ. 3.112.

**ఉనుపరి** వి. స్వతంత్రుడు. బసవ. 5.358.

**ఉనుపు** స.క్రి. (బట్టలు మొ. వాటికి) రంగువేయు.

క. ఉని. నాను ; పో.చూ. సం. ఉన్ని. తడి. (కిట్టెల్) ; త. ఊట్టు < ఉణ్-. రంగువేయు ; మాల్తో. ఒందె.

<మూ.ద్రా. *ఉణ్-.

**ఉనుపులవాడు** వి. (బట్టలకు) రంగులు వేయువాడు.

**ఉనుపులవాడు** చూ. ఉనుపు.

**ఉన్కి** రూ.చూ. ఉనికి. వి. 1. జీవనం, బతుకు. భార.ఆది. 4.182 ; 2. స్థితి, స్థానం. భార.ఉద్యో. 1.366 ; 3. అవస్థ, దశ. అని. 2.137.

**ఉన్కిపట్టు** వి. నివాసస్థానం, నెలవు.

**ఉన్కిపట్టు** చూ. ఉన్కి.

**ఉన్కు** రూ.చూ. ఇంకు[1] ; చూ. ఇనుకు. అ.క్రి. ఇంకిపోవు.

**ఉందురుగు** వి. ఒకరకం చెట్టు (Erioglossum edule).

**ఉన్న** చూ. ఉండు. విశ. యథార్థమైన, వాస్తవమైన.

**ఉన్నట్టివాడు** రూ. ఉన్నవాడు. వి. 1. ఎదుట, ఉన్నవాడు ; 2. కలవాడు, సంపన్నుడు. <ఉన్న + అట్టి వాడు. **ఉన్నట్టుండి** క్రి.విశ. అదాటుగా, ఆకస్మికంగా. <ఉన్న + అట్టు + ఉండి. **ఉన్నట్టులు** క్రి.విశ. యథార్థంగా. భార.విరా. 2.273. <ఉన్న + అట్టులు. **ఉన్నట్లేయుండి** క్రి.విశ. అదాటుగా, ఆకస్మికంగా. <ఉన్న + అట్లు + ఏ + ఉండి. **ఉన్నది** వి. 1. అస్తిత్వం కలది. భార. ఆది. 3.206 ; 2. ఆధీనంలో ఉన్న వస్తువు. <ఉన్న + అది. **ఉన్నరూపు** వి. వాస్తవం, యథార్థం. భార.విరా. 1.191. **ఉన్నవాడు** రూ.చూ. ఉన్నట్టివాడు. వి. 1. తక్కిన వాడు, ఇతరుడు. భాగ. 10. ఉ. 34 ; 2. ఎదుట ఉన్న వాడు ; 3. ధనవంతుడు.

**ఉన్నట్టివాడు** చూ. ఉన్న.

**ఉన్నట్టుండి** చూ. ఉన్న.

**ఊరులుగొలుపు** చూ. ఊరి¹.

**ఊరువ** రూ.చూ. ఊరవు¹. వి. పెద్ద.

**ఊరువడి** రూ.చూ. ఊరవడి. వి. మిక్కిలి వేగం. రాజ. చ. 2.75.

**ఊరువడించు** రూ.చూ. ఊరవడించు. అ.క్రి. 1. వేగపడు, తొందరపడు. రం.రా.యు. 288 ; 2. విజృంభించు. అప్ప. 2.483 ; 3. గద్దించు ; 4. అతిశయించు.

**ఊరువడు** చూ. ఊడు.

**ఊరువణించు** రూ.చూ. ఊరవడించు. అ.క్రి. పరాక్రమించు. కళా. 7.73.

**ఊరువిడి** చూ. ఊరువు¹. వి. వస్తు సమూహం. విక్ర. 2.6.

**ఊరువు¹** రూ. ఊరుము², ఊర్వు¹. వి. 1. స్వరూపం, వస్తువు. విక్ర. 2.6 ; 2. విధం, ప్రకారం. వరాహ. 10.62, విక్ర. 6.25.

సం. పా. రూప. స్వరూపం, ఆకారం, ప్రకృతి, సౌందర్యం ; ప్రా. రూఅ, రూవ- ;

క. రూవు, రూహు ; త. ఉరు, ఉరువమ్, ఉరువు.

<ప్రా. రూవ- <సం. రూప-. అజాదిత్వం.

**ఊరువు²** రూ. ఊర్వు². స.క్రి. 1. విడదీయు, వేరుచేయు. భార. శాంతి. 3.499 ; 2. మాను, విడుచు. భార. శాంతి. 6.144, హరి. ఉ. 10.71 ; 3. వెడలించు. భా.రా. యు. 518.

క. ఉరిమ. ఒలుచు, చర్మమును తీసివేయు ; త. ఉరి. చర్మం ఊడిపోవు, ఒలుచు, తొక్కుతీయు ; వి. తోలు, తొక్క, పట్ట ; మ. ఉరియుక. బెరడు ఊడిపోవు, ఒలుచు ; కుఇ. డుహ. తోలు ఊడిపోవు ; గోం. ఉడుహ్-త్-. తోలుతీయు ; పో.చూ. కొలా. ఉడ్ప్. విడుచు ; కుఱు. ఒడ్క్-. చెట్టు బెరడు ఒలుచు ; మాల్తో. ఓడ్య్. ఒలుచు.

<మూ.ద్రా. *ఊర్-/ *ఉర్-.

**ఊరువు³** విశే. పెద్దది, అధికమైనది, మేలైనది.

త. ఉఱు. అధికం, విస్తారం.

<త. ఉఱు.

**ఊరుసు** వి. మహమ్మదీయ సాధువ వర్ధంతి.

హిం. అర. ఉర్స్ ; ఉ. ఉరుస్, ఉర్స్ ;

క. తు. ఉరుసు. మహమ్మదీయ సాధువు సమాధి వద్ద సమర్పించే కానుకలు ; త. ఉరుస్. మహమ్మదీయుల పండుగ.

<ఉ. ఉరుస్.

**ఊర్కు** రూ.చూ. ఊఱుకు. అ.క్రి. దుముకు, దూకు. భార. శాంతి. 1.144.

**ఊర్చిపోవు** చూ. ఊర్చు.

**ఊర్చు** పో.చూ. ఊరలు¹. అ.క్రి. చెమ్మగిలి బొట్లు బొట్లుగా జారు.

**ఊర్చిపోవు** అ.క్రి. చెమ్మగిలి బొట్లు బొట్లుగా జారు.

**ఊర్దు** వి. శిబిరం, ముకాం.

హిం. ఉ. ఉర్దు. సైనిక శిబిరం.

<ఉ. ఉర్దు.

**ఊర్మ** రూ.చూ. ఊఱుము¹. వి. మేఘ గర్జన. సిం.ద్వా. 3.97.

**ఊర్రంకి** రూ. ఊర్లంక. వి. తీగలుగా పెరిగే ఒక రకం గడ్డి. (Ischaemum pilosum).

**ఊర్లగడ్డ** రూ.చూ. ఊరలగడ్డ. వి. బంగాళదుంప.

**ఊర్లంక** రూ.చూ. ఊర్రంకి. వి. తీగలాగా పెరిగే ఒకరకం గడ్డి.

**ఊర్లఁబడు** చూ. ఊర్లు.

**ఊర్లవాడు** వి. ఉచ్చు ఉపయోగించి దొంగతనం చేసేవాడు, గొంతుపిసికి చంపేవాడు.

**ఊర్లాంపద్దు** వి. ఉర్లాం సంస్థానంలో సన్మానం పొందిన పండితుడు.

**ఊర్లిపోవు** చూ. ఊర్లు.

**ఊర్లు** రూ.చూ. ఊరులు. అ.క్రి. 1. పడు, రాలు. ఉ.రా. 3.8 ; 2. దొర్లు. పారి. 3.38.

**ఊర్లఁబడు** ఊర్లన్ + పడు ; రూ.చూ. ఊరలఁబడు. అ.క్రి. కూలు, పడిపోవు. చంద్రా. 1.11. **ఊర్లిపోవు** అ.క్రి. చెమ్మగిలి బొట్టుబొట్టుగా జారు. **ఊర్లుకొను** అ.క్రి. కిందకు దొర్లు. **ఊర్లుపెంజెర** వి. దొర్లుకుంటూపోయే ఒకజాతి పెంజెర, సర్ప విశేషం. సిం.ద్వా. 3.100.

**ఊర్లుకొను** చూ. ఊర్లు.

**ఊర్లుపెంజెర** చూ. ఊర్లు.

**ఊర్వడి** రూ.చూ. ఊరవడి. వి. మిక్కిలి వేగం. సారంగ. చ. 1.93. 96.

**ఊర్వు¹** రూ.చూ. ఊరువు¹. వి. స్వరూపం, ఆకారం.

**ఊర్వు²** రూ.చూ. ఊరువు². స.క్రి. వదలించుకొను.

**ఊఱక** రూ.చూ. ఊరక. క్రి.విశే. 1. పలుకక, మాటాడక భార.సభా. 2.305 ; 2. వ్యర్థంగా. భా.రా.యు. 916.

**ఊఱనిరోపము** చూ. ఊఱు².

**ఊఱవడి** రూ.చూ. ఊరవడి ; పో.చూ. ఊఱిది. వి. 1. విజృంభణం. కాశ. 2.45 ; 2. వేగం.

**ఊఱవు** రూ.చూ. ఊరవు¹. వి. 1. ఔచిత్యం. రం.రా.యు. 313 ; 2. దృఢత్వం, గట్టితనం. సాం.ని.మాన. 35 ; విశే. 1. అధికం, గొప్పది. భార.అర. 4.295, 7.366 ; 2. ఉచితం, యుక్తం. భార.ఉద్యో. 3.380 ; 3. విశాలం. హర. 2.32.

క. ఉఱుబు, ఉఱువు. సాన్నిహిత్యం, ఆధిక్యం ; ఉఱౌ. అధికంగా, పూర్తిగా, చక్కగా, ఆధిక్యం.

**ఊఱిది** రూ. ఊరిది. వి. 1. వేగం, వడి. వసు. 2.115, వేంక.పంచ. 2.160 ; 2. శక్తి, బలం. ప్రబంధ. 86, చంద్రా. 4.144 ; 3. ధృతి, ధైర్యం. ఆం.సం.మాన. 57. విశే. తీవ్రం, దారుణం. దశ.కు. 7.149.

క. ఉఱుబు, ఉఱుబె. అధికం, మొత్తం, శక్తి, తీవ్రత, క్రూరత ; త. ఉఱు. అధికం, ఎక్కువ ; ఉఱుతి. దృఢత్వం, శక్తి ; మ. ఊత్తమ, ఉఱుతి. శక్తి, బలం ; కుఇ. సూఱ. స్థూలంగా ఉండు ; బ్రా. ఊరెంగ్, హూరెంగ్, హూరింగ్. ఉబుకు, పొంగు.

<మూ.ద.ద్రా. *ఉఱ్-.

**ఊఱియ** చూ. ఊఱిది. వి. 1. ధీరుడు, దిట్ట. అచ్చ.రా. అర. 108 ; 2. సాహసికురాలు. సారంగ. చ. 2.285 ; 3.

సహాయుడు. కాళిందీ. 2.9 ; విణ. క్రూరము, దుష్టము. వేంక.పంచ. 2.117.

**ఊఱియు** రూ. ఉరియు[5]. పో.చూ. ఊఱు. అ.క్రి. 1. స్రవించు, కారు. కాశీ. 7.40 ; 2. వర్షించు. శుక. 1.276.

క. ఊఱు. వారు, స్రవించు, చిమ్ము, నాను ; తు. ఊజుని, ఊజుణె, ఊజుణు. కారు. స్రవించు ; త. ఊఱై. (వాన) కురియు, (మంచు) కురియు ; వి. ఊట, బొట్టు, వాన ; ఊఱది. ఊట, బుగ్గ, చెలమ ; మ. ఊఱక్క. చిమ్ము, స్రవించు ; ఊఱవ్ర. చెలమ, ఊట : ఊఱుక. చిమ్ము, స్రవించు, కారు, మునుగు, అణగు, కుదురుకొను ; గోం. ఉరేసానా, ఊరిసీ, ఉరేసా్క. చల్లు, చిలకరించు.

**ఊఱు[1]** రూ. ఉరు. అ.క్రి. 1. ధర్మమగు, న్యాయమగు, ఉచితమగు. భార.ఆది. 5.111 ; 2. కలుగు. భా.రా.యు. 976, కు.సం. 10.126 ; 3. బహిర్గతమగు, పైకివచ్చు. హరిశ్చ. పూ. 1961 ; 4. నచ్చు, ఇష్టమగు. భార.ద్రోణ. 2.7, ఉద్యో. 4.179.

క. ఊఱు. కలుగు, సంభవించు ; ఊరు. ఉండు ; ఊఱె. చక్కగా, బాగా ; ఊఱు. ఉండు, వసించు, స్థిరపడు, ఉంచు, ఆధారపడు, అంగీకరించు ; తు. ఊన్తు. నిలబడు, ఉండు, ఆగు, ఆపు, నిలుపు : ఎన్తు ; త. ఊఱు. ఉండు, జరుగు, నచ్చు. స్థిరమగు ; విణ. సమృద్ధం ; పో. చూ. మ. ఊఱుక. స్థిరంగావుండు ; ఊఱు. కలిసియుండు. స్థిరంగా ఉండు.

**ఊఱు[2]** (వ్యతిరేకార్థంలోనే ప్రయుక్తం) స.క్రి. లక్ష్యపెట్టు, గణించు, సరకుగొను. భార.ఆది. 6.194, కు.సం. 3.259, 7.958 ; అ.క్రి. 1. మాను, విరమించు. భార.ఆది. 2.27, మను. 4.58 ; 2. జంకు, వెనుదీయు. కకుత్స. 4.45, భోజ. 6.353.

పో.చూ. క. ఊఱిసు, ఊఱు. సహించు, ఓర్చు ; త. ఊఱు, ఊఱువ్-, ఊఱ్ఱ్-. తోచు, ఆలోచించు, సహించు ; మ. ఊఱక, ఊఱుక. కలిసియుండు, గట్టిగానుండు.

<మూ.ద.ద్రా. *ఉత్-.

**ఊఱువిరోసము** వి. అధిక కోపం.

**ఊఱు[3]** రూ. ఉట్టు[2]. వి. ఆవులకు పాలు తీసేటప్పుడు కాళ్లకు వేసే బంధము.

క. ఊఱి. కుందల్ని వేలాడదీసే తాడు ; ఉరుల్, ఉరులు, ఉరల్, ఉరిల్, ఉరుళ్, ఉర్చు. జారుముడి, ఉచ్చు, ఉరి ; త. ఊఱి. ఉట్టి. పో.చూ. ఉరువు-కయిఱు. పలుపుతాడు ; మ. ఊఱి. ఉట్టి, జారుముడి ; ఊఱివల. ఒకవిధమైన వల ; పర్జి. ఉత్-, ఉట్-. తాడుతో వేలాడదీయు. ఉత్క్, ఉట్క్.

**ఊఱుద్రాడు** రూ. ఉట్టుద్రాడు. వి. ఆవుల్ని పాలుతీసేటప్పుడు వెనుకకాళ్లకు కట్టేబంధపుతాడు. హరి.పూ. 5.142, వి.పు. 7.338.

**ఊఱు[4]** రూ.చూ. ఉట్టు[1]. ధ్వన్యను. వి. కోతులు చేసేధ్వని, పరుగెత్తుతూ పాములు చేసేధ్వని. ద్వి.హరిశ్చ. 1962 పం.

**ఊఱుకొట్టు** అ.క్రి. ఉట్టుమని ధ్వనిచేయు.

**ఊఱుకు** రూ. ఉరుకు, ఉర్కు. అ.క్రి. 1. దుముకు. భార. విరా. 2.282, భీష్మ. 3.27 ; 2. వెలికివచ్చు. ఉద్గతమగు. కాశీ. 3.32 ; 3. అతిశయించు. పద్మ. 7.278 ; 4. పరుగెత్తు, పారు. ఆము. 3.19, హరిశ్చ. 4.107 పం.

క. ఊఱు. వెలికివచ్చు ; ఊఱుంబుతొ. నడచు, ఎదుర్కొను, ముందుకుసాగు ; ఊఱుబు, ఉర్కు, ఉక్కు. వేచు, ఉబుకు, కాగు, తెర్లు ; త. ఊఱుక్కు. దుముకు ; కొండ. ఉర్కు. పరుగెత్తు ; పర్జి. ఉర్కు. పడు. ఉర్కుప్-, ఉర్కుత్. పడవేయు ; కొలా. ఉర్కుత్ప్. కిందికిదూకు.

<మూ.ద్రా. *ఉత్-(ఉ)క్-.

**ఊఱుకుబొద్దు** రూ. ఊఱుకుడుబొద్దు. వి. పైకి ఉబికిన బొద్దు. నవనాథ. 3.107 పు. 20 పం.

**ఊఱుకుడు** చూ. ఊఱుకు. విణ. దూకుడు. **ఊఱుకుడు(గవ్వ** (-కవ్వ). రూ. ఉపుగుకవ్వ. వి. గచ్చుకవ్వ. ఎగిరేకవ్వ. **ఊఱుకుడుబొద్దు** రూ. ఉరుకుబొద్దు. వి. రోగంవల్ల పెరిగిన బొద్దు, తుండి.

**ఊఱుకుడు(గవ్వ** చూ. ఊఱుకుడు.

**ఊఱుకుడుబొద్దు** చూ. ఊఱుకుడు.

**ఊఱుకుబొద్దు** చూ. ఊఱుకు.

**ఊఱుకొట్టు** చూ. ఊఱు[4].

**ఊఱుచు** పో.చూ. ఊడ్చు. స.క్రి. పోగొట్టు, నశింపజేయు.

పో.చూ. త. ఒఱు. నశింపజేయు, అణచు.

**ఊఱుత** రూ.చూ. ఉడుత. వి. వీపుమీద మూడు నిడుపు చారలుగల ఒక జంతువు, చిక్రోడం. వరాహ. 12.52.

**ఊఱు(ద్రాడు** చూ. ఊఱు[3].

**ఊఱువు** రూ. ఉరువు. వి. ఊట, చెమ్మ, నానుడు.

**ఊఱుము[1]** రూ. ఉరుము[1], ఉర్మ ; చూ. బొబ్బ, బోలు. అ.క్రి. గర్జించు. భార.ఆది. 8.270 ; వి. 1. వీరహుంకారం. భార. 5.343 ; 2. మేఘధ్వని, గర్జన. హర. 2.17.

క. ఒఱళు, ఒర్లు. బాధతో అరచు, గర్జించు ; బొబ్బె. బొబ్బపెట్టు, గర్జించు ; త. ఉరఱ్ఱు, ఉరుమ్, ఉరుము, ఊఱుము. గర్జించు ; ఉర. బిగ్గరగా ధ్వనిచేయు ; ఉరఱు. ప్రతిధ్వనించు ; ఉరప్పు. గర్జన ; మ. ఊఱుమ్ముక, ఉరమ్ముక. గొణుగు, గర్జించు ; ఊఱుమ్మల్. గర్జన ; కుఇ. రూంబ, రూమ. గర్జించు ; రుంజి. గర్జించు. మార్మోగు.

**ఊఱుము[2]** రూ. ఉడుము[1]. వి. జంతువిశేషం, ఉడుము. ఉ.హ. 4.29.

**ఊఱుముతిండి** వి. ఉడుప కుక్క, ఉడుముల్ని తినే కుక్క. కు.సం. 2.59.

**ఊఱుముతిండి** చూ. ఊఱుము[2].

**ఊఱుముపోయించు** చూ. ఉరుము బోయించుట. స.క్రి. సాధారణంగా ఒక గ్రామానికి పునాది వేసేముందు ఆ గ్రామ దేవత జాతరలో విందు ఏర్పాటుచేయు.

**ఊఱువు** చూ. ఉట్టు[1]. వి. కోతులు చేసే ఒకరకం ధ్వని. అచ్చ. రా. 5.90.

**ఊఱ్ఱ** పో.చూ. ఉఱ్ఱూతలూగు. వి. ఉత్కంఠ, తహతహ.

**ఊఱ్ఱటలూగు** చూ. ఉట్టు[1].

**ఊఱ్ఱటలూ(చు** చూ. ఉట్టు[1].

**ఉఱ్ఱట్లాగు** చూ. ఉఱ్ఱు¹.

**ఉఱ్ఱాడు** చూ. ఉఱ్ఱు¹.

**ఉఱ్ఱు¹** (ధ్వన్యనుకరణశబ్దం) రూ.చూ. ఉయు¹. వి. **1.** కదలటంలో ఊగటంలో కలిగే ధ్వని (సమస్తంగానే ప్రయుక్తం) ; **2.** కోతులు చేసే ధ్వని.

**ఉఱ్ఱటలాగు** రూ. ఉఱ్ఱట్లాగు. అ.క్రి. ఎక్కువగా ఊగు, మిక్కిలి చలించు. వేంక.పంచ. 4.231, కృ. శకు. 2.57. **ఉఱ్ఱటలాచు.** ఉఱ్ఱటలాగు యొక్క ప్రే. స.క్రి. మిక్కిలి ఊగించు. **ఉఱ్ఱట్లాగు** రూ. ఉఱ్ఱటలాగు. అ.క్రి. ఎక్కువగా ఊగు, మిక్కిలి చలించు. శశా. 5.36. **ఉఱ్ఱాడు** ఉఱ్ఱు¹+ఆడు. అ.క్రి. మిక్కిలి చలించు. హంస. 1.172. **ఉఱ్ఱూత** ఉఱ్ఱు¹+ఊత. వి. కోతులు ఆవేశంతో అరిచే అరుపు. **ఉఱ్ఱూతలూగు** ఉఱ్ఱు+ఊతలు+ఊగు. పో. చూ. ఊత. అ.క్రి. **1.** మిక్కిలి ఊగు. చలించు. కాశీ. 2.151, కళా. 1.76 : **2.** కుతూహలపడు, ఉత్సహించు, సురా. 47.

**ఉఱ్ఱు²** రూ.చూ. ఉయు³. వి. ఆవుకు పాలు తీసేటప్పుడు కాళ్లకు కట్టే త్రాడు, బంధం. భోజ. 4.129.

**ఉఱ్ఱుకట్టు** అ.క్రి. పాలు పితికేటప్పుడు ఆవు కాళ్లకు కట్టే బంధం. **ఉఱ్ఱుత్రాడు** (-త్రాడు) ; రూ. ఉయుత్రాడు. వి. పాలు పితికేటప్పుడు ఆవుకాళ్లకు కట్టే బంధం. మైరా. 1.57.

**ఉఱ్ఱుకట్టు** చూ. ఉఱ్ఱు².

**ఉఱ్ఱుకఱ్ఱు** వి. అర్ధరూపాయి (విశ్వబ్రాహ్మణుల పరిభాష).

**ఉఱ్ఱుత్రాడు** చూ. ఉఱ్ఱు².

**ఉఱ్ఱూత** చూ. ఉఱ్ఱు¹.

**ఉఱ్ఱూతలూగు** చూ. ఉఱ్ఱు¹.

**ఉల** పో.చూ. దూల. వి. కండూతి, దురద.

**ఉలకాలు** వి. అంటువ్యాధి. **ఉలవరము²** రూ. ఉలారము¹. వి. దురద, గజ్జి. దురదగొండి ఆకు తగలటంవల్ల పుట్టిన దురద.

**ఉలక** రూ.చూ. చులక. విశే. తేలిక, లఘువు. సాం.ని. 224 ; వి. చులకన, లాఘవం.

**ఉలకన** రూ.చూ. చులకన. చూ. ఉలక. వి. లాఘవం, తేలిక.

**ఉలకాలు** చూ. ఉల.

**ఉలగరించు** చూ. ఉలగరము.

**ఉలగరము** రూ.చూ. ఉలవరము¹. వి. దుక్కిపదను.

**ఉలగరించు** రూ.చూ. ఉలవరించు. అ.క్రి. ఎరువులు మొ. వాటిచే సారవంతమగు. **ఉలంకు** చూ. ఉల్లము. వి. ఇళ్ళకు తలవాకిటిముందర ఉండే నలచదరపు ప్రదేశం, ప్రకోష్ఠం.

క. ఒళగు. లోపలిభాగం ; కొడ. ఒళు ; తు. ఉళ ; త. మ. ఉళ్లకమ్. మనస్సు, హృదయం.

**ఉలచ** రూ.చూ. ఉలుచ. వి. మత్స్య విశేషం.

**ఉలచచేప** వి. మత్స్య విశేషం. **ఉలచమీను** రూ.చూ. ఉలుచమీను. వి. మత్స్యవిశేషం.

**ఉలచచేప** చూ. ఉలచ.

**ఉలచమీను** చూ. ఉలచ.

**ఉలదంటు** రూ.చూ. ఊలదంటు. వి. తీపిలేని జొన్నదంటు.

**ఉలవ¹** రూ. ఉలువ. వి. సస్య విశేషం, కుళుత్థం (Dolichos beflor) ఆం.భా. 2.236.

క. హురళి, హురుళి, హుళువగ, హులువర. ఉలవలు ; త. ఫుల్. వర్లుకాక తక్కిన ధాన్యం ; పో.చూ. ఫుల్యాలి. గడ్డిపస.

<మూ.ద్రా. *పుల్-.

**ఉలవచిక్కుడు** వి. ఒకరకం చిక్కుడు. **ఉలవలు** వి. బ.వ. ధాన్య విశేషం, కుళుత్థాలు.

**ఉలవ²** వి. చిటపటాలు.

ఉలవగింజ ఆకారాన్ని పోలి ఉండటంవల్ల ఈ పేరు వచ్చిఉంటుంది.

**ఉలవ³** రూ.చూ. ఉళువాయి. వి. చక్రానికి ఇరుసును దూర్చే రంధ్రానికి లోపలా బయటా వేసిన ఇనపకట్టు.

**ఉలవచిక్కుడు** చూ. ఉలవ¹.

**ఉలవరము¹** రూ. ఉలగరము, ఉల్లరము, ఉల్లారము, ఉల్వరి. వి. దుక్కిపదను, భూమిని దున్నడానికి సరిపోయే తేమ.

త. ఉళవీరమ్. (ఉళవు. దున్ను+ఈరమ్. తేమ). దుక్కి పదను ; మ. ఉళవు. దున్నటం.

**ఉలవరించిన** విశే. సారవంతమైన. **ఉలవరించు** రూ. ఉలగరించు. అ.క్రి. ఎరువులు మొ. వాటిచే సారవంతమగు. **ఉలవరింపు** వి. ఎరువులవల్లా, మురుగు నీటివల్లా భూమిని సారవంతం చెయ్యటం.

**ఉలవరము²** చూ. ఉల.

**ఉలవరించిన** చూ. ఉలవరము¹.

**ఉలవరించు** చూ. ఉలవరము¹.

**ఉలవరింపు** చూ. ఉలవరము¹.

**ఉలవలు** చూ. ఉలవ.

**ఉలవాయి** రూ.చూ. ఉళువాయి. చూ. ఉలవ³. వి. చక్రం కుంద అరగకుండా ఉండటానికి ఇరుసును దూర్చే రంధ్రానికి లోపలా బయటా వేసిన ఇనప కట్టు.

**ఉలవేగలి** వి. ఒక్కసారి సాగైన భూమి.

క. ఉళువికె. దున్నటం ; త.మ. ఉళవు.

**ఉలస¹** రూ.చూ. ఉలుచ. వి. మత్స్య విశేషం. హంస. 4.187.

**ఉలస²** వి. **1.** ఒకరకం గడ్డి ; **2.** దాదవ, చేను.

పో.చూ. క. పుల్, హులి, హుల్లు, ఉల్లు. గడ్డి ; తు. పుల్లు ; త.మ. పుల్.

**ఉలసకమ్మలు** వి. బ.వ. కన్నడ దేశంలోని స్మార్త బ్రాహ్మణులు.

క. కమ్మె. బ్రాహ్మణులలోని ఎనిమిది తెగల్లో ఒక తెగ, మైసూరులో స్మార్తులు.

బహుశః <వలస+కమ్మలు. ఆంధ్ర దేశంలోని పూర్వపు కర్మ రాష్ట్రం నుండి వలస వచ్చిన బ్రాహ్మణులు.

**ఉలారము¹** రూ.చూ. ఉలవరము². వి. **1.** గజ్జి, దురద ; **2.** అత్యాతురత.

**ఉలారము²** వి. ఒకరకం కలుపు మొక్క.

**ఉలాన** వి. సుమారు, రమారమి.

**ఉలి**[1] వి. 1. రాళ్ళను తెగగొట్టే పనిముట్టు, రాతిఉలి. హరి. ఉ. 2.15. కాశ. 4.47; 2. వడ్రంగులు కర్ర తెగగొట్ట దాని కుపయోగించే పనిముట్టు, కొయ్య ఉలి. ఆం.భా. 2.30; 3. కలుపుతీసే పరికరం.

క. ఉళి. ఉలి, ఆరె, కదురు; తు.మ. ఉళి. ఉలి; త. ఉళి. గంట్ర గొర్రలి, ఉలి, గోరుముల్లు; కోట. ఉళ్‌యి. ఉలి; తొద. ఉళ్‌యి. చురకవేసే పరికరం.

<మూ.ద్రా. *ఉళ్-.

**ఉలిపాటు** వి. ఉలితో నరికినప్పుడు ఏర్పడిన నిట్రవ అంచు. **ఉలిమలువు** స.క్రి. ఉలితో కొయ్యమీద చెక్కటం. **ఉలియాడు**[1] స.క్రి. గంట్లు కలదిగాచేయు, కక్కుకొట్టు.

**ఉలి**[2] రూ.చూ. నులి. విశే. అల్పం.

<నులి.

**ఉలిగాలువ** ఉలి[2]+కాలువ. వి. చిన్న కాలవ. భార. ద్రోణ. 4.63. **ఉలివచ్చి** వి. కొంచెం పచ్చి. పరమ. 4.265 పు. 3 పం. **ఉలివదును** వి. కొద్దితడువు. **ఉలియాడు**[2] స.క్రి. (ఊడ్చిన మొక్కలు పోయినచోట్ల) మళ్లీ ఊడ్చు. **ఉలివాడు**[2] అ.క్రి. కొంచెం వడలిపోవు. కు.సం 10.446. **ఉల్లారు**[2] అ.క్రి. 1. కొంచెం ఆరు; 2. ఒక మోస్తరుగా ఎండు. **ఉల్లారేయు** చూ. ఉల్లారు. స.క్రి. తడిపిన నూలు విప్పి ఆరవేయు.

**ఉలికిపడు** చూ. ఉలుకు.

**ఉలికిపాటు** చూ. ఉలుకు.

**ఉలిగాలువ** చూ. ఉలి[2].

**ఉలింత** రూ.చూ. వలంత. వి. ఒక కొసను రెండుగా చీల్చి పంగలుగా చేసిన నాగ.

**ఉలింద** రూ.చూ. ఇల్లింద. వి వృక్ష విశేషం (Diospyros capitulata).

**ఉలివచ్చి** చూ. ఉలి[2].

**ఉలివడు** అ.క్రి. దోచుకొనబడు. ఆం.భా. 3.116.

పో.చూ. క. ఒలె. చలించు, వంగు, వణకు; త. ఉలై. స.క్రి. ఓడించు, వేధించు, పీడించు.

**ఉలివదును** చూ. ఉలి[2].

**ఉలిపాటు** చూ. ఉలి[1].

**ఉలిపి**[1] పో.చూ. ఒలుచు. రూ. ఉలిపిరి[2], ఉలుపి, ఉలుపు[2], ఒలిపి[1]. వి. శోభి, శోభరోగం కలవాడు. ఆం.భా. 2.122.

**ఉలిపి**[2] వి. 1. కాలేటప్పుడు చిటపటలాడే ఒకరకం చెట్టు; 2. ఉలిపివంటివాడు, కులువ, దుర్మార్గుడు, పొగరుబోతు, ముంగోపి; విశే. క్షుద్రం, నీచం. సానందో. 4.125.

త. ఉలైప్పు. బాధాకరం, పీడాకరం.

**ఉలిపికట్ట** రూ.చూ. ఉలిపికట్టె. వి. పొగరుబోతు, చెడ్డవాడు. **ఉలిపికట్టె** రూ. ఉలిపికట్ట. వి. 1. పొగరుబోతు. హంస. 5.113; 2. చెడ్డవాడు, దుష్టుడు. **ఉలిపికట్టెతనము** వి. పొగరుబోతు తనం. **ఉలిపిగొట్టు** వి. 1. పొగరుబోతు, గర్వి; 2. ముంగోపి. **ఉలిపితెవులు** వి. గజ్జి, తీట, దురద.

**ఉలిపి**[3] వి. కొయ్యలో పురుగులు తొలిచేటప్పుడు రాలే పొడి.

పో.చూ. క. ఉళుకు, పుళుకు, హుళుకు. పురుగులు తొలిచిన నుసికొయ్య; త. ఉళు. నుసిపురుగు, పురుగులు తొలిచిన స్థితి, క్రిమిదష్టమగు; ఉళుప్పు. పురుగులు తొలిచిన స్థితి; మ. ఉళుమ్పు. ధాన్యానికి పట్టే పురుగు.

<త. ఉళుప్పు.

**ఉలిపికట్ట** చూ. ఉలిపి.

**ఉలిపికట్టె** చూ. ఉలిపి.

**ఉలిపికట్టెతనము** చూ. ఉలిపి.

**ఉలిపిగొట్టు** చూ. ఉలిపి.

**ఉలిపితెవులు** చూ. ఉలిపి.

**ఉలిపిరి**[1] విశే. పల్చని.

<ఉల్లి+పొర.

**ఉలిపిరి**[2] రూ.చూ. ఉలిపి[1]. వి. 1. తెలుపుమీద మసర రంగు మచ్చ; 2. ఎర్రడాలు కలిసిన తెల్లమచ్చ.

**ఉలిపిరికాయ** చూ. ఉలిపి[2]. వి. దుడుకు పిల్లవాడు.

**ఉలిబద్దారం** రూ.చూ. ఉరుబద్దె దారం. వి. అచ్చువడుల్లో దూర్చిన బద్దె పోగుల్లో అని వెంబడి దూర్చిన దారం.

**ఉలిమలువు** చూ. ఉలి[1].

**ఉలిమి** పో.చూ. ఉలి[1]. వి. ఉలి, రాళ్ళు తొలిచే ఉలి.

**ఉలిమిడి** రూ.చూ. ఉలిమిరి. వి. వృక్ష విశేషం, ఉరుముడు చెట్టు.

**ఉలిమిరి** రూ. ఉరిమిడి, ఉరివిడి, ఉరుముడు, ఉలిమిడి. వి. వృక్ష విశేషం, ఉరుముడు చెట్టు (Crataeva religiosa, Forest).

క. ఉలిమిరి.

**ఉలిమ్రాను** వి. ఖదిర, చంద్ర (Acacia sundra, Mimasa sundra).

త. ఒళిమరమ్. చీకట్లో మెరిసే ఒకరకం చెట్టు.

**ఉలియాడు**[1] చూ. ఉలి[1].

**ఉలియాడు**[2] చూ. ఉలి[2].

**ఉలియు**[1] అ.క్రి. 1. శబ్దించు, మోగు. భార.ఆది. 1.301; 2. అరచు, కూయు. భార.ఆది. 2.301.

క. ఉలి. శబ్దించు, అరచు, మాట్లాడు; ఉలి, ఒలి. ధ్వని, కేక; తు. ఉలియుని, ప్రేరేపించు; త. ఒలి, ఉలై. ధ్వనిచేయు; మ. ఒలియుక, ఒలిక్క. ధ్వనించు.

బహుశః <ప్రా. క. ఉలి.

<మూ.ద.ద్రా. *ఒల్-ఇ-.

**ఉలియు**[2] అ.క్రి. తొలగు, వెళ్ళిపోవు. ఉ.రా. 8.175.

పో.చూ. త. ఒలి. స.క్రి. తొలగించు, శుభ్రపరచు; ఉలుప్పు. కుదిపివేయు, ఆకులు పండ్లు మొ. వానిని దులిపివేయు.

**ఉలియు**[3] అ.క్రి. కదలు, చలించు. భా.రా.యు. 1.871.

క. ఒలె. కదలు, ఊగు; తు. ఉలియుని. కంపించు; త. ఉలై; మ. ఉలయుక. కదలు, వదులగు.

<మూ.ద.ద్రా. *ఒల్-.

**ఉలివాడు**[1] చూ. ఉలివు[1].

**ఉలివాడు**[2] చూ. ఉలి[2].

**ఉలివు**[1] పో.చూ. ఉలుకు; చూ. ఉలియు[3]. వి. కదలిక.

**ఉలివాడు**[1] అ.క్రి. చలించు, కదలు. కళా. 2.172.

**ఉలివు**[2] రూ. ఉల్కు. చూ. ఉలియు[1]. వి. శబ్దం, ధ్వని.

భార.ఆది. 7.168, విరా. 3.4.

**ఉలివుడు** వి. ధ్వని, శబ్దం. **ఉలివులాగ** ఉలివు[2] + లాగ వి. చెవి. వ్య. శబ్దాన్ని గ్రహించే రంధ్రం.

**ఉలివుడు** చూ. ఉలివు[2].

**ఉలివులాగ** చూ. ఉలివు[2].

**ఉలుకఁబాఱు** చూ. ఉలుకు.

**ఉలుకు** రూ. ఉల్కు. అ.క్రి. **1.** భయపడు, బెదరు. భార. ఆర. 2.84, విక్ర. 1.133, శృం.నై. 7.124; **2.** ఉడుకు, అసూయపడు. భార.ఉద్యో. 2.31, ఆము. 4.42; **3.** మిరుమిట్లుగొను. కు.సం. 10.62; **4.** హెర్లు; వి. **1.** భయం. భార.విరా. 1.213, ఆము. 5.70; **2.** ఉడుకు, సంతాపం. శుక. 2.208; **3.** కోర్కె, కామం. సిం.ద్వా. 2.127.

క. ఉలుకు, ఉళుకు. కంపించు, కలవరపడు: త. ఉట్కు. భయపడు, నివ్వెరపోవు, సిగ్గుపడు; వి. భయం, సిగ్గు; మ. ఉళుక్కు. సాగు, బలహీనపడు; ఉళుప్పు. సిగ్గరితనం.

< మూ.ద.ద్రా. *ఉళ్-క్-, *ఉళ్-ఉక్క్-.

**ఉలికిపడు** అ.క్రి. ఆకస్మికంగా కలిగిన భయాదులచే కంపించు, అదరిపడు, తుళ్లిపడు. భార.ఆది. 1.156. **ఉలికిపాటు** రూ. ఉల్కిపాటు. వి. ఆకస్మిక భయాదులచే కంపించటం, ఉలికిపడటం, తుళ్లిపడటం. కళా. 6.228, ఉ.రా. 7.410. **ఉలుకఁబాఱు** ఉలుకన్ + పాఱు. అ.క్రి. వెలికి ప్రసరించు. భాగ. 7.363.

**ఉలుకుడు** చూ. ఉలియు[1]. వి. ధ్వని, శబ్దం, కలత.

**ఉలుకుబట్టు** చూ. ఉలిపి[3]. అ.క్రి. (కొయ్యకు) పురుగుపట్టు, చేవచెడు.

క. ఉలుకు, పుఱుకు, హుఱుకు. పురుగుపట్టినచెక్క; త. ఉళు. నుసిపురుగు, పురుగుపట్టినది; మ. ఉళుమ్పు. ధాన్యానికి పట్టే పురుగు.

**ఉలుకూడు** చూ. ఉలుకుబట్టు. అ.క్రి. (వరిపైరుకు) ఒక రకం తెగులుపట్టు.

**ఉలుక్కు** పో.చూ. ఉలుకు. వి. అశ్వగతి భేదం, మందగతి. ఆం.భా. 2.198.

క. ఉలుకు. శరీరం కంపించు; త. ఉలుక్కు. (చెట్ల వలె) ఊగులాడు.

< త. ఉలుక్కు.

**ఉలుచ** రూ. ఉలచ, ఉలస[1]. చూ. ఉఱుజు. వి. మిక్కిలి చాపల్యంగల ఒక రకం చేప. ఆము. 2.53, ఆం.భా. 1.160.

క. ఉణచిమీను. సముద్రపుచేప; ఉలూపి; త. ఉఱువై. సముద్రంలో దొరికే ఆకుపచ్చ చేప (Gobius arnatus), గోధుమరంగులో ఉండే మంచినీటి చేప (Gobius giuris), పసుపుపచ్చగా ఉండి, మంచినీళ్ళల్లో, మురికినీళ్ళల్లో ఉండే చేప (Gobius striatus); ఉళువై. ఒక రకం చేప (Gobius ornates), గోధుమరంగులో ఉండే సముద్రపు చేప (Savrida tumbil).

పో.చూ. సం. ఉలూపి. మత్స్య విశేషం; ఉలుపిన్. సముద్రపు చేప.

సంస్కృతంలోనికి ద్రావిడ భాషలనుంచి ప్రతిదేయం.

**ఉలుచమీను** రూ. ఉలచమీను. వి. మిక్కిలి చాపల్యం గల చేప.

**ఉలుచమీను** చూ. ఉలుచ.

**ఉలుచు** రూ.చూ. ఒలుచు. స.క్రి. **1.** ఊడదీయు, తొలగించు; **2.** జళిపించు, ఊపు; **3.** ఉలితో చెక్కు.

**ఉలుప[1]** రూ.చూ. ఉలుపా. వి. **1.** కానుక, బహుమతి. పాండు. 5.114, బహుళా. 5.114, శుక. 3.189; **2.** గృహ ప్రవేశం చేసేటప్పుడు ఇచ్చే బలి.

**ఉలుపవట్టు** ఉలుప[1] + పట్టు. రూ.చూ. ఉలుపావట్టు. స.క్రి. కానుక ఇచ్చు, ఇచ్చు, సమర్పించు. పాండు. 5.288.

**ఉలుప[2]** వి. పల్చటిపల్ల ఊరుబిండి. ఆం.భా. 2.251.

పో.చూ. క. ఒళుపు, ఒళుహు. సారం.

**ఉలుపడ** చూ. ఉలుపు[2].

**ఉలుపఁడు** చూ. ఉలుపు[2].

**ఉలుపవట్టు** చూ. ఉలుప[1].

**ఉలుపా** రూ. ఉలుప[1], ఉలుఫా, ఉల్పా. వి. ఉపాయన, రాజాదులకిచ్చే కానుక. వసు. 1.154, ప్రభా. 1.78.

నే. ఉల్ఫా, ఉల్ఫత్. వి. ఉచితం, వివి. ఊరక, ధర్మంగా; హిం. ఉ. ఉల్ఫత్. ప్రేమ, దయ; మరా. ఉలఫా. భిచ్చపు బియ్యం మొ.; అర. అలూఫా, ఉలూఫా. ప్రేమ;

క. ఉలుపె, ఉలిపె. బహుమానాలు, కానుకలు; తు. ఒలిపా; త. ఉల్పా, ఉలుప్పై.

< మరా. ఉలఫా.

**ఉలుపాచేయు** స.క్రి. కానుకగా ఇచ్చు. యయా. 4.75. **ఉలుపాలువట్టు** స.క్రి. కానుకలిచ్చు. ఆము. 4.86. **ఉలుపావట్టు** రూ. ఉలుపవట్టు. ఉలుపా + పట్టు. స.క్రి. కానుకగా ఇచ్చు. రామా. 8.237.

**ఉలుపాచేయు** చూ. ఉలుపా.

**ఉలుపాలువట్టు** చూ. ఉలుపా.

**ఉలుపావట్టు** చూ. ఉలుపా.

**ఉలుపి** రూ.చూ. ఉలిపి[1]. వి. శోభి, శోఫరోగం కలవాడు. ఆం.భా. 2.122.

**ఉలుపు[1]** చూ. ఉలుచు. స.క్రి. ఊడదీయు. సారంగ. చ. 1.60.

**ఉలుపు[2]** రూ.చూ. ఉలిపి[1]. పో.చూ. ఉలుము[1]. వి. ఒక విధమైన చర్మవ్యాధి, శోఫ. సిం.ద్వా. 1.213.

**ఉలుపడ** రూ. ఉల్పడ. వి. శోఫరోగి. **ఉలుపఁడు** రూ. ఉల్పఁడు. వి. శోఫరోగి. ఆం.భా. 3.122. **ఉల్పడ** రూ.చూ. ఉలుపడ. **ఉల్పఁడు** రూ.చూ. ఉలుపఁడు. ఆం. భా. 2.122.

**ఉలుఫా** రూ.చూ. ఉలుపా. వి. ఉపాయనం, రాజాదులకిచ్చే కానుక.

**ఉలుమఁడు** చూ. ఉలుము[1].

**ఉలుము[1]** వి. కుష్ఠురోగం. భార. అను. 5.100, ఆం.భా. 2.128.

పో.చూ. త. ఉళు. క్రిమిదష్టమగు, ఉళుప్పు. క్రిమి దష్టమైన స్థితి.

**ఉలుమ(డు** వి. కుష్ఠురోగి. సిం.ద్వా. 1.213.

**ఉలుము**[2] రూ. నులుము. స.క్రి. నలుపు, కండ్లు నులుముకొను. భాగ. 7.734.

**ఉలువ** రూ.చూ. ఉలవ[1]. వి. సస్యవిశేషం.

**ఉలువకట్టు** పో.చూ. ఉలువు[1]. వి. నేలలో గుచ్చి పెద్ద పెద్ద రాళ్ళను పెల్లగించే గడ్డపార మొ. సాధనం. దశా. 2.164.

**ఉలువు**[1] వి. రాళ్ళ వరసలకు మధ్యనున్న స్థలం.

క. ఒళవు. లోపలి భాగం; తు. ఉళ; త. ఉళవు. గోప్యం, రహస్యం; ఉళ్. లోపల, లోపలి భాగం; మ. ఉళ్ళు. లోపల, లోపలిది.

< త. ఉళవు.

**ఉలువు**[2] రూ.చూ. సులువు. విశే. సులభం, తేలిక.

**ఉల్కం** రూ.చూ. చులుక. విశే. సులువు.

**ఉల్కిపాటు** చూ. ఉల్కు.

**ఉల్కు** రూ.చూ. ఉలుకు. అ.క్రి. భయపడు. ద్వి.హరిశ్చ. ఉ. 1525.

**ఉల్కిపాటు** రూ.చూ. ఉలికిపాటు. వి. ఉలికిపడటం. దశకు. 2.46.

**ఉల్చు** రూ.చూ. ఒలుచు. స.క్రి. ఊడదీయు, తొలగించు. జై.భా. 1.45.

**ఉల్టా** విశే. తలకిందు, తారుమారు, లోతట్టు, అడుగుతట్టు.

కా. వుల్టావున్. తలకిందుచేయు; కుమా. నే; ఉల్టో; విశే. ఎదురు, తలకిందు, తారుమారు; అ. ఒలొటా; బెం. ఒ.హిం.పం.ల.ఉ. ఉల్టా; గు. ఉల్టు; మరా. ఉలటా, ఉల్టా;

క. ఉరటా, ఉలటా. తలకిందు, లోతట్టు; పర్జి. ఉల్టి. గుండ్రంగా తిరుగు.

< ఉ. ఉల్టా.

**ఉల్టాసీదా** విశే. 1. పై వైపు లోవైపు; చీరెలు మొ. వాని అద్దకం ఉన్నవైపు లేనివైపు; 2. కింద మీదులు. ఉ. ఉల్టాసీధా. తలకిందు, తిన్నని. < ఉ. ఉల్టాసీధా.

**ఉల్టాసీదాలుకొట్టు** అ.క్రి. 1. కిందుమీదులగు; 2. కష్ట సుఖాలు అనుభవించు; 3. లాభనష్టాలు పొందు; 4. వ్యవహారాల్లో మునిగితేలు.

**ఉల్టాసీదా** చూ. ఉల్టా.

**ఉల్టాసీదాలుకొట్టు** చూ. ఉల్టా.

**ఉల్పడ** చూ. ఉలువు[2].

**ఉల్ప(డు** చూ. ఉలువు[2].

**ఉల్పా** రూ.చూ. ఉలుపా. వి. ఉపాయనం, రాజాదుల కిచ్చే కానుక. ఉ.హరిశ్చ. 2.79.

**ఉల్రె** వి. గ్రామ దేవతలకు చేసే జాతర.

హిం. హుర్ర. హర్షధ్వానం; ఉ. హుర్ర. కోలాహలం, భయంకరమైన శబ్దం; పార. హుర్రా, హుర్రా. శబ్దం, ధ్వని, గర్జన.

< ఉ. హుర్ర.

**ఉల్ల** క్రి.విశే. చాలా దగ్గర. చాలా దూరం కానిచోటు. తార. అర. 2.34, భా.రా.యు. 153.4, కాశీ. 7.244.

క. ఉల్లి. ఈమధ్య ప్రదేశంలో, ఇక్కడ; త. ఉళ్-ళ్-అత్తె. వి. సామీప్యం, పొరుగు.

< మూ.ద.ద్రా. *ఉళ్-.

**ఉల్లకి** వి. ఇద్దరు బోయీలు మోసే కర్రకు కట్టిన గుడ్డ ఉయ్యాల, డోలి.

**ఉల్లకుట్టు** చూ. ఉల్లము.

**ఉల్లక్కి** రూ.చూ. హుళక్కి. విశే. రిక్తం, ఉత్తది.

**ఉల్లక్కులు** వి. చచ్చు గడ్డిలోని వడ్లు, మేలువడ్లకు తాలువడ్లకు నడిమిరకం.

క. పొళ్ళు, పొళ్ళు. బోలు, పనికిమాలినవి; తప్పు; తాలు; కొడ. పొళ్ళె. తప్పు, తాలు; తు. పొల్లు, పొళ్ళు; త. పొల్లు; మ. పొళ్ళు; గోం. పొల్‌లుతు; కుఇ. పొల్‌గు.

< క. పొళ్ళు (తాలు)+అక్కి (ధాన్యం)+లు.

**ఉల్లంకి**[1] వి. వేధించటం.

**ఉల్లంకి**[2] రూ. ఉల్లంగి[1], ఉల్ల(గి. పో.చూ. ఉల్లాము. వి. ఉల్లంకిపిట్ట, గుడ్డికొక్కరాయి. (Gallinago medica) ప్రబంధ. 234.

క. ఉల్లంగి. ఉల్లంకిపిట్టు; త. ఉళ్ళాన్, ఉళ్ళు, ఉళ్; మ. ఉళ్ళి. పక్షి విశేషం.

**ఉల్లంగి**[1] రూ.చూ. ఉల్లంకి[2]. వి. ఉల్లంకిపిట్ట, గుడ్డికొక్కరాయి. హంస. 3.13.

**ఉల్లంగి**[2] పో.చూ. ముల్లంగి. వి. ముల్లంగి.

**ఉల్ల(గి** రూ.చూ. ఉల్లంకి[2]. వి. ఉల్లంకిపిట్ట.

**ఉల్లంచేప** వి. మత్స్య విశేషం, ఎక్కువ ఎముకలుండి చాలా రుచిగా ఉండే పెద్దరకం చేప.

త. ఉల్లమ్, ఉళ్ళమ్, ఉళ్ళా. మత్స్య విశేషం.

**ఉల్లట** రూ. ఉల్లడ, ఉల్లిడి, ఉల్లెడ[1]. పో.చూ. ఎల్లెడ. వి. మేనా, సవారి.

సం. ఉల్లోచ-. వితానము, మేలుకట్టు; ప్రా. ఉల్లోచ, ఉల్లోయ, వడ. వస్త్రం;

క. ఉల్లడె. వితానం, మేలుకట్టు.

**ఉల్లడ** రూ.చూ. ఉల్లట. వి. 1. మేలుకట్టు, వితానము; 2. మేనా. చంద్ర.చ. 5.20, ఆం.భా. 2.158.

**ఉల్లడి** పో.చూ. అల్లరి. వి. అలజడి, గందరగోళం. బసవ. ద్వి. 5.1025.

క. అల్ల.

**ఉల్లబము** పో.చూ. ఉల్లట. వి. 1. మేలుకట్టు, వితానము; 2. మేనా, సవారి. ఆం.భా. 2.158.

సం. ఉల్లంబయతి. పైన వేలాడదీయు; ప్రా. ఉల్లోవ-. వితానము, మేలుకట్టు.

< ప్రా. ఉల్లోవ-.

**ఉల్లము** వి. 1. మనస్సు, హృదయం. నిర్వ. 9.24; 2. ఇచ్ఛ, కోరిక. కళా. 6.261.

క. ఉళ్, ఒళ్. లోపల, లోపలివైపు; కొడ. ఒళు. లోపల; తు. ఉళ, ఉళై, ఉళాయి, ఒళ; త. ఉళ్ళమ్. మనస్సు, హృదయం, ఊహ, కోర్కె, ఉద్దేశం, శక్తి,

నేర్పు, జ్ఞానం, వివేకం, ఆత్మ; ఉళమ్. మనస్సు, హృదయం, రొమ్ము; ఉళ్. లోపలి భాగం, మనస్సు, హృదయం; మ. ఉళ్ళు. లో, లోపల, లోపలకు; ఉళ్ళమ్. మనస్సు, హృదయం; కోట. ఉళ్. లో, లోపల, లోపలకు; తొద. ఉట్; గోం. రొన్. ఒంటరిఇల్లు; రోపా, లొపా, లొపా, లొప్పా. లో, లోపల; కుఇ. లై; పర్జి. ఒలె, ఒలెక్. ఇల్లు; కొలా. లోపల్. లో, లోపల; నా. లోప, లోపల్; ఒల్లా. ఉలె. లోపల, ఇల్లు; కుడు. ఉలా. లోపలిగది, లోపలివైపు; మాల్తో. ఉలె. లో, లోపల; బ్రా. ఉరా. ఇల్లు, భార్య; ఉస్త్. హృదయం, మనస్సు, లోపల, మధ్య.

<మూ.ద్రా. *ఉళ్-/*ఒళ్-.

**ఉల్లకుట్టు** రూ. ఉల్లికుట్టు. వి. ఎత్తిపొడుపుమాట. <ఉల్లము+కుట్టు[1].

**ఉల్లరము** రూ.చూ. ఉలవరము[1]. వి. **1.** జలప్రవాహం; **2.** నీటి పారుదలవల్ల సారవంతమైన భూమి.

**ఉల్లఱపుబిరుదు** చూ. ఉల్లఱము.

**ఉల్లఱపుబిర్దు** చూ. ఉల్లఱము.

**ఉల్లఱము** 'ఉల్లరము' అని ముద్రిత పాఠం; చూ. ఉల్లము. విఆ. దుస్సహం. ప్రబంధ. 788.

ఉర్లాము కావచ్చు; అక్కడి పరీక్షలు దుస్సహమైనవిగా ప్రసిద్ధి.

<ఉర్లాము.

**ఉల్లఱపుబిరుదు** రూ. ఉల్లఱపుబిర్దు. వి. **1.** దుస్సహమైన పరాక్రమం కలవాడు. ఉ.హ. 4.200; **2.** భయంకరమైన బిరుదులు కలవాడు. ఆం.కా. 3.26. **ఉల్లఱపుబిర్దు** రూ.చూ. ఉల్లఱపు బిరుదు.

**ఉల్లల(వ్)** అనుకరణశబ్దం; 'ఉడుకు' (పరితపించు) పదానికి ముందు ప్రయుక్తం. అవ్య. పరితాప సూచక ధ్వన్యనుకరణ శబ్దం. భార.శాంతి. 3.33; వి. **1.** హృదయం; **2.** కళ పెళ ఉడికే ధ్వని.

**ఉల్లసమాట** చూ. ఉల్లసము.

**ఉల్లసమాడు** చూ. ఉల్లసము.

**ఉల్లసము** వి. **1.** విరహబాధ. కు.సం. 5.105; **2.** ఎత్తిపొడుపుమాట. శృం.నై. 7.179, సిం.ద్వా. 11.42; **3.** సంతోషం, ఉత్సాహం.

సం. ఉల్లస-. సంతోషం, ఉత్సాహం; ప్రా. ఉల్లస, ఉల్లాస-; అ.మా. ఉల్లసియ.

<సం. ఉల్లస-. అర్థవిపరి.

**ఉల్లసమాట** వి. ఉల్లసమాడటం, ఎత్తిపొడవటం. భార. విరా. 5.182. **ఉల్లసమాడు** స.క్రి., అ.క్రి. **1.** ఎత్తిపొడుచు, తూలనాడు, ఎగతాళి చేయు. భార.ద్రోణ. 2.5, శృం.నై. 6.96, పి.శకు. 2.182; **2.** నిందించు. కాశీ. 4.50. **ఉల్లసములాడు** స.క్రి. ఎత్తిపొడుచు, ఎగతాళిచేయు. భార. భీష్మ. 1.112. **ఉల్లసించు** అ.క్రి. వ్యక్తమగు, స్ఫుటమగు. ఉ.రా. 1.181. **ఉల్లసిలు** రూ.చూ. ఉల్లసిల్లు. అ.క్రి. **1.** పుట్టు, బయలుదేరు. మను. 2.10; **2.** సంతోషించు; **3.** ఒప్పు. **ఉల్లసిల్లు** రూ. ఉల్లసిలు. అ.క్రి. **1.** సంతోషించు. శృం.నై. 4.40; **2.** ఒప్పు, ప్రకాశించు. మార్క. 1.8; **3.** పుట్టు, కలుగు. హర. 4.19; **4.** వికసించు. కాశీ. 1.125; **5.** స్ఫుటమగు, వ్యక్తమగు.

**ఉల్లసములాడు** చూ. ఉల్లసము.

**ఉల్లసించు** చూ. ఉల్లసము.

**ఉల్లసిలు** చూ. ఉల్లసము.

**ఉల్లసిల్లు** చూ. ఉల్లసము.

**ఉల్లాకు**[1] రూ. ఉళ్ళాకు. వి. చీటి, ఖండపత్రిక, ధాన్యాదుల పరిమితి, స్వామ్యం మొదలైన వాటిని తెలుపటానికై రాసి ఉంచిన పత్రం.

పో.చూ. క. ఉళకు. కచ్చితమైన ధర, అడంగులు.

బహుశః <ఉలి[2]+ఆకు. ఏదో రాసిపెట్టి ఉంచిన రాటాకుముక్క.

**ఉల్లాకుతెగులు** వి. రాటాకు తెగులు. కొన్ని మొ. వాటి తెగులు; తేర ఆకుల తెగులు కావచ్చు.

**ఉల్లాకు**[2] వి. బంగారం పరీక్షచేసి నికరం నిర్ణయించటం.

పో.చూ. క. ఉళకు. నికరం.

**ఉల్లాకు(జే(వ** (-చే(వ) పో.చూ. ఉల్లంచేప. వి. ఒకరకం చేప.

**ఉల్లాకుతెగులు** చూ. ఉల్లాకు[1].

**ఉల్లాము**[1] వి. ఉల్లంకిపిట్ట.

త. ఉళ్ళల్, ఉళ్ళాన్, ఉళ్ళు. (Gallina gomedia); మ. ఉళ్ళి.

<మూ.ద.ద్రా. *ఉళ్-.

**ఉల్లాముపిట్ట** వి. ఉల్లంకిపిట్ట.

**ఉల్లాము**[2] వి. **1.** చెరువు మొ. జలాశయాలలో గట్టవెంబడి, అరగాడిలోను ఏర్పడిన చిన్న పడియ; **2.** చేపలు వచ్చి చేరటానికి తవ్విన గుంట.

ఉల్లంచేపలు ఈ గుంటల్లో దొరకటాన్నిబట్టి ఈ పేరు వచ్చిఉండవచ్చు.

**ఉల్లాముపిట్ట** చూ. ఉల్లాము[1].

**ఉల్లారబోయు** స.క్రి. కుమ్మరించు.

**ఉల్లారము** రూ.చూ. ఉలవరము[1]. వి. **1.** మురుగుకాల్వ; **2.** మురుగు పారుదలచే సారవంతమైన భూమి.

**ఉల్లారి** చూ. ఆరె. వి. కలుపు తియ్యటానికి, కొయ్యముక్కకు ఇనపచువ్వ అమర్చి చేసిన పనిముట్టు.

క. పుల్లు, ఉల్లు. కలుపు, గడ్డి, కసవు.

బహుశః <క. ఉల్లు+ఆరె. కలుపు తీసే పనిముట్టు.

**ఉల్లారు**[1] పో.చూ. ఉల్లెడ. వి. **1.** గుర్రపు జీనుమీది పరుపు. కళా. 6.224; పరమ. 3.228 వ.; **2.** జాలరు, అంచు. ఆము. 4.35.

ప్రా. ఉల్లరయ. పూసలతో చేసిన ఒక రకం ఆభరణం; పా. ఉళార. గొప్ప, శక్తిమంతమైన, శ్రేష్ఠమైన, మేలైన, పెద్దదైన.

క. ఉల్లార, ఉలార. కూర్చోటానికి పనికొచ్చే రంగురంగుల మెత్తని పరుపు.

<క. ఉల్లార.

**ఉల్లారు**[2] చూ. ఉలి[2].

**ఉల్లారేయు** చూ. ఉలి[2]

**ఉల్లి** వి. 1. నీరుల్లి, వెల్లుల్లి (Allium cepa). భార.అను. 3.189, మార్క. 3.203.

క. ఉళ్ళి. ఉల్లిగడ్డ, డుంప, ఎ. ఉళ్ళి, ఉల్లి. వెల్లుల్లి; త. ఉళ్ళి. ఉల్లిగడ్డ, వెల్లుల్లి; ఉళ్ళి-ప్-పూండు/-పూండు. వెల్లుల్లి, నీరుల్లి; ఈరుళ్ళి. ఉల్లిగడ్డ; మ. ఉళ్ళి. ఉల్లిగడ్డ, వెల్లుల్లి; తొద. ఉళ్‌య్. వెల్లుల్లి; కోట. ఉళ్‌య్. ఉల్లిగడ్డ; గోం. ఉల్లి; కువి. ఊల్లి; వెల్లఊల్లి వెల్లుల్లి; పర్జి. ఉల్లి. వెల్లుల్లి; కొలా. ఉల్లి. ఉల్లిగడ్డ.

<మూ.ద్రా. *ఉళ్ళ్-.

**ఉల్లికోడి** వి. ఉల్లిమొక్కలోనుంచి బయలుదేరి చివర తెల్లని పువ్వు పూసే పొడుగాటి కాడ. **ఉల్లికోదు** వి. ఉల్లి తెగులు, ఉల్లి ఆకులకు పట్టే ఒకరకం తెగులు. **ఉల్లిగడ్డ** వి. ఉల్లిపాయ. **ఉల్లిపాయ** వి. 1. ఉల్లిగడ్డ; 2. ఉల్లిగడ్డలోని చిన్న పాయ. **ఉల్లిపొర** వి. ఉల్లిగడ్డమీది పల్చని పొర. **ఉల్లిపొరకాగితము** వి. ఉల్లిపొరవంటి పల్చని కాగితం. **ఉల్లిమల్లి** వి. ఉల్లికీ మల్లికీ వ్యత్యాసం తెలిపే వాసన. **ఉల్లిమొజ్జ** వి. ఉల్లితెగులు.

**ఉల్లిక** వి. నలికండ్లపాము.

**ఉల్లికుచ్చడము** వి. ఒకరకం చేప.

**ఉల్లికుట్టు** రూ.చూ. ఉల్లకుట్టు. విశే. ఎత్తిపొడుపు. భార.ఉద్యో. 2.242; వి. ఎత్తిపొడుపుమాట. భార.శాంతి. 3.20.

**ఉల్లికోడి** చూ. ఉల్లి.

**ఉల్లికోదు** చూ. ఉల్లి.

**ఉల్లిగడ్డ** చూ. ఉల్లి.

**ఉల్లింకాయ** పో.చూ. ఉల్లాము. వి. పెద్ద ఉల్లంకిపిట్ట.

**ఉల్లిడి** రూ.చూ. ఉల్లట. వి. 1. మేలుకట్టు; 2. నవారి, మేనా.

**ఉల్లింద్ర** రూ.చూ. ఇల్లింద. వి. ఒకరకం కంచెచెట్టు (Diospyras capituata).

**ఉల్లిపాయ** చూ. ఉల్లి.

**ఉల్లిపావని** వి. ఒకరకం పొడలపాము.

**ఉల్లిపాషాణము** రూ.చూ. ఇలిపాషాణము. వి. సౌవీరం, ఒకరకం విషపదార్థం, ఉల్లిలాగా తెల్లగా ఉండే ఖనిజ పదార్థం.

పో.చూ. క. శంఖపాషాణ. శంఖభస్మం.

**ఉల్లిపొర** చూ. ఉల్లి.

**ఉల్లిపొరకాగితము** చూ. ఉల్లి.

**ఉల్లిమల్లి** చూ. ఉల్లి.

**ఉల్లిమొజ్జ** చూ. ఉల్లి.

**ఉల్లుళ్లెక్క** రూ. ఉళ్ళుళ్ళెక్క. పో.చూ. హుళక్కి. వి. అబద్ధం, ఉళక్కి.

**ఉల్లూరుగా** పో.చూ. ఉరులు. విశే. వదులువదులుగా.

**ఉల్లె** వి. అప్పం అడుగుచెక్క.

త. ఉలర్. ఎండు, వాడిపోవు, మాడు; మ. ఉలరుక. ఎండు; ఉలర్‌చ్చ. ఎండటం; ఉలర్‌త్తుక, ఉలర్‌క్కుక. ఎండు.

**ఉల్లెక్కమాటలు** చూ. ఉల్లుళ్లెక్క. వి. అబద్ధాలు.

**ఉల్లెడ**[1] రూ.చూ. ఉల్లట. వి. 1. మేలుకట్టు, వితానము. మను. 5.71. ఆము. 6.130, ముకుంద. 3.281; 2 నవారి, మేనా.

**ఉల్లెడగట్టు** అ.క్రి. బూజుపట్టు.

**ఉల్లెడ**[2] వి. చేనికి కంచె వేసేటప్పుడు ఒక వరస పెద్ద కంప మండలుపాతిన తర్వాత మధ్య సందుల్లో వేసే సన్న ముళ్ళకంప.

**ఉల్లెడగట్టు** చూ. ఉల్లెడ[1].

**ఉల్లెడతాడు** వి. రాట్నం ఆకులకు చుట్టిన తాడు.

**ఉల్లెడతీయు** స.క్రి. రాట్నం రెండు వైపులా ఉన్న ఆకులను కలుపుతూ తాడు చుట్టు.

**ఉల్లెందు** రూ.చూ. ఇల్లింద. వి. ఒకరకం చెట్టు.

**ఉల్లోవు** వి. నట్టిల్లు.

క. ఒళ్. లోపలి భాగం; త. ఉళ్. లోపల, లోపలి భాగం; ఉళ్యూర్. పట్టణ మధ్య భాగం.

**ఉల్వరి** రూ.చూ. ఉలవరము[1]. వి. దుక్కిపదను నేల. ద.హిం. శా. 6.639, శక. 1069.

**ఉల్వు** రూ.చూ. ఉలివు[2]. వి. 1. శబ్దం, ధ్వని. పండి.చ. 4.252; 2. కదలిక.

**ఉల్సర** వి. భయం.

క. ఒళసూర్. భయపడు, జంకు; త. ఉలైవ్వల్. కష్టం, ఉపద్రవం; మ. ఉలచ్చల్, ఉలవు. కలత.

<త. ఉలైచ్చల్. అర్థవివరి.

**ఉళక్కి** రూ.చూ. హుళక్కి. వి. అసత్యం, శూన్యం, కపటం, మోసం. అచ్చ.రా. 6.409.

**ఉళి** పో.చూ. ఉలి[1]. వి. ఇనుము.

క. ఉళి. ఉలి, రాళ్లకొట్టే ఉలి.

<క. ఉళి.

**ఉళిక్కి** రూ.చూ. హుళక్కి. వి. అసత్యం, శూన్యం, మాయ. అచ్చ.రా. 6.409.

**ఉళిగము** రూ.చూ. ఊడిగము. వి. సేవ, దాస్యం. బసవ. 6.640 వ.

**ఉళువాయి** రూ. ఉలవ[3], ఉలవాయి. వి. చక్రానికి, ఇరుసుకు మధ్య వేసే ఇనపకట్టు.

త. ఉళువాయ్. ఇనపకట్టు; ఉళ్-వాయ్. నోటి లోపలి భాగం, అంగిలి.

<త. ఉళ్-వాయ్.

**ఉళ్ళక్కి** రూ.చూ. హుళ్ళక్కి. వి. అసత్యం, వేళాకోళం, నెపం.

**ఉళ్ళాకు** రూ.చూ. ఉల్లాకు[1]. వి. చీటి, ఖండ పత్రిక.

**ఉళ్ళుళ్ళెక్క** రూ.చూ. ఉల్లుళ్లెక్క. వి. అబద్ధం, ఉళక్కి.

**ఉవిద** వి. 1. యువతి. భార. ఆది. 4.253; 2. భార్య. ద్వి. నల. 1.374; 3. అందగత్తె. శృం.నై. 4.32.

సం. యువతి-, యువతీ. బాలిక, యౌవనవతి; ప్రా. జుఐ, జువై; అ.మా. జువై, జువతి; కుమా. హిం. జోఈ; నే. సిం. జోఇ. భార్య; ల. జో, జోఎ;

<సం. యువతి-.

**ఉవ్వ**[1] వి. పెద్దకళింగ, వృక్షవిశేషం. ఈ చెట్టు పువ్వు పెద్దది గానూ, సువాసనతోనూ ఉంటుంది (Dillenia indica).

త. ఉకా, ఉవా, ఉవాత్తెకు; మ. ఉకమరమ్.

**ఉవ్వకాయ** వి. పెద్ద కళింగకాయ.

**ఉవ్వ[2]** వి. గాయం, పుండు (బాలభాష).
తు. ఉబ్బు. పుండు, వ్రణం (బాలభాష).

**ఉవ్వ[3]** పో.చూ. దువ్వపులుఁగు, దాసరిపిట్ట, కాటుకపిట్ట.
**ఉవ్వపిట్ట** రూ. ఉవ్విపిట్ట. వి. జిట్టంగి, దాసరిపిట్ట, కాటుకపిట్ట.

**ఉవ్వ[4]** వి. ఒకరకం పిల్లల ఆటలో 'ఏమీలేదు' అనే అర్థాన్నిచ్చే పదం. బహుశః ధ్వన్యను.

**ఉవ్వ[5]** రూ.చూ. ఊబ[2]. వి. ఒక రకం కలుపు మొక్క (Heteropogon contorutus).

**ఉవ్వకాయ** చూ. ఉవ్వ[1].

**ఉవ్వవ** చూ. ఉవ్వన. క్రి.విశ. వెంటనే, తటాలున, హఠాత్తుగా. భా.రా.యు. 21, దుర్మా. 3.140.

**ఉవ్వపిట్ట** చూ. ఉవ్వ[3].

**ఉవ్వలపోటీ** పో.చూ. ఉవ్వ[4]. వి. బాలక్రీడా విశేషం. కళా. 3.33.

**ఉవ్వాయి** వి. 1. సంతోషం. ఉ.హ. 3.125 ; 2. ఉత్సాహం.
క. ఒసె. సంతోషించు ; త. ఉవకై. సంతోషం, ఆహ్లాదం, కామవాంఛ ; ఉవ. సంతోషించు, ఆమోదించు, ఇష్టపడు ; మ. ఉవక్క. ఎగురు, అతిశయించు, ప్రేమించు ; ఉవప్పు. ప్రేమ, సంతోషం ; ఉవలి. ఇచ్ఛ, అభిలాష ; ఉవా. సంపూర్ణత ; ఉవ్వ. ఔను ;
మరా. ఉవాఇనెఁ. స.క్రి. తృప్తిచెందు ; ఉవాయ, ఉవాఇవా, ఉవాయివా.

**ఉవ్విపిట్ట** రూ.చూ. ఉవ్వపిట్ట. వి. జిట్టంగి, కాటుకపిట్ట.

**ఉవ్విళులు** రూ.చూ. ఉవ్విళ్లు. వి. తహతహ, తొందర.
**ఉవ్విళులూరు** అ.క్రి. తహతహపడు, తొందరపడు. భార.విరా. 5.393, కళా. 5.15. **ఉవ్విళులూర్చు** రూ.చూ. ఉవ్విళ్లూర్చు. స.క్రి. ఆశ కలిగించు, త్వరపెట్టు, తహతహపెట్టు. కవిక. 2.150.

**ఉవ్విళులూరు** చూ. ఉవ్విళులు.

**ఉవ్విళులూర్చు** చూ. ఉవ్విళులు.

**ఉవ్విళ్లు** రూ. ఉవ్విళులు, ఊవిళ్లు. వి. త్వర, తొందర. శతకంఠ. 3.70.
పో.చూ. ఉగుబ్, ఉగబ్. ఉమియు ; త. ఉమిబ్.
**ఉవ్విళ్లగొను** ఉవ్విళ్లు+కొను. అ.క్రి. తొందరపడు. కవిక. 2.150. **ఉవ్విళ్లగొలుపు** ఉవ్విళ్లు+కొలుపు. స.క్రి. తొందరపెట్టు, తహతహపెట్టు. ప్రభా. 3.66. **ఉవ్విళ్లూరచేయు** ఉవ్విళ్లు+ఊఅన్+చేయు. స.క్రి. తహతహపెట్టు, త్వరపెట్టు. **ఉవ్విళ్లూరు** రూ. ఉవ్విళులూరు, ఊవిళ్లూరు. అ.క్రి. 1. ఆశించు, కోరు. భార.విరా. 1.321 ; 2. తహతహపడు, తమకించు. హరి.పూ. 4.116. **ఉవ్విళ్లూర్చు** రూ. ఉవ్విళులూర్చు. స.క్రి. 1. ఆశగొలుపు, కోరిక కల్గించు. కాశీ. 4.150 ; 2. త్వరపెట్టు, తహతహ పెట్టు.

**ఉవ్విళ్లగొను** చూ. ఉవ్విళ్లు.

**ఉవ్విళ్లగొలుపు** చూ. ఉవ్విళ్లు.

**ఉవ్విళ్లూరచేయు** చూ. ఉవ్విళ్లు.

**ఉవ్విళ్లూరు** చూ. ఉవ్విళ్లు.

**ఉవ్విళ్లూర్చు** చూ. ఉవ్విళ్లు.

**ఉవ్వు[1]** వి. శీఘ్రత్వాదులను తెలిపే అనుకరణ శబ్దం.
**ఉవ్వున(న్)** రూ. ఉప్పున. క్రి.విశ. 1. అకస్మాత్తుగా, హఠాత్తుగా. భా.రా.యు. 2145 ; 2. వెంటనే, శీఘ్రంగా. వి.పు. 5.310. **ఉవ్వెత్తు** క్రి.విశ. 1. అవలీలగా, అనాయాసంగా. రం.రా. 31 పు. 22 పం., వసు. 2.10 ; 2. ఎక్కువగా. పాండు. 5.189 ; 3. నిశ్శేషంగా, పూర్తిగా. మను. 4.60, కళా. 8.57 ; విశ. మొత్తం, అన్నీ. **ఉవ్వెత్తుగ** రూ.చూ. ఉవ్వెత్తుగా. క్రి.విశ. అవలీలగా, ఒక్కుమ్మడిగా, పూర్తిగా. **ఉవ్వెత్తుగా** రూ. ఉవ్వెత్తుగ. క్రి.విశ. అవలీలగా, ఒక్కుమ్మడిగా, పూర్తిగా. చెన్న. బ. 5.65. **ఉవ్వెత్తుగాఁగ** క్రి.విశ. అవలీలగా, అనాయాసంగా, ఒక్కుమ్మడిగా. రం.రా. బాల. 31 పు. 22 పం. **ఉవ్వెత్తుగొను** ఉవ్వెత్తు+కొను. స.క్రి. నిశ్శేషంగా చంపు, నశింపజేయు. భార. ఉద్యో. 1.29, ఆర. 7.36.

**ఉవ్వు[2]** వి. ప్రయత్నం, పరిశ్రమ, కృషి.

**ఉవ్వున(న్)** చూ. ఉవ్వు[1].

**ఉవ్వెత్తు** చూ. ఉవ్వు[1].

**ఉవ్వెత్తుగ** చూ. ఉవ్వు[1].

**ఉవ్వెత్తుగా** చూ. ఉవ్వు[1].

**ఉవ్వెత్తుగాఁగ** చూ. ఉవ్వు[1].

**ఉవ్వెత్తుగొను** చూ. ఉవ్వు[1].

**ఉసక** రూ.చూ. ఇసుక. వి. ఇసుక.

**ఉసంగి** వి. ఒకరకం కలుపు మొక్క.

**ఉసల** వి. ఒకరకం గడ్డి.

**ఉసలా** రూ.చూ. ఉసులు[1]. వి. అవకాశం, వీలు.
**ఉసలాయించు** స.క్రి. ప్రయత్నంతో సమకూర్చు ; పో.చూ. హిం. ఉసల్‌నా. పూర్తియగు.

**ఉసలాయించు** చూ. ఉసలా.

**ఉసి[1]** పో.చూ. ఇసుకొలుపు. వి. కుక్కలు మొదలైన వాటికి చేసే ప్రేరణం ; ప్రేరణం (ధ్వన్యను.).
క. ఉస్, ఊస్, హూస్, హెూస్, జంతువుల్ని అదిలించటానికి ఉపయోగించే ధ్వన్యనుకరణ శబ్దం, అలసినప్పుడు నిట్టూర్చే ధ్వని. తు. ఉసు, ఉస్సు.
**ఉసికొను** అ.క్రి. కుక్క మొ.నవి ప్రోత్సాహం పొందు, మీదపడు, కవియు. **ఉసికొలుపు** రూ. ఉసికొల్పు. స.క్రి. కుక్కలు మొ.వాటిని ప్రేరేపించు. సారంగ. చ. 1.98. **ఉసికొల్పు** రూ.చూ. ఉసికొలుపు. స.క్రి. 1. కుక్కలు మొ.వాటిని ప్రేరేపించు. కు.సం. 4.377, హంస. 4.88 ; 2. ప్రేరేపించు, కోపం కల్గించు.

**ఉసి[2]** రూ.చూ. నుసి. వి. పొడి, నుసి. ద్వి. హరిశ్చ. ఉ. 504.
**ఉసికంకి** వి. కళ్లంలో గింజలు రాల్చిన కంకి, చచ్చుకంకి. **ఉసికొట్టు** స.క్రి. పడుగు పీకిన తర్వాత ధాన్యం మీద ఉన్న చెత్తను తీసివేయు. **ఉసిగొర్రు** వి. ఆటగొర్రు, భూమిదున్నేగొర్రు. **ఉసిపడుగు** వి. చచ్చు గడ్డి పడుగు, చాలా భాగం గింజలు రాలిన గడ్డిలో వేసిన పడుగు.

**ఉసి**[3] వి. సంగీతంలో తాళం వేసేటప్పుడు దెబ్బకూ దెబ్బకూ నడుమ చేసే ఒకవిధమైన హస్త విక్షేపం, సందు, విరామం.

**ఉసిపాట** వి. తంవాన తాన మొ.వాటి అంగ భూతమైన గానం.

**ఉసి**[4] వి. ఉత్సాహం, సహాయం.

క. ఒసె. సంతోషంగా ఉండు, తగి ఉండు; హొసిగె. సంతోషం; త. ఉక, ఉవ, ఉవర్, ఉయర్. పైకెత్తు, సంతోషంగా ఉండు, తృప్తిపొందు;

**ఉసికొయ్య** వి. బండికి ఎద్దులు కట్టకుండా ఉన్నప్పుడు బండి నొగను ఎద్దుల మెడపై ఉన్నట్లు ఎత్తి ఉంచటానికి ఉపయోగించే ఊతకొయ్య.

**ఉసి**[5] వి. హొడవు.

**ఉసికంకి** చూ. ఉసి[2].

**ఉసికె** రూ.చూ. ఇసుక. వి. ఇసుక.

**ఉసికెనేల** వి. ఇసుక ఎక్కువగా ఉన్న నేల. **ఉసికెపొర నేల** వి. ఇసక, మన్ను పొరలు పొరలుగా కలిసి ఉన్ననేల.

**ఉసికెనేల** చూ. ఉసికె.

**ఉసికెపొరనేల** చూ. ఉసికె.

**ఉసికొట్టు** చూ. ఉసి[2].

**ఉసికొను** చూ. ఉసి[1].

**ఉసికొయ్య** చూ. ఉసి[4].

**ఉసికొలుపు** చూ. ఉసి[1].

**ఉసికొల్పు** చూ. ఉసి[1].

**ఉసిగొ్రు** చూ. ఉసి[2].

**ఉసిపడుగు** చూ. ఉసి[2].

**ఉసిపాట** చూ. ఉసి[3].

**ఉసిమొన** వి. మల్లబంధ విశేషం.

పో.చూ. క. ఉసిరు. శక్తి, బలం.

**ఉసిరి** రూ. అసెరెకి, ఉసిరిక. ఓసిరీ. వి. ఆమలక వృక్షం, ఉసిరిచెట్టు (Phyllanthus emblica).

త. ఉవిల్. ఉసిరిక చెట్టు; కుఇ. జూర. ఉసిరి; కువి. జూరొ; పెంగో. హూర్కమర్; మండ. జూర్క; కొండ. ఉసికమరన్, సూరిక్కమాను, సురికమరన్; కొలా. ఉసురాక్.

**ఉసిరికాయ** రూ. ఉసిరికకాయ. వి. ఉసిరికకాయ. దశా. 6.15.

**ఉసిరిక** రూ.చూ. ఉసిరి. వి. ఆమలకీ వృక్షం. ఉ.రా. 5.288.

**ఉసిరికకాయ** రూ.చూ. ఉసిరికాయ. వి. ఉసిరిక చెట్టు కాయ. కాశీ. 5.167.

**ఉసిరికకాయ** చూ. ఉసిరిక.

**ఉసిరికాయ** చూ. ఉసిరి.

**ఉసిలిపోవు** చూ. ఉసిపోవు. అ.క్రి. తప్పించుకొనిపోవు. పండి. చ. 1.441.

**ఉసిళ్లు** రూ.చూ. ఇసుళ్లు. వి. రెక్కచెదలు.

**ఉసిపోవు** అ.క్రి. వ్యర్థమగు, తప్పిపోవు, గురితప్పు. కకుత్స. 4.57.

క. హుసి. గురితప్పిన దెబ్బ. అసమర్థుడు.

< ఉసి[2] + పోవు.

**ఉసుక** రూ.చూ. ఇసుక. వి. ఇసుక. ద్వి.హరిశ్చ. ఉ. 1319.

క. ఉసుకు, ఉసకు, ఉసిగె, ఉసబు, ఉసువు, ఉసుబు, ఉసువ్రు. ఇసుక; గోండి. ఉసాక్. ఉసెక్; కొట. ఉసాక్, ఉసక్.

**ఉసుగు** చూ. ఉసుము. అ.క్రి. నలుగు, ఒరపిడిపొందు. పండి. చ. పురా. 104 పం.

క. ఉసికు, ఉసిగు, ఉసుకు, హొసకు, హొసగు, ఒసగు. నలుపు, ఊవు, కదలించు, రుద్దు, రాపిడివల్ల నిప్పు పుట్టించు, కొట్టు; హొసె; త. ఒచి. కదిలించు, ఊపు, విరుచు.

**ఉసుము** స.క్రి. **1.** రుదుచు, తొలగించు. పాండు. 3.196; **2.** ఉరుకు. పాండు. 5.41; **3.** పులుము, సులుము. పాండు. 5.224.

గోం. ఉసువానా, ఉసూమి, ఉసుమ్క్. గుడ్డతో తుడుచు; ఊసానా, ఊసి, ఊస్కా. ఆవుపేడతో అలుకు, కన్నీళ్లు కార్చు: కువి. ఊస్స. పులుముకొను; ఊస్ప. అలుకు; పర్జి. గద. ఒల్లా. ఉయ్క్. రుద్దు; కొలా. ఉస్మ్. తుడుచు, పూయు, ఉస్కెల్; మాల్తో. నుస్గ్. రుద్దు, శుభ్రపరచు.

< మూ.మ.ద్రా. *ఉచ్-.

**ఉసురమురు** చూ. ఉసురు[1].

**ఉసురు**[1] రూ.చూ. ఉస్సురు. అవ్య. తాపంలో వచ్చే నిశ్వాస ధ్వనికి అనుకరణం. సారంగ. 2.147.

**ఉసురసురు** రూ. ఉసురుసురు. అవ్య. తాపంలో వచ్చే నిశ్వాస ధ్వనికి అనుకరణం. హంస. 4.113. క. అసురుసురు. అలసట, గ్లాని. **ఉసురుమను** అ.క్రి. బాధపడు, శోకించు. **ఉసురుసురు** రూ.చూ. ఉసురసురు. అవ్య. తాపంలోవచ్చే నిశ్వాసధ్వనికి అనుకరణం. శుక. 3.200.

**ఉసురు**[2] రూ. ఉసుఱు. వి. **1.** ఊపిరి, ప్రాణం, ఆయువు. భార.శల్య. 2.56, వసు. 4.47, ఆం.భా. 1.61; **2.** ప్రాణక్షోభంవలని దుష్ఫలం. శుక. 2.114, వేమన. 1.46, ద్వి.సారంగ. 31 పు. 9 పం.; **3.** శిశ్నం.

క. ఉసలు, ఉసురు. ఊపిరి, ప్రాణం; ఉసిర్, ఉసుర్. ఊపిరి పీల్చు, మాట్లాడు, పలుకు, చెప్పు; ఉసిర్. వి. ఊపిరి, ప్రాణం, ఊపిరి పీల్చటం; ఉసిరు. ఊపిరి, బలం, శక్తి; తు. ఉసురు, ఉసులు. ఊపిరి; త. ఉయిర్. స్పృహవచ్చు, తెలివివచ్చు; ప్రాణం, ఆత్మ. ఉవిర్. ప్రాణం. ఉయ్. నివసించు, ఉండు, రక్షింపబడు; ఉయిర్. ప్రాణం, ఆత్మ, జీవి; మ. ఉయిర్. నివసించు, ఉండు, తప్పించుకొను; ఉసిర్. ప్రాణం, ఊపిరి; ఉయిర్క్క. బ్రతుకు, పునరుద్ధరించు; ఉయిర్ప్ప. ప్రాణం, పునరుజ్జీవనం; కువి. ఊకురి. ఊపిరి. శ్వాస; కురు. ఉజ్జ్. జీవించు; మాల్తో. ఉయ్. జీవించు.

< మూ.ద్రా*. ఉచ్-/*ఉయ్-.

**ఉసురుకొను** రూ. ఉసుఱుకొను. అ.క్రి. పెరుగు, వర్ధిల్లు, బలం పుంజుకొను. కాశీ. 3.23. **ఉసురుపుచ్చుకొను** స.క్రి. నొప్పించు, బాధించు. **ఉసురుపోసికొను** రూ. ఉసురుపోసుకొను. స.క్రి. నొప్పించు, బాధించు. **ఉసురుపోసుకొను** రూ.చూ. ఉసురుపోసికొను. స.క్రి. నొప్పించు, బాధించు.

**ఉసురుకొను** చూ. ఉసురు[2].
**ఉసురుఖానా** రూ చూ. అహూర్ఖానా. వి. పీర్ల చావడి.
**ఉసురుపుచ్చుకొను** చూ. ఉసురు[2].
**ఉసురుపోసికొను** చూ. ఉసురు[2].
**ఉసురుపోసుకొను** చూ. ఉసురు[2].
**ఉసురుసను** చూ. ఉసురు[1].
**ఉసురుసురు** చూ. ఉసురు[1].
**ఉసుఱు** రూ.చూ. ఉసురు[2]. వి. **1.** ప్రాణం. ఆం.భా. 1.61 ; **2.** మనఃక్షోభంవల్ల కల్గిన దుష్ఫలం. శుక. 1.114.
**ఉసుఱుకొను** రూ. ఉసురుకొను. అ.క్రి. వర్ధిల్లు, వృద్ధి పొందు. కాశీ. 3.23.
**ఉసుఱుకొను** చూ. ఉసుఱు.
**ఉసులయిన** చూ. ఉసులు[1].
**ఉసులు**[1] రూ. ఉనలా, ఉనుపు. చూ. ఎసలిక. వి. అను కూల్యం, వీలు. ఉ.హ. 3.80 ; విణ. అనుకూలం.
**ఉసులయిన** విణ. మేలైన, తేలికైన, **ఉసులుగానుండు** అ.క్రి. బాగుగానుండు, మేలగు. **ఉసులుచేయు** అ.క్రి. ఓటు చేయు, సులువుచేయు.
**ఉసులు**[2] చూ. ఉసి[5]. వి. కొలత, పరిమాణం.
**ఉసులుగానుండు** చూ. ఉసులు[1].
**ఉసులుచేయు** చూ. ఉసులు[1].
**ఉసుళ్లు** రూ.చూ. ఇసుళ్లు. వి. రెక్కచీమలు, రెక్కచెదలు.
**ఉసువు** రూ.చూ. ఉసులు[1]. వి. తేలిక, సులువు.
**ఉసూరను** చూ. ఉసూరు.
**ఉసూరు** రూ.చూ. ఉస్సురు. అవ్య. తాపంలోవచ్చే నిశ్వాస ధ్వనికి అనుకరణం. రస. 2.92.
**ఉసూరను** రూ.చూ. ఉస్సురను. అ.క్రి. నిట్టూర్చు.
**ఉస్కెరాయి** చూ. ఇసుక. వి. కట్టుబడిరాయి.
**ఉస్తాదు** రూ. వస్తాదు. వి. **1.** కసరత్తు నేర్పేవాడు ; **2.** ఉపాధ్యాయుడు, యజమాని ; **3.** మొనగాడు.
హిం.ఉ. ఉస్తాద్. గురువు, ఉపాధ్యాయుడు.
<ఉ. ఉస్తాద్.
**ఉస్తి** వి. ఆసరా, తోడు, సహాయం.
**ఉస్తె** రూ.చూ. ఉచ్చింత. వి. ఉచ్చింతచెట్టు. హంస. 4.10.
**ఉస్తెకాయ** వి. ఉచ్చింతకాయ. **ఉస్తెవరుగు** రూ.చూ. ఉచ్చింతవరుగు.
**ఉస్తెకాయ** చూ. ఉస్తె.
**ఉస్తెవరుగు** చూ. ఉస్తె.
**ఉస్సు** రూ.చూ. ఉస్సురు. అవ్య. తాపంలో వచ్చే నిశ్వాస ధ్వనికి అనుకరణం, నిట్టూర్పు. వి.ర. 7.154.
**ఉస్సురనిపించు** చూ. ఉస్సురు.
**ఉస్సురను** చూ. ఉస్సురు.
**ఉస్సురస్సురను** చూ. ఉస్సురు.
**ఉస్సురస్సురు** చూ. ఉస్సురు.
**ఉస్సురు** రూ. ఉసురు[1], ఉసూరు, ఉస్సు. అవ్య. తాపంలో వచ్చే నిశ్వాస ధ్వనికి అనుకరణం, నిట్టూర్పు. అని. 1.83.
క. ఉసిర్, ఉసుర్. ఉసురు. ధ్వనించు. పలుకు, చెప్పు ; తు. ఉసురు, ఉసులు. శ్వాస, ఊపిరి ; త. ఉయిర్. గట్టిగా ఊపిరిపీల్చు ; మ. ఉయిర్, ఉసిర్. ప్రాణం, శ్వాస.
**ఉస్సురనిపించు** 'ఉస్సురను'యొక్క ప్రే. అ.క్రి. బాధ పెట్టు, నిట్టూర్చునట్లుచేయు. **ఉస్సురను** రూ. ఉసూరను. అ.క్రి. దుఃఖించు, నిట్టూర్చు. **ఉస్సురస్సురను** అవ్య. తాపంలోవచ్చే నిశ్వాసధ్వనికి అనుకరణం. **ఉస్సురస్సురు** తాపంలోవచ్చే నిశ్వాసధ్వనికి అనుకరణం. పరమ. 3.148.
**ఉహుకు** రూ.చూ. హుంకు. వి. గద్దగోరు.
**ఉహుహూ** వి. **1.** చలికి వణికేటప్పుడు చేసే ధ్వన్యనుకరణం. దా.స. 10 పు. 900 ; **2.** 'వద్దు' అని నిరాకరించటానికి చేసే ధ్వని.
క. ఉహుహు, ఉహూ. చలికి వణికేటప్పుడు చేసే ధ్వన్యనుకరణం.
**ఉహ్హు** వి. **1.** ఊదేటప్పుడు వచ్చే ధ్వన్యనుకరణం. కాశీ. 6.228, పాండు. 3.12 ; **2.** నిట్టూర్పు. కాశీ. 5.65.

# ఊ

**ఊ** అవ్య. తెలుగు వర్ణమాలలో ఆరో వర్ణం. సంవృతమై తాల వ్యేతరమైన ఓష్ఠ్య దీర్ఘ స్వరం ; అన్ని ద్రావిడ భాషల్లోనూ ఉంది.
**ఊఁ** అవ్య. **1.** కథాది శ్రవణ సమయాన శ్రోత వింటున్నట్టు తెలిపే ధ్వని ; **2.** అంగీకార సూచకం ; **3.** ఆశ్చర్య క్రోధాది సూచకం ; **4.** ప్రశ్నార్థకం.
పో.చూ. క. ఊమ్. కోప సూచకం ; ఉమ్. బాధా సూచకం ; హూమ్. సంశయ కోపాదులను తెలియ జేస్తుంది ; తు. ఊ. ఆ తర్వాత ; ఊఁజ్కట్టుని. ఊఁ కొట్టటం ; ఊఁ. కథలు వినేటప్పుడు ఊఁకొట్టటం ; త. ఉమ్-కూట్టు, ఉమ్-కొట్టు. కథ చెప్పేటప్పుడు ఊఁ కొట్టటం ; ఊమ్‌కొట్టు ; గో. ఊఁకా ;
సం. ఉ. కోపాదులను సూచిస్తుంది. ఆజ్ఞానుజ్ఞాది సూచకం ; హుమ్, ఉమ్. ఆశ్చర్యాదులను సూచిస్తుంది.
**ఊఁకొట్టు** అ.క్రి. ఊఁ అను. చంద్రా. 3.4 ; స.క్రి. ఊఁ అనుచు విను ; వి. కోపాది సూచకంగా ఊ అనటం. చంద్రా. 6.15. **ఊఁకొను** స.క్రి. **1.** అంగీకరించు, నమ్మ తించు. భార.ఉద్యో. 3.331 ; **2.** కథాదులు ఊఁ అంటూ

విను. కాశీ. 7.173 ; అ.క్రి. ఈఁ అను. పార్వ. 6.2.

**ఈక(తుప్ప)** రూ.చూ. వాక. వి. వాకుడుచెట్టు (Carissa carandas).

**ఈకనబొడ్డు** వి. ఒకానొక మందాకు చెట్టు.

**ఈకరగుంజ** రూ.చూ. ఉకారగుంజ. వి. **1.** సరిగూటం; **2.** సరిచేసేటప్పుడు ఉన్ని పడుగులో చివర ఎక్కించిన కర్ర ; **3.** దోనెను బిగించటానికి నేలలో పాతిన కొయ్య.

**ఈకరతాడు** వి. సరితాడు. సరిచేయటానికి దాపిన ఉన్ని పడుగును గూటాలకు బిగించేతాడు.

**ఈకరరాయి** వి. దోనెరాయి.

**ఈకు** రూ.చూ. హుక్కు. వి. గడ్డగోరు. కొక్కెం.

**ఈకుగడె** వి. **1.** తలుపు రెక్కల్లో ఒక దానిని బిగించిన వంగలకొయ్య ; **2.** అడ్డగడియ.

**ఈకుగడె** చూ. ఈకు.

**ఈక్పాడి** పో.చూ. ఈకు. వి. మైనం పూసిన పడి (దీని మధ్య అంచు పోగులు దూగుస్తారు).

**ఈఁక¹** రూ.చూ. ఉముక. వి. ధాన్యాదులపై పొట్టు లేక పొల్లు. ఆం.భా. 2.239.

**ఈఁకదంపు** వి. **1.** వ్యర్థప్రయాసం ; **2.** వ్యర్థప్రసంగం; **3.** బియ్యం చెయ్యటానికై ధాన్యం దంపి ఈకను తొలగించటం. **ఈఁకదంపుపాట** వి. **1.** వడ్లు దంచేటప్పుడు కాలక్షేపానికి స్త్రీలు పాడే పాట ; **2.** అర్థంలేని వాగాడంబరం. **ఈఁకపొల్లు** వి. వ్యర్థ ప్రసంగం. **ఈఁకబట్టి** రూ. ఉనుకబట్టి. వి. పొట్టుబట్టి. **ఈఁకబంతి** వి. **1.** ఈకవంటి రేకులుగల బంతిచెట్టు ; **2.** పోకబంతి.

**ఈఁక²** చూ. ఈఁగు. వి. ఈగులాట. రుక్మా. 3.154.

**ఈఁకదంపు** చూ. ఈఁక¹.

**ఈఁకదంపుపాట** చూ. ఈఁక¹.

**ఈఁకపొల్లు** చూ. ఈఁక¹.

**ఈఁకబట్టి** చూ. ఈఁక¹.

**ఈఁకబంతి** చూ. ఈఁక¹.

**ఈఁకర** వి. **1.** సంతోషాదులు కలిగినప్పుడు చేసే హుంకారం. బసవ. 5.481 పం. ; **2.** ఆనందంతో శిశువులు 'ఈఁ, ఈఁ' అనే తొక్కుపలుకు. సిం.ద్వా. 3.45.

పో.చూ. క. హుంకార. అసహ్యాన్ని తెలిపే ధ్వని, పీరులు చేసే హుంకృతి ; త. ఉకార్కరం, ఉఙార్కరం. సంక్షోభసూచక హుంకారం, జుమ్మనే ధ్వని ; హూంకారం, ఊంకారం ;

సం. ప్రా. హుంకార-. సంతోషాదులు కలిగినప్పుడు చేసే హుంకారం.

<సం. హుంకార-.

**ఈఁకరలిచ్చు** అ.క్రి. శిశువులు ఆనందంతో ఈఁ ఈఁ అని ధ్వనిచేయు. భోజ. 7.176. **ఈఁకరలుగొట్టు** ఈకరలు + కొట్టు ; అ.క్రి. **1.** అస్పష్ట ధ్వనిచేయు. బసవ. 7.828 పం. **ఈఁకరలువెట్టు** ఈకర(లు) + పెట్టు. అ.క్రి. ఈకర లిచ్చు, హుంకరించు. బసవ. 5.481 పం.

**ఈఁకరలిచ్చు** చూ. ఈఁకర.

**ఈఁకరలుగొట్టు** చూ. ఈఁకర.

**ఈఁకరలువెట్టు** చూ. ఈఁకర.

**ఈఁకించు** చూ. ఈఁకు.

**ఈఁకు** అ.క్రి. ఉంకించు, పూను. భా.రా.సుం. 3 ; వి. పూనిక, ప్రయత్నం. భా.రా. యు. 280, భాగ. 10.4.436.

పో.చూ. క. ఉంకిసు. ఆలోచించు, పరిశీలించు ; ఉన్నిసు. ఆలోచించు ; త. ఊక్కమ్. ప్రయత్నం, పట్టుదల, బలం, నిశ్చయం, ఊక్కు. ప్రయత్నించు, ఆలోచించు ; వి. పట్టుదల. పో.చూ. ఉన్ను. ఆలోచించు ; వి. ప్రయత్నం ; ఊక్కల్. స్థిరనిశ్చయం ; మ. ఊక్కు. బలం, పూనిక ; పో.చూ. ఉన్నుక. ఆలోచించు ; పో.చూ. కోట. కొద. ఉన్‌య్-, ఉన్‌చ్. ఆలోచించు ; కువి. ఒన్‌ప్. ఉద్దేశించు ; పర్జి. ఊకిప్-, ఊకిత్. ఈగించు.

<మూ.ద్రా. *ఈన్-/ *ఉన్న్-; *ఈఙ్క్-/ *ఈన్-క్-; *ఉఙ్క్- <*ఉన్-క్.

**ఈఁకించు** రూ. ఉంకించు. అ.క్రి. ఉత్సహించు, పూను. భార. కర్ణ. 3.130, ప్రబంధ. 283 ; స.క్రి. కదలించు, పురికొల్పు, పాచికలు గిలకరించు. **ఈఁకువ¹** రూ. ఉంకువ³. వి. **1.** పూనిక, ప్రయత్నం. వేంక. పంచ. 2.13 ; రామా. 5.7 ; **2.** మారు, పర్యాయం.

**ఈఁకువ¹** చూ. ఈఁకు.

**ఈఁకువగు** ఈఁకువ¹ + అగు. అ.క్రి. ప్రయత్నించు, పూను. భా.రా. సుం. 26. **ఈఁకువలుగొను** ఈఁకువలు + కొను. అ.క్రి. నెలకొను, స్థిరపడు. భా.రా. యు. 636.

**ఈఁకువ²** చూ. ఉనికి. వి. ఆశ్రయం, ఆధారం. భా.రా. సుం. 26.

**ఈఁకువగు** చూ. ఈఁకువ¹.

**ఈఁకువలుగొను** చూ. ఈఁకువ¹.

**ఈఁకొట్టు** చూ. ఈఁ.

**ఈఁకొను** చూ. ఈఁ.

**ఈఁగాడు** చూ. ఈఁగు.

**ఈఁగించు** చూ. ఈఁగు.

**ఈఁగియాడు** చూ. ఈఁగు.

**ఈఁగు** రూ. ఊపు ; పో.చూ. తూఁగు. అ.క్రి. **1.** ఆందోళించు, వెనుకకు ముందుకు చలించు. భార. ఆర. **4.138** ; **2.** కదలు. కాశీ. 1.133 ; **3.** చలించు. వేంక. పంచ. 1.376.

పో.చూ. క. తూగు. ఊగటం, చలించటం ; తూంకు. పో.చూ. తు. తూకున, తూంకుని. ఊగు, తూగు. తూకుడుని, తూంకుదుని. వేలాడగట్టు ; త. ఊంకు. ఊగు ; ఊచల్. ముందుకూ వెనుకకూ కదలు ; ఊచలాడు, ఊచలాట్టం. ఊగటం ; ఊచలాట్టు, ఊక్కు. స.క్రి. ఊపు ; ఊయల్. కదలించు ; పో.చూ. తూంకు. ఊపు ; తుయల్. ఊపు ; తుంకు. వేలాడగట్టు ; మ. ఊంచలాటుక. ఊగు ; పో.చూ. తుక్కుక. వేలాడగట్టు. పో.చూ. తూక్కమ్. వేలాడటం ; ఉయ్యాలపండుగ ; గోం. ఊమ్- ఊపు ; ఊకాడ్, ఊంగ్-. ఊగు ; కువి. ఊమ్. ఊగు ; పర్జి. ఊఁగ్-. వేలాడు, ఊగు, ఊజ్- ఊగు, చలించు ; ఊకిప్-, ఊకిత్-. వేలాడదీయు,

ఊగించు ; కొలా. ఊఁగెన్, ఊజ్ఎజ్. ఊగు ; ఊప్, ఊగటం ; నా. ఊంగ్-. వేలాడటం, ఊగటం ; ఊప్ ; గద. ఊమిజ్. ఊగు ; కురు. నుకుర్. చెట్లు గాలి. ఊగినట్లు ఊగటం ; మాల్తో. న్కుక్-. ఊగు, ఊపు. కదల్చు ; నుక్. కదల్చు.

<మూ.ద్రా. *ఊయ్-క్క్/*ఊయ్.

ఊఁగాడు రూ. ఊవాడు. అ.క్రి. ఊగు, అల్లాడు. చిత్ర. భా. 3.86. ఊఁగించు. స.క్రి. కదల్చు, ఊపు. ఊఁగియాడు అ.క్రి. సంచలించు, కదలిపోవు. కాశీ. 3.11. ఊఁగుదల వి. ఊపు, ఆందోళన. ఊఁగులాట ఊఁగు(లు)+ఆట. వి. 1. ఊగులాడటం, ఆందోళనం : 2. సందిగ్ధస్థితి. ఊఁగులాడు ఊఁగు(లు)+ఆడు. అ.క్రి. ఊగాడు. వీధి. 50.

ఊఁగుదల చూ. ఊఁగు.

ఊఁగులాట చూ. ఊఁగు.

ఊఁగులాడు చూ. ఊఁగు.

ఊచ రూ.చూ. ఊఁచ. వి. 1. కదురు ; 2. ఏకు తయారు చెయ్యటానికి ఉపయోగించే సల్ల : 3. రాట తిరగటానికి ఆధారమైన ఇరుసు : 4. కండెనూలు చుట్టే జొన్నదంటు ముక్క ; 5. మగ్గం గుంటలో పావుచెక్కల బిగింపుకు వేసిన అడ్డపల్ల : 6. నాడెలో పేకదారం కండె గుచ్చే ఇనపపుల్ల.

ఊచకట్టు వి. సిమెంటు పోతకు నిర్మించిన మూస. ఊచకమ్మి వి. సన్నటి బెత్తంమాదిరి కమ్మి. ఊచతిరుగుడు వి. వరి,జొన్న మొదలైనవాటి ఎన్ను తెల్లబడి ఎండిపోవటం. ఊచతీరు వి. వరితెగులు. ఊచతెవులు వి. వరి, జొన్న మొ. వాటికి పట్టే తెగులు. ఊచపిప్పి వి. వరి, జొన్న మొ. పైర్లకు పట్టే తెగులు. ఊచపుల్ల వి. నూలుకండె చుట్టే జొన్న దంటుముక్క, కదురు. ఊచపొట్ట వి. పిప్పారని వెన్ను.

ఊచకట్టు చూ. ఊచ.

ఊచకమ్మి చూ. ఊచ.

ఊచతిరుగుడు చూ. ఊచ.

ఊచతీరు చూ. ఊచ.

ఊచతెవులు చూ. ఊచ.

ఊచపిప్పి చూ. ఊచ.

ఊచపుల్ల చూ. ఊచ.

ఊచపొట్ట చూ. ఊచ.

ఊచు చూ. ఊడు. అ.క్రి. వ్యాధిచేత తలవెంట్రుకలు రాలు.

క. ఉరిచు. పైతోలు ఒలుచు. పండ్లు మొ. వాటి తొక్క దీయు, వదులుచేయు, ఛొచ్చు, గుచ్చుకొను ; త. ఉకు. (ఈకలు, వెంట్రుకలు మొ.) రాలు ; ఊచు, ఊయ్. నాశనమగు. శిథిలమగు ; మ. ఊక్క. జార్చు, రాల్చు ; కోట. ఉచ్. ఒలికించు, ఒలుకు ; తొద. ఉచ్. (మురికినీరు) పారబోయు ; పర్జి. ఉయ్. (వెంట్రుకలు మొ.) రాలు.

ఊజ రూ.చూ. ఊజా. వి. ఒక విధమైన పాత్ర.

ఊజా రూ. ఊజ. పో.చూ. కూజా. వి. ఒక విధమైన పాత్ర, మరచెంబు.

ఊజి చూ. ఊఁత. 1. గూళి, చేపలుపట్టే ఊత ; 2. చిన్న కోడిపిల్లల్ని కప్పిపెట్టే గూడు.

ఊఁచ రూ. ఊచ, ఊన వి. 1. తృణ విశేషం, ఇషీక. రామా. 5.68 ; 2. జొన్నకాడ ; 3. ఇనుము మొ. వాటి కమ్మి ; 4. బాణంగా ఉపయోగించుకోటానికి చెక్కిన వెదురు కోల ; 5. పరటిమాట ; 6. బండికి కట్టిన సన్నటి బొంగు.

క. ఊచి, ఊచిహుల్లు. చీపుర్ల తయారీకి పనికివచ్చే తృణ విశేషం ; త. ఊచి. పదును, సన్నన, కొద్దిపాటి మందం, తేలిక, గంజం ;

పో.చూ. సం. సూచా. క్ర.

ఊఁచకండె. వి. నూలు చుట్టిన జొన్నకాడ. శుక. 2.423. ఊఁచకాలు వి. ఊఁచపోయిన కాలు, వ్యాధిచే ఎండి సన్నబడ్డ కాలు. ఊఁచకోఁత వి. చాల మందిని ఒకే మారు అతిఘోరంగా కోసివేయటం, సంపూర్ణ హత్య (అర్థవిపరి). ఊఁచచెయ్యి వి. ఊఁచపోయిన చెయ్యి. ఊఁచపట్టు అ.క్రి. చేవపట్టు. ఊఁచపడు అ.క్రి. 1. కృశించు, నిస్సారమగు, ఊచవలె సన్ననగు, భాను. 2.18 ; 2. ఊచ కలదియగు. భాను. 2.13. ఊఁచపోవు అ.క్రి. 1. కృశించు, క్షీణించు. భల్లా. 4 ; 2. పీలఅగు, చిక్కిపోవు ; 3. ఈచుకపోవు ; (పశువులకు) గర్భపాతమగు ; 4. పశువు వట్టిపోవు ; 5. చెట్లు కాపుడుగు. ఊఁచబియ్యము వి. గుడ్డలో పెట్టి జొన్నకర్రతో కొట్టగా రాలిన లేత జొన్నలు, పాల జొన్నలు. రామలింగ. 85. ఊఁచముట్టు క్రి.విశే. పూర్తిగా, నిశ్శేషంగా. భార. విరా. 3.120, శుక. 2.261. ఊఁచముట్టుగొను ఊచముట్టు+కొను ; అ.క్రి. నిశ్శేషంగా చంపు, చంపు. భార.శల్య. 1.28.

ఊఁచకండె చూ. ఊఁచ.

ఊఁచకాలు చూ. ఊఁచ.

ఊఁచకోఁత చూ. ఊఁచ.

ఊఁచచెయ్యి చూ. ఊఁచ.

ఊఁచపట్టు చూ. ఊఁచ.

ఊఁచపడు చూ. ఊఁచ.

ఊఁచపోవు చూ. ఊఁచ.

ఊఁచబియ్యము చూ. ఊఁచ.

ఊఁచముట్టు చూ. ఊఁచ.

ఊఁచముట్టుగొను చూ. ఊఁచముట్టు.

ఊఁచు ఊఁగుయొక్క ప్రే. స.క్రి. 1. ఊగజేయు, ముందుకు వెనుకకు చలింపజేయు. భార.అర. 4.138 ; 2. ఆడించు, కదిలించు. ద్వి.హరిశ్చ. 4.1130 ; అ.క్రి. సందేహించు, కొంకు.

పో.చూ. తు. ఒచ్చుని. ఊపు ; ఓడఒచ్చుని. పడవ నడుపు: క. ఊకు(క). ఊగు, కదలు. ఊబ్బల్. ఉయ్యాల; గోం. ఊయానా-, ఊమ్గి-, ఊమ్కా. పంకాలాగు, ఉయ్యాల ఊపు ; పర్జి. ఊచిప్-, ఊచిల్-. ఊగు, చలించు, కంపించు ; ఊజ్ ; పో.చూ. ఒల్లా. ఉదుర్ప్-, ఉదుర్-. చలించు, కంపించు.

<మూ.ద.ద్రా. *ఊయ్-.

ఊట చూ. ఊరు[2] ; రూ. ఊటు[1]. వి. 1. చలమ, నీటిబుగ్గ కు.సం. 7.955 ; 2. సారం. భార.స్త్రీ. 2.9 ; 3. చేవ, బలం. ఆం.భా. 3.50 ; 4. ఊరిన ద్రవం, తేమ (అవకాయ ఊట).

**ఎక్కలి**[3] చూ. ఎక్కటి. వి. శూరుడు.

**ఎక్కలిదేవి** చూ. ఎక్కలి[1].

**ఎక్కళ్ళు** పో.చూ. ఎక్కుడు. వి. సాహుకారు వద్ద చిన్న కుండలో కొలిచి ధాన్యం తీసుకొని, పెద్ద కుండలో కొలిచి తిరిగి చెల్లించు పద్ధతి.

**ఎక్కవేయు** చూ. ఎక్కు[1].

**ఎక్కసకియము** రూ.చూ. ఎకసకియము.

**ఎక్కసెక్కెము** రూ.చూ. ఎకసకియము. వి. పరిహాసం, పరిహాస వచనం. మను. 2.39.

**ఎక్కాడు** చూ. ఎక్కు[1].

**ఎక్కాలు** చూ. ఎక్కము[2].

**ఎక్కించు** చూ. ఎక్కు[1].

**ఎక్కిడి** పో.చూ. ఎక్కుడు[2]. వి. ఒక పనిని చేయించుకొనుటలో చూపు శ్రద్ధ.

**ఎక్కిడు** చూ. ఎక్కు[1].

**ఎక్కిరించు** రూ.చూ. వెక్కిరించు. అ.క్రి. వికటంగా అనుక రించు, అపహసించు, పరిహసించు.

**ఎక్కిరింత**[1] రూ. ఎకిరింత. చూ. ఎక్కు. వి. 1. వాహనం. శ్రీం.నై. 1.5 ; 2. గుర్రం. వేంక. ఆం. 91, సాంబని. 71.

**ఎక్కిరింతపక్కి** వి. విష్ణుమూర్తి వాహనం, గరుడుడు. ఆము. 6.183. **ఎక్కిరింతయెద్దు (-ఎద్దు)** వి. వృషభ వాహనం.

**ఎక్కిరింత**[2] రూ.చూ. వెక్కిరింత. వి. పరిహాసం, అపహాస్యం, ఆక్షేపణం. అచలా. 1.17.

**ఎక్కిరింతమెకము** వి. కోతి. వ్య. ఇతరుల్ని వెక్కిరించే జంతువు.

**ఎక్కిరింతపక్కి** చూ. ఎక్కిరింత[1].

**ఎక్కిరింతమెకము** చూ. ఎక్కిరింత[2].

**ఎక్కిరింతయెద్దు** చూ. ఎక్కిరింత[1].

**ఎక్కిలి** రూ. వెక్కిలి. వి. దప్పి మొ. వాటిచే కలిగే రోగ విశేషం. హిక్క. దశా. 2.186.

తు. ఎక్కదె, ఎక్కలె. ఎక్కిలి ; మ. ఇక్కళిక్క. ఎక్కుక్కళ్లనొందు ; ఎక్కిల్, ఎక్కిట్టు, ఇక్కిట్టుమ్. ఎక్కిలి, అంతిమ శ్వాస ; బ్రా. హిక్కిన్గ్. ఎక్కు.

**ఎక్కు**[1] స.క్రి. 1. అధిష్టించు, ఆశ్రయంగా కొను. భార. ఆది. 6.64, కాశీ. 4.108 ; 2. చెట్టు మొ. వానిని ఆరోహించు. ఆము. 6.19 ; అ.క్రి. 1. సంతోషకరమగు, ఇష్టమగు, నచ్చు. భార. విరా. 1.74, సౌప్తి. 1.24 ; 2. మార్కొను, ఎదుర్కొను. భార. విరా. 3.164, కకుత్థ్స. 4.98, రాజవా. 5.12 ; 3. అధికమగు, అతిశయించు, హెచ్చు. భార. శల్య. 1.56, బసవపు. 4 పు. 300 పం. ; హరి. పూ. 5.12 ; 4. నెరవేరు, సిద్ధించు. భార. సౌ. 1.230, భా.రా. అయో. 39 ; 5. ఆవేశించు. భా.రా. అయో. 89 ; 6. స్పష్టపడు. భార.ఆర. 7.160 ; 7. సంభవించు, కలుగు. ద్వి. హరిశ్చ. ఉ. 909, రాఘవ. 3.50 ; 8. పైకి పోవు, (పైకి) వ్యాపించు. కాశీ. 2.121, పారి. 4.71, వసు. 4.29 ; 9. పారు, ప్రసరించు. ఆము. 4.282 ; 10. అధిష్ఠించు. పారి. 1.79, నీలా. 1.7 ; వి. 1. వింటి నారి సంధించటం. భార. ఆర. 1.11 ; 2. దుష్ప్రోత్సాహం. దశకు. 8.46 ; 3. వింటినారి. నరస. 2.62.

క. ఎక్కు. పైకివచ్చు, మునిగాళ్ళపై నిలుచు ; ఎక్కె. వి. మసరి, గొప్పతనం ; పో.చూ. ఎక్కల. దయ్యం లాగా ఎత్తైన, పొడవైన, పెద్దదైన ; తు. ఎక్కల్యుని, ఎక్కలుని. దూకు, ఎగురు ; నెక్కులక్కఉప్పుని. అందు దాటులో నుండు ; పో.చూ. ఎర్కని. ఆనకట్టవద్ద నీటివరె పైకిలేచు ; త. ఎక్కు. పోగుచేయబడు, లేచు, పైకిపోవు : ఎఱు. అధిరోహించు, బయలుదేరు ; మ. ఎక్కుక. పైకి వచ్చు, మునిగాళ్ళపై నిలచు ; పఇ. ఎకని. విఇ. పైకి లేచుచున్న, ఆరోహించుచున్న. క్రి.విఇ. కష్టసాధ్యంగా, పైకి ; కువి. ఎంగ్. పైకెక్కు ; ఎఖ్. ఉన్నతంచేయు ; కుడుఖ్. ఎకె-, ఎకా, ఎకీకా, క్రి.విఇ. చాల, విఇ. చాల మెక్కువ ; పో.చూ. లె. ఎక్కువ ; ఎకేకా ; బ్రా. హేఫ్-. పైకెత్తు.

<మూ.ద్రా. ఎయ్-స్క- / -క్క-.

**ఎక్కంబాఱు** అ.క్రి. పైకి ప్రాకు. కకుత్థ్స. 2.187. <ఎక్కు+-అ̄ >(న్)+పాఱు. **ఎక్కంబెట్టు** స.క్రి. 1. ప్రోత్సహించు ; 2. లేని ఆధిక్యం కల్పించు. <ఎక్కు +-అ̄>(న్)—పెట్టు. **ఎక్కవేయు** క్రి. 1. దీపపు వత్తి పైకి తోయు ; 2. నీళ్ల తగ్గిన సమయంలో కాలువ నీటిని దూరం నుంచి మళ్లించుకొని వచ్చు. **ఎక్కాడు** స.క్రి. 1. పురికొల్పు, ప్రోత్సహించు. ఉ. హరి. 4.103 ; 2. స్వారిచేయు. ఉ. హరి. 4.103. <ఎకు+ఆడు-. **ఎక్కించు** స.క్రి. 1. అధికంచేయు, అతిశయింపజేయు ; భార. విరా. 2.310 ; 2. అధిష్ఠింపజేయు. భార. విరా. 5.23 ; 3. కలిగించు. భార. శల్య. 1.59, శృం. నై. 5.156 ; 4. అధిష్ఠింపజేయు. కాశీ. 2.107 ; 5. వింటినారి సంధించు. పారి. 5.5 ; 6. నిక్కించు, ఎత్తు. పాండు. 1.189 ; 7. ప్రసరింపజేయు. పాండు. 2.112 ; 8. ఇచ్చకాలాడు, పెల్లించు. ఆం.భా. 3.124. **ఎక్కిడు** స. క్రి. ఎక్కుపెట్టు, సజ్యంచేయు. భార. విరా. 2.319, రామా. 4.139, దశా. 7.308. **ఎక్కుకొను** స.క్రి. ఆరో హించు, అధిష్ఠించు, పైకెక్కు. విక్ర. 4.53, ఉత్త.రా. 2.125. **ఎక్కుడించు**[1] స.క్రి. వింటినారి సడలించు. భా.రా. అర. 1.3, శుకస. 1.128. **ఎక్కుతక్కులు** వి.బ.వ. ఎత్తు పల్లాలు. రాధికా. 3.159. **ఎక్కుదీయు** స.క్రి. వింటినారి సడలించు. నీలా. 3.44. <ఎక్కు+తీయు. **ఎక్కుద్రోచు** స.క్రి. వింటినారి సంధించు. వీర. 2.63, భాగ. 10 ఉ. 1292. <ఎక్కు+త్రోచు. **ఎక్కుపెట్టు** రూ. ఎక్కువెట్టు. స.క్రి. వింటినారి సంధించు. భార.ఉద్యో. 2.130. **ఎక్కు బావి** వి. ఎక్కటానికి మెట్లుగల బావి, దిగుడుబావి, నడ బావి. శుక.స. 2.408. **ఎక్కులు** వి. ప్రేరేపణ. **ఎక్కులుపెట్టు** స.క్రి. పురికొల్పు, ప్రోత్సహించు, రెచ్చగొట్టు. దశకు. 8.46. **ఎక్కువెట్టు** రూ.చూ. ఎక్కుపెట్టు. స.క్రి. సజ్యంచేయు, వింటినారి సంధించు. భార.ఉద్యో. 2.130, భీమ. 2.357, కకుత్థ్స. 1.179. <ఎక్కు+పెట్టు.

ఎక్కు[2] చూ. ఎక్కిలి. వి. ఎక్కిళ్ళు.
ఎక్కు[3] వి. రాట్నం ఇరుసుమీద తిరగటానికి చక్రంమాదిరిగా అమర్చిన సావుచెక్క.
ఎక్కుకొను చూ. ఎక్కు[1].
ఎక్కుడించు[1] చూ. ఎక్కు[1].
ఎక్కుడించు[2] చూ. ఎక్కుడు[2].
ఎక్కుడు[1] చూ. ఎక్కు. వి. 1. వాహనం. కు.నం. 7.870, ఉ.హరి. 6.37, కాశీ. 7.670 ; 2. ఆరోహణం. ఎక్కుట. రం.రా. 150 పు. 291 ; 3. మిత్రు.

ఎక్కుడుగాఁడు (-కాఁడు) వి. రౌతు. రాజ.చ. 1.5. ఎక్కుడుఁదీఁగ వి. మానేరు,జ్యోతిష్మతి (Halicacambum). ఎక్కుడుపెట్టు స.క్రి. వింటినారి సంధించు. వి.క్ర. 6.
ఎక్కుడు[2] చూ. ఎక్కు. విశే. 1. స్థితికి మించినది. భార.ఉద్యో. 4.191 ; 2. హెచ్చైన. భార.ద్రోణ. 3.250 ; 3. మిక్కిలి ఆదరింపదగినది. భార.శల్య. 2.57 ; 4. అధికం. ఉండ వలసిన దానికంటె ఎక్కువ. భా.రా. 3.1.158 ; 5. శ్రేష్ఠం. ఉత్తమం. ఉ.హరి. 6.37 ; 6. అతిశం. వరాహ. 10.87. క్రి.విశే. ఎక్కువగా, అధికంగా. భార.కర్ణ. 2.317. శాం. 2.187.

ఎక్కుడించు[2] స.క్రి. అధికంచేయు, హెచ్చించు. హరి.ఉ. 9.32. ఎక్కుడుకన్ను వి. అధికంగా ఉన్నకన్ను, శివది మూడోకన్ను. భా.రా. 3.1.158. ఎక్కుడుతనము వి. శ్రేష్ఠత్వం. ఎక్కుడుమాటలు వి.బ.వ. అనవసరపు మాటలు. భార.ఉద్యో. 4.191. ఎక్కుడుమెకము వి. ఏనుగు. వ్యు. మహాజంతువు. అచ్చ.రా. 3.4.
ఎక్కుడుకన్ను చూ. ఎక్కుడు[2].
ఎక్కుడుగాఁడు చూ. ఎక్కుడు[1].
ఎక్కుడుతనము చూ. ఎక్కుడు[2].
ఎక్కుడుఁదీఁగ చూ. ఎక్కుడు[1].
ఎక్కుడుపెట్టు చూ. ఎక్కుడు[1].
ఎక్కుడుబారి చూ. ఎక్కుడు. వి. ఒకసారి మోటలాగిన తర్వాత ఎద్దులు మోటబావివైపు వెళ్ళేదారి.
ఎక్కుడుమాటలు చూ. ఎక్కుడు[2].
ఎక్కుడుమెకము చూ. ఎక్కుడు[2].
ఎక్కుతక్కులు చూ. ఎక్కు[1].
ఎక్కుదీయు చూ. ఎక్కు[1].
ఎక్కుద్రోచు చూ. ఎక్కు[1].
ఎక్కుపెట్టు చూ. ఎక్కు[1].
ఎక్కుబావి చూ. ఎక్కు[1].
ఎక్కులు చూ. ఎక్కు[1].
ఎక్కులుపెట్టు చూ. ఎక్కు[1].
ఎక్కువ చూ. ఎక్కు, ఎగు. వి. 1. ఆధిక్యం. విక్ర. 4.188 ; 2. శ్రేష్ఠత్వం, ప్రాముఖ్యం, ప్రత్యేకత, విశిష్టత ; విశే. అధికం, గొప్ప, విశేషం, ప్రత్యేకం. చిత్ర.భా. 1.100.

క. ఎక్కె. ప్రాముఖ్యం, శ్రేష్ఠత్వం, గొప్పశక్తి ; హో. చూ. తు. ఎర్కని. అ.క్రి. అధికమగు (నీటిమట్టంవలె) పైకి లేచు.

ఎక్కువతక్కువ వి. ఇంచుమించు, మిట్టపల్లాలు. విక్ర. 4.183. ఎక్కువలు వి. వార్తలు, వింతలు, విశేషాలు.
ఎక్కువతక్కువ చూ. ఎక్కువ.
ఎక్కువలు చూ. ఎక్కువ.
ఎక్కువెట్టు చూ. ఎక్కు[1].
ఎక్కుళ్లు ఎక్కిలి బ.వ. రూపం. రూ. వెక్కుళ్లు. వి. వెక్కిళ్ళు.
ఎక్కొట్టు చూ. ఎగ(న్). స.క్రి. ఎగవేయు.
ఎక్కొలుపు స.క్రి. ప్రేరేపించు, పురికొలుపు.
ఎక్రా రూ.చూ. ఎకరము. 4840 చదరపు గజాల విస్తీర్ణం.
ఎగ(న్)- (సమాసగతంగా మాత్రమే ప్రయుక్తం.) 'ఎగు' ధాత్వర్థకం. క్రి.విశే. పైన, పైగా.

ఎగఊపిరి వి. 1. ఎగశ్వాస, కష్టంతో గాలి పీల్చటం ; 2. అవసానకాలస్థితి. ఎగఁగట్టు(-కట్టు) స.క్రి. పైకికట్టు. శృం.నై. 1.62. <ఎగన్+కట్టు. ఎగఁగొట్టు స.క్రి. 1. ఎగురగొట్టు. చమ. 1.32 ; 2. (ఋణాదులను) ఎగవేయు ; 3. పనిఎగవేయు. <ఎగన్+కొట్టు. ఎగఁగొలుపు రూ. ఎగఁగొల్పు. స.క్రి. ప్రేరేపించు, పురికొల్పు. <ఎగన్+కొలుపు. ఎగఁగొల్పు రూ.చూ. ఎగఁగొలుపు. స.క్రి. పురికొల్పు, ప్రోత్సహించు. మృ.వి. 2.18. ఎగఁగ్రోలు స.క్రి. (నీరు మొ.) పీల్చు. కళా. 6.109. <ఎగన్+క్రోలు. ఎగఁజల్లు స.క్రి. పైకి చల్లు. వసు. 3.157. <ఎగన్+చల్లు. ఎగఁజిమ్ము స.క్రి. పైకి విసరు, చల్లు. <ఎగన్+చిమ్ము. ఎగఁజెప్పు స.క్రి. ఉన్నవి లేనివి కలిపి చెప్పు. <ఎగన్+చెప్పు. ఎగఁజేదు స.క్రి. పక్కలు కిందికి మీదికి ఊరక చలింపజేయు. <ఎగన్+చేదు. ఎగఁజేపు అ.క్రి. ఆవు మొ. పాలు పైకి లాగి బిగబట్టు. స.క్రి. ఇస్తున్న దాన్ని ఇవ్వకుండా ఆపు. <ఎగన్+చేపు. ఎగఁజోపు స.క్రి. 1. పైకితోలు. కళా. 3.47 ; 2. విరుచు, త్యజించు. రాఘవ. 2.6. <ఎగన్+దోపు. ఎగదిగ(న్) రూ. ఎగాదిగ, ఎగాదిగా. క్రి.విశే. వెనుకకు ముందుకు, పైకి కిందికి. రామా. 7.69, కళా. 7.67. <ఎగన్+దిగన్. ఎగదున్నకం వి. నిలువు దున్నిన తరువాత అడ్డంగా దున్నే పద్ధతి. ఎగదువ్వు స.క్రి. పైకిదువ్వు. కవిజన. 3.124. ఎగదోకు అ.క్రి. ఎక్కివచ్చు. ఎగనూఁదు స.క్రి. 1. ఎగురనూదు. ఊక మొ. తేలిక పదార్థాలను ఊదివేయు. వసు. 5.59 ; 2. నిరసించు. <ఎగన్+ఊఁదు[1]. ఎగవెత్తు స.క్రి. పైకెత్తు. ప్రభా. 5.44. కవిరాజ. 3.69. <ఎగన్+ఎత్తు. ఎగఁదట్టు అ.క్రి. 1. అధికమగు. చెన్న. వి. 4.20 ; 2. ఎగదాకు. పైకి వచ్చి తగులు. <ఎగన్+తట్టు. ఎగఁదన్ను అ.క్రి. 1. (పాలు తీసేటప్పుడు ఆవు మొ.) వెనుక కాళ్లతో తన్ను ; 2. నీరు వాలున కాక ఎదురుకు ప్రవహించు. స.క్రి. అప్పు మొ. తీర్పు నిరాకరించు. <ఎగన్+తన్ను. ఎగఁదీయు స.క్రి. పైకెత్తు. మను. 4.103. <ఎగన్+తీయు. ఎగఁదొట్టు రూ. ఎకఁదొట్టు. అ.క్రి. పైకి వ్యాపించు. ఉత్త.రా. 2.148. <ఎగన్+తొట్టు. ఎగఁదోలు స.క్రి. 1. బీటిగడ్డిని సొంత పశువులు మేసినతరువాత ఇతరుల పశువులకు వదలివేయు ; 2. ఒకరిని ఇంకొకరిపై పురికొల్పు ; 3. పశువులను మోట బావిలో పైకి తోలు. <ఎగన్+తోలు. ఎగఁద్రోచు స.క్రి.

1. పైకి తోయు. భార.సభా. 2.86 ; 2. కష్టాన్ని లెక్క పెట్టకుండా ప్రవర్తించు. <ఎగన్+త్రోచు. ఎగఁద్రోయు స.క్రి. మీదికి తోయు, తోయు. హర. 7.119. దశా. 2.360. 1. పనిలో సహాయపడు; 2. లెక్కపెట్టకుండా ఉపేక్షించు. <ఎగన్+త్రోయు. ఎగమీటు స.క్రి. (గోటితో) పైకి మీటు, ఎగజిమ్ము. వసు. 1.119. ఎగఁబట్టు స.క్రి. 1. ఎత్తిపడు. శేషధ. 5 ; 2. ఊపిరి ఉగ్గబట్టు. <ఎగన్+పట్టు. ఎగఁబడు అ.క్రి. 1. పరుగెత్తు. కాశ. 2.70 ; 2. ముందుకు గాని పైకిగాని పోవు ; 3. అందనివాటిని అందుకొన యత్నించు ; 4. పైకి లేచు, స.క్రి. గద్దించు. <ఎగన్+పడు. ఎగఁబాఱు అ.క్రి. ఎగువకు పారు. <ఎగన్+పాఱు ఎగఁబిల్చు స.క్రి. పైకి పిల్చు. <ఎగన్+పిల్చు. ఎగఁబెట్టు స.క్రి. 1. (బుణాదులను) అపహరించు, ఎగవేయు ; 2. (పని) ఎగవేయు. <ఎగన్+పెట్టు. ఎగఁబోఁత వి. 1. పైకి పోయటం ; 2. దుర్వార పట్టటం ; 3. ప్రేరేపణ, దుష్ప్రోత్సాహం. <ఎగన్+పోఁత. ఎగఁబోయు స.క్రి. 1. విజృంభింపజేయు, అతిశయింపజేయు. మను. 6.29 ; 2. ప్రేరేపించు, పురికొల్పు, ప్రోత్సహించు. చంపరా. 5.49 ; 3. రాశిలో ధాన్యం పైకి నెట్టి పోయు. అ.క్రి. 1. దుర్భోధచేయు. సారంగ. 3.186 ; 2. ఆయాసపడు, దుఃఖాయాసంచెందు ; 3. ఏడ్చు. <ఎగన్+పోయు. ఎగఁబ్రాఁకు అ.క్రి. పైకి ప్రాకు, ప్రాకుచు ఎక్కు. రం.రా. 4.199, ఆము. 2.75. < ఎగన్ + ప్రాఁకు. ఎగ బ్రమింగు స.క్రి. పూర్తిగా మింగు. భాగ. 6.150. ఎగరొప్పు పో.చూ. ఎగరోఁజు. అ.క్రి. వగర్చు. ప్రబంధ. 788. వి. వగర్పు. ఎగరోఁజు పో.చూ. ఎగరొప్పు. అ.క్రి. వగర్చు. వి. వగర్పు. ప్రబంధ. 788. ఎగవిడుచు స.క్రి. 1. పశువును మేతకు విడుచు. వేంక.పంచ. 3.49 ; 2. ఊరక విడిచివేయు. కళా. 3.191. ఎగవేయు స.క్రి. 1. (తప్పునుంచి) తప్పించుకొను. ద్వి.సారంగ. 3.107 ; 2. అప్పు మొ. ఎగగొట్టు, అపహరించు. ఎగవైచు స.క్రి. 1. ఎగరవేయు. రామాభ్యు. 5.291 ; 2. అపహరించు, అక్రమంగా వినియోగించు ; 3. అప్పు మొ. ఎగగొట్టు. ఎగవవ(వ్) క్రి.విశే. పైకి (కట్టెలు, వత్తి మొ. 'పైకి') తోయటం. కాశ. 4.34, విశే. ఎక్కువ. సిం.నార. శ. 19. ఎగవవఁదోయు రూ.చూ. ఎగసనఁద్రోయు. అ.క్రి. 1. పైకి నెట్టు, పైకెత్తు ; 2. దీపపువత్తి సరిచేయు. ఎగసవఁద్రోయు రూ. ఎగసనదోయు. స.క్రి. 1. పైకి దిద్దు. భా.రా.అర. 2.82 ; 2. పైకి నెట్టు, పైకెత్తు, దీపపు వత్తి సరిచేయు. కళా. 4.84; 3. పురికొల్పు, రెచ్చగొట్టు. ఎగపాప వి. పైన. ఎగాదిగ రూ.చూ. ఎగదిగ(న్). క్రి.విశే. పైకి కిందికి, వెనుకకు ముందుకు. ఆము. 2.57, ఉత్త.రా. 6.152. ఎగాదిగా రూ.చూ. ఎగదిగ(న్).

ఎగఊపిరి చూ. ఎగ(న్)-.

ఎగఁగట్టు చూ. ఎగ(న్)-.

ఎగఁగొట్టు చూ. ఎగ(న్)-.

ఎగఁగొలుపు చూ. ఎగ(న్)-.

ఎగఁగొల్పు చూ. ఎగ(న్)-.

ఎగఁగ్రోలు చూ ఎగ(న్)-.

ఎగచు చూ. ఎగయు. రూ. ఎగుచు, ఎపుచు. స.క్రి. 1. ఎగయుచేయు. భార.అర. 2.12 ; 2. తరుము. భార. శాంతి. 3.36.

ఎగఁజల్లు చూ. ఎగ(న్).

ఎగఁజిమ్ము చూ. ఎగ(న్)-.

ఎగఁజెవ్వ చూ. ఎగ(న్)-.

ఎగఁజేదు చూ. ఎగ(న్)-.

ఎగఁజేపు చూ. ఎగ(న్)-.

ఎగఁజోపు చూ. ఎగ(న్)-.

ఎగతాళి రూ. ఎకతాళి[2]. వి. పరిహాసం, అవహాస్యం, గేలి.

క. ఎగతాళి, ఎక్కతాళి, ఎగతాళ. అవహాస్యం, వేళాకోళం, పరిహాసం ; త. ఎకత్తాళి (ప్రతిదే. <తె.) వేళాకోళం, పరిహాసం, అవహాస్యం ; పో.చూ. ఇకళ్. అలక్ష్యంచేయు, తృణీకరించు ; తాళి. గట్టిగా మందలించు.

ఎగతాళిచేయు స.క్రి. గేలిచేయు, వెక్కిరించు, అవహసించు, పరిహసించు.

ఎగతాళిచేయు చూ. ఎగతాళి.

ఎగదిక(వ్) చూ. ఎగ(న్)

ఎగదువ్నకం చూ. ఎగ(న్)-.

ఎగదువ్వు చూ. ఎగ(న్)-.

ఎగదోకు చూ. ఎగ(న్)-.

ఎగమాఁదు చూ. ఎగ(న్)-.

ఎగవెట్టు చూ. ఎగ(న్)-.

ఎగఁదట్టు చూ. ఎగ(న్)-.

ఎగఁదమ్ను చూ. ఎగ(న్)-.

ఎగఁదీయు చూ. ఎగ(న్)-.

ఎగఁదొట్టు చూ. ఎగ(న్)-.

ఎగఁదోలు చూ. ఎగ(న్)-.

ఎగఁద్రోచు చూ. ఎగ(న్)-.

ఎగఁద్రోయు చూ. ఎగ(న్)-.

ఎగవు చూ. ఎగు. వి. 1. మంఉపడటం. ద్వి. భాగ. 10 ; 2. ఎగరటం. ఆం.భా. 2.99 ; 3. గర్వం, ఆగ్రహం.

పో.చూ. త. ఇక. హెచ్చిపోవు, మించిపోవు, అతిక్రమించు, ఉల్లంఘించు, న్యాయ మార్గం తప్పు, మీదుగా దూకు.

ఎగమారు చూ. ఎగు.

ఎగమీటు చూ. ఎగ(న్)-.

ఎగఁబట్టు చూ. ఎగ(న్)-.

ఎగఁబడు చూ. ఎగ(న్)-.

ఎగఁబాఱు చూ. ఎగ(న్)-.

ఎగఁబిల్చు చూ. ఎగ(న్)-.

ఎగఁబెట్టు చూ. ఎగ(న్)-.

ఎగఁబోఁత చూ. ఎగ(న్)-.

ఎగఁబోయు చూ. ఎగ(న్)-.

ఎగఁబ్రాఁకు చూ. ఎగ(న్)-.

ఎగబ్రమింగు చూ. ఎగ(న్)-.

ఎగయించు చూ. ఎగయు.

**ఎగయు** రూ. నెగయు. అ.క్రి. 1. లేచు, ఉత్థితమగు. భార. శాంతి. 4.40; 2. పైకిపోవు, ఎగురు. భార. శాంతి. 5.439; 3. ఉన్నతమగు, ఎత్తగు. ఉ.హరి. 1.10; 4. చిట్లి లేచు. మార్క. 1.23; 5. ఉద్భవించు, కలుగు. పట్టు. భాగ. 10 పూ. 704; 6. పెరలు, ఉద్ధతమగు. వరాహ. 12.25, 29.

త. ఐక. <*ఎయ్-అ. దూకు; ఏంతు. పైకి లేచు; ఎఱ్చు. అతిక్రమించు, మేరమీరు; పో.చూ. మాల్తో. ఐతె. పైకి లేచు; బ్రాహూ. హే-ఫ్-. లేచు.

<మూ.ద్రా. ఎయ్- / ఏ-.

**ఎగయించు** స.క్రి. 1. పై కెత్తు. భార. భీష్మ. 3.173, 174, ఆశ్వ. 2.60; 2. లేచునట్లుచేయు. కాశ. 4.34. <ఎగయు+-ఇంచు[3]. **ఎగయుదెంచు** రూ. నెగయుదెంచు. అ.క్రి. పైకి వచ్చు. రామా. 7.110. <ఎగయు+తెంచు. **ఎగయువాఁడు** రూ.చూ. నెగయువాఁడు. వి. పైకి వచ్చే వాడు. **ఎగసిపడు** అ.క్రి. 1. ఎగిరిపడు, మిట్టిపడు. రాజవా. 3.101; 2. గర్వించు; 3. కోపించు. **ఎగసిపాటు** వి. మిట్టిపాటు, గర్వం. రసిక. 4.171. **ఎగసిపోత** వి. అహంకారం, పొగరు. **ఎగసిల్లు** అ.క్రి. 1. పైకి లేచు; 2. ఉన్నతమగు.

**ఎగయుదెంచు** చూ. ఎగయు.

**ఎగయువాఁడు** చూ. ఎగయు.

**ఎగరగొట్టు** చూ. ఎగరు.

**ఎగరఁబోఁత** చూ. ఎగరు.

**ఎగరు** రూ.చూ. ఎగురు. అ.క్రి. పై కెగురు.

ఎగుర(న్) >ఎగర(న్) >ఎగరు.

**ఎగరగొట్టు** రూ.చూ. ఎగురఁగొట్టు. స.క్రి. పైకి విసరి వేయు. **ఎగరఁబోఁత** వి. తూర్పార పోయటం <ఎగరు+అ[1](న్)+పోఁత.

**ఎగరొవ్వ** చూ. ఎగ(న్).

**ఎగరోఁజు** చూ. ఎగ(న్)-.

**ఎగవిడుచు** చూ. ఎగ(న్).

**ఎగవు** చూ. ఎగయు. వి. ఎగరటం.

**ఎగవేయు** చూ. ఎగ(న్).

**ఎగవైచు** చూ. ఎగ(న్).

**ఎగసవ(న్)** చూ. ఎగ(న్).

**ఎగసనఁదోయు** చూ. ఎగ(న్).

**ఎగసవఁద్రోయు** చూ. ఎగ(న్).

**ఎగపాప** చూ. ఎగ(న్).

**ఎగసిపడు** చూ. ఎగయు.

**ఎగసిపాటు** చూ. ఎగయు.

**ఎగసిపోత** చూ. ఎగయు.

**ఎగసిల్లు** చూ. ఎగయు.

**ఎగాదిగ(న్)** చూ. ఎగ(న్).

**ఎగాదిగా** చూ. ఎగ(న్).

**ఎగియు** రూ.చూ. నెగయు. అ.క్రి. ఎగురు, పైకి లేచు.

**ఎగియువాఁడు** రూ.చూ. నెగయువాడు. వి. పైకి వచ్చే వాడు.

**ఎగియువాఁడు** చూ. ఎగియు.

**ఎగిరించు** 'ఎగురు' యొక్క ప్రేరణార్థకం. స.క్రి. ఎగురునట్లు చేయు.

క. ఎగరిసు. గాలిలో ఎగురునట్లుచేయు; దూరంగా తీసుకొనిపోవు.

**ఎగిరిపాటు** చూ. ఎగురు. వి. మిట్టిపాటు, మిడిసిపాటు.

**ఎగు** అ.క్రి. 1. పైకిపోవు. బసవ. 4.725. క్రీడా. 106; 2. ఎగురు; 3. పూర్తి అగు. విజయ. 2.164; విశ. ఎత్తగు, ఉన్నతమగు. కళా శాస్త్రము. 1.11.

క. నెగె. లేచు, లేవు, దూకు; నెగపు, నెగపు, నెగపు. పైకెత్తు. నెగవు, నెగసు. దూకించు, దూకు, ఎగరు. లేచు, ఎగురు, ఎగు. లేవటం, ఎగుమతి; తు. నెగియుని. లేచు, పైకి వచ్చు, నెగిపుని. దూకు. పై కెగయు; త. నివ. లేచు, ఉన్నతమగు, ఎత్తగు. నివర్. (-న్ర్-వ్-) ఎత్తుగా మీదికి లేచు, పైకెక్కి పోవు. ముందుకుసాగు, దూకు, పరుగెత్తు; పో.చూ. నిమిర్. ఎత్తు, తల నిటారుగా నుంచు, ఎత్తు పెరుగు; ఏంతు. ఎత్తుగా లేచు, ఉన్నతమగు; ఎన్చు- అతిక్రమించు, దాటిపోవు, హద్దుమీరు; పో.చూ. మ. ఎవియక. లేచు; నివిత్తుక. లేవు; నికక్క. లేచు, ఎగురు; నెగప్. ఎగురజేయు; నా. నెగయ్-. ఎగురు, లేచు; నెగప్; ఎగిరించు, లేచు; పో.చూ. మాల్తో. ఐతె. పైకెగురు; బ్రా. హీ-ఫ్- పైకి లేవు, ఎత్తు (*హీ-లేచు).

**ఎగమారు** చూ. ఎక్కుడు. వి. పైకి ఎక్కడం. **ఎగుడు** విశ. ఉన్నతం. **ఎగుడుదిగుడు** విశ. విషమం. ఎత్తు పల్లాలుగల, అనంగతం, అనందర్భం. **ఎగుదల** వి. 1. పై భాగం; 2. అభివృద్ధి. **ఎగుపొగరు** వి. ఊరకే తుళ్లిపడటం. **ఎగుబారి** వి. ఒకసారి మోట లాగిన తరువాత ఎద్దులు మోట బావివేపు ఎక్కివెళ్లే దారి. **ఎగుబుజములు** వి. ఎత్తైన లేదా బలమైన బుజాలు. విజయ. 2.164. **ఎగుబోద** వి. కొత్తగా రెక్కలు మొలచి ఎగిరే వయస్సు వచ్చిన పక్షిపిల్ల. వేంక. పంచ. 1.287. <ఎగు+నం. పోత-(పిల్ల).

**ఎగుచు** రూ.చూ. ఎగచు. స.క్రి. 1. వెంబడించు, వెంటాడు, తరుము. భార.ఆది. 4.6, అర. 2.12; 2. వెడలగొట్టు, తోలివేయు. మను. 4.42.

**ఎగుడు** చూ. ఎగు.

**ఎగుడుదిగుడు** చూ. ఎగు.

**ఎగుదల** చూ. ఎగు.

**ఎగుదు** రూ.చూ. ఎయిదు[1]. అ.క్రి. 1. పరుగెత్తు. బసవ. 7. 298.1.; 2. పరుగెత్తుకొనివచ్చు. బసవ. 4.777.1; 3. దొరకు, లభించు. పండిత. 5.328.

**ఎగుపొగరు** చూ. ఎగు.

**ఎగుబారి** చూ. ఎగు.

**ఎగుబుజములు** చూ. ఎగు.

**ఎగుబోద** చూ. ఎగు.

**ఎగుమతి** చూ. ఎగు. వి. 1. ఓడ మొ. వాటిపై సరకు లెక్కించటం; 2. పరదేశానికి పంపటం; 3. అభివృద్ధి.

అతిశయం.

పో.చూ. త. ఏఱ్ఱుమతి, ఏఱ్రుమది. సూ.ని. 765. ఎగుమతి, ఎగుమతి అయిన సరకు; మ. ఏఱ్ఱుమతి. ఎగుమతి.

ఎగుమతిచేయు స.క్రి. పరదేశానికి పంపు, ఓడ మొ. వాటిపైకెక్కించు. ఎగుమతిదారు(డు వి. 1. ఎగుమతి చేసే వాడు: 2. తండిపోతు. ఎగుమతి+దార్ (పార.ప్రత్య.) +డు. ఎగుమతిదిగుమతి వి. 1. పరదేశానికి పంపటం, పరదేశంనుండి తెప్పించుకోవటం; 2. ఓడ మొ. వాటిపై కెక్కించటం, వాటినుండి దింపటం.

**ఎగుమతిచేయు** చూ. ఎగుమతి.

**ఎగుమతిదారు(డు** చూ. ఎగుమతి.

**ఎగుమతిదిగుమతి** చూ. ఎగుమతి.

**ఎగుపు** చూ. ఎగు. వి. 1. పెంపు, గర్వం; 2. పక్షిగతి, పల్లటీ.

ఎగుపులు వి. అవసానదశలో వచ్చే ఎగశ్వాస.

**ఎగుపులు** చూ. ఎగుపు.

**ఎగుమల** పో.చూ. ఎగు. వి. అనుపోసిన పదుగులో మొదటి అనివర్ణ భాగం.

**ఎగుర(గొట్టు** చూ. ఎగురు.

**ఎగురు** రూ. ఎగరు, ఎవురు. చూ. ఎగు. అ.క్రి. 1. ఉడ్డీనం చేయు, ఎగయు. మను. 4.35; 2. పైకిలేచు, పైకెగురు. వసు. 4.23, దశా. 2.303. వి. 1. ఎగరటం; 2. గర్వం, పొగరు.

క. ఎగరు-. ఎగురు. పైకిలేచు. దూకు; త. ఇవర్-. ఎత్తుగా లేచు, ఎక్కు, పోవు, ముందుకు సాగు, పైకిలేచు, దూకు, పరుగెత్తు.

<మూ.ద.ద్రా. *ఎయ్-/*ఎ-.

ఎగుర(గొట్టు రూ. ఎగరగొట్టు. స.క్రి. 1. ఎగురునట్లు చేయు. ఇందు.ప. 2.188; 2. ఉన్నచోటనుండి లేవగొట్టు. <ఎగురు + అ[7](న్) + కొట్టు. ఎగురులాడు అ.క్రి. గంతులువేయు, దూకు, ఎగురు. <ఎగురు+-లు+ఆడు.

**ఎగురులాడు** చూ. ఎగురు.

**ఎగువ** చూ. ఎగు. రూ. ఎగువు. వి. 1. మీదు, ఆవలిభాగం. పరమ.వి. 3.193; 2. పైగానుండటం, ఆధిక్యం. రామాభ్యు. 5.148; విశ. మీదనున్నది, ఆవలిభాగంలో ఉన్నది. మను. 4.37.

**ఎగువు** రూ.చూ. ఎగువ. వి. మీదిభాగం, ఆవలిభాగం. భార. కర్ణ. 2.381.

**ఎగ్గడ** రూ.చూ. ఎక్కడ. క్రి.విశ. ఎక్కడ.

**ఎగ్గడి** రూ.చూ. హెగ్గడి. వి. 1. అంతఃపురం కావలివాడు. ఆం.భా. 2.183; 2. అంతఃపుర కావలికత్తె.

ఎగ్గడికత్తె రూ.చూ. హెగ్గడికత్తె. వి. అంతఃపురపు కావలి కత్తె. బహుళా 2.65. ఎగ్గడికా(డు రూ.చూ. హెగ్గడికా(డు. వి. అంతఃపుర కావలివాడు. ఎగ్గడీ(డు రూ.చూ. హెగ్గడీ(డు. వి. అంతఃపురం కావలివాడు.

**ఎగ్గడికత్తె** చూ. ఎగ్గడి.

**ఎగ్గడికా(డు** చూ. ఎగ్గడి.

**ఎగ్గడీ(డు** చూ. ఎగ్గడి.

**ఎగ్గతము** రూ.చూ. ఏకతము. వి. ఏకాంతస్థలము, ఒంటరిగా నుండుచోటు. భార.ఆశ్రమ. 2.163; విశ. ఏకాంతమైనది. నిర్జనమైనది. భార.మౌ. 157.

**ఎగ్గ(బెట్టు** చూ. ఎగ్గు.

**ఎగ్గలితనము** రూ.చూ. వెంగలితనము. వి. అవివేకం, మూర్ఖత, వెర్రితనము.

**ఎగ్గాడు** చూ. ఎగ్గు.

**ఎగ్గాయిదిగ్గాయి** క్రి.విశ. పూర్తిగా, పైనుంచి కిందికి.

**ఎగ్గించు** చూ. ఎగ్గు.

**ఎగ్గు** వి. 1. కీడు, అపకారం. భార.ఆది. 7.23; 2. అశుభ చిహ్నం, దుర్నిమిత్తం. భార.సభా. 2.178; 3. అమంగళ వాక్యం, కీడుమాట, దూషణ వాక్యం. మార్క. 5.142. ఆం.భా. 1.117; 4. తప్పు, నిషిద్ధమైన పని. కేయూర. 3.38; 5. భంగం, చెరుపు. కావ్య. 3.54; 6. అపరాధం. భోజ. 3.114. కళా. 5.130; 7. నింద. భాగ. 9.378; 8. అగౌరవం, అవమానం. సారంగ. 2.201; విశ. కీడైనది, హానికరమైనది. భార.విరా. 1.131.

క. ఎగ్గు, హెగ్గు. కీడు, అగౌరవం, నింద; పో.చూ. త. ఇకఝ్చు. తిరస్కారం, నిరసన; ఇకట్చ్చి. అపనింద, తృణీకారం, కొంచెపరచటం, తప్పు, అయిష్టం, అసహ్యం.

ఎగ్గ(బెట్టు (ఎగ్గు + పెట్టు) అ.క్రి. మిగులు. ఎగ్గాడు స.క్రి. నిందించు. భాగ. 10. పూ. 1773. ఎగ్గించు 1. అనాదరం చేయు, నిరసించు. వసు. 2.48; 2. ఎగ్గుగా తలచు. తప్పని తలచు. వసు. 4.34; 3. ఆక్షేపించు, దూషించు. శత.రా. 3.135 <ఎగ్గు+-ఇంచు[3]. ఎగ్గుగొను స.క్రి. తప్పుగానెంచు. భార.కర్ణ. 3.33. <ఎగ్గు+కొను. ఎగ్గు చేయు స.క్రి. అవమానించు. ఎగ్గులాడు స.క్రి. 1. తిట్టు, నిందించు. భార.సభా. 2.15; 2. తప్పుపట్టు. ఎగ్గులు వి. నింద, ఆక్షేపణ. భార.సభా. 2.61. ఎగ్గులువట్టు స.క్రి. తప్పుపట్టు, అవమానించు. ఎగ్గులువల్కు రూ. ఎగ్గులువల్కు. స.క్రి. తిట్టు, నిందించు. భార.సభా. 2.61. ఎగ్గులువల్కు (-పల్కు) రూ.చూ. ఎగ్గులుపల్కు. స.క్రి. తిట్టు, నిందించు, భాగ. 6.496. ఎగ్గొందు అ.క్రి. అపజయమొందు, భంగ పడు, నష్టపడు. ప్రభు. 13.45. <ఎగ్గు+ఒందు.

**ఎగ్గుగొను** చూ. ఎగ్గు.

**ఎగ్గుచేయు** చూ. ఎగ్గు.

**ఎగ్గుర్తు** రూ.చూ. ఎగ్గుఋతు. వి. విషయసంగ్రహం, గ్రంథ పీఠిక.

ఎగ్గుర్తులెక్క రూ.చూ. ఎగ్గుఋతు లెక్క. విషయ సంగ్రహం.

**ఎగ్గుర్తులెక్క** చూ. ఎగ్గుర్తు.

**ఎగ్గుఋతు** రూ. ఎగ్గుర్తు. వి. విషయ సంగ్రహం, సంక్షేప రూపం, గ్రంథపీఠిక.

పో.చూ. క. హెగ్గుఋతు. ప్రముఖమైన గుర్తు.

<ఎగు+గుఋతు.

ఎగ్గుఋతులెక్క రూ. ఎగ్గుర్తులెక్క. వి. విషయసంగ్రహం.

**ఎగ్గుఋతులెక్క** చూ. ఎగ్గుఋతు.

**ఎగ్గులాదు** చూ. ఎగ్గు.
**ఎగ్గులు** చూ. ఎగ్గు.
**ఎగ్గులువట్టు** చూ. ఎగ్గు.
**ఎగ్గులువల్కు** చూ. ఎగ్గు.
**ఎగ్గులువల్కు** చూ. ఎగ్గు.
**ఎగ్గిర** రూ.చూ. ఎక్కడ. క్రి.విా. ఎక్కడ. ఆం.భా. 8.66.
**ఎగ్గొందు** చూ. ఎగ్గు.
**ఎగ్గోగిల** వి. దురదగొండి (Mucuna pruritus).
**ఎగ్గోవు** వి. వేళాకోళం.
**ఎగ్గోలు** వి. ఎనిమిది కాళ్ల విషకీటకం.
**ఎంగల్లు** వి. ఒకరకం చేప.

త. వెన్-కణ్-. ఎరుపు, బంగారు రంగులుగల ఒకరకం చిన్నచేప ; ఎఱ్ఱని కన్ను. వెణ్-కణ్. చేప.

**ఎంగిలి**[1] విా. ఉచ్ఛిష్టం, తినగా మిగిలినది, నోటికి తగులుటచే అపవిత్రమైనది. కు.సం. 9.321. వి. 1. అన్యునిచే అనుభవింపబడ్డ స్త్రీ. దశకు. 9.8 ; 2. తినగా మిగిలిన ఆహారం. భార.కర్ణ. 2.76 ; 3. భుక్తశేషం అంటినందువల్లగాని తిన్నందువల్లగాని కలిగిన దోషం. భార.అను. 3.24.

కొడ. ఎచ్చి. ఎంగిలి మెతుకులు ; త. ఎచ్చిల్. ఉమ్మి, ఎంగిలి, అపవిత్రమైనది, భుక్తశేషం, మలమూత్రాదులు, బల్యన్నంలో మిగిలినది ; ఎచ్చమ్. మిగిలినది, భుక్తశేషం, ఉమ్మి,ఎంగిలి ; ఎంచు- మిగులు, వెనుక మిగల్చబడు, చెడగొట్టబడు; మ. ఎచ్చిల్. ఎంగిలిమెతుకులు; ఎచ్చమ్. బల్లుల ఈగల మలం ; కోట. ఎచి. భోజనంచేసిన తర్వాత చేతులు కడుక్కునే నీళ్లు, మెతుకులు, భగవంతునకు నివేదించి పుచ్చుకునే ప్రసాదం ; తొద. ఇచిల్. ఎంగిలి, అశౌచం ; గోం. యెంగుల్. అంటుచేసిన ; కుఱు. ఎంగ్గ్‌నా. మిగులు, అదనంగా ఉండు, తప్పుకొను ; మా. ఎన్‌గె, ఎన్గ్రె. మిగులు.

**ఎంగిలిఅన్నము** వి. భుక్తశేషం. **ఎంగిలిఆకు** వి. పులిస్తరాకు. **ఎంగిలికాయ** వి. నిష్ప్రయోజకుడు. **ఎంగిలిగావించు** స.క్రి. బలాత్కరించు, చెరుచు. నిర్వ.రా. 7.74. <ఎంగిలి + కావించు. **ఎంగిలిచుదుము** వి. గుండ్రని బిళ్లగా ఏర్పడు గజ్జివంటి చర్మవ్యాధి. **ఎంగిలిచురుదు** వి. గుండ్రని బిళ్లగా ఏర్పడు గజ్జివంటి చర్మవ్యాధి. **ఎంగిలిచుఱుకు** వి. గుండ్రని బిళ్లగా ఏర్పడే గజ్జివంటి చర్మవ్యాధి. **ఎంగిలిచేయు** వి. అస్వస్థత తర్వాత మొదటిసారిగా అన్నంతిను, ఎంగిలిపడు. **ఎంగిలించు** స.క్రి. తినటంచేగాని అనుభవించటంచేతగాని అపవిత్రంచేయు. కాశీ. 3.351. క. ఎంజలిసు. అపవిత్రం చేయు. **ఎంగిలిపడు** అ.క్రి. ఎంగిలిచేయు. **ఎంగిలిబంతి** వి. బువ్వంబంతి. **ఎంగిలిమంగలము** వి. అపవిత్రమైనది. కాశీ. 3.96. వ్య. ఎంగిలి అయిన మంగలం వంటిది. **ఎంగిలిమాటలు** వి. బవ. బూతుమాటలు, అర్థంలేని మాటలు. వ్య. అపవిత్రమైన మాటలు. **ఎంగిలియగు** అ.క్రి. అపవిత్రమగు. <ఎంగిలి + అగు. **ఎంగిలివాఁడు** వి. అపవిత్రుడు, లోభి, ఇంద్రియలోలుడు, వ్యభిచారి.

**ఎంగిలి**[2] పో.చూ. ఇంగిలాయి. వి. రెండడుగుల పొడవుగల ముల్లుగల చేప.

**ఎంగిలిఅన్నము** చూ. ఎంగిలి[1].
**ఎంగిలిఆకు** చూ. ఎంగిలి[1].
**ఎంగిలికాయ** చూ. ఎంగిలి[1].
**ఎంగిలిగావించు** చూ. ఎంగిలి[1].
**ఎంగిలిచుదుము** చూ. ఎంగిలి[1].
**ఎంగిలిచురుదు** చూ. ఎంగిలి[1].
**ఎంగిలిచుఱుకు** చూ. ఎంగిలి[1].
**ఎంగిలిచేయు** చూ. ఎంగిలి[1].
**ఎంగిలించు** చూ. ఎంగిలి[1].
**ఎంగిలిపడు** చూ. ఎంగిలి[1].
**ఎంగిలిబంతి** చూ. ఎంగిలి[1].
**ఎంగిలిమంగలము** చూ. ఎంగిలి[1].
**ఎంగిలిమాటలు** చూ. ఎంగిలి[1].
**ఎంగిలియగు** చూ. ఎంగిలి[1].
**ఎంగిలివాఁడు** చూ. ఎంగిలి[1].
**ఎంగువ**[1] రూ.చూ. ఎంగెన. వి. ఒకరకం చెట్టు.
**ఎంగున**[2] రూ. ఏగున. వి. ఐదు కుంచాలు, కొలత.

<ఏను[2] + కుంచము.

**ఎంగెన** రూ. ఎంగున[1], ఏగి, ఏగిశ, ఏగేన, ఏగేసె, ఏగేశ, ఏంగ్సు, ఏమిశ. వి. ఒక అడవిచెట్టు, చెక్క పసుపుపచ్చని నారింజరంగు, తేలిక, మన్నికగలది.
**ఎచటు** చూ. ఎ[2].
**ఎచరము** రూ.చూ. ఎచ్చరము. వి. హెచ్చరిక. ఉ.హరి. 3.124.
**ఎచరించు** రూ.చూ. ఎచ్చరించు. స.క్రి. 1. ఏర్పరచు. పాండు. 3.56 ; 2. ప్రోత్సహించు. ప్రేరేపించు. పురికొల్పు. నవనాథ. 2.94. పు. 11 పం.
**ఎచొటు** చూ. ఎ[2].
**ఎచోటు** చూ. ఎ[2].
**ఎచ్చటు** చూ. ఎ[2].
**ఎచ్చరము** రూ. ఎచరము. చూ. ఎచ్చరించు. వి. హెచ్చరిక, జాగరూకత. కవిక. 6.94.
**ఎచ్చరిక** రూ. హెచ్చరిక. వి. 1. ప్రోత్సాహం. రాఘవ. 4.152 ; 2. జాగ్రత్త, అవధానం. పాండు. 2.97, ఉ.రా. 7.398.

క. ఎచ్చఱికె. జాగ్రత్త, మెలకువ ; హెచ్చఱికె ; తు. ఎచ్చరిగె, ఎచ్చెరిగె ; కొడ. ఎచ్చల్. జాగ్రత్త ; త. ఎచ్చరిక్కై (*ఎఱుచ్చి + అఱిక్కై). జాగ్రత్త, మెలకువ, రాజుగాని అధికారులుగాని వచ్చినప్పుడు నిశ్శబ్దంగా ఉండటానికి చేసే హెచ్చరిక, సభలోగాని న్యాయస్థానంలోగాని జాగ్రత్తకై చేసే హెచ్చరిక ; పో.చూ. అఱిక్కై. గమనించు. అఱి. తెలిసికొను.

**ఎచ్చరికపడు** రూ. హెచ్చరికపడు. అ.క్రి. జాగ్రత్తపడు. **ఎచ్చరికించు** రూ.చూ. ఎచ్చరించు. స.క్రి. 1. జ్ఞప్తికి తెచ్చు. శ్రీరం.మా. 4.4 ; 2. ప్రోత్సహించు, పురికొల్పు. విక్ర. 7.8.

**ఎచ్చరికపడు** చూ. ఎచ్చరిక.
**ఎచ్చరికించు** చూ. ఎచ్చరిక.

**ఎచ్చరించు** రూ. ఎచరించు, ఎచ్చరికించు, హెచ్చరించు, హెచ్చరికించు. స.క్రి. 1. జ్ఞప్తిచేయు. ఆము. 5.77; 2. జాగురూకునిచేయు. వసు. 6.8; 3. ప్రోత్సాహపరచు, పురికొల్పు. శుక. 1.301; 4. తెలుపు. దశా. 7.156.

క. ఎచ్చఱిసు. మేల్కొలుపు, మేల్కొను. హెచ్చరించు, ముందు జాగ్రత్త చెప్పు, జ్ఞప్తియందుంచుకొను; ఎచ్చఱ్, ఎచ్చఱు. మేల్కొను; ఎబ్బర్. మేల్కొను, మెలకువతో నుండు; తు. ఎచ్చెరిగె. జాగ్రదవస్థ; త. ఎచ్చరి. హెచ్చరించు, ముందు జాగ్రత్త చెప్పు. ఎఱు. లేచు, బయలుదేరు, ప్రేరేపింపబడు, అతిశయించు, పెరుగు, కీర్తి, వదంతి మొ. వ్యాపించు; కుఱు. ఎజ్గ్నా (ఎజ్గస్). మేల్కొను; ఎజ్ర్నా. మాల్తో. ఎజె. మేల్కొలుపు; ఎజ్రె. మేల్కొనియుండు.

<మూ.ద.ద్రా. *ఎత్. *చత్.

**ఎచ్చరింత** చూ. ఎచ్చరించు. వి. ఎచ్చరిక. పాంచాలి. 8.60; త. ఎచ్చరిత్తల్. హెచ్చరిక.

**ఎచ్చరింపు** చూ. ఎచ్చరించు. వి. హెచ్చరిక.

త. ఎచ్చరిప్పు. హెచ్చరిక.

**ఎచ్చివచ్చి** వి. 1. పూర్తిగా పక్వానికి రాని; 2. కాలీకాలని.

**ఎచ్చిరాయి** వి. కల్లం మీద కాల్చటానికి సిద్ధంగా వుంచిన ఇటుక.

**ఎచ్చిరిలు** రూ.చూ. ఎచ్చిరిల్లు. అ.క్రి. 1. వృద్ధినొందు. వేంక. పంచ. 1.297, కళా. 6.32; 2. ఆవేశపడు, ఉద్రేకపడు.

**ఎచ్చిరిల్లు** రూ. ఎచ్చిరిలు, ఎచ్చిర్లు. చూ. ఎచ్చరించు. అ.క్రి. 1. మెలకువగా నుండు. శ్రీరం.మా. 3.14; 2. పెరుగు, అభ్యుదయమొందు; 3. ఆవేశపడు, ఉద్రేకపడు.

క. ఎచ్చు, హెచ్చు. అధికమగు; తు. ఎచ్చుని, హెచ్చుని. పో.చూ. త. ఎఱు. పెరుగు, వృద్ధి పొందు.

**ఎచ్చిర్లు** రూ.చూ. ఎచ్చిరిల్లు. అ.క్రి. 1. విజృంభించు. రామా. 8.6; 2. ఆవేశపడు, ఉద్రేకపడు.

**ఎచ్చిఱు** అ.క్రి. 1. తేరుకొను, ప్రబోధం చెందు. కు.సం. 5.583, జై. భా. 8.93; 2. వృద్ధిపొందు. వేంక. పంచ. 1.502.

క. ఎచ్చఱ్, ఎచ్చఱు. మేల్కొను; ఎబ్బర్. మేల్కొను; కొడ. ఎచ్చర. జాగ్రత్త; తు. ఎచ్చరికె. మెలకువ; త. ఎఱుచ్చి. మేల్కొలుపు పాట, మేల్కొనటం, ఉన్నతి, ఎఱు. మేల్కొను, పెరుగు; కోట. ఎతొర్ (ఎతొత్). మేల్కొను; ఎతొర్చ్. మేల్కొల్పు; పో.చూ. గో. తేడానా (తేడ్స్- తేడ్క్). లేచు, నిద్రలేచు; పర్జి. ఒల్లా. సిల్ప్- (సిల్త్-). లేచు; ఎచిప్- (ఎచిత్-). లేపు, నిద్రలేపు; నన్. నిద్రలేచు; కుఱు. ఎజ్నా. లేపు; ఎజె. మేల్కొలుపు; ఎజ్రె. మెలకువగా వుండు; పో.చూ. మాల్తో. ఇల్. లేచు, నిలబడు (?); పో.చూ. బ్రా. సలింగ్, సలింగ్. నిల్చొను, లేచు.

**ఎచ్చిలు** చూ. ఎచ్చు.

**ఎచ్చిల్లు** చూ. ఎచ్చు.

**ఎచ్చు** రూ.చూ. హెచ్చు. అ.క్రి. 1. అధికమగు. ఉ.రా. 7.398; 2. చెలరేగు, రెచ్చు. ఉ.రా. 2.110. విశే. 1. అధికం, హెచ్చైనది. దశా. 2.217; 2. గొప్ప, గౌరవనీయమైన. వేయి. శ. 2. వి. గొప్పదనం, ఆధిక్యం. నీలా. 1.42.

ఎచ్చిలు రూ.చూ. ఎచ్చిల్లు. అ.క్రి. హెచ్చు, అతిశయించు. ద్వి. పరమ. 6.464 ప. 4 పం. ఎచ్చిల్లు రూ. ఎచ్చిలు. అ.క్రి. అతిశయించు. ఎచ్చుతగ్గు వి. ఎత్తుపల్లాలు, ఎగుడు దిగుడు, అసమత్వం. ఎచ్చుతగ్గులుగా(న్) క్రి.విశే. అమర్యాదగా, తిరస్కారంగా <ఎచ్చు తగ్గు+-లు+కాన్. ఎచ్చుపోత వి. అనుకు ఎక్కువ నూలు పొయ్యటం.

**ఎచ్చుతగ్గు** చూ. ఎచ్చు.

**ఎచ్చుతగ్గులుగా(న్)** చూ. ఎచ్చు.

**ఎచ్చుపోత** చూ. ఎచ్చు.

**ఎచ్చెలివి** పో.చూ. ఎచ్చిలు. వి. అభివృద్ధి.

**ఎచ్చోటు** చూ. ఎ[2].

**ఎచ్చో(న్)** చూ. ఎ[3].

**ఎచ్చోటు** చూ. ఎ[3].

**ఎజ్జ** రూ.చూ. అజ్జ[2]. వి. కాలం.

**ఎంచు** చూ. ఎన్ను. రూ. ఎలుచు. స.క్రి. 1. ఉన్నదున్నట్లు నిరూపించు. హర. 5.21; 2. పాటించు, సరకుచేయు. వసు. 4.8; 3. స్మరించు, కళా. 3.258; 4. పరిశీలించు, విమర్శించు. చంద్రా. 6.103; 5. సంకల్పించు. ఇందు. 1.180; 6. ఏరు, ఎన్ను. ఇందు. 3.13; 7. అనుకొను, భ్రాంతిచే తలచు. ఇందు. 3.94; 8. ఊహించు. దశా. 2.84; 9. ఆక్షేపించు, నిరసించు. దశా. 2.269; 10. పొగడు, స్తుతించు. ఉ.రా. 1.81; 11. ఆరోపించు. ఉ.రా. 1.193; 12. భావించు. సీతరా. 3.179; 13. లెక్కించు, గణించు.

క. ఎణిసు, ఎణసు, ఎణుసు, ఎణ్ణిసు. లెక్కించు, గణించు. అంచనావేయు, అభిసంధించు, విచారించు, ఆలోచించు; పో. చూ. త. ఎణ్ణుని. ఆలోచించు, స్మరించు; మ. ఎణ్ణుక. లెక్కించు, గణించు, గౌరవించు, వివరించు; పో.చూ. కువి. ఎజికినై. లెక్కించు; పర్జి. ఎజ. సంఖ్య; ఎజచాజ్. లెక్కించు.

<*ఎణ్-చ్-.

ఎంచుకొను అ.క్రి. లెక్కించుకొను, ఆలోచించుకొను.

**ఎంచుకొను** చూ. ఎంచు.

**ఎట** చూ. ఎట్టు. వి. ఎక్కడ. 'ఏనెట నీవెట'లో వలె సంబంధం లేమిని కూడా తెలుపుతుంది. భార. ఆది. 4.99.

ఎటకేని క్రి.విశే. ఎక్కడికైనా.

**ఎటకాయించు** చూ. అటకాయించు. అ.క్రి. అడ్డగించు.

**ఎటకేని** చూ. ఎట.

**ఎటమటము** వి. 1. విభేదం; 2. వినాశం; 3. తారుమారు చేయటం.

**ఎటవారె** పో.చూ. ఇందుగ. వి. చిల్లచెట్టు (Strychnos potcto). దీని గింజలు నీటిలోని మురికిని విరిచి, నీరు తేరుకునేట్లు చేస్తాయి.

త. తేత్తామరం. చిల్లచెట్టు. పో.చూ. బెఱు. నీరు,

ఒక మడి రాలూడు నైర్మల్యం, నైగనిగ్యం.

**ఎటికపాము** రూ.చూ. ఎమిడికపాము. వి. కడుపులో పుట్టే జబ్బు పురుగు.

**ఎటిగొట్నము** వి. వెట్టిపని.

నెటి < వెట్టి.

**ఎటు** రూ.చూ. ఎట్టు[1]. క్రి.విశ. **1.** ఏ ప్రకారం. విక్ర. 7.131, ప్రభా. 5.3, మను. 6.50 ; **2.** ఏ వైపు. శృం.నై. 3.46, ఉ.రా. 1.179 ; **3.** పొసగక పోవటాన్ని తెలుపుతుంది.

పో.చూ క. ఎత్త. ఏపోటు, ఏవైపు.

**ఎటుకు** క్రి.విశ. ఎంత వరకు. **ఎటుబట్టి** క్రి.విశ. ఏ విధంగానైనా. **ఎటుల** క్రి.విశ. ఏ విధంగా, ఏ ప్రకారంగా. **ఎటులనేని** క్రి.విశ. ఏ విధంగానైనా. **ఎటులు** రూ.చూ. ఎట్టులు. క్రి.విశ. ఏ ప్రకారంగా. మను. 4.83. **ఎటువంటి** విశ. **1.** ఏ స్వభావంకల, ఎట్టి. కాశ. 1.99 ; **2.** ఏరకమైన, ఎంత గొప్ప. దశా. 2.33. **ఎటువలె** అవ్య. **1.** ఎట్లు, ఏ రీతిగా. వసు. 3.121 ; **2** దేనివలె. **ఎట్లా** చూ. ఎట్లు. క్రి.విశ. ఏరీతి, ఎట్లు. రాధా. 2.20. **ఎట్లాగు** క్రి.విశ. ఎట్లు. **ఎట్లాగైనా** రూ. ఎట్లానైన. క్రి.విశ. ఏదో ఒక విధంగా. **ఎట్లాగో** క్రి.విశ. ఎట్లు. **ఎట్లానైన** రూ.చూ. ఎట్లాగైనా. క్రి.విశ. ఏదో ఒక విధంగా. **ఎట్లు** రూ.చూ. ఎట్టులు. అవ్య. **1.** ఏ ప్రకారం. భార. అర. 2.247, మను. 3.48 ; **2.** పొసగమని తెలుపుతుంది. శివరా. 3.76 ; **3.** ఏ వైపు ; **4.** ఏ రకమైన. **ఎట్లో** చూ. ఎట్లు. అవ్య. **1.** ఏలాగో (భయ సంశయాలను తెలుపుతుంది). భాగ. 8.72, దశా. 1.176.

**ఎటుకు** చూ. ఎటు.

**ఎటుబట్టి** చూ. ఎటు.

**ఎటుల** చూ. ఎటు.

**ఎటులనేని** చూ. ఎటు.

**ఎటులు** చూ. ఎటు.

**ఎటువంటి** చూ. ఎటు.

**ఎటువలె** చూ. ఎటు.

**ఎట్ట[1]** రూ. ఎట్టా. చూ. ఎట్టు. క్రి.విశ. ఏ విధంగానైనా.

**ఎట్టకునేని** రూ. ఎట్టకేని. క్రి.విశ. చాలా సేపటికి, చివరకు, అతి ప్రయాసంమీద. భార. అశ్వ. 89. **ఎట్టకేని** రూ.చూ. ఎట్టకునేని. క్రి.విశ. చాలాసేపటికి, చివరకు, చిట్టచివరకు, అతికష్టంమీద. భార. ఆది. 6.130, విరా. 2.112. **ఎట్టకేలకు(న్)** క్రి.విశ. **1.** చివరకు, చాలా సేపటికి. భార. విరా. 2.112 ; **2.** అతికష్టంమీద. జై.భా. 8.73.

< ఎట్టకు + ఏలకు.

**ఎట్ట[2]** రూ.చూ. వెట్ట. వి. వేడి.

**ఎట్టకునేని** చూ. ఎట్ట[1].

**ఎట్టకేని** చూ. ఎట్ట[1].

**ఎట్టకేలకు(న్)** చూ. ఎట్ట[1].

**ఎట్టట** చూ. ఎట్టు[1].

**ఎట్టన(న్)** చూ. ఎట్టు[1].

**ఎట్టపోగు** చూ. నెట్ట. వి. దండెత్తటానికి వచ్చే సైన్యం ; గుంపు. చంద్రా. భా. 4.90.

బహుశః < నెట్ట (విస్తారమైన), పోగు (గుంపు).

**ఎట్టము** రూ.చూ. ఎఱ్ఱము. వి. పశువుల మందల చుట్టూ కంచె వెయ్యటానికి కలిపి కట్టిన గచ్చ తీగలు మొ.

క. ఎట్టు. కంప తొడుగు.

**ఎట్టయెదురు** చూ. ఎదురు. క్రి.విశ. మిక్కిలి ఎదురు. కాశీ. 4.186.

క. ఎట్టు. అందుబాటులో నుందు.

**ఎట్టా** చూ. ఎట్టు[1]. క్రి.విశ. ఏ విధంగానైనా.

**ఎట్టి[1]** చూ. ఎట్టు. విశ. ఎటువంటి. భార. ఆది. 5.58, మను. 3.46.

క. ఎన, ఎన్ను, ఎంత. ఎటువంటి ; ఎంతహ, ఎంథ. ఏ మాదిరి ? ఏ రకం ? ఎట్లు ? ; త. ఎన్న. ఎటువంటి ? పో.చూ. గో. బాతోల్, బాతల్, బాతోనా, బాతోడ్. ఎటువంటి ; కొ. ఎంటొన్‌మన్, ఎణ్‌తొర్‌మెన్. ఎటువంటి ; నా. నంట. ఎట్లు.

**ఎట్టి(డు** చూ. ఎట్టి. వి. ఎటువంటివాడు. మార్క. 1.119, భా.రా. 2.297. < ఎట్టి + వాఁడు. **ఎట్టిది** చూ. ఎట్టి. వి. ఎటువంటిది. < ఎట్టి + అది. **ఎట్టిపాటివారు** వి. బ.వ. ఎంతటివారు. భార. శాంతి. 4.426. **ఎట్టిరు** వి. బ.వ. ఎటువంటివారు. < ఎట్టి + వారు.

**ఎట్టి[2]** రూ.చూ. వెట్టి. వి. కూలి లేకుండా పెద్ద రైతుకు చిన్న రైతులు చేసే పని. అవ్య. ఊరకే, నిర్లక్ష్యంగా.

**ఎట్టి(డు** చూ. ఎట్టి[1].

**ఎట్టిది** చూ. ఎట్టి[1].

**ఎట్టిపాటివారు** చూ. ఎట్టి[1].

**ఎట్టిరు** చూ. ఎట్టి[1].

**ఎట్టు[1]** రూ. ఎటు, ఎట్టూ. క్రి.విశ. **1.** ఎట్లు, ఏ ప్రకారం ; **2.** ఏ వైపు. భార. ద్రోణ. 4.205.

పో.చూ. క. ఎత. ఏది, ఏ కోటు, ఏ వైపు ; త. ఎఱ్ఱు. ఎట్లు, ఎంత, ఎన్ని, జాలినీ ఆశ్చర్యాన్ని తెలిపే అవ్యయం ; పర్జి. ఎతె, ఎతెన్. ఎట్లు ; ఒల్లా. ఎటెట్. ఏ రకమైన; ఎకెన్. ఎట్లు.

< మూ.ద్రా. *ఎత్-.

**ఎట్టట** క్రి.విశ. ఎట్టినను. పరమ. వి. 2.192, కళా. 3.258. < ఎట్టు[1] + అటు + -అ(న్[1]) **ఎట్టన(న్)** క్రి.విశ. ఏ విధంగానైనా, ఏ పరిస్థితులలోనైనా, అవశ్యం. భాగ. 1.312. **ఎట్టా.** రూ.చూ. ఎట్ట[1]. ఆశ్చర్యార్థకం. ఏమిటేమిటి ! ఎట్లా ! **ఎట్టులు** రూ. ఎటులు, ఎట్లు. అవ్య. ఎట్లు, ఏ ప్రకారం. నీలా. 1.23. **ఎట్టువోలె(న్)** అవ్య. ఎటువలె. < ఎట్టు[1] + పోలె(న్). **ఎట్టెటూ** రూ.చూ. ఎట్టెట్టూ. అవ్య. ఏ ప్రకారం. కళా. 4.3, 7.32. < ఎట్టు[1] + ఎటూ. **ఎట్టెట్టగు** అ.క్రి. ఏ రీతిగా పరిణమించు. కకుత్స. 2.125. < ఎట్టు[1] + ఎట్టు[1] + అగు. **ఎట్టెట్టా** ఆశ్చర్యార్థకం. ఎట్టూ. కు.నం. 7.19. < ఎట్టు[1] + ఎట్టా. **ఎట్టెట్టూ** రూ. ఎట్టెటూ. అవ్య. ఏ ప్రకారం. కాశీ. 7.107. < ఎట్టు[1] + ఎట్టు.

**ఎట్టు[2]** వి. నాణాలను అచ్చువేసే మూస.

**ఎట్టులు** చూ. ఎట్టు[1].
**ఎట్టువోలె(న్)** చూ. ఎట్టు[1].
**ఎట్టూ** రూ.చూ. ఎట్టు[1]. అవ్య. ఏ ప్రకారం. ఆశ్చర్యాన్నీ ఆక్షేపాన్నీ తెలిపే అవ్యయం. ఆము. 6.54.
**ఎట్టె** వి. కంప పంట చెరకుగాను, దళ్లు కట్టడానికి పనికి వచ్చే చిన్న చెట్టు (Strychnine-tree).

క. ఇట్టి, ఇటింగు, ఇజ్జె, ఘటంగి : త. ఆట్టి, ఎట్టి.

< త. ఎట్టి.

**ఎట్టెం** వి. గుబురుగా ఉన్న కొమ్మ. దీనిని విత్తనాల దాళ్లను ఊడ్చడానికి ఉపయోగిస్తారు.

క. ఎట్ట. విత్తనాల దాళ్లను ఊడ్చడానికి ఉపయోగించే గుబురు కొమ్మ.

**ఎట్టెటూ** చూ. ఎట్టు[1].
**ఎట్టెట్టగు** చూ. ఎట్టు[1].
**ఎట్టెట్టా** చూ. ఎట్టు[1].
**ఎట్టెట్టూ** చూ. ఎట్టు[1].
**ఎట్లా** చూ. ఎటు.
**ఎట్లాగు** చూ. ఎటు.
**ఎట్లాగైనా** చూ. ఎటు.
**ఎట్లాగో** చూ. ఎటు.
**ఎట్లావైనా** చూ. ఎటు.
**ఎట్లు** రూ.చూ. ఎట్టులు.
**ఎట్లో** చూ. ఎటు.
**ఎడ[1](న్)** వి. **1.** వీలు, అనుకూల్యం. భార.ఆది. 2.132 ; **2.** సమయం. భార.ఆది. 5.164, ఆము. 4.183 ; **3.** దూరం. భార.విరా. 4.171, భీష్మ. 6.196, హరి.ఉ. 2.59 ; **4.** స్థానం, చోటు. భార.ఆది. 6.142. ఆను. 5.160, పారి. 1.84 ; **5.** ఆలశ్యం, విలంబం. భార.ఆది. 8.119, భారా. 5.74 ; **6.** గడువు, వ్యవధి. భార.ఉద్యో. 1.165, హరి.ఉ. 7.111 ; **7.** అంతరం, ఎడం. భార. భీష్మ. 3.411, కాశీ. 7.5 ; **8.** నడిమి ప్రదేశం, నడిమి కాలం. భార.ద్రోణ. 5.106, హరి.పూ. 9.179 ; **9.** వ్యవధానం. అవకాశం. భార.శాంతి. 1.188, హరి ఉ. 2.159 ; **10.** నెత్తపలకపై కాయలుంచే గది. దశకు. 5.64,65 ; **11.** రాయబారం, దౌత్యం. బసవ. 4.834, రం.రా. కిష్కిం. 215 పు. 30 పం. ; **12.** తెరపి. తీరిక. భార. ఆర. 5.308, కళా. 7.20 ; **13.** ఆచారం, వ్యవహారం. కాశీ. 5.544, విజ్ఞా. 3.83 ; **14.** నిరర్థకం. పి. శకుం. 3.83 ; **15.** భేదం. భాగ. 1.64, రామా. 3.155 ; **16.** విచ్ఛిత్తి. విరామం. భాగ. 10. పూ. 519, ఉ.రా. 4.177 ; **17.** అమర్యాద, అగౌరవం. పారి. 1.117 ; **18.** ఎడబాటు, వియోగం. కళా. 3.177 ; **19.** అడ్డు. విశే. **1.** వేరైన. ఇతరమైన. పండి.చ.పురా. 153. పు. **2.** దూరస్థం, దవ్వైనది. కళా. 4.53 ; **3.** అధికం. అవ్య. అందు, విషయంలో.

క. ఎడ, మధ్య ప్రదేశం లేక కాలం, ఎడం, నడిమిది ; ఎడె. చోటు, ప్రదేశం, మధ్య ప్రదేశం, కాలం, దూరం, అధికం, సమృద్ధి : తు. ఎడె. మధ్యప్రదేశం, దూరం, మధ్య మొ. ; త. ఇడమ్. చోటు, కాలం, మారం, అవకాశం, హద్దు. చెదల్పు : ఇడై. మధ్య ప్రదేశం, మధ్య కాలం, చోటు : మ. ఇట, ఇటం. చోటు, వ్యవధి, మధ్య ప్రదేశం ; కోల. ఎధ్.

< మూ.ద్రా. *ఎట్-.

**ఎడకట్టు** స.క్రి. చేద్చు. కాశీ. 7.5 ; అ.క్రి. ఆరినవుండు మళ్లీ చీముపట్టు. **ఎడకడ** విశే. భిన్నం, అన్యం, ఇతరం, పరాయి. **ఎడకడవాఁడు** వి. అన్యుడు, పరాయివాడు. **ఎడకత్తియ** రూ. ఎడకత్తె. వి. చూరిక, బాద్పుడు కత్తె. ఆం.భా. 2.110. **ఎడకత్తె** రూ.చూ. ఎడకత్తియ. వి. చూరిక, బాద్పుడు కత్తె. దశకు. 6.180. **ఎడకాఁడు** వి. రాద్పరుగాడు, పుంజెనగాడు. ఆము. 2.52. **ఎడకారు** వి. అకాలపు పంట, మాఘ జ్యేష్ఠ మాసాల మధ్య పండే పంట. **ఎడకార్తె** వి. అశ్వినీకార్తె. చైత్రమానంలో వచ్చే కార్తె. సేద్యపు పనులు తక్కువగా ఉండే కార్తె. **ఎడకాల్వ** వి. **1.** రెండు మళ్ల మధ్యగుండా పారే కాలవ ; **2.** నీరు వలచబడిన కాలవ. **ఎడగడ్డ** వి. ఒడ్డు, తీరం. హరి.ఉ. 9.220. **ఎడగిలియుండు** అ.క్రి. తొలగి ఉండు, దూరంగా ఉండు. **ఎడగిలు** రూ.చూ. ఎడగిల్లు. అ.క్రి. తొలగు, తప్పుకొను. **ఎడగిల్లు** రూ. ఎడగిలు. అ.క్రి. వైదొలగు, తప్పుకొను .విప్ర. 2.31. **ఎడగుంటక** రూ. ఎడగుంటక. వి. గడ్డి, కలుపు మొ. తియ్యటానికి పైరులో లోలే మూడు పదుగుల గుంటక. **ఎడగొను** అ.క్రి. వీలుచేసుకొను. ప్రభా. 5.53. క. ఎడెగొళ్, జరుగు, సంభవించు, నిలుచు, ఆగిపోవు, నిలబడు, పొందు, సంపాదించు, గ్రహించు, పూనుకొను. **ఎడగొఱ్ఱు** వి. ఆట గొర్రు, నాగలితోడున్నిన తరువాత పెళ్లలు నలగటానికి దున్నె గొర్రు. **ఎడఁజేయు** స.క్రి. ఎత్తివేయు, తీసివేయు. < ఎడ[1](న్) + చేయు. **ఎడఁజెందు** అ.క్రి. మూర్ఛపోవు, సొమ్మసిల్లు, ఎడ[1] + (న్) + చెందు. **ఎడతాఁకు** అ.క్రి. **1.** రాకపోకలు చేయు. పరమ వి. 5.47 ; హరిశ్చ. 4.121 ; **2.** తాకు, మూర్కొను. పి.శకు.పీఠి. 83 ; **3.** కలియు. **ఎడతీయు** అ.క్రి. ఎడతెగు, విడివడు. **ఎడతెగు** అ.క్రి. **1.** ఎడపడు, విచ్ఛిన్నమగు. భార.ఆది. 4.181, విరా. 5.129 ; **2.** నశించు, అంతమగు. భాగ. 1.513 ; **3.** వేరుపడు. భాగ. 8.37. **ఎడతెంపి** చూ. ఎడతెగు. వి. **1.** విచ్ఛిత్తి, విడిపోవడం ; **2.** తెరపి, వ్యవధానం. **ఎడతెర్పి** రూ.చూ. ఎడతెఱపి. వి. వ్యవధానం. భార.విరా. 5.61. **ఎడతెఱపి** రూ. ఎడతెర్పి. వి. (దేశకాలాల్లో) వ్యవధానం. **ఎడత్రవ్వు** అ.క్రి. **1.** ఎడతెగు. విచ్ఛిన్నమగు. భార. శల్య. 1.348, శాంతి. 3.186 ; **2.** చెడిపోవు. ఆము. 2.31. **ఎడత్రెమ్చు** అ.క్రి. విడిపోవు, ఎడతెగు. **ఎడత్రోవకావరి** వి. బందిపోటు దొంగ. **ఎడదవ్వు** వి. అతిదూరం. కాశీ. 7.197. విప్ర. 1.84. **ఎడదూడ** వి. పాలువిడిచిన దూడ, తరిపిదూడ. **ఎడనాడు** స.క్రి. తిట్టు, నిందించు. భాగ. 6.27. **ఎడనెడ** అవ్య. 1. అక్కడక్కడ. భార.భీష్మ. 1.39 ; **2.** మధ్య కాలం. భార.శాంతి. 4.368 ; **3.** అప్పుడప్పుడు. కై.బా. 3.143 < ఎడ[1](న్) + ఎడ(న్). **ఎడపడు** రూ. ఎడవడు.

అ.క్రి. 1. విచ్ఛిన్నమగు, విరామం కలుగు. భార.అర. 3.238. కు.సం. 6.762. మను. 5.71; 2. ఒకదాని తర్వాత ఒకటి అగు. భార.ఉద్యో. 2.76; 3. దూరమగు. భార.శాంతి. 6.174, 4. లోపంపొందు. రం.రా. బాల. 16 పు. 8 పం.; 5. అవరోధం పొందు, విఘ్నంపొందు. రం.రా. 55 పు. 30 పం.; 6. విడివడు, వీడు. హరి.పూ. 5.142; 7. అడ్డుపడు, జామీనుగానుండు. విజ్ఞా. 3.88. ఎదపిల్ల వి. పాలు విడిచిన పిల్ల. ఎదవుచ్చు స.క్రి. రాయబారం నడుపు, కుంటెనతనం చేయు. బసవ. 2.474 పం., 4.834. ఎదపెట్టు రూ. ఎదవెట్టు. 1. అడ్డుగా పెట్టు, మితిగా పెట్టు. భార.ద్రోణ. 1.112; 2. మధ్య మధ్య నొక్కొక్కటి విడుచు. భార.ద్రోణ. 4.289. అను. 4.148; 3. దూరంగా పెట్టు. ఎదపోవు రూ. ఎదవోవు. అ.క్రి. రాయబారం నడుపు, కుంటెనతనం చేయు. భాగ. 10.148. ఎదప్రొద్దు వి. సంధ్యాసమయం, సంజెవేళ. ద్వి.హరిశ్చ. పూ. 1729. ఎదబిడ్డ వి. చంటిబిడ్డకు పూర్వపు బిడ్డ, పాలు విడిచిన బిడ్డ. ఎదమంద వి. వేసవికాలం తోలించే మంద, పెలిమంద. ఎదఁబడు అ.క్రి. విరామం ఉండు. భార.అర. 238. <ఎద[1](న్)+పడు. ఎదఁబాటు వి. వియోగం, వేఱుపాటు. అధ్యా.రా. 1.12 పుట. <ఎద[1](న్)+పాటు. ఎదఁబాపు స.క్రి. 1. తొలగించు. ఉ.రా. 3.88; 2. అప్పు తీర్చు మొ. ఉ.రా. 5.80; 3. వేఱుచేయు. <ఎద[1](న్)+పాపు. ఎదఁబాయు అ.క్రి. దూరమగు, వీడిపోవు. వసు. 5.98; స.క్రి. వదలు, విడుచు. సారంగ. 2.272. <ఎద[1](న్)+పాయు. ఎదయగు అ.క్రి. 1. విలంబమగు. దశకు. 2.110; 2. దూరమగు. పిశకు. 4.163. రాఘవ. 1.44. <ఎద[1](న్)+అగు. ఎదయాడు అ.క్రి. 1. ప్రవర్తించు. దశకు. 7.52; 2. తిరుగాడు, చుట్టుపట్ల తిరుగు. శృం.నై 5.184. <ఎద[1](న్)+ఆడు. ఎదయెదముగా(న్) (ఎదఎదముగా(న్) క్రి.విశ. వేర్వేరుగా, దూరదూరంగా. <ఎద[1](న్)+ఎదము+కాన్. ఎదవడు రూ.చూ. ఎదపడు. అ.క్రి. విరామం కలుగు. మను. 5.71. ఎదవల వి. ఒక రకం వల. హంస. 4.185. ఎదవాఁడు వి. 1. దూరపు వాడు; 2. చివరివాడు; 3. కొత్తవాడు. ఎదవాపులు వి. కొద్దిగా పెరిగి తల్లిని విడిచి తిరిగే కోడిపిల్లలు. ఎదవారు వి. పొరుగువారు, అన్యులు. ఎదవిడివడు అ.క్రి. అడ్డునుండి తప్పించుకొను, విశృంఖలమగు. పండి.చ. 176 పు. 4 పం. <ఎద[1](న్)+విడివడు. ఎదవెట్టు రూ. ఎదపెట్టు. స.క్రి. 1. మితిగా పెట్టు. భార.ద్రోణ. 1.112; 2. అడ్డుగా పెట్టు. భార.ద్రోణ. 1.116; 3. భగవదర్పణంగా ఆహారంలో కొంత ఆవల పెట్టు. ఎదవొలము వి. భూములమధ్యనున్న పొలం. <ఎద[1](న్)+పొలము. ఎదవోవు రూ.చూ. ఎదపోవు. అ.క్రి. రాయబారంపోవు, దౌత్యమునకైపోవు. బసవ. 4.739, శివ.సా. 407. ఎదసను అ.క్రి. తొలగిపోవు, ఎడంగా వెళ్లు. శుక. 1.299. ఎదసంది వి. మధ్యభాగం, నడిమి సందు. భాగ. 9.401. ఎదసాల వి. ప్రత్యేకమైన ఇల్లు. ఎదసేద్యము రూ. ఎరసేద్యము. వి. పైరుసేద్యం, కలుపుపోవటానికి నేల గుల్లబారటానికి పైరులోచేసే సాగు. ఎదసేయు రూ. ఎడలుసేయు. స.క్రి. 1. దూరంచేయు, ఎడబాపు. భార.ఆది. 6.142; 2. తిరస్కరించు. భాగ. 3.868; 3. భేదంకలదిగా చేయు. <ఎద[1](న్)+చేయు. ఎదసొచ్చు అ.క్రి. ప్రవేశించు, పైబడు. భాగ. 6.90.

ఎద[2] రూ.చూ. ఎదఁద. వి. హృదయం. భార.ఆది. 5.116. నిర్వ.రా. 8.73.

క. ఎర్దె. మనస్సు.

ఎద[3] రూ. ఎదమ, ఎర్మ, ఎల[2]. చూ. ఎదము. విశ. ఎదమ. కు.సం. 3.248, పండి.చ. 2 పు. 132 పం., శివరా. 4.38.

క. ఎడ. ఎదమ, ఎదమప్రక్క; కొడ. ఎథతె. ఎదమ; తు. ఎడత్తు, ఎదమప్రక్క; త.మ. ఇటమ్. కోట. ఎడ్, ఎడమ; తొద. ఒథ్; పో.చూ. గోం. డావా. ఎదమ; పో.చూ. కుఇ. దెబ, దెబె, దెబొ; పో.చూ. కువి. ౡెబ, ౡెబి. పో.చూ. పర్జి. దె్ౘబి; కొలా. ఎడమకెయి. ఎదమ చేయి; పో.చూ. నా. దావ.

ఎదకాలు రూ. ఎదమకాలు. వి. వామపాదం. కు.సం. 3.248, పండి.చ.పరా. 132 పు., ఉ.హరి. 3.65.

ఎద[4] వి. ఒకరకం గడ్డి. ప్రబంధ. 200.

ఎద[5] రూ.చూ. ఎల[1]. విశ. లేత. కేయూర. 4.50.

ఎదనీరు రూ.చూ. ఎలనీరు. వి. లేతకొబ్బరికాయలోని నీరు. ఆము. 1.81.

ఎద[6] వి. గ్రామ దేవతలకు నైవేద్యంగా పెట్టే వంటకం.

ఎద[7] వి. డబ్బు. మల్హ. 2.81.

ఎదకట్టు చూ. ఎద[1](న్).

ఎదకడ చూ. ఎద[1](న్).

ఎదకడవాఁడు చూ. ఎదకడ.

ఎదకత్తియ చూ. ఎద[1](న్).

ఎదకత్తె చూ. ఎద[1](న్).

ఎదకాఁడు చూ. ఎద[1](న్).

ఎదకారు చూ. ఎద[1](న్).

ఎదకార్తె చూ. ఎద[1](న్).

ఎదకాలు చూ. ఎద[3].

ఎదకాల్వ చూ. ఎద[1](న్).

ఎదగడ్డ చూ. ఎద[1](న్).

ఎదగర వి. శ్రమ.

పో.చూ. క. అట. అలసట, బడలిక; పో.చూ. త. ఇళై. అలసటచెందు, శత్రువుముందు లొంగిపోవు, శక్తి హీనుడగు. ఇళేక్కయ్. అలసట, స్పృహకోల్పోవటం.

ఎదగరపడు అ.క్రి. శ్రమపడు, అలయు. భార.సౌప్తి. 1.60.

ఎదగరపడు చూ. ఎదగర.

ఎదగరి పో.చూ. ఎద[1](న్). వి. చలికాలపు వరిపంట.

ఎదగల రూ. ఎదగాల, ఎడిగల. వి. విభాగం, వేరు.

ఎదగలగాఉండు అ.క్రి. తొలగి ఉండు.

ఎదగలగాఉండు చూ. ఎదగల.

ఎదగాల రూ.చూ. ఎదగల. వి. వేరు, విభాగం.

ఎదగిలియుండు చూ. ఎద[1](న్).

ఎదగిలు చూ. ఎద[1](న్).

**ఎదగిల్లు** చూ. ఎద[1](న్).
**ఎదగుంటక** చూ. ఎద[1](న్).
**ఎదగొమ** చూ. ఎద[1](న్).
**ఎదగొప్ర** చూ. ఎద[1](న్).
**ఎద(జెందు** చూ. ఎద[1](న్).
**ఎద(జేయు** చూ. ఎద[1](న్).
**ఎదట్టు** రూ.చూ. ఎదబెట్టు. వి. ఒకరకం నాణెం.
**ఎదతా(కు** చూ. ఎద[1](న్).
**ఎదతాపీ** పో.చూ. ఎద[1](న్). వి. కట్టుబడిలోవాడే మందపాటి రేకు గల కొంచెం పెద్ద సైజు తాపి.
**ఎదతీయు** చూ. ఎద[1](న్).
**ఎదతెగు** చూ. ఎద[1](న్).
**ఎదతెంపి** చూ. ఎద[1](న్).
**ఎదతెరిపి** చూ. ఎద[1](న్).
**ఎదతెర్పి** చూ. ఎద[1](న్).
**ఎదతెలుపి** చూ. ఎద[1](న్).
**ఎదత్రవ్వ** చూ. ఎద[1](న్).
**ఎదత్రెచ్చు** చూ. ఎద[1](న్).
**ఎదత్రోవకావరి** చూ. ఎద[1](న్).
**ఎదదవ్వ** చూ. ఎద[1](న్).
**ఎదదూడ** చూ. ఎద[1](న్).
**ఎదవాడు** చూ. ఎద[1](న్).
**ఎదనీరు** చూ. ఎద[5].
**ఎదవెద** చూ. ఎద[1](న్).
**ఎద(ద** రూ. ఎద[2], ఎద్ద, ఎద్ద, ఎద[1]. వి. **1.** మనస్సు. భార. విరా. 2.86, శాంతి. 1.35 ; **2.** హృదయం. ఉ.రా. 4.203 ; **3.** రొమ్ము. చంద్రా. 1.84.

క. ఎదె, ఎద్దె, ఎర్దె. హృదయం, రొమ్ము, ధైర్యం. ఎదెగాఱ. ధైర్యశాలి ; తు. ఎదె. హృదయం, రొమ్ము, గుండె. పో.చూ. త. ఇతయమ్. గుండె ; ఇరుతయమ్. గుండె, హృదయం ; కోట. ఎద్. చెట్టుమ్రాను, ధైర్యం ; ఎద్ మర్. రొమ్ము ; కొద. ఎథ్ య్. ధైర్యం ; పర్జి. ఎద్ రమ్, ఎద్ రామ్. రొమ్ము ;

పో.చూ. సం. హృదయ. గుండె, ఆత్మ. మనస్సు. మహా. ప్రా. హిఅయ ; అప. హిఅడ. హృదయం, మనస్సు, రొమ్ము.

**ఎద(దవచ్చు** అ.క్రి. బుద్ధిపుట్టు, ఇష్టమగు. కలుశ. 85.
**ఎద(దవచ్చు** చూ. ఎద(ద.
**ఎదవక** చూ. ఎదవు.
**ఎదవడు** చూ. ఎద[1](న్).
**ఎదవ(దదవ** చూ. ఎదము.
**ఎదవరి** చూ. ఎదవు.
**ఎదపిల్ల** చూ. ఎద[1](న్).
**ఎదవు** చూ. ఎద[1]. ఎదయు. వి. అభావం, లేమి. కు.సం. 10.557 ; స.క్రి. **1.** విడుచు. భార.ఆది. 4.182, విరా. 3.21 ; **2.** విఘాతం పొందించు, విఘ్నంపొందించు. భారా. 1.621, బసవ. 3 పు. ; **3.** తప్పించు, మాన్పు. జై.భా. 4.73 ; **4.** తొలగించు. హంస. 5.242 ; **5.** క్షీణింపజేయు. నశింపజేయు.

**ఎదవక** క్రి. విణ. **1.** భేదం లేకుండ. భార.ఆది. 7.40 ; **2.** విలంబం చేయక, ఆలస్యం చేకుండ. హరి.పూ. 4.115 ; **3.** ఎడయక, దూరం కాకుండ. వసు. 2.133 ; **4.** తప్పక, అవశ్యం. చెన్నబ. 3.164 ; **5.** అవిచ్ఛిన్నంగా, నిరంతరం. నీలా. 1.108. **ఎదవరి** వి. ఎకదాషనది. పండి.చ. 2.116 పు.

**ఎదవుచ్చు** చూ. ఎద[1](న్).
**ఎదపెట్టు** చూ. ఎద[1](న్).
**ఎదపెద** క్రి. విణ. అటుఇటు.
**ఎదపోవు** చూ. ఎద[1](న్).
**ఎదప్రొద్దు** చూ. ఎద[1](న్).
**ఎదబిడ్డ** చూ. ఎద[1](న్).
**ఎదబెట్టు** రూ. ఎదట్టు, ఎబెట్టు[1]. వి. దీనారభేదం, ఒకనాణెం. ఆం.భా. 2.274.

త. ఇడైవెట్టు (-ప్-పణమ్). కత్తిరించబడిన లేదా సరిగా ముద్రింపబడని నాణెం. వెట్టు. చెక్కు, కత్తిరించి వేయు. వి. పురాతనకాలపు చిన్న నాణెం.

**ఎడమ** రూ.చూ. ఎద[3]. వి. వామభాగం. భీమ. 5.130, ఆము. 5.38, నీలా. 3.15 ; విణ. ఎడమ, దాపలి.

**ఎడమకాలు** రూ.చూ. ఎదకాలు. వి. వామపాదం. **ఎడమకుడి** వి. **1.** కొంత మంచి, కొంత చెడ్డ ; **2.** స్వల్ప భేదం. అర్థవిపరి. **ఎడమచేయిచూపు** అ.క్రి. **1.** దబ్బు ఎగకొట్టు; **2.** సాయం నిరాకరించు. అర్థవిపరి. **ఎడమపెనపెట్టు** అ.క్రి. ఎడమవైపునకు పెనవేయు, వ్యతిరేకం చేయు. వ్యు. తాళ్లు పేనేటప్పుడు మామూలుగా కుడివైపుకు పెనవేస్తారు, దానికి వ్యతిరేకంగా ఎడమకు పెనవేయటం. ప్రబోధ. 1.81. **ఎడమపెనవా(డు** వి. ఇతరులతో కలసిమెలసి ఉండనివాడు. అర్థవిపరి. **ఎడమబడు** రూ. ఎద్మబడు. **ఎడమవాదాడి** వి. మగ్గం చట్రం కింద, ఎడమవైపు పల్లపు చోటు. అ.క్రి. కొరవడు.

**ఎడమకాలు** చూ. ఎడమ.
**ఎడమకుడి** చూ. ఎడమ.
**ఎడమచేయిచూపు** చూ. ఎడమ.
**ఎడమడుగు** రూ. ఎడమడుపు. విణ. **1.** విపరీతం, విరుద్ధం. భార.ఆది. 4.100, హరి.ఉ. 10.233 ; **2.** నిజాయితీ లేని, కుటిలమైన. హరి.పూ. 1.83 ; **3.** వ్యత్యస్తం, తారుమారు. వి. **1.** అభ్యంతరం, ఆటంకం. బసవ. 3.368 ; **2.** ఆలస్యం. బసవ. 3.434 ; **3.** భేదం. భాగ. 10 పూ. 202, పద్మ. 4.180.

<ఎడమ + అడుగు[1]. వ్యు. ఎడమపాదం.

**ఎడమడుగువరువడి** వి. మల్లబంధ విశేషం. వ్యు. వామపాద ప్రక్రమం. హంస. 1.206.

**ఎడమడుగువరువడి** చూ. ఎడమడుగు.
**ఎడమడువు** రూ.చూ. ఎడమడుగు. విణ. విపరీతం, విరుద్ధం. భార.ఉద్యో. 9.214. వి. ఆలస్యం. హరి.పూ. 9.87.
**ఎడమంద** చూ. ఎద[1](న్).
**ఎడమపెనపెట్టు** చూ. ఎడమ.

**ఎడమపెనవాఁడు** చూ. ఎడమ.

**ఎడమబడు** చూ. ఎడమ.

**ఎడమయోరభృంగి** వి. మల్లబంధ విశేషం. ప్రబంధ. 75.

**ఎడమవాదాడి** చూ. ఎడమ.

**ఎడమిచ్చు** చూ. ఎడము.

**ఎడము** చూ. ఎడ[1]. వి. **1.** మధ్యభాగం. భార.విరా. 1.162, హర. 6.101 ; **2.** విరామం. తెరపి. భార.ఆర. 5.308, యయా. 86 ; **3.** గడువు. వేంక. పంచ. 1.84 ; **4.** విచ్ఛేదం. తెంపు. నీలా. 2.98 ; **5.** దూరం. వేం.మా. 6.12 ; స.క్రి. ఆక్రమించుకొను. ఉ.హరి. 3.24.

క. ఎడతర. మధ్యరకం ; ఎడ. మధ్య ; తు. ఇడెతర. మధ్య రకం. తక్కువ రకం ; త. ఇతమ్. అవకాశం, హద్దు. ఎడల్పు. దూరం. పో.చూ. మ. ఇటయాల్. మధ్య మనిషి, మధ్యవర్తి.

<మూ.ద్రా. *ఎట్-.

ఎడపేఁదడప రూ. అడపరదప, అడపాతడపా, అడపా దడపా. క్రి.విశే. అప్పుడప్పుడు. కాశీ. 4.85. వేంక. పంచ. 1.434. ఎడమిచ్చు అ.క్రి. అవకాశమిచ్చు. <ఎడము + ఇచ్చు. ఎడముకొను అ.క్రి. **1.** అవకాశం కల్గించుకొను, తెరపి చేసుకొను. కళా. 3.266 ; **2.** ఆక్రమించుకొను. ఉ.హరి 3.24.

**ఎడముకొను** చూ. ఎడము.

**ఎడఁబడు** చూ. ఎడ[1](న్).

**ఎడఁబాటు** చూ. ఎడ[1](న్).

**ఎడఁబాపు** చూ. ఎడ[1](న్).

**ఎడఁబాయు** చూ. ఎడ[1](న్).

**ఎడయగు** చూ. ఎడ[1](న్).

**ఎడయాడు** చూ. ఎడ[1](న్).

**ఎడయిక** చూ. ఎడయు.

**ఎడయించు** చూ. ఎడయు.

**ఎడయు** చూ. ఎడ[1]. స.క్రి. విడుచు, త్యజించు. హరి.పూ. 9.147. అ.క్రి. **1.** విముఖమగు, మనసు విరుగు. ప్రభా. 5.166 ; **2.** క్షీణించు, నశించు. నా. పంచ. 1.70 ; **3.** చెడు, భగ్నమగు. శుక. 2.153 ; **4.** సంబంధంలేక పోవు, దూరమగు, తొలగు. శుక. 3.479.

క. ఎడ, ఎడె. చోటిచ్చు, విరామం ; తు. ఇడె, ఎడె ; త. ఇడై. చోటిచ్చు, వెనుకకు తగ్గు ; మ. ఇటక్క. చోటును వెడల్పుచేయు ; ఇట. మధ్యచోటు ; ఇటమ్ ; కుఇ. ఎస్ప ; మాల్తో. ఎడర్. ఏకాంతంగా ఉండు ; ఎడ్ర్త్. వేరుచేయు, తొలగించు.

మూ.ద్రా. *ఎట్-అ. <మూ.ద్రా. *ఎట్. భగ్న మగు.

ఎడయిక వి. ఎడబాటు, వియోగం. ఎడయించు స.క్రి. ఖండించు, నరుకు. భాగ. 6.370.

**ఎడయెడముగా(న్)** చూ. ఎడ[1](న్).

**ఎడరు**[1] అ.క్రి. విరుగు, భగ్నమగు. భార. ఆర. 1.198. వి. **1.** భంగం, అవమానం. భార. ఉద్యో. 1.348 ; **2.** అశుభం, కీడు. భార. శాంతి. 6.309 ; **3.** సరైన సమయం, సందు. భా.రా. 6.2253, భాగ. 8.27, పాండు. 3.72 ; **4.** ఆపద, కష్టం. శివరా. 3.87.

క. ఎడర్, ఎడరు, ఇడరు, ఇడురు, ఇర్డు. నూటి, ఇబ్బంది, అడ్డంకి, విఘ్నం ; త. ఇటర్. దుఃఖం, బాధ, కష్టం, దారిద్ర్యం ; ఇటుఱు. దుఃఖపడు, కష్టపడు ; మ. ఇటర్. అడ్డంకి, ఆటంకం, బాధ, దుఃఖం.

<మూ.ద.ద్రా. *ఎట్ + అర్.

**ఎడరు**[2] రూ.చూ. ఎడారి. వి. ఎడారి.

**ఎడఱు** స.క్రి. నిరోధించు, ఎదిరించు. పాండురంగని ధర్మవరం శాసనం. క్రీ.శ. 897.

క. ఇడఱు, ఎడఱు. ఎదుర్కొను, కాలుతప్పివేయు ; ఎడవ్ర, ఎడవు. కాలుతొక్కి పడేట్లుచేయు ; ఎడహు. తప్పుచేయు ; తు. ఎట్టుని. ఎదుర్కొను, కాలుతప్పివేయు ; త. ఇటుఱు (ఇటుఱ్-). ఎదుర్కొను, కాలుతొక్కిపడ వేయు, తన్ను, అడ్డగించు, నిరోధించు. వి. అడ్డంకి ; మ. ఇటుఱుక. ఎదుర్కొను, నడకతడబడు, సంకోచించు.

**ఎడల(న్)** పో.చూ. ఎడ[1]. అవ్య. **1.** విషయాన. శృం.నై. 2.57 ; **2.** పక్షాన. దశా. 3.13.

**ఎడలించు** చూ. ఎడలు.

**ఎడలు** చూ. ఎడ[1]. స.క్రి. విడుచు, వదిలిపెట్టు. భార. భీష్మ. 2.18. అ.క్రి. **1.** రాలు, కిందపడు. కు.సం. 4.445 ; **2.** వదలు, సడలు. భార. భీష్మ. 2.137 ; **3.** తగ్గు, కృశించు. భార. ఉద్యో. 1.228 ; **4.** చెడు. భార. ఉద్యో. 4.278, భోజ. 4.224 ; **5.** వికలమగు, చెదరిపోవు. భార. శల్య. 2.33 ; **6.** పగులు, బద్దలగు. భార. స్త్రీ. 1.34 ; **7.** చచ్చు. భార. అను. 2.402 ; **8.** విచ్ఛిన్న మగు. భార. అశ్వ. 3.170 ; **9.** తొలగు, అవసరిల్లిపోవు. శృం.నై. 6.67 ; **10.** లేకపోవు. ఆము. 6.69 ; **11.** దూరమగు. చంపూ.రా. 4.74.

త. ఇటు. త్రోయు, భగ్నంచేయు ; మాల్తో. ఎడర్. ఏకాంతంగా ఉండు ; ఎడ్ర్త్. విభజించు, తొలగించు.

తెలుగులోనే-అల్ పరప్రత్యయంగా ఉంది.

**ఎడలించు** స.క్రి. **1.** వెలివుచ్చు, వెల్లడించు, బయట పెట్టు, విడుచు, త్యజించు. భాగ. 8.318 ; **2.** భగ్నం చేయు. జై.భా. 1.98 ; **3.** విసర్జించు. హరి.పూ. 7.136, పారి. 5.18 ; **4.** తొలగించు. మను. 3.28 ; **5.** వదల్చు. ఆము. 1.67 ; **6** చిక్కుతీయు. ఆము. 1.62 ; **7.** పోగొట్టు, నశింపజేయు. కాశి. 3.125 ; **8.** తీయు, తెరచు. శుక. 3.333 ; ఎడలుచు రూ. ఎడల్చు. స.క్రి. ఊడ్చు, ఊడదీయు, తొలగించు. ఘటి. 2.153, చిత్ర.భా. 4.3. ఎడలువాపు స.క్రి. వేరుచేయు, ఎడబాపు. బ్రహ్మో. 3.51. <ఎడలు + పాపు. ఎడలుసేయు రూ.చూ. ఎడసేయు. స.క్రి. వేరుచేయు, ఎడబాపు. కవిరాజ. 5.241. <ఎడలు + చేయు. ఎడల్చు రూ.చూ. ఎడలుచు. స.క్రి. **1.** వదల్చు. కళా. 5.113 ; **2.** తీయు. కళా. 3.122 ; **3.** తొలగించు, ఊడదీయు. చిత్ర.భా. 3.33, కువచ. 1.88.

**ఎడలుచు** చూ. ఎడలు.

**ఎడలువాపు** చూ. ఎడలు.
**ఎడలుసేయు** చూ. ఎడలు.
**ఎడల్చు** చూ. ఎడలు.
**ఎడవడు** చూ. ఎడ[1](న్).
**ఎడవల** చూ. ఎడ[1](న్).
**ఎడవాఁడు** చూ. ఎడ[1](న్).
**ఎడవాపులు** చూ. ఎడ[1](న్).
**ఎడవారు** చూ. ఎడ[1](న్).
**ఎడవిడివడు** చూ. ఎడ[1](న్).
**ఎడవు** చూ. ఎడ[1]. విశ. దవ్వు, దూరం. ఆము. 6.18; వి. ఎడారి, మరుదేశం, నిర్జలప్రదేశం. ఆము. 4.53.
త. ఇటుమ్. దూరం; ఇటువై. మార్గం.
**ఎడవెట్టు** చూ. ఎడ[1](న్).
**ఎడవొలము** చూ. ఎడ[1](న్).
**ఎడవోవు** చూ. ఎడ[1](న్).
**ఎడసమ** చూ. ఎడ[1](న్).
**ఎడసంది** చూ. ఎడ[1](న్).
**ఎడసాల** చూ. ఎడ[1](న్).
**ఎడమంకము** వి. దేవుని పూజా ద్రవ్యాలతో బాటు ఇచ్చే సుంకం. క్రీ.శ. 1107.
క. ఎడె. నైవేద్యం, ఆహారం, అన్నం; ఎడెకాస. నైవేద్యంతోపాటుగా దైవానికి అర్పించే డబ్బు.
సం. ఇడ్-. దేవుని తృప్తికోసం బలియిచ్చిన దానిపైన పోసే మత్తుపానీయం.
**ఎడసేయు** చూ. ఎడ[1](న్).
**ఎడసొచ్చు** చూ. ఎడ[1](న్).
**ఎడాటము** చూ. ఎడ[1]. వి. **1.** విషయం. భీమ. 2.88, సారంగ. 2.11; **2.** భేదం, ప్రణయకోపం. అహల్యా. 3.7; **3.** క్రీడ, విలాసం.
త. ఇడై-య్-అట్టమ్. విషయం, వ్యవహారం, వ్యాపారం.
**ఎడారి** రూ. ఎడరు[2], ఎడారు. వి. **1.** నిర్జలప్రదేశం. శేష. 2; **2.** బహిరంగ ప్రదేశం; **3.** ఒంటరికోటు; **4.** అడవి.
త. ఎటూర్ (<తె). మైదానం, పొలం; పో.చూ. అరిడై. దుర్గమమైన లేదా మిట్టపల్లాలతోవ.
**ఎడారిమొక్కలు** వి. బవ. ఎడారిలో మొలిచే మొక్కలు.
**ఎడారిమొక్కలు** చూ. ఎడారి.
**ఎడారు** రూ.చూ. ఎడారి. వి. నిర్జల ప్రదేశం.
**ఎడారె** వి. చెప్పులు కుట్టే ఆరె.
**-ఎడి** రూ.చూ. ఎడు. ప్రత్య. తద్ధర్మాద్యర్థక ప్రత్యయం. భాగ. 1.18.
**ఎడిగల** రూ.చూ. ఎడగల. వి. వేరు.
**ఎడిగలబోవు** అ.క్రి. వేరుపడు.
**ఎడిగలబోవు** చూ. ఎడిగల.
**ఎడివ** చూ. ఎడ్డియ. వి. మొరటువాడు.
**ఎడివి** చూ. ఎడఋ. వి. తట్టుకొనిపడటం.
క. ఎడవ్వు. వి. కాలు తట్టుకొనిపడటం, తట్టుకొనటం.
<క. ఎడవు.

**-ఎడు** రూ. -ఎడి. ప్రత్య. **1.** భవిష్యదర్థకం. భార. ఆది. 2.137; **2.** భూతార్థకం. భార. ఆది. 2.215, శల్య. 1.232; **3.** తద్ధర్మాద్యర్థక ప్రత్యయం. భార. ఆది. 3.149; **4.** ఆశీరర్థకం. భార. ఆది. **3.169**; **5.** శాపాన్ని తెలిపేది. భార. ఆది. 4.229.
త. -ఎడు. పూనుకొను.
**ఎడుపు** రూ. ఎదము. స.క్రి. ఎదంచేయు.
**ఎడుపుగూడు** వి. చౌకంగూడు, నలుపలకలుగా ఉండే గూడు. **ఎడుపువేయు** స.క్రి. పలుచగా ఉన్న పైరులో నడుమ నడుమ పైరునాటి ఒత్తుచేయు.
**ఎడుపుగూడు** చూ. ఎడుపు.
**ఎడుపువేయు** చూ. ఎడుపు.
**ఎడ్కగోత్రము** చూ. సెట్టి. వి. వైశ్య కులగోత్రం. క్రీ.శ. 1154.
సం. శ్రేష్ఠిన్, శ్రేష్ఠీ. ఉత్తముడు; ప్రా. సెట్ఠీ. గ్రామ ముఖ్యుడు; సెట్ఠి. వర్తకుడు, ఉత్తముడు.
త. ఎట్టి. వైశ్యులలో ఉత్తములైనవారికి రాజు ప్రసాదించే బిరుదం, వైశ్యకులం.
**ఎడ్డ** రూ.చూ. ఎడఁద; వి. హృదయం, మనస్సు. భార.ఆది. 5.15, శాంతి. 3.268.
**ఎడ్డముల్లు** వి. హృదయశల్యం, ఉపద్రవం. భారా.యు. 433. **ఎడ్డవగచు** అ.క్రి. మిక్కిలి దుఃఖించు. భాగ. 4.570.
**ఎడ్డమి** రూ.చూ. ఎడ్డము. వి. **1.** ఆపద, దురదృష్టం, కీడు, ఉపద్రవం. విష్ణుపు. 5.102; **2.** అవివేకం, బుద్ధి మాంద్యం.
<ఎడ్డము + ఇ.
**ఎడ్డము** రూ. ఎడ్డమి. చూ. ఎదరు. పో.చూ. అడ్డము. వి. **1.** ఇబ్బంది. భీమ. 2.116; **2.** అడ్డం, నిరోధం. భాగ. 8.467.
క. ఎడ్డ, అడ్డ. నిరోధం. అడ్డంకి.
**ఎడ్డముల్లు** చూ. ఎడ్డ.
**ఎడ్డవగచు** చూ. ఎడ్డ.
**ఎడ్డి** రూ.చూ. ఎడ్డియ. విశ. **1.** అప్రస్తుతం, అసందర్భం; **2.** మోటు; **3.** మురికి; **4.** చెడ్డ.
**ఎడ్డిమాట** వి. అసందర్భ ప్రసంగం. హర. 7.67.
**ఎడ్డిగిజ్జడి** వి. కల్లుతాగే తాటాకు దొన్నె.
**ఎడ్డిమడ్డి** రూ.చూ. ఎడ్డెమడ్డె. విశ. మొరటు.
**ఎడ్డిమాట** చూ. ఎడ్డి.
**ఎడ్డియ** రూ. ఎడ్డి, ఎడ్డె. వి. మూర్ఖుడు, బుద్ధిహీనుడు.
క. హెడ్డ, ఎడ్డె. స్తబ్ధుడు; త. ఎట్టుణ్. (<తె). మూర్ఖుడు, బుద్ధిహీనుడు.
పో.చూ. సం. హీడ. కోపం, ఆవేశం, ద్వేషం, తిరస్కారం.
<క. ఎడ్డ.
**ఎడ్డు** రూ.చూ. ఎద్దు. వి. ఎద్దు.
**ఎడ్డె** రూ.చూ. ఎడ్డియ. వి. మూర్ఖుడు, విరసుడు, మోటువాడు. ఉ. హరిశ్చ. 4.12, అహల్య. 3.14; విశ. **1.** ముతుక, మోటు. శుక. 2.362; **2.** అసహ్యమైన.

ఎడ్డె(డు వి. మూర్ఖుడు. శుక. 1.438. ఎడ్డెతనము వి. మూర్ఖత్వం, బుద్ధిహీనత. ఎడ్డెమడ్డె రూ. ఎడ్డిమడ్డి. విశే. మొరటు. ఎడ్డెవా(డు వి. మూర్ఖుడు, బుద్ధిహీనుడు. వేమన. 2.68.

ఎడ్డె(డు చూ. ఎడ్డె.

ఎడ్డెతనము చూ. ఎడ్డె.

ఎడ్డెన వి. భోజన పాత్రలు పెట్టుకునే ఎత్తుపీట. శృం.నై. 6.108, జై.భా. 8.202.

మరా. అడ్ణీ. ముక్కాలిపీట.

క. అడ్డణిగె. ముక్కాలిపీట. మెట్లు కలిగి నిచ్చెనవలె పనికివచ్చే ఎత్తైన ముక్కాలిపీట.

ఎడ్డెమడ్డె చూ. ఎడ్డె.

ఎడ్డెవా(డు చూ. ఎడ్డె.

ఎడ్ద రూ.చూ. ఎద(ద. వి. హృదయం, మనస్సు. భాం.ఆది. 5.15, శాంతి. 3.268.

ఎడ్మ రూ.చూ. ఎడ[3]. వి. ఎడమటి. పాండు. 2.108.

ఎడ్మబడు రూ.చూ. ఎడమబడు. అ.క్రి. కించపడు, తక్కువయగు. పాండు. 2.108.

ఎడ్మబడు చూ. ఎడ్మ.

ఎడ్లగుంపు చూ. ఎడ్లు.

ఎడ్లచెలికకాంపు చూ. ఎడ్లు.

ఎడ్లబండి చూ. ఎడ్లు.

ఎడ్లమోట చూ. ఎడ్లు.

ఎడ్లు ఏ.వ. ఎద్దు. రూ. ఎళ్లు. వి. బ.వ. 1. వృషభాలు, ఎద్దులు. భార.విరా. 4.349, హరి.పూ. 6.21 ; 2. ఆవులు లేక గొర్రెలు. పాలిచ్చే ఆడ జంతువులేవైనా.

ఎడ్లగుంపు వి. పశువుల మంద. ఎడ్లచెలికకాంపు వి. వ్యవసాయానికి అనువైన భూమి, ఎడ్లచే దున్నింపబడే భూ సేద్యం. ఎడ్లబండి వి. ఎద్దులబండి. ఎడ్లమోట వి. ఎడ్లచే లాగించే మోట.

ఎణుంబొది రూ.చూ. ఎను(బది. వి. ఎనబై.

ఎంటవ వి. ముంగిసజాతి జంతువు.

ఎంటి రూ.చూ. వెంటి. వి. 1. గడ్డితో పేనిన తాడు ; 2. వడి దిప్పి చుట్టిన నూలు ; 3. అచ్చుతకిన తరవాత చుట్టబెట్టిన పడుగు నూలు ; 4. చుట్టచుట్టిన పడుగు నూలు.

ఎంటిగట్టు అ.క్రి. నరిచేసిన పడుగునూలు చుట్టివేయు. ఎంటిచుట్ట రూ. ఎంటిచుట్టు. అ.క్రి. నరిచేసిన పడుగు చుట్టి వేయు. ఎంటిచుట్టు రూ.చూ. ఎంటిచుట్ట.

ఎంటిగట్టు చూ. ఎంటి.

ఎంటిచుట్ట చూ. ఎంటి.

ఎంటిచుట్టు చూ. ఎంటి.

ఎంటిబద్ద రూ.చూ. వింటిబద్ద. వి. అచ్చు పెంకును కోయ డానికి కుమ్మర్లు వాడే విల్లువంటి సాధనం.

ఎంటిలేటరు రూ.చూ. వెంటిలేటరు. వి. గాలి కిటికీ, వెలుతురు కోసం గాలికోసం గోడల్లో ఎత్తున పెట్టిన చిన్నకిటికీ.

ఎంటు రూ.చూ. వెంటి. వి. 1. వరిగడ్డితో ఒక పురిగా పేనిన మోకు ; 2. వడితిప్పి చుట్టిన నూలు.

ఎంటె రూ.చూ. వెంటె. వి. 1. చెరుకుగడల ఆకులకు పెనవేసే తీడు ; 2. వడితిప్పి చుట్టిన నూలు.

ఎంటెచుట్టు అ.క్రి. నరిచేసిన పడుగు చుట్టివేయు.

ఎంటెచుట్టు చూ. ఎంటె.

ఎంట్రకాయ చూ. ఎండ్రి. వి. పీత.

ఎంట్రికె రూ.చూ. ఎండ్రి. వి. పీత.

ఎంట్రుక[1] రూ.చూ. ఎండ్రిక. వి. పీత.

ఎంట్రుక[2] రూ.చూ. వెండ్రుక. వి. కేశం.

ఎండ వి. సూర్యకాంతి, ఆతపం. భార.ఆశ్ర. 1.143.

పో.చూ. తు. బెంబు. బొంబు. సూర్యకాంతి ; త. ఎన్ఱూత్. వేసవి, సూర్యకాంతి, సూర్యుడు, ఎన్ఱు. సూర్యుడు, ఎల్. సూర్యుడు, కాంతి, సూర్యకాంతి, ఎల్లి. సూర్యుడు. పగలు ; గోం. ఎద్ది, అద్ది. సూర్యుని వేడి. కువి. ఎస్క. దప్పిక ; పర్జి. నెన్డి, నెండి. సూర్యకాంతి, వేడి ; పో.చూ. కురు. ఐద్.-ఐదొయ్. వేచు, కాల్చు, నేరే-. ఎండించు ; పో.చూ. మాల్తో. ఎథ్యె-ఎథ్చె. ధాన్యం వేచు, నేరే. ఎండించు.

ఎండకన్నెరుగనివా(డు వి. సుఖజీవి. కష్టమెరుగనివాడు. ఎండకారు వి. వేసవికాలం. ఎండకాలము వి. వేసవి. ఎండ గట్టు స.క్రి. 1. వస్త్రాన్ని ఎండలో ఆరగట్టు ; 2. శుష్కింప జేయు, నిర్ద్రవంచేయు. < ఎండ + కట్టు[1]. ఎండగాలి వి. వేడి గాడుపు. ఎండగుంజు అ.క్రి. పడుగు ఆరుతుండగా కుంచెతో గుంజు. ఎండగొట్టు < ఎండ + కొట్టు[1]. వి. ఎండదెబ్బ, వడ దెబ్బ. రాజ.వా. 2.69. స.క్రి. నీరులేక ఎండిపోవునట్లుచేయు. ఎండచాటుపట్టువు వి. గొడుగు. వ్యు. ఎండనుండి కాపాడు సాధనం. వేంక.స్తా. 84. ఎండతాలు వి. వానలు బాగా కురవకపోవటంవల్ల తాలు గింజపడటం. ఎండదొర వి. సూర్యుడు. శేష. 2. ఎండనీరు వి. ఎండమావి. వ్యు. ఎండ తీక్ష్ణంగా ఉన్నప్పుడు మైదానంమీద దూరంగా నీరులాగా కన్పించే ఆవిరి. ఎండపసుపు వి. ఎండ తగలటంవల్ల వస్తువుల పైన ఏర్పడే పసుపురంగు. ఆము. 6.62. ఎండపెట్టు[1] వి. వడదెబ్బ. ఎండపెట్టు[2] స.క్రి. ఎండలోపెట్టు, ఎండించు. ఎండపెట్టురోగం వి. వడదెబ్బ. ఎండపొద్దు వి. మధ్యాహ్నం. ఎండమఱువు వి. గొడుగు. సా.ని. 3.62. ఎండమావులు వి. మృగతృష్ణలు. వ్యు. సూర్యకాంతి + గుట్టాలు ; పరిగెత్తే గుట్టాల్లాగా కన్పించే సూర్యకాంతి. భార.ఆది. 5.159, కు.సం. 8.135. ఎండబ(డు (-పడు) అ.క్రి. 1. ఎండ తగులు, వడదెబ్బ తిను. కాశీ. 2.81 ; 2. పొద్దెక్కు. ఎండతేడు వి. సూర్యుడు. వ్యు. ఎండకు మూలం. ప్రభువు. సిం.ద్వా. 1.253. ఎండవడు ఎండ + పడు. అ.క్రి. ఎండలో ప్రయాణంచేయు. గంధ. 66. ఎండవేయు స.క్రి. ఎండలోపెట్టు.

ఎండకన్నెరుగనివాడు చూ. ఎండ.

ఎండకారు చూ. ఎండ.

ఎండకాలము చూ. ఎండ.

ఎండగట్టు చూ. ఎండ.

ఎండగాలి చూ. ఎండ.

ఎండగుంజు చూ. ఎండ.

ఎండగొట్టు చూ. ఎండ.

ఎండచాటుపుట్టువు చూ. ఎండ.
ఎండఁజేయు చూ. ఎండు[1].
ఎండతాలు చూ. ఎండ.
ఎండదొర చూ. ఎండ.
ఎండనీరు చూ. ఎండ.
ఎండపసుపు చూ. ఎండ.
ఎండపెట్టు[1] చూ. ఎండ.
ఎండపెట్టు[2] చూ. ఎండ.
ఎండపెట్టురోగం చూ. ఎండ.
ఎండపొద్దు చూ. ఎండ.
ఎండమఱువు చూ. ఎండ.
ఎండమావులు చూ. ఎండ.
ఎండబదు చూ. ఎండ.
ఎండఁబాఱు చూ. ఎండు[1].
ఎండఁబెట్టు చూ. ఎండు[1].
ఎండఁబోయు చూ. ఎండు[1].
ఎండవేఁడు చూ. ఎండ.
ఎండవ చూ. ఎండ. వి. ధాన్యాదులను ఎండబెట్టే పర్యాయం.
ఉదా. రెండు ఎండవలైనవి.
ఎండవేడు చూ. ఎండ.
ఎండవేయు చూ. ఎండ.
ఎండాకు చూ. ఎండు[1].
ఎండి రూ.చూ. ఎండ్రి. వి. పీత.
ఎండించు చూ. ఎండు[1].
ఎండిపోయిన చూ. ఎండు[1].
ఎండిపోవు చూ. ఎండు[1].
ఎండు[1] చూ. ఎండ. అ.క్రి. 1. ఎండిపోవు, నిర్ద్రవమగు, నీరసమగు, నిస్సారమగు. కాశ. 1.123, తై.శా. 7.210; 2. కృశించు.
ప్రో.చూ.తు. దెంబు, దొంబు. ఎండ; త. ఎన్ఱూల్. ఎండ, సూర్యుడు, ఎన్ఱు. సూర్యుడు; ఎల్. సూర్యుడు, కాంతి, ఎండ; ఎల్లి. సూర్యుడు, పగలు, కుఇ. ఏస్కి. దప్పి; కువి. ఎస్కి. ప్రో.చూ. కురు. ఇడ్- (ఇడి-). వేచు, కాల్చు; నేర్. ఎండించు. ప్రో.చూ. మాల్తో. ఎడి-, ఎడ్చ్. ధాన్యము వేచు, వండు; నేర్. ఎండించు.
<మూ.ద్రా. *ఎన్-ఓ *<ఎల్- *ఎల్-న్త్.
ఎండఁజేయు స.క్రి. ఎండించు. ఎండఁబాఱు అ.క్రి. ఎండిపోవు. మను. 3.129. ఎండఁబెట్టు స.క్రి. ఎండించు. ఎండఁబోయు అ.క్రి. ధాన్యాదులను ఆరబోయు. ఎండాకు వి. ఎండిన ఆకు. ఎండించు ఎండుయొక్క ప్రేరణార్థకం. స.క్రి. ఎండునట్లుచేయు. దశా. 1.185. ఎండిపోయిన విశే. ఎండిన. ఎండిపోవు అ.క్రి. నీరసమగు. ఎండుకాయలు చూ. ఎండ్రు. వి. బ.వ. నూర్పిడి అయిన తర్వాత ఎండ కెండిన పప్పు ధాన్యాలు. ఎండుగడ్డి వి. ఎండిన గడ్డి. ఎండుతెవులు వి. క్షయ. శరీరాన్ని నానాటికీ కృశింపజేసే వ్యాధి. ఎండుపుఁదట్ట వి. ఏదైనా ఎండ పెట్టటాని కుపయోగించే వెదురు బద్దల తట్ట. ఎండుబదును వి. ఒక మోస్తరుగా ఎండిన తడి. ఎండుమెదుకులు వి. బ.వ. అటుకులు. ఎండువాతం వి. 1. మేతమేయక చిక్కిపోవడం; 2. మలబద్ధకం; 3. శరీరం కృశించిపోయే ఒక రకమైన వాత వ్యాధి.
ఎండు[2] దూ.చూ. ఎండి. వి. నక్కిలో వేసిన బావు దారు.
-ఎందు[3] సమస్తంగానే ప్రయుక్తం. దూ. ఎఁడు. అవ్య. నిందు.
ఉదా. మూనెండు. మూన నిండుగా. పండిత. 5.348.
క. ఎఁబ్. లెక్కించు, విలువకట్టు.
ఎండుకాయలు చూ. ఎండు[1].
ఎండుగడ్డి చూ. ఎండు[1].
ఎండుగ వి. ధాన్యాదులను ఎండ బెట్టడం.
ఎండుగతట్ట చూ. ఎండుగులు.
ఎండుగులు రూ. ఎండుపులు. చూ. ఎండు[1]. వి. బ.వ. ఎండ బోసిన ధాన్యం.
ఎండుగతట్ట వి. ఏదైనా ఎండబెట్టటాని కుపయోగించే వెదురు బద్దల బుట్ట.
ఎండుతెవులు చూ. ఎండు[1].
ఎండుపుఁదట్ట చూ. ఎండు[1].
ఎండుబదును చూ. ఎండు[1].
ఎండుమెదుకులు చూ. ఎండు[1].
ఎండువాతం చూ. ఎండు[1].
ఎండుపులు రూ.చూ. ఎండుగులు. చూ. ఎండు[1]. వి. బ.వ. ఎండబోసిన ధాన్యం. శేయా. 3.84.
ఎండె రూ.చూ. ఇండె[2]. వి. బొబ్బరకాయ.
ఎండ్ర రూ. ఎండ్రింత. వి. ఒక రకం గడ్డి. గుడ్డి నాయుంచి. ప్రబంధ. 200, 201. ఆం.శా. 2.76.
ఎండ్రకాయ చూ. ఎండ్రి. వి. పీత. హంస. 4.186.
ఎండ్రకాయాకు వి. కొంత తెముడులా ఉండే కలుపుమొక్క.
ఎండ్రి రూ. ఎండ్రిక, ఎండ్రుక[1], ఎండి, ఎండ్రిక. వి. 1. పీత. ఆము. 2.53; 2. కర్కాటక రాశి. ఆము. 4.77.
క. ఏడి. పీత; ఎసడి, ఎండ్రగాయి- పీత; ప్రో.చూ. నల్లి, లల్లి. పీత; కొర్గ. నండి. పీత; తు. దెంజి. పీత; త. నెండు. పీత; కర్కాటక రాశి, నండు. పీత; మ. నండు. పీత; గో. యెతె- యెతెతా- యెతెగ్- యెతి. పీత; ప్రో.చూ. పర్జి. ఇడ్ది. పీత; కొ. నండె. పీత, యెండద. మెట్ట పీత; నా. ఎండె. పీత; గ. ఎండ్ర్క. పీత.
ఎండ్రిమెక్కుమెకము వి. నక్క. వ్యు. ఎండ్రకాయలను తినే జంతువు. ఎండ్రిమేఁతరి వి. నక్క. వ్యు. ఎండ్రకాయలను తినే జంతువు. ఎండ్రిరాశి వి. కర్కాటక రాశి.
ఎండ్రిక రూ.చూ. ఎండ్రి. వి. పీత. ఆం.శా. 1.160.
ఎండ్రింత రూ.చూ. ఎండ్ర. వి. ఒక రకం గడ్డి.
ఎండ్రిమెక్కుమెకము చూ. ఎండ్రి.
ఎండ్రిమేఁతరి చూ. ఎండ్రి.
ఎండ్రిరాశి చూ. ఎండ్రి.
ఎండ్రు వి. కాయ ధాన్యం.
ప్రో.చూ. ఐ. ఎన్ఱు. సూర్యుడు; ఎఱ్ఱూల్. వేసవి, ఎండ, సూర్యుడు.

కాయు ధాన్యాలను నూర్చిడి తరవాత ఎంతలో ఎంత బెడదాయు.

**ఎణ్బది** రూ.చూ. ఎనుఁబది. వి.ఎక్కై. ద.హిం.శా. 6 నం. 208 పు. 594.

**-ఎఁడు** రూ.చూ. ఎందు[3]. అవ్య- సిందుగా. ఉదా. మానెఁడు. భార. అశ్వ. 1.84. ఆము. 1.8.

**ఎతఁడు** రూ.చూ. ఏతఁడు. సర్వ. ఎవడు ? ఏవాడు ?

పో.చూ. క. ఎతరవ. ఎటువంటివాడు ?

**ఎతరాజి** రూ. ఎతరాజీ. వి. ఆపత్తి. మెకంజీ. నం. 138. చెన్నరాయపల్లె పు. 11.

హిం. ఎత్‌రాజ్. ఆపత్తి, విరోధం ; ఉ. ఎత్‌రాజ్. ఆపత్తి. ఛిద్రాన్వేషణం ; పార.అర. ఎత్‌రాజ్. ఆటంకం.

< ఉ. ఎత్‌రాజ్.

**ఎతరాజీ** రూ.చూ. ఎతరాజి. వి. ఆపత్తి. మెకంటి. నం. 106. క్రొత్రపాడు. చింతగుంట తా.పు. 174.

**ఎతుబరికాఁడు** రూ.చూ. ఎత్తుబరికాఁడు. వి. దొంగ, మోన గాడు.

**ఎతుబారీ** వి. నమ్మకం, పలుకుబడి. మెకంజీ.నం. 2. యెదుపాడు. పు. 83.

హిం.ఉ. ఎత్‌బార్. విశ్వాసం ; పార. ఇ'తిబార్ ; అర. ఎతహ్‌బార్.

< ఉ. ఎత్‌బార్.

**ఎత్తం** రూ.చూ. ఏతము. వి. పొలాలకు నీళ్ళుతోడే ఏటవాలు కొయ్య యంత్రం.

**ఎత్తడి** చూ. ఎత్తు[1]. విణ. 1. ఎత్తైన (ఎత్తడివాడు) ; 2. తోలిన కొత్తమన్నుగల (చేను), (ఎత్తడితోట).

**ఎత్తనగాయలు** చూ. ఎత్తు[1]. వి. బ.వ. నాలుగైదు కాయల్ని పైకెగరేసి పట్టుకుంటూ ఆడపిల్లలాడే ఆట.

**ఎత్తనగోల** చూ. ఎత్తు[1]. వి. 1. మధ్య బరువుకట్టి అటూఇటూ మనుషులు పట్టుకొని మోసుకొనిపోవటానికి ఉపయోగించే కఱ్ఱ. అం.భా. 2.267 ; 2. ఊతకోల.

**ఎత్తనగోలు** చూ. ఎత్తు[1]. వి. 1. మొదలు, ప్రారంభం ; 2. ప్రయత్నం.

**ఎత్తరతత్తరలు** వి. చీలికలు, పీలికలు.

సం. యత్ర-. ఎక్కడ ; తత్ర-. అక్కడ.

బహుశః < సం. యత్ర తత్ర, క్రమరహితమైన. వ్యు. ఎక్కడ అక్కడ.

**ఎత్తరము** చూ. ఎత్తు[1].

**ఎత్తరవు** చూ. ఎత్తు[1].

**ఎత్తలి** చూ. ఎత్తు[1]. వి. ప్రవాహంవలన పొలాలలో పెట్టిన ఇసుకదిబ్బ, మేట.

**ఎత్తళి** వి. పరికరం, పనిముట్టు, సాధనం.

**ఎత్తికొనిపోవు** స.క్రి. తీసికొనిపోవు, దొంగిలించు.

**ఎత్తికొను** రూ. ఎత్తుకొను. స.క్రి. 1. అపహరించు, దొంగిలించు. భార.ఆది. 1.133 ; 2. అవలంబించు, పూను. కు.సం. 7.882 ; 3. గ్రహించు, పట్టుకొను. భార.విరా. 3.217 ; 4. వహించు, మోయు. భార.భీష్మ. 2.82, హరి. 2.11 ; 5. ఆపదనుండి ఉద్ధరించు, రక్షించు. విక్ర. 7.105 ; 6. తీసికొను, తోడ్కొను. ప్ర.భా. 5.18 ; 7. చంకబెట్టుకొను ; అ.క్రి. 1. యత్నించు, పూను. భార.అర. 6.252, మార్క. 5.346 ; 2. యాచించు.

**ఎత్తికోలు** రూ. ఎత్తుకోలు. వి. 1. మానిక, ప్రయత్నం. భార. విరా. 5.64, భీష్మ. 1.103 ; 2. ఇచ్ఛ, కోరిక. శృం.నై. 1.80, 81.

**ఎత్తించు** 'ఎత్తు'యొక్క ప్రేరణార్థకం. స.క్రి. 1. పైకెత్తునట్లు చేయు, నిర్మించు ; 2. వ్రతం మొదలయినవి పూర్తి అయిన తర్వాత ఉద్యాపన చేయించు.

**ఎత్తిడి** రూ.చూ. ఎత్తెల. వి. చేపలు పట్టటానికి ఉపయోగించే పొడవైన వలయాకారపు వల, ఇది మూతి వలయంనుంచి చివరికి పోనుపోను సన్నగిలిపోతుంది.

**ఎత్తిపట్టు** అ.క్రి. ఎగబట్టు.

**ఎత్తిపెట్టు** స.క్రి. 1. ఒకరిని అనవసరంగా పెద్దచేయు ; 2. కట్టిపెట్టు ; 3. చేస్తూచేస్తూ ఉన్నపనిని మధ్యలో మానివేయు ; 4. నిందించు ; 5. అన్నీ పూర్తిచేయు ; 6. ఆగిపోవు ; 7. తాత్కాలికంగా చాలించు.

**ఎత్తిపొడుచు** స.క్రి. దెప్పు, అపహసించు, నిందించు, తప్పులు బయటపెట్టి నొవ్వనాడు. భాగ. 10. పూ. 978.

**ఎత్తిపొడుపు** వి. తప్పులు బయటపెట్టి నొవ్వనాడటం, దెప్పటం.

**ఎత్తిపొడుపుమాట** వి. దెప్పుడు మాట, తప్పులు బయటపెట్టి నొవ్వనాడే మాట.

**ఎత్తిపోఁత** వి. శవమును కాల్చిన భస్మాదులను సంచయనానంతరం ఎత్తి నీళ్లల్లో పోసే కర్మ, సంచయనం, చిన్నదినం.

**ఎత్తిపోఁతల** వి. జలపాతంయొక్క దార్లు.

**ఎత్తిపోయు** అ.క్రి. తిట్టు, నిందించు.

**ఎత్తిపోవు** అ.క్రి. 1. చెడిపోవు. వరాహ. 7.31, రామా. 4.57 ; 2. నిశ్శేషమగు, హత్తిగాపోవు ; 3. ఎక్కువగా రాణించు ; 4. చల్లని విత్తనాలు మొలపకుండాపోవు ; 5. దివాలా తీయు ; 6. వలసపోవు.

**ఎత్తిమట్టె** రూ.చూ. ఎద్దుమట్టె. వి. ఒక రకం కలుపుమొక్క.

**ఎత్తిరిల్లు** అ.క్రి. 1. వికసించు ; 2. అభివృద్ధిచెందు.

**ఎత్తిలి**[1] చూ. ఎత్తు[1]. క్రి.విణ. గట్టిగా, బిగ్గరగా. హరి.పూ. 5.150, శివరా. 2.54.

**ఎత్తిలి**[2] రూ.చూ. ఎత్తెల. వి. సంచివలె ఉండే చిన్న చేపల వల.

**ఎత్తివేఁత** వి. తీసివేత.

**ఎత్తివేయు** స.క్రి. 1. పైకెత్తి కిందపడవేయు ; 2. తేలికగా చూచు, అలక్ష్యంచేయు ; 3. తీసివేయు ; 4. అనవసరంగా ఒకరిని పెద్దచేయు.

**ఎత్తు**[1] స.క్రి. 1. సంకల్పించు, తలచు. భార.ఆది. 3.12 ; 2. చావు ఆపద మొ. వాటినుంచి ఉద్ధరించు, కాపాడు, రక్షించు. భార.ఆది. 6.262, హరి.ఉ. 7.144, భా.రా. సుం. 1086 ; 3. లేవదీయు, పైకిదేయు. భార.ఆది. 7.119, శల్య. 1.153, హర. 2.48 ; 4. వహించు. పూను. భార.ఉద్యో. 3.227, భా.రా.కిష్కిం. 4.52 ; 5. గొంతు హెచ్చించు. భార.భీష్మ. 2.372, పను. 4.52 ;

6. అపహరించు. భార.అను. 5.235, శృం.నై. 7.78 : 7. ఎత్తుకొను, చంకబెట్టుకొను. పండి.చ. 4.288, పాండు. 3.62 ; 8. చేతబట్టుకొను, కైకొను. ఉ.హరి. 1.165, శృం.నై. 1.68 ; 9. తాల్చు, ధరించు. భాగ. 3.1011, కాశ. 4.8 ; 10. స్థాపించు, నిలుపు, ఏర్పరచు, అమర్చు. విక్ర. 4.136, శివరా. 2.53, భీమ. 5.100 ; 11. (అర్ఘ్యాదులు) ఇచ్చు, సమర్పించు. కాశీ. 3.179, ఉ.రా. 8.309 ; 12. ఊదదీయు, పెల్లగించు. శృం.నై. 7.3, వసు. 1.68 ; 13. ఉద్ఘాటించు, వెల్లడిచేయు. వరాహ. 2.186, చిత్రభా. 2.70 ; 14. పొందు, పడయు. పాండు. 4.267, ద్వి.భార. విరా. 4.84 వ. ; 15. (పన్ను) రాబట్టు. కళా. 7.23 ; 16. తోడు, చేదు (చేను మొ. వాటికి నీరు) పెట్టు. ఆము. 4.282, విప్ర. 2.20 ; 17. పైనపెట్టు, మీదఉంచు. ఆము. 6.73 ; 18. ప్రస్తావించు. పార్వ. 5.197 ; 19. లోపలికి పుచ్చుకొను. కాశీ. 7.178, రామలిం. 60 ; 20. (గ్రంథాదులనుంచి) గ్రహించు, సంగ్రహించు ; అ.క్రి. 1. దండెత్తు, పోరాటానికి బయలుదేరు. భార.ఉద్యో. 2.21 ; 169 ; 2. అతిశయించు. భార. ఉద్యో. 2.109, రం.రా.బాల. 63 పు. 16 పం ; 3. (యుద్ధానికి) సిద్ధపడు, పూను. భార.ఉద్యో. 4.112 ; 4. కలుగు, సంభవించు. భార.భీష్మ. 1.206, ద్రోణ. 4.89, భా.రా.యు. 519; వి. 1. ఒకరకం పూలదండ. భార.విరా. 1.107, భోజ. 5.207, ఆము. 5.91 : 2. మారు, తడవ, పర్యాయం. భార.ద్రోణ. 5.196, భీమ. 4.28 ; 3. రీతి, విధం. భాగ. 10 పూ. 1318, పాండు. 3.179 ; 4. పోలిక, సామ్యం. హరి.ఉ. 4.130 ; 5. ఊర్ధ్వ ప్రమాణం, ఉన్నతి. మను. 4.37 ; 6. పలపుకత్తె వలపుకాని కిచ్చే ధనం. ఆము. 2.21 ; 7. పుణుగులో నాల్గవ వంతు, రెండు పీసెలు లేక 6¼ పొన్లు. ఆము. 5.96 ; 8. ఉపాయం, యుక్తి. రామా. 7.48, సారంగ. 2.14, ఆం.భా. 1.113 ; 9. తూకం, బరువు. ప్రభా. 4.78 ; 10. గౌరవం, గొప్పతనం. పల్నా. 2.124 ; 11. ఒక వస్తువును అణచి పెట్టటానికై దానిపైన పెట్టే బరువు ; 12. పన్నుగడ, పన్నిక ; 13. చదరంగంలో పావును ఒక గడి నుంచి మరొక గడికి కదపటం ; 14. ఒక్క వరుస అడ్డంగా మరో వరుస నిలువుగా పేర్చిన పేర్పు ; విశ. 1. తూనిక గలిగినది, ఎత్తు గలిగినది. విజ్ఞా. వ్యవ. 117 ; 2. ఉన్నతం, అధికం, గొప్పది. వసు. 5.103.

క. ఎత్తు. లేపు, పైకెత్తు, గ్రహించు, ఎత్తిపట్టు, దొంగిలించు కొనిపోవు, దండెత్తు, బిచ్చమెత్తు, రూపుదాల్చు, వెల్లడించు, ప్రస్తావించు, పేర్కొను, పైకితీయు, గొప్పచేయు ; తు. ఎత్తు. ఎత్తిపట్టు ; ఎత్తుని. పన్నులనుగాని విరాళాలనుగాని పోగుచేయు ; ఎత్తరుని. ఎక్కు ; ఏపుని. పైకెత్తు ; త. ఎళు. పైకెత్తు (ఏ-) ; ఏంతుక. పైకి లేచు, పట్టుకొను ; మ. ఎఱుక. లేచు ; ఎతుకక. నిర్మించు, పూనుకొను ; ఏఱుక. పైకెత్తు, మాట్లాడు ; ఏన్తుక. నిర్వహించు ; కో. ఎటిప్- (ఎటిడ్-). (పొగ) లేచు, పైకి దూకు, ఎగురు ; (ఎళిప్) దూకించు ; ఎద్- (ఎయిత్). తీసుకొనిపోవు, మోయు ; గోం. అత్. ఒడిలోకి తీసుకొను ; కుఇ. ఎర. చంకనెత్తికొను ; కువి. ఎర్-. చంకనెత్తికొను ; పర్జి. ఎతిప్-ఎతిత్-. ఎత్తు ; కొలా. ఎత్-, ఎత్-త్. పైకెత్తు ; యెర్రా-. ఎత్తైన ; నాయకి. ఎత్, ఎత్ ; కురు. ఎజ్నా (ఎజ్జస్). నిద్రనుంచి లేచు ; మ్రాల్తో. మేల్కొన్న ; మాల్తో. ఎజె. లేపు ; ఎజాజె. లేచిన.

<మూ.ద.ద్రా. మూ.ప.ద్రా. ఏర్- ర్- <*ఏర్-ర్- లేదా ఎక్-/-ఎస్-.

**ఎత్తరము** రూ. ఎత్తరపు. విశ. ఎత్తైనది, ఉన్నతం. మను. 5.98. వి. ఉన్నతి, ఎత్తు. దశా. 8.210. క. ఎత్తర, ఎత్తరు, ఎత్తర. ఎత్తు, పొడుగు ; తు. ఎత్తర. ఎత్తు, ఎత్తైన, పైకి లేచిన. **ఎత్తరవు** రూ.చూ. ఎత్తరము. **ఎత్తుకుఎత్తు** రూ. ఎత్తుకెత్తు. వి. ఎత్తుకు పైయెత్తు, సరికిసరి. **ఎత్తుకెత్తు** రూ.చూ. ఎత్తుకు ఎత్తు. క్రి.విశ. సరికిసరి, ఎత్తుకు పైఎత్తు. శుక. 1.138. **ఎత్తుకొనివచ్చు** స.క్రి. తెచ్చు. **ఎత్తుకొను** రూ.చూ. ఎత్తికొను. స.క్రి. 1. ఆపద నుండి కాపాడు. విక్ర. 7.105 ; 2. కౌగిలించు. విప్ర. 5.15 ; 3. తీసికొనిపోవు, తెచ్చు, నడిపించు. ప్రభా. 5.18 ; 4. (బిడ్డను) చంకనెత్తికొను. **ఎత్తుకొయ్య** వి. బరువులను మీటుటకై ఆధారంగా పెట్టే కొయ్య (త్రాసు). **ఎత్తుకోలు** రూ.చూ. ఎత్తికోలు. **ఎత్తుగట్టు** అ.క్రి. ఒక కొల పాత్రకు లేదా ఒక కొలమానానికి సరిపోయే తూకం కట్టు. **ఎత్తుగడ** వి. 1. యత్నం ; 2. పన్నుగడ, వ్యూహం ; 3. ఆరంభం ; 4. కుటిలోపాయం. <ఎత్తు¹ + కడ. **ఎత్తుగడచేయు** స.క్రి. ప్రయత్నించు. **ఎత్తుగడ్డలు** వి. బ.వ. ఎత్తుడు పొయ్యి గడ్డలు. **ఎత్తుగల్లు** వి. మెట్టు ఎక్కటానికి ఎత్తుగా పెట్టుకొన్న రాయి. <ఎత్తు¹ + కల్లు. **ఎత్తుగీతము** రూ. ఎత్తుగీతి, ఎత్తుగీదియ. వి. సీసపద్యానికి అనుబంధంగా వచ్చే గీతపద్యం. అప్ప. 4.355. **ఎత్తుగీతి** రూ.చూ. ఎత్తుగీతము. వి. సీసపద్యానికి అనుబంధంగా వచ్చే గీతపద్యం. అప్ప. 2.96. **ఎత్తుగీదియ** రూ.చూ. ఎత్తుగీతము. వి. సీసపద్యానికి అనుబంధంగా వచ్చే గీతపద్యం. కవిజనా. 2.20. **ఎత్తుగున్న** వి. లేత ఏనుగుపిల్ల. పాంచాలీ. 1.39, చంద్రాంగ. 1.43. **ఎత్తుదెంచు** అ.క్రి. దండెత్తి వచ్చు. భార. ఆది. 7.191 ; హరి.ఉ. 2.103. <ఎత్తు¹ + -తెంచు. **ఎత్తుపడు** అ.క్రి. 1. భగ్నమగు. ప్రబోధ. 3.68 ; 2. నశించు ; 3. కృశించు. **ఎత్తుపుల్ల** వి. 1. తాళ్ళరాటి దిగువ బద్దకు దూర్చే పుల్ల ; 2. అచ్చుతికే టప్పుడు అచ్చు కర్రల కాధారంగా నిలబెట్టిన పుల్ల. **ఎత్తుపెట్టు** రూ. ఎత్తువెట్టు. స.క్రి. పురికొల్పు, ప్రోత్సహించు. హంస. 1.114. **ఎత్తుబడి** వి. 1. శవమును ఇంటి నుంచి స్మశానానికి కదలించటం ; 2. యాచన ; 3. ఒకనికి సహాయం కోసం చందాలు వసూలు చేయటం ; 4. ఎత్తదగినది. **ఎత్తుబడు** అ.క్రి. 1. దుర్బలపడు, నీరసపడు ; 2. ఆర్థికంగా దెబ్బతిను. **ఎత్తుబత్తెము** వి. అత్త కోడలి కిచ్చే దినభత్యం. **ఎత్తుబరికాఁడు** రూ. ఎతుబరికాఁడు. వి. దొంగ. ఆం.సం.మాన.

11. ఎత్తుబాటు వి. దూర ప్రదేశములకు ప్రత్యేకించి వెళ్లటం. ఎత్తుబిడ్డ వి. మరొక స్త్రీచే ప్రేమతో పెంచబడ్డ తల్లిలేని బిడ్డ, తల్లిలేని లోటు లేకుండా పెంచబడ్డ బిడ్డ. ఎత్తుభారము వి. 1. ఉపద్రవం, బాధ, బాధ్యత, వినాశం; 2. దబ్బిబ్బు. ఎత్తుమోట వి. ఏటికాలవకు ఉద్దికట్టి తోలే మోట. ఎత్తురాయి వి. రెండు వీసెల తూకం రాయి, కట్టు రాయి. ఎత్తులమారి వి. జిత్తులమారి, తెలివికలవాడు, మోసగాడు. పో.చూ. త. ఎత్తన్. మోసగాడు. ఎత్తులువెట్టు అ.క్రి. 1. మోసగించు. వాల్మీ. 3.7; 2. ప్రోత్సహించు, పురికొల్పు. పక. 1.61. <ఎత్తులు[1] + -లు + పెట్టు. ఎత్తువచ్చు అ.క్రి. సాటివచ్చు, సమానమగు, సరితూగు. దార. ఉద్యో. 2.265, అను. 2.48, భాగ. 10. ఉ. 400. ఎత్తువడు అ.క్రి. 1. ఎత్తబడు. కు.సం. 3.248; 2. జబ్బుపడు, మంచంపట్టు. హరి.పూ. 6.44; 3. చెడు (జవసత్వాలు ఉడిగిపోవు). భాగ. 10 పూ. 894. < ఎత్తు[1] + పడు. ఎత్తువిడు స.క్రి. ప్రోత్సహించు. ప్రేరించు. కళా. 7.76, దశా. 3.86. ఎత్తువెట్టు రూ.చూ. ఎత్తుపెట్టు. స.క్రి. ప్రోత్సహించు, పురికొల్పు. హంస. 1.114. ఎత్తువేయు స.క్రి. తూచు. ఎత్తువేలుపు వి. శివుడు, ఈశాన్య దిక్పాలకుడు. ఎత్తువోవు అ.క్రి. తగ్గు, తీసిపోవు, తక్కువయగు. ప్ర. బరువుగానీ పరువుగానీ కోల్పోవు. ఉ.హరి. 6.160, రామా. 4.57. <ఎత్తు[1] + పోవు. ఎత్తుసేయు అ.క్రి. కపటం పన్ను. మల్హ. 2.42. <ఎత్తు[1] + చేయు.

ఎత్తు[2] వి. దయ్యం. ఆం. పదా. సుర. 39.

ఎత్తులకెకిమీఁడు వి. శివుడు, పిశాచాలకు రాజు.

ఎత్తుకుఎత్తు చూ. ఎత్తు[1].
ఎత్తుకెత్తు చూ. ఎత్తు[1].
ఎత్తుకొనివచ్చు చూ. ఎత్తు[1].
ఎత్తుకొను చూ. ఎత్తు[1].
ఎత్తుకొయ్య చూ. ఎత్తు[1].
ఎత్తుకోలు చూ. ఎత్తు[1].
ఎత్తుగట్టు చూ. ఎత్తు[1].
ఎత్తుగడ చూ. ఎత్తు[1].
ఎత్తుగడచేయు చూ. ఎత్తు[1].
ఎత్తుగడ్డలు చూ. ఎత్తు[1].
ఎత్తుగల్లు చూ. ఎత్తు[1].
ఎత్తుగీతము చూ. ఎత్తు[1].
ఎత్తుగీతి చూ. ఎత్తు[1].
ఎత్తుగీదియ చూ. ఎత్తు[1].
ఎత్తుగున్న చూ. ఎత్తు[1].
ఎత్తుదెంచు చూ. ఎత్తు[1].
ఎత్తుపడు చూ. ఎత్తు[1].
ఎత్తుపల్ల చూ. ఎత్తు[1].
ఎత్తుపెట్టు చూ. ఎత్తు[1].
ఎత్తుబడి చూ. ఎత్తు[1].
ఎత్తుబడు చూ. ఎత్తు[1].
ఎత్తుబత్తెము ఎత్తు[1].
ఎత్తుబరికాఁడు చూ. ఎత్తు[1].
ఎత్తుబాటు చూ. ఎత్తు[1].
ఎత్తుబిడ్డ చూ. ఎత్తు[1].
ఎత్తుభారము చూ. ఎత్తు[1].
ఎత్తుమోట చూ. ఎత్తు[1].
ఎత్తురాయి చూ. ఎత్తు[1].
ఎత్తులకెకిమీఁడు చూ. ఎత్తు[2].
ఎత్తులమారి చూ. ఎత్తు[1].
ఎత్తులువెట్టు చూ. ఎత్తు[1].
ఎత్తువచ్చు చూ. ఎత్తు[1].
ఎత్తువడు చూ. ఎత్తు[1].
ఎత్తువెట్టు చూ. ఎత్తు[1].
ఎత్తువేయు చూ. ఎత్తు[1].
ఎత్తువేలుపు చూ. ఎత్తు[1].
ఎత్తువోవు చూ. ఎత్తు[1].

ఎత్తునరి పో.చూ. ఎత్తు. వి. మరమగ్గం నిలువుపట్టెను మేరువు పలకకు బిగించి నన్నపుల్లతో పడిపెట్టిన దారం.

ఎత్తుసేయు చూ. ఎత్తు[1].

ఎత్తెల రూ. ఎత్తిడి, ఎత్తిలి[2]. వి. చేపలుపట్టే వల. భార.శాంతి. 3.198; హంస. 4.184.

ఎత్తెలగొను స.క్రి. 1. ఎత్తెలతో చేపలను పైకి లాగునట్లు అవలీలగా లాగు, అవలీలగా జయించు. నిర్వ.రా. 6.147; భార.విరా. 4.9; 2. అవలీలగా స్వాధీనం చేసుకొను. దశకు. 7.30. <ఎత్తెల + కొను.

ఎత్తెలగొను చూ. ఎత్తెల.

ఎత్తెసరు రూ.చూ. అత్తెసరు. వి. గంజి వార్చకుండా, అన్నంతో ఇమిడిపోయేటట్లు పెట్టే ఎసరు.

ఎత్తొక్కు రూ.చూ. ఎద్దుతొక్కు.

ఎద[1] రూ.చూ. ఎడఁద. వి. 1. గుండె. కు.సం. 9.241; 2. మనస్సు, హృదయం. హర. 3.66; ఆము. 2.92; 3. రొమ్ము. మను. 1.1; 4. భయం. చంద్రా. 2.88; ఆం. భా. 3.51; 5. పణతకూ ఆరుకూ మధ్యగల వంపు లోపలివైపు.

ఎదగందు వి. హృదయంలో నల్లని మచ్చగలవాడు, చంద్రుడు. ఆల.పదా.సుర. 28. <ఎద[1] + కందు. ఎదచూలి వి. 1. గాలి, వాయుదేవుడు. ఆం.పదా.సుర. 35: 2. వాయుపుత్రుడు, హనుమంతుడు, భీముడు. ఎదమెపెట్టు స.క్రి. హృదయంలో ఉంచుకొను. ఎదపడు (రూ. ఎదవడు) అ.క్రి. భయపడు, అధైర్యపడు. వేంక.పంచ. 4.768; ఉ.రా. 6.257. ఎదపదిలము వి. శ్రద్ధ, జాగ్రత్త. ఆం. పదా.గుణ. 12. ఎడపుట్టులు రూ.చూ. ఎద. పుట్టువులు వి. బ.వ. స్తనములు ఆం.పదా. 2.77 ఎదపుట్టువులు రూ. ఎదపుట్టులు వి. బ.వ. రొమ్మున పుట్టినవి, స్తనములు. ఎదమచ్చగలసామి వి. రొమ్మున మచ్చగలవాడు, విష్ణువు. సాంబ.ని. 1.4. ఎదముల్లు వి. మనశ్శల్యం. రం.రా.ఉ. 157 పు. 8 పం. ఎదవడు రూ.చూ. ఎదపడు. అ.క్రి. 1. భయపడు. జై.భా. 7.42; 2. ఖేదపడు. <ఎద[1] + పడు. ఎదనుడి వి. రొమ్మమీది నుడి. ఎదానవేసికొను స.క్రి.

అపహరించు, కాజేయు.

**ఎద$^{2}$** రూ.చూ. వెద. వి. పశురుతువు. మను. 4.37.

**ఎదవశవు** వి. కామవాంఛతోనున్న జంతువు. **ఎదపోవు** అ.క్రి. రుతుసమయానికి వచ్చు. **ఎదారు** అ.క్రి. యౌవనం పొందు. **ఎదావు** రూ.చూ. వెదావు. వి. ఎదగొన్న ఆవు. పొర్లటకు సిద్ధంగా ఉన్న ఆవు. పో.చూ.క. బెదెయాకళ్, బెదెయాఙ్. పొర్లుటకు సిద్ధంగా ఉన్న ఆవు. <ఎద$^{2}$+ ఆవు.

**ఎదకట్టు** వి. బండిబండకు వేసిన ఇనపకట్టు.

**ఎదగందు** చూ. ఎద$^{1}$.

**ఎదచూలి** చూ. ఎద$^{1}$.

**ఎదట** రూ.చూ. ఎదుట(న్). క్రి.విశ. ఎదురుగా.

**ఎదదోవి** వి. మోటబొక్కెన నీళ్ళు కుమ్మరించే చోటు.

**ఎదమపెట్టు** చూ. ఎద$^{1}$.

**ఎదవడు** చూ. ఎద$^{1}$.

**ఎదవదిలము** చూ. ఎద$^{1}$.

**ఎదవశవు** చూ. ఎద$^{2}$.

**ఎదపుట్టులు** చూ. ఎద$^{1}$.

**ఎదపుట్టువులు** చూ. ఎద$^{1}$.

**ఎదపురి** వి. మోటు బావికుంట మొ. వాటినుంచి నీళ్ళు తోడి పోసేవైపు ఎత్తుగా కట్టిన కట్ట.

**ఎదపోవు** చూ. ఎద$^{2}$.

**ఎదబెట్టు$^{1}$** పో.చూ. ఎద$^{1}$. స.క్రి. జొన్న మొదలగు పైరులను ఇతర పైరులతో కలపకుండా చల్లు.

**ఎదబెట్టు$^{2}$** అ.క్రి. ఆవు పాలివ్వక ఒట్టిపోవు.

**ఎదమచ్చగలసామి** చూ. ఎద$^{1}$.

**ఎదముల్లు** చూ. ఎద$^{1}$.

**ఎదర** పో.చూ. ఎదురు. వి. బావిగోడ లోపలివైపు.

**ఎదరవాలు** వి. గంగడోలుమీది నుశి.

**ఎదర్పు** చూ. ఎదురు. వి. 1. రావలసిన సొమ్ము రాబట్టుకోటానికిగాను మరల రుణస్థుడికి చేసే ఎదురు సహాయం: 2. ఆదుకోటం.

**ఎదల** రూ. ఎనల$^{2}$. చూ. ఎద$^{1}$. వి. గుండెజబ్బు, ఎగరొప్పు.

**ఎదవడు** చూ. ఎద$^{1}$.

**ఎదసుడి** చూ. ఎద$^{1}$.

**ఎదావవేసికొను** చూ. ఎద$^{1}$.

**ఎదారు** చూ. ఎద$^{2}$.

**ఎదావు** చూ. ఎద$^{2}$.

**ఎది** రూ.చూ. ఏది. సర్వ. ఎవరె? ఏది? ఎక్కడఉంది? ఎట్లా?

**ఎదిరి** రూ. ఎదురు. వి. 1. అన్యుడు, ఇతరుడు. భార.ఉద్యో. 2.59, కాశీ. 6.78; 2. ప్రతిపక్షుడు, శత్రువు. భార. ఉద్యో. 3.34, ప్రబోధ. 4.63.

క. ఇదిర్, ఇదిరు, ఎదిర్, ఎదిరు, ఎదురు, ఎదిర్, ఎదుర్. ఎదురుగా ఉన్నది, ముందున్నది, ముందు, విరుద్ధం, వ్యతిరేకం; ఇదిర్చు. ఎదుర్కొను; తు. ఎదురు. ముంచు, ముందర, విరుద్ధం, వ్యతిరేకం; త. ఎతిర్. వ్యతిరేకించు, ఎదుర్కొను, కలిసికొను, ముందున్నది; ఎతిర్కొళ్. ఎదుర్కొను; మ. ఎతిర్. వ్యతిరేకం, విరుద్ధం, సాటి, సామ్యం: ఎతిర్క్క. ఎదుర్కొను; కుడు. ఎథ్ర్. కనిపించు; మాల్తో. ఎశెర్. కన్పించు.

<మూ.ద.ద్రా. *ఎత్- ఇర్.

**ఎదిరిపెర** చూ. ఎదురు. వి. లోక చివర పొడుగ్గా వుండే నుశి.

**ఎదిరించు** చూ. ఎదురు.

**ఎదుగు** అ.క్రి. 1. అతిశయించు. నిర్వ.రా. 4.22. భాగ. 10 పూ. 75: 2. పెరుగు. శుక. 2.152; 3. మీరు, మించు, రజస్వలయగు.

పో.చూ. త. ఎతిర్. ముందుగా జరుగు: మాల్తో. ఇత్. మొలకెత్తు: ఇతర్, ఇత్గర్.

బహుశ: <మూ.ద్రా. *ఎత్-.

ఎదుగుడు వి. పెంపు, అతిశయం.

**ఎదుగుడు** చూ. ఎదుగు.

**ఎదుట(న్)** రూ. ఎదట(న్). చూ. ఎదురు. క్రి.విశ. ఎదురుగా, ముందు.

ఎదుటివా(డు వి. తన కెదురుగా నున్నవాడు.

**ఎదుటివా(డు** చూ. ఎదుట(న్).

**ఎదురగు** చూ. ఎదురు.

**ఎదురాడు** చూ. ఎదురు.

**ఎదురీ(దు** చూ. ఎదురు.

**ఎదురు** రూ.చూ. ఎదిరి. అ.క్రి. 1. మార్కొను, ప్రతిఘటించు. భార.ఆది. 6.44, భీష్మ. 1.81; 2. ఎదురుపడు, అభిముఖమగు. ఆము. 6.96, వసు. 2.110; స.క్రి. మార్కొను, ఎదిరించు. రామ. 7.55, విక్ర. 4.112; వి. 1. అన్యుడు, ఇతరుడు. కు.సం. 9.333, భార.ఉద్యో. 2.57: 2. ముందరి భాగం, ముందు, సమక్షం. భార.శాంతి. 4.160; కళా. 3.79, ఆము. 5.147; 3. ప్రియుడు ప్రియురాలికివ్వటానికి మారుగా ప్రియురాలే ప్రియుడికిచ్చే ధనం. శుక. 3.353, హంస. 2.112; 4. శకునం; 5. మారు, బదులు. విశ. 1. సాటి, సమానం. భార.విరా. 4.53, సుదంతా. 3.117; 2. మారు, బదులు. వరాహ. 9.90; 3. ముందరఉన్నది. శుక. 3.20. క్రి.విశ. 1. సమానంగా. భార.భీష్మ. 3.78; 2. ఎదురుగా, అభిముఖంగా. నిర్వ. 9.47, విక్ర. 2.85, వరాహ. 5.50, శుక. 2.112. స.క్రి. 1. కలియబెట్టు; 2. పరచిన ధాన్యం దగ్గరకు చేర్చు; 3. నూర్చిన ధాన్యంలో ఉన్న గడ్డిపరకలను ఎండాకులను పొలికట్టెతోగానీ చేత్తోగానీ తీసివేయు. వి. నిర్మాణంలో రాకూడని తప్పు.

ఎదిరించు అ.క్రి., స.క్రి. ఎదుర్కొను, ప్రతిఘటించు, తారసిల్లు. శృం.నై. 3.95, మను. 6.42, రాఘవ. 4.188. క. ఇదెర్చు, ఇదిరిసు, ఎదరిసు, ఎదిరిసు. ఎదుర్కొను, వ్యతిరేకించు, ప్రతిఘటించు, విరోధించు; త. ఎతిర్. ఎదుర్కొను, ప్రతిఘటించు; మ. ఎతిర్కుక్క. ఎదుర్కొను, మార్కొను. ఎదురగు అ.క్రి. ఎదుర్కొను, అభిముఖమగు, ఎదురుగావచ్చు. ఎదురాడు స.క్రి. వ్యతిరేకంగాచెప్పు, ఖండించు. సిం.ద్వా. 6.139, శుక. 2.209. క. ఎదురాడు. పోటీగా హెచ్చు వెలకు అడుగు, వ్యతిరేకంగా చెప్పు: త. ఎతిర్.

విరుద్ధంగా ఉండు. భిన్నంగా ఉండు. ఎదురీదు అ.క్రి. ప్రవాహాని కెదురుగా ఈదు. దశకు. 3.120. పో.చూ. త. ఎతిర్-నీచ్చు. ప్రవాహాని కెదురీదుట. ఎదురుకట్టు రూ. ఎదుర్కట్టు. క్రి. విశ. ముందు, ముందర. ఎదురుకట్టుల(న్) రూ. ఎదురుకట్ల(న్). క్రి. విశ. ముందు, ముందర. భోజ. 5.216. ఎదురుకట్ల(న్) రూ.చూ. ఎదురుకట్టుల(న్). క్రి. విశ. ముందు. ముందర. రామా. 2.38, విష్ణు.పు. 7.137. ఎదురుకుత్తుక వి. ఆంకిట్ల పట్టుకొనే ఒక రకం జబ్బు. ఎదురుకెదురు క్రి.విశ. ఎదుటివాడు చేయవలసిన పని తానే చేయుట. భీమ. 4.12. ఎదురుకొను రూ. ఎదుర్కొను. స.క్రి. 1. ప్రత్యుద్గమించు (బంధుమిత్రాదులను తీసికొనిరావటంకోసం ఎదురుపోవు). విక్ర. 7.74; 2. మార్కొను. ఉ.రా. 2.78, అ.క్రి. అభిముఖమగు, తారసిల్లు. ఉ.రా. 3.228, వి.పు. 2.49. క. ఇదిర్ గొళ్, ఇదిర్ గొళ్లు, ఎదుర్గొళ్లు. ప్రేమతోగాని గౌరవంతోగాని ఎదురుపోవు; తు. ఎదుర్కొణుని. ప్రేమగౌరవాలతో ఎదురుపోవు; త. ఎతిర్ కొళ్. అతిథినిగాని గొప్పవారినిగాని తీసికొనిరావటానికి ఎదురుపోవు. ఎదురుకొలుపు 'ఎదురుకొను' ప్రేరణార్థకం. స.క్రి. అభిముఖంచేయు, కన్పింపజేయు. చంపూ. 5.18. ఎదురుకోలు రూ. ఎదుర్కోలు. చూ. ఎదురుకొను. వి. అతిథికోసం ఎదురుపోవటం, ప్రత్యుద్గమనం. అని. 5.59; త. ఎతిర్-కొళ్. అతిథి మొ. వారిని కలిసికొని తీసుకొని రావటానికై ఎదురుపోవు. ఎదురుక్షవరము వి. వెంట్రుకలున్న వాలుకు ఎదురుగా గొరగటం. ఎదురుగడ వి. మారువ్రాసిన ఒడంబడిక మొ. క. ఎదురుగడె; తు. ఎదురుకడె. ఎదురుగడగవ్రాయుట స.క్రి. లెక్కతేల్చిన నిల్వల మొత్తం కొట్టివేత. ఎదురుగడపత్రిక వి. సమష్టి ఒడంబడిక, ఒకరికొకరు వ్రాసుకొన్న ఒడంబడిక. ఎదురుగడయొడంబడిక వి. మారు వ్రాసిన ఒప్పందం. < ఎదురుగడ + ఒడంబడిక. ఎదురుగడలెక్క వి. మారులెక్క. ఎదురుగాలి వి. ఎదురుగా వీచు గాలి. ఎదురుగుండ(న్) రూ. ఎదురుగుండా. క్రి.విశ. ఎదుట. ఎదురుగుండా రూ. చూ. ఎదురుగుండ(న్). వి. ఎదురుగా. ఎదురుచుక్క రూ. ఎదుచ్చుక్క. వి. చుక్క ఎదురుగా ఉండటం. పరమ. 1.21, శుక. 2.288. పో.చూ. సం. ప్రతిశుక్రమ్. ఎదురుచూచు అ.క్రి. 1. వేచివుండు, ప్రతీక్షించు. భార. శాంతి. 6.594, శృం.నై. 4.64; 2. ఆశించు. ఎదురుచేట(వేయు) వి. గాలి అనువుగా లేనప్పుడు ఒకడు తూర్పారపోస్తుంటే మరొకడు ఎదురుగా నిలబడి వేరొక చేటతో విసరటం. ఎదురుజవాబు వి. విరుద్ధమైన సమాధానం. ఎదురుండు అ.క్రి. ఎదురుగా ఉండు. కాశీ. 2.147. పో.చూ. క. ఇదిరిర్. ముందుండు, ఎదుటనుండు. ఎదురుతంటసము వి. ఫిర్యాదికి వేసే జరిమానా. ఎదురుతాఁకగు అ.క్రి. 1. ఎదురుపడు, తారసిల్లు, కలిసికొను. జై.భా. 7.144, వేంక. పంచ. 3.252; 2. సమానమగు. ద్వి.పద. వి. 5.358 పు. 4 పం. < ఎదురు + తాఁకు + అగు. ఎదురుతిరుగు అ.క్రి. 1. ఎదుర్కొను, వ్యతిరేకించు; 2. తిరగబెట్టు. ఎదురునకలు వి. మూలానికి ప్రతి. ఎదురుపడు రూ. ఎదుర్పడు. అ.క్రి. 1. ఎదిరించు, ప్రతిఘటించు. భార.భీష్మ. 2.313; 2. ఎదురుగావచ్చు. పి. శకుం. 1.132, ఉ.రా. 8.94, హంస. 2.117. త. ఎతిర్-ప్-పటు. ఎదుట కన్పించు, కలిసికొను, తారసిల్లు. ఎదురుపలుకు అ.క్రి. అభ్యంతర పెట్టు, వ్యతిరేకించు. ఎదురుపాటు రూ. ఎదుర్పాటు. వి. అభిముఖంగా రావటం, ఎదురుపడటం. త. ఎతిర్-ప్-పాటు. కలుసుకోవటం. ఎదురుప్రతి వి. నకలు. ఎదురుబడి[1] వి. అభిముఖంగా రావటం, కలుసుకోవటం. ఎదురుబడి[2] వి. ఎదురుగా ఉంచబడిన పాఠశాల, పోటీ బడి. ఎదురుబిడి వి. ఎదురుగా (కచ్చగా) మాట్లాడటం. <ఎదురు + పిడి. ఎదురుబిడివాఁడు వి. చెప్పిన మాటకు అడ్డు చెప్పేవాడు. <ఎదురు + పిడివాఁడు. ఎదురుమేనటికము వి. ఆచార ప్రకారం మేనమామ కొమార్తెకు మారుగా మేనత్త కుమార్తెను పెండ్లాడటం. ఎదురుమోల(న్) రూ.చూ. ఎదురుమ్రోల(న్). క్రి. విశ. ఎదుట, ముందు. ఎదురుమ్రోయు అ.క్రి. ప్రతిధ్వనించు. హరి.పూ. 4.16. పో.చూ. ఎతిర్-ఒలి (-ఒలి. ధ్వనించు). ప్రతిధ్వనించు. ఎదురుమ్రోల(న్) రూ. ఎదురుమోలన్. క్రి. విశ. ఎదుట, ముందు. ఎదురురొమ్ము రూ.చూ. ఎదురుటొమ్ము. వి. రొమ్ము నడిమి భాగం. ఎదురుటొమ్ము రూ. ఎదురురొమ్ము, ఎదురొమ్ము, ఎదుటొమ్ము, ఎదుఱుమ్ము. వి. రొమ్ము నడమి భాగం. ఎదురులెక్కు రూ.చూ. ఎదురెక్కు. అ.క్రి. ఎదురుగా పోవు. మను. 5.83. ఎదురువడ్డి వి. బాకీదారు బాకీ పూర్తిగా తీర్చేలోపల ఇచ్చిన చెల్లులమీద వడ్డీ. త. ఎతిర్-వట్టి. ఎదురువడ్డి. పూర్తి పరిష్కారానికి ముందుగా ఇచ్చిన చెల్లులపై వడ్డీ. ఎదురువ్యాజ్యము వి. వ్యాజ్యానికి ప్రతిగావేసే వ్యాజ్యం. ఎదురుసన్నాహము వి. పెండ్లికుమారునిపక్షంవారిని పెండ్లికుమార్తెపక్షంవారు ఎదురేగి తీసుకురావటం. ఎదురుసెలగు అ.క్రి. ప్రతిధ్వనించు. భార.ఉద్యో. 4.116. <ఎదురు + చెలగు. ఎదురెక్కు రూ. ఎదురుతెక్కు. అ.క్రి. 1. ఎదురుగాబోవు. ఆము. 1.5, నీలా. 3.13; 2. మీదికివచ్చు. కకుత్థ్స. 4.145. ఎదురెత్తు స.క్రి. ప్రతిఘటించు, ఎదిరించు. దశకు. 2.29. ఎదురెదురగు అ.క్రి. పరస్పరం అభిముఖమగు, ఎదుటపడు. హరి.ఉ. 7.235. ఎదురేఁగు అ.క్రి. కలిసికోవడానికై ఎదురుపోవు. ఎదురొడ్డు అ.క్రి. ఎదురుగా వ్యూహం పన్ను, ప్రతిఘటించు. కవిక. 2.147, ఉ.రా. 8.237. స.క్రి. 1. ప్రతిప్రయోగంచేయు, అస్త్రానికి అస్త్రం ఎదురుగా ప్రయోగించు. కళా. 8.97; 2. జూదంలో ఎదురుపందెం వేయు. క. ఇదిరొడ్డు. ఆటంకపరచు, వ్యతిరేకించు; పో.చూ. ఇదిరొడ్డణ. శత్రుసైన్యం. ఎదురొత్తు స.క్రి. మారొత్తు. పారి. 1.117. వి. బ.వ. మారొత్తులు, ప్రతిఘట్టనలు. రాధికా. 1.64, 78. ఎదుర్కట్టు రూ.చూ. ఎదురుకట్టు. క్రి.విశ. ఎదురు, ముందర. కాశీ. 6.262. ఎదుర్కొను రూ.చూ. ఎదురుకొను. అ.క్రి. మార్కొను. ఉ.రా. 2.78. ఎదుర్కోలు రూ.చూ. ఎదురుకోలు. వి. 1. ప్రత్యుద్గమనం. కళా. 2.132; 2. ఆడుపెండ్లివారు మగపెండ్లివారినిగాని మగపెండ్లివారు ఆడుపెండ్లివారినిగానీ ఎదురేగి

తీసుకురావటం. హంస. 5.40. ఎదుర్చుక్క రూ.చూ. ఎదురుచుక్క. వి. 1. ప్రతికూలం, హానికరం. ప్రభు. 3.102 పు. 17 పం.; 2. అపశకునం. ఎదుర్పడు రూ. చూ. ఎదురుపడు. అ.క్రి. మార్కొను. భాగ. 3.92. ఎదుర్పాటు రూ.చూ. ఎదురుపాటు. వి. అభిముఖంగా రావటం.
ఎదురుకట్టు చూ. ఎదురు.
ఎదురుకట్టుల(న్) చూ. ఎదురు.
ఎదురుకట్ల(న్) చూ. ఎదురు.
ఎదురుకత్తుక చూ. ఎదురు.
ఎదురుకెదురు చూ. ఎదురు.
ఎదురుకొమ చూ. ఎదురు.
ఎదురుకొలుపు చూ. ఎదురు.
ఎదురుకోలు చూ. ఎదురు.
ఎదురుక్షవరము చూ. ఎదురు.
ఎదురుగడ చూ. ఎదురు.
ఎదురుగడగవ్రాయుట చూ. ఎదురుగడ.
ఎదురుగడపత్రిక చూ. ఎదురుగడ.
ఎదురుగడయొడంబడిక చూ. ఎదురుగడ.
ఎదురుగడలెక్క చూ. ఎదురుగడ.
ఎదురుగాలి చూ. ఎదురు.
ఎదురుగుండ(న్) చూ. ఎదురు.
ఎదురుగుండా చూ. ఎదురు.
ఎదురుచు 'ఎదురు'యొక్క ప్రేరణార్థకం. రూ. ఎదుర్చు, ఎ్దురుచు. అ.క్రి., స.క్రి. మార్కొను, ప్రతిఘటించు. భార. కర్ణ. 2.164.
ఎదురుచుక్క చూ. ఎదురు.
ఎదురుచూచు చూ. ఎదురు.
ఎదురుచేట(వేయు) చూ. ఎదురు.
ఎదురుజవాబు చూ. ఎదురు.
ఎదురుండు చూ. ఎదురు.
ఎదురుతంటసము చూ. ఎదురు.
ఎదురుతాఁకగు చూ. ఎదురు.
ఎదురుతిరుగు చూ. ఎదురు.
ఎదురునకలు చూ. ఎదురు.
ఎదురుపడు చూ. ఎదురు.
ఎదురుపలుకు చూ. ఎదురు.
ఎదురుపాటు ఎదురు.
ఎదురుపుటక పో.చూ. ఎదురు. వి. మెడమీద కాసే కాయ.
ఎదురుప్రతి చూ. ఎదురు.
ఎదురుబడి[1] చూ. ఎదురు.
ఎదురుబడి[2] చూ. ఎదురు.
ఎదురుబిడి చూ. ఎదురు.
ఎదురుబిడివాఁడు చూ. ఎదురు.
ఎదురుమేనత్తకము చూ. ఎదురు.
ఎదురుమోల(న్) చూ. ఎదురు.
ఎదురుమ్రోయు చూ. ఎదురు.
ఎదురుమ్రోల(న్) చూ. ఎదురు.
ఎదురురొమ్ము చూ. ఎదురు.
ఎదురురొమ్ము చూ. ఎదురు.
ఎదురులెక్క చూ. ఎదురు.
ఎదురువడ్డి చూ. ఎదురు.
ఎదురువ్యాజ్యము చూ. ఎదురు.
ఎదురుసవ్వాహము చూ. ఎదురు.
ఎదురుసెలగు చూ. ఎదురు.
ఎదురెక్కు చూ. ఎదురు.
ఎదురెత్తు చూ. ఎదురు.
ఎదురెదురగు చూ. ఎదురు.
ఎదురేఁగు చూ. ఎదురు.
ఎదురేటు వి. గాలి అనువుగా లేనప్పుడు ఒకరు తూర్పార పోస్తుంటే మరొకరు ఎదురుగా నిలబడి వేరొక చేటతో విసరటం.
<ఎదురు+ఏటు.
ఎదురొడ్డు చూ. ఎదురు.
ఎదురొత్తు చూ. ఎదురు.
ఎదురొమ్ము రూ.చూ. ఎదురు రొమ్ము. వి. రొమ్ము నడిమి భాగం. రాఘవ. 4.111.
ఎదురొమ్మిమీఁదికుంపటి వి. మిగుల బాధాకరమైనది.
ఎదురొమ్మిమీఁదికుంపటి చూ. ఎదురొమ్ము.
ఎదుర్కట్టు చూ. ఎదురు.
ఎదుర్కొను చూ. ఎదురు.
ఎదుర్కోలు చూ. ఎదురు.
ఎదుర్చు రూ.చూ. ఎదురుచు. అ.క్రి. స.క్రి. మార్కొను, ప్రతిఘటించు, ఎదుర్కొను. భార. ఆది. 4.206, ~శాం. 7.30.
ఎదుర్చుక్క చూ. ఎదురు.
ఎదుర్పడు చూ. ఎదురు.
ఎదుర్పాటు చూ. ఎదురు.
ఎదుఱుమ్ము రూ.చూ. ఎదురురొమ్ము. వి. రొమ్ము నడిమి భాగం.
ఎదుఱొమ్ము రూ.చూ. ఎదురురొమ్ము. వి. రొమ్ము నడిమి భాగం.
ఎదుఱొమ్ముకుంపటి వి. గుండెల బరువు, తీర్చరాని కష్టం కల్గించే వస్తువు, గుండెలమీది కుంపటి.
ఎదుఱొమ్ముకుంపటి చూ. ఎదుఱొమ్ము.
ఎర్దడి విశ. 1. శూన్యం, లేనిది. హరి.పూ. 7.69; 2. దరిద్రం; వి. 1. దారిద్ర్యం, పేదరికం. ఆం.భా. 2.210, లచ్చ.రా. బాల. 8; 2. అభావం, లేకపోవటం; 3. వర్షాభావం.
పో.చూ. క. ఇటి. కిందికి వచ్చు, దిగు; పో.చూ. త. ఎళిమై. దారిద్ర్యం; ఏఙమై; తొద. ఏటయ్. దారిద్ర్యం.
ఎర్దడిగా(న్) క్రి.విశ. కష్టంగా. <ఎర్దడి+కాన్. ఎర్దడినీళ్లు వి. బ.వ. చాలీచాలని నీళ్లు. ఎర్దడివేల వి. నిర్జల భూమి. మరుభూమి. ఆం.భా. 2.5.
ఎర్దడిగా(న్) ఎర్దడి.

ఎద్దడిపీళ్ల చూ. ఎద్దడి.
ఎద్దడివేల చూ. ఎద్దడి.
ఎద్దడివరం పో.చూ. ఎద్దడి. వి. మిఱుఁగా వున్న మడికి పల్లంగా వున్న మడికీ మధ్య వేసిన గట్టు.
ఎద్దవుచీర చూ. ఎద్దము.
ఎద్దము వి. పట్టి తీరిన అంచు.

క. ఎద్దు. ముంచు, రంగువేయు ; త. ఎఴుతు. రంగు వేయు, గీయు, గంట్లుపెట్టబడు ; ఎఴుత్తు. రంగువెయ్యటం ; మ. ఎఴుతుక. రంగువేయు ; ఎఴుత్తు. చిత్రం.

ఎద్దవుచీర వి. పట్టెల అంచు పావడ.

ఎద్ది రూ.చూ. ఏది. సర్వ. ఏది ? భార. శాంతి. 6.547.
ఎద్దు రూ. ఎడ్డు. వి. **1.** వృషభం. హరి.పూ. 6.27, సారంగ. 2.276, సు.శ. 3 ; **2.** ఆదపశువు. ద.హిం.గా. 4.1009.

క. ఎత్తూ, ఎత్తు. ఎద్దు, వృషభం ; కొడ. ఎత్తు ; తు. ఎరు. దున్నపోతు, ఎద్దు ; త. ఎరుతు. ఎద్దు, కోడె ; మ. ఎరుతు. ఎద్దు, కోడె, బరువుమోసే జంతువు ; కోట. ఎత్ ; తొద. ఎస్త్ ; కొలా. ఎడ్. (బ.వ.-ల్)· ఎద్దు ; ఏడ్, యెద్ ; నా. హెడ్డ్. (బ.వ. హెడ్ల్) ; కుఱు. అడ్డో.

<ప్రా.తె. *ఎర్ద్ <మూ.ద.ద్రా. ఎర్ త్-.

ఎద్దుతత్తడిజోదు వి. ఎద్దు వాహనంగా గల వీరుడు. శివుడు. అచ్చ.రా. 3.59. ఎద్దునాలిక రూ. ఎద్దునాలుక. వి. గోజిహ్వ, బెండచెట్టు (Elephatopus scaber). ఆం.భా. 2.61. క. ఎత్తునాలిగె. ఒక రకం చెట్టు ; త. ఎరుమై నాక్కు. ఒక రకం చెట్టు, ఆకులు ఎద్దునాలుకవలె గరుకుగా ఉండటంవల్ల కావచ్చు ; పో.చూ. సం. గోజిహ్వ. ఎద్దు నాలుక చెట్టు, బెండ. ఎద్దునాలుక రూ.చూ. ఎద్దునాలిక. వి. బెండచెట్టు. ఎద్దువట్టు స.క్రి. వట్టలుకొట్టు, ముష్కహీనం చేయు, (ఎద్దును) బీజాలు లేనిదానినిగా చేయు, వశంలో నుంచుకొను. ఎద్దుబలువు వి. ఒక ఎద్దు మోయగల బరువు. ఎద్దుముట్టె వి. ఒక రకం దుంప. (ఎద్దుముట్టె ఆకారంలో ఉండే దుంప) (Pouzolzia tuberosa). ఎద్దుమొద్దు వి. మూఢుడు, అరసికుడు. సురా. 60. క. ఎద్దుమద్ద. ఎద్దు వలె మూర్ఖుడు. ఎద్దుమొద్దువాడు వి. మూర్ఖుడు. వేమ. 650. ఎద్దురాశి వి. వృషభరాశి. త. ఎరుతు. వృషభం, రాశి చక్రంలో రెండోరాశి. ఎద్దులవాడు రూ. ఎద్లవాడు. వి. ఎద్లను తోలేవాడు. ఎద్దువేఁట వి. ఎద్దును మాటుచేసికొని క్రూర జంతువులను వేటాడటం. రామా. 2.29.

ఎద్దుకట్టువంకెలు వి. బ.వ. ఒకరకం వడ్లు.
ఎద్దుకొమ్ము(గడ్డి) రూ. ఎద్దుగుమ్మ. వి. ఒకరకం కలుపుమొక్క.
ఎద్దుగుమ్మ రూ.చూ. ఎద్దుకొమ్ము. వి. ఒకరకం కలుపుమొక్క.
ఎద్దుతత్తడిజోదు చూ. ఎద్దు.
ఎద్దుతొక్కు రూ. ఎత్తొక్కు, ఎద్దొక్కు, ఎద్దోకు. వి. ముక్కర మాను, కొమిరెకి ఆధారంగా మోటదోనె పక్కగా బావి వైపు దొచ్చుకువచ్చినకొయ్య, ఇటువంటివి రెండుంటాయి.
ఎద్దునాలిక చూ. ఎద్దు.
ఎద్దునాలుక చూ. ఎద్దు.
ఎద్దువట్టు చూ. ఎద్దు.
ఎద్దుబలువు చూ. ఎద్దు.
ఎద్దుమట్టి రూ. ఎత్తిమట్టి. వి. ఒకరకం కలుపుమొక్క.
ఎద్దుముట్టె చూ. ఎద్దు.
ఎద్దుమొద్దు చూ. ఎద్దు.
ఎద్దుమొద్దువాడు చూ. ఎద్దుమొద్దు.
ఎద్దురాశి చూ. ఎద్దు.
ఎద్దులవాడు చూ. ఎద్దు.
ఎద్దువేఁట చూ. ఎద్దు.
ఎద్దొక్కు రూ.చూ. ఎద్దుతొక్కు.
ఎద్దోకు రూ.చూ. ఎద్దుతొక్కు.
ఎద్రుచు రూ.చూ. ఎదురుచు. అ.క్రి. ప్రతికూలమగు. ఉ. హరి. 4.109.
ఎన విశే. సాటి, సమానం, భార.స.భా. 1.78. వి. **1.** సామ్యం. చంపూ. 3.69 ; 6.40, **2.** జత, జోడు.

క. ఎణె, ఎణ. జంట, జత, సంబంధం, సావాసం, సర్దుబాటు, సమానత్వం, సామ్యం, సాటి ; కొడ. ఎణె. జత ; తు. ఇణె, ఇనై. జత, జంట, సాటి, సహవాసి ; త. ఇణై. ఒకేరకం రెండు వస్తువులు, జత, జంత, పోలిక ; మ. ఇణ. జత, జంట, కట్టు, చెలి, సహవాసి. ఇణెక్క. కలియు, ఇరుక్కుక.

<మూ.ద్రా. *ఎణ్-.

ఎనచేయు రూ. ఎనసేయు. స.క్రి. సమానం చేయు. సాటిచేయు. ఎనఁబోలు రూ. ఎనవోలు. అ.క్రి. సమానమగు, సాటియగు. భాగ. 4.744. ఎనవచ్చు అ.క్రి. సమానమగు, సాటియగు. జాహ్నవి. 1.72. ఎనవాయు అ.క్రి. జతవీడు, జోడువాయు. భారా. సుందర. 303. <ఎన+పాయు. ఎనవోలు రూ.చూ. ఎనఁబోలు. అ.క్రి. సాటిఅగు, సరిపోలు. వసు. 2.46. <ఎన+పోలు ఎనసేయు రూ.చూ. ఎన చేయు. స.క్రి. సమానంచేయు, సాటిచేయు. విక్ర. 8.46.

ఎనకరి రూ. ఆఁకరి, ఏఁకరి. వి. ఒక కిరాత జాతి. ఆం.భా. 2.289.
ఎనకొమ్ములు వి. బ.వ. ఒకరకం వడ్లు.
ఎనచేయు చూ. ఎన.
ఎనపు 'ఎనయు' ప్రేరణార్థకం. స.క్రి. కలుపు, ఒకటి చేయు, పొందించు. చంద్రికా. 4.68.
ఎనబది రూ.చూ. ఎనుఁబది వి. ఎనభై.
ఎనభయి రూ.చూ. ఎనుఁబది. వి. ఎనభై.
ఎనభై రూ.చూ. ఎనుఁబది. వి. ఎనిమిది పదులు.
ఎనమండుగురు రూ.చూ. ఎనమండ్రు. వి. ఎనిమిది మంది.
ఎనమండ్రు రూ. ఎనమండుగురు, ఎనమండ్రురు. వి. బ.వ. ఎనిమిది మంది. భార.ఆది. 4.125.

పో.చూ. క. ఎణ్బర్. ఎనిమిది మంది ; త. ఎణ్-మర్, ఎణ్-వర్. ఎనిమిది మంది ; మ. ఎణ్మర్.

ఎనమండ్రురు రూ.చూ. ఎనమండ్రు. వి. బ.వ. ఎనిమిది మంది. భార.ద్రోణ. 3.216.
ఎనమందుము రూ. ఎన్మందుము. చూ. ఎనిమిది. వి. ఎనిమిది తూముల పరిమాణం.
ఎనమనూఱు రూ.చూ. ఎనమన్నూఱు. వి. ఎనిమిది వందలు.

భార.ఆది. 1.44, జై.భా. 8.176, శివ. 7.65.

**ఎనమన్నూఱు** రూ. ఎనమనూఱు. వి. ఎనిమిది వందలు. భార. ఆది. 1.44.

క. ఎంటునూఱు ; తు. ఎణ్మనూదు ; త. ఎణ్ణూరు. ఎనిమిది వందలు ; మ. ఎణ్ణూఱు. ఎనిమిది వందలు.

**ఎనమలుపెట్టు** పో.చూ. ఇడుమ. అ.క్రి. తప్పులు పట్టు.

**ఎన(బోలు** చూ. ఎన.

**ఎనయమి** చూ. ఎనయు.

**ఎనయిక** చూ. ఎనయు.

**ఎనయించు** చూ. ఎనయు.

**ఎనయు** చూ. ఎన. రూ. ఎనియు. అ.క్రి. **1.** సరియగు, సమానమగు. భార.విరా. 3.114, హరి.ఉ. 5.156 ; **2.** వ్యాపించు, ప్రసరించు. హరి.పూ. 8.39 ; **3.** కలుగు, సంభవించు. హరి.ఉ. 2.68, శుక. 1.219 ; **4.** కలియు, ఏకమగు. భార.శాంతి. 4.295 ; **5.** లభించు. ఆము. 340; **6.** ఒప్పు, తగియుండు, తగు. ఇందు. 1.106 ; **7.** (ఈగల వలె) మూగు. రామలిం.శ. 83 ; **8.** సంగమించు, రమించు. శకుం. 3.81 ; స.క్రి. **1.** పోలు, భార.కర్ణ. 2.23, హరి.పూ. 8.153 ; **2.** తాకు, అంటు. హరి.పూ. 167, వసు. 3.148. **3.** అనుభవించు, పొందు. వసు. 3.183 ; **4.** (రతియందు) కలియు. ఇందు. 5.156, హంస. 2.66 ; **5.** గ్రహించు, పుచ్చుకొను. శుక. 2.360.

క. ఎణాసు. జతచేయు, సమంచేయు, పోల్చు ; త. ఇణై. అ.క్రి. అంగీకారమగు, కలియు, పోలు, జతఅగు, ఎల్లు. స.క్రి. సమంచేయు ; మ. ఇణయుక. అంగీకరించు. ఇణొక్క. కల్పు. ఇణజ్ఞుగ. అంగీకరించు. ఇణక్కుక. పరస్పరాంగీకారం పొందు ; నా. ఎల్గ్. కౌగిలించుకొను ; కుఇ. ఏణ్బ. అంగీకరించు, శిరసావహించు.

మూ.ద్రా. *ఎక్-/*ఎణ్.

**ఎనయమి** వి. విరోధం, అసమ్మతి. **ఎనయిక** వి. **1.** పొందిక. భార. అను. 4.184, ఆము. 6.119 ; **2.** పోలిక. **ఎనయించు** స.క్రి. **1.** అదుకు, కలుపు. వేంక. పంచ. 2.63 ; **2.** కలిగించు. వసు. 1.9 ; **3.** చేయు, కావించు. హంస. 2.104. త. ఇణై. కలుపు, ఏకంచేయు.

**ఎనవచ్చు** చూ. ఎన.

**ఎనవాయు** చూ. ఎన.

**ఎనవోలు** చూ. ఎన.

**ఎనసేయు** చూ. ఎన.

**ఎని** రూ.చూ. ఎన్ని[1]. సర్వ. ఎన్ని. (వస్తువులు మొ.)

**ఎనిక[1]** రూ.చూ. ఎన్నిక[1]. వి. గణనం, లెక్క. విజ్ఞా. 2.45.

**ఎనిక[2]** రూ.చూ. ఎన్నిక[2]. వి. నాలుగు పోగుల నూలు దారం.

**ఎనికె[1]** రూ.చూ. ఎన్నిక[1]. వి. గణనం, లెక్క.

**ఎనికె[2]** రూ.చూ. ఎన్నిక[2]. వి. మూడు లేక నాలుగు పోగుల నూలు దారం.

**ఎనిమిదడుగులమెకము** చూ. ఎనిమిది.

**ఎనిమిది** రూ. ఎన్మిది. వి. విశ. ఎనిమిది. భార. ఆది. 1.49, కర్ణ. 2.345.

క. ఎంటు. ఎనిమిది, కొడ. ఎట్టి. తు. ఎణ్మ. ఎనిమిది ; త. ఎట్టు. ఎనిమిది సంఖ్య ; ఎణ్. సంఖ్యా విశ ; మ. ఎట్టు. ఎనిమిది.

**ఎనిమిదడుగులమెకము** వి. శరభం, సింహం కంటె బలవత్తరమైన ఎనిమిది కాళ్లగల జంతువు. వేంక. ఆం. 3.94. **ఎనిమిదికాళ్లచుక్క** వి. ద్వాదశవ నక్షత్రం. పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర. రెంటికి కలిపి ఎనిమిది పాదాలు. సం.లో ప్రోష్ఠపద అంటారు. పిలిన గిట్టల దృష్ట్యా ఆవుకులాగా ఎనిమిది పాదాలు కలదని కావచ్చు. **ఎనిమిదికాళ్లరిక్క** వి. ద్వాదశవ నక్షత్రం. పూర్వాభాద్ర. ఉత్తరాభాద్ర. రెంటికి కలిపి ఎనిమిది పాదాలు.

**ఎనిమిదికాళ్లచుక్క** చూ. ఎనిమిది.

**ఎనిమిదికాళ్లరిక్క** చూ. ఎనిమిది.

**ఎనిమిదికాళ్లరిక్కనెల** వి. భాద్రపద మాసం.

**ఎనిమిదికాళ్లరిక్కనెల** చూ. ఎనిమిదికాళ్ల రిక్క.

**ఎనియు** రూ.చూ. ఎనయు. అ.క్రి. కలిసికొను.

**ఎనీమ** వి. ఆసనంలోకి ఎక్కించే ద్రవం.

ఇం. *Enema*. ఆసనంలో ఎక్కించే ద్రవం.

< ఇం. Enema.

**ఎను[1]** రూ.చూ. ఎనుప. విశ. ఎనుముకు సంబంధించిన.

**ఎనుపపసు** వి. గేదె. కాలువూరు శాసనం. 1365, నెల్లూరు శాసనం. 3.1121. **ఎనుపసరము** వి. గేదె. ఆం.భా. 2.264. **ఎనపెంటి** వి. గేదె. త. పెణ్-ణ్-ఎరుమై. గేదె ; పో.చూ. పెంటు. ఆడ. **ఎనుపోతు** వి. దున్నపోతు. భార. విరా. 1.83. త. ఎరుమై-ప్-పోత్తు దున్నపోతు.

**-ఎను[2]** అవ్య. **1.** ప్రథమ పురుషైక వచనంలో భూతకాలిక క్రియకు వచ్చే అంత్యానుబంధం. ఉ. (వాడు) పడు + -ఎను. భార. ఆది. 5.95, శాంతి. 5.570 ; **2.** తిర్యగ్వాచకాలు వాచ్యాలయినప్పుడు బహువచనానికి కూడా. చిలుకలు పలుకు + -ఎను. వాచక అంత్యానుబంధం. < -ఎ-ను.

**ఎనుచు** చూ. 'ఎనయు.' ప్రేరణార్థకం. స.క్రి. **1.** ఎనియజేయు, కలియజేయు, కలియబెట్టు, వండిన కూరలను మెత్తగా ఎనుపు ; **2.** దంచు, పెరకు.

త. ఇణై. కలుపు, అతికించు.

**ఎనుప** చూ. ఎనుము. రూ. ఎను[1]. విశ. **1.** గేదెకు సంబంధించిన ; **2.** నల్లని.

**ఎనవకదుపు** వి. గేదెల మంద. త. ఎరుమై. గేదె, కతుప్పు. పశువులమంద. **ఎనుపతేలు** రూ.చూ. ఇనుపతేలు. వి. నల్లతేలు. ఆం.భా. 2.88. పో.చూ. క. ఎమ్మెచేళు. పెద్ద నల్లతేలు. **ఎనుపదూడ** వి. గేదె దూడ. **ఎనుపపాలు** వి. గేదె పాలు. **ఎనుపమో(కాలు** వి. దున్నపోతు మోకాలు లాగా ఉండే ఒక రకం చెట్టు. త. కరున్ కాలి. మైసూరు రాష్ట్రంలో, కోరమండలంలోని నల్లచేవ మాను (Terpru Ebonum).

**ఎనుపకదుపు** చూ. ఎనుప.

**ఎనుపతేలు** చూ. ఎనుప.

**ఎనుపదూడ** చూ. ఎనుప.

**ఎనుపపాలు** చూ. ఎనుప.

**ఎనుపమోకాలు** చూ. ఎనుప.

**ఎనుపశువు** చూ. ఎను[1].

**ఎనుపసరము** చూ. ఎను[1].

**ఎనుపు** చూ. 'ఎనుచు' ప్రేరణార్థకం. స.క్రి. కలుపు, కలియ బెట్టు.

ఎనుపుడు వి. కలపటం, కలియబెట్టటం.

**ఎనుపుడు** చూ. ఎనుపు.

**ఎనుపెంటి** చూ. ఎను[1].

**ఎనుపోతు** చూ. ఎను-[1].

**ఎనుబంద్రుడు** చూ. ఎనుఁబది. వి. బవ. ఎనభైమంది. ఎనుబదికి మహన్మహత్వర్థక రూపం.

క. ఎణ్‌బదింబర్ ; త. ఎణ్-పతిణ్-పర్.

**ఎనుబొది** రూ.చూ. ఎనుఁబది. వి. ఎనభై. అర్ధంకి పందరంగని గాననం. నిరోష్ఠ్యమైన "అ" ఓష్ఠమైన 'ఒ' గ మారటం, ఉభయోష్ఠ్యమైన 'వ' వర్ణ ప్రభావం వల్లనే.

**ఎనుమద్ది** చూ. ఇనుమద్ది. వి. మద్ది జాతికి చెందిన ఒక పెద్ద చెట్టు.

**ఎనుము[1]** రూ. ఎన్ము, ఎలుము[2]. వి. గేదె. విజ్ఞా. 8.4, వరాహ. 11.84.

క. కొర. ఎమ్మె. గేదె; తు. ఎర్మె. గేదె; త. ఎరుమై. గేదె లేక దున్న, పో.చూ. ఇరుమై. నలుపు, పో.చూ. కార్-అన్. గేదె, కార్-అ. దున్న; మ. ఎరిమ. గేదె లేక దున్న, ప్రధానంగా గేదె. ఎరుమ. గేదె; గోం. ఎర్మి. గేదె; పో.చూ. పర్జి. బిర్. బవ. బిర్‌కుల్. గేదె. బిర్‌చికొడ్. సాయంత్రం. గేదెలాంటి చీకటి. పో.చూ. కొలా. శిర్న్. వి. బవ. సిద్. గేదె. హైగసిర్. దున్న. హిన్లాపసిల్. గేదె; నా. శిర్. గేదె; ఒ. సిర్. గేదె. ప్రాయస్సిరు. గేదె; పో.చూ.బ్రా. హిర్. ఒంటెపిల్ల.

<ప్రా.తె. *ఎరుమ్.

గేదె నలుపు కాబట్టి నల్లని అని అర్థవివరి.

ఎనుముగొడ్డు వి. గేదె.

**ఎనుము[2]** రూ.చూ. వెలువు. వి. పొట్టిగా వుండే వైపు దాని కొలత.

**ఎనుముగొడ్డు** చూ. ఎనుము[1].

**ఎనుఁబది** రూ. ఎణుంబొది, ఎణ్బది, ఎనబది, ఎనభయి, ఎనభై, ఎనుబొది, ఎన్బది. వి. ఎనిమిది పదులు, ఎనభై. ఉ.హ. 4.6.

క. ఎంబత్తు; తు. ఎణ్ప; త.మ. ఎణ్‌పతు.

<మూ.ద్రా. ఎణ్‌పత్.

**ఎనెమ్మ** రూ.చూ. ఎరిణమ్మ. వి. పుట్టిన పదినాళ్లలోపు పురిటి పాపలను బాధిస్తుందని చెప్పబడే ఒక భూతం, పురిటి పురుగు.

**ఎంత** సర్వ. ఎంతకాలం. భార. ఆది. 7.266, హరి. ఉ. 5.248. విశ. **1.** ఎంతపాటి. ఆము. 2.19; **2.** సందర్భాన్ని బట్టి ప్రదేశాదుల్ని తెలిపేది ఆము. 5.77, పారి. 1.80; **3.** ఎక్కువ లేక తక్కువ నీతి. సీ. 56.

పో.చూ. క. ఎంథ, ఎంతహ. ఏరకం, ఎలా. ఎనితు. ఎంతపాటి, ఏకొలది, ఎన్ని, ఎంతకాలం; తు. ఎతు. ఏపాటి, ఏకొలది, ఎన్ని, ఎంతకాలం; త. ఎనైత్తు. ఎంతపాటి, ఎనయ్. ఎంతపాటి; మ, ఎ్రత. (<ఎత్తిర) ఎంత మొత్తం, ఎంతపాటి, ఎన్ని; పర్జి. ఎంగొట్. ఎంత. ఎనొ*త్. ఎంత, అంత; కోలా. ఎంజెల్, ఎత్రె. ఎంత; నా. ఎంజెల్, ఎత్తెర్. ఎంత; ఒల్లా. ఎంగెర్. ఎన్ని. ఎన్నెత్. అంత, ఏనెత్. ఎలా.

<మూ.ద్రా. *ఎన్-.

**ఎంతకు** క్రి. విశ. ఎంతమొత్తానికి. **ఎంతట** క్రి. విశ. ఎంతలో, చాలాకాలందాకా. మల్ల. 101. **ఎంతటి** విశ. ఎంత ప్రమాణంగల. పారి. 1.10. **ఎంతటివారు** వి. ఎంతపాటి మనుష్యులు. **ఎంతదనుక(న్)** రూ. ఎంతదాఁక(న్), ఎందనుక(న్), ఎందాఁక(న్), క్రి. విశ. ఎంతపర్యంతం. **ఎంతదాఁక(న్)** రూ.చూ. ఎంతదనుక(న్). క్రి. విశ. ఎంతపర్యంతం. **ఎంతమంది** సర్వ. ఎందరు మనుష్యులు. **ఎంతమాత్రము** క్రి. విశ. ఏపాటి. **ఎంతయు(న్)** అవ్య. మిక్కిలి, అధికం. భార. ఆది. 6.6. క్రి. విశ. చాలా, అమితంగా, అధికంగా. భార. ఆది. 4.36. **ఎంతయైన** క్రి. విశ. **1.** ఎంత ఎక్కువ అయినా; **2.** చాలా ఎక్కువ, అత్యంతం. **ఎంతలు** క్రి. విశ. ఎంత పెద్ద! ఎంత ఎక్కువ! భార.ద్రోణ. 2.388. **ఎంతలో** క్రి. విశ. ఎంత విలువలో, ఎంత సేపటిలో, ఎంత మొత్తంలో. **ఎంతవరకు** క్రి. విశ. **1.** ఏప్రదేశంవరకు?; **2.** ఎంతకాలంవరకు? **ఎంతసేపు** క్రి. విశ. **1.** ఎంతకాలం; **2.** సమయమంటా. **ఎంతే(న్)** రూ.చూ. ఎంతేని. అవ్య. సమృద్ధిగా, అత్యంతంగా. ఆము. 4.107. **ఎంతేని** రూ. ఎంతే(న్). అవ్య. అత్యంతం, అధికంగా. రంగ. చ. 1.156. అత్యంతం, అధికంగా. త. -ఏని, అయినుమ్. అయినప్పటికి. **ఎంతో** అవ్య. ఎంతేని, అధికం, మిక్కిలి. ఆము. 6.9, ఇందు. 1.176. క్రి. విశ, అత్యంతంగా, అధికంగా. క. ఏంతొ ఒహ. ఎంత? ఒహ. ఏరకం. పో.చూ. ఎంతెతొ, ఒహ. ఏమిటి. ఏరకం. ఒహ. ఎంతవింత; తు. ఎతో. చాలా, ఎక్కువ. మొ. **ఎందనుక(న్)** రూ.చూ. ఎంతదనుక(న్). క్రి. విశ. ఎంతపర్యంతం. **ఎందాఁక(న్)** రూ.చూ. ఎంతదనుక(న్). ఉద్యో. 2.66; క్రి. విశ. ఎంతపర్యంతం. భార.శాంతి. 6.341.

**ఎంతకు** చూ. ఎంత.

**ఎంతట** చూ. ఎంత.

**ఎంతటి** చూ. ఎంత.

**ఎంతటివారు** చూ. ఎంతటి.

**ఎంతదనుక(న్)** చూ. ఎంత.

**ఎంతదాఁక(న్)** చూ. ఎంత.

**ఎంతమంది** చూ. ఎంత.

**ఎంతమాత్రము** చూ. ఎంత.

**ఎంతయు(న్)** చూ. ఎంత.

**ఎంతయైన** చూ. ఎంత.

**ఎంతలు** చూ. ఎంత.

**ఎంతలో** చూ. ఎంత.

**ఎంతవరకు** చూ. ఎంత.

**ఎంతసేపు** చూ. ఎంత.
**ఎంతే(న్)** చూ. ఎంత.
**ఎంతేని** చూ. ఎంత.
**ఎంతో** చూ. ఎంత.
**ఎందమక(న్)** చూ. ఎంత.
**ఎందఱు** సర్వ. బ.వ. ఎంతమంది. ఆము. 1.83.
పో.చూ. క. ఎనితు, ఎంత. ఎనిబర్. ఎంతమంది; త. ఎనైవర్. ఎంతమంది; కొలా. ఎందర్. ఎంతమంది మనుషులు; నా. ఎంఫర్.
<మూ. ద.ద్రా. ఎందర్.
**ఎందఱే** రూ.చూ. ఎందఱేని. సర్వ., బ.వ. చాలామంది. ఆము. 1.88. **ఎందఱేని** రూ. ఎందఱే. సర్వ., బ.వ. చాలామంది. పాండు. 4.267. **ఎందఱో** సర్వ., బ.వ. చాలామంది.
**ఎందఱే** చూ. ఎందఱు.
**ఎందఱేని** చూ. ఎందఱు.
**ఎందఱో** చూ. ఎందఱు.
**ఎందలి** చూ. ఎందు.
**ఎందాఁక(న్)** చూ. ఎంత.
**ఎందు(న్)** అవ్య. **1.** దేనియందు. ఇది సందర్భాన్నిబట్టి దేశాన్ని కాలాన్ని తెల్పుతుంది. భార.సభా. 2.41; **2.** ఎక్కడ. భార.విరా. 2.26; **3.** ప్రతిచోటా. భార.శాంతి. 2.66.
క. ఎందు. ఏకాలం, ఎక్కడ; త. ఎతు. ఏది; ఎతఱ్కు. ఎందుకు.
**ఎందలి** క్రి. విశ. ఎక్కడి. క. అలి < అల్లి. అక్కడ. **ఎందుకంటే** అవ్య. ఏకారణంవల్ల అంటే. **ఎందుకనిన** అవ్య. ఏకారణంవల్ల అంటే. **ఎందుకు** క్రి. విశ. దేనికి? ప్రభా. 2.71. **ఎందుకో** క్రి. విశ. దేనికోసమో? **ఎందుచేత** క్రి.విశ. ఏకారణంచేత. **ఎందుండి** క్రి. విశ. **1.** ఎక్కడినుండి? ఏ ప్రదేశంనుండి? భార.ఆది. 5.213; **2.** ఏప్రదేశంలో ఉన్న తర్వాత. మను. 1.61. **ఎందుమ** అవ్య. ప్రతిచోటా, అన్నిటా. భార.ఆది. 4.158, హరి. పూ. 1.45. **ఎందువేని** అవ్య. ఎక్కడికైనా. ఆము. 4.255. **ఎందుల(న్)** క్రి. విశ. దేనియందు, దేనివలన. దశా. 1.221. **ఎందులకు(న్)** క్రి. విశ. **1.** ఎక్కడికి. భార.ఆది. 4.231, మను. 6.55; **2.** దేనికి. ఆము. 2.29. **ఎందులోనిది** విశ. ఏపాటిది. వరాహ. 12.59. **ఎందేనిమండి** విశ. ఎక్కడినుండో. భార.ఆది. 3.181. **ఎందేనియు(న్)** అవ్య. ఎక్కడికో. కాశీ. 1.105. **ఎందో** అవ్య. ఎక్కడో.
**ఎందుకంటే** చూ. ఎందు(న్).
**ఎందుకనిన** చూ. ఎందు(న్).
**ఎందుకు** చూ. ఎందు(న్).
**ఎందుకో** చూ. ఎందు(న్).
**ఎందుచేత** చూ. ఎందు(న్).
**ఎందుండి** చూ. ఎందు(న్).
**ఎందుమ** చూ. ఎందు(న్).
**ఎందువేని** చూ. ఎందు(న్).
**ఎందుము** రూ.చూ. ఏఁదుము. వి. అయిదు తూములు. ద.హిం. గా. 526. శ. 1241.
**ఎందుల(న్)** చూ. ఎందు(న్).
**ఎందులకు(న్)** చూ. ఎందు(న్).
**ఎందులోనిది** చూ. ఎందు(న్).
**ఎందేనిమండి** చూ. ఎందు(న్).
**ఎందేనియు(న్)** చూ. ఎందు(న్).
**ఎందో** చూ. ఎందు(న్).
**ఎన్నఁటివలె(న్)** చూ. ఎన్నఁడు.
**ఎన్నఁడు** రూ.చూ. ఏనాఁడు. వి. ఏదినం, ఏకాలం. **వరాహ.** 7.37. అవ్య. ఎప్పుడూ, ఎల్లప్పుడూ. ఈ **అర్థంలో** ప్రశ్నాంతంగానే ఉంటుంది. హర. 2.129.
**ఎన్నఁటివలె(న్)** క్రి. విశ. ఎప్పటి రీతిగా, **వెనుకటి** మాదిరిగా. దశా. 2.51. త. ఎన్నుమ్-పోల్. **మామూలుగా;** ఎ-న్-నాళ్-ఉమ్-పోల్. మామూలుగా. **ఎన్నఁడో** అవ్య. ఎప్పుడో. భార.ద్రోణ. 2.51. <ఎన్నఁడు + -ఓ.
**ఎన్నఁడో** చూ. ఎన్నఁడు.
**ఎన్నవ** వి. చెప్పరూ ఏడవటం.
పో.చూ. త. ఎన్-. చెప్పు, తెలియజేయు. ఎన్నె. అనుకంపంతో లేక ఆశ్చర్యంతో అనే మాట. ఇన్నల్. కష్టం, బాధ.
**ఎన్నాళ్లు** ఎన్ని + నాఁడు + -లు. ఎన్ని + నాళ్లు. వి.బవ. ఎన్ని రోజులు. ఆము. 6.54, విజయ. 2.174.
త. ఎనయ్. ఎన్ని.
**ఎన్ని**[1] రూ. ఎని. సర్వ. **1.** ఎంత సంఖ్య గలవి? **2.** చూపదర్శకం. భార.ఉద్యో. 3.41, పాండు. 4.176, శశా. 4.176.
పో.చూ. క. ఏనితు. ఎంత? ఎన్ని?; పో.చూ. తు. ఏతు. ఎన్ని, ఎంత; పో.చూ. త. ఎనై. అన్ని, ఎన్నో అన్ని, ఎన్ని?; కొలా. ఎనిన్. ఎన్ని; నా. ఎన్నింగ్. ఎన్ని.
<మూ.ద్రా. *ఎన్-.
**ఎన్నియో** అవ్య. చాలా, బహు సంఖ్య గలవి.
**ఎన్ని**[2] వి. దూడలు ఆపేక్షయంగా తినే ఒక ఆకు మొక్క.
**ఎన్నిక**[1] చూ. ఎన్ను. రూ. ఎనిక[1], ఎనికె[1]. వి. **1.** గణనం, లెక్క. కాశీ. 2.91; **2.** సంకల్పం. ఉరా. 8.178, కువచ. 4.90; **3.** అపకీర్తి, నింద. శుక. 3.299; **4.** ఊహ, ఆలోచన. శుక. 3.149, విప్ర. 5.48; **5.** ప్రసిద్ధి, ఖ్యాతి. రసిక. 3.81, నీలా. 1.53; **6.** ఎన్ను కొనటం; విశ. **1.** కోరదగినది, తగినది. ప్రబోధ. 5.13, ఆము. 3.57; **2.** గణనీయం, శ్రేష్ఠం.
క. ఎణికె, ఎన్నికె. లెక్క, గణనం, సంఖ్య, ఆలోచన, గమనింపు; తు. ఎణ్ణుని. ఆలోచించు. ఎణికె; త. ఎణ్ణిక్కై. అంకెలు వేయటం, గౌరవం, మర్యాద; మ. ఎణ్ణుక. లెక్కించు. అంకెలు వేయు, గౌరవించు, ఎణ్. సంఖ్య. ఆలోచన; తొద. ఒణ్. (ఒణ్య. లెక్కించు.) ఒణ్గ. ఎన్ను; కుఇ. ఎజి. అంకె, ఎజ్‌బాయ్. లెక్కించు. కువి. ఎజికినై. లెక్కించు.
<మూ.ద.ద్రా. *ఎణ్.

ఎన్నికకదుపులు వి. బవ. విలువగల పశువులు. ఎన్నికకెక్కు అ.క్రి. ప్రసిద్ధిచెందు. గణనకెక్కు. విక్ర. 1.187. ఎన్నికచేయు స.క్రి. గణించు, లెక్కించు. ఎన్నికదారులు వి. బవ. ఓటర్లు. <ఎన్నిక[1] + ఉ. దార్. (<పా. దార్). ఎన్నికపెట్టు స.క్రి. లెక్కించు, గణించు. ఎన్నికమనిషి వి. విశిష్ట వ్యక్తి. ఎన్నికమాటలు వి. బవ. విలువైన మాటలు. ఎన్నికయిడు (ఇడు) స.క్రి. లెక్కించు. సాంబని. 2.50. ఎన్నికలు వి. బవ. ఎలక్షన్లు.

ఎన్నిక[2] రూ. ఎనిక[2], ఎనికె[2]. వి. నాలుగు పోగుల నూలు దారం.

ఎన్నికకదుపులు చూ. ఎన్నిక[1].

ఎన్నికకెక్కు చూ. ఎన్నిక[1].

ఎన్నికచేయు చూ. ఎన్నిక.

ఎన్నికదారులు చూ. ఎన్నిక[1].

ఎన్నికపెట్టు చూ. ఎన్నిక[1].

ఎన్నికమనిషి చూ. ఎన్నిక[1].

ఎన్నికమాటలు చూ. ఎన్నిక[1].

ఎన్నికయిడు చూ. ఎన్నిక[1].

ఎన్నికలు చూ. ఎన్నిక.

ఎన్నియో చూ. ఎన్ని[1].

ఎన్ను[1] స.క్రి. **1.** లెక్కించు. భార. ఆది. 1.19, ద్రోణ. 2.200 ; **2.** ఆక్షేపించు, నిందించు. హరి. పూ. 9.74, రసిక. 1.54 ; **3.** ప్రసంగించు, చెప్పు. భార. అను. 4.42, విక్ర. 8.73 ; **4.** ఆలోచించు, ఊహించు, భావించు. రామా. 5.220 ; **5.** లక్ష్యపెట్టు. సరకుచేయు, ఆము. 4.127 ; **6.** తెలిసికొను, గ్రహించు. వసు. 3.57 ; **7.** పన్ను. ఎత్తువేయు. శుక. 2.191 ; **8.** స్తుతించు. పొగడు. నీలా. 2.41. వి. ప్రసిద్ధి, కీర్తి. రసిక. 3.81.

క. ఎన్, ఎన్ను. చెప్పు, మాట్లాడు, పిలుచు, పేర్కొను. ఎణ్, ఎణ్ణు, ఎణిసు. లెక్కించు, విచారించు, పోల్చు, ఆలోచించు ; తు. ఎణ్ణుని, ఎణ్ణుణ. ఆలోచించు ; త. ఎణ్ణు. ఆలోచించు, గౌరవించు, లెక్కించు ; మ. ఎణ్ణుక. లెక్కించు, గౌరవించు. ఎణ్. సంఖ్య, ఆలోచన. కొ. ఎణ్. లెక్కించు. ఒణ్. కుఇ. పో.చూ. ఏలు. మనస్సు, కారణం, తెలివి, ఆలోచన. ఎల్కి. మనస్సు, కారణం ; కువి. ఎణకి. లెక్కించు.

<మూ.ద్రా. *ఎణ్.

ఎన్నుకొను స.క్రి. వరించు, కోరుకొను, ఏరుకొను. ఎన్నువ వి. చచ్చినవారిని తలచుకొని ఏడుస్తూ స్త్రీలు వారి జీవిత చరిత్రల్ని పేర్కొనటం.

ఎన్ను[2] రూ. వెన్ను. వి. **1.** ధాన్యం కంకి. జై.భా. 7.197, ఉ.రా. 1.74 ; **2.** మొక్క పై కొనగింజలు పట్టే భాగం. ఆం.భా. 2.236.

క. తెనె. మొన, ఓిల, ధాన్యం కంకి ; త. వెన్ని. పై భాగం. పో.చూ. తినై. ఇటలీ జొన్న ; మ. వెన్ని. పై భాగం. తల, చిన. కంకివలె పైకి లేచుట ; చినెక్క. పైకి లేచుట, మొలచుట ; చినెక్కుక. మొలకెత్తుట, పండుట ; గోం. సెన్. వరికంకి ; పర్జి. వెన్. వరికంకి ; ఈన్. (ధాన్యాదులు) పాలు పోసుకోవటం ; కొలా. సెన్. వరికంకి ; నా. సెన్. వరికంకి.

<మూ.ద్రా. *చెన్.

ఎన్నుపొచ్చ వి. చోడి తెగులు, ఊచ తెగులు.

ఎన్ను[3] వి. నాలుగు పోగుల నూలు దారం. శుక. 2.428, ఆం.భా. 2.295.

ఎన్నుకొను చూ. ఎన్ను[1].

ఎన్నుపొచ్చ చూ. ఎన్ను[2].

ఎన్నువ చూ. ఎన్ను[1].

ఎన్నెమ రూ.చూ. ఎరిణమ్మ.

ఎన్నెమ్మ రూ.చూ. ఎరిణమ్మ. వి. పుట్టిన పదినాళ్లలో పురిటి పాపల్ని బాధిస్తుందని చెప్పబడే ఒక భూతం, పురిటి పురుగు.

ఎన్నెమ్మపురుగు వి. పురిటి పురుగు. పురిటి పాపల్ని బాధించేందుకు పురుగు రూపంలో వచ్చిన ఎన్నెమ్మ భూతం.

ఎన్నెమ్మపురుగు చూ. ఎన్నెమ్మ.

ఎన్బది రూ.చూ. ఎనుబది. వి. ఎనభై.

ఎన్మందుము రూ.చూ. ఎనమందుము. వి. ఎనిమిది తూములు.

ఎన్మిది రూ.చూ. ఎనిమిది. వి. ఎనిమిది సంఖ్య. భార. ఆర. 4.37.

ఎన్ము రూ.చూ. ఎనుము[1]. వి. గేదె.

ఎపుడు రూ.చూ. ఎప్పుడు. క్రి.విశ. ఎల్లప్పుడు. భార. ఆది. 2.49, ఉ.రా. 1.34.

ఎప్డు రూ.చూ. ఎప్పుడు. క్రి.విశ. ఎల్లప్పుడు. విక్ర. 1.1.

ఎప్పటట్లు చూ. ఎప్పుడు.

ఎప్పటికంటె(న్) చూ. ఎప్పుడు.

ఎప్పటికందువ చూ. ఎప్పుడు.

ఎప్పటికప్పుడు చూ. ఎప్పుడు.

ఎప్పటికప్డు చూ. ఎప్పుడు.

ఎప్పటియాటయాడు చూ. ఎప్పుడు.

ఎప్పంటికంటె(న్) చూ. ఎప్పుడు.

ఎప్పుడు రూ. ఎపుడు, ఎప్డు. వి. **1.** ఎల్లప్పుడు (ఈ అర్థంలో 'ను' అంటాగమంగా వస్తుంది). భార. సభా. 1.29 ; ('ను' లేకుండా) భార. ఆర. 2.26 ; **2.** ఏ సమయంలో ? యదార్థకం. ఆము. 4.12 ; **3** పూర్వం, మునుపు. ఆము. 6.71, విష్ణు. 1.198.

క. ఏ. ఎమిటి ? ఏది ? ; పొత్తు. సూర్యుడు, కాలం ; పో.చూ. ఏవాగలూ, యావాగలూ. ఎల్లప్పుడు ; తు. ఏప, ఏపళు. ఏ సమయం ? ఎప్పుడు ; ఏపల, ఏపళ్ల. ఎల్లప్పుడు ; త. ఎ-ప్-పొళుతు. ఎప్పుడు ? ఎప్పోతు. ఎప్పుడు ; ఎ-ప్-పొళుత్-ఉమ్ ; ఎ-ప్-పోత్-ఉమ్. ఎల్లప్పుడు ; మ. ఎప్పోళ్. ఏ సమయం ? ఎప్పుడు ? ; ఎప్పోళుం. ఎల్లప్పుడు ; పో.చూ. గో. బప్పోజ్. ఎప్పుడు ; కోలా. ఎప్పుడ్. ఏ సమయాన ? ఎప్పుడు ; నిపుడ్, యప్పుడ్. ఎప్పుడు ; ఎ. ఎది, పొడ్. వి. సూర్యుడు ; పొద్ద. సూర్యుడు ; పొద్దుల్. రోజంతా.

<మూ.ద్రా. *ఏపొత్-.

పోవు : 2. ఒడిపోవు ; 3. కొత్తకుండలో పోసిన నీరు దాని సూక్ష్మ రంధ్రాలగుండా వెలుపలకు స్రవించు : 4. రంగు విడుచు, చాయబోవు ; 5. శరీరము సడలిపోవు.

**ఎలిసె** రూ.చూ. వెలిసె. వి. గోడకూ ఇంటికప్పుకూ నడుమ ఉండే తెరపబోటు.

**ఎలుక** రూ. ఇలి[2], ఎలక, ఎలిక[1], ఎలికె, ఎల్క. వి. మూషికం. భార.ఆది. 8.307.

క. ఇలి, ఎలి. మూషికం; కొడ. తు. త. మ. ఎలి. కో. ఎయ్ జ్. ఎలక ; తో. ఇస్ య్. ఎలక ; గోం. ఎల్లి. బ.వ. ఎల్క ; కొండ. ఎల్క ; కుఇ. ఒడ్డి. ఎలక. బ.వ. ఒడికి ; కువి. ఒడ్లి, ఒర్లి. ఎలక ; పర్జి. ఎల్. బవ. ఎల్ కుల్. ఎలక ; కొలా. నా. ఎల్క. ఎలక. పో.చూ. గద. సిరె. బ.వ. సిరెల్. ఎలక ; ఒల్లా. సిరెల్. ఎలక. బ్రా. హల్. ఎలక.

ఎలి + -కళ్[1] అనుచిత విభాగంవల్ల తెలుగులో ఎలుక శబ్దం ఏర్పడింది.

<మూ.ద్రా. *ఎల్-.

**ఎలుకచెవి** వి. 1. ఎలుక జీడి, ఒకరకం చెట్టు ; 2. చిత్తా నక్షత్రం. క. ఎలికివి. ఎలుక చెవి, చిన్న ఆకులుగల మొక్క ; తు. ఎరికెబి. ఒక ఓషధి ; త. ఎలి-చ్-చెవి. ఒక రకం మొక్క, నేలపై పాకు ఒక తీగ. **ఎలుకచెవివల్లిక** వి. ఒక రకం చెట్టు. **ఎలుకజీడి** వి. ఒక రకం చెట్టు. **ఎలుకజీడివల్లిక** వి. ఒకరకం చెట్టు. **ఎలుకబోను** రూ. ఎలికెబోను వి. ఎలుకను పట్టే సాధనం. **ఎలుకమొక్క** వి. ఒకరకం చెట్టు. **ఎలుకరౌతు** వి. ఎలుకనెక్కేవాడు. వినాయకుడు. పో.చూ. క. ఇలిదేవర. ఎలుక తేరుగా గలవాడు, వినాయకుడు.

**ఎలుకచెవి** చూ. ఎలుక.

**ఎలుకచెవివల్లిక** చూ. ఎలుక.

**ఎలుకజీడి** చూ. ఎలుక.

**ఎలుకజీడివల్లిక** చూ. ఎలుక.

**ఎలుకబోను** చూ. ఎలుక.

**ఎలుకమొక్క** చూ. ఎలుక.

**ఎలుకరౌతు** చూ. ఎలుక.

**ఎలుగు[1]** రూ.చూ. అలుఁగు[2]. వి. నాగలి, గొర్రు, గుంటక మొ. వాటి కర్రు.

**ఎలుగు[2]** రూ.చూ. వెలుగు. వి. 1. ఇంటిచుట్టూ కట్టే దడి : 2. నాగటికాడిని దూరంగా నొక చివరికి జరిపి కట్టటం.

**ఎలుగుతెగులు** వి. ఒకరకం వరి తెగులు. (చిగుళ్లు తెల్లబడతాయి).

**ఎలుఁగిచ్చు** చూ. ఎలుఁగు[1].

**ఎలుఁగించు** చూ. ఎలుఁగు[1].

**ఎలుఁగిడు** చూ. ఎలుఁగు[1].

**ఎలుఁగు[1]** రూ. ఎలువు[1], ఎల్గు[1]. వి. 1. కంఠస్వరం. భార. ద్రోణ. 4.133, విక్ర. 4.27 ; 2. పిలుపు. భోజ. 5.66 : 3. ధ్వని, మోత.

పో.చూ. క. ఎలర్. ధ్యాన, గాలి మొ. పో.చూ. త. ఇలిర్. మొలచు, నిటారుగా నిలచు మొ. గొ. లెంగ్. కంఠస్వరం ; పర్జి. ఇలుంగ్. కంఠస్వరం.

<మూ.ద్రా. *ఇల్-.

**ఎలిఁగించు** రూ. ఎలుఁగించు. అ.క్రి. కూయు. కు.సం. 9.306. **ఎలుఁగిచ్చు** స.క్రి. 1. పిలుచు. భార. 2.205 ; 2. పలుకు, మాట్లాడు, బదులు పలుకు. వసు. 2.17. **ఎలుఁగించు** రూ. ఎలిఁగించు. అ.క్రి. కూయు. భార. అను. 1.181. **ఎలుఁగిడు** అ.క్రి. మొరుగు. రామ. 2.21. **ఎలుఁగు చేయు** అ.క్రి. ధ్వనిచేయు, కూయు. సింద్వా. 1.213. **ఎలుఁగులిచ్చు** స.క్రి. పిలుచు. భార. ఆది. 6.290 ; అ.క్రి. 1. ధ్వనిచేయు, మోగు. ఆము. 4.35 ; 2. పలుకు, మాటాడు, బదులు పలుకు. **ఎలుఁగుసూపు** 1. అ.క్రి. గట్టిగా అరచు, పెద్దకేకవేయు ; 2. పలుకు, మాటాడు. భార. అను. 1.75, భీష్మ. 2.28. <ఎలుఁగు + చూపు. **ఎలుఁగెత్తు** రూ. ఎల్గెత్తు. అ.క్రి. గొంతెత్తు. భార. భీష్మ. 3.135, దశా. 2.201.

**ఎలుఁగు[2]** రూ. ఎలువు[2], ఎల్గు[2]. వి. భల్లూకం. హరి. ఉ. 10.21.

త. ఎణ్కు. భల్లూకం. ఎలు, ఉలియమ్ ; గోం. ఎడ్జ్ ఆర్జ్ ల్ ; కొండ. ఒల్జు, ఒడ్జు. కుఇ. ఒలి, ఒడి ; బవ. ఒలింగ ; కువి. జౌడి ; పర్జి. ఇలి ; బవ. ఇలిల్. భల్లూకం ; మూలరూపం. ఎళ్- ; గద. ఇలిజ్ ; ఒల్లా. ఇలిజ్ ; మాల్తో. ఎజు.

**ఎలుఁగుగొడ్డు** రూ. ఎలుగ్గొడ్డు, ఎల్గుగొడ్డు, వెలుగుగొడ్డు, ఎలుగ్గొడ్డు. వి. భల్లూకం. **ఎలుఁగుబంటి** రూ.చూ. ఎలుఁగుమంటి. వి. భల్లూకం. **ఎలుఁగుమంటి** రూ. ఎలుఁగుబంటి. **ఎలుగ్గొడ్డు** రూ.చూ. ఎలుఁగుగొడ్డు.

**ఎలుఁగుగొడ్డు** చూ. ఎలుఁగు[2].

**ఎలుఁగుచేయు** చూ. ఎలుఁగు[1].

**ఎలుఁగుబంటి** చూ. ఎలుఁగు[2].

**ఎలుఁగుమంటి** చూ. ఎలుఁగు[2].

**ఎలుఁగులిచ్చు** చూ. ఎలుఁగు[1].

**ఎలుఁగుసూపు** చూ. ఎలుఁగు[1].

**ఎలుఁగెత్తు** చూ. ఎలుఁగు[1].

**ఎలుగ్గొడ్డు** చూ. ఎలుఁగు[2].

**ఎలుచు** రూ.చూ. ఎంచు. స.క్రి. ఆలోచించు, లెక్కించు. ఆం.భా. 3.126.

**ఎలువు** రూ.చూ. వెలుపు. వి. వెదల్పు.

**ఎలుము[1]** రూ.చూ. వెలుపు. వి. వెదల్పు.

**ఎలుము[2]** రూ.చూ. ఎనుము. వి. గేదె.

**ఎలువు[1]** రూ.చూ. ఎలుఁగు[1].

**ఎలువు[2]** రూ.చూ. ఎలుఁగు[2]. వి. భల్లూకం. భార. అర. 7.39.

**ఎలువు[3]** రూ.చూ. అలుఁగు[2]. వి. 1. నాగలి, గొర్రు, గుంటక మొ. వాటి కర్రు ; 2. పలుగు నేలలో లోతుగా దిగటం ; 3. దున్నేటప్పుడు, నేల లోతుగా తెగటం.

**ఎలువుపీట** రూ. ఎల్గుపీట. వి. ఎలువు నలువులకు ఏడికోల, కాడి కలిపేచోట వారిజె దూర్చిన చిన్న కొయ్య గొట్టం. **ఎలువుపేడు** రూ. ఎల్గుపేడు. వి. ఏడికోలను పణతలో దూర్చేచోట కిందివైపు కొట్టే పేడు.

**ఎలువుపీట** చూ. ఎలువు[3].

**ఎలువపేడు** చూ. ఎలువ[3].
**ఎలుష** రూ.చూ. వెలిసె. వి. గొడ్లపాకలోని అటక.
**ఎలోమ** వి. ఒక రకం గడ్డి (Diospyros embryopterics).
**ఎల్క** రూ.చూ. ఎలుక. వి. మూషికం.
**ఎల్గు[1]** రూ.చూ. ఎలుఁగు[1].
  **ఎల్గెత్తు** రూ.చూ. ఎలుఁగెత్తు. అ.క్రి. గొంతెత్తు, పెద్ద గొంతుతో మాటాడు. వసు. 4.52.
**ఎల్గు[2]** రూ.చూ. ఎలుఁగు[2]. వి. భల్లూకం. ఢ.నం. 12.892, విక్ర. 3.89.
  **ఎల్గుగొడ్డు** రూ.చూ. ఎలుఁగుగొడ్డు. వి. భల్లూకం. సారంగ. చ. 1.73.
**ఎల్గు[3]** రూ.చూ. అలుఁగు[2].
**ఎల్గుగొడ్డు** చూ. ఎల్గు[2].
**ఎల్గుపీట** రూ.చూ. ఎలువపీట.
**ఎల్గుపేడు** రూ.చూ. ఎలువపేడు.
**ఎల్గెత్తు** చూ. ఎల్గు[1].
**ఎల్చి** వి. పొడుగాటి పీట.
**ఎల్తి** వి. ఒక రకం వెదురు (Dendrocalamus hamiltari), 60-70 అ. ఎత్తుదాక పెరుగుతుంది ; కొన్ని రకాలకు కణుపుల దగ్గర ముళ్ళుంటాయి.
**ఎల్ల[1]** వి. సీమ, పొలిమేర, హద్దు. శృం.నై. 1.31, ఆం.భా. 2.24.
  క. ఎల్లె. హద్దు, సరిహద్దు : త. ఎల్లై, ఎల్క్కై. సరిహద్దు ; మ. ఎల్ల. హద్దు.
  <మూ.ద.ద్రా. *ఎల్-.
  **ఎల్లందు(న్)** అవ్య. సరిహద్దు లోపల ; **ఎల్లమ్మ** వి. ఊరి పొలిమేరలో ఉండే ఒక గ్రామ దేవత. ద్రావిడ దేవత. తు. ఎల్లమ్మ. ఒక గ్రామ దేవత ; త. ఎల్లమ్మన్. ఒక గ్రామ దేవత (అపాయంలో ఉన్న బెస్తవాళ్లూ, విషసర్ప దష్టులూ ఆరాధించే దేవత). **ఎల్లరాయి** రూ. అల్లరాయి. వి. సరిహద్దు రాయి. పో.చూ. క. ఎల్లకల్లు. సరిహద్దు రాయి, త. ఎల్లై-క్-కల్ ; **ఎల్లలువెట్టు** అ.క్రి. హద్దు ఏర్పరచు. దశకు. 2.71. <ఎల్ల[1]+-లు+పెట్టు. **ఎల్లాఁడి** వి. 1. దొంగ, మోసగాడు, పొలిమేరవద్ద కాచి దోచుకొనేవాడు ; 2. తలారి ; 3. పనికిమాలినవాడు ; 4. కూలి జనం. **ఎల్లాఁడికత్తియ** రూ. ఎల్లాఁడికత్తె. వి. దొంగతనం చేసే స్త్రీ. **ఎల్లాఁడికత్తె** రూ.చూ. ఎల్లాఁడికత్తియ. **ఎల్లాఁడితనము** వి. కపటం, వంచన, మోసం. **ఎల్లాఁడులు** వి. తెలగాలలో ఒక తెగవారు.
**ఎల్ల[2]** అవ్య. సర్వ శబ్దార్థకం. భార. ఆది. 6.28, భీష్మ. 2.232, అను. 2.283.
  క. ఎల్ల. అన్నీ, ప్రతి వస్తువు, మొత్తం ; కొడ. ఎల్ల. మొత్తం ; త. ఎల్లామ్. మొత్తం, అన్ని, అందరు ; కోట. ఎల్, ఎల్మ. మొత్తం ; మ. ఎల్లామ్. అన్నీ, మొత్తం ; కోలా. ఇత్తర్, ఎల్. రెండూ.
  **ఎల్లకమ్మరి** వి. దేవశాశిల్పి, విశ్వకర్మ. ద్వి. పరమ. వి. 27 వు. 6 పం. **ఎల్లది** సర్వ. సమస్తం. భార. అను. 4.241, హరి. ఉ. 7.158. **ఎల్లనాఁడు** క్రి.విశ. ఎల్లప్పుడు. హరి. ఉ. 3.5. **ఎల్లందు(న్)** రూ.చూ. ఎల్లయందు(న్). క్రి.విశ. సర్వత్ర, అంతట, అన్నిచోట్ల. రం.రా. 101 వు. 27 పం. **ఎల్లపుడు** రూ.చూ. ఎల్లప్పుడు. **ఎల్లప్డు** రూ.చూ. ఎల్లప్పుడు. **ఎల్లప్పుడు** రూ. ఎల్లపుడు, ఎల్లప్డు. క్రి. విశ. సర్వకాలం. ఉ.రా. 1.60. **ఎల్లప్రొద్దు** క్రి. విశ. ఎల్లప్పుడు. సీతారా. 1.97. **ఎల్లబోఁటి** విశ. అందరివంటి, సామాన్యమైన. హరి. పూ. 5.148. **ఎల్లయందు(న్)** రూ. ఎల్లందు(న్). క్రి.విశ. ప్రతి చోట, అంతట. భార. అశ్వ. 2.215. **ఎల్లయెడల(న్)** క్రి. విశ. అన్నిచోట్ల. **ఎల్లరు** రూ. చూ. ఎల్లవారు. వి. అందరు. రామా. 2.106, 107. **ఎల్లవాఁడు** వి. ప్రతివాడు. భార. ఆది. 6.306, సౌప్తి. 1.45. **ఎల్లవారు** రూ. ఎల్లరు, ఎల్లారు. వి. అందరు. **ఎల్లవెంట** వి. అన్నివిధాల. **ఎల్లారు** రూ.చూ. ఎల్లవారు. వి. అందరు. శివలీలా. 1.125. <క. ఎల్లారు. **ఎల్లెడ[1](న్)** క్రి.విశ. 1. ప్రతి విషయంలో, అన్ని విషయాల్లో. విప్ర. 5.40 ; 2. అంతటా, ప్రతి చోట. నీలా. 1.30, దశా. 1.281. క. ఎల్లెడ. అన్ని చోట్ల. <ఎల్ల[2]+ఎడ(న్).
**ఎల్ల[3]** రూ.చూ. వెల్ల. వి. (ఇంటికి వేసిన) సున్నం. విశ. తెల్లని.
  **ఎల్లకొట్టించు** అ.క్రి. (ఇంటికి) సున్నం కొట్టించు. **ఎల్లగిసె** వి. తెల్ల అగిసె. <ఎల్ల[3]+అగిసె. **ఎల్లెలుక** రూ.చూ. వెల్లెలుక. వి. తెల్లని యెలుక, రాజమూషికం. <ఎల్ల[3]+ఎలుక. **ఎల్లెల్క** రూ.చూ. వెల్లెలుక. వి. రాజమూషికం (వ్య. తెల్లటి ఎలుక) <ఎల్ల[3]+ఎల్క.
**ఎల్ల[4]** వి. ఎన్ను, కంకి.
**ఎల్ల[5]** వి. కూర కొనటానికి వేసే పిడికెడు బియ్యం.
**ఎల్లకమ్మరి** చూ. ఎల్ల[2].
**ఎల్లకూర** వి. ఒక రకం శాకం.
**ఎల్లకొట్టించు** చూ. ఎల్ల[3].
**ఎల్లక్షను** వి. ఎన్నికలు.
  ఇం. ఎలెక్షన్. ఒకరినిగాని కొందరినిగాని, ఓట్లు వేసి అధికార పదవులకు ఎన్నుకోటం ; ఒక ప్రత్యేకాంశం మీద ప్రజాభిప్రాయం సేకరించటం, ఎన్నుకోటం.
  <ఇం. Election.
**ఎల్లగిసె** చూ. ఎల్ల[3].
**ఎల్లగొయ్యి** అ.క్రి. ఇటుకకోయు.
**ఎల్లంకి** పో.చూ. ఉల్లంకి. వి. ఒక రకం పిట్ట. పార్వ. 6.77.
**ఎల్లంకిగాలి** వి. వానకు ముందు వీచే దుమ్ముగాలి.
**ఎల్లడి** రూ.చూ. అల్లడి. వి. 1. తెరచాప అల్లడి కన్ను ; 2. జనపనార దారు.
**ఎల్లది** చూ. ఎల్ల[2].
**ఎల్లదోడు** అ.క్రి. నూతులలో పూడికతీయు.
**ఎల్లదోనె** వి. మోట బొక్కెన నీళ్లు కుమ్మరించే చోటు, పోదు దోనె.
**ఎల్లనాఁడు** చూ. ఎల్ల[2].
**ఎల్లందు(న్)** చూ. ఎల్ల[1], ఎల్ల[2].
**ఎల్లపుడు** చూ. ఎల్ల[2].
**ఎల్లప్డు** చూ. ఎల్ల[2].

ఎల్లవ్వరు చూ. ఎల్ల[2].
ఎల్లప్రొద్దు చూ. ఎల్ల[2].
ఎల్లబడు అ.క్రి. వెలికి వచ్చు, బయటకు వచ్చు.
ఎల్లబార వి. మొత్తం, పూర్తి.
ఎల్లబోఁటి చూ. ఎల్ల[2].
ఎల్లమ్మ చూ. ఎల్ల[1].
ఎల్లయందు(న్) చూ. ఎల్ల[2].
ఎల్లయెడల(న్) చూ. ఎల్ల[2].
ఎల్లరు చూ. ఎల్ల[2].
ఎల్లలాయి చూ. ఎల్ల[1].
ఎల్లలుపెట్టు చూ. ఎల్ల[1].
ఎల్లవ[1] వి. కట్టుబడిలో పొడుచుకొని వచ్చిన రాతిముక్క, కొపిర.
ఎల్లవ[2] వి. దూలాల చివర మేకు బిగింపు చేసిన వానం.
ఎల్లవకర్ర వి. 1. పెనుగ్రర నుంచి దూలాల చివర్ల మీదికి పరిచిన కర్ర: 2. కూసాల మీది అడ్డపట్టె.
ఎల్లవమెట్టు వి. ఇంటికి వెలుపల గోడకు అతికి కట్టిన మెట్టు.
ఎల్లవాఁడు చూ. ఎల్ల[2].
ఎల్లవారు చూ. ఎల్ల[2].
ఎల్లవాలు విశ. ఏటవాలు, ఎక్కువవాలు.
ఎల్లవెంట చూ. ఎల్ల[2].
ఎల్లాఁపి చూ. ఎల్ల[1].
ఎల్లాఁపికత్తియ చూ. ఎల్ల[1].
ఎల్లాఁపికత్తె చూ. ఎల్ల[1].
ఎల్లాఁపితనము చూ. ఎల్ల[1].
ఎల్లాఁపులు చూ. ఎల్ల[1].
ఎల్లాయి వి. 1. చాకలి ఉతికిన గుడ్డలకు ఆవిరిపెట్టటానికై కట్టిన పొయ్యి; 2. చాకలి ఆవిరిబానకు చుట్టిన గుడ్డలు; 3. ఉబ్బ.
ఎల్లారు చూ. ఎల్ల[2].
ఎల్లి[1] వి. గొడుగు. భార.శల్య. 1.133, శాంతి. 4.389.
పో.చూ. త. ఎల్లి. సూర్యుడు.
బహుశః <త. ఎల్లి. సూర్యుడు. సూర్యుడినుంచి రక్షణ, ఆచ్ఛాదనం.
ఎల్లి[2] వి. 1. రేపు. భార.అర. 2.168, విరా. 5.301, నిర్వ. 1.44, ఉ.హ. 3.22; 2. భవిష్యత్తు, మరణానంతరం. పండిత. వురా. 120 పు.
తు. ఎల్ల. రేపు: ఎల్లంజి. ఎల్లుండి; పో.చూ. త. ఎల్లై. 24 గంటలు గల రోజు.
పో.చూ. సం. హేలి. సూర్యుడు.
ఎల్లుండి వి. రేపటి తర్వాత రోజు, రేపురాక అమర్నాడు. భార.అర. 2.168. తు. ఎల్లంజి. ఎల్లుండి.
ఎల్లితము రూ.చూ. ఏలిదము.
ఎల్లిదము రూ.చూ. ఏలిదము. విశ. 1. తేలికఅయినది, అసమర్థమైనది. కు.సం. 4.421, మను. 2.41. దశకు. 3.93; 2. అగౌరవకరం. భార.విరా. 5.317; వి. 1. అగౌరవం, అవమానం. ఉ.హరి. 5.197, సారంగ.చ. 3.87, ఆం.భా. 1.134; 2. కొత్త, వింత, తిరస్కారం.
క. ఏళిద. తిరస్కారం. అపహాస్యం. తిట్టు, నింద, అగౌరవం; పో.చూ. రు. ఎల్లి, ఎల్య. చిన్న, లేత; ఎల్లిబుద్ధి. తేలికబుద్ధి; త. ఏళితం. అపహాస్యం, వేళాకోళం. <ఏళణమ్<సం. హేలన; ఎళ్ళల్. నింద, అపహాస్యం; ఎళు. ఉపేక్షించు, అగౌరవించు, అపహసించు.
బహుశః <సం. హేల్ (హేద్).
ఎల్లిదుఁడు చూ. ఎల్లిదము. వి. అల్పుడు, అసమర్థుడు. కు.సం 4.418, నిర్వ.రా. 8.7.
త. ఎళియన్. అల్పుడు.
ఎల్లిపాయ వి. వెల్లుల్లి, తెల్లపాయ.
<వెల్లి+పాయ.
ఎల్లిపాయలగడ్డి వి. ఒకరకం కలుపుమొక్క.
ఎల్లిపాయలగడ్డి చూ. ఎల్లిపాయ.
ఎల్లిబొమ్మిడి వి. వేళ్ళమీదపుట్టే మల్లెతెగులు.
<వెల్లి (తెలుపు)+బొమ్మిడి.
ఎల్లుండి చూ. ఎల్లి[2].
ఎల్లెడ[1](న్) చూ. ఎల్ల[2].
ఎల్లెడ[2] పో.చూ. ఉల్లడ. వి. మేలుకట్టు, వితానం, నారగుడ్డ చిక్కం మొ. వేలాడగట్టిన ఉయ్యెల.
ఎల్లెలుక చూ. ఎల్ల[3].
ఎల్లెల్క చూ. ఎల్ల[3].
ఎల్మపాటు వి. గుమ్మకింది బల్లకుఉన్న నిలువుచెక్కల పేరు.
ఎళవాగర వి. ఒంటిమీద గడ్డలు లేవటం.
ఎళనీరు రూ.చూ. ఎలనీరు. వి. లేత కొబ్బరినీరు. ఆం.భా. 2.78.
ఎళవు రూ. ఎఱవు. వి. 1. చనిపోయినవారికై దుఃఖించటం; 2. హాని, నష్టం.
పో.చూ. క. ఎఱల్. ఆలసటచెందు; ఎఱవు. రోగము వల్ల కలిగిన ఈడ్పు, తిమ్మిరిరోగం; త. ఎఱల్. దుఃఖం; ఇఱవు. నష్టం, హాని, చావు, కష్టం.
<త. ఇఱవు.
ఎఱవు రూ.చూ. వెలుపు. వి. వెడల్పు.
ఎఱవరి వి. ఏలిక, ప్రభువు. ద.హిం.గా. 10.610.
ఎఱవు రూ.చూ. ఎళవు. వి. చావు, నష్టం.
ఎళ్ళము వి. 'పలము'కు ఏడురెట్ల బరువు. ఆం.భా. 2.269.
ఎళ్ళకాయ రూ.చూ. అళికాయ. వి. దబ్బపండు.
క. ఈళె, ఇళ్ళె. ఒకరకం నారింజకాయ; హేరళె. దబ్బకాయ.
<క. ఇళ్ళె (+కాయ).
ఎళ్లు రూ.చూ. ఎడ్లు. వి. బహు. ఎద్దులు. హరి.పూ. 6.21.
ఎవ వి. హెచ్చరిక, ఏకాగ్రత.
ఎవకల వి. వేకువ.
ఎవఁడు రూ. ఎవ్వాఁడు. సర్వ. 1. ఎవడు? కిమర్థకం. నీలా. 2.43; 2. యత్‌శబ్దార్థకం; ఎవడోవాడు.
ఎవంద్రు రూ. ఎవ్వంద్రు, ఎవ్వాంద్రు. చూ. ఎవరు. సర్వ. ఎవరు?
ఎవత రూ. ఎవతి, ఎవతుక, ఎవతె, ఎవ్వత, ఎవ్వతి, ఎవ్వతె;

సర్వ. ఏస్త్రీ ?
క. యావళు. ఏ స్త్రీ ?; త. ఎవళ్, యావళ్. ఏ స్త్రీ ?; కొ. ఎవ్ళ్. ఏ స్త్రీ ?; కువి. ఎస్తరి. ఏ స్త్రీ ?; కొలా. ఎద్. ఎవతె ?; కురు. ఎవదె. ఎవతె ? ఎవరు (స్త్రీ) ?; మాల్తో. ఐకథ్. ఎవతె ?

**ఎవతి** రూ.చూ. ఎవత.

**ఎవతుక** రూ.చూ. ఎవత.

**ఎవతె** రూ.చూ. ఎవత.

**ఎవయు** రూ.చూ. నెగయు. అ.క్రి. పైకి లేచు, ఎగురు. భార. సభా. 1.255 ; కకుత్థ. 5.37.

**ఎవరిత** రూ. ఎవరితి, ఎవరితె, ఎవర్త, ఎవర్తి, ఎవర్తుక, ఎవర్తె, ఎవ్వరిత, ఎవ్వరితి, ఎవ్వరితె. ఎవ్వర్త, ఎవ్వర్తి, ఎవ్వర్తుక, ఎవ్వర్తె. వి. ఎవత.
బహుశః <ఎవర్ + ఇ + త్.

**ఎవరితి** రూ.చూ. ఎవరిత.

**ఎవరితె** రూ.చూ. ఎవరిత.

**ఎవరు** రూ. ఎవ్వరు, ఎవ్వారలు, ఎవ్వారు. సర్వ. **1.** ఎవరు (బ.వ.), ఏకవచనంలోకూడా ప్రయోగం ఉంది. భార. అర. 3.116 ; **2.** అందరు. సీలా. 2.43.
క. అర్, యార్, దారు. 'ఆవ'యొక్క ప్రథమా బ.వ. (పుం. స్త్రీ); తు. ఏరు. ఎవరు ?; త. యావర్-ఉమ్. అంతా ; మ. ఆర్. ఎవడు ? ఎవరు ?
ఏ+వారు>ఎవ్వారు>ఎవ్వరు>ఎవరు.
<మూ.ద.ద్రా. *యా.
ఎవరో సర్వ. **1.** ఏమిటో (మీరెవరో చెప్పండి) ; **2.** ఎవరో ఒకరు.

**ఎవరో** చూ. ఎవరు.

**ఎవర్త** రూ.చూ. ఎవరిత.

**ఎవర్తి** రూ.చూ. ఎవరిత.

**ఎవర్తుక** రూ.చూ. ఎవరిత.

**ఎవర్తె** రూ.చూ. ఎవరిత.

**ఎవల** రూ.చూ. ఏవల.

**ఎవలు** వి. ధాన్య విశేషం, బార్లీ బియ్యం. (Hordeum hexastichon).
సం. యవ-; ప్రా. జవ-.
<సం. యవ-.

**ఎవి** రూ.చూ. ఏవి ; ఏ.వ. ఎది. సర్వ. బ.వ. ఏవి.

**ఎవుచు** రూ.చూ. ఎగచు. చూ. ఎగు. స.క్రి. **1.** తోయు, పడదోయు. నిర్వచ. 1.39 ; **2.** తోలు. భార.కర్ణ. 1.159 ; **3.** (బాణాదులతో) కొట్టు. భాగ. 8.145 ; **4.** వెంబడించు, తరుము.

**ఎవ్వ** పో.చూ. ఏవ. వి. **1.** లేమి ; **2.** కష్టం.
త. ఎవ్వమ్. దుఃఖం, కష్టం.

**ఎవ్వఁడు** రూ.చూ. ఎవ్వాఁడు. సర్వ. **1.** యచ్ఛబ్దార్థకం, ఎవడోవాడు. భార.ఆది. 4.183 ; **2.** కిమర్థకం, ఎవడు. భార. 6.1.232, (నేనెవ్వఁడ ? లోవల) ఏపాటివాడు, ఎంతవాడు, ఎట్టివాడు. ఉ.రా. 6.274.

**ఎవ్వండ్రు** రూ.చూ. ఎవండ్రు.

**ఎవ్వత** రూ.చూ. ఎవత. సర్వ. ఎవతె. భార.శాంతి. 3.144.

**ఎవ్వతి** రూ.చూ. ఎవత.

**ఎవ్వతె** రూ.చూ. ఎవత.

**ఎవ్వరిత** రూ.చూ. ఎవరిత.

**ఎవ్వరితి** రూ.చూ. ఎవరిత.

**ఎవ్వరితె** రూ.చూ. ఎవరిత.

**ఎవ్వరు** రూ.చూ. ఎవరు. సర్వ. బ.వ. ఎవరు. నిర్వ. 3.102, 4.82, భార.విరా. 1.216, శృం.నై. 1.55.

**ఎవ్వర్త** రూ.చూ. ఎవరిత.

**ఎవ్వర్తి** రూ.చూ. ఎవరిత.

**ఎవ్వర్తుక** రూ.చూ. ఎవరిత.

**ఎవ్వర్తె** రూ.చూ. ఎవరిత.

**ఎవ్వల** రూ.చూ. ఏవల. క్రి.విశ. ఏవైపు. హరి.ఉ. 9.57, హరి.పూ. 5.191.

**ఎవ్వాండ్రు** రూ.చూ. ఎవండ్రు.

**ఎవ్వాఁడు** రూ. ఎవఁడు, ఎవ్వఁడు, ఏఁడు[2], ఏవాఁడు, వేఁడు. సర్వ. **1.** కిమర్థకం, ఎవడు. భార.భీష్మ. 1.179 ; **2.** యచ్ఛబ్దార్థకం. మను. 1.18 ; **3.** ఎంతటివాడు, ఏపాటివాడు, ఎట్టివాడు. ఉ.రా. 3.178.
క. యావను. ఎవడు ; త. ఎవన్, యావన్.
<ఏ+వాడు.

**ఎవ్వారలు** రూ.చూ. ఎవరు.

**ఎవ్వారు** రూ.చూ. ఎవరు.

**ఎవ్వి** రూ.చూ. ఏవి. సర్వ. బవ. ఏ వస్తువులు.

**ఎశల** రూ.చూ. వెసల. వి. చిన్న మట్టిపాత్ర.

**ఎన[1]** రూ. ఏన[1]. క్రి.విశ. **1.** అత్యంతం, మిక్కిలి. శృం.నై. 5.156 ; **2.** చక్కగా, ప్రశస్తంగా, సమర్థంగా. వేం.మా. 4.11 ; వి. **1.** విధం, రీతి. పాండు. 4.266 ; **2.** ప్రేరణం, ప్రోత్సాహం ; **3.** అతిశయం, ఆధిక్యం.
క. ఎసె. ప్రకాశించు, కన్పించు, స్పష్టపరచు ; త. ఇయై. పూర్తిగా నిండు; ఇయల్పు. ప్రవర్తన నియమావళి; ఇవై. ఇమిడిపోవు. తీసికొనివచ్చు, సూచించు.
ఎనకొను అ.క్రి. **1.** పురిగొను, ఉల్లాసపడు, ధైర్యము తెచ్చుకొను ; **2.** ఆవేశపడు. ఎనకొలుపు రూ. ఎనకొల్పు. స.క్రి. పురికొల్పు, రెచ్చగొట్టు, ప్రేరేచు. భార.ఉద్యో. 4.207. ఎనకొల్పు రూ.చూ. ఎనకొలుపు. స.క్రి. **1.** రెచ్చగొట్టు, పురికొల్పు, ఉత్సాహపరచు. భార.ఉద్యో. 4.234 ; **2.** కలిగించు, ఆపాదించు. ఆము. 6.98 ; త. ఇయఱ్ఱు. కలిగించు, పురికొల్పు. ఎనపోయు స.క్రి. వినియోగించు, వ్యయించు. దశకు. 11.117. ఎనబెట్టు స.క్రి. ఎక్కులు పెట్టు, పురికొల్పు. కళా. 6.268. ఎనరేఁగు రూ. ఏనరేఁగు. అ.క్రి. చెలరేగు, విజృంభించు, అతిశయించు. హరిశ్చ. 5.142. ఎనలారు రూ. అనలారు.అ.క్రి. **1.** నిండియుండు. భార.శాంతి. 6.581 ; **2.** ఒప్పు, తగియుండు, అతిశయించు. భార.అను. 3.306 ; **3.** కన్పించు. విష్ణుపు. 1.137. త. ఇయల్. అర్హత, యోగ్యత. <ఎన[1] + -లు + -ఆరు[2]. ఎనవెట్టు స.క్రి. పురికొల్పు, ప్రోత్సహించు, రెచ్చగొట్టు. కళా. 6.231. <ఎన[1] + పెట్టు.

ఎన$^{2}$ వి. పేర్చిన రాళ్లమధ్య సందు.

ఎనకము వి. **1.** అతిశయం, పెంపు. భార.విరా. 2.292, హరి.పూ. 8.6 ; **2.** ఆగ్రహం, ఆవేశం. భార.ఉద్యో. 4.324 ; **3.** విజృంభణం. భార.భీష్మ. 2.378 ; **4.** ఉత్సాహం, ఉల్లాసం. బసవ. ద్వి. 5.36. 868 ; **5.** రీతి, విధం. కాశీ. 6.185 ; **6.** ప్రీతి, చెన్న. 3.249 ; విశే. **1.** అధికం, హెచ్చైనది. భార.కర్ణ. 3.42 ; **2.** మనోహరం, ప్రియం. హరి.ఉ. 7.75.

క. ఎసక. ప్రకాశం, కాంతి, అందం, రూపం, తీరు, ఆనందం ; త. ఇయక్కమ్. మార్గం, గొప్పదనం.

ఎనకమెనఁగు అ.క్రి. **1.** అతిశయించు, వృద్ధిచెందు. భార.విరా. 1.74 ; **2.** సంభవించు, కలుగు. భార.విరా. 1.808, భార.శాంతి. 5.566 ; **3.** ఒప్పు, శోభిల్లు. ఆము. 6.6. <ఎనకము+ఎనఁగు.

ఎనకమెనఁగు చూ. ఎనకము.

ఎనకరి వి. కిరాతభేదం. ఆం.భా. 2.289.

ఎనకాపు చూ. ఎన$^{1}$.

ఎనకొలుపు చూ. ఎన$^{1}$.

ఎనకొల్పు చూ. ఎన$^{1}$.

ఎనగొట్టు వి. కొరగానివాడు.

బహుశః ఎన$^{1}$+కొట్టు. ఉత్సాహం లేనివాడు.

ఎనగొండ్రు వి. కొండ్రవేసిన తర్వాత పొలంలో మిగిలిన మూల, కుని.

ఎనంగు రూ.చూ. ఎనఁగు. అ.క్రి. **1.** ఒప్పు, అతిశయించు ; **2.** కలుగు ; **3.** విజృంభించు.

ఎనఁగించు చూ. ఎనఁగు.

ఎనఁగు చూ. ఎన$^{1}$. రూ. ఎనంగు, ఎనవు, ఎనుగు. అ.క్రి. **1.** అతిశయించు, ఒప్పు. భార.ఆది. 4.196, శాంతి. 6.383 ; **2.** కలుగు. భార.ఆది. 5.3 ; **3.** విజృంభించు, ఉప్పొంగు. ఉ.హరి. 5.220.

క. ఎసె. ప్రకాశించు, స్పష్టమగు ; పో.చూ. ఎస్క. కాంతి, అందం. రూపం ; త. ఇయంకు. కదలు, కదలించు.

<మూ.ద్రా. *ఎయ్/ఎ-<*ఎచ్-.

ఎనఁగించు స.క్రి. ఎనగునట్లుచేయు, కలిగించు. వసు. 1.9.

ఎనటిపోఁతలు చూ. ఎనరు$^{2}$.

ఎనపోయు చూ. ఎన$^{1}$.

ఎనబెట్టు చూ. ఎన$^{1}$.

ఎనరు$^{1}$ రూ.చూ. ఏనరు. అ.క్రి. అతిశయించు, విజృంభించు, మీరు. నిర్వ.రా. 6.137, పాండు. 4.180.

ఎనరు$^{2}$ వి. వంటకై మరగకాచిన నీరు. భార.ఉద్యో. 4.116.

క. ఎసర్, ఎసరు. వంటపాత్రలో మసలుతున్న నీరు, కూరలు మొ. వండగా మిగిలిన గంజినీరు. వండిన కూరగాయలతోనున్న నీరు మొ. మిరియపు నీరు ; తు. ఐయరుని. చాలినంత, కావలసినంత ; త. ఎచర్. (ప్రతి.ప.<తె.) అన్నము వండుటకు గిన్నెలో పోసి నిప్పుపై పెట్టిన నీరు ; కుఇ. ఏజు. అన్నం, ఎనరు, ఆహారం ; కొలా. ఎసర్ (బ.వ. ఎసిల్). ధాన్యం వండటానికై మసలకాచిన నీరు ; నా. ఎసర్. అన్నం వండటానికి, పిండి కలపటానికి కాచిన నీరు.

<మూ.ద్రా. *ఎచ్>అర్.

ఎనటిపోతలు వి. బ.వ. మరగకాగుతున్న నీటిలో పోయదగిన బియ్యం. దంపి బాగుచేసిన బియ్యం. ఆము. 2.97.

ఎనరుపెట్టు రూ. ఎనరువెట్టు : అ.క్రి. **1.** హానిచేయు. రామా. 6.249 ; **2.** వంటకై నీటి నొక పాత్రలో మరగబెట్టు. పో.చూ. క. ఎసరిఁసు ; పో.చూ. త. ఎసర్-కట్టు.

ఎనరువెట్టు రూ.చూ. ఎనరుపెట్టు. అ.క్రి. **1.** వంటకై నీటి నొక పాత్రలో మరగబెట్టు. ఆము. 1.9, పాండు. 2.86 ; **2.** హానిచేయు. చంపూరా. 5.16. <ఎనరు$^{2}$+పెట్టు.

ఎనరుపెట్టు చూ. ఎనరు$^{2}$.

ఎనరువెట్టు చూ. ఎనరు$^{2}$.

ఎనరేఁగు చూ. ఎన$^{1}$.

ఎనల$^{1}$ రూ.చూ. వెనల, వి. మట్టిపిడత.

పో.చూ. తు. బిసలై. మట్టిపిడత.

ఎనల$^{2}$ రూ.చూ. ఎదల. వి. గుండెజబ్బు, ఎగరొప్పు.

ఎనల$^{3}$ రూ.చూ. ఎనలు$^{2}$. వి. దొమ్మి.

ఎనలారు చూ. ఎన$^{1}$.

ఎనలిక రూ. ఎనలికె, ఎసిలిక. వి. తీరిక, అవకాశం.

త. ఇయల్. స్థిరంగాఉండు.

<ఎనలు+ఇక.

ఎనలికె రూ.చూ. ఎనలిక. వి. తీరిక, అవకాశం.

ఎనలు$^{1}$ వి. ఇసుక.

పో.చూ. క. ఉసుకు, ఉసిజె, ఉసుబు. ఇసుక.

ఎనలు$^{2}$ రూ. ఎనల$^{3}$. వి. సంకుల సమరం, దొమ్మియుద్ధం, యుద్ధం.

ఎనల్దొక్కు స.క్రి. రాళ్లమధ్య సందులను పూడ్చు, దర్జుచేయు.

ఎన2+-లు+తొక్కు.

ఎనల్దొక్కుడు వి. గోడరాళ్ల ఒక వరుసలో ఉండి తూకం సరిపోయేటట్టు కట్టటం.

ఎనల్లపొద్దు వి. సాయంసమయం, ఎనళ్లపెట్టేవేళ.

<ఎనరు$^{2}$+-లు+-అ+ప్రొద్దు.

ఎనవు రూ.చూ. ఎనఁగు. అ.క్రి. అతిశయించు.

ఎనవెట్టు చూ. ఎన$^{1}$.

ఎని వి. కట్టటంలో రాయికిరాయికి నడిమిదోటు.

ఎనిబూయు స.క్రి. రాళ్ల మధ్య సందులు సున్నంతో పూడ్చు. <ఎని+పూయు.

ఎనిబూయు చూ. ఎని.

ఎసిలిక రూ.చూ. ఎనలిక. వి. అవకాశం, తీరుబడి.

ఎనుగు రూ.చూ. ఎనఁగు. అ.క్రి. వృద్ధిచెందు.

# ఏ

**ఏ**[1] వి. తెలుగు వర్ణమాలలో ఎనిమిదో అక్షరం. అర్ధసంవృతమై తాలవ్యమైన నిరోష్ఠ్య దీర్ఘస్వరం. ఇది అన్ని ద్రావిడ భాషల్లోనూ ఉంది.

< మూ.ద్రా. *ఏ.

**ఏ**[2] రూ. -ఎ-[5]. అవ్య. **1.** సంబంధార్థకంగా నామ, సర్వనామాదుల ముందు వచ్చే ప్రత్యయం, యచ్ఛబ్దార్థకం. భాగ. 8.21 ; **2.** కిమర్థక ప్రత్యయం (ప్రశ్నార్థకం). మను. 1.68.

త. ఏ. ప్రశ్నార్థక ప్రత్యయం ; ఏ, ఏతు, ఏవణ్. మ. లోవలె ప్రశ్నార్థక విశేషణం ; యా, యావణ. ఏమి, ఏ వస్తువులు. ప్రశ్నార్థక విశేషణం ; యాతు, యావన్.

**-ఏ**[3] రూ.చూ. -ఎ[3]. అవ్య. **1.** అవధారణార్థకమైన అంత్య ప్రత్యయం. భార. ఉద్యో. 3.358, ఉత్త. హ. 4.300 ; **2.** నిర్దేశ సూచకమైన అంత్య ప్రత్యయం. భాగ. 9.325 ; **3.** ఆధిక్యాన్ని తెలిపే అంత్య ప్రత్యయం. రామలిం. శ. 85 ; **4.** తనంతట తానే (అన్య ప్రేరణం లేకుండా) అనే అర్థమిచ్చే ప్రత్యయం (వాడే వచ్చాడు).

క. ఏ, ఎ. అవధారణార్థక ప్రత్యయం ; తు. ఏ, ఎ ; త. ఏ, ఎ. అవధారణ నిర్దేశాద్యర్థక ప్రత్యయం ; మ. ఏ. అవధారణార్థకం.

పో.చూ. సం. ఏవ ; ప్రా. ఎవ్వ.

**-ఏ**[4] రూ. -ఎ[4]. అవ్య. **1.** ఆశ్చర్య ప్రశంసాదిబోధకమైన ప్రశ్నార్థకం. భార.ఆది. 2.31, 52, సభా. 2.11, ఉద్యో. 2.117, 3.183, హరి.పూ. 5.234, శృం.నై. 4.69, దశా. 1.201 ; **2.** ఆశ్చర్యాన్ని తెలిపే ప్రశ్నార్థకం. దశా. 1.201 ; **3.** ప్రశంసను తెలిపే ప్రశ్నార్థకం. భార. ఉద్యో. 2.117 ; **4.** దుఃఖాన్ని తెలిపే ప్రశ్నార్థకం. భార. ఉద్యో. 3.183 ; **5.** పరిహాసాన్ని తెలిపే ప్రశ్నార్థక ప్రత్యయం. రాజ. 9.5.23 ; **6.** కాకువర్థాన్ని తెలిపే ప్రశ్నార్థక ప్రత్యయం. నైష. 1.27.

క. ఏ. ప్రశ్నార్థకం ; ఏమిటి, ఏది ; తు. ఏ ; త. ఏ. జాలిని తెలిపే ప్రత్యయం, ప్రశ్నార్థకం, వ్యతిరేకార్థకం, తిరస్కారార్థకం.

**-ఏ**[5] రూ. -ఎ[2]. అవ్య. పరిచితులైన స్త్రీ పురుషుల విషయంలో 'ఏమే, ఒరే' మొ. చోట్ల సంబోధనార్థక ప్రత్యయం. భాగ. 10 పూ. 1249, విప్ర. 4.22.

మ. ఏ. ప్రశ్నార్థక సర్వనామం. ఏమిటి ? ఎట్లు ? ; ఏ. వ్యతిరేకార్థంలో ప్రశ్నార్థకంగా వచ్చే అంత్య ప్రత్యయం. అల్లే ? (కాదా ?) ; కొంద. ఏన్. ఎవరు ; పర్. ఎవడు ; ఏమ్. ఏది ; ఏవ్. ఏది ; ఏమె. ఎందుకు, ఎందుకొరకు ; పర్జి. ఏడ్. ఎవరు ; ఏది. ఎవరైనా ; నా. ఏన్. ఎవరు ; పర్. ఎవడు ; గద. ఏయ్‌న్డ్. ఎవరు.

< మూ.ద్రా. *-ఏ/ -*ఎ.

**-ఏ**[6] 'ఏమి' యొక్క సంగ్రహ రూపం. అవ్య. ఏమిటి ? భాగ. 10.408.

క. ఏ, ఏన్, ఏమ్, ఏను. ఏమిటి ? ; త. ఎన్. ఎందుకు ? ఎందుకోసం ?

**-ఏ**[7] రూ.చూ. ఏని. అవ్య. **1.** అయినప్పటికీ ; **2.** నిర్ధారణ లేమిని తెలుపుతుంది ; **3.** పక్షాంతరాన్ని తెలుపుతుంది.

**ఏకఛాయ** వి. **1.** పదిమంది వ్యక్తులు సంతకం చేసిన బాండు ; **2.** ఒకే మాదిరి.

సం. ఏకచ్ఛాయ-. ఒకే పోలిక, ఒకే రీతి.

< సం. ఏకచ్ఛాయ-. అర్థవిపరి.

**ఏకటప్సా** పో.చూ. ఏకటాకీ. క్రి.విశ. తీవ్రంగా, నిరంతరంగా, ఒకే మాదిరిగా.

సం. ఏక + హిం. తప్సా. ఒకే, లేదా. నిరంతరమైన ఆడంబరం.

< సం. ఏక + హిం. తప్సా.

**ఏకటాకీ** (ప్రతి.ప.) క్రి.విశ. తీవ్రంగా, నిరంతరంగా, ఒకే మాదిరిగా.

సం. ఏక-. ఒకే లేదా నిరంతరమైన ; మరా. టాకా. అతుకు ; హిం. టాకీ. అతుకు.

< సం. ఏక + మరా. టాకా.

**ఏకటిదబ్బ** చూ. ఏకుబద్ద. వి. ఉన్ని ఏకే బద్ద.

**ఏకడ** చూ. ఎ[2]. రూ.చూ. ఎక్కడ. క్రి.విశ. ఏచోట.

**ఏకడినార** చూ. ఏకు. వి. ఏకుబద్ద కొనలకు కట్టిన జంతు నరం.

**ఏకండితలుపు** రూ.చూ. ఏకాండం తలుపు. వి. ఒకే చెక్కతో చేసిన తలుపు.

**ఏకతమాడు** చూ. ఏకతము.

**ఏకతము** రూ. ఎగ్గతము. క్రి.విశ. ఒంటరిగా, తోడులేకుండా, భార. ఆది. 2.26, 6.142, 7.254 ; విశ. ఒంటరియైన. భార. శాంతి. 5.398, మార్క. 1.32 ; వి. **1.** నిర్జన స్థలం, రహస్య ప్రదేశం, ఏకాంత ప్రదేశం. హర. 4.63. **2.** సంప్రదింపు. మను. 5.119.

సం. ఏకాంత-. నిర్జన రహస్య ప్రదేశం, ప్రత్యేకత, పరిపూర్ణత్వం ; ఏకత్వ-. ఒకటే అగుట, కలయిక, ఏకకాల సంభవత్వం, అభేదత్వం, అసహాయత్వం, కేవలత్వం ; ఏకతా. ఒకటి యగుట, కలయిక, ఏకకాల సంభవత్వం,

అభేదత్వం; మహా. ఎక్కంత. విశ్రామ ప్రదేశం; ఏగంత: అ.మా. ఏగంత. ఏకాంత ప్రదేశం, ఏకాంతం; పా. ఏకత్త. కలయిక. ఒంటరితనం, ఏకాంతం, ప్రత్యేకత.

క. ఏక-అంత. ఒంటరి రహస్య ప్రదేశం; త. ఏకాంతం-. ఏకాంతవాసం. ఒంటరితనం; మ. ఏకాంతం-. ఏకాంతవాసం.

<నం. ఏకాంత-.

**ఏకతమాడు** అ.క్రి. రహస్యంగా మాటలాడు. మను. 5.96.

**ఏకతలుపు** చూ. ఏకాండం తలుపు. వి. ఒకే చెక్కతో చేసిన తలుపు.

<సం. ఏక + తె. తలుపు.

**ఏకపునాది** (మిశ్రమ.) వి. నిర్మాణపు నమూనా ప్రకారం కట్టవలసిన గోడలన్నింటికీ ఒకేసారి తవ్విన పునాది.

<సం. ఏక- + పునాది (<ఉ. బునియాదీ.)

**ఏకభోగము** వి. అవిభక్తమైన అనుభవం. (వ్య. మొత్తం ఒక్కరే అనుభవించటం. మామూలుగా మతసంస్థలకూ, పండితులకూ, ఇతర గౌరవనీయులకూ పూర్తి హక్కులతో దానం చేసే భూముల విషయంలో ఈ పదం వ్యవహరింపబడుతుంది). భీమ. 5.77.

సం. ఏకభోగమ్.

త. ఏకపోకమ్. పూర్తి అనుభవం, పూర్తి హక్కు.

<నం. ఏకభోగ-. అర్థవిపరి.

**ఏకదశారతి** మిశ్రమ. వి. ఆరాత్రికా విశేషం, ఒక రకమైన హారతి.

<నం. ఏకదశా + ఆరతి.

**ఏకన** వి. అంచు, పక్క.

బహుశః <నం. ఏక + కొన. ఒక అంచు. మధ్య హల్లోపం.

**ఏకరంగి** వి. ఒకే రంగుకల మొకమాలు. దశా. 1.42.

ఉ. ఎక్‌రంగీ. ఒకే రంగు కలది.

<ఉ. ఎక్‌రంగీ.

**ఏకరువు** వి. ఒక్క వల్లె. రాజవా. 2.86. వ్య. నిరంతర పునరుక్తి.

పో.చూ. త. ఉరుప్పోటు. (ఉరు + పోటు) మంత్రాలను మరల మరల ఉచ్చరించుట, అప్పజెప్పుటకై మరల మరల చదువుట; ఉరు. ప్రార్థనా పునరుక్తి, మనస్సులో ప్రార్థించుకొనేప్పుడు లెక్క కుపయోగించే పూస.

<నం. ఏక- + రువ్వు.

**ఏకరుపెట్టు** రూ.చూ. ఏకరువుపెట్టు (వచ్చిన వేదాదులు మరచిపోకుండా పఠించు. చదువు). స.క్రి. అప్పగించుటకై మరలమరల చదువు. రాజవా. 2.85. **ఏకరువిడు** స.క్రి. వచ్చిన వేదమంత్రములను మరలమరల ఉచ్చరించు, లేదా చదువు. రాజవా. 2.85. **ఏకరువుపెట్టు** రూ. ఏకరుపెట్టు. స.క్రి. 1. వచ్చిన వేదమంత్రాదులను మరలమరల ఉచ్చరించు, లేక చదువు; 2. చేసినపనినిగాని, తప్పునుగాని పదేపదే చెప్పు.

**ఏకరుపెట్టు** చూ. ఏకరువు.

**ఏకరువిడు** చూ. ఏకరువు.

**ఏకరువుపెట్టు** చూ. ఏకరువు.

**ఏకలము** పో.చూ. ఒంటరిగాఁడు. వి. అడవిపంది. పారి. 3.30, ఆం.భా. 2.82.

క. ఎక్కల. అడవిపంది.

సం. ఏకల-. ఒంటరి (ఎవ్వరూ ఒంటరిగా సంచరించటం వల్ల అడవిపందికి ఆ పేరు వచ్చిఉండవచ్చు).

<నం. ఏకల-.

**ఏకవీఁడు** వి. అడవిపంది. హరిశ్చ. 2.24.

**ఏకవీఁడు** చూ. ఏకలము.

**ఏకసంత** వి. ఒకేసారి విని గ్రహించటం.

సం. ఏకసంధా. ఒక పర్యాయం కూడిక.

<నం. ఏకసంధా.

**ఏకసర** రూ. ఎకసర, ఏకసరము. వి. మల్లబంధ విశేషం. ప్రబంధ. 78.

సం. ఏకసర. ఒకేదంత; హిం. ఏక్‌సర్. ఒంటరి, ప్రతిలేని మొ.

<నం. ఏకసర. అర్థవిపరి.

**ఏకసరము** రూ.చూ. ఏకసర. వి. మల్లబంధ విశేషం. మల్లు. 3.69.

**ఏకహా** అవ్య. ఎప్పుడూ.

**ఏకాంగిపోరు** మిశ్రమ. వి. ద్వంద్వయుద్ధం. సిం.ద్వా. 6.51. వ్య. ఒకేవ్యక్తిపోరు.

సం. ఏకాంగి-. ఒకేవ్యక్తి.

సం. ఏకాంగి + పోరు.

**ఏకాణము** క్రి. విశే. పూర్తిగా, అంతటికీ.

**ఏకాండంతలుపు** చూ. ఏకాండము.

**ఏకాండము** వి. అఖండం, ఒకే చెక్కతో చేయబడినది. రం.రా. 1.73 ప. 13 పం, శృం.నై. 6.98.

సం. ఏకకాండ-. ఒకేకాండం కలది.

త. ఏకాంటుమ్. అతుకులు లేని ఒకే ముక్క.

<నం. ఏక- + కాండము. మధ్యహల్లోపం. ఒకే కాండం లేదా భాగం కలది.

**ఏకాండంతలుపు** రూ. ఏకండి తలుపు. వి. ఒకేచెక్కతో చేయబడిన తలుపు.

**ఏకారిల్లు** రూ.చూ. ఎకేరిల్లు. వి. ఒక్క గది యిల్లు.

**ఏకాసి** వి. చాంద్రమాన మాసం ప్రతి పక్షంలో పదొకండవ తిథి. వై.శ్రీరంగ. 3.119.

సం. ఏకాదశీ. ప్రతిపక్షంలో ఉపవాసయోగ్యమైన పదకొండోరోజు.

<నం. ఏకాదశీ.

**ఏకించు** చూ. ఏకు.

**ఏకినార** రూ.చూ. ఏకునార. వి. 1. కమానుకు కట్టే నరం; 2. ఏకుబద్దకు కట్టిన గట్టి పురిదారం.

**ఏకిరిదొరలు** వి. పాళెగాంధ్ర కులం.

**ఏకిలి** చూ. ఎత్తిలి. వి. ప్రవాహంవలన పొలంలో పెట్టిన ఇనుకదిబ్బలు.

**ఏకిలికట్టె** చూ. ఎకు. వి. ఉన్ని ఏకే బద్ద.

**ఏకిలివార** రూ.చూ. ఏకునార. వి. 1. కమానుకు కట్టిన నరం; 2. దూది ఏకటానికి బద్దకు కట్టిన నరం.

**ఏకిలిబద్ద** రూ.చూ. ఏకులబద్ద. వి. నారి కట్టిన వింటిబద్ద.

**ఏకు** స.క్రి. 1. దూది మొ. వాటిని విడిపోయేట్టుగ యంత్ర విశేషంతో కొట్టు, దూదేకినట్టు విదగొట్టు. కకుత్స. 5.76; 2. (తప్పు) బయటపెట్టు; 3. నిందించు, తిట్టు, అగౌర వించు; వి. ఏకిన దూది చుట్టు, తూలకడిక. చంద్రా. 5.86, ఆం.భా. 2.294.

క. ఎక్కాడు. దూది ఏకు; ఎక్కు, యక్కు. విద డీయు, వేరుచేయు, దూదేకు, ఉన్ని ఏకు; యక్కు. గట్టిగా కొట్టు; తు. ఎక్కు. ప్రత్తినుండి దారంతీయు; ఎక్కుని. (నూలు) వడకు; త. ఎ్ంకు. చేతితో పత్తిని ఏకుగా చేయు; ఎ్ంకురు; మ. ఏక్కు. దూదేకు; ఏక్కుక. కలుపు, అతికించు; కుఇ. ఏస్పు. వేరుచేయు, విభజించు. వడుకు: పర్జి. ఏక్. పొలాల్లోనుంచి రాళ్లు, కలుపు మొ. ఏరిపారవేయు.

**ఏకించు** ఏకు యొక్క ప్రేరణార్థకం. స.క్రి. దూదిఏకు నట్టు చేయు. **ఏకుకర్ర** వి. ఏకు తయారుచేయటానికుపయో గించే పుల్ల. **ఏకుడు** వి. దూది ఏకటం. ఆం.భా. 2.294. **ఏకువార** రూ. ఏకినార, ఏకిలినార. వి. దూది యేకటానికి బద్దకు కట్టిన నరం. **ఏకుపొత్తి** వి. సన్నదారం తీసేటప్పుడు చేతిచెమట అంటకుండా ఏకుపెట్టుకునే తోలుతిత్తి. **ఏకులబుట్ట** రూ. ఏకిలిబుట్ట. వి. ఏకులు పెట్టుకునే బుట్ట. **ఏకులువడుకు** స.క్రి. దారం తీయు.

**ఏకుకర్ర** చూ. ఏకు.

**ఏకుడు** చూ. ఏకు.

**ఏకుడుకర్ర** చూ. ఏకు. వి. దూది వడికేటప్పుడు కమాను నరం కట్టే కొయ్యపిడి. **ఏకుడుగూటం** చూ. ఏకుడుకర్ర. **ఏకులబద్ద** రూ. ఏకిలిబద్ద. వి. నారికట్టిన వింటిబద్ద. **ఏకుడుదబ్బ** చూ. ఏకుబద్ద. వి. ఉన్ని ఏకే బద్ద.

**ఏకుడుకర్ర** చూ. ఏకుడు.

**ఏకుడుగూటం** చూ. ఏకుడు.

**ఏకుడుదబ్బ** చూ. ఏకుడు.

**ఏకుదోఁక** వి. ఒక రకం పిట్ట. పార్వ. 6.77.

**ఏకువార** చూ. ఏకు.

**ఏకులవారిగాఁడు** పో.చూ. ఏకుదోఁక. వి. ఒకరకం పిట్ట. హంస. 3.12.

బహుశః దూదేకుయంత్రంవలె ధ్వనిచేయునది.

**ఏకుపొత్తి** చూ. ఏకు.

**ఏకులబద్ద** చూ. ఏకుడు.

**ఏకులబుట్ట** చూ. ఏకు.

**ఏకులువడుకు** చూ. ఏకు.

**ఏకె** సర్వ. ఎవతె?

పో.చూ. క. యావాకె. ఎవతె?

**ఏకెత్తు** వి. సమానమైన మట్టం.

<సం. ఏక+ఎత్తు[1].

**ఏకోమ** వి. సమష్టి, యావత్తు.

క. ఏకూను, సకోను. పూర్తిమొత్తం; మ. ఏకూణ. సంగ్రహించటం; ఏకుణాల్. లెక్కపూర్తియైన తర్వాతి మొత్తం.

**ఏకోమదారులు** వి. బ.వ. సమష్టిభాగస్థులు. <ఏకోను+-దారు+-లు.

**ఏకోమదారులు** చూ. ఏకోను.

**ఏకోరు** స.క్రి. మిక్కిలిగా కోరు.

<సం. ఏక-+కోరు.

**ఏక్కు** వి. మిక్కిలి రోత.

వాంతులు చేసుకునేప్పటి ధ్వన్యనుకరణ.

**ఏగర్ర** వి. రాట్నం పిలకచెవులమధ్యవేసిన నిలువుకొయ్య.

**ఏగలి** రూ. ఏగిలి[1]. వి. భూమిని సారవంతం చేసేది.

**ఏగాని** రూ. యాగాని. వి. రెండు దమ్మిడీల లేదా అణాలో ఆరోవంతు విలువగల రాగినాణెం, కొన్ని చోట్ల ఒకటిన్నర దమ్మిడీ, కానిలో సగం. మూడు దమ్మిడీల విలువగల కాని అనే రాగినాణెంలో ఏగాని పరిమాణంలోనూ, విలువలోనూ సగం. కొన్ని ప్రదేశాల్లో డబ్బు అంటే నాలుగు దమ్మిడీలు. అందులో సగం ఏగాని రెండు దమ్మిడీలు.

బహుశః <అర+కాని. అరపైన; <ఎఱ+కాని. ఎర్రని పైన.

<త. ఐ+కాని. చిన్న పైన; త. ఐ. చిన్న.

**ఏగి** రూ.చూ. ఎంగెస. వి. తలుపులు తయారుచెయ్యటానికీ బండి భాగాలు తయారుచెయ్యటానికి శ్రేష్ఠమైన కలపనిచ్చే పెద్ద అడవి చెట్టు.

**ఏగిలి[1]** రూ.చూ. ఏగలి. వి. భూమిని సారవంతం చేసేది.

**ఏగిలి[2]** వి. మెట్టపంట కోసిన తరువాత పొలంలో మిగిలే వేళ్ళతో ఉన్న మోడు, కొయ్యకాలు.

**ఏగిసె** రూ.చూ. ఎంగెస. వి. తలుపులూ బండి భాగాలు. తయారుచెయ్యటానికి శ్రేష్ఠమైన కలపనిచ్చే పెద్ద అడవి చెట్టు (P. bilobus; P. marsupium).

**ఏగుడు** పో.చూ. ఏవ. విణ. రోత అయినది. సింహా. 1.96.

పో.చూ. క. ఏవ. అసహ్యం, రోత, ద్వేషం, మురికి, అసహ్యకరమైన వస్తువు; పో.చూ. త. ఏవమ్. తప్పు, కళంకం.

**ఏగురు** రూ. ఏవురు. చూ. ఐదు. సర్వ. ఐదుగురు.

క. అయ్వర్, అయ్వరు, ఆయ్వరు. ఐదుగురు; కొడ. ఐవొ; తు. ఐవెరు, ఐవేరు, ఐయెరు; త. ఐవర్; మ. ఐవర్; పర్జి. చేవిర్. ఐదుగురు పురుషులు; గోం. సెవిర్, సారుంగ్, సైయుంగ్. ఐదు; కుఇ. సింగి. ఐదు; పర్జి. చెందు. ఐదు; చేవిర్. ఐదుగురు; కొలా. అయ్‌ద్(<తె.); సెగుర్; అయ్‌ద్. అయిదు; ఐద్. ఐదు; సెగుర్. అయిదుగురు; చేవుర్.

<మూ.ద్రా. *చేవుర్.

**ఏగుప** రూ.చూ. ఎంగుస[2]. వి. ఐదు కుంచాల కొలత. ఆం.భా. 2.27.

**ఏగేకి** రూ.చూ. ఎంగెస.

**ఏగేస** రూ.చూ. ఎంగెస. వి. తలుపులు, బండి భాగాలు తయారు చెయ్యటానికి శ్రేష్ఠమైన కలపనిచ్చే అడివి చెట్టు (P. bilo-

bus ; P. marsupium).

ఏగేసె రూ.చూ. ఎంగెస.

ఏగొయ్య వి. పూరింటి ఆకుకప్పు కుట్టటానికి వాడే పరికరం.

ఏంకరు వి. నూలు చిలపలుగాచుట్టే పనిముట్టు.

ఇం. *Hank*. నూలుదారపు కండె, చిలప.

< ఇం. Hank.

ఏంగ్స రూ.చూ. ఎంగెస. వి. వృక్ష విశేషం.

ఏఁకట చూ. ఏఁకరు. వి. 1. మిక్కిలి అపేక్ష, కోరిక, ఆశ. భీమ. 2.124, వై.భా. 8.76 ; 2. బాధ. ధర్మ. 4.127.

త. ఏక్కఱు. కోరు ; ఏంకు. దుఃఖాదులచే కృశించు, అపేక్షించు.

ఏఁకటపడు అ.క్రి. వాచిపోవు, మిక్కిలి అపేక్షించు. వరాహ. 12.68.

ఏఁకటపడు చూ. ఏఁకట.

ఏఁకరి రూ.చూ. ఎనకరి. వి. వేటాడి, ఎరుకచెప్పి జీవించే ఒక కిరాతజాతి. ఆం.భా. 2.289.

ఏఁకరు రూ. ఏఁకారు. అ.క్రి. 1. ఉవ్విళ్లూరు, మిక్కిలి కాంక్ష గలిగియుండు. ఉ.హరి. 5.29. మల్ల.నీతి. 36 ; 2. భయపడు. పద్మ. 9.231.

పో.చూ. తు. ఏప్పర. లోభం, తీవ్రవాంఛ ; ఏ్వవ ; త. ఏక్కఱు. కోరు, బడలికజెందు ; ఏంకు. కోరు, అపేక్షించు, భయమొందు, ఏడ్చు ; ఏక్కమ్. వాంఛ ; ఏక్కఱు, ఏచఱు. కోరు ; ఏకఱ్ఱు. కోరు ; కో. ఏంగ్. దుఃఖించు.

ఏఁకారు రూ.చూ. ఏఁకరు. అ.క్రి. 1. ఉవ్విళూరు, మిక్కిలి కాంక్షగలిగియుండు. శుక. 3.488 ; 2. బాధపడు. హంస. 2.104 ; 3. కృశించు, దుఃఖాదులచే శుష్కించు. హంస. 2.112.

ఏఁగడము చూ. ఏఁగు.

ఏఁగించు చూ. ఏఁగు.

ఏఁగు అ.క్రి. 1. కదలు. భార.ఆది. 6.267, హరి.పూ. 1.58 ; 2. నడచు. భార.విరా. 1.148 ; 3. వెళ్లు, పోవు. కళా. 3.15 ; 4. ఉత్సవంతో తిరుగు (పెద్దన చాటువు) ; 5. చనిపోవు. హంస. 1.190.

తు. ఎక్కవుని. చేరు ; ఎక్కుని. తాకు ; త. ఏకు. వెళ్లు, కదలు, నడచు, జారిపోవు ; ఐయంకు. కదలు, వెళ్లు ; పో.చూ. పర్జి. వెన్-వెంద్. వెళ్లు ; మ. ఏకుక, ఐయన్నుక. తిన్నగా కదులు ; కుఇ. ఎప (ఎత్-). చేరు ; కువి. ఎజ్- ; మాల్తో. ఎక్(ఎ). వెళ్లు, కదులు ; ఏఙ్. అనుసరించు ; కురు. ఏక్నా (ఈక్యాస్). నడచు. వ్యవహారములు నడుపు ; ఏక్. నడచు ; ఏక్త్. నడిపించు.

< మూ.ద్రా. *ఏక్-/ఏన్క్ < *ఏయ్క్-/*ఏయన్క్.

ఏఁగడము రూ. ఏఁగుడు. వి. 1. పోవటం ; 2. ప్రయాణం. ఏఁగించు అ.క్రి. 1. పంపు, ఏగునట్లుచేయు. భార.ఆది. 6.294 ; 2. (ఉత్సవంతో)తిప్పు. ఆము. 4.9. త. ఏకువి. పంపు, ఏగునట్లుచేయు. ఏఁగుడు రూ.చూ. ఏఁగడము. వి. ప్రయాణం. ఆం.భా. 2.219. ఏఁగుదెంచు రూ. ఏతెంచు. అ.క్రి. 1. వచ్చు. భార.ఆది. 6.225, విక్ర. 1.108 ; 2. వెళ్లు. వై.భా. 2.73. < ఏఁగు + -తెంచు.

ఏఁగుపెండ్లి వి. పెండ్లి అయిన తర్వాత వధూవరులను ఊరేగించే ఉత్సవం. వసు. 3.10.

ఏఁగుడు చూ. ఏఁగు.

ఏఁగుదెంచు చూ. ఏఁగు.

ఏఁగుపెండ్లి చూ. ఏఁగు.

ఏఁగెస రూ.చూ. ఎంగెస. వి. గృహ నిర్మాణంలో కలపకు ఉపయోగించే ఒక జాతి అడవిచెట్టు. (Ptero carpus marsupium).

ఏచ రూ. ఏస[2]. విణ. 1. వికృత స్వరం కలది. యయా. 1.102 ; 2. వంకరు.

సం. వేష-. పని, చురుకుదనం, నిర్వహణ, దుస్తులు, అలంకారం ; ప్రా. వేస-. దుస్తులు ; పా. వేస. దుస్తులు, మారువేషం. ధరించిన రూపం.

క. యాస, యేస. వేస. దుస్తులు, మారువేషం. కృత్రిమ ముఖాలు తగిలించుకొని ఆడేఆట (బుట్టబొమ్మలాట) ; కపటం, మాయ, సొమ్ము, అలంకారం ; తు. యేస, ఏస, బుట్టబొమ్మలాట, దుస్తులు, మాయ. కపటం.

< ప్రా. వేస-.

ఏచకంకటిచుక్క వి. వంకరమంచంవలె ఉండే నక్షత్రం, ఉత్తరాషాఢ.

ఏచకంకటిచుక్క చూ. ఏచ.

ఏచు అ.క్రి. 1. పెరుగు, బలియు. భార.ఆది. 4.20, విరా. 1.162. పాండు. 5.289 ; 2. విజృంభించు, చెలరేగు. భార.సభా. 2.183 ; ఉద్యో. 1.138 : 3. అధికమగు, పెద్దదియగు, అతిశయించు. భార. భీష్మ. 1.94, భా.రా. యుద్ధ. 1488, వరాహ. 11.50 ; 4. కలుగు, సంభవించు. భాగ. 8.476, ఆము. 6.45.

పో.చూ. క. ఏఱికె. అధికమగు, పెంపొందు ; త. ఏ. పెంపు, సమృద్ధి ; ఏన్తు. పైకి లేచు, ఎత్తైన ; ఎయ్త. క్రి.విణ. ఎక్కువగా ; ఎయ్తు. చాలినంత ; కుఇ. ఎప (ఎత్-). ఎక్కువగు, విస్తారం ; బ్రా. హేంఫింగ్. ఎత్తు, పైకెత్తు.

< మూ.ద.ద్రా. *ఏ- < మూ.ద్రా. *ఏయ్- / *ఏ-.

ఏజెంటు వి. మరొకరి పక్షాన పనిచేసేవాడు.

ఇం. *Agent*. మరొకరి పక్షాన పనిచేసేవాడు.

< ఇం. Agent.

ఏజెన్సి వి. కొండ ప్రాంతం. ప్రతినిధిచేత పరిపాలితమైన ప్రాంతం.

ఇం. *Agency*-. ఒక సంస్థ అధీనంలో ఉన్న ప్రాంతం, వ్యాపార కార్యక్రమాలు జరిపే ప్రదేశం.

< ఇం. Agency. అర్థవిపరి.

ఏఁచు స.క్రి. బాధించు, ఇబ్బందిపెట్టు, ఏడిపించు. భార. విరా. 2.384.

త. ఏచు. స.క్రి. బాధపెట్టు, తిట్టు, నిందించు ; ఎంకు. అ.క్రి. ఏడ్చు, వెక్కి వెక్కి యేడ్చు, ఆందోళన చెందు ; ఏచ్ఱు. కష్టపడు ; మ. ఏశణి. చాడీలు చెప్పుట.

ఏఁచెల్ల చూ. చెల్ల. ఎసు + చెల్ల. అవ్య. సంతాపార్థకం,

ద్వి. హరిశ్చ. చ. ఉ. 927.

బహుశః ఏన్ + చెల్లన్. వ్యు. నేను పోజాలను, నేను తగను మొ.

**ఏట**[1] రూ.చూ. ఏటము. వి. పక్క : విణ. ప్రధానం, అధికం, గొప్పది.

**ఏటవాలు** విణ. ఓరగానున్నది, ఒరగినది. వ్యు. పక్క వంపు. మను. 3.8, ప్రభా. 2.42 ; క్రి.విణ. వంపుగా. ఆము. 4.91.

**ఏట**[2] 'ఏఁడు' సంవత్సరం, సప్తమ్యంత రూపం. క్రి.విణ. ప్రతి సంవత్సరం, సంవత్సరానికి.

**ఏట**[3] రూ.చూ. ఏడి. వి. బలిగా యిచ్చే గొర్రె లేక మేక.

**ఏటపోతు** వి. పొట్టేలు.

**ఏటకట్టటం** చూ. ఏరు[1]. వి. 1. దున్నేముందు మోకును పలక చుట్టూ తిప్పి కాడికి కట్టే కట్టు ; 2. అరక.

**ఏటఁగలువు** చూ. ఏఱు[2].

**ఏటకాడు** రూ.చూ. ఏరకాడు. వి. 1. అరక కట్టటాని కుపయోగించే పగ్గం ; 2. బండి పోలు తాడును జువ్వాయి మోకుకు కలిపే తాడు.

**ఏటపెట్టటం** చూ. ఏరు[1]. వి. 1. దున్నేముందు మోకును పలక చుట్టూ తిప్పి కాడికి కట్టే కట్టు : 2. అరక.

**ఏటపోతు** చూ. ఏట[3].

**ఏటము** రూ. ఏట[1]. విణ. 1. అధికం. బసవ. 4.351 ; 2. ప్రధానం, గొప్పది. విజ్ఞా. 3.27.

క. ఏత. ఎక్కుడు ; త. ఏత్తమ్. ఆధిక్యం ; మ. ఏత్తమ్. ఎక్కువ.

<మూ.ద్రా. *ఏత్-.

**ఏటఁబలువు** చూ. ఏఱు[2].

**ఏటలవి** చూ. ఏటు. వి. ఏటుకు అందే దూరం. వ్యు. బాణం పారునంత దూరం. భార. కర్ణ. 2.186, మను. 4.44.

<ఏటు + అలవి.

**ఏటవార్నె** పో.చూ. ఏరు[1]. వి. బండి పోలు తాడును జువ్వాయి మోకుకు అతికే తాడు.

**ఏటవాలు** చూ. ఏట[1].

**ఏటసామాను** చూ. ఏరు[1]. వి.బ.వ. అరక కట్టటాని కుపయోగించే ఉపకరణాలు.

**ఏటి** రూ.చూ. ఏమి. క్రి.విణ. ఏమిటి, ఏరకం, ఏది. భార. ఆది. 2.143.

**ఏటికి(న్)** రూ.చూ. ఏమిటికి(న్) క్రి.విణ. ఎందు కొరకు. భార. ఆది. 3.5, సభా. 2.92. **ఏటికో** రూ.చూ. ఏమిటికో.

**ఏటిఆవలిగిలిగింత** చూ. ఏఱు[2].

**ఏటికపాము** రూ.చూ. ఎమిడిక పాము. వి. 1. ఎఱ్ఱ, వాన పాము. కళాపూ. 1.152 ; 2. కడుపులో పుట్టి పాముపలె ఉండే పురుగు.

**ఏటికఱ్ఱ** రూ.చూ. ఏడికఱ్ఱ. వి. కాడిని పలకనీ కలిపే గొడుగు కఱ్ఱ.

**ఏటికి(న్)** చూ. ఏటి.

**ఏటికియేడాది** చూ. ఏఁడు[1].

**ఏటికెదురీఁదు** చూ. ఏఱు[2].

**ఏటికో** చూ. ఏటి.

**ఏటికోలు** వి. నమస్కారం. సాష్టాంగ ప్రణామం.

త. ఏత్తు. స్తుతించు, పొగడు : ఏత్తు. <. (ఏఱు ప్రేరణ.) పైకెత్తు మొ. స్తుతించు.

ఏత్తి + క్ + కోళ్ >ఏటికోలు.

<త. ఏత్తిక్కోళ్.

**ఏటికోళ్లు** ఏటికోలు యొక్క బ.వ. వి.బవ. నమస్కారములు. భార. ద్రోణ. 2.347, భీమ. 2.50.

**ఏటిగుల్ల** చూ. ఏఱు[2].

**ఏటిపాలగు** చూ. ఏఱు[2].

**ఏటిపుచ్చ** వి. చేదుపుచ్చ, పాపటకాయ.

**ఏటిబట్టె** చూ. ఏఱు[2].

**ఏటిబోటిమగలయికిమీఁదు** చూ. ఏఱు[2].

**ఏటిమొగ్గ** వి. రెండు కాళ్లు రెండు చేతులపై నడుస్తూ ముఖం పై కెత్తిన ఒకానొక నాట్య భంగిమ. వ్యు. ఉత్తమ భంగిమ లేక శరీరం ఏదో ఒక చివర పంపుగల భంగిమ.

**ఏటిరాయి** వి. 'క్వార్టు' జాతికి చెందిన ఒక రకం మెరిసే రాయి.

**ఏటిరింత**[1] రూ. ఏట్రింత[1]. వి. భారద్వాజ పక్షి. సిం. ద్వా. 1.231.

పో.చూ. క. హెగ్గార. పెద్దది ; వలియనహక్కి. బలమైన పక్షి ; పో.చూ. త. వలియన్-వలియోన్. బలమైనది ; పో.చూ. సం. భారద్వాజ, వ్యాఘ్రాటు. వ్యు. పెద్దపలివలె సంచరించేది.

బహుశః <త. ఏఱు (ఎత్తునకుపోవు, పెద్దదగు) + ఇంత.

**ఏటిరింత**[2] రూ. ఏట్రింత[2]. వి. ఒక రకం మొక్క.

**ఏటిపోఁదు** చూ. ఏఱు[2].

**ఏటివిడి** చూ. ఏఁడు[1].

**ఏటు** చూ. ఏయు. వి. బాణప్రయోగం, బాణపుదెబ్బ. భార. భీష్మ. 3.225.

క. ఏటు. దెబ్బ, వేటు, రువ్వటం ; ఎటు. దెబ్బ ; తు. ఏటు. దెబ్బ, వేటు ; ఎట్టుని. దెబ్బతీయు ; త. ఏఱు. రువ్వు, (కత్తి మొ. వాని) దెబ్బ ; ఎఱ్ఱు. కొట్టు, పారవేయు ; మ. ఏఱు. రువ్వటం, విసరివేయటం ; ఏఱ్ఱు. దెబ్బ, బట్టలుతకటం.

<మూ.ద.ద్రా. *ఏత్-.

**ఏటుకాఁడు** వి. బాణాలు వేసేవాడు, విలుకాడు. భాగ. 10 పూ. 1056. క. ఎటుగాఱ. విలుకాడు. **ఏటుపోటుతల** వి. 1. యుద్ధరంగం. వ్యు. బాణాలు వేసుకొనే కత్తులు దూసుకొనే చోటు. భార. కర్ణ. 3.197. **ఏటుబెట్టు** స.క్రి. ప్రయోగంచేయు (దాతబడి). **ఏటులాడు** ఏటులు + ఆడు. రూ. ఏట్లాడు. అ.క్రి. బాణయుద్ధంచేయు, యుద్ధంచేయు. భార.భీష్మ. 2.88. **ఏట్లాడు** రూ.చూ. ఏటులాడు. అ.క్రి. బాణయుద్ధంచేయు. యుద్ధంచేయు. భార.విరా. 5.133, యయా. 1.116.

**ఏటుకాఁడు** చూ. ఏటు.

**ఏటుకొంౘ** పో.చూ. ఏరు[1]. వి. మొదటి కొంౘపక్కనవేసే

రెండోకొంగ్ర, కొన్నిచోట్ల మొదటి కొంగ్ర.

**ఏటుపోటుతల** చూ. ఏటు.

**ఏటుబెట్టు** చూ. ఏటు.

**ఏటులాడు** చూ. ఏటు.

**ఏటేట(న్)** చూ. ఏఁడు[1].

**ఏట్రింత[1]** రూ.చూ. ఏటిరింత[1]. వి. భారద్వాజపక్షి. యయా. 2.24. ఆం.భా. 2.91.

**ఏట్రింత[2]** రూ.చూ. ఏటిరింత[2]. వి. ఒకరకం మొక్క.

**ఏట్లాడు** చూ. ఏటు.

**ఏడ** రూ.చూ. ఎక్కడ. వి. ఎక్కడ. భార.అర. 2.47, భీమ. 2.155.

పో.చూ. క. యావెడె (యావ+ఎడె). ఎక్కడ? ఏచోటు?; పో.చూ. తు. ఒయిటె. ఎక్కడ, ఏచోట; అయికె. అక్కడ, ఆచోట; నెకె. ఇక్కడ, ఈచోట; త. యా. ఏమిటి; యాంటు. ఎక్కడ; మ. ఎవిటె. ఎక్కడ; ఎవిటె. ఎక్కడ; ఏడ, ఓడ. ఎక్కడ?; పో.చూ. కొలా. ఎత్తిన్. ఎక్కడ?; నా. ఐత్తిన్. ఎక్కడ.

**ఏడతర** వి. బంజరునేలలో ఆరు లేక ఏడు అడుగుల ఎత్తుపెరిగే ముళ్లచెట్టు (Dichrostachyscinerea).

క. ఎడతఱె; త. విడత్తర్, విడత్తల్, విడత్తేర్, విడత్తిరై.

**ఏడవ** చూ. ఏడు[1].

**ఏడాకుమొలకలు** చూ. ఏడు[1]. వి. ఒకరకం ధాన్యం.

**ఏడాకులవఁటి** చూ. ఏడు[1].

**ఏడాకులపొన్న** చూ. ఏడు[1].

**ఏడాకులరఁటి** చూ. ఏడు[1].

**ఏడాకులవారు** వి. బవ. తక్కువజాతి బ్రాహ్మణులు. వీరితో తక్కిన తెగల బ్రాహ్మణులకు వివాహాది సంబంధాలు నిషిద్ధాలు.

< ఏడు[1] + ఆకులు + -అ + వారు. వ్యు. ఆకులు దూరంగా కలవారు, తక్కినవారికంటె వేరుగా భోజనాదులు చేయవలసినవారు, నిషిద్ధులు.

**ఏడాకోడము** రూ.చూ. ఏడాగోడము. వి. తబ్బిబ్బు, వైరుధ్యం.

**ఏడాగోడపుమాట** చూ. ఏడాగోడము.

**ఏడాగోడము** రూ. ఏడాకోడము. వి. విరుద్ధం, తబ్బిబ్బు.

త. ఏటాకూటుమ్. వైపరీత్యం, వైరుధ్యం, తబ్బిబ్బు; మ. ఏటాకూటుమ్. వ్యతిరేకత, వైపరీత్యం.

బహుశః వ్యతిరేకతను తెలిపే ధ్వన్యనుకరణ శబ్దం.

**ఏడాగోడపుమాట** వి. విరుద్ధపు మాట. **ఏడాగోడముగా(న్)** క్రి.విశే. తబ్బిబ్బుగా, విరుద్ధంగా <ఏడాగోడము+కాన్.

**ఏడాగోడముగా(న్)** చూ. ఏడాగోడము.

**ఏడాటము** చూ. ఏడు[1].

**ఏడాటలాడించు** చూ. ఏడు[1].

**ఏడావడి** వి. ఒకరకం చెట్టు.

**ఏడి** రూ. ఏట[3], ఏడిక, ఏఁట, ఏలిక[3], యాట, వేఁట. వి. మేషం. గొర్రె. ప్రబంధ. 135.

పో.చూ. క. ఆడు. మేకపోతు. మేక; కొడ. ఆడు; తు. ఏడు. మేక; త. యాటు. పొట్టేలు, మేక; ఆటు; ఏళకమ్. పొట్టేలు, మేక, గొర్రె; మ. ఆటు. మేక, గొర్రె; కో. ఆడ్. మేక; తొ. ఓడ్; గో. యేటి. ఆడుమేక; కుఇ. ఓడ. మేక; కుఱు. ఏరా. మేక; బ్రా. హేట్. ఆడు మేక, ఆడుకొండమేక.

సం. ఏడి, ఏడా, ఏడకా. ఆడుమేక.

బహుశః ద్రావిడ భాషలలోనుండి సంస్కృతంలోకి వచ్చిన ప్రతి. ప.

**ఏడిక** రూ.చూ. ఏడి. వి. గొఱ్ఱె. భార.ద్రోణ. 2.210, శకుత్స. 1.153, అచ్చరా. 5.44.

తెలుగు వైయాకరణులు దీనిని (సంస్కృతేతర) దేశీయ పదంగా గుర్తించారు.

**ఏడికవజీర్** వి. అగ్నిదేవుడు. ఆం.పదా. 1.30. <ఏడిక + ఉ. వజీర్.

**ఏడికర్ర** రూ. ఏటికర్ర. ఏఁటికర్ర. పో.చూ. ఏడు[1]. వి. కాడి నిడువతనూ కలిపే పొడుగుకర్ర.

**ఏడికవజీర్** చూ. ఏడిక.

**ఏడికొమ** చూ. ఏడు[2].

**ఏడికోలు** చూ. ఏడు[2].

**ఏడిపించు** రూ. ఏడ్పించు. 'ఏడ్చు' ప్రేరణార్థక శబ్ద రూపం. స.క్రి. ఏడ్చునట్లుచేయు.

**ఏడు[1]** వి. 1. సప్తసంఖ్య, ఆరున్నొకటి. భార.ఆది. 1.47; 2. దాల. విశే. ఏడు సంఖ్యగల. భార.ఆది. 1.69.

క. ఏళ్, ఏళు, ఏళు. ఏడు; ఎళ్. ఓళు. మొ. ఏడు (యోళు అని ఉచ్చారణ); కొడ. ఓళు. ఏడు; తు. ఏలు. ఏడు; త. ఏళు. ఏడు: ఎళు, ఏళ్ (వ్. ముందు); మ. ఏళు, ఎళు. ఏడు; ఏడు. ఏడు; గో. ఏరుంగ్. ఏడు; కొలా. ఎడ్. ఏర్. ఏడు.

<మూ.ద్రా. *ఏళ్.

**ఏడవ** వి. ఒక వరుసలో ఆరు తర్వాతది. **ఏడాకుమొలకలు** పో.చూ. మొలకొలుకులు. వి. బ.వ. ధాన్య విశేషం. ప్రబంధ. 112. **ఏడాకులవఁటి** రూ.చూ. ఏడాకులరఁటి. వి. ఒకరకం అరటిచెట్టు. **ఏడాకులపొన్న** వ్యు. ఏడాకులుగల పొన్నచెట్టు. వి. ఒకరకం చెట్టు. కాశీ. 3.23. (Calophyllum inophyllum). **ఏడాకులరఁటి** రూ. ఏడాకుల వఁటి. వి. ఒకరకం అరటిచెట్టు. ఏడు ఆకులుగల అరటిచెట్టు. మను. 3.84 మ. ఏళ్-ఇల-ప్-పాల. ఏడాకులుగల పాల చెట్టు. **ఏడాటము** వి. ఇబ్బంది, కష్టం. **ఏడాటలాడించు** స.క్రి. కష్టపెట్టు, బాధించు. వ్యు. పెక్కు ఆటలాడించు, ఏడు ఆపదలకు లోబరుచు. ఇక్కడ 'ఏడు' బహుత్వాన్నేకాక సప్త వ్యసనాలనూ సూచించవచ్చు. యయా. 3.34. **ఏడుకొండలరాయఁడు** చూ. ఏడు[1]. వి. ఏడుకొండలకు ప్రభువు, తిరుపతి వేంకటేశ్వరస్వామి. **ఏడుకొండలు** వి. బవ. తిరుపతి యందలి ఏడుకొండలు, ఏడు కుల పర్వతాలు. **ఏడుగురు** రూ.చూ. ఏడువురు. వి. ఏడుమంది. ఉ.రా. 1.297. **ఏడుగుఱ్ఱాలజోదు** వి. ఏడు గుఱ్ఱాలపై స్వారిచేసే వీరుడు, సూర్యుడు. సమీర. 2.219. **ఏడుగుఱ్ఱాలతేరెక్కుజోదు** వి. ఏడు గుఱ్ఱాల రథం ఎక్కే వీరుడు, సూర్యుడు. **ఏడుతూములు** రూ. ఏడ్తుము. వి. ఏడు తూముల మానవిశేషం. **ఏడుసూఱు**

రూ. ఏడ్నూఱు, ఏన్నూఱు. వి. ఏడువందలు. ద్వి.పరమ. వి. 8.642 పు. 12 పం. క. ఏళునూఱు. ఏడు వందలు ; ఏళ్ నూరు. ఏడు వందలు ; తు. ఏళ్ నూడు. త. ఎళు నూరు. ఏడుమంది వి. ఏడుగురు. ఏడు(మొక్కులు వి. బవ. అనేక నమస్కారాలు. భార.అశ్వ. 1.75. ఏడువారముల నగలు రూ. ఏడువారాల నగలు. వి. వారంలో ఏరోజు కారోజు (ప్రత్యేకంగా ధరించే నగలు, అలంకారాలు. చెన్న బ. 56. ఏడువారాలనగలు రూ.చూ. ఏడువారముల నగలు. ఏడుపురు రూ. ఏడుగురు, ఏడ్గురు, ఏడ్వురు. వి. ఏడుమంది. హర. 4.41. ఏడ్గురు రూ.చూ. ఏడువురు. వి. ఏడుమంది. కుచేల. 1.31. ఏడ్దుము రూ.చూ. ఏడుతూములు. వి. ఏడు తూముల మానవిశేషం. ఆం.భా. 2.271. ఏడ్నూఱు రూ. చూ. ఏడునూఱు. వి. ఏడుపందలు. కాశీ. 5.286. ఏడ్వురు రూ.చూ. ఏడువురు. వి. ఏడుమంది. భార.ఆది. 5.84.

ఏడు[2] రూ.చూ. వేఁడు. స.క్రి. (ప్రార్థించు.

ఏడికొను రూ.చూ. వేఁడికొను. స.క్రి. ప్రార్థించు. బతిమాలు. ఏడికోలు రూ.చూ. వేఁడికోలు. వి. (ప్రార్థన.

ఏడుకొండలరాయఁడు చూ. ఏడుకొండలు.

ఏడుకొండలు చూ. ఏడు[1].

ఏడుగడ రూ. ఏడ్గడ. వి. 1. సమస్తం, ఎల్ల. భార.ఆది. 4.65; 2. నియంత, రక్షకుడు, ప్రభువు. వ్య. సప్తవిధ రక్షకులు. భార.ఉద్యో. 4.93.

సప్తవిధ రక్షకులు. 1. గురుడు ; 2. తల్లి ; 3. తండ్రి; 4. పురుషుడు ; 5. విద్య ; 6. దైవము ; 7. దాత.

< ఏడు + కడ.

ఏడుగళ్ళ అవ్య. ఎల్లప్పుడు.

ఏడుగాడు వి. చెడుపు.

ఏడుగురు చూ. ఏడు[1].

ఏడుగుఱ్ఱాలజోదు చూ. ఏడు[1].

ఏడుగుఱ్ఱాలతేరెక్కుజోదు చూ. ఏడు[1].

ఏడుచు రూ.చూ. ఏడ్చు. అ.క్రి. రోదించు.

ఏడుతూములు చూ. ఏడు[1].

ఏడుమాఱు చూ. ఏడు[1].

ఏడుపు రూ. ఏడ్పు, ఏలుపు. చూ. ఏడుచు. వి. 1. రోదనం. భార.ఉద్యో. 1.347, ఉ.రా. 6.276 ; 2. మొర, బాధ ; 3. అన్యస్త్రీ రతి.

ఏడుమంది చూ. ఏడు[1].

ఏడు(మొక్కులు చూ. ఏడు[1].

ఏడువారములనగలు చూ. ఏడు[1].

ఏడువారాలనగలు చూ. ఏడు[1].

ఏడువురు చూ. ఏడు[1].

ఏడూఁడి రూ.చూ. ఏఁడుడి. వి. చనిపోయిన తొలి వత్సరాంతంలో మూడు రోజులపాటు జరిపే కర్మకాండ.

ఏడె[1] వి. ఇంటికప్పుకూ, పశుగ్రాసానికీ పనికివచ్చే బల్లపరుపు కాడగల కలుపుమొక్క (Andropogon contortus, Heteropo-goncontortas beafur).

ఏడె[2] చూ. ఎద. వి. 1. దిగుదారిలో ఎడ్లు నడిచే రెండుదారుల మధ్యభాగం ; 2. నిలువుగా అడ్డంగా దున్నటం ; 3. అదవిదారి.

ఏడె[3] చూ. ఎద. వి. 1. బండి జల్ల తెరచివున్నవైపు ; 2. ఎక్కువ కంకులు పొయ్యటానికి బండి జల్ల అంచుల్ని నిల వేసిన దొప్పకట్ట(లు).

ఏడెకాడు వి. బండి జల్ల తెరచివుంచినవైపు అడ్డంకట్టిన రాడు.

ఏడెకాడు చూ. ఏడె[3].

ఏడ్గడ రూ.చూ. ఏడుగడ. వి. రక్షకుడు, ప్రభువు. కాశీ. 3.205.

ఏడ్గురు చూ. ఏడు[1].

ఏడ్చు రూ. ఏడుచు. అ.క్రి. రోదించు. భార.ద్రోణ. 22.54 ; అ.క్రి., స.క్రి. అన్యస్త్రీతో రమించు.

క. అట్, అఱు. ఏడ్చు, రోదించు ; అఱు, అఱుపు. ఏడ్చుట, రోదించుట ; తు. అఱ్పున. ఏడ్చు, రోదించు ; త. అఱు. ఏడ్చు, రోదించు ; పో.చూ. అలవు. వి. యోగ బాధ ; మ. అఱుక. ఏడ్చు, రోదించు ; గో. అరానా. ఏడ్చు, రోదించు ; అరన. ఏడ్చు ; అర్ ; కుఇ. ఱీ-వ్-అ(ఱీ-త్-). ఏడ్చు, రోదించు, శోకించు, కూయు, మొరుగు, ధ్వనిచేయు ; పర్జి. అర్. ఏడ్చు, రోదించు ; గద. అర్. ఏడ్చు ; కోట. ఒగ్-(అర్-) ; తొద. ఒర్-(ఒర్య్-), కొండ. అర్ప. ఏడ్చు ; అరియానా. ఏడ్చు, దుఃఖించు; శోకించు ; కువి. రేఅలి. ఏడ్చు ; ఱీ ; కొలా. అర్-, అర్-త్- ; నా. అల్.

బహుశః < ˚యాట్-.

ఏడ్చుకొను అ.క్రి. రోదించు. నల. 4. పు. 231.

ఏడ్చుకొను చూ. ఏడ్చు.

ఏడ్తెఱ వి. 1. వడి, వేగం. నిర్వ.రా. 2.80 ; 2. అతిశయం. భార.విరా. 1.226, 295 ; 3. శక్తి, సామర్థ్యం, పరాక్రమం. భార.విరా. 4.15, 67, ఉద్యో. 4.54 ; 4. తేజస్సు, కాంతి. భార.విరా. 2.319, హరి.ఉ. 6.34 ; 5. ఏపు, చేవ, విజృంభణం. భార.భీష్మ. 1.254 ; 6. పూనిక, పట్టుదల. ఉ.రా. 2.164.

క. ఎత్తర, ఎత్తర, ఎత్తరు. ఎత్తు, పొడుగు, ఉన్నత స్థానం ; ఎట్. విజృంభణం ; ఏళ్. నిలబడుట ; ఏఱిగె. విజృంభించుట, వృద్ధి, అతిశయం, ఆధిక్యం, ఔన్నత్యం ; తు. ఎత్తర. ఎత్తు, పొడుగు ; పో.చూ. త. ఎఱు. విజృంభించు, అతిశయించు ; ఎఱుత్తెఱుమ్. గర్వం, దుడుకు, అహంకారం ; మ. ఎఱు. ఎత్తు.

ఏడ్దుము చూ. ఏడు[1].

ఏడ్నూఱు చూ. ఏడు[1].

ఏడ్పించు రూ.చూ. ఏడిపించు. స.క్రి. ఏడ్చునట్లు చేయు. శివరా. 2.109.

ఏడ్పు రూ.చూ. ఏడుపు. వి. ఏడుపు.

ఏడ్వురు చూ. ఏడు[1].

ఏణికర్ర పో.చూ. ఏరు[1]. రూ.చూ. ఏడికర్ర. వి. కాడిసీ పటతసీ కలిపే పొడుగుకర్ర.

ఏణ్ణర్ధము వి. ఒకటిన్నర సంవత్సరం.

ఏడున్ + అర్ధము > ఏడునర్ధము > ఏడుణర్ధము > ఏణ్ణ

ర్ధము (వర్ధనమీాకరణం).

**ఏందుగుడి** రూ.చూ. ఏఁడుడి. వి. చనిపోయిన తొలి వత్సరాంతంలో మూడు రోజులపాటు జరిపే కర్మకాండ.

**ఏఁట** రూ.చూ. ఏడి. వి. గొ్రె. బసవ. వు. 2.417, పండి.చ. 1.53 వు. (అను నాసిక్యం చింత్యం).

**ఏఁడాది** చూ. ఏఁడు[1].

**ఏఁడి** రూ. ఏఁడీ. చూ. ఏఁడు. సర్వ. ఎక్కడున్నాడు? సీతావి. 2.55.

ఏఁడు + ఇ, ప్రశ్నను గానీ సంబోధనను గాని తెలువుతుంది.

**ఏఁడికోల** వి. ఈష, నాగటికొయ్య, కాడిని పటకనూ కలిపే పొడుగుకర్ర. శుక. 2.408, ఆం.భా. 2.282.

క. ఏరు, అర్. నాగటికి కట్టిన ఎడ్ల జత; అర్కాలు. నాగలి కిందిభాగం; త. ఏర్-క్-కాల్. నాగటికొయ్య. వ్య. నాగటికొయ్య.

**ఏఁడీ** రూ.చూ. ఏఁడి. సర్వ. ఎక్కడున్నాడు? భార.ద్రోణ. 1.374.

ఏఁడు + ఈ[5].

**ఏఁడు[1]** వి. 1. సంవత్సరం. భార.ఆది. 3.19; 2. ఆయువు. రాఘవ. 1.28.

క. ఏడు, ఏఱు. కాలం, సంవత్సరం; కొడ. ఆండు. సంవత్సరం; అండు. సంవత్సరం; తు. ఒడు. సంవత్సరం; ఇయ్యొడు. ఈ సంవత్సరం; మూవొడు. కిందటి సంవత్సరం; త. యాంటు. సంవత్సరం; అంటు. సంవత్సరం, వయస్సు; యాట్టై, విశ. వయస్సుగల; అట్టై. వయస్సు; మ. అంటు, ఆట్టు. వయస్సు; గొ. యేండ్. ఈ సంవత్సరం; హేండ్. నిరుటికి ముందు సంవత్సరం; యెణ్ ఱు. ఈ ఏడు; ఈయెండ్, హయెండ్. నిరుటికి నిరుడు; కుఇ. రాండు. నిరుడు; రోండు. గత వత్సరంలో, నిరుటికి నిరుడు; వారొండి. వచ్చేయేడు, ఆ పైఏడు, పర్జి. ఇయడ్, ఇయాడ్. ఈఏడు; గద. ఇయాండ్. ఈఏడు. ఒల్లా. ఇయాండ్. ఈఏడు; కో. అర్. సంవత్సరం; ఒర్, అర్. ఒకఏడు; ఈరార్. రెండేండ్లు; అర్, ఒర్. ఒకఏడు; తొ. ఓర్. సంవత్సరం; నిర్ఓర్. ఒకఏడు. ఈరోర్. రెండేండ్లు; ఎర్. ఒర్. ఒకఏడు, కొండ. ఏండాద్-. ఇయోండ్. ఈఏడు; యెడ (యెడ). సంవత్సరం; కొలా. ఏడ్. సంవత్సరం; ఆఏడ్. నిరుటికి రెండేండ్ల పూర్వం; ఈఏడ్, ఇ.ఎ.డ్. ఈఏడు; ఈయెండ్. ఈఏడు; నా. ఇయెర్. ఈఏడు.

<మూ.ద.ద్రా. *యాంట్-.; ఏటికియేడాది క్రి.విశ. సంవత్సరమంతా. ఏటివిడి బ.వ. ఏటివిళ్లు. వి. సంవత్సరీకము (ఆనాటితో ఏటి సూతకం వదలిపోతుందంటారు). ఏటేట(న్) క్రి.విశ. ప్రతి సంవత్సరం. ఏఁడాది వి. సంవత్సరం. వ్య. సంవత్సరాది. భాగ. 10 పూ. 929, వేమన. 2.68; క్రి. విశ. సంవత్సరమంతా, సంవత్సరం మొదటినుంచీ. పద్మపు. 5.100.

సంవత్సరాది అనే అర్థం క్రమంగా సంవత్సరంగా మారిపోయింది.

**ఏఁడు[2]** రూ.చూ. ఎవ్వాఁడు. సర్వ. 1. ఎవరు? భార.ఉద్యో. 1.119, భీమ. 4.88; 2. ఎల్లవాడు. ఆము. 4.30.

**ఏఁడుడి** రూ. ఏడూడి, ఏందుగుడి. చూ. ఏఁడు[1]. పో.చూ. ఏటివిడి వి. చనిపోయిన తొలి సంవత్సరాంతంలో మూడు రోజులపాటు జరిపే కర్మకాండ.

**ఏత** వి. ఈడిగ, కల్లుగీయు జాతి, ఈంద్రజాతి.

క. ఏఱి. ఆరోహకుడు; అలర్ఏఱి. గండుతుమ్మెద (పూలపైకెక్కేది); ఏఱ. ఎక్కటం; త. పో.చూ. మరమ్-ఏఱి తాటిచెట్లెక్కి కల్లు గీసే 'చాడార్' జాతి; ఏఱు. ఎక్కు; ఏఱి. ఎక్కేవాడు; మ. ఏఱ్ఱుకార్. తాటిచెట్లెక్కేవాళ్లు.

**ఏతఁడు** రూ. ఎతఁడు. సర్వ. ఎవరు?

ఏత + డు; ఆత, ఈత, ఏత అనే ప్రాతిపదికలలో ఆతమ్, ఈతమ్ మొ. లో వస్తాయి.

**ఏతము** రూ. ఏతాము. వి. 1. నీళ్లతోడే యంత్రం, ఘటీయంత్రం; 2. జాకార్డు దాటీ కట్టుబడిలో అడ్డను తిప్పటానికి దొడ్డిచట్రంపైన అమర్చిన కొయ్యబద్ద.

క. ఏత (ఏఱుత పైకి లేవటం మొ. యాత్ర, ఎక్కటం. పైకి లేవటం, నీరుతోడే యంత్రం; త. ఏఱ్ఱమ్. ఏతాము. <ఏఱు. ఎక్కు.

ఏతము <*ఏత్తమ్ <*ఏఱ్ఱమ్ <ఏఱు. పైకెత్తు. పో.చూ. సం. యంత్రమ్. ఇది సంస్కృతభవమని సూ.ని. గ్రహించటం పొరపాటు.

ఏతమెత్తువిరోధము వి. పెద్ద విభేదం, ఏతామంత ఎత్తున ఉన్న విభేదం.

**ఏతమెత్తువిరోధము** చూ. ఏతము.

**ఏతరి** చూ. ఏతు[1].

ఏతరితనము వి. చెడ్డతనం, క్రూరత్వం. మను. 6.46.

**ఏతరితనము** చూ. ఏతరి.

**ఏతలము** వి. అడవిపంది.

**ఏతా** వి. అసత్యం. ఒంటి. శ. 104.

**ఏతాము** రూ.చూ. ఏతము. వి. నీళ్లతోడే యంత్రం. రం.రా. కిష్కింధ.

**ఏతిరెంచు** క్రి. వద్దన్న పని పదేపదే చేయు.

<వ్యతిరేకించు.

**ఏతు[1]** వి. 1. లోపం, దోషం. శృం.నై. 8.37: 2. గర్వోక్తి, బడాయిమాట. వరాహ. 4.102, పాండు. 1.73.

త. ఏతు. తప్పు, లోపం; ఏ. గర్వం, ఆత్మవంచన; మ. చేతమ్. నష్టం, వ్యర్థం.

ఏతరి వి. 1. ఉద్ధతుడు, గర్వి. భాగ. 10. ఉ. 1109; 2. నిరంకుశుడు, స్వేచ్ఛావిహారి. భాగ. 10. పూ. 182; 3. లోభి, దురాశకలవాడు. వేంక.పంచ. 1.214: 4. దుర్నయుడు, క్రూరుడు. మను. 6.46, ఆము. 2.40, చంపూరా. 5.75. త. ఏతర్. నిందార్హులు, దుర్బుద్ధులు.

**ఏతు[2]** రూ.చూ. ఏతుల. వి. సామాన్య స్త్రీ, చాపలస్త్రీ.

**ఏతుల** రూ. ఏతు[2]. వి. 1. చాపలలో ఒకజాతి పేరు. ఆము. 4.35; 2. సామాన్య స్త్రీ. విజ.వి. 1.131, ఆం.భా. 2.16.

పో.చూ. క. నేయ్. అల్లటం ; త. నేయ్. (బట్టలు మొ.) నేయటం ; మ. నెయ్క. నేయటం, (చాపలు) అల్లటం.

**ఏతులకొమ్మ** వి. చాపలల్లేజాతిస్త్రీ. **ఏతులవారు** వి. చాపలల్లేజాతివాడు.

**ఏతులకొమ్మ** చూ. ఏతుల.

**ఏతులవాడు** చూ. ఏతుల.

**ఏతెంచు** రూ.చూ. ఏఁగుదెంచు. అ.క్రి. 1. వచ్చు. భార.ఆది. 8.63, శాంతి. 3.357, శృం.నై. 4.82 ; 2. సంభవించు. విక్ర. 3.34 ; 3. జరుగు, ప్రవర్తిల్లు. హరి.ఉ. 6.239 ; 4. పోవు. విష్ణు పు. 7.330.

**ఏద**[1] రూ.చూ. ఆద[1]. వి. 1. మనస్సు ; 2. విచారం, వ్యాకులత.

**ఏద**[2] వి. అవధానం, ఏకాగ్రత. ఆం.భా. 1.138.

నే. యాద్. జ్ఞాపకం, శ్రద్ధ ; మరా. యాద్. జ్ఞాపకం ; హిం.పార.ఉ. యాద్. జ్ఞాపకం.

< ఉ. యాద్.

**ఏద**[3] వి. ఒకానొక చెట్టు.

**ఏదడి** చూ. ఎదు[4]. వి. ఒకజాతి ఎలుగుబంటి.

**ఏది** రూ. ఎది, ఎద్ది. సర్వ. 1. ప్రశ్నార్థకం. భార.ఆర. 1.5, దశా. 1.11 ; 2. ఎక్కడ ఉన్నది ? కళా. 1.92 ; 3. యత్ శబ్దార్థకం. 'ఏదో అది' అని అన్వయం.

పో.చూ. క. అవుదు, యావుదు. ఏమిటి ? ఏది ? ; అవ, యావ. ఏమిటి ? ఏది ? ; యావదు, యావుదు. ఏది ; పో.చూ. తు. ఓవు. ఏది ? ; ఎవ్వ. ఏది ; త. ఎతు, యాతు. ఏది ?, ఎతు. ఏది ? ఏమిటి ?, ఎందుకు, ఎక్కడనుంచి ?, ఎట్లు ? ; మ. ఏతు. ఏమిటి, ఏది ; కో. ఏద్. ఏమిటి ?, ఏవస్తువు ? ; ఏ. ఏది (ఏ.వ.). ఏఅమ్. ఏవి (బ.వ.) ; పో.చూ. గోం. బోర్ (పుం.ఏ.వ). బోర్, బోర్క్ (పుం.బ.వ.) ; బద్. (స్త్రీ.నపుం.ఏ.వ.) ; బన్ (స్త్రీ.నపుం.బ.వ.) ; కువి. ఏన. ఏమిటి ? పర్జి. ఏద్ (ఏర్). ఎవరు ? ; కొలా. ఏ-. ఎపతె ? ఏన్, ఏనద్. ఎవడు ? ; ఏర్. (పుం.) ఎవరు ? ; ఏవ్ (స్త్రీ) ఎవరు ? ; ఏ. ఎక్కడ ? ; నా. ఏన్. ఎవడు ? ; ఏర్. ఎవరు ? ; ఒల్లా. ఎయన్ద్. ఎవడు (ఏ.వ.) ; ఎయిర్. ఎవరు (బ.వ.) ; కురు. నీ (పుం.స్త్రీ. ఏ.వ., బ.వ.) ఎన్నె్ద్ (నపుం. ఏ.వ., బ.వ.) ; మాల్తో. నెరెహ్ (పుం. ఏ.వ.) ; నెరిథ్, నెథ్ (స్త్రీ. ఏ.వ.) ; నెరెర్ (పుం.స్త్రీ. బ.వ.) ; ఇందిర్థ్ (నపుం. ఏ.వ., బ.వ.) ; బ్రా. దేర్ (పుం.స్త్రీ. ఏ.వ. బ.వ.) : అన్త్ (నపుం. ఏ.వ. బ.వ.) ; అరా. ఎది ? ;

ఏదో అవ్య. కొంత. వి. ఏదోఒక వస్తువు. <ఎది + -ఓ[2].

**ఏదీ** సర్వ. 1. ప్రశ్నార్థకం. ఎక్కడ ఉన్నది ?-లేదని భావం. భార.ఉద్యో. 4, శృం.నై. 4.43 ; 2. కౌతుకాద్భుతాలను సూచించే ప్రశ్నార్థకం. కళా. 1.92 ; 3. వేగిరిపాటును సూచించే ప్రశ్నార్థకం. కాశ. 3.167.

<ఏది + -ఈ[7].

**ఏదు**[1] రూ.చూ. ఎయ్యు. స.క్రి. పొందు. కు.సం. 6.678, హరి.ఉ. 7.112.

**ఏదు**[2] స.క్రి. 1. రక్షించు. చెకు. 5.17, దశా. 1.133 ; 2. పోషించు, పెంచు. రామాభ్యు. 3.135 ; అ.క్రి. పెరుగు. ప్రబంధ. 186.

త. ఏంతు. పైకివచ్చు. ఆధారమగు, సమృద్ధిగానుండు ; మ. ఏంతుక. నిర్వహించు.

<మూ.ద్రా. *ఏద్- / *ఏ-.

**ఏదు**[3] అ.క్రి. 1. నశించు. చెడు, ఉడుగు. భార.ఆది. 6.202, ఉద్యో. 3.103 ; 2. లేనిదగు, పోయినదగు. నిర్వ.రా. 1.43, భార. శాంతి. 3.193.

క. అయ్దు. పోవు ; త. ఎయ్తు. విడుచు, త్యజించు ; ఆయ్. తగ్గించు, నశించు ; చాయ్. నశించు ; చాయ్వు. నాశనం ; పర్జి. చాయ్. విడుచు ; పో.చూ. కొలా. నా. గద. ఒల్లా. సాయ్.

మధ్య ద్రావిడ రూపాలు సకర్మకాలు. తెలుగు తమిళ భాషల్లో అకర్మకాలుగా కన్పిస్తున్నాయి. దీర్ఘ ఆకార ఏకారాల మార్పు తరువాత నున్న 'చ' వర్గాన్ని బట్టి వుంటుంది.

<మూ.ద్రా. *చాయ్-.

**ఏదుడు** వి. 1. విడుదల, విముక్తి ; 2. విడవటం, విసర్జించటం.

**ఏదు**[4] వి. శల్యం, ముళ్లపంది. భార. భీష్మ. 3.30, విక్ర. 1.169, ఆము. 5.34.

క. ఏదు. ముళ్లపంది ; కొడ. ఎప్పంది ; తు. ఎయిపంజి ; త. ఎయ్. ముళ్లపంది ; ఎయ్-ప్-పణ్ణి ; మ. ఎయ్యన్, ఎయ్యమ్పన్ని ; గో. సొఈ, సొఈతా, సొఈక్ ; కువి. సొజు ; పర్జి. చెదిర్ ; కొంద. సహి. కొలా. శిద్ ; నా. శెద్ ;

పో.చూ. సం. సేధ-.

<మూ.ద్రా. *చేత్-.

**ఏదుకన్ను** వి. ముళ్లపంది కన్ను. దుస్సాధ్యమైన వస్తువు. విక్ర. 1.169. **ఏదుపంది** వి. 1. ముళ్లపంది ; 2. బలిసినవాడు. **ఏదుముళ్లు** వి. బవ. ఏదుపంది ముళ్లు. **ఏదులు** వి. బవ. ఏదుపంది ముళ్లు. **ఏదువాసన** వి. 1. ఏదుపంది వాననవంటి దుర్వాసన ; 2. బలిసినవాని శరీరపు కంపు. **ఏదువేఁట** వి. ఒక రకమైన వేట.

**ఏదుకన్ను** చూ. ఏదు[4].

**ఏదుకట్టులు** వి. బవ. ఒక రకం ధాన్యం. వ్య. ఎదిగిన కాడలు. హంస. 4.128.

**ఏదుడు** చూ. ఏదు[3].

**ఏదుపంది** చూ. ఏదు[4].

**ఏదుముళ్లు** చూ. ఏదు[4].

**ఏదులు** చూ. ఏదు[4].

**ఏదువాసన** చూ. ఏదు[4].

**ఏదువేఁట** చూ. ఏదు[4].

**ఏదో** చూ. ఏది.

**-ఏన్** రూ.చూ. ఏని. అవ్య. పక్షాంతరంలో. భార. ఉద్యోగ. 3.97.

**ఏనాఁడు** రూ. ఎన్నఁడు. క్రి.విశే. ఎల్లప్పుడు, సర్వదా.

**ఏవాదము** పో.చూ. ఏనామ్. వి. సముద్ర తీరం.

**ఏనాది** రూ.చూ. అనాది. వి. 1. ఒకప్పుడు ఒక ఆటవిక జాతిపేరు. ఇప్పుడు కూలినాలి చేసుకు జీవించే ఆ తెగ వారికి వర్తిస్తుంది; 2. దారి దొంగ (వీరిలో కొందరు దొంగతనం వల్ల జీవించటాన్ని బట్టి).

సం. అనాది-. ఆది (మొదలు) లేనివారు, కాలాన్ని బట్టి ఇప్పటి వారని చెప్ప వీలుకాని వారు, చాలా ప్రాచీనులు.

**ఏనాపిసుక** చూ. ఏనామ్.

**ఏనామ్** వి. సముద్రం.

సం. యాన. నావ;

త. యాణమ్. <సం. యాన-. నావ, పడవ, తెప్ప మొ.

<సం. యాన-. చూ. యానాం. తూర్పు గోదావరి జిల్లాలో ఒక పల్లెటి పడవల రేవు.

**ఏనాపిసుక** వి. సముద్రపు ఇసుక.

**ఏనాళ్లు** వి. బ.వ. 1. ఐదు రోజులు; 2. వివాహానంతరం వియ్యంకు లొకరి కొకరు పంపే సారె.

<ఏ(న్)+నాళ్లు.

**ఏని** రూ.- ఏ[7], ఏన్, నేని. అవ్య. 1. వాక్యాలంకారం. భార. ఆది. 1.76, సభా. 1.9; 2. అపకర్షం. భార. ఆది. 4.137; 3. నిర్ధారణలేమి. భార. ఆది. 8.305; 4. పక్షాంతరం. భార. సభా. 2.237; 5. నిన్పందేహత, నిశ్చయము. భార. విరా. 2.108; 6. వికల్పం. భార. శాంతి. 2.228, అను. 4.136.

పో.చూ. క. అరె, అడె. అయితే, ఎప్పుడు మొ.: త. ఆయినుమ్. అయినప్పటికీ, ఒంటె; ఏనుమ్. 'అయినా' అనే అర్థమిచ్చే అంత్య ప్రత్యయం: ఆయిన్. అయితే, కాని; పో.చూ. మ. అగిల్. అయితే.

**ఏనిక** రూ.చూ. ఏనుఁగు. వి. ఏనుగు. భార. శల్య. 1.26.

**ఏనికదిండి** వి. ఏనుగుతిండిగా కలది, సింహం. <ఏనిక+తిండి. **ఏనికదోమ** వి. ఏనుగుతొండం వంటి తొండంగల దోమ, తొండపుదోమ, ఘోణిక.

**ఏనికదిండి** చూ. ఏనిక.

**ఏనికదోమ** చూ. ఏనిక.

**ఏనిగె** రూ.చూ. ఏనుఁగు.

**ఏను**[1] చూ. నేను. సర్వ. ఏవ. నేను. భార. ఆది. 4.106, ఉద్యో. 3.96, పారి. 1.47.

క. ఆమ్, ఆన్, నామ్, నాన్, యాను, నాను. నేను; తు. ఏను, యాను. నేను; త. యాన్. నేను; నాన్. నేను; -ఏన్. ఉత్తమ పురుషైక వచన క్రియా విభక్తి; మ. ఞాన్. నేను.

ఞాన్, యాన్, ఆన్, నాన్, నేన్. వివిధ భాషల్లో ఉన్న రూపాలు ఇవి. ఞాన్, యాన్ ప్రాచీన రూపాలై వుండవచ్చు.

<మూ.ద్రా. *యాన్.

**ఏను**[2] రూ.చూ. ఐదు. వి. ఐదు. భార. ఆది. 1.55, అను. 1.80.

**ఏ(న్)నూఱు** వి. ఐదు వందలు. శృం.నై. 6.72.

క. అయ్‌నూఱు. అయిదు వందలు; తు. ఐనూరు; త. ఐ-న్-నూఱు. ఐదు వందలు; ఐఞ్ఞూఱు, ఐ-నూఱు; మ. అఞ్ఞూఱు. ఐదు వందలు.

**ఏను**[3] వి. ఎదురు మూల.

**ఏను**[4] వి. ఊచ, కాడ, కుపి, కొండి; నాగలి మొ. వాని అలుగును కామతో కలిపే ఇనపకొండి.

**ఏ(న్)నూఱు** చూ. ఏను[2].

**ఏనుగ** రూ.చూ. ఏనుఁగు. వి. ఏనుగు.

ఏనుగకాలు, ఏనుగ పల్లేరువంటి సమస్తపదాల అనుచిత విభాగంవల్ల ఏర్పడి వుండవచ్చు.

**ఏనుగకాలివాడు** వి. బోదకాలివాడు. **ఏనుగజెలగ** రూ. చూ. ఏనుఁగు జలగ. వి. పెద్ద జెలగ. **ఏనుగడుగులు** వి. ఒక రకం చిత్ర వర్ణ వస్త్రం. **ఏనుగపల్లేరు** రూ.చూ. ఏనుఁగు పల్లేరు. వి. పెద్ద పల్లేరు (**Pedalium murex**).

**ఏనుగకాలివాడు** చూ. ఏనుగ.

**ఏనుగజెలగ** చూ. ఏనుగ.

**ఏనుగడుగులు** చూ. ఏనుగ.

**ఏనుగపల్లేరు** చూ. ఏనుగ.

**ఏనుగమాంపం** వి. ఒక రకం కలుప మొక్క.

**ఏనుఁగడుగుగారెలు** చూ. ఏనుఁగు.

**ఏనుఁగడుగులు** చూ. ఏనుఁగు.

**ఏనుఁగంబారి** చూ. ఏనుఁగు.

**ఏనుఁగు** రూ. ఏనిక, ఏనిగె, ఏనుగ, ఏన్గు. వి. ఏనుగు. భార. భీష్మ. 2.297, ఆం.భా. 2.194. విణ. పెద్దది.

క. కొడ. ఆనె. ఏనుగు; తు. అనె. ఏనుగు: త. యానై, ఆనై. ఏనుగు: మ. ఆన; తొద. అన్; కో. అన్; గో. ఏని, ఏనల్; యేని, యేనితా, యేనెంగ్. ఏనుగు; కొండ. ఏని. ఏనుగు; పర్జి. ఏను, బ.వ. ఏనుల్; ఆను, బ.వ. ఆనుల్; కొలా. ఎనాగి, ఏన్గి. ఏనుగు: గదబ. ఒల్లా. ఏనిగ్, బ.వ. ఏన్గి.

<మూ.ద్రా. *యాన్-.

**ఏనుఁగడుగుగారెలు** వి. బ.వ. పెద్ద గారెలు. చంద్రా. 6.98. ఏనుగు పాదంవలె పెద్ద గారెలని నిరుక్తి. <ఏనుఁగు+అడుగు[1]+గారెలు. **ఏనుఁగడుగులు** వి. బ.వ. ఒక రకం చిత్ర వర్ణ వస్త్రం (బట్ట చుట్టూ ఏనుగడుగుల లాగా పెద్ద పెద్ద అద్దకపు నమూనాలు ఉండటంవల్ల ఆ పేరు వచ్చి ఉండవచ్చు). **ఏనుఁగంబారి** వి. 1. లక్ష్యం లేనివాడు, జాగ్రత్త లేనివాడు; 2. ఎవ్వరినీ లక్ష్యపెట్టని, అంబారి వేసిన రాచ ఏనుగు. **ఏనుఁగుకలబంద** వి. పెద్ద కలబంద (ఇది కలబందలో పెద్ద రకం అనుకోటం పొరపాటు; దీన్నే కిత్తలి, కిత్తనార అంటారు). **ఏనుఁగుకాలు** వి. బూరగాలు, బోదకాలు (ఏనుగు కాలంత లావైన కాలు). క. ఆనెకాలు. బోదకాలు; తు. అనెకాయ; త. యానై-క్-కాల్; ఆనై-క్-కాల్; **ఏనుఁగుకొమ్ముమొదలు** వి. గజదంత మూలం, కరీరిక. **ఏనుఁగుకొమ్ములు** వి. బ.వ. ఒక రకం ధాన్యం. హంస. 4.128 (ఏనుగు దంతాలవలె తెల్లటివని భావం). త. యానై-క్-కొంపన్. ఒక రకం

వడ్లు ; యాన్రై-క్-కొంపు. వరి పంటకు తగిలే ఒక తెగులు ; యానై-క్-కొంపన్. పూర్వాభాద్రలో నాటు వేసే ఒక రకం ఆరు నెలల వరి పంట (బియ్యం సన్నగా తెల్లగా ఉంటాయి). ఏనుఁగుకోల వి. ఒక రకం అస్త్రం. అచ్చ.రా. 6.521. ఏనుఁగుగజ్జి వి. 1. పెద్దగజ్జి, పెద్దశిల. ఏనుఁగుగొంగ వి. ఏనుగుకు శత్రువు, సింహం. ఏనుఁగుచెవి చేమ వి. గజకర్ణి (ఏనుగు చెవులవలె పెద్ద పెద్ద ఆకులు గలది (Colocasia antiquorum)). ఏనుఁగుచెవి యూఁపు వి. ఆస్ఫాలనం, ఏనుగు చెవులు ఒక దానితో నొకటి కొట్టుకోటం. ఏనుఁగుజలగ రూ. ఏనుగ జెలగ. వి. పెద్ద జలగ. ఏనుఁగుతుమ్మ రూ. ఏనుఁగు తుమ్మి. వి. మ్సూర్జకం, పెద్దతుమ్మ (Ehlomis indica). ఏనుఁగుతుమ్మి రూ.చూ. ఏనుఁగు తుమ్మ. ఏనుఁగుతోలుదాల్పు వి. ఏనుగు తోలు ధరించువాడు, శివుడు. మృ. వి. 1.22. ఏనుఁగుదాయ వి. ఏనుగుకు శత్రువు, సింహం. కకుత్స. 4.57. ఏనుఁగు దాహము వి. ఏనుగంత దప్పిక, పేరాస. ఏనుఁగువడక వి. గంభీరగమనం, మందగమనం. ఏనుఁగువల్లు వి. ఏనుగు దంతం. ఏనుఁగువల్లేరు రూ. ఏనుగ పల్లేరు. వి. పెద్ద పల్లేరు. పో.చూ. యానై-నెరింజ్జి, పెరునెరుంచి. బలిష్ఠమైన కాండంగల ఒకానొక ఓషధి. ఏనుఁగుపాఁడి వి. అమితమైన ఈవి. వ్య. పెద్దపాఁడి. విజయ. వి.పి. 54. ఏనుఁగుపిప్పలి వి. గజపిప్పలి (Scindapus officinalis). ఏనుఁగుబీఱ వి. మహాకోశాతకి, పెద్దబీర. ఏనుఁగుమీఁదిసున్నము వి. (ఏనుగుపై నున్నవాని వద్దనుంచి ఆకులకు రాచుకోటానికై సున్నం తేవటంవలె) దుర్లభం. కవి.రా. 3.48. ఏనుఁగు మొగమయ్య వి. ఏనుఁగు మొగంగలవాడు, వినాయకుడు. శుక. 3.462. క. ఆనెమొగ. వి. గణపతి ; త. యానై ముకవన్. వినాయకుడు ; ఆనైముకత్తోన్. ఏనుఁగు మొగముసామి రూ. ఏనుఁగు మోముసామి. వి. ఏనుగు మొగంగల దేవర, వినాయకుడు. ఆం.భా. 1.43. ఏనుఁగు మొగసాల వి. యామకుంజరాలుండే ముఖశాల, మొదటి మొగసాల. శృం.నై. 3.85. ఏనుఁగుమోముసామి రూ.చూ. ఏనుఁగు మొగము సామి. ఏనుఁగురాకాసిగొంగ వి. గజాసుర విరోధి, శివుఁడు. ఏనుఁగులగొంగ వి. ఏనుగులకు శత్రువు, సింహం. ఆం. సం. 2.1. ఏనుఁగులగొంగసూడు వి. (ఎనిమిది కాళ్లు గలిగి సింహం కంటె బలవత్తరమైనదిగా చెప్పబడేది) శరభం, ఏనుగులకు శత్రువైన సింహానికి శత్రువు. ఏనుఁగులతిండి వి. (రెండు తలలూ మహాకాయమూ కలిగి, ఏనుగులను తిని జీవిస్తుందని చెప్పబడేది) గండ భేరుండ పక్షి. (ఏనుగులను తిండిగా కలది.) ఏనుఁగులసూడు వి. ఏనుగుల శత్రువు, సింహం. నీలా. 1.45. ఏనుఁగులు వి. బ.వ. గజబలం. ఏనుఁగుసూడుమెకము వి. ఏనుగులకు శత్రువైన జంతువు, సింహం. వేంక. ఆం. 3.94. ఏనుఁగు సొరము రూ.చూ. ఏనుఁగు స్వరము. వి. సప్తస్వరాలలో చివరిది, నిషాదము. ఏనుఁగుస్వరము రూ. ఏనుఁగుసొరము. వి. సప్తస్వరాలలో ఒకటి, నిషాదం. (నిషాదం బృంహతే గజః) గజ బృంహితంవలె గంభీరమైనది.

ఏనుఁగుకలబంద చూ. ఏనుఁగు.

ఏనుఁగుకాలు చూ. ఏనుఁగు.

ఏనుఁగుకొమ్ముమొదలు చూ. ఏనుఁగు.

ఏనుఁగుకొమ్ములు చూ. ఏనుఁగు.

ఏనుఁగుకోల చూ. ఏనుఁగు.

ఏనుఁగుగజ్జి చూ. ఏనుఁగు.

ఏనుఁగుగొంగ చూ. ఏనుఁగు.

ఏనుఁగుచెవిచేమ చూ. ఏనుఁగు.

ఏనుఁగుచెవియూపు చూ. ఏనుఁగు.

ఏనుఁగుజలగ చూ. ఏనుఁగు.

ఏనుఁగుతుమ్మ చూ. ఏనుఁగు.

ఏనుఁగుతుమ్మి చూ. ఏనుఁగు.

ఏనుఁగుతోలుదాల్పు చూ. ఏనుఁగు.

ఏనుఁగుదాయ చూ. ఏనుఁగు.

ఏనుఁగుదాహము చూ. ఏనుఁగు.

ఏనుఁగువడక చూ. ఏనుఁగు.

ఏనుఁగువల్లు చూ. ఏనుఁగు.

ఏనుఁగువల్లేరు చూ. ఏనుఁగు.

ఏనుఁగుపాఁడి చూ. ఏనుఁగు.

ఏనుఁగుపిప్పలి చూ. ఏనుఁగు.

ఏనుఁగుబీఱ చూ. ఏనుఁగు.

ఏనుఁగుమీఁదిసున్నము చూ. ఏనుఁగు.

ఏనుఁగుమొగమయ్య చూ. ఏనుఁగు.

ఏనుఁగుమొగముసామి చూ. ఏనుఁగు.

ఏనుఁగుమొగసాల చూ. ఏనుఁగు.

ఏనుఁగుమోముసామి చూ. ఏనుఁగు.

ఏనుఁగురాకాసిగొంగ చూ. ఏనుఁగు.

ఏనుఁగులగొంగ చూ. ఏనుఁగు.

ఏనుఁగులగొంగసూడు చూ. ఏనుఁగులగొంగ.

ఏనుఁగులతిండి చూ. ఏనుఁగు.

ఏనుఁగులసూడు చూ. ఏనుఁగు.

ఏనుఁగులు చూ. ఏనుఁగు.

ఏనుఁగుసూడుమెకము చూ. ఏనుఁగు.

ఏనుఁగుసొరము చూ. ఏనుఁగు.

ఏనుఁగుస్వరము చూ. ఏనుఁగు.

ఏనుము రూ.చూ. ఏఁడుము. వి. ఐదు తూముల ప్రమాణం.

ఏన్గు రూ.చూ. ఏనుఁగు. వి. ఏనుఁగు. రం.రా. 1.40 పు. 27 పం, ఆం.భా. 2.194.

ఏనె వి. 1. చిన్న కొండ, తిప్ప ; 2. రాళ్ళగుట్ట.

ఏనొంపు రూ. ఏరొంపు, ఏలొంపు. వి. ఏటవాలు, ఎక్కువ వాలు.

ఏన్నఁడు రూ. ఏనాఁడు. క్రి. విశ. 1. ఏ దినం ? ఏ కాలం ? భార.ద్రోణ. 2.51 ; 2. ఎల్లప్పుడు. హర. 2.129, వరాహ. 7.87, మను. 3,24.

త. ఎ-న్, నాళ్. ఏడ్రోజు ? ఎప్పుడు ? ఏ రోజు ?; ఎ-న్-నాళుమ్. ఎల్లప్పుడు.

ఏన్నాళ్లు వి. బ.వ. ఏడు రోజులు. భీమ. 4.12.

<ఏణ్ణాళ్ళు<ఏడ్డాళ్ళు<ఏడ్నాళ్ళు<ఏడు+నాళ్లు.

ఏన్నూఱు రూ.చూ. ఏడునూఱు. వి. ఏడు వందలు. బసవ. పు.

7.298 ప.

<ఏజ్ఞాబు < ఏడ్ఙాబు < ఏడ్నూబు.

ఏందుం రూ.చూ. ఏఁడుము. వి. ధాన్యం కొలత.

ఏఁదర చూ. ఏఁడు[2]. వి. సమిష్టి కుటుంబానికి చెందని సొంత ఆస్తి. స్వార్జితమైన ధనం ; విశ. స్వశక్తిచే సంపాదించినది.

పో.చూ. త. సందు. చేతితో తీసికొనిపోవు, స్తంభం వలె ఆధారమగు.

ఏఁదరకమతము వి. సొంత కమతం.

ఏఁదరకమతము చూ. ఏఁదర.

ఏఁదుము రూ. ఎందుము, ఏనుము, ఏందుం. వి. 1. అయిదు తూములు. ఆం.భా. 2.271 ; 2. రెండెకరాల నేల.

బహుశః ఐదు తూముల ధాన్యం పండేటంత నేల.

<ఏను + తూము.

ఏపడఁచు చూ. ఏపు.

ఏపరి చూ. ఏపు.

ఏపరించు చూ. ఏపు.

ఏపలు చూ. ఏపు.

ఏపారు చూ. ఏపు.

ఏపి[1] రూ.చూ. వేఁపి. వి. కుక్క, వేటకుక్క. వేంక.పంచ. 1.121.

ఏపి[2] రూ.చూ. ఏపె[2]. వి. సాలవృక్షం, నల్లమద్ది (Hardwiekia binata).

ఏపిరి వి. ఎల్ల, హద్దు. ఆము. 3.16.

పో.చూ. సం. మిరా. ఎల్ల, హద్దు. మిర. హద్దు.

ఇది అనుచిత విభాగంవల్ల ఏర్పడిన శబ్దం కావచ్చు. 'ఇక్షుమతి వేదికయేపిరిగాఁగ' అన్నచోట 'వేదిక + య్ + ఏ + పిరి గాఁగ' అని విభజించాలి. వేదికయే హద్దుగా అని అర్థం.

పో.చూ. త. పిరి. వేరుచేయు, విభజించు. 'పిరి' అనేది యతిప్రాస స్థానాల్లో లేదు కాబట్టి దాని బదులు 'మిర' గ్రహించవచ్చు.

ఏపు చూ. ఏచు. వి. 1. విజృంభణం. భార.ఆది. 7.189, 8.10, శాంతి. 2.487 ; 2. ఔద్ధత్యం, గర్వం. భార. ఉద్యో. 4.24, ఆం.భా. 1.38 ; 3. ఉత్సాహం. భార. ఉద్యో. 4.361, భీష్మ. 2.28 ; 4. ఆధిక్యం, గొప్పదనం. భార.శాంతి. 3.310 ; 5. అభ్యుదయం, అభివృద్ధి. నరస. 5.106 ; 6. విధం. మటికా. 2.145, హంస. 2.46 ; 7. విలాసం. హంస. 1.100, ఆం.భా. 1.189. విశ. 1. ప్రియమైనది. హర. 2.5 ; 2. అధికం, గొప్పది. విష్ణు పు. 5.112.

త. ఏ. ఆధిక్యం, గొప్పదనం, గర్వం, ఆత్మవంచన, ఔద్ధత్యం, పైచూపు ; పో.చూ. మ. ఏఴ్జుమ్. విజృంభణం, ఆధిక్యం ; పో.చూ. గోం. సిఉ-సిఉ. గొప్పదనం.

ఏపడఁచు స.క్రి. గర్వాన్నిగాని, పెంపునుగాని అణచి వేయు, నశింపజేయు. భార.కర్ణ. 2.307. <ఏపు + అడఁచు. ఏపరి వి. ఉడుము. వ్యు. గోడలు మొ. వానిని ఎక్కడానికి శక్తిసామర్థ్యాలున్న జంతువు. ఏపరించు స.క్రి. 1. బాధించు. ద్వి.హరిశ్చ. ఉ. 1180 పం ; 2. దుఃఖపెట్టు. ద్వి.హరిశ్చ. ఉ. 1887. పం. ఏపలు అ.క్రి. పెంపు నశించు. అప్ప. 3.191. ఏపారు అ.క్రి. 1. అతిశయించు, అధికమగు. భార.ఆది. 1.69, శాంతి. 3.279 ; 2. విజృంభించు. భార. భీష్మ. 2.378 ; 3. అధికంగా కలుగు. భాగ. 10. ఉ. 662, వాశి. 2.14 ; 4. ఒప్పు, ప్రకాశించు. శృం.నై. 5.149. త. ఏ. అతిశయం, ఆధిక్యం. ఏపుటడవి వి. దట్టమైన అడవి. భార.అర. 1.294. ఏపుమాపు స.క్రి. 1. చంపు. విక్ర. 4.102 ; 2. ఓడించు. సారంగ.చ. 2.41. ఏపుమిగులు అ.క్రి. 1. ఉత్సహించు, భార.భీష్మ. 2.28 ; 2. విలసిల్లు, నరిపడు. భాగ. 1.451. ఏపురేఁగు అ.క్రి. 1. విజృంభించు, చెలరేగు. భాగ. 3.687 ; 2. హద్దుమీరు, విచ్చలవిడిగా తిరుగు. వేంక. పంచ. 4.240, హంస. 2.200.

ఏపుటడవి చూ. ఏపు.

ఏపుమాపు చూ. ఏపు.

ఏపుమిగులు చూ. ఏపు.

ఏపురేఁగు చూ. ఏపు.

ఏపె[1] సర్వ. ఎవతె.

ఏపె[2] రూ. ఏపి[2]. వి. నల్లమద్ది. సిం.ద్వా. 11.20, రాజవా. 3.40.

క. ఏపి. నల్లమద్ది.

ఏప్రియలు వి. ఆంగ్ల సంవత్సరంలో నాలుగోనెల. నానారాజ సందర్శనము. ఉ. 759.

ఇం. *April.* ఆంగ్ల సంవత్సరంలో నాల్గోనెల. దీనికి 30 రోజులు.

<ఇం. April.

ఏప్రొద్దు క్రి. విశ. ఎల్లప్పుడు.

ఏబదలం రూ.చూ. ఏఁబలము. వి. 30 తులాలు. ఏబలం, పదలం, అనే పదాల వాడుకలో వచ్చిన తబ్బిబ్బువల్ల ఏర్పడిన రూపం.

ఏబరాసి రూ.చూ. ఏబ్రాసి. చూ. ఏబ్రము. వి. అంబేద, నీచుడు, రోత పుట్టించేవాడు.

ఏబిర సర్వ. ఎవతె.

ఆబిర, ఏబిర మొదలైన సమస్త పదాల్లో బిడ్డ శబ్దం స్త్రీ మాత్ర పరం.

<ఏ + బిర(<బిడ్డ).

ఏబ్రము చూ. ఎబ్బెటికము. వి. రోత, అసహ్యం. నిరంకు. 2.25.

ఏబ్రాసి రూ. ఎబ్బెరాసి, ఎబ్రాసి, ఏబరాసి, ఏభ్యరాసి, ఎబ్రాసి. వి. నీచుడు, రోత పుట్టించేవాడు.

క. ఎబ్బాసి, ఏబ్బాసి. అల్పుడు, బుద్ధిహీనుడు ; త. ఏప్పిరాచి, ఏప్పియన్. అల్పుడు, బుద్ధిహీనుడు.

ఏభ్యం రూ.చూ. ఎబ్బె. విశ. రోత, అసహ్యం.

నొక్కి చెప్పటం కోసంగాని, సంస్కృతీకరించటం కోసం గాని మహాప్రాణం ప్రవేశించి వుండవచ్చు.

ఏభ్యపడు అ.క్రి. రోయు, అసహ్యపడు. ఏభ్యరాసి రూ.చూ. ఏబ్రాసి. వి. నీచుడు. వ్యు. రోత, కుప్ప. మల్హ. 3.134.

**ఏభ్యవడు** చూ. ఏభ్యం.
**ఏభ్యరాపి** చూ. ఏభ్యం.
**ఏ|భాపి** రూ.చూ. ఏ|భాసి.
**ఏమగు** చూ. ఏమి.
**ఏమట** వి. నిలకడ, నిబ్బరం.

**ఏమటసేయు** అ.|క్రి. నిలిచిపోవు. ఆగు. మల్హ. 3.134. <ఏమట + చేయు.

**ఏమటపేయు** చూ. ఏమట.
**ఏమని** చూ. ఏమి.
**ఏమనుచు(న్)** చూ. ఏమి.
**ఏమయినా** చూ. ఏమి.
**ఏమఱ** చూ. ఏమఱు. వి. మఱుపు, అ|శ్రద్ధ, పొరపాటు, పరాకు. భాగ. 8.463.
**ఏమఱక** చూ. ఏమఱు.

**ఏమఱకుండు** అ.|క్రి. జా|గ్రత్తగా ఉండు. భార. ఆది. 6.152.

**ఏమఱకుండు** చూ. ఏమఱక.
**ఏమఱిక** చూ. ఏమఱు.
**ఏమఱించు** చూ. ఏమఱు.
**ఏమఱిపడు** చూ. ఏమఱు.
**ఏమఱిపాట(న్)** చూ. ఏమఱు.
**ఏమఱిపాటు** చూ. ఏమఱు.
**ఏమఱిలు** చూ. ఏమఱు.
**ఏమఱిల్లు** చూ. ఏమఱు.
**ఏమఱు** రూ. ఏమాఱు. అ.|క్రి. |ప్రమాదపడు, అజా|గ్రత్తగా నుండు. భార.ఆది. 6.194. విరా. 1.110; స.|క్రి. **1.** ఉపేక్షించు, అలక్ష్యం చేయు. భార.ఆది. 8.314, ఆ|శ్రమ. 1.66, కాశీ. 3.71 : **2.** మరచు. పరమ.వి. 2.34.

కొద. ఏమొాట్. మోసగించు ; త. ఏమాఱు. మోస పోవు, మసలుకొను, ఏయమ్. <సం. క్షేమ. సంతోషం, సంతోషపెట్టటం మొ ; మ. ఏమాళి. బిచ్చగాడు, నీచుడు : కోట. ఏ.మా.ర్, (ఏ.మా.ర్స్). హఠాద్భయ సం|భ్రమాల వల్లగానీ, మరణ సమయంలోగానీ, ఎగశ్వాస తీయు : ఏ.మ.ల్. మోసపోవు ; ఏ.మాత్. మోసగించు ; ఏమతి. యుక్తి, చమత్కారం.

ఏమ(మ్) + అఱు. శుభ సంతోషాలకు దూరం చేయబడు.

బహుశః *ఏమ్-రక్షణ + మాఱు-, మర్చిపోవు. పో.చూ. ఏయమ్. రక్షణ ; ఏమ్-అఱ్ఱు-. రక్షించు ; చెమమ్-రక్షణ.

బహుశః <|ప్రా. చేమ-, <సం. క్షేమ-.

**ఏమఱక** |క్రి.విశ. జా|గ్రత్తగా. భార.ఆది. 2.158, 5.146. **ఏమఱిక** వి. పరాకు, |ప్రమాదం. ఆం.భా. 1.138. **ఏమఱించు** స.|క్రి. ఏమరజేయు, మైమరచునట్లు చేయు. దశకు. 6.17, జై.భా. 6.168. **ఏమఱిపడు** అ.|క్రి. పరాకు పడు. **ఏమఱిపాట(న్)** |క్రి.విశ. **1.** అకస్మాత్తుగా. హరిశ్చ. 3.158 ; **2.** అనాలోచితంగా. భోజ. 5.106 ; **3.** యాదృచ్ఛికంగా. ద్వి.హరిశ్చ. ఉ. 128 పు. 155. 1. **ఏమఱిపాటు** రూ.చూ. ఏమఱుపాటు. |క్రి.విశ. అకస్మాత్తుగా. పరమ. 4.61, ఉ.హరిశ్చ. 1. వి. పరాకు, |ప్రమాదం. ఆం.భా. 1.138. **ఏమఱిలు** రూ.చూ. ఏమఱిల్లు. అ.|క్రి. |ప్రమాదపడు, పొరపడు. కళా. 1.8 ; స.|క్రి. మరచు, మోసపోవు. కామలిం. 101. **ఏమఱిల్లు** రూ. ఏమఱిలు. అ.|క్రి. పొరపడు. స.|క్రి. మరచు, మోసపోవు. **ఏమఱుచు** పో.చూ. ఏమరించు. రూ. ఏమార్చు. స.|క్రి. ఏమరజేయు. **ఏమఱుపాటు** రూ. ఏమఱిపాటు. |క్రి.విశ. **1.** అకస్మాత్తుగా. పరమ. 4.2 ; **2.** వంచనలో. భోజ. 5.106. **ఏమఱుపు** వి. **1.** ఒకానొక కావ్యదోషం. |ప్రబంధ. 16 ; **2.** |ప్రమాదం, పొరపాటు.

**ఏమఱుచు** చూ. ఏమఱుచు.
**ఏమఱుపాటు** చూ. ఏమఱు.
**ఏమఱుపు** చూ. ఏమఱు.
**ఏమాఱు** రూ.చూ. ఏమఱు. స.|క్రి. ఉపేక్షించు, అలక్ష్యం చేయు. బిల్హ. 1.63.
**ఏమార్చు** రూ.చూ. ఏమఱుచు. స.|క్రి. వంచించు, |భమింప జేయు.
**ఏమి** చూ. ఏ[6]. రూ. ఏటి, ఏమిటి, ఏమీ. విశ. **1.** ఎట్టిది, ఎంతటిది. భార.ఆది. 3.208 ; **2.** ఏ. భార.విరా. **1.216**, భాగ. 10. ఉ. 117 ; **3.** ఏది. భార.శాంతి. **1.548** ; **4.** ఎంత. భార.శాంతి. 5.193. అవ్య. **1. పలితంపట్ల** అనాదరం తెలిపే |ప్రశ్నార్థకం. భార.శాంతి. 5.404 ; **2.** అయితే ఏమి. రం.రా.బాల. 50 పు. 14. పం ; **3. జుగు** ప్సతోగూడిన వ్యతిరేకతను తెలిపే |ప్రశ్నార్థకం. దశా. 2.313 ; **4.** 'లేదు' అనే అర్థంలో |ప్రశ్నార్థకం. ఆము. 6.31.

క. ఏన్, ఏను, ఏమ్, ఏ. ఏమిటి?; తు. దాన, జాన, ఎమిటి ? ఏది ?; త. ఎన్న. (వి. ఏవ) ఎన్నతు, ఎన్నై. మ. ఎంతు. ఏమిటి ? ఎంతె. ఏమిటి ? ఎందుకు ?; కొ. ఏద్. ఏమిటి ? ఏ వస్తువు ? ; తొ. ఏఒ, ఏది ? ఏఒఅమ్. ఏవి ?; కువి. ఏన. ఏమిటి? ; |బా. అరా. ఏది? ; అరాఫి్క. ఏవి ?

<మూ.|ద్రా. *ఏన్.

**ఏమగు** అ.|క్రి. **1.** ఎట్టి దుస్థితికి వచ్చు. ఆము. 2.29 ; **2.** ఎట్టి దుష్టుడగు. మను. 6.50 ; **3.** ఎట్టి బంధుత్వం కలిగిఉండు. **ఏమని** |క్రివిశ. ఎందుకు. ఏ కారణాన. భార. ఉద్యో. 4.287. **ఏమనుచు(న్)** |క్రి.విశ. ఎందుకు ? ఏ కారణాన ? జాహ్నవీ. 4.96. **ఏమయినా** అవ్య. ఏదో ఒకటి. **ఏమిగా(న్)** |క్రి.విశ. ఎట్లు ? ఏ విధంగా ? హరి.పూ. 8.70. <ఏమి + కా(న్). **ఏమియును** రూ. ఏమీ. |క్రి.విశ. ఎంత మా|త్రమైనా, కొంచమైనా. భార.శాంతి. 5.375. క. ఏనా నుమ్. ఏనుమ్. ఏమైనా. ఏదోఒకటి ఏనూ. ఏమైనా. దీనికి వ్యతిరేకార్థక |క్రియకు ముందే |ప్రయోగం. "ఏమియు తెలియదు" వలె. **ఏమియొ** రూ. ఏమియో. |క్రి.విశ. ఎందుచేతనో. ఊహను తెలుపుతుంది. భార.ఆర. 2.178. <ఏమి + -ఒ[2]. **ఏమియొక్కొ** |క్రి.విశ. ఏమిటోకదా! సందేహ సూచకం. భార.సభా. 1·218. **ఏమియో** రూ.చూ. ఏమియొ. |క్రి.విశ. ఎందుచేతనో, ఊహను తెలుపుతుంది.

భార.ఆది. 4.70. ఏమిర అవ్య. ఓరి. (బాగా పరిచితుణ్ణిగానీ తనకంటే తక్కువవాణ్ణిగానీ చేసే సంబోధన). భార.ద్రోణ. 4.288. ఏమేమి అవ్య. క్రోధామ్ఫురాలను సూచిస్తుంది. దశా. 1.313. <ఏమి + ఏమి. ఏమేమొ అవ్య. అశ్లీలార్థద్యోతకం. ఉక. 2.547. క. ఏనేనొ. ఏమేమొ ; తు. దాన దాన ; త. ఎన్‌న్-ఎన్ను -వ్-ఓ ; మ. ఎందఎంద. <ఏమి + ఎమి[1] + -ఓ[2]. ఏమేయ్ రూ. ఏమేవ్. అవ్య. భార్యనుగానీ, నీచస్త్రీనిగానీ చేసే సంబోధన. ఏమేవ్ రూ. చూ. ఏమోయ్. ఏమోయ్ అవ్య. సన్నిహితులైన పురుషుల పరస్పర సంబోధన.

ఏమిగా(వ్) చూ. ఏమి.

ఏమిటనో చూ. ఏమిటి.

ఏమిటి రూ.చూ. ఏమి. సర్వ. ఏది, ఎటువంటిది. భార.సభా. 2.67.

ఏమిటనో క్రి.విశ. ఎందుచేతనో. పరమ. వి. 1.117. ఏమిటికి(వ్) రూ. ఏటికి(న్) క్రి.విశ. ఎందుకు. భార.అర. 1.137. విరా. 1.187. ఏమిటికో రూ. ఏటికో. క్రి.విశ. దేనికో, ఎందుకో. ఏమిటో క్రి.విశ. ఏదో, ఎందుకో.

ఏమి-టి. అనుచిత విభాగంవల్ల 'టి' యుక్తరూపం 'ఏమి'కి కల్గింది.

ఏమిటికి(న్) చూ. ఏమిటి.

ఏమిటికో చూ. ఏమిటి.

ఏమిటో చూ. ఏమిటి.

ఏమియును చూ. ఏమి.

ఏమియొ చూ. ఏమి.

ఏమియొక్కొ చూ. ఏమి.

ఏమియో చూ. ఏమి.

ఏమిర చూ. ఏమి.

ఏమిశ రూ.చూ. ఎంగెన. వి. ఒక రకం మొక్క.

ఏమీ రూ.చూ. ఏమి. సర్వ. 1. ప్రశ్నార్థకం. భార.ఆది. 8.129. కువల. 3.105. ముకుం. 2.107 ; 2. కౌతుకాన్ని తెలుపుతుంది. శృం.నై. 2.102 ; 3. ఆశ్చర్యాన్ని తెలుపుతుంది. ప్రభా. 1.56 ; 4. అనాదరాన్ని తెలుపుతుంది. చంద్రా. 2.143 ; 5. క్రోధాన్ని తెలుపుతుంది. దశా. 1.26.

ఏము[1] రూ.చూ. మేము. సర్వ. మేము. భార.ఆది. 2.148.

ఏము[2] రూ.చూ. జేము. వి. గొంగడి నేసేటప్పుడు పేక పోగు దగ్గర పడటానికి కొట్టే కొయ్యపట్టె.

ఏమె[1] సర్వ. ఎవతె ?

పో.చూ. త. యావళ్. ఎవతె; ఎవళ్. ఎవతె; మ. యావళ్/ఏవళ్. ఎవతె ? ఏ+మె.

ఏమె[2] రూ.చూ. ఏమే. అవ్య. భార్యనుగానీ, నీచస్త్రీనిగానీ చేసే సంబోధన. 'ఏమిటే,' 'ఓసి.' శృం.నై. 6.114.

ఏమే రూ. ఎమె[2]. అవ్య. ఓసి. వసు. 4.76. దశా. 1.26.

ఏమేమి చూ. ఏమి.

ఏమేమొ చూ. ఏమి.

ఏమేయ్ చూ. ఏమి.

ఏమేవ్ చూ. ఏమి.

ఏమొ రూ. ఏమో. అవ్య. 1. ఊహను తెలుపుతుంది. విజయ. 1.115 ; 2. ఎందుచేతనో, ఏకారణంవల్లనో. కువచ. 2.100.

క. ఏనొ, ఏమిటి ? ఎట్లు ? సాధ్యమా ? ఏనో. ఏమిటి ? ఎవరికేమి తెలియదు. ఎట్లు ? అది ఎట్లా సంభవం ? : తు. దాన్ను, జాన్ను. సాధ్యమా ? ఎవరికేమి తెలియదు.

ఏమో రూ.చూ. ఏమొ. అవ్య. 1. ఎందుచేతనో, ఏకారణంవల్లనో. హర. 7.63 ; 2. ఊహను తెలుపుతుంది. కళా. 7.111 ; 3. అశ్లీల పదాన్ని పరిహరించటానికి ఉపయోగిస్తుంది. ఉ.హరి. 5.84.

ఏమోయగు అ.క్రి. చెప్పరాని విధంగా పరిణమించు. భీమ. 2.104.

ఏమోయ్ చూ. ఏమి.

ఏమోయగు చూ. ఏమో.

ఏఁవరించు చూ. ఏఁచు. స.క్రి. దుఃఖపెట్టు. ద్వి. హరిశ్చ. ఉ. 1180 పం.

త. ఏంపు. బాధపడు ; ఏంపల్. బాధ ; తేంపు. కష్టంలోవుండు, బాధపడు ; తేంపల్. నిట్టూర్పు.

ఏఁపు చూ. ఏఁచు. వి. సంతాపం, బాధ. దశకు. 7.108. విష్ణు పు. 8.279. స.క్రి. బాధించు. నవనాథ. 2.81 పు. 9 పం., అచ్చ.రా.యుద్ధ. 451.

త. ఏంపు. బాధపడు ; తేంపు. కష్టంలో ఉండు, బాధపడు.

ఏఁబండ్రు సర్వ. యాభైమంది. కునం. 1.74.

క. అయ్యదింబరు. యాభైమంది ; త. ఐ.య్-పతిణ్-మర్. యాభైమంది.

<మూ.ద్రా. *చేన్ + *పన్న్.

ఏఁబది రూ. ఎమ్బది. వి. యాభై. ఐదుపదులు. ఆము. 4.211.

క. అయ్‌వత్తు. యాభై ; కొ. అయమ్-బది ; తు. ఐవ. యాభై ; త. ఐయ్-పతు, అయ్-పతు-. యాభై; మ. అయ్‌పతు. యాభై ; కో. అయ్‌వత్ ; తొ. ఎబొఒ.

<ఏన్ + పది.

ఏఁబలము రూ. ఏబదలం, ఏఁబులము. వి. అయిదు పలాలు. వీసెలో నాలుగోవంతు. ఆం.భా. 2.269.

<ఏన్ + పలము. పలం అంటే ఆరు తులాలు.

ఏఁబులము రూ.చూ. ఏఁబలము. వి. అయిదు పలాలు, వీసెలో నాలుగోవంతు.

ఏయది రూ. ఎయ్యది. సర్వ. 1. ఏది. భార.ఆది. 1.30 ; 2. ఎవతె ; 3. ఆమె ఎక్కడ ఉన్నది ; 4. అది ఎక్కడ ఉన్నది.

పో.చూ. క. యా, యావా, ఆ, అవ, దావ, ఏ, ఎ. ఏమిటి, ఏవి ; అవుదు. ఏమిటి, ఏది ; యావళు, అవళ్. ఎవతె ? ; కొడ. ఎ.వెన్, ఎ.వ, ఎ.వ్రు, ఎ.దు. ఎవడు, ఎవతె ?, ఎవరు ?, ఏది ?, ఏవి ? ; పో.చూ. తు. దా, దానె[1], జానె[1], దావ, దాదవ్రు, వా, వోవ్రు. ఏమిటి, ఏది ; ఏరు, ఏరాణె. ఎవరు ? పో.చూ. త. యావళ్. ఎవతె ? ; ఎవళ్. ఎవతె ?, ఎవళ్. ఎవతె ; పో.చూ. మ. యావళ్/ఏవళ్. ఎవతె ; పో. చూ. కొండ. ఏయ్.

ఎవతె ? ఏది ? ఏవ్. ఏస్త్రీలు ? ఏవి ? ఇఁటి, ఇటో (ఇ)క. ఏమిటి ? ఏది ? పో.చూ. కుఇ. ఎస్తంజు, ఎస్తరు, ఎస్తరి, ఎస్తల్. ఎవడు ? ఎవరు ? ఎవతె ? ఏది ? ఏస్త్రీలు ?, ఏవి ? పో.చూ. పర్జి. ఆరో. ఏది. ఏమా, ఏన. ఏది, ఏమిటి ?; పో.చూ. కొలా. ఎయ్/ఎయ్/ఎ.న్/ఎ.న్డ్, ఎ.ల్, ఎట్. ఎదవ్. ఎవడు ? ఏస్త్రీలు, ఎవతె, ఏది ? ఏ.వ్. ఏస్త్రీలు ; నా. ఏన్. ఎవడు ? ; కుడు. ఎక్దన్, ఎక్దా. ఎవడు ?, ఎవతె ?, ఏది ; పో.చూ. (బ్రా. అరా, అరావ్. ఏది ?

<ఏ[2]+అది.

**ఏయు**[1] న.క్రి. **1.** (బాణాదులు) వేయు. భార.ఆది. 4.208, ఆర. 4.68. ఆము. 5.85 ; **2.** (బాణములతో) కొట్టు. భార.ఆది. 7.169. దశా. 1.301.

క. ఏయ్, ఏసు. విసరు, వేయు, కొట్టు. ఎసు, ఇసు. బాణంవేయు. విసరు, ఎసె. బాణంవేయు, విసరు : తు. ఎయి, ఎయ్యుని. వేయు ; త. ఎయ్. (బాణాలు) ప్రయో గించు. ఏ. బాణం వేయు, ఏవ్ర (ఏవి-). విసరివేయు, బాణం వేయు, వి. బాణం, ఎవ్వు (ఎవ్వి-) బాణంవేయు, ఏచు (ఏచి). విసరు, కొట్టు ; మ. ఎయ్త్తు. బాణం వేయుట, ఎయ్యుక్క. బాణం వేయించుట, ఎయ్యుక. బాణం వేయుట, ఏవ్ర. వేయుట ; కోట. ఎయ్-(ఇచ్-) ఇయ్-(ఇచ్-), ఇచ్ వ్-(ఇచ్ త్-), తొద. (ఇచ్-ఇచ్-). బాణం వేయు ; గోం. ఎస్నా. బాణం వేయు, ఏస్. వేయు ; పర్జి. ఏయ్-, ఎన్-. బాణం వేయు, ఎయక్-. బాణం వేయు. గదబ. ఎయ్-(ఎత్-). వేయు ; కురు. ఇన్జా. బాణాలు వేయు ; మాల్తో. ఇన్హె (ఇన్జ్-). రాయి విసరు.

<మూ.ద్రా. *ఎయ్-/*ఏ-(<*ఎద్-).

**ఏయు**[2] రూ. వేయు. స.క్రి. వేయు, వైచు, ఉంచు. భాగ. 1.489.

**ఏర** రూ. ఏరా. పో.చూ. అరె, ఒరె. అవ్య. అతిపరిచయాన్ని గానీ, అవజ్ఞనుగానీ తెలిపే సంబోధన. శివర. 1.103.

పో.చూ. క. ఏనో ; పో.చూ. త. అడే లేక అడా, ఎన్నడా ; పో.చూ. గో. రే. తండ్రిని మామను భార్య అన్నలను పిలవటాని కుపయోగించే సంబోధన.

పో.చూ. సం. రే. అవ్య. పునరుక్తంగా వాడబడే అవజ్ఞా పూర్వక సంబోధన ; పో.చూ. ప్రా. రే, అరే. మాగ. అలే, లే. ఏ+ర.

**ఏరకల్ప** రూ.చూ. ఏరుగలప. వి. దున్నటాని కుపయోగించే పనిముట్టు.

**ఏరగట్టు** రూ.చూ. ఏరుకట్టు. వి. అరక కట్టడాని కుపయోగించే పగ్గాలూ, పట్టె, మోకుళ్లూ, వారిజె, చెలకోల మొ. వాళ్ల గుది లేక కట్టు.

**ఏరగాడి** వి. నాగటికి కట్టే కాడి.

<ఏరు[1]+కాడి.

**ఏరతాడు** రూ. ఏటతాడు. వి. దున్నేప్పుడు నాగటికి కట్టే మోకు.

<ఏరు[1]+తాడు.

**ఏరదుక్కి** వి. మెట్టలో దున్నటం.

<ఏరు[1]+దుక్కి.

**ఏరలము** పో.చూ. ఏఁబలము. వి. అయిదు పలాలు.

**ఏరలు** రూ.చూ. ఏరాలు. వి. తోడికోడలు. (ఆం.పదా.)

**ఏరవకడ** వి. దావరదంగి, దేవతాళం (పడమటి కనుముల్లో అనామలలోను, మలబార్, తిరువాన్కూర్, తిన్నెవెల్లి కొండల్లోను పెరిగే చెట్టు).

పో.చూ. క. దేవతాడ్(ల్, ళ్) (ఇ. ఎ. ఈ). తృణ విశేషం. పో. చూ. త. సంధానవిరి ; పో.చూ. మ. వందకమిన్.

**ఏరవంగ** చూ. ఏఱువంగ. వి. ఓషధీ విశేషం (Solanum Speciosum).

**ఏరసేద్యం** వి. తొలకరికి ముందు పొలంలో గుంటకతో దున్నటం.

<ఏరు[1]+సేద్యం.

**ఏరా** రూ.చూ. ఏర. అవ్య. అతిపరిచయాన్నిగానీ, అవజ్ఞను గానీ తెలిపే సంబోధన. పాండు. 3.33.

**ఏరాది** వి. గుర్రంపిల్ల. చంద్రా. 1.43.

**ఏరాలు** రూ. ఏరిలు. వి. **1.** తోడికోడలు. పంచి.వ. 4.287 ష. 9.1 ; **2.** సవతి (వా.).

పో.చూ. త. వేఱు. ఇతరం, బిన్నమైనది, వ్యతిరేకత, వైరం, పో.చూ. వేఱు-త్-తాయ్. సవతి తల్లి ; మ. వేఱు. భేదం.

<వేఱ్ (ఉ)+ఆలు.

**ఏరాళము** రూ.చూ. హేరాళము. విశే. పెద్దది. భాగ. 10. పూ. 213, అధికం ; క్రి.విశే. అధికంగా. శృం.నై. 7.39. అసంఖ్యాకంగా.

**ఏరాసి** వి. మొత్తం, ముద్ద.

సం. ఏకరాశి. ఒకే పోగు, పోగుగా చేయబడిన ఒక మొత్తం, పోగు చేయబడిన లేదా మిశ్రితమైన మొత్తం.

<సం. ఏకరాశి.

**ఏరి** రూ. ఏరీ. సర్వ. ఎక్కడ ఉన్నారు ? దశా. 1.258.

**ఏరితకోల** చూ. ఏరు[1]. వి. నాగటిమేటి.

**ఏరీ** రూ.చూ. ఏరి. సర్వ. ఎక్కడ ఉన్నారు ? భాగ. 8.590.

**ఏరు**[1] వి. **1.** ఎద్దులను కట్టి దున్నటానికి సిద్ధపఱచిన నాగలి. పరమ. వి. 5.30 ; **2.** నాగలి. రా.వి. 1.56 ; **3.** ఎడ్ల లేక దున్నల జత.

క. అర్, అరు, ఏరు. నాగటికి కట్టిన జోడెద్దులు ; త. ఏర్. నాగలి, ఎడ్ల నాగలి, ఎద్దు కాడి. వేర్. కాడి, కాడి కట్టిన ఎద్దుల జత ; మ. ఏర్. ఎడ్లకాడి, ఎద్దులు కట్టిన నాగలి [ఏరు=ఏర్ (త.తు.) ఎద్దు, ఎర్మ్మ. తొలిసారి కాడి కట్టిన ఎద్దుల జత]. కోట. తొద. ఎర్. నాగలి ; గోం. సేర్. నాగలి ; కుఇ. సేరు. ఎద్దుకాడి ; దున్నే జంతువుల జత ; సిరెక. రెండు, జత, ఎద్దుకాడి ; కువి. సేరు. ఎద్దుకాడి, జత, దున్నే జంతువుల జత, సెరెక. రెండు, జత, ఎద్దుకాడి, హేరూ. నాగలి ; పర్జి. వెరెయ్ కుల్. ఎద్దుల జత, పో.చూ. ఈరి. బవ. ఈరిల్. నాగటి కర్రు కాధారమైన దుంప ; కొలా. వేర్. నాగలి, ఎద్దుల జత.

పో.చూ. సం. సిర.

<మూ.ద్రా. *చేర్-.

ఏరుకట్ట రూ. ఆరగట్ట, ఏరగట్ట. వి. అరక కట్టడానికి ఉపయోగించే పగ్గాలు, పట్టెళ్ల, మోకు, వారిజె, చెలకోల మొ. తాళ్ల గుది లేక కట్ట. ఏరుకట్టు స.క్రి. నాగటి కాడి కట్టు. ఏరుగలప రూ. ఏరకల్ప. వి. నాగలిలో ఒక భాగం, ఒక పరికరం. నాగటి కలప. ఆం. భా. 2.281. <ఏరు[1] + కలప. ఏరువేల ఒకే రోజు ఒకే నాగలితో దున్న గలిగినంత నేల. దాదాపు నాలుగు మైళ్ల దూరం. భార. ఆశ్వ. 3.158. ఏరువాక రూ. ఏఱువంక. వి. ఏటేటా దుక్కికి ప్రారంభం. పో.చూ. క. ఆరంబ, ఆరంబు. దున్నటం, వ్యవసాయం. పో.చూ. త. ఏరుపూట్టు. వ్యవసాయ తరుణంలో ఒక శుభ దినాన జరిపే కృషికి ప్రారంభోత్సవం. వంకు. లాగు. పో.చూ. కుఇ. సేరు యూవ. స.క్రి. దున్ను బహుశః పోరు + పోక > ఏరు + వోక > ఏరువాక. ఏరువాకపున్నమ రూ. ఎర్వోక పున్నమ. వి. జ్యేష్ఠ శుద్ధ పూర్ణిమ. ఏరుసాగించు స.క్రి. 1. దుక్కి దున్నించు. 2. మొదట దుక్కి దున్నేటప్పుడు విందులూ విలాసాలూ ఏర్పాటుచేయు. ఏరుసాగు అ.క్రి. దుక్కిదున్ను. దున్నటం మొదలుపెట్టు. ఆము. 4.124.

ఏరు[2] చూ. ఎరియు. వి. నొప్పి, బాధ. భార. ఆది. 3.191. మార్క. 2.87.

త. ఎఱ్ఱు. కొట్టు, గుచ్చు, పొడుచు, తాకు, తగులు. ఏఱు. (కత్తి) దెబ్బ, (తేలు) కుట్టటం, నాశనం చేయటం; మ. ఎఱ్ఱు. దెబ్బ. గుడ్డలుతికేప్పుడు వేసే దెబ్బ; గోం. ఏరేతానా. తీవ్రంగా బాధపెట్టు.

'తలమేరు'లో వలె తరచు సమస్త ప్రయోగం. పో.చూ. తలపోటు.

ఏరుచు అ.క్రి. బాధపడు. స.క్రి. 1. రగుల్కొలుపు; మండించు; 2. నేర్చు: 3. బాధపెట్టు, శిక్షణలో నుంచు.

ఏరుకట్ట చూ. ఏరు[1].

ఏరుకట్టు చూ. ఏరు[1].

ఏరుకోల చూ. ఏడికర్ర. వి. బండి దొలుపు కమర్చిన పొడవాటి పలక కొయ్య.

ఏరుగడము చూ. ఏరుగు.

ఏరుగలప చూ. ఏరు[1].

ఏరుగు అ.క్రి. విష్టించు, మలం విడుచు. వి. మలం. ఆం.భా. 2.184.

క. ఏరు, ఎరుబు. ఆవుపేడ, రెట్ట, పెంట, ఎరణ. దూడపేడ, ఎక్కు. తరచు విరేచనాలు కావడం; త. ఎరుకు. నీళ్ల విరేచనాలు కావటం (పశువుల విషయంలో). ఎరు. పేడ; కొలా. ఎర్ంగ్-, ఎరెంక్. స్వచ్ఛపరచు, ఎర్ంగుడ్. మలం, షరీషం, యర్న్- ఎన్. మల విసర్జనచేయు; నా. ఎర్ంగ్. స్వచ్ఛపరచు; కురు. ఎర్ఖ్నా (ఇర్ఖ్యస్) చిన్న పిల్లలు, జంతువులు, మలం విడుచు, (పెద్దలకు) విరేచనాలు అగు; మాల్తో. ఇన్హ్. వినరు, కొట్టు.

<*మూ.ద్రా. *ఏర్-, *ఏర్- ఉవ్-, *ఎర్- ఉక్క్-/- ఉంక్-.

ఏరుగడము వి. మలవిసర్జనం.

ఏరుచు చూ. ఏరు[2].

ఏరువేల చూ. ఏరు[1].

ఏరుపడు[1] రూ.చూ. ఏర్పడు[1]. అ.క్రి. తేటపడు, కన్పడు, బయల్పడు, స్థిరపడు, వర్తిల్లు.

ఏరుపడు[2] రూ. ఏర్పడు[2]. అ.క్రి. వేరుపడు, వేరుగా కనపడు. రామా. 8.90.

ఏరుపఱచు రూ.చూ. ఏరు పఱుచు[2]. స.క్రి. ఏర్పరించు, విభజించు. దశా. 2.357.

ఏరుపఱుచు[1] రూ. ఏర్పఱచు, ఏర్పఱుచు[1], చూ. ఏర్పడు[1]. స.క్రి. 1. కనబరచు, చూపు. ఆము. 5.26; 2. అమర్చు, కూర్చు. దశా. 2.357.

ఏరుపఱుచు[2] రూ. ఏరుపఱచు, ఏర్పఱుచు[2], చూ. ఏఱు[1]. స.క్రి. వేరుచేయు, విభజించు. భార. ఉద్యో. 3.103.

ఏరుపఱుపు వి. 1. శోధనం, శుభ్రపరచటం. ఆం.భా. 2.252; 2. బియ్యం కడుగు, కుడితి; 3. వడియ కట్టటం (వేరు చేయటం అనే అర్థం నుండి పరిణామం.

ఏరుపాటు[1] రూ. ఏర్పాటు[1]. చూ. ఏర్పడు[1]. వి. 1. వైనం; 2. కట్టుబాటు, తీర్మానం, నియమం; 3. పరిష్కారం, నిశ్చయం, నిర్వహణ; 4. ఎన్నిక, ఏరుకోటం, ఒడంబడిక,

ఏరుపాటు[2] రూ. ఏర్పాటు[2]. చూ. ఏఱు[1]. వి. 1. విభాగం. భార. భీష్మ. 3.248; 2. భేదం. చంద్రా. 1.19.

ఏరుబంది వి. ఒక రకం చెట్టు.

ఏరుమద్ది వి. ఒక రకం మద్ది చెట్టు (Terminalia arjuna).

ఏరుమల్లె చూ. ఏఱుమల్లె. వి. ఒక రకం మల్లె.

ఏరుబ్రాలు వి. ఒక రకం వడ్లు. భీమ. 2.142.

క. ఏరుపాలు. పంటలో పాలికాపు భాగం.

<ఏరు + ప్రాలు. వ్య. నూకలూ రాళ్లూ తీసేసి ఏరిన బియ్యం.

ఏరువ వి. ఓడ కింద వెన్ను దూలం.

పో.చూ. క. ఏఱగట్టు ముడివేయు, (తాళ్లతో) కట్టు. పో.చూ. త. ఏరా. ఓడ కింద వెన్ను దూలం.

ఏరువాక చూ. ఏరు[1].

ఏరువాకపున్నమ చూ. ఏరువాక.

ఏరుసాగించు చూ. ఏరు[1].

ఏరుసాగు చూ. ఏరు[1].

ఏరొంపు రూ.చూ. ఏనొంపు. వి. ఎక్కువ వాలు.

ఏర్చు[1] చూ. ఎరియు. స.క్రి. 1. దహించు, కాల్చు. భార. ఆది. 2.60, భీష్మ. 3.278, భారా. 6.502; 2. బాధించు, మండించు, వాసిష్ఠ. 1.106, ఆము. 1.92, 4.218; 3. ధ్వంసంచేయు. పాడుచేయు. మను. 4.99.

ఏర్చు[2] స.క్రి. 1. ఏరు, ఎన్ను. భార.విరా. 1.95, ప్రభా. 2.74, అచ్చరా. 5.182; 2. ఏరిపారవేయు, తొలగించు. భార.విరా. 2.52; 3. శోధించు. ఆము. 1.18; 4. విభజించు. మను. 5.32.

పో.చూ. క. అరిసు. పోగుచేయు, ఏరుకొను; తు. ఆరిపుని. చెరుగు, జల్లించు; త. అరి. చెరుగు, వేరు

చేయు ; మ. అరిక్క. చెరుగు, జల్లించు, అరి. బియ్యం ; కువి. ఏర్ స్. వేరుచేయు ; కొలా. యెర్ స్.

**ఏర్పు[3]** చూ. ఏర్పడు. అ.క్రి. 1. వ్యూహంగా పన్ను. భార. విరా. 4.184, శల్య. 1.75 ; 2. నిర్మించు, ఏర్పరచు. భీమ. 3.102, శివరా. 1.75 ; 3. సంధించు, కూర్చు. పాండు. 5.15.

క. ఏఱ్. తగియుండు, ఏర్పడిసు, ఏర్పడు. ఏర్పరుచు, ఒక క్రమంలో పెట్టు ; క. ఏఱ్పటు, ఏఱ్పాటు, ఏర్పడు, ఏఱ్పాటు, ఏర్పాటు, ఏఱ్ పు. తగి ఉండటం, ఔచిత్యం ; విశే. తగిన. ఏర్-<*ఏల్-. తగియుండు ; మ. ఏలుక. తగు, తగియుండు, ఏల్. సన్నాహం.

**ఏర్పడు[1]** రూ. ఏరుపడు[1]. అ.క్రి. 1. తేటపడు, స్పష్టపడు. భార.ఆది. 1.16 ; 2. వాసనవలన తెలియు. భార.ఆది. 3.41 ; 3. కంటికి కనబడు. భార.ఆది. 4.122 ; 4. బయల్పడు, వెల్లడియగు. భార.అర. 2.348 ; 5. వేరుపడు, వేరుగా కనబడు. భాగా. 6.645 ; 6. బుద్ధిగోచరమగు, తెలియు. ఆము. 4.252 ; 7. స్థిరపడు. కళా. 2.176 ; 8. ప్రత్తిల్లు, ఉండు. మల్ల. 2.94.

క. ఏఱ్. అగు, తగు, తగియుండు, సాధ్యమగు ; సమర్థమైయుండు, ఏర్పడు, ఒక క్రమపద్ధతిలో నుండు, సిద్ధంగానుండు. ఏర్పడిసు. ఏర్పరచు, క్రమంలో ఉంచు ; తు. ఏపుని. పట్టుకొను, తీసుకొను, ఎత్తుకొను ; త. ఏల్ (ఏఱ్ ప్-ఏఱ్ట్- ; ఏల్ వ్-, ఏఱ్ ఱ్-). జరుగు, సంభవించు, తగియుండు, ఓటుగానుండు, ఆరంభించు, పూనుకొనియుండు, ఏర్పాటు. రూపొందటం, పో.చూ. తెలిపటు. ఎన్నుకొనబడు. కనిపించు ; కోట. ఏ.ర్ప్.ర్. సిద్ధపరచటం. ఒకపనికై ఒకడ్ని ఎన్నుకోటం ; మ. ఏల్. సాధ్యత, అందుబాటు, సన్నాహం, బాధ్యత, ఏలుక. తగియుండు, సరిపడు ; కుఇ. ఏఱ్ బ (ఏత్-). అందుకొనటానికి గానీ, అంగీకరించటానికి గానీ చేయి జాపటం, అందుకోలు, అంగీకారం ; కువి, ఏ.న్రై. అంగీకరించు, ఏన్-హన్రై. స్వీకరించు ; పర్జి. ఏణ్ణ(ఏఱ్ త్-). అంగీకరించు, స్వీకరించు.

<మూ.ద.ద్రా. *ఏర్-.

**ఏర్పడుదెంచు** అ.క్రి. 1. కలుగు, సంభవించు. భార. ఆది. 5.137 ; 2. స్పష్టపడు. భార.విరా. 1.245. <ఏర్పడు + తెంచు.

**ఏర్పడు[2]** రూ.చూ. ఏరుపడు[2]. చూ. ఏఱు[1]. అ.క్రి. వేరుపడు, వేరుగా కనపడు.

**ఏర్పడుదెంచు** చూ. ఏర్పడు[1].

**ఏర్పరించు** చూ. ఏర్పడు[1]. ప్రే. స.క్రి. 1. నిర్ణయించు, నిరూపించు. భారా.విరా. 1.65 ; 2. వివరించి చెప్పు. విష్ణు పు. 8.16, అచ్చరా. అయో. 70 ; 3. నిర్మించు, ఏర్పాటు చేయు. విప్ర. 2.21 ; 4. వ్యూహం పన్ను. పారి. 5.2.

**ఏర్పరించు[2]** చూ. ఏఱు[1]. స.క్రి. 1. గుర్తించు. రం.రా. 4.208 పు. 25 పం ; 2. వేరుచేయు. మల్ల, 2.14.

**ఏర్పఱచు** రూ.చూ. ఏరుపఱుచు[1]. చూ. ఏర్పడు[1].

**ఏర్పఱుచు[1]** రూ.చూ. ఏరుపఱుచు[1]. స.క్రి. 1. చూపు. భార. విరా. 2.298 ; 2. చక్కబరచు. భార.ఉద్యో. 4.214 ; 3. స్థిరపరచు. నిర్ణయించు. ఉ.రా. 1.280.

**ఏర్పఱుచు[2]** రూ.చూ. ఏరుపఱుచు[2]. స.క్రి. వేరుచేయు, విభజించు. కు.సం. 1.18 ; ద్విపల. 1.411 పు. 412 పం.

**ఏర్పాటు[1]** రూ. ఏరుపాటు[1]. చూ. ఏర్పడు[2]. వి. 1. కట్టుబాటు, నియమం, నిర్ణయం. దశా. 1.248 ; 2. నిర్ణీతం. దశా. 2.193 ; 3. స్పష్టం. దశా. 4.154.

క. ఏర్పాటు, ఏర్పాడు. నిర్ణయం, క్రమపద్ధతి ; తు. ఏర్పాడు. క్రమపద్ధతి : త. ఏఱ్ పాటు. పద్ధతి, క్రమం, నియమం. ఆచారం, కట్టుబాటు ; మ. ఏర్పాటు. క్రమపద్ధతి.

**ఏర్పాటుగా(న్)** క్రి. విశే. ప్రకటంగా. ఉ.హ. 4.125 ; నిశ్చరంగా. కాశీ. 7.107.

<ఏర్పాటు + కాన్.

**ఏర్పాటు[2]** రూ.చూ. ఏఱుపాటు[2]. వి. 1. విభాగం ; 2. భేదం.

**ఏర్పాటుగా(వ్)** చూ. ఏర్పాటు[1].

**ఏర్పిడిక** రూ.చూ. ఏఱుపిడుక.

**ఏర్పిడుక** రూ.చూ. ఏఱుపిడుక.

**ఏర్పు** చూ. ఎరియు. వి. 1. మంట ; 2. వేడి.

త. ఎరిప్పు, ఎరిపు. మంట.

**ఏర్లఱేఁడు** చూ. ఏఱు[2]. వి. నదులకు ప్రభువు, సముద్రుడు. అచ్చరా. 1.14.

**ఏఱు[1]** స.క్రి. 1. కన్గొను. వ్య. పైకెత్తు. ఉ.హ. 8.48 ; 2. తలలు నరికి పైకితీయు. భార.ద్రోణ. 1.111, చంపూ. 6.80 ; 3. ఎంచు, ఎన్ను, గణించు. భార.శల్య. 2.108, భాగ. 10 ఉ. 474 ; 4. గింజలు మొ. ఒకటొకటే పైకితీయు. భార.అశ్వ. 4.220 ; 5. తప్పుపట్టు. శృం.నై. 7.90 ; 6. పోగులు అంటుకోకుండా విడదీసి నెరపు.

క. ఏఱ్. కూర్చు, పోగుచేయు, ఏరు, ఎంచు, ఎన్నుకొను; ఏఱ్, ఈఱు (<ఇఱి). కొట్టు, పొడుచు, గుచ్చు, దెబ్బవేయు, కోత, గాయం ; తు. సొరుని, సొరియుని. జల్లించు, చెరగు, వేరుచేయు ; త. ఏఱు. (కత్తి మొ.) దెబ్బ, మచ్చ ; గో. ఏర్. వేరగు ; ఎహ్రా. కలుపుతీయు ; పఇ. ఏజి. వేరగు ; ఏస్ప్. వేరుచేయు, పెరుకు, విడదీయు ; కువ. చాజ్-(చజ్జ్-). ఎన్నికచేయు, మంచిదాని నేరుకొను.

<మూ.ద్రా. *చాత్-/*చేత్.

**ఏఱునుగ్గు** వి. ఏర్పిడుక. **ఏఱుపిడుక** రూ. ఏర్పిడిక, ఏర్పిడుక. వి. నేలమీదపడి ఎండిపోయిన తర్వాత వంటచెరకుగా ఏరబడే పేడకడి. మను. 4.60. ఆం.భా. 2.253.

**ఏఱు[2]** వి. నది. భార.ఆది. 6.59, అచ్చ.రా. 1.11. విశే. జలసంబంధమైన.

తు. సొరు. చిన్ననది ; త. ఆఱు, యాఱు. నది ; మ. ఆఱు. నది ; కోట. పెయ్ వ్-ఎ.ర్. నది ; గోం. ఏర్. నీరు. ఆట్.యా.ర్. సలసలకాగే నీరు ; కొండ. ఏరు. నీరు. కుఇ. ఏసు. కువి. ఏయూ, ఏజా. నీరు ; పర్జి. పెరెద్. నది. (పెర్-పెద్ద) ; ఒల్లా. ఏర్. నీరు.

<మూ.ద్రా. *ఏర్-.

**ఏటఁగలుపు** స.క్రి. ధ్వంసంచేయు, శిథిలంచేయు. వ్యు. నదిలో పారవేయు. <ఏఱు + -అ[7](న్) + కలుపు. **ఏటఁబఱుపు** స.క్రి. ధ్వంసంచేయు, శిథిలంచేయు. చంద్ర. 1.112 <ఏఱు + -అ[7](న్) + పఱుపు. **ఏటిఆవలిగిలిగింత** విశే. దుర్లభం, అరుదు. వ్యు. నది ఆవలినుండి చక్కిలిగింత. కవిరాజ. 3.48. **ఏటికెదురీఁదు** అ.క్రి. 1. ప్రవాహాని కెదురీదు. భార. మౌసల. 98 ; 2. కఠినమైన బాధ్యత వహించు. **ఏటిగుల్ల** వి. ఏటి అడుగున దొరికే గుండ్రని రాతిముక్క. **ఏటిపాలగు** అ.క్రి. వ్యర్థమగు. వ్యు. నది పాలయిపోవు. **ఏటిబట్టె** వి. నదినుండి తవ్విన కాల్వ. **ఏటిబోటిమగలయొకిమాఁడు** వి. వడుఁడు వ్యు. నదీనాథులైన సముద్రాలకు రాజు. **ఏటిఱేఁడు** వి. నదీనాథుడు, సముద్రుడు యయా. 3.27. **ఏఱుదొర** వి. నదీనాథుడు, సముద్రుడు, ముకుంద. 2.25. **ఏఱుపుచ్చ** వి. కళింగ వృతం. **ఏఱుమద్ది** వి. నదీ సర్జం, ఒక జాతిమద్ది పో.చూ. త. వెల్లమర్ద. కూలమరుధు. **ఏఱుమల్లియ** రూ. ఏఱుమల్లె. వి. వానం తిక. అరబ్బి మల్లె. దండలు కట్టటానికి వాడతారు. (Cape Jasmine). త. ఆఱ్ఱు- మల్లికై నీటిమొక్క. **ఏఱుమల్లె** రూ.చూ. ఏరుమల్లియ. వి. అరబ్బీమల్లె. ప్రబంధ. 112. బ.వ. ధాన్యవిశేషం. **ఏఱువంగ** వి. ఒక జాతి వంగ. తీరప్రదేశాల్లో పెరుగుతుంది. క. ఏరువంగ. ఒక మొక్క పేరు. **ఏఱువావిలి** వి. అరబ్బీమల్లె. (దండలకుపయోగిస్తారు.)

**ఏఱుజాజి** వి. ధాతకి. (Grisleqto mentqsq)

**ఏఱుదొర** చూ. ఏఱు[2].

**ఏఱునుగ్గు** చూ. ఏఱు[1].

**ఏఱుపిడుక** చూ. ఏఱు[1].

**ఏఱుపుచ్చ** చూ. ఏఱు[2].

**ఏఱుమద్ది** చూ. ఏఱు[2].

**ఏఱుమల్లియ** చూ. ఏఱు[2].

**ఏఱుమల్లె** చూ. ఏఱు[2].

**ఏఱువంగ** చూ. ఏఱు[2].

**ఏఱువావిలి** చూ. ఏఱు[2].

**ఏఱువు** వి. 1. దేశం, విదేశం. అప్ప. 2.197 ; 2. సీమ సరిహద్దు.

బహుశః సహజమైన సరిహద్దు అయిన ఏఱు[2]నుబట్టి వచ్చివుండవచ్చు.

**ఏల[1]** రూ. ఏలా. క్రి.విశే. 1. ఏమి ?, ఏమి ప్రయోజనం ? భార.ఆది. 1.117, ఉ.హ. 4.300; 2. (వలదు, కూడదు, అనావశ్యకం, మొ. తాత్పర్యాలతో) ఎందుకు ? కాశీ. 4.47, విక్ర. 2.184 ; 3 ఎట్లు? ఎట్లు కలుగును. ఆము. 6.31 ; 4. ఏ కారణంచేత ? దశా. 1.168.

బహుశః <ఏ + లా(గు) ఎట్లు? ఏ విధంగా ?

**ఏలకొ** రూ.చూ. ఎలకో. అవ్య. ఎందులకో, ఏ కారణం చేతనో. దశా. 8.266. **ఏలకో** రూ. ఏలకొ, ఏలాకొ, ఏలాకో. అవ్య. ఎందులకో, ఏ కారణంచేతనో భార.అర. 2.146. <ఏల + -కు (న్) + ఓ[2].

**ఏల[2]** వి. ఒక రకమైన జానపద గీతం. శుక. 2.172, అచ్చరా. 6.90, ఆం.భా. 1.123.

క. ఏలె. ఒక ఛందం. త. ఏల-ప్-పాట్టు. ఏలో, ఏలేలో అనే పల్లవి తోడి పడవపాట. ఏడాల్, యాళ్. స్వరాలు మానవ కంఠస్వరం, ఏఱల్. సప్తస్వరాలతో కూడిన సంగీతం.

పో.చూ. సం, హేలా. తేలిక, చులకన, శృంగార చేష్ట, వినోదం. పల్లవిని బట్టి పాటకాపేరు వచ్చివుండవచ్చు.

**ఏలకూఁతలు** వి. బాలక్రీడావిశేషం. ఏల ఏల అని అరుస్తూ ఆడే ఆట. **ఏలపదము** వి. ఒక రకం జానపద గీతం, ఏల పాట. శుక. 2.172. **ఏలపాట** వి. 1. ఒక రకం పాట, ఏల; 2. ఒక ప్రత్యేక ఛందంలో కూర్చిన పాట. **ఏలపాటలు** వి. బవ. బాలక్రీడా విశేషం. విష్ణు. పు. 7.202.

**ఏల[3]** వి. పీఠికా పుర ప్రాంతమందలి ఒక నది.

**ఏలేఱు** వి. పీఠికా పుర ప్రాంతమందలి ఒక నది. భీమ. 2.52.

**ఏలకి** వి. ఒకానొక లత. పి. శకుం. 2.23. (Amomum xanthioides.)

క. ఏలక్కి, యాలకి, యాలక్కి. పెద్ద ఏలకి ; ఇలాచి, ఎలచి. ఏలకి. <ఏలె + అక్కి. (కిట్టెల్) ; కొడ. ఏళక్కి ; తు. ఏలక్కి, ఏలెక్కి. త. ఏలమ్. ఏలకిచెట్టు ; ఏల-క్-కాయ్. ఏలకి, ఏల-య్-అరిచి. ఏలకిగింజ ; మ. ఏలక్కాయ్, ఏలక్కాయి. ఏలకికాయ, ఏలక్కాయ్, ఏలత్తరి. ఏలకిగింజలు.

సం. ఏలా. ఏలకిచెట్టు : ప్రా. ఎలా. ఏలకిచెట్టు ; అమా. ఎలా ఏలకిచెట్టు, గింజ ; హిం. ఇలాయ్‌చీ, సం. ఏల + చీ <-చ ; పార.ప్రత్య.

**ఏలకికాయ** వి. 1. ఏలా ఫలం ; 2. ఏలకికాయవలె ఉండే భక్ష్య విశేషం. హంస. 1.105, ప్రబంధ. 112. **ఏలకిగింజలు** వి. బవ. ఏలకులు. **ఏలకివండు** వి. ఏలకికాయ. **ఏలకిరాజనములు** వి. బవ. ఒక రకం ధాన్యం. బహుశః ఏలకి గింజలవలె ఉండే ధాన్యం. ప్రబంధ. 112. **ఏలకులు** వి. బవ. ఏలకిగింజలు. ప్రబంధ. 57.

**ఏలకికాయ** చూ. ఏలకి.

**ఏలకిగింజలు** చూ. ఏలకి.

**ఏలకివండు** చూ. ఏలకి.

**ఏలకిరాజనములు** చూ. ఏలకి.

**ఏలకులు** చూ. ఏలకి.

**ఏలకూఁతలు** చూ. ఏల[2].

**ఏలకొ** చూ. ఏల[1].

**ఏలకో** చూ. ఏల[1].

**ఏలపదము** చూ. ఏల[2].

**ఏలపాట** చూ. ఏల[2].

**ఏలపాటలు** చూ. ఏల[2].

**ఏలపుయిస్తిహారు** చూ. ఏలము[1].

**ఏలము[1]** రూ. వేలము[1]. వి. అమ్మకంలో ఒక విధం, వేలం పాట.

క. ఏలామ్, ఎలామ్, యాల. వేలం, బహిరంగమైన అమ్మకం ; తు.త. ఏలమ్. వేలం ; మ. ఏలమ్. వేలంశేక.

హిం. ఉ.అర. ఏలాన్. ప్రకటన, ఉద్ఘోషణ.

<ఉ. ఏలాస్.

**ఏలపుయిష్తిహారు** వి. వేలం, చాటింపు, ప్రకటన. <ఉ. ఏలము + ఉ. ఇస్తిహారు. **ఏలముపాడు** స.క్రి. వేలంకోసం కేకలువేయు. వేలంద్వారా అమ్ము. **ఏలమువేయు** స.క్రి. వేలంద్వారా అమ్ము.

**ఏలము**[2] రూ.చూ. వేలము[2]. వి. లాటితోపులో కల్లు గీచేవాని గుడిసె.

పో.చూ. త. వేల. తోపు.

**ఏలమువట్టు** వి. ఊత, ఆధారం, ఆలంబనం, కాపు, ఆశ్రయం. వ్య. స్థిరజీవనం. పాండు. 5.179.

**ఏలమువట్టు** చూ. ఏలము[2].

**ఏలముపాడు** చూ. ఏలము[1].

**ఏలమువేయు** చూ. ఏలము[1].

**ఏలా** రూ.చూ. ఏల[1] అవ్య. **1.** ఎట్లు? ఎట్లు కలుగును ? భార. ద్రోణ. 2.141 ; **2.** ఏమి ప్రయోజనం ? ఏమి ? కాశీ. 4.49 ; **3.** ఏ కారణంచేత. భాగ. 7.27 ; **4.** ఎందుకు? ఎందుకోసం. అనుకూల సమాధానం ఆకాంక్షిస్తూ.

**ఏలాగు** క్రి.విశే. ఏ విధంగా ? ఎట్లు ?

**ఏలాగైన(న్)** క్రి.విశే. ఏ విధంగానైన <ఏలాగు + ఐన(న్).

**ఏలాగైన(న్)** చూ. ఏలాగు.

**ఏలాటము** చూ. ఏల[2]. వి. పరిహాసం. నీతి. 35.

పో.చూ. క. ఏళిద. తిరస్కారం, అపహాస్యం ; త. ఏళితమ్. అపహాస్యం, పరిహాసం, ఎళ్. నింద, ఆక్షేపణ ఎళ్ళల్. నింద, అపహాస్యం ; పో.చూ. మ. ఏళితమ్. తిరస్కారం, అగౌరవం ; పో.చూ. గోం. సేహ్‌ణానా, సెహ్‌ఛి-సెహ్‌కా. పరిహసించు.

<ఏల[2] + -ఆట(ము).

**ఏలాము**[1] రూ. వేలము[2]. వి. లాటితోపులో కల్లుగీచే వాని గుడిసె.

**ఏలాము**[2] వి. సొరచేప.

**ఏలాముచేప** వి. సొరచేప. రంపం పళ్లలాంటి పళ్లూ, పెద్ద ముట్టె ఎముకగల చేప.

**ఏలాముచేప** చూ. ఏలాము[2].

**ఏలి** విశే. **1.** కపటంతో కూడినది, మోసంతో కూడినది. భార. ఉద్యో. 3.9 ; **2.** కృత్రిమం. చంద్రా. 2.36.

**ఏలిక**[1] చూ. ఏలు[1]. వి. **1.** భార్యకు ప్రభువు, భర్త. భీమ. 1.76 ; **2.** రాజు, ప్రభువు, యజమాని. నీలా. 2.47, ఆం.భా. 2.182.

త. ఆళుకై. పరిపాలన, రాజ్యం.

**ఏలికసాని** వి. రాణి, యజమానురాలు, దొరసాని. కాశీ. 6.221.

**ఏలిక**[2] రూ.చూ. ఏడి. వి. గొఱ్ఱె.

**ఏలికరాజనాలు** వి. బవ. ధాన్య విశేషం, శ్రేష్ఠమైన రాజనాలు. హంస. 4.128.

**ఏలికసాని** చూ. ఏలిక[1].

**ఏలికెపాము** రూ.చూ. ఎమిడిక పాము. వి. పేగుల్లో పుట్టే ఒక రకం పురుగు.

**ఏలిచేప** వి. సొరచేప.

**ఏలిదము** రూ. ఎల్లితము, ఎల్లిదము. వి. లాఘవం, చులకన, ఉపేక్ష. భార. ఆది. 6.116 ; విశే. తేలికైన. కు.సం. 10.514.

సం. హేల్. ఉపేక్షించు. హేలితవ్య, హేలన. తిరస్కారం.

క. ఏళిద. తిరస్కారం, అపహాస్యం, తిట్టు, నింద, అగౌరవం ; త. ఏళితమ్. అపహాస్యం, పరిహాసం ; ఏళణమ్. అపహాస్యం, వేళాకోళం. <సం. హేలన ; మ. ఏళితమ్. తిరస్కారం, అలక్ష్యం.

<సం. హేలితమ్. ఉపేక్షింపబడినది.

**ఏలినఅత(డు** చూ. ఏలు[1].

**ఏలించు** చూ. ఏలు[1].

**ఏలినవా(డు** చూ. ఏలు[1].

**ఏలినవారు** చూ. ఏలు[1].

**ఏలిసె** వి. పూరేడుపిట్ట, పరిమపిట్ట, కోలంకిపిట్ట.

**ఏలు**[1] స.క్రి. **1.** పాలించు, శాసించు. భార. ఆది. 4.158, ఉద్యో. 4.59 ; **2.** భృత్యునిగా గైకొను. భార. 4.1.227 ; **3.** భర్తగా గైకొను. వసు. 4.84 ; **4.** భార్యగా గైకొను. దశా. 1.30.

క. ఆళ్, ఆళు. పొందు, సంపాదించు, కలిగియుండు, పాలించు, శాసించు, నిర్వహించు ; కొడ. అ.ళ్- (అ.ళి). పరిపాలించు ; తు. ఆళుని, ఆళుణ. పాలించు, శాసించు, నిర్వహించు ; త. ఆళ్. పాలించు, శాసించు, అదుపులోనుంచు, (గృహకృత్యాలు) నిర్వహించు ; ఆళ్లు. ఆశ్రితునిగా గ్రహించు, అదుపులోనుంచు, కాపాడు, పోషించు, ఆట్-కొళ్. దాసినగా గ్రహించు (భగవంతుడు భక్తునివలె) కటాక్ష పాత్రుని జేయు ; మ. ఆళుక. పరిపాలించు, కలిగియుండు, పొందు ; కొ. అ.ణ్- (అ.డ్-). పొందు, పాలించు, పోషించు, కలిగియుండు ; కొ. ఒ.ళ్- (ఒ.డ్-) (గేదెలు మొ.) కలిగియుండు, పాలించు.

<మూ.ద.ద్రా. *యాళ్.

**ఏలినఅత(డు** వి. రాజు, పాలకుడు. విప్ర. 5.40. **ఏలించు** స.క్రి. ఏలునట్లుచేయు. క. ఆళిసు. ఏలించు. **ఏలినవా(డు** వి. రాజు, ప్రభువు, యజమాని. భార. సభా. 1.37, ఉద్యో. 2.33. **ఏలినవారు** వి. రాజు, ప్రభువు - గౌరవ వాచకం. **ఏలుకొను** స.క్రి. **1.** వశపరచుకొను. భార. విరా. 2.335 ; **2.** కైకొను. భీమ. 3.5 ; **3.** పాలించుకొను. విక్ర. 1.167 ; **4.** కాపాడుకొను. దశా. 2.311. **ఏలుకోటి** వి. **1.** ప్రజలు, ఏలుబడికి లోబడిన ప్రజలు. ఆం.భా. 2.117 ; **2.** ప్రజావర్గం. <సం. కోటి-గుంపు. **ఏలుదెంచు** స.క్రి. పాలించు, శాసించు. భార. విరా. 2.83. <ఏలు[1] + -తెంచు. **ఏలుబడి** రూ. ఏల్బడి. వి. **1.** పరిపాలన, ప్రభుత్వం, రాజ్యం. శుక. 1.375 ; **2.** అధీనం, అదుపు. చంద్రా. 4.84. **ఏలువారు** రూ. ఏలేవారు. వి. బవ. పాలకులు. **ఏలేవారు** రూ.చూ. ఏలువారు. **ఏల్బడి** రూ.చూ. ఏలుబడి. విశే. తక్కువది. లోబడినది. వసు. 2.70.

**ఏలు**[2] న.క్రి. సమానమగు, సరిపోలు. హర. 4.10. త. ఎల్. సమానమగు ; ఐయల్. సరిపోలు, పోలియుండు.

**ఏలుకొను** చూ. ఏలు[1].

**ఏలుకోటి** చూ. ఏలు[1].

**ఏలుదెంచు** చూ. ఏలు[1].

**ఏలుపు** రూ.చూ. ఏడుపు. వి. ఏడ్వటం, రోదించటం.

**ఏలుబడి** చూ. ఏలు[1].

**ఏలువారు** చూ. ఏలు[1].

**ఏలేలు** చూ. ఏల[3].

**ఏలేవారు** చూ. ఏలు[1].

**ఏలొకొ** రూ.చూ. ఏలకో. అవ్య. ఎందులకో, ఏకారణంచేతనో. భార. ఆది. 4.30, 179, 6.289, అర. 2.208.

బహుశః <ఏల[1] + ఒకొ[2].

**ఏలొకో** రూ.చూ. ఏలకో. క్రి.విశ. ఎందులకో, ఏకారణం చేతనో.

**ఏలొంపు** రూ.చూ. ఏనొంపు. వి. ఎక్కువ వాలు.

**ఏల్చు** పో.చూ. ఏర్చు[2]. న.క్రి. నూలు పోగులు విడదీయు.

**ఏల్సె** పో.చూ. ఏలిసె. వి. ఉల్లాం పిట్ట.

**ఏల్నాటిశని** వి. చెడ్డకాలం, జన్మ నక్షత్రంపై శని దుష్ప్రభావం కల కాలం.

క. ఎలరె-య్-ఆటద-శని. శని భచక్ర పరివర్తన కాలం 30 సంవత్సరాల్లో దుష్ఫలితాల నిచ్చే 7½ సంవత్సరాల కాలం ; త. ఏళ్-అరై-నాట్టు-చ్-చని. జన్మరాశిలోను వ్యయ ద్వితీయాల్లోను సంచరిస్తూ 7½ సంవత్సరాలపాటు దుష్ఫలితాలనిచ్చే శని. ఏళ్-అరయ్-య్-అణ్బు-చ-చని.

**ఏల్బడి** చూ. ఏలు[1].

**ఏళ్నూరు** రూ.చూ. ఏడునూఱు. వి. ఏడు వందలు.

**ఏళ్లము** వి. బ.వ. ఏడు పలములు.

**ఏళ్లు**[1] చూ. ఏడు. వి. ఏడు, ఏడులు (బ.వ.).

<*ఏఌ్ఌు<ఏడ్(<ఏడు)+-లు.

**ఏళ్లు**[2] ఏఱు[2] యొక్క బ.వ. వి. బ.వ. నదులు.

<ఏఱులు<ఏఱు[2]+-లు.

**ఏవ** రూ. ఏవము. వి. 1. నీచత్వం. భార.విరా. 1.197 ; 2. జుగుప్స, రోత. బసవ. 6.32 పం, ఆము. 1.14 ; 3. రోషం, మాత్సర్యం. విజయ. 3.152, ఆం.భా. 3.46 ; 4. అవధానం, ఎచ్చరిక. ఏకాగ్రత. సారంగ. 1.78, ఆం.భా. 1.138 ; 5. పాపం, నేరం.

క. ఏవ. అనిష్టం, అసహ్యం, ద్వేషం, వికృతత్వం, జుగుప్స, అసహ్యమైనది, శోచనీయమైనది, హేవ. రోత. పో.చూ. త. ఏవమ్. తప్పు, కళంకం ; పో.చూ. అర. హేవ. కోరిక ; పో.చూ. మ. హేవ. బలవత్తరమైన కోరిక ; పో.చూ. సం. హేవాక. బలవత్తరమైన కోరిక. ఇది అరబ్బీనుంచి వచ్చిందనీ, దీన్ని కల్హణ, బిల్హణాది ఆధునికులు ప్రయోగించారనీ ఆప్టే.

బహుశః <క. హేవ. తెలుగు కన్నడాల్లో ఇది క్రియా విశేష్యరూపాల్లో ప్రయుక్తం. కిట్టెల్ దీన్ని దేశ్యంగా భావించాడు.

**ఏవకాఁడు** వి. నీచుడు. భా.రా. 6.2253. **ఏవగించు** రూ. ఆవగించు[2]. అ.క్రి. 1. రోయు, అసహ్యపడు. భార.ఆది. 7.256 ; 2. రోషించు, కోపించు. భార.కర్ణ. 2.318 ; న.క్రి. 1. తిరస్కరించు, తెగడు. హరిశ్చ. 4.229. కావ్యాను. 2.91, సరస. 1.11 ; 2. పరిహరించు, విడుచు. వసు. 1.130. పో.చూ. క. హేవరిసు. అసహ్యపడు, వెనుకాడు, వెనుదీయు. **ఏవగింపక** క్రి.విశ. అనిష్టంగానీ ద్వేషంగానీ లేక, భార.ఆది. 2.258. **ఏవగింపదయ్యె(న్)** న.క్రి. అసహ్యించుకోలేదు. భార.ఆది. 7.226. **ఏవగింపు** (<ఏవగించు). వి. 1. నింద, అపవాదు. ఆం.భా. 1.115 ; 2. రోత, ద్వేషం. **ఏవపడు** న.క్రి. 1. రోయు, ద్వేషించు. భార.ఉద్యో. 2.216, ఆను, 3.32 ; 2. విసుగుచెందు ; 3. నిందించు, తిట్టు, ఆరోపించు ; 4. విడుచు, త్యజించు.

**ఏవకాఁడు** చూ. ఏవ.

**ఏవగించు** చూ. ఏవ.

**ఏవగింపక** చూ. ఏవగింపు.

**ఏవగింపదయ్యె(న్)** చూ. ఏవగింపు.

**ఏవగింపు** చూ. ఏవ.

**ఏవపడు** చూ. ఏవ.

**ఏవము** రూ.చూ. ఏవ. విశ. 1. నీచం. భార.విరా. 1.197 ; 2. రోత కలిగించునది, అసహ్యమైనది. భార.విరా. 2.49; వి. 1. జుగుప్స, రోత. బసవ. 7.32. పం ; 2. హేయవృత్తి. ఆము. 6.55.

**ఏవల** రూ. ఎవల, ఎవ్వల. వి. ఏవైపు ? ఏప్రక్క ? భార. భీష్మ. 1.81, దశకు. 9.7.

<ఏ+వలను.

**ఏవాఁడు** రూ.చూ. ఎవ్వాఁడు. సర్వ. 1. ఎవడు. ఆము. 4.67 ; 2. ప్రతివాడు.

<ఏ+వాఁడు.

**ఏవి** రూ. ఏవి, ఎవ్వి. సర్వ. యచ్ఛబ్దార్థకం. బ.వ. జడవాచకం, ఏయది.

ఏవో సర్వ. ఏవోకొన్ని, ఏవైనా.

**ఏవిరేజి** వి. సరాసరి.

ఇం. *Average*. సరాసరి.

<ఇం. Average.

**ఏవురు** రూ.చూ. ఏగురు. వి. ఐదుగురు. భార.ఆది. 6.237.

క. అయ్వర్, ఆయ్వరు, అయ్బరు. ఐదుగురు. తు. అయ్యొరు. ఐదుగురు ; త. అయ్వర్ ; పర్జి. వేవిర్. ఐదుగురు.

**ఏవో** చూ. ఏవి.

**ఏన**[1] రూ.చూ. ఎస[1]. పో.చూ. ఎసరు. వి. అధికం, అత్యంతం.

**ఏసరేఁగు** రూ.చూ. ఎసరేఁగు. అ.క్రి. 1. చెలరేగు, విజృంభించు. పరమవి. 2.136 ; 2. అతిశయించు. పాండు. 4.78. **ఏసరేయు** అ.క్రి. చెలరేగు, విజృంభించు. హర. 2.20.

**ఏన**[2] రూ.చూ. ఏచ. విశ. 1. అల్పం. శృం.నై. 1.82 ; 2. వక్రం, విషమం. షను. 2.11 ; 3. వికృత స్వరంగల

(మాట), వికృతోచ్చారణ. చంద్రా. 2.39 ; 4. వంపు ; 5. బండపరువు రాళ్ళమధ్య ఐమూలగా వచ్చే సందు ; 6. పైత్యం.

ఏవమాటలు వి. గ్రామ్యపు మాటలు. ఏసగింపు చూ. ఏన[1]. వి. అపవాదం, అతిసంభాషణ. ఏసట వి. స్నేహం. భక్తి.

**ఏవమాటలు** చూ. ఏన[2].

**ఏవరించు** చూ. ఏసరు.

**ఏవరు** రూ. ఎసరు[1]. పో.చూ. ఎసగు. అ.క్రి. మీరు, అతిశయించు. రుక్మా. 4.39.

తు. ఐయకుని. తగినంత ; పో.చూ. క. ఏ. అతిశయం, అధికం, దొంతి, పైచూపు, గర్వం, అహంకారం. ఏన్తు(ఏన్తి-). పైకిలేచు, ప్రాముఖ్యం, శ్రేష్ఠం ; పో.చూ. మ. ఏంతక. అతిశయించు ; పో.చూ. మాల్తో. ఐతె. గింజపలె పొడుచుకొనివచ్చు. ఇల్‌గె, ఐతె. పొడగబడు.

< మూ.ద్రా. ఏద్(ఉ)+అర్.

**ఏవరించు** అ.క్రి. మీరు, అతిశయించు. నవనాథ. 1.46 వ. 23 పం.

ఏసరేగు చూ. ఏన[1].

ఏసరేయు చూ. ఏన[1].

-ఏసి ప్రత్య. 1. వంతున (ఐన్నేసి). భార.ఉద్యో. 3.317, అప్ప. 3.220 ; 2. ప్రమాణాన్ని. పరిమాణాన్ని, సామ్యాన్ని తెలిపే అంతప్రత్యయం. భార. 5.395.

ఇది వేయు ధాతుక్త్వార్థక రూపమైన 'వేసి'నుండి వచ్చినట్లు బ్రౌన్. చేయు క్త్వార్థకమైన చేసి నుండి సాధించడం మేలు. నాలుగు+చేసి>నాలుగుసేసి>నాలుగేసి (వ్య. నాలుగుచేసి).

ఏసు రూ. ఏసె. వి. పీచు, పోగు.

ఏసె రూ.చూ. ఏసు. వి. 1. నార, పత్తి : 2. గడ్డిపోచ, చీపురుపుల్ల.

ఏహ్యము విశ. ఏవం, రోత పుట్టించేది. నవనాథ. 4.187. 10 పం. చారు 9.

సం. ఐహిక. లౌకికం, అశాశ్వతం ; ప్రా. ఏహిఅ. < *ఏహియ < ప్రా. ఎహిల.



**ఐ[1]** వి. తెలుగు వర్ణమాలలోని తొమ్మిదో అక్షరం. ద్రావిడ భాషల్లో 'ఐ' వర్ణంగా లేదు. సంస్కృతంలో 'అ,' 'ఇ' లు కలిసి ఏర్పడ్డ సంధ్యక్షరం ప్రసిద్ధంగా ఉంది. తత్సామ్యం వల్ల తెలుగు మొదలైన ద్రావిడ భాషల్లో దీన్ని వర్ణంగా గ్రహించారు. కాని ధ్వని శాస్త్రజ్ఞులు దీన్ని 'అయ్' గా గ్రహిస్తారు.

< మూ.ద్రా. *అయ్.

**ఐ[2]** రూ.చూ. అయి. అవ్య. 1. అగు ధాతువు యొక్క క్త్వార్థక రూపం : 2. చతుర్థీ విభక్త్యర్థకాలైన 'కి,' 'కు' లు చివర గల పదాలకు అనుప్రయుక్తం. భార. ద్రోణ. 5.250, శాంతి. 1.209, పాండు. 3.21 ; 3. స్వయంగా, తనంతట తాను ఇత్యాది అర్థబోధకం. భార. అను. 2.301.

ఐకోలు వి. ఒప్పుకోలు.

**ఐకోలు** చూ. ఐ[2].

**ఐతి** విశ. 1. ఉచితం ; 2. శక్యం, సాధ్యం.

**ఐద** రూ.చూ. అయిద. క్రి.విశ. వెంబడి, వెనుక. ఆం.భా. 3.73.

ఐదవెట్టు అ.క్రి. 1. వెంబడిపోవు. బసవ. 6.576 వ. < ఐద+పెట్టు.

**ఐదవ** చూ. ఐదు.

**ఐదవెట్టు** చూ. ఐద.

**ఐదార** రూ.చూ. అయిదార. వి. అగ్ని.

**ఐదు** రూ. అయిదు. ఏను[2]. వి. అయిదు. భార. శాంతి. 4.222, భాగ. 10 పూ. 1530.

క. అయ్, అయ్దు ; కొడ. అంజి ; తు. ఐ, ఐను ; త. ఐన్తు, అంచు ; మ. అంచు, ఐ ; కోట. అన్జ్ ; తొద. ఉజ్ ; గోం. పైయుంగ్, సెలిర్. అయిదుగురు ; కుఇ. సింగి. అయిదు ; పర్జి. చేందు. అయిదు వస్తువులు ; చేందుక్, వెందు. అయిదు, చెవిర్. అయిదుగురు ; కొలా. అర్థయ్. అయిదు ; నాయ. ఐద్, సెగుర్. అయిదుగురు, చెవ్వుర్.

< మూ.ద్రా. *చయ్న్తు.

ఐదవ విశ. పంచమ. ఐదుకైదువులజంత రూ. అయిదు కైదువుల జంత. వి. అయిదు బాణాలు కలవాడు, మన్మథుడు. ఐదుగురు రూ. అయిదుగురు. వి. అయిదు మంది. ఐదుతెగలచూపుజోదు. వి. మన్మథుడు. వేంక. అం. 1.10. ఐదుదాయులు రూ. అయిదుదాయులు, ఐద్దాయులు. వి. అయిదు విధాలయిన దాయల మీద చేసే పనులు. వజ్రం, కమ్మరం, కంచరం, అగసాలెపని, కాసెపని, అనే పంచ శిల్పాలు. పో.చూ. సం. పంచాణము. ఐదు పదిగావించు రూ. అయిదు పదిగావించు. స.క్రి. అయిదును నరికి పదిగాచేయు. ఖండించు. వరాహ. 2.29. ఐదు పదిసేయు రూ. అయిదు పదిసేయు. చూ. ఐదు పదిగావించు (రెండు చేతులు జోడించు). అ.క్రి. 1. అంజలి చేయు, నమస్కరించు. కళా. 8.100 ; 2. (రెండు కాళ్ల

వేట్ల కలుష). వెనుకంజవేయు, వెనుదీయు. ఆం. శే. 12. <ఐదుపది+చేయు. ఐదుమంది వి. అయిదుగురు. ఐదుమోములవేల్పు రూ. అయిదుమోములవేల్పు. వి. అయిదు ముఖాలు కలిగిన దేవుడు. శివుడు. క. ఐమొగ; త. ఐమ్ముకన్, ఐన్దుముకత్తోన్. ఐద్దాయులు రూ.చూ. ఐదు దాయులు. వి. పంచ శిల్పాలు.

**ఐదుకైదువులజంత** చూ. ఐదు.

**ఐదుగురు** చూ. ఐదు.

**ఐదుతెగలచూపుజోదు** చూ. ఐదు.

**ఐదుదాయులు** చూ. ఐదు.

**ఐదుపదిగావించు** చూ. ఐదు.

**ఐదుపదిసేయు** చూ. ఐదు.

**ఐదుమంది** చూ. ఐదు.

**ఐదుమోములవేల్పు** చూ. ఐదు.

**ఐదువ** రూ.చూ. అయిదువ. వి. సువాసిని, పతివత్ని. మను 5.51, ఆం.భా. 2.107.

ఐదువతనము రూ.చూ. అయిదువ తనము. వి. సువాసినీత్వం. ల.వి. 5.46. ఐదువ్రతాడు రూ.చూ. అయిదువ త్రాడు. వి. మంగళసూత్రం. వరాహ. 4.13, అచ్చరా. 2.53. ఐదువరాలు రూ.చూ. అయిదు వరాలు. వి. సౌభాగ్యవతి, వివాహిత స్త్రీ. శుక. 2.281.

**ఐదువతనము** చూ. ఐదువ.

**ఐదువ్రతాడు** చూ. ఐదువ.

**ఐదువరాలు** చూ. ఐదువ.

**ఐదోతనము** రూ. చూ. అయిదువ తనము. వి. సువాసినీత్వం.

**ఐద్దాయులు** చూ. ఐదు.

**ఐన** రూ.చూ. అయిన. విణ. **1.** అగు ధాతు భూతార్థక విశేషణం. 'ఐనపని:' **2.** చక్కని, మంచి. 'ఐన గుణములు;' **3.** ఇష్టమైన, కావలసిన. 'ఐనవాడు;' **4.** కలిగియున్న. 'తెలివైనవాడు' ప్రత్య. సంబంధ సూచకం. 'కొడుకైన రాముడు.'

ఐనవారు వి. తగినవారు, కావలసినవారు, బంధువులు.

**ఐన(న్)** రూ.చూ. అయిన(న్). క్రి.విణ. అగు ధాతువ యొక్క చేదర్థక రూపం. **1.** పూర్వోత్తర వాక్యాలకు గల వైరుధ్యాన్ని తెలుపుతుంది. భార. ఆది. 4.184; **2.** ఉత్కర్షను తెలుపుతుంది. భార. ఉద్యో. 3.360; **3.** నిర్ధారణ లేమిని తెలుపుతుంది. భార. శాంతి. 5.505; శృం.నై. 2.9; **4.** అపకర్షను హైన్యాన్ని తెలుపుతుంది. భాగ. 8.590; **5.** వికల్పాన్ని తెలుపుతుంది. 'కాని,' 'ఏని' భాగ. 10. పూ. 972; **6.** అయితే, అయినచో.

**ఐనవారు** చూ. ఐన.

**ఐనింటివారిబిడ్డ** చూ. ఐనిల్లు.

**ఐనిల్లు** రూ.చూ. అయినిల్లు. వి. **1.** కలసి వచ్చిన ఇల్లు; **2.** మంచి కుటుంబం; **3.** నట్టిల్లు, అంతర్గృహం.

ఐనింటివారిబిడ్డ వి. మంచి కుటుంబంలో పుట్టిన బిడ్డ.

**ఐందమ్** రూ.చూ. ఆముదము.

**ఐందార** రూ.చూ. అయిదార. వి. అగ్ని.

**ఐవమొక్క** వి. తెల్లకంకి వేసిన వరిమొక్క.

**ఐవు[1]** రూ. అయివు[1]. వి. గుర్తు, ఆనవాలు, జాడ.

పో.చూ. పార. ఐబత్. రహస్య స్థానం.

**ఐవు[2]** చూ. అయబు. వి. దోషం, తప్పు.

**ఐపోవు** రూ.చూ. అయిపోవు. అ.క్రి. **1.** పూర్తిఅగు; **2.** అంతమగు.

**ఐమచ్చ** వి. గుర్తు, లక్షణం, పుట్టుమచ్చ.

పో.చూ. త. ఐ. అందం, అయ్. అందంగా వుండటం.

బహుశః <త. ఐ.+మచ్చ. శుభదాయకమైన గుర్తు, పుట్టుమచ్చ.

**ఐమూల** రూ.చూ. అయిమూల. వి. రెండు దిక్కుల నడిమి దిక్కు, విదిక్కు.

ఐమూలవండ్లచట్టము వి. అయిమూలగా ఉండే పండ్లున్న చట్రం.

**ఐమూలవండ్లచట్టము** చూ. ఐమూల.

**ఐయు** రూ.చూ. అయ్యు.

**ఐర[1]** రూ.చూ. అయిర[1]. వి. నేత్రరోగ విశేషం. ఆం.భా. 2.127.

**ఐర[2]** రూ.చూ. అయిర[2]. వి. ఆర్జవం, తిన్నదనం.

ఐరకొను రూ.చూ. అయిరకొను. అ.క్రి. **1.** చక్కబడు. వేంక.పంచ. 1.99; **2.** వర్ధిల్లు, పెరుగు. వేంక.పంచ. 1.750.

**ఐరకొను** చూ. ఐర[2].

**ఐరగట్టు** రూ.చూ. అయిరగట్టు. వి. నాగలిపనిముట్టు. ఆం.భా. 2.231. సం. సైర. నాగలికి సంబంధించిన.

**ఐరాజులు** వి. చుంచెలుకలు.

పో.చూ. త. అయిర్. చమత్కారం, కపటం.

సం. ఆఖురాజ-. మూషికరాజు.

బహుశః <సం. ఆఖురాజ-.

**ఐరువు** రూ.చూ. అయిరువు. వి. అగ్ని.

**ఐరేవి** రూ. అయిరేణి. అయిరేని. పో.చూ. అరిమెన కుండ, అరివేణి. వి. చిత్రాలు వేసి, నీటితో నింపి, వివాహ వేదికమీద పెట్టేకుండలు. బచ్చెనపనిచేసిన పెండ్లి కుండలు; విజయ. వి. 3.95.

క. అయ్‌రాణి, అయ్‌రణె. వివాహ సమయంలో ఉపయోగించే చిన్న పాత్ర లేక.సచిత్రిత ఘటం. అయ్‌రాణి కుంభ; త. అరచాణి-ప్-పానై. వివాహ వేదికమీద ఒకదానిమీద ఒకటి పెట్టిన చిత్రాలుండి నీటితో నిండిన కుండలు. వీటిలో బంగారం ముక్కలు లేదా ధాన్యం వేస్తుంటారు. అరచాణి (<అరచు+అణి). రావిచెట్టుకొమ్మ, రావికొమ్మలతో కూడిన వివాహ వేదిక; మ. ఐరాణి. అరటిచెట్టు. ఐరాణికుక్కాటు-కూటు-కోటు. గ్రామం.

'ఐరిణీత్యాముమాదేవీ' అనే వివాహసమయ ప్రార్థనను బట్టి పార్వతిగాను, పసిపిల్లల్ని రక్షించేందుకు స్కందానుజ్ఞ పొందిన మాతృక గాను (చూ. ఎరిణె) గుర్తించవచ్చు.

తె. ఐరేని.<మూ.ద.ద్రా. పచ్-ఇర్-అణి; పో.చూ. త. పచుమై. అందం మొ.; క. పసుర్, హసరు. ఆకు పచ్చ. పచ్-ఇర్-అణి >*అచిరాణి >*అయిరాణి. అయ్

రాణి, అయ్‌రణె. కన్నడ పదాలు ఈ *అయిరాణినుండి వచ్చాయి.

తె. ఐరేని <*అయ్‌ర్-ఎణి. ఇక 'అరివెణి' 'అరిమెన' ఉన్నాయి.

అరివేణి <*అవిరేణి <*అయిరేణి.

'అరిమెన' అరివేణి నుంచి తరువాత ఏర్పడిన రూపం కావచ్చు.

<నం. ఐరిణీ.

**ఐరేవికడవలు** రూ. అయిరేని కడవలు. వి. బచ్చెన పని చేసిన పెండ్లికుండలు, కువచ. 170, ఆం.దా. 3.36.

**ఐరేవికుండలు** రూ. అయిరేని కుండలు.

**ఐరేవికడవలు** చూ. ఐరేని.

**ఐరేవికుండలు** చూ. ఐరేని.

**ఐలారము** రూ.చూ. అయిలారము. వి. ఒక మూలిక, ఉబ్బుల కుపయోగించే వేరు.

**ఐవచ్చు** రూ.చూ. అయివచ్చు. అ.క్రి. 1. కలిసివచ్చు, అచ్చి వచ్చు, అనుకూలమగు. ఆం.దా. 2.94.

**ఐవజు** రూ. అయివజు, ఐవాజు, ఐవేజు వి. 1. రాకట్టు, రసవాలకు ఖాటగా ఉంచు : 2. ఆస్తిపాస్తులు, వస్తువులు ; 3. నిల్వ, మడుపు, అసలు.

హిం.ఉ. ఏవజ్, వేరొకదానికి బదులుగా ఉంచినది, మారకం, పారితోషికం, బహుమానం, ప్రతీకారం, పరిహారం. ఎవజి ; మరా. ఐవజ్. ఆస్తి, సంపద ; పార. ఐవయు ; అర. ఏవజ్. మారకం.

క. ఐవజు. ఆస్తి, సంపద, ధనం, వస్తువులు ; తు. ఐవజి, ఐవెజి. ధనం, సంపద, ఆస్తి ; త. ఐవేషు. ఆస్తి, సంపద, మూలధనం, ఐవేచి, ఐవేజి.

<మరా. ఐవజ్.

**ఐవాజు** రూ.చూ. ఐవజు. వి. మారకం.

**ఐవేజు** రూ.చూ. ఐవజు.

**ఐసాపైసా** రూ. అయిసాపయిసా. వి. ఆదోయిదో, ఏదో ఒకటి.

**ఐషాన్‌మూల** చూ. ఈశానం. వి. ఈశాన్యమూల.

**ఐసు** రూ. అయిసు, ఐపుసు?. వి. మంచుగడ్డ.

ఇం. *Ice*. మంచుగడ్డ.

<ఇం. Ice.

# ఒ

**ఒ**[1] తెలుగు వర్ణమాలలో పదోవర్ణం. అర్ధసంవృతమై తాలవ్యేతరమైన ఓష్ఠ్యహ్రస్వ స్వరం. బ్రాహుఈలో తప్ప అన్ని ద్రావిడ భాషల్లోనూ ఉంది.

ద్రా. ఓ.

<మూ.ద్రా. *ఒ.

**-ఒ**[2] చూ. ఓ[2]. అవ్య. 1. అప్రాచుర్యాన్ని తెలుపుతుంది. భార. ఆది. 7.195, భీమ. 1.115 ; 2. సందేహాన్ని తెలుపుతుంది. భార. ఆది. 7.209, విరా. 1.215 ; 3. ప్రశ్నార్థకం. భార. అర. 2.98, శాంతి. 3.384 ; 4. సంభావన తెలుపుతుంది. భార. విరా. 3.295, శృం.నై. 1.52, కళా. 7.37 ; 5. ప్రార్థనాద్యర్థకం. కాశీ. 5.274 ; 6. కాక్వర్థకం. పారి. 2.25.

కాలక్రమాన ఈ ప్రత్యయం అనేకార్థాలు సంతరించుకొని వుండాలి. సందర్భాన్ని బట్టి అర్థం వస్తుంది.

**ఒక** రూ.చూ. ఒక్క. విణ. 1. ఏకార్థకం. భార. ఆది. 4.93 ; 2. ఒకానొక (అనిర్దిష్టం). భార. ఆది. 5.239 ; 3. అన్యం, వేరైనది. భార. భీష్మ. 2.365 ; 4. సామాన్యం, సాధారణం. భార. ద్రోణ. 4.147 ; 5. కొంత. శేయా. 3.237 ; 6. వాక్యాలంకారంగా ఉపయుక్తం. ఆము. 4.59 ; 7. అనిర్వాచ్యం. పారి. 1.156 ; 8. గణనీయం, ఎంచతగింది. దశా. 2.423.

**ఒకకాలమున్** ఇది ఈ అర్థంలో వ్యతిరేకార్థకంతో కూడి ఉంటుంది. అవ్య. ఏకాలమందూ, ఎప్పుడూ. భార. ద్రోణ. 3.117. **ఒకకుత్తుకగు** అ.క్రి. ఏకగ్రీవం కలవారగు, ఒక మాట కలవారగు, ఐకమత్యం కలిగి ఉండు. హర. 2.60. <ఒక-కుత్తుక+అగు. **ఒకంట(న్)** రూ.చూ. ఒక్కట(న్). క్రి.విణ. ఒకచోట, ఒకసారి. **ఒకండ్రు** రూ.చూ. ఒక్కండ్రు. సర్వ. ఒకరు. **ఒకత** రూ.చూ. ఒక్కత. సర్వ. ఒకతె. భార. విరా. 2.256. **ఒకతడవ(న్)** క్రి.విణ. 1. ఒకప్పుడు : 2. అరుదుగా. **ఒకతి** రూ.చూ. ఒక్కత. సర్వ. ఒకతె. **ఒకతుక** రూ.చూ. ఒక్కత. సర్వ. ఒకతె. **ఒకతూరి** క్రి.విణ. ఒకసారి. **ఒకతె** రూ.చూ. ఒక్కత. సర్వ. ఒక స్త్రీ, అన్య స్త్రీ. కళా. 7.148. **ఒకతేప** క్రి.విణ. ఒకసారి. **ఒకనాఁడు** రూ.చూ. ఒక్కనాఁడు. వి. 1. ఒక రోజు, ఒకానొక రోజు ; 2. వేరొక రోజు. **ఒకనాఁడును** అవ్య. ఒక్కనాడు కూడా, ఎప్పుడూ. భార. ఆది. 4.114 (వ్యతిరేకార్థక వాక్యాల్లోనే ప్రయుక్తం). త.మ. ఒరునాళుమ్. **ఒకనిగాన్** రూ.చూ. ఒక్కనిగా(న్). క్రి.విణ. ఒకనిగా. **ఒకనొక** రూ.చూ. ఒకానొక. విణ. ఏదో ఒక. **ఒకందు(న్)** అవ్య. ఒకచోటను. రసిక. 2.67. **ఒకపరి** రూ. ఒకపారి. క్రి.విణ. ఒకసారి. **ఒకపారి** రూ.చూ. ఒకపరి. క్రి.విణ. ఒకసారి. **ఒకపూఁటకొకపూఁటకు(న్)** క్రి.విణ. పూట పూటకు, అంతకంతకు, క్రమక్రమంగా. కళా. 4.23. త. ఒరుపొఴుతు, ఒరుపొతు. ఏక కృత్తం. <ఒక పూటకు(న్)+ఒక పూటకు(న్)

ఒకపెట్టు క్రి.విశే. ఏక కాలంలో. ఒకపెట్టువ(న్) క్రి.విశే. ఏక కాలంలో. ఒకపొద్దు రూ. చూ. ఒక్క ప్రొద్దు. వి. ఏక భుక్తం. ఒకప్రొద్దు రూ. చూ. ఒక్క ప్రొద్దు. వి. ఏకభుక్తం, ఒక్కపొద్దు ఉండే ఉపవాసం, ఉపవాసం. కుచేల. 3.52. ఒకమరి క్రి.విశే. ఒకసారి. ఒకమరికొకమరి క్రి.విశే. ఒకసారి కంటె మరొకసారి, అంత కంతకు, క్రమ క్రమంగా. కాశ. 3.107. ఒకమాటు రూ.చూ. ఒక్కమాటు. క్రి.విశే. ఒకసారి. ఒకమాఱు రూ.చూ. ఒక్కమాఱు. క్రి.విశే. ఒకసారి. ఒకమొగి(న్) రూ.చూ. ఒక్క మొగి(న్). క్రి.విశే. ఏకకాలంలో. ఒకయ్యూక(న్) రూ. ఒక్క యూక(న్). ఒక్కయూఁకునన్. క్రి.విశే. ఏకకాలంలో. ఒకరిత రూ.చూ. ఒక్కరిత. సర్వ. ఒక స్త్రీ, అన్య స్త్రీ. కాశీ. 5.316. ఒకరితి రూ.చూ. ఒక్కరిత. సర్వ. ఒక స్త్రీ, అన్య స్త్రీ. ఒకరితె రూ.చూ. ఒక్కరిత. సర్వ. ఒక స్త్రీ, అన్య స్త్రీ. ఒకరు రూ.చూ. ఒక్కరు. సర్వ. ఒకడు (గౌరవ వాచకం). ఒకరుఁడు రూ.చూ. ఒక్కరుఁడు. సర్వ. **1.** అన్యుడు. భార. ఉద్యో. 2.77 ; **2.** ఒక పురుషుడు, ఒకానొకడు. ఆము. 6.3 ; **3.** ఒంటరి, ఏకాకి. విక్ర. 2.2. ఒకరులు రూ.చూ. ఒక్కరులు. సర్వ. ఒక పురుషుడు, ఒక స్త్రీ. ఒకరువుఁడు రూ.చూ. ఒక్కరుఁడు. సర్వ. అన్యుడు, ఒకానొకడు. ఒకరువులు రూ.చూ. ఒక్కరువులు. సర్వ. ఒక పురుషుడు, ఒక స్త్రీ. ఒకర్త రూ.చూ. ఒక్కరిత. సర్వ. ఒక స్త్రీ, అన్య స్త్రీ. ఒకర్తి రూ.చూ. ఒక్కరిత. సర్వ. ఒక స్త్రీ, అన్య స్త్రీ. ఒకర్తు రూ.చూ. ఒక్కరిత. సర్వ. ఒక స్త్రీ, అన్య స్త్రీ. ఉ.రా. 3.215. ఒకర్తుక రూ.చూ. ఒక్కరిత. సర్వ. ఒక స్త్రీ, అన్య స్త్రీ. ఒకర్తె రూ.చూ. ఒక్కరిత. సర్వ. ఒక స్త్రీ, అన్య స్త్రీ. దశా. 3.144. ఒకళులు రూ.చూ. ఒక్కరులు. సర్వ. ఒక పురుషుడు, ఒక స్త్రీ. ఒకళ్లు రూ.చూ. ఒక్కరులు. సర్వ. ఒక పురుషుడు, ఒక స్త్రీ. ఒకవిడుత క్రి.విశే. ఒకసారి. ఒకవేళ క్రి.విశే. పక్షాంతర బోధకం. త. ఒరువేళై. ఒకవేళ, బహుశః. ఒకవేళైతె అవ్య. ఒకవేళ ఇలా జరిగితే. <ఒకవేళ+ఐతె. ఒకసంకిల్లు వి. ఒకే మూల పచ్చేటట్లు కట్టిన ఇల్లు. <ఒక+సంక+ఇల్లు. ఒకసారి రూ.చూ. ఒక్కసారి. క్రి.విశే. ఒక సమయం, ఒకతడవ. ఒకానొక సర్వ. ఏదో ఒక (అనిర్దిష్టం). మను. 2.25, శుక. 1.225. పో.చూ. క. ఒందానొందు. ఒకానొక ; త. ఒంఱానొంఱు. ఒకానొకటి సర్వ. ఏదో ఒకటి. ఒకానొకఁడు సర్వ. **1.** ఎవడో ఒకడు ; **2.** ఏదో ఒకటి. పో.చూ. క. ఒబ్బానొబ్బ. ఎవరో ఒకడు; పో.చూ. తు. ఒర్యానొర్యె. ఒకానొకత సర్వ. ఎవతో ఒకతె. ఒకానొకప్పుడు వి. ఒకానొక సమయం. ఒకింత రూ.చూ. ఒక్కింత. విశే. **1.** కొంచెం. భార.విరా. 5.141 ; **2.** అంత, అంత కొంచెం.

ఒకకాలమున్ చూ. ఒక.

ఒకకుత్తుకగు చూ. ఒక.

ఒకట(న్) రూ.చూ. ఒక్కట(న్). అవ్య. ఏకకాలంలో, ఒక్క మారుగా. హరి.ఉ. 1.120, భార.ఆర. 3.290.

ఒకటవ చూ. ఒకటి.

ఒకటి రూ.చూ. ఒక్కటి. సర్వ. **1.** ఏకం, ఏకత్వ సంఖ్యాకం. భార. ఆర. 4.98 ; **2.** ఒక సంగతి, ఒక విషయం. ఆము. 6.77, కళా. 7.6 ; **3.** అన్యం, భిన్నం, వేరు. సారంగ చ. 2.109 ; **4.** సమానం.

ఒకటవ క్రి. విశే. మొదటి. ఒకటికి క్రి. విశే. మూత్ర విసర్జనకు. హంస. 3.142. పో.చూ. త. ఒన్ఱు. ఒకటిగా(న్) క్రి. విశే. కలిసికట్టుగా. <ఒకటి+కాన్. ఒకటిచేయు రూ. చూ. ఒక్కటిచేయు. స.క్రి. ఏకంచేయు, కలుపు. ఒకటిన్నర సర్వ. ఒకటిపైన సగం. ఒకటి(న్)పాతిక రూ. ఒకటింబాతిక. సర్వ. ఒకటిపైన నాలుగోవంతు. ఒకటింబాతిక రూ.చూ. ఒకటి(న్)పాతిక. సర్వ. ఒకటిపైన నాలుగోవంతు. ఒకటియగు అ.క్రి. **1.** అన్యథాయగు. భార.ద్రోణ. 3.287 ; **2.** కలియు ; **3.** సంగమించు. త. ఒన్ఱాకు, ఒన్ఱా. కలియు. <ఒకటి+అగు. ఒకటే అవ్య. **1.** ఒక్కటే (ఏవార్థకం) ; **2.** అంతా అదే. ఒకటొకటిగా(న్) క్రి. విశే. ప్రత్యేకంగా, ఒకదానితర్వాత ఒకటిగా. < ఒకటి + ఒకటి + కాన్ ఒకటో విశే. మొదటి.<ఒకటవ.<ఒకటి+అవ.

ఒకటికి చూ. ఒకటి.

ఒకటిగా(న్) చూ. ఒకటి.

ఒకటిచేయు చూ. ఒకటి.

ఒకటిన్నర చూ. ఒకటి.

ఒకటి(న్)పాతిక చూ. ఒకటి.

ఒకటింబాతిక చూ. ఒకటి.

ఒకటియగు చూ. ఒకటి.

ఒకటే చూ. ఒకటి.

ఒకటొకటిగా(న్) చూ. ఒకటి.

ఒకటో చూ. ఒకటి.

ఒకంట(న్) చూ. ఒక.

ఒకంద్రు చూ. ఒక.

ఒకఁడు రూ.చూ. ఒక్కఁడు. సర్వ. **1.** ఒకటి, ఒకపని. భార. ఆది. 4.220 ; **2.** ఏకీభూతుడు, కలిసినవాడు. హర. 1.21 ; **3.** ఒక పురుషుడు, ఏకాకి, ఒంటరి. కవిక. పీఠి. 20 ; **4.** అన్యుడు.

ఒకఁడొకఁడు సర్వ. ఒకరితర్వాత ఒకరు.

ఒకఁడొకఁడు చూ. ఒకఁడు.

ఒకత చూ. ఒక.

ఒకతడవ(న్) చూ. ఒక.

ఒకతి చూ. ఒక.

ఒకతుక చూ. ఒక.

ఒకతూరి చూ. ఒక.

ఒకతె చూ. ఒక.

ఒకతేప చూ. ఒక.

ఒకవాఁడు చూ. ఒక.

ఒకనాఁడుమ చూ. ఒక.

ఒకనిగా(న్) చూ. ఒక.

ఒకనొక చూ. ఒక.

ఒకందున్ చూ. ఒక.

ఒకవరి చూ. ఒక.

ఒకపారి చూ. ఒక.
ఒకపూఁటకొకపూఁటకు చూ. ఒక.
ఒకపెట్టు చూ. ఒక.
ఒకపెట్టున(న్) చూ. ఒక.
ఒకపొద్దు చూ. ఒక.
ఒకప్రొద్దు చూ. ఒక.
ఒకమరి చూ. ఒక.
ఒకమరికొకమరి చూ. ఒక.
ఒకమాటు చూ. ఒక.
ఒకమాఱు చూ. ఒక.
ఒకమొగి(న్) చూ. ఒక.
ఒకయొక(న్) చూ. ఒక.
ఒకరిత చూ. ఒక.
ఒకరితి చూ. ఒక.
ఒకరితె చూ. ఒక.
ఒకరు చూ. ఒక.
ఒకరుఁడు చూ. ఒక.
ఒకరులు చూ. ఒక.
ఒకరువుఁడు చూ. ఒక.
ఒకరువులు చూ. ఒక.
ఒకర్త చూ. ఒక.
ఒకర్తి చూ. ఒక.
ఒకర్తు చూ. ఒక.
ఒకర్తుక చూ. ఒక.
ఒకర్తె చూ. ఒక.
ఒకళులు చూ. ఒక.
ఒకళ్లు చూ. ఒక.

ఒకళ్లొకళ్లు రూ. ఒకరొకరు. సర్వ. ఒక్కొక్కరు, ఒకరి తర్వాత మరొకరు. భార. ఆది. 5.248. పో.చూ. క. ఒబ్బొబ్బరు. పరస్పరం, ప్రతిఒక్కరు; తు. ఒర్ యొరయె. ప్రతిఒక్కరు.

ఒకళ్లొకళ్లు చూ. ఒకళ్ళు.
ఒకవిడుత చూ. ఒక.
ఒకవేళ చూ. ఒక.
ఒకవేళైతె చూ. ఒక.
ఒకసంకిల్లు చూ. ఒక.
ఒకసారి చూ. ఒక.
ఒకానొక చూ. ఒక.
ఒకానొకటి చూ. ఒక.
ఒకానొకఁడు చూ. ఒక.
ఒకానొకత చూ. ఒక.
ఒకానొకప్పుడు చూ. ఒక.
ఒకారు వి. ఒకరకం చిన్నతొట్టి.
ఒకాలతు రూ.చూ. వకాలతు. వి. న్యాయవాది చేసే పని. అభిభాషణం.
ఒకింత చూ. ఒక.
ఒకీలు రూ.చూ. వకీలు. వి. 1. ప్రతినిధి; 2. న్యాయవాది.
ఒకొ[1] రూ.చూ. ఒక్క. విశ. ఒక.
ఒకొ[2] రూ.చూ. ఒక్కొ[2]. అవ్య. 1. ప్రశ్నార్థకం. మార్కం. 3.69; 2. ఏమో. కాబోలు. ఊహను తెలుపుతుంది. ఆము. 3.50; 3. కార్యార్థకం. ఆము. 6.58; 4. సందేహ సూచకం. దాశ.క్రోడ. 2.29.
ఒకొట(న్) రూ.చూ. ఒక్కట(న్). క్రి.విశ. 1. ఒకే సమయంలో; 2. కలిసి; 3. ఒకేచోట; 4. అకస్మాత్తుగా.
ఒకొటి రూ.చూ. ఒక్కటి. సర్వ. ఒకటి.
ఒకొంద్రు రూ.చూ. ఒక్కంద్రు. సర్వ. ఒకరు.
ఒకొఁడు రూ.చూ. ఒక్కఁడు. సర్వ. 1. ఒకటి. భార.ఆది. 1.37; 2. మరొక వ్యక్తి. భార.అర. 4.61; 3. ఒక పురుషుడు.
ఒకొత రూ.చూ. ఒక్కత. సర్వ. ఒక స్త్రీ. అన్యస్త్రీ.
ఒకొతి రూ.చూ. ఒక్కత. సర్వ. ఒక స్త్రీ. అన్యస్త్రీ.
ఒకొతుక రూ.చూ. ఒక్కత. సర్వ. ఒక స్త్రీ, అన్యస్త్రీ.
ఒకొతె రూ.చూ. ఒక్కతె. సర్వ. ఒక స్త్రీ. అన్యస్త్రీ.
ఒకొరిత రూ.చూ. ఒక్కరిత. సర్వ. ఒక స్త్రీ, అన్యస్త్రీ.
ఒకొరితి రూ.చూ. ఒక్కరిత. సర్వ. ఒక స్త్రీ. అన్యస్త్రీ.
ఒకొరితె రూ.చూ. ఒక్కరిత. సర్వ. ఒక స్త్రీ, అన్యస్త్రీ.
ఒకొరు రూ.చూ. ఒక్కరు. సర్వ. ఒక పురుషుడు, ఎవరో ఒకరు.
ఒకొరుఁడు రూ.చూ. ఒక్కరుఁడు. సర్వ. 1. ఒక పురుషుడు; 2. ఎవడో ఒకడు.
ఒకొరులు రూ.చూ. ఒక్కరులు. సర్వ. ఒక పురుషుడు, ఒక స్త్రీ.
ఒకొరువుఁడు రూ.చూ. ఒక్కరుఁడు. సర్వ. 1. ఒక పురుషుడు; 2. ఎవరో ఒకరు.
ఒకొరువులు రూ.చూ. ఒక్కరువులు. సర్వ. ఒక పురుషుడు, ఒక స్త్రీ.
ఒకొర్త రూ.చూ. ఒక్కరిత. సర్వ. ఒక స్త్రీ.
ఒకొర్తి రూ.చూ. ఒక్కరిత. సర్వ. ఒక స్త్రీ, అన్యస్త్రీ.
ఒకొర్తు రూ.చూ. ఒక్కరిత. సర్వ. ఒక స్త్రీ, అన్యస్త్రీ.
ఒకొర్తుక రూ.చూ. ఒక్కరిత. సర్వ. ఒక స్త్రీ, అన్యస్త్రీ.
ఒకొర్తె రూ.చూ. ఒక్కరిత. సర్వ. ఒక స్త్రీ, అన్యస్త్రీ.
ఒకొళులు రూ.చూ. ఒక్కరులు. సర్వ. ఒక పురుషుడు, ఒక స్త్రీ.
ఒకొళ్లు రూ.చూ. ఒక్కరులు. సర్వ. ఒక పురుషుడు, ఒక స్త్రీ.
ఒకో[1] రూ.చూ. ఒక్కొ[1]. సర్వ. ఒకటి.
ఒకో[2] రూ.చూ. ఒక్కొ[2]. అవ్య. 1. ఏమో. కాబోలు. భార. ఆది. 6.29, ఆము. 3.50; 2. సందేహ సూచకం. భార. ఆది. 3.343; 3. ప్రశ్నార్థకం. భార.అర. 3.366, మార్కం. 3.26.

ఒక్క రూ. ఒక, ఒకొ[1], ఒక్కొ[1], ఓ[3]. చూ. ఒరు. విశ. 1. ఏకీభూతం. భార.ఆది. 2.15; 2. ఏకార్థకం. భార.ఆది. 3.19; 3. అన్యం. భార.ఆది. 7.101; 4. అనిర్దిష్టం. ఒకానొక. భార.ఆది. 3.138, కళా. 3.82; 5. అనిర్వాచ్యం. భార.అర. 1.177, శుక. 1.160.

మ. ఒక్క. మొత్తం, అంతా, కలిసి; పర్జి. ఒక్. ఒక; ఒల్లా. ఒక్; కొ. ఒక్; నా. ఒక్.

<మూ.ద్రా. *ఒక్/*ఒట్-.

ఒక్కటి రూ. ఒకటి, ఒకొటి, ఒక్కొటి. చూ. ఒక్క. సర్వ. 1. ఏకం, ఒకటి. భార.ఆది. 5.48; 2. అభిన్నం,

ఏకీభూతం. భార.ఆర. 7.251, భీష్మ. 1.51 ; **3.** అన్యం, వేరు. సారంగ.చ. 2.109 ; విశ. నిర్వికారమైనది. భోజ. 6.62. **ఒక్కటిచేయు** రూ. ఒకటిచేయు. స.క్రి. ఏకంచేయు, కలుపు. రం.రా.ఉ. 63, సీతా. 3.39. **ఒక్కటీఁడు** వి. ఒక పురుషుడు, ఏకాకి. **ఒక్కం(డ్రు** రూ. ఒకం(డ్రు, ఒకొం(డ్రు, ఒకొ్కం(డ్రు. సర్వ. ఒకడు. **ఒక్కఁడు** రూ. ఒకఁడు, ఒకొఁడు, ఒకొ్కఁడు. సర్వ. **1.** అభిన్నం, ఏకీభూతం, సమానం. భార.ఆది. 6.297, మానవ. 80 ; **2.** ఒకటి. భార.సభా. 2.41 ; **3.** ఒక పురుషుడు. భార.ఆర. 3.275 ; **4.** ఒకానొకడు. ఆము. 5.129 ; **5.** అన్యుడు. కళా. 3.140 ; **6.** ఒకటి. పో.చూ. గోం. ఓకో. ఓకోవే. ప్రతి ఒక్క ; పర్జి. ఒక్క్. ఒకుత్. ఒకటి ; కొలా. ఒక్కొద్. ఒక వస్తువు ; ఒక్కొన్. ఒక మనిషి ; నా. ఒక్కొద్ ; ఒక్కొన్. ఒల్లా. ఉకుట్, ఒకుట్. ఒక స్త్రీ ; ఉకుర్. ఒక పురుషుడు. **ఒక్కఁడొకఁడు** రూ. ఒకఁడొకఁడు. సర్వ. ఒకరితర్వాత ఒకరు. పో.చూ. క. ఒబ్బొబ్బర్. పరస్పరం, అందరు, ఒక్కొక్కరు, ఒకరితర్వాత ఒకరు ; త. ఒవ్వొరువన్-అయ్. ఒకరితర్వాత ఒకరు. **ఒక్కత** రూ. ఒకత, ఒకతి, ఒకతుక, ఒకతె, ఒకొత, ఒకొతి, ఒకొతుక, ఒకొతె, ఒక్కతి, ఒక్కతుక, ఒక్కతె, ఒక్కొత, ఒక్కొతి, ఒక్కొతుక, ఒక్కొతె. సర్వ. ఒక స్త్రీ, అన్యస్త్రీ. భార.ఆది. 7.21. <ఒక్క+-త (స్త్రీ ప్రత్యయం) **ఒక్కతి** రూ.చూ. ఒక్కత. సర్వ. ఒక స్త్రీ. భార.ఆది. 7.251. **ఒక్కతుక** రూ.చూ. ఒక్కత. సర్వ. ఒక స్త్రీ. **ఒక్కతూకు** క్రి.విశ. ఒక్కసారిగా. **ఒక్కతె** రూ. చూ. ఒక్కత. సర్వ. **1.** ఒక స్త్రీ. భార. ఆది. 3.313 ; **2.** అన్యస్త్రీ. **ఒక్కనాఁడు** రూ. ఒకనాఁడు. వి. **1.** ఒక రోజు, ఒకానొక రోజు. ఆం.భా. 1.97 ; **2.** వేరొక రోజు. **ఒక్కంతగ(వ్)** క్రి.విశ. **1.** సమానంగా. భార.శాంతి. 5.337 ; **2.** ఏకంగా. రం.రా.ఉ. 10 పు. 12 పం. ; **3.** ఒక్కమాటుగా, యుగపదర్థకం. ఆం.భా. 3.80 ; **4.** హఠాత్తుగా : **ఒక్కపెట్ట** క్రి.విశ. ఒక్కసారిగా. నిర్వ.రా. 4.47, భార.ద్రోణ. 5.93. **ఒక్కపెట్టు** క్రి.విశ. ఒక్కసారిగా, ఒక్క దెబ్బతో. **ఒక్కపెట్టువన్** క్రి.విశ. ఒకేసారిగా. ఉ.రా. 4.327. **ఒక్కప్రొద్దు** రూ. ఒక పొద్దు, ఒక ప్రొద్దు. వి. ఏక భుక్తం. కళా. 3.37. **ఒక్కప్రొద్దువిడుచు** అ.క్రి. ఉపవసించు. **ఒక్కమాటు** రూ. ఒక మాటు. క్రి.విశ. **1.** ఒకసారి. కళా. 5.14 ; **2.** అరుదుగా ; **3.** అకస్మాత్తుగా. **ఒక్కమాఱు** రూ. ఒకమాఱు. క్రి. విశ. ఒకసారి. **ఒక్కమొగి(న్)** రూ. ఒకమొగి(న్). క్రి. విశ. ఒక్కసారిగా, ఒక్కటిగా, ఒక్కఊపున. భార.ఆది. 2.24. **ఒక్కయుమ్మడి(న్)** రూ. ఒకుక్కమ్మడి(న్). క్రి. విశ. ఏకకాలంలో, ఒక్కటిగా, ఒక్కఊపున. భార.భీష్మ. 2.131, మార్క. 6.170 <ఒక్క + ఉమ్మడి(న్). **ఒక్కయూక(న్)** రూ.చూ. ఒకయూక(న్). క్రి.విశ. ఏకకాలంలో. ఆం.భా. 3.80. **ఒక్కయూఁకునన్** రూ. చూ. ఒకయూక(న్). క్రి. విశ. ఏకకాలంలో. **ఒక్కరతె** చూ. ఒక్కొరిత. సర్వ. **1.** ఒకస్త్రీ. శ్రీరాధా. 5.215 ; **2.** అన్యస్త్రీ. **ఒక్కరిత** రూ. ఒకరిత, ఒకరితి, ఒకరితె, ఒకర్త, ఒకర్తి, ఒకర్తు, ఒకర్తుక, ఒకర్తె, ఒకొరిత, ఒకొరితి, ఒకొరితె, ఒకొర్త, ఒకొర్తి, ఒకొర్తు, ఒకొర్తుక, ఒకొర్తె, ఒక్కరతె, ఒక్కరితి, ఒక్కరితె, ఒక్కర్త, ఒక్కర్తి, ఒక్కర్తు, ఒక్కర్తుక, ఒక్కర్తె, ఒక్కొరిత, ఒక్కొరితి, ఒక్కొరితె, ఒక్కొర్త, ఒక్కొర్తి, ఒక్కొర్తు, ఒక్కొర్తుక, ఒక్కొర్తె, ఒర్త, ఒర్తి, ఒర్తు, ఒర్తుక. సర్వ. ఒకస్త్రీ, అన్యస్త్రీ. ఉ.రా. 5.241. **ఒక్కరితి** రూ.చూ. ఒక్కరిత. సర్వ. ఒకస్త్రీ. **ఒక్కరితె** రూ.చూ. ఒక్కరిత, సర్వ. ఒకస్త్రీ. **ఒక్కరు** రూ. ఒకరు, ఒకొరు, ఒక్కొరు. భార. ఆర. 235. సర్వ. ఒకపురుషుడు, ఎవరోఒకరు. భార.ఆరణ్య. 3.364. **ఒక్కరుఁడు** రూ. ఒకరుఁడు, ఒకరువుఁడు, ఒకొరుఁడు, ఒకొరువుఁడు, ఒక్కరువుఁడు, ఒక్కొరుఁడు, ఒక్కొరువుఁడు. సర్వ. **1.** ఒకపురుషుడు. భార.సభా. 2.246, విరా. 2.257 ; **2.** ఏకాకి, ఒంటరి. భార.ఆది. 2.105, ద్రోణ. 2.133 ; **3.** అన్యుడు. మను. 6.79. **ఒక్కరులు** రూ. ఒకరులు, ఒకళులు, ఒకళ్లు, ఒకొరులు, ఒకొళులు, ఒకొళ్లు, ఒక్కళులు, ఒకళ్లు, ఒక్కొరులు, ఒక్కొళులు, ఒక్కొళ్లు. సర్వ. ఒకపురుషుడు, ఒకస్త్రీ. **ఒక్కరువుఁడు** రూ.చూ. ఒక్కరుఁడు. సర్వ. **1.** ఒకపురుషుడు ; **2.** ఒంటరి ; **3.** అన్యుడు. **ఒక్కరువులు** రూ. ఒకరువులు, ఒకొరువులు, ఒక్కొరువులు. సర్వ. ఒకపురుషుడు, ఒకస్త్రీ. **ఒక్కరూపు** వి. సమానం. భార.ఉద్యో. 1.41. **ఒక్కర్త** రూ.చూ. ఒక్కరిత. సర్వ. ఒకస్త్రీ, అన్యస్త్రీ. **ఒక్కర్తి** రూ.చూ. ఒక్కరిత. సర్వ. అన్యస్త్రీ. **ఒక్కర్తు** రూ.చూ. ఒక్కరిత. సర్వ. అన్యస్త్రీ. భార. ఆది. 2.80, విక్ర. 5.59. **ఒక్కర్తుక** రూ.చూ. ఒక్కరిత. సర్వ. అన్యస్త్రీ. యయా. 4.100. **ఒక్కర్తె** రూ.చూ. ఒక్కరిత. సర్వ. ఒకస్త్రీ. **ఒక్కళులు** రూ.చూ. ఒక్కరులు. సర్వ. ఒకపురుషుడు, ఒకస్త్రీ. **ఒక్కళ్లు** రూ.చూ. ఒక్కరులు. సర్వ. ఒకపురుషుడు, ఒకస్త్రీ. **ఒక్కసరి** రూ.చూ. ఒక్కసారి. క్రి.విశ. ఒకసారి. ఉ.రా. 5.796. **ఒక్కసారి** రూ. ఒకసారి, ఒక్కసరి. ఒక్కసారె. క్రి. విశ. ఒకసారి. ఉ.రా. 2.331. **ఒక్కసారె** రూ.చూ. ఒక్కసారి. క్రి.విశ. ఒకసారి. **ఒక్కాస్తి** విశ. ఒక్క పరిమాణం గలది. రాజవా. 2.44. <ఒక్క + ఆస్తి. **ఒక్కింత** రూ. ఒకింత. విశ. కొంచెం. భాగ. 8.90. <ఒక్క + ఇంత. **ఒక్కుమ్మడి** రూ.చూ. ఒక్కయుమ్మడి(న్). క్రి. విశ. ఏకకాలంలో. భార.ద్రోణ. 2.55. **ఒక్కూక** క్రి. విశ. ఒక్కసారిగా. **ఒక్కూకు** వి. ఒక్కసారి. **ఒక్కెడ** క్రి. విశ. ఒకసమయంలో, ఒకచోట. <ఒక్క + ఎడ[1]. **ఒక్కెత్తు** క్రి. విశ. కలిసికట్టుగా, ఒకసారిగా, ఒక ఊపున. <ఒక్క + ఎత్తు[1]. **ఒక్కెబ(వ్)** క్రి. విశ. అకస్మాత్తుగా. భార.ఆది. 5.256. వి. భయం. **ఒక్కొక్క** విశ. ఒకటి తర్వాత ఒకటి. భార.ఆది. 8.115. **ఒక్కొక్కప్పుడు** వి. అప్పుడప్పుడు. <ఒక్క + ఒక్క + అప్పుడు. **ఒక్కొక్కళ్లు** సర్వ. ఒకరి తర్వాత ఒకరు. భార.ఆర. 4.131.

**ఒక్కట(వ్)** రూ. ఒకట(న్), ఒకంట(న్), ఒకొట(న్), ఒకొ్కట. క్రి.విశ. **1.** కూడ, కలిసి. భార.ఆది. 3.37 ; **2.** ఏకత్ర, ఒకచోట. భార.ఆది. 4.28 ; **3.** ఏకకాలంలో, ఒకమారుగా. భార.ఆది. 7.5 ; **4.** అకస్మాత్తుగా.

**ఒక్కటి** చూ. ఒక్క.

**ఒక్కటిచేయు** చూ. ఒక్కటి.

**ఒక్కటిఁడు** చూ. ఒక్కటి.
**ఒక్కణ** రూ.చూ. వక్కణ. వి. వ్యాఖ్య.
**ఒక్కంత్రు** చూ. ఒక్క.
**ఒక్కఁడు** చూ. ఒక్క.
**ఒక్కఁడొకఁడు** చూ. ఒక్కడు.
**ఒక్కండ్లు** వి. పొల్లు చెరిగిన పప్పు.
క. ఒక్కు, ఒక్కల్. నూర్చు: ఒక్కణికె. మార్పిడి: పో.చూ. త. వలుక్కు. కొట్టు.
**ఒక్కండ్లుపెట్టు** స.క్రి. 1. (పప్పు) దంచు; 2. పొట్టు తొలగించు.
**ఒక్కండ్లుపెట్టు** చూ. ఒక్కండ్లు.
**ఒక్కత** చూ. ఒక్క.
**ఒక్కతి** చూ. ఒక్క.
**ఒక్కతుక** చూ. ఒక్క.
**ఒక్కతూకు** చూ. ఒక్క.
**ఒక్కతె** చూ. ఒక్క.
**ఒక్కవాఁడు** చూ. ఒక్క.
**ఒక్కంతగ(న్)** చూ. ఒక్క.
**ఒక్కపెట్ట** చూ. ఒక్క.
**ఒక్కపెట్టు** చూ. ఒక్క.
**ఒక్కపెట్టువన్** చూ. ఒక్క.
**ఒక్కప్రొద్దు** రూ. ఒక్క.
**ఒక్కప్రొద్దువిడుచు** చూ. ఒక్క.
**ఒక్కమాటు** చూ. ఒక్క.
**ఒక్కమాఱు** చూ. ఒక్క.
**ఒక్కము** చూ. ఒక్క. సర్వ. ఒకటి.
పో.చూ. త. ఒరుక్కమ్. ఏకం.
**ఒక్కమొగి(న్)** చూ. ఒక్క.
**ఒక్కయుమ్మడి(న్)** చూ. ఒక్క.
**ఒక్కయూక(న్)** చూ. ఒక్క.
**ఒక్కయూఁకువన్** చూ. ఒక్క.
**ఒక్కరతె** చూ. ఒక్క.
**ఒక్కరిత** చూ. ఒక్క.
**ఒక్కరితి** చూ. ఒక్క.
**ఒక్కరితె** చూ. ఒక్క.
**ఒక్కరు** చూ. ఒక్క.
**ఒక్కరుఁడు** చూ. ఒక్క.
**ఒక్కరులు** చూ. ఒక్క.
**ఒక్కరువుఁడు** చూ. ఒక్క.
**ఒక్కరువులు** చూ. ఒక్క.
**ఒక్కరూపు** చూ. ఒక్క.
**ఒక్కరేణి** వి. కోనేరు.
సం. పుష్కరిక. కోనేరు; ప్రా. పుక్ఖరిణీ, పొక్ఖరిణీ. కోనేరు, జలాశయం; పా, పొక్ఖరణీ. కోనేరు;
క. ఒక్కరణి, హుక్కరణి. కోనేరు.
< క. ఒక్కరణి.
**ఒక్కర్త** చూ. ఒక్క.
**ఒక్కర్తి** చూ. ఒక్క.
**ఒక్కర్తు** చూ. ఒక్క.
**ఒక్కర్తుక** చూ. ఒక్క.
**ఒక్కర్తె** చూ. ఒక్క.
**ఒక్కఱులు** చూ. ఒక్క.
**ఒక్కళ్లు** చూ. ఒక్క.
**ఒక్కసరి** చూ. ఒక్క.
**ఒక్కసారి** చూ. ఒక్క.
**ఒక్కసారె** చూ. ఒక్క.
**ఒక్కసికొక్కు** వి. బాలక్రీడా విశేషం. హంస. 3.146.
**ఒక్కాణము** రూ.చూ. వక్కాణ. వి. వ్యాఖ్యానం.
**ఒక్కాణించు** స.క్రి. వ్యాఖ్యానించు.
**ఒక్కాణించు** చూ. ఒక్కాణము.
**ఒక్కాస్తి** చూ. ఒక్క.
**ఒక్కి** చూ. వక్కి. విశే. పలచని, సన్నని, బక్కచిక్కిన.
**ఒక్కింత** చూ. ఒక్క.
**ఒక్కు** రూ.చూ. వక్కు. వి. 1. ముసలివాడు; 2. ఎండినది.
**ఒక్కుమ్మడి** చూ. ఒక్క.
**ఒక్కుల** వి. ధాన్యం కొలత.
మ. ఒర్, ఓర్. సమానం; కోట. ఒర్‌పాణి, ఒర్‌కాఖ్. కొలత; తొద. వుఅక్. కొలత;
హిం. ఆ. ఉక్తలియా, ఉక్తలీ. ఒకానొక పాత్ర.
**ఒక్కూక** చూ. ఒక్క.
**ఒక్కూకు** చూ. ఒక్క.
**ఒక్కె** రూ.చూ. ఒక్కెఱ. విశే. భయంకరం; వి. భయం.
**ఒక్కెడ** చూ. ఒక్క.
**ఒక్కెత్తు** చూ. ఒక్క.
**ఒక్కెత్తుగండడు** వి. అసహాయశూరుడు. ద. హిం. శా. సం. 4. సెం. 1158.
**ఒక్కెత్తుగండడు** చూ. ఒక్కెత్తు.
**ఒక్కెఱ(న్)** చూ. ఒక్క.
**ఒక్కొ**[1] రూ.చూ. ఒక్క. సర్వ. ఒకటి. వసు. 5.84.
**ఒక్కొ**[2] రూ. ఒకొ[2], ఒకో[2], ఒక్కో[2]. అవ్య. 1. ఊహా. సూచకం. భార. ఆది. 1.112; 2. ప్రార్థనార్థకం. భార. ఆది. 1.149; 3. సందేహ సూచకం. భార. ఆది. 8.185. మను. 2.17.
**ఒక్కొక్క** చూ. ఒక్క.
**ఒక్కొక్కఁడు** సర్వ. ఒకరి తరువాత ఒకరు.
పో.చూ. క. ఒబ్బొబ్బ, ప్రతి ఒక్కరు; ఒబ్బొబర్. పరస్పరం, అందరు, ఒకరి తర్వాత ఒకరు; పో.చూ. తు. ఒరిఒరియె; త. ఒవ్వొఒరువన్ఱయ్.
**ఒక్కొక్కప్పుడు** చూ. ఒక్క.
**ఒక్కొక్కళ్ళు** చూ. ఒక్క.
**ఒక్కొట** రూ.చూ. ఒక్కట. క్రి.విశే. 1. ఏక కాలంలో, ఒక్క మారుగా. భార. ఆది. 5.238; 2. ఏక ముఖంగా, ఒకటిగా కూడి. భార. అర. 1.305, మను. 3.72.
**ఒక్కొటి** రూ.చూ. ఒక్కటి. సర్వ. ఒకటి. భార.విరా. 2.24.
**ఒక్కొండ్రు** రూ.చూ. ఒక్కండ్రు. సర్వ. ఒకడు.
**ఒక్కొఁడు** రూ.చూ. ఒక్కఁడు. సర్వ. 1. ఒకటి. భార. శ్రీ.

1.33 ; 2. ఒక పురుషుడు. రాఘవ. 2.106.
ఒక్కొత రూ.చూ. ఒక్కత. సర్వ. ఒక స్త్రీ, అన్యస్త్రీ.
ఒక్కొతి రూ.చూ. ఒక్కత. సర్వ. ఒక స్త్రీ, అన్యస్త్రీ.
ఒక్కొతుక రూ.చూ. ఒక్కతి. సర్వ. ఒక స్త్రీ, అన్యస్త్రీ.
ఒక్కొతె రూ.చూ. ఒక్కత. సర్వ. ఒక స్త్రీ, అన్యస్త్రీ.
ఒక్కొమొగి(న్) చూ. ఒక్కమొగి(న్). క్రి.విశే. ఒక్కుమ్మడిగా.
ఒక్కొరిత రూ.చూ. ఒక్కరిత. సర్వ. ఒక స్త్రీ, అన్యస్త్రీ.
ఒక్కొరితి రూ.చూ. ఒక్కరిత. సర్వ. ఒక స్త్రీ, అన్యస్త్రీ.
ఒక్కొరితె రూ.చూ. ఒక్కరిత. సర్వ. ఒక స్త్రీ, అన్యస్త్రీ.
ఒక్కొరు రూ.చూ. ఒక్కరు. సర్వ. ఒక పురుషుడు, ఎవరో ఒకరు.
ఒక్కొరు(డు రూ.చూ. ఒక్కరు(డు. సర్వ. ఒకడు. భార. అర. 5.20.
ఒక్కొరులు రూ.చూ. ఒక్కరులు. సర్వ. ఒక పురుషుడు, ఒక స్త్రీ.
ఒక్కొరువుడు రూ.చూ. ఒక్కరుడు. సర్వ. 1. ఒక పురుషుడు ; 2. ఏకాకి ; 3. అన్యుడు.
ఒక్కొరువులు రూ.చూ. ఒక్కరువులు. సర్వ. ఒక పురుషుడు, ఒక స్త్రీ.
ఒక్కొర్త రూ.చూ. ఒక్కరిత. సర్వ. ఒక స్త్రీ, అన్యస్త్రీ.
ఒక్కొర్తి రూ.చూ. ఒక్కరిత. సర్వ. ఒక స్త్రీ, అన్యస్త్రీ.
ఒక్కొర్తు రూ.చూ. ఒక్కరిత. సర్వ. ఒక స్త్రీ, అన్యస్త్రీ.
ఒక్కొర్తుక రూ.చూ. ఒక్కరిత. సర్వ. ఒక స్త్రీ, అన్యస్త్రీ.
ఒక్కొర్తె రూ.చూ. ఒక్కరిత. సర్వ. ఒక స్త్రీ, అన్యస్త్రీ.
ఒక్కొయులు రూ.చూ. ఒక్కయులు. సర్వ. ఒక పురుషుడు, ఒక స్త్రీ.
ఒక్కొళ్లు రూ.చూ. ఒక్కరులు. సర్వ. ఒక పురుషుడు, ఒక స్త్రీ.
ఒక్కో రూ.చూ. ఒక్కో[2]. అవ్య. ఊహాది సూచనార్థకం.
ఒక్కోట అవ్య. ఒకే సమయంలో.
ఒక్కోలన రూ. ఒక్కోలనము. క్రి.విశే. ఒకే సమయంలో.
ఒక్కోలనము రూ.చూ. ఒక్కోలన. అవ్య. ఒకే సమయంలో.
ఒక్కోలు అవ్య. ఒకేసారిగా.
ఒగ విశే. ఒక.
ఒగచదము చూ. వగచు. వి. దయ.
ఒగరపుమూట రూ.చూ. ఒగరుపుమాట. వి. పొలాల్లో నూర్పిడి సమయంలో కూలి నాలి వాళ్లకు ధాన్యరూపంలో ఇచ్చే కట్టడి.
ఒగరించు చూ. ఒగరు.
ఒగరు చూ. తొగరు. వి. 1. షడ్రసాలలో ఒకటి, కషాయరసం. విక్ర.చ. 5.172 ; 2. ఒగరుకూర. దాశ. 86 ; విశే. వగరైనది, కషాయమైనది. యయా. 4.13.
క. ఒగర్, ఒగరు. వగరు ; తువర, తొవర, తొగరి, తొగఱు, తొవరు, నొగరు ; తు. ఒబరు, నొగరు. వగరు ; పో.చూ. చబఱుని ; త. ఉవర్‌ప్పు. వగరుచు; తువర్, తువర్‌ప్పు, తుక ; మ. చవర్. వగరు ; కుఇ. తొర్ప (తొర్త్-) వగరు.
< మూ.ద్రా. *తొకర్.
ఒగరించు అ.క్రి. బాధపడు. ఒగరెక్కు అ.క్రి. ఒగరగు. చి.భార. 2.100.
ఒగరుచు[1] రూ. ఒగర్చు. అ.క్రి. వగరుగా ఉండు.
త. ఉవర్, వగరు, తువర్. వగరుగా ఉండటం ; తుక. వగరు ; మ. చవరు, చవకుక్క, చవర్తు. వగరు.
ఒగరుచు[2] రూ. ఒగర్చు[2]. అ.క్రి. కష్టంమీద ఊపిరితీయు.
క. ఉగరిసు ; పో.చూ. త. ఉయిర్ ; పో.చూ. మ. ఉయిర్.
ఒగరువు రూ. ఒగర్పు, వగర్పు. చూ. ఒగరుచు[2]. వి. ఊపిరి కుట్టు, శ్వాసబంధం, ఆయాసం.
ఒగరుపుమూట రూ. ఒగరపుమాట. వి. ధాన్యం కొలగాళ్లకిచ్చే భృతి.
ఒగరెక్కు చూ. ఒగరు.
ఒగర్చు[1] రూ.చూ. ఒగరుచు[1]. అ.క్రి. ఒగరుగా ఉండు. ఆము. 2.53.
ఒగర్చు[2] చూ. ఒగరుచు[2]. అ.క్రి. కష్టంమీద ఊపిరితీయు.
క. ఉగరిసు.
ఒగర్పు రూ.చూ. ఒగరువు. వి. ఊపిరికుట్టు, ఆయాసం.
ఒగి(న్) అవ్య. 1. క్రమంగా. భార.ఆది. 4.48 ; 2. చక్కగా, తెన్నుగా. భార.సభా. 1.51 ; 3. యథాసంఖ్యంగా. మార్క. పీఠిక. 27 ; 4. వాక్యాలంకారంగా ఉపయుక్తం. వి. పు. 8.18, నీలా. 1.22.
బహుశః < ఒగ్గు. వరుసగా నిలబడు.
ఒగిదిగ చూ. ఒగి. వి. 1. కొప్పువల ; 2. జడబిళ్ళ.
ఒగుడు వి. జొన్న మొ. వాటి ఎండుటాకు. కుచేల. 2.7.
పో.చూ. క. ఒణగ. ఎండు ; సొప్పు. ఆకులు ; తొవల్, తొవలు, తొప్పలు, తప్పల. మొక్కల లేత ఆకులు, చిగుళ్లు ; సొగె, సొగు, తోకె. చెరుకు మున్నగు వాటి ఆకులు ; తు. తప్పు, సప్పు. ఆకులు ; త. ఉవల్. కొమ్మలు, రెమ్మలు, ఎండుటాకులు ; ఉవలై, తువళ్. ఎండు, వాడిపోవు ; తువళ్. మరణించు, అరటిబోదె ; ఉని. ఉడుకు, మరుగు ; మ. తోల్. పచ్చని ఆకులు, చిన్న కొమ్మలు ; తువరుక. ఎండిపోవు.
ఒగుడుకఱచు అ.క్రి. కృశించు. పో.చూ. త. తువళ్. చిక్కిపోవు, కృశించు.
ఒగుదుకఱచు చూ. ఒగుడు.
ఒగ్గట్టు వి. ఐకమత్యం, ఒక కట్టు.
క. ఒక్కట్టు. ఒక కట్టు, ఐకమత్యం ; పో.చూ. త. ఒక్కట్టు. స్త్రీలు ధరించే కంఠాభరణం.
< క. ఒక్కట్టు.
ఒగ్గటి రూ. ఒగ్గాటి, వి. తడిపి తిరగబోతపెట్టిన బొరుగులు.
క. అగ్గరణె, ఒగ్గరణె. తాలింపు, తిరగబోత ; తు. ఒగ్గరణె.
< క. ఒగ్గరణ్.
ఒగ్గము చూ. ఒగ్గు. వి. 1. తరిమెన పెట్టదగిన వస్తువును కదల కుండా ఉంచే పనిముట్టు. హరి.పూ. 1.191 ; 2. అవపాతం, ఓదం (ఏనుగు మొ. వాటిని పట్టటానికి నేల తవ్వి పైని తేలికైన కర్రలు కప్పి ఆ పైని మట్టి పరచి చదునుగా చేసిన గొయ్యి). భాగ. 1.454.

**ఒగ్గాణి** రూ.చూ. ఒగ్గణి.

**ఒగ్గాళము** విణ. మింగి బయటికి కక్కబడెడి. క్రీడా. 142.

నం. ఉద్గార-. కక్కటం, త్రేంచుట; ప్రా. ఒగ్గాలి, ఉగ్గాల. నెమరువేయటం; అమా. ఉగ్గాల; పా. ఉగ్గార. కక్కటం, ఉమ్మి వేయటం.

ప్రా. ఒగ్గాల-.

**ఒగ్గి**[1] వి. త్వరగా నెమ్ము ఆరిపోయే రేగడినేల, బెట్టనేల.

**ఒగ్గి**[2] వి. మరానుమీద పడుగు తోడేప్పుడు, అనులు పడేప్పుడు పోగును జరపటానికి ఒక కొయ్యపట్టెకు బిగించిన రేకుముక్క.

**ఒగ్గివట్టె** రూ.చూ. ఒగ్గులపట్టె.

**ఒగ్గిరివట్టె** రూ.చూ. ఒగ్గులపట్టె.

**ఒగ్గిలివట్టె** రూ.చూ. ఒగ్గులపట్టె.

**ఒగ్గిలిపెండె** వి. మరాను కట్టుబడిలో పడుగు పోగులు దూర్చే బెజ్జాలుగల రేకుముక్కలు. ఉంగరాలు బిగించిన కొయ్య పట్టె.

**ఒగ్గివాళ్లు** వి. కురమల దగ్గర డోలు కొడుతూ బీరప్పమల్లప్ప కథలు చెప్పేవాళ్లు.

**ఒగ్గీ** చూ. వంకీ. వి. 1. అడ్డుగడియ ; 2. గానుగ మొద్దుకు దూలాన్ని తగిలించటానికి ఏర్పరిచిన ఇనపవంకె.

**ఒగ్గు** స.క్రి. 1. అడ్డంగాపెట్టు, అడ్డంగాదాచు. భా.రా.యు. 711 ; 2. (వల, దోను మొ.) తరచు, ఒడ్డు, పన్ను. వి.క్ర. చ. 5.212 ; 3. పట్టు, ఘటించు. ఆము. 2.59 ; 4. (వినటానికి చెవి) ఇచ్చు. పారి. 1.83, ప్రభా. 5.41 ; 5. పందెం వేయు. కువచ. 2.45 ; 6. నిల్చు. కుచేల, 3.22 ; 7. విడిచిపెట్టు ; 8. ఏదైనా ఒక వస్తువును పనికి అనువుగా అమర్చు ; అ.క్రి. 1. వాలు, ప్రవణమగు. మను. 3.99 ; 2. సిద్ధపడు. హంస. 2.152, దశా. 8.39, పాంచాలీ. 2.49 ; 3. వశమగు, లోనగు. ఉ.రా. 4.210; 4. ఒప్పుకొను, ఇష్టపడు. శుక. 1.442 ; 5. ప్రయత్నించు; 6. లోబడు ; 7. సన్నద్ధమగు ; 8. వంగు, నమ్మించు ; 9. వ్యాపించు ; 10. చెవియొగ్గు.

క. ఒగ్గు. కలుపు (నీరు, వాతావరణం), సరిపడు ; ఒల్లు. అభిముఖమగు ; తు. ఒగ్గుణి, ఒగ్గుణు, ఒగ్గున. ఒగ్గుని. అంగీకరించు, సరిపడు ; ఒరగుని. ఒరుగు, ఆనుకొను ; ఒరగు. దిండు ; త. ఒరుంకు. కలియు, కేంద్రీకరించు ; మ. ఒక్కుక. అభిన్నమగు, కలిసియుండు, ఒప్పుకొను ; ఒరుణ్ణుక. సిద్ధపడు, లోబడు ; ఒరుక్కుక. సిద్ధపడటం ; పర్జి. ఒర్గ్. ఒరుగు, ఆనుకొను ; కురు. ఒర్- (ఒడ్-). ఒక వస్తువును స్థిరస్థితిలో ఉంచు.

<ప్రా. తె. *ఒగ్గు.

**ఒగ్గుబల్ల** రూ. ఒగ్గుబిల్ల. వి. తరిమెనపట్టే కొయ్యకు ఆధారమయిన బల్ల. **ఒగ్గుబిల్ల** రూ.చూ. ఒగ్గుబల్ల. వి. తరిమెనపట్టే కొయ్యకు ఆధారమయిన బల్ల.

**ఒగ్గుబల్ల** చూ. ఒగ్గు.

**ఒగ్గుబిల్ల** చూ. ఒగ్గు.

**ఒగ్గులపట్టె** చూ. ఒగ్గిపట్టె, ఒగ్గిరిపట్టె, ఒగ్గిలిపట్టె. వి. మరాను కట్టుబడిలో పడుగు పోగులు దూర్చె బెజ్జాలుగల రేకుముక్కలు, ఉంగరాలు బిగించిన కొయ్యపట్టె.

**ఒగ్గువాడు** వి. ఒగ్గు అనే వాయిద్యాన్ని వాయిస్తూ చిన్న మెత్తు అనే [illegible] జాతివాడు.

**ఒగ్గె** వి. 1. మంచినాన్ని పరానికి బిగించిపట్టే రేకు ; 2. బండి రొలుపును వేసిన ఇనుపకట్టు.

**ఒగ్గెర** వి. అల్లు చేసేటప్పుడు పడుగు పోగులు ఎక్కించే ఒక రకం పనిముట్టు.

**ఒగ్గేయు** స.క్రి. వదలిపెట్టు.

**ఒంక** వి. నీటి ఉసిరి (Water emblic myrobalam).

**ఒంకాయ** చూ. ఒంకియ. వి. 1. వంగలకొయ్య : 2. కొక్కెము.

**ఒంకి** చూ. వంగు. రూ.చూ. వంకి. వి. గోడలో నిలిపిన ఒంకె. చిలుకకొయ్య.

**ఒంకిరాయి** వి. పంచలుదించటానికి వీలుగా అర్ధవాసాలు వెయ్యటానికి అనువుగా ఇంటిగోడల్లో ముందుకు పొడుచుకు వచ్చేటట్టు బిగించిన రాయి.

**ఒంకియ** రూ.చూ. వంకి. వి. కొక్కెం.

**ఒంకిరాయి** చూ. ఒంకి.

**ఒంకీలు** వి. స్త్రీల వంకకడియాలు.

**ఒంకె** రూ.చూ. వంకి. వి. గోడలో బిగించబడిన ఒంకె, చిలుక కొయ్య.

**ఒంగలు** రూ.చూ. వంగలు. వి. నూర్పిళ్లకు ముందు రైతులు భూమికి చేసే అర్చన.

**ఒంగిడి** రూ.చూ. వంగుడు. వి. చిన్నచిన్న చినుకులు, తుప్పర.

**ఒంగు** రూ.చూ. వంగు. అ.క్రి. వంగు. వి. 1. బండిజల్లపైన వంపుగా వేసిన కర్ర ; 2. వంచిన వెదురుబద్ద.

**ఒంగుడుగుడిసె** చూ. ఒంగు. వి. ఎత్తు తక్కువగావుండే పొట్టి గుడిసె.

**ఒచ్చము** రూ.చూ. పొచ్చెము. వి. 1. అవమానం. హరి.ఉ. 3.105 ; 2. వ్యాజం, కపటం. నవ. 1. వు. 10, 9. వం ; 3. అపకీర్తి ; 4. లోటు, తప్పు, నైచ్యం.

**ఒచ్చమువడు** అ.క్రి. అవమానపడు. హర. 3.10.

<ఒచ్చము + పడు.

**ఒచ్చమువడు** చూ. ఒచ్చము.

**ఒచ్చింత(కూర)** రూ.చూ. ఉచ్చింత.

**ఒచ్చుబడి** రూ.చూ. వచ్చుబడి. వి. ఆదాయం.

**ఒచ్చె** వి. కట్టుబడిలో పనికిరాని చిన్న రాలిముక్క.

క. ఒచ్చయ, ఒచ్చియ, ఒచ్చి, ఒచ్చెయ. అపకీర్తి, అగౌరవం, అనౌచిత్యం ; త. ఒచ్చియమ్.

**ఒచ్చెము** పొ. చూ. పొచ్చెము. వి. 1. వ్యాజం, కపటం : కు.సం. 5.572 ; 2. అవమానం, మానహాని. భార.ఉద్యో. 3.168 ; 3. కొరత, లోపం, భంగం. కాశీ. 7.57 ; 4. తప్పు, దోషం. వి.క్ర. 1.14 ; విణ. అనుచితం. శృం. నై. 4.54.

**ఒచ్చెముపట్టు** స.క్రి. తప్పుపట్టు. అవమానపరచు. వి.క్ర. చ. 1.87.

**ఒచ్చెముపట్టు** చూ. ఒచ్చెము.

**ఒచ్చెల** రూ.చూ. ఓచెల్ల. అవ్య. ఆశ్చర్యసంతాపాది సూచకం. వి.క్ర. 1.150, భోజ. 5.53.

**ఒచ్చెల్ల** రూ.చూ. ఓచెల్ల. అవ్య. ఆశ్చర్యసంతాపాది సూచకం. భోజ. 1.182.

**ఒజ్జ** రూ. ఒఝ్ఝ, ఓజ[3], ఓజు. ఓఝ, వజ్జ. వి. 1. పురోహితుడు, ఋత్విక్కు. భార.ఆది. 2.180, విక్ర. 4.127 ; 2. గురువు, ఉపాధ్యాయుడు, ఉపాధ్యాయురాలు, ఉపాధ్యాయుని వంటి వాడు (పంతులు). భార.విరా. 2.191, మను. 3.129, శేయార. 1.36, పంచాణమువారు. పల్నా. పు. 40, 43.

సం. ఉపాధ్యాయ-. గురువు : ప్రా. ఒజ్ఝఅ, ఒజ్ఝయ, ఉఅజ్ఝాఅ, ఉజ్ఝ, ఉజ్ఝాయ, ఉజ్ఝావ, ఉవజ్ఝయ, ఉవజ్ఝాఅ, ఉవజ్ఝాయ ; అప. ఉజ్ఝా ; అ.మాగ. ఉవజ్ఝాయ ; పాలి. ఉపజ్ఝ, ఉపజ్ఝాయ. శౌ. ఉవజ్ఝాఅ.

క. ఓజ, ఓవజ, వాజ. గురువు, వ్రదంగి, కమ్మరి, కంసాలి ; త. ఉవచ్చన్-. కాళికాలయంల అర్చక మార్దంగి కుల్లో ఒక కులం, ప్రాచీన ఆరబ్ తెగవాడు ; ఓచ్చన్. పూజారికులం; ఓచన్. గురువు; ఉవైచ్చన్. కాలికాలయపు పూజారికులంవాడు ; ఉవాత్తి. అధ్యాపకుడు.

<ప్రా. ఒజ్జఅ.

**ఒజ్జతనము** రూ. ఒజ్జనము. వి. అధ్యాపకత్వం. **ఒజ్జనము** రూ.చూ. ఒజ్జతనము. వి. అధ్యాపకత్వం. కళా. 7.83. **ఒజ్జబంతి** రూ. ఓజబంతి. వి. ఒరవడి, మేలుబంతి, విద్యార్థులు చూసి రాయటానికై ఉపాధ్యాయుడు రాసే పంక్తి. పాండు. 1.20. **ఒజ్జరి** వి. పురోహితుడు, నీచబ్రాహ్మణుడు. మల్హ. 2.14. **ఒజ్జతికము** వి. అధ్యాపకత్వం. చంపూ. 3.60. **ఒజ్జలవంగనామము** వి. గురువుకు వంగనామం, అయ్యవారి తప్పులు దిద్దబోవటం మొ. చర్య. **ఒజ్జలపుచ్చకాయ** వి. గురువు తాను పుచ్చకాయ తింటూ ఇతరులు తినకూడదని చేసే ఉపదేశం. దశా. 7.1.81, కళా. 1.8, శశాం. 4.181. **ఒజ్జలపుచ్చపాదు** వి. గురువుకు పుచ్చపాదు, నేర్చిన విద్య మరచి ఎదురు తిరగటం. **ఒజ్జసాని** వి. గురుపత్ని. ద్వి. హరిశ్చ. ఉ. 1030.

**ఒజ్జతనము** చూ. ఒజ్జ.

**ఒజ్జనము** చూ. ఒజ్జ.

**ఒజ్జబంతి** చూ. ఒజ్జ.

**ఒజ్జరి** చూ. ఒజ్జ.

**ఒజ్జతికము** చూ. ఒజ్జ.

**ఒజ్జలవంగనామము** చూ. ఒజ్జ.

**ఒజ్జలపుచ్చకాయ** చూ. ఒజ్జ.

**ఒజ్జలపుచ్చపాదు** చూ. ఒజ్జ.

**ఒజ్జసాని** చూ. ఒజ్జ.

**ఒఝ్ఝ** రూ.చూ. ఒజ్జ. వి. పురోహితుడు, ఋత్విక్కు. పాంచాలీ. 4.25.

ఒఝ్ఝబ్రాహ్మణులు వి. మిథిలానగరానికి చెందిన ఒక జాతి బ్రాహ్మణులు.

**ఒఝ్ఝబ్రాహ్మణులు** చూ. ఒజ్జ.

**ఒంచి** రూ.చూ. వంచె. వి. గద్దె కోసేటప్పుడు స్త్రీలు వెనక కట్టుకునే వస్త్రవిశేషం.

**ఒంచు**[1] రూ.చూ. వంచు. అ.క్రి. వంగునట్లు చేయు.

**ఒంచు**[2] రూ.చూ. ఒంచె[1]. వి. రాశినుంచి ధాన్యాన్ని కొలిచి పోయడానికి ఇద్దరు వ్యక్తులు చెరోకొంగూ జోలెలాగా పట్టి వుంచిన వస్త్రం.

**ఒంచువాఁడు** రూ.చూ. నొంచువాఁడు. సర్వ. హంతకుడు, హింసకుడు, అనుచిత విభాగం.

**ఒంచె**[1] రూ. ఒంచు[2]. వి. 1. పట్టను జోలెలాగా మడిచి తాళ్లతో బద్దకు వేళ్లాడదీసిన సాధనం ; 2. ఎదవెట్టే మనిషి వీపుకు కట్టుకున్న విత్తనాలమూట.

**ఒంచె**[2] వి. గుట్ట, తిప్ప, తిన్నె.

**ఒంచెతట్ట** వి. దావిమీద కట్టిన అంచునుంచి కిందికి విడిచే కట్ట.

**ఒంజలి** వి. భార్యం, పని. సాం. ని. మాన. 23.

**ఒంజి** వి. చుట్ట.

**ఒంజిలి** రూ. ఒండిలి, ఒందిలి. వి. దుఃఖం ; విశే. దుఃఖం కల.

క. నో, నోయ్, నోయ్యు, నోయు. దుఃఖించు; నోయ్ పిసి. బాధపెట్టు, బాధ ; త. ఒచి. బాధపడు; నొ, నొచివు. బాధ; నొన్తు. నశించు. నొయ్మై. బీదరికం ; నో. దుఃఖం; నోవల్. జబ్బు, బాధ ; నోఞ్జల్. కృశత్వం; నోయ్. కష్టం; ఓయచ్చల్. అలసట, బలహీనత; ఉయయు. దుఃఖం; ఉయక్కం. కష్టం : ఉయఙ్కు. బాధపడు, తుయంకు. మూర్ఛిల్లు ; తుయుక్కు. దుఃఖం ; తుయరమ్. ఆపద, కష్టం ; మ. నోక. బాధపెట్టు ; గో. నొఙయానా. కొట్టు, హింసించు ; కుఇ. నోవ. బాధ ; పర్జి. నొయ్-, నొజ్-బాధించు; ఒల్లా. నొయ్. బాధించు; కొండ. పో.చూ. నొగు. జ్వరం; కొలా. ఒయ్. గాయాలు, నొప్పులు ; నా. ఒయ్. బాధ ; కుఱు. నూఙ్ను. బాధించు ; బ్రా. పో.చూ. ఉస్త్ ఖాల్ హి. కలవరపర్చే విషయం.

<మూ.ద్రా. *నోయ్-.

**ఒంజు** రూ.చూ. వంజు. వి. ఒకరకం చేప, వంజరం.

**ఒటుక్కు** వి. బెదురు, అదురు, ఉలికిపాటు.

**ఒట్టము** రూ.చూ. వట్టము. వి. 1. నష్టం, తక్కువ ; 2. చిల్లర తీసుకునేటప్పుడు ఇచ్చే కమీషను.

**ఒట్టారము** రూ.చూ. వట్టము. వి. దండుగ, వ్యర్థం.

**ఒట్టి**[1] రూ.చూ. వట్టి. విశే. రిక్తం, ఏమీలేని.

ఒట్టికట్కం వి. అదును లేకుండా కేవలం రాతిమీద రాయి పేర్చి కట్టటం. ఒట్టికలప వి. పల్చగా మెత్తగా ఉన్న అదును. ఒట్టిచెక్క వి. నేలమీద గచ్చు చేసేటప్పుడు చదును చెయ్యడానికి వాడిన పొడిగా వున్న కొయ్యతాపీ. ఒట్టిపోవు అ.క్రి. పాడిపశువు పాలివ్వటం ఆగిపోవు, ఎండిపోవు. ఒట్టిమాటలు వి. ఏమీ ప్రయోజనం లేనిమాటలు, పనికిమాలిన మాటలు. ఒట్టిరాతి వి. సున్నంగానీ అదును గానీ అతకని రాయి.

**ఒట్టి**[2] వి. వరదల్లో కొట్టుకొచ్చిన మెత్తటి మన్ను.

**ఒట్టికట్కం** చూ. ఒట్టి[1].

**ఒట్టికలప** చూ. ఒట్టి[1].

**ఒట్టిచెక్క** చూ. ఒట్టి[1].

**ఒట్టిపోవు** చూ. ఒట్టి[1].

**ఒట్టిమాటలు** చూ. ఒట్టి[1].

**ఒట్టియ** రూ. ఒంటియ, ఒంటె. వి. లొట్టిపిట్ట, ఉష్ట్రం. కు.సం. 8.160.

సం. ఓష్ఠ-. ఒంటె. మన్న: ఔష్ట్రక. ఔష్ట్రిక. ఉష్ట్ర సంబంధి; ఔష్ట్ర. ఒంటెలజాతి; ప్రా. ఒట్టియ, ఉట్టియ, ఉట్ట. ఒంటె; అమాగ. ఉట్ట. ఒంటె; ఉట్టీ. ఒంటెలతో ఆడుది; ఉట్టియ. ఒంటె వెంట్రుకలతో తయారైన కంబళి; ఉట్టియ. ఒంటె మెదవంటి మూలిక కలిగిన కాంతం; ఉంట్ట. ఒంటె. పా. ఒట్ఠ. ఒంటె; హిం.మరా. ఊంట్. ఒంటె.

క. ఒట్టె, ఒంటె. ఒంటె; త. ఒత్తిరి, ఒట్టకం, ఒట్టమ్, ఒట్టై; మ. ఒట్టకం, ఒట్ట; కు. కొడ. ఒంటె; కుఇ. ఊటా, ఊటొ; కొలా. ఒట్.

<ప్రా. ఒట్టియ.

**ఒట్టిరాతు** చూ. ఒట్టి[1].

**ఒట్టు[2]** అ.క్రి. ప్రజ్వలించు, మండు. నిర్వ. 4.54. భార. ఉద్యో. 1.297; స.క్రి. కాల్చు, దహించు. భాగ. 3.989.

పో.చూ. క. ఉరి. కాల్చు; త. ఒట్టు. ఎండిపోవు, తడి ఆరిపోవు.

**ఒట్టు[3]** స.క్రి. ఉంచు, పెట్టు. భార.శల్య. 2.134. అ.క్రి. జనించు, కలుగు, పోగగు. భాగ. 10.253. వి. మొత్తం.

క. ఒట్టు. కలిపిపెట్టు, పోగుచేయు, కలియు, పోగగు, ఒకేమొత్తమగు, అనుసరించు, పూర్తిమొత్తం; తు. ఒట్టుని. పోగుచేయు; ఒట్టు, అనుసరింపజేయు, పూర్తి మొత్తం; త. ఒట్టు. జరుగు, కాకు, కలియు; ఒట్టు. సృజించు, చేయు; మ. ఒటుక. కలియు, అంటుకొను, అనుసరించు.

**ఒట్టుమొత్తము** వి. పూర్తిమొత్తం. క. ఒట్టుమొత్త; త. ఒట్టుమొత్తమ్; మ. ఒట్టుతుక, ఒట్టుత్తుక.

**ఒట్టు[3]** స.క్రి. తాగు. బహు. 2.27.

**ఒట్టు[4]** రూ. ఉట్టు[4]. వి. 1. ప్రతిజ్ఞ, శపథం. కావ్య. 1.107, ప్రభా. 1.123; 2. నిషేధం. కాశీ. 5.271; 3. శాపం. దశకు. 6.54; 4. వైరం.

క. ఒట్టు. ప్రతిజ్ఞ, శపథం; త. ఒట్టు. ప్రతిజ్ఞ; ఒట్టులై. ప్రతిజ్ఞచేయు; కుఇ. ఒడ. ప్రతిజ్ఞచేయు; కువి. ఒట్టినై.

**ఒట్టుగొను** అ.క్రి. ఒట్టుపెట్టుకొను. విజ్ఞా. 2.60. <ఒట్టు+కొను. **ఒట్టుపెట్టు** రూ. ఒట్టువెట్టు. అ.క్రి. శపించు. దశకు. 6.54. **ఒట్టుపెట్టుకొను** అ.క్రి. శపథంచేయు. **ఒట్టు విడుచు** స.క్రి. (శాపం) ఉపసంహరించు. **ఒట్టువెట్టు** రూ. చూ. ఒట్టుపెట్టు. అ.క్రి. నిషేధించు. కాశీ. 7.135. <ఒట్టు+పెట్టు.

**ఒట్టు[5]** చూ. వట్రువ. వి. బండిచక్రం నిర్మాణంలో వంకర కొయ్య పలక. ఒక్కొక్కచక్రానికి ఇలాంటివి ఆరుంటాయి.

**ఒట్టు[7]** వి. మోటలాగే ఎద్దులు బావిపైకి వచ్చి నిలచే చోటు.

**ఒట్టుగొను** చూ. ఒట్టు[4].

**ఒట్టుపెట్టు** చూ. ఒట్టు[4].

**ఒట్టుపెట్టుకొను** చూ. ఒట్టు[4].

**ఒట్టుమొత్తము** చూ. ఒట్టు[2].

**ఒట్టువిడుచు** చూ. ఒట్టు[4].

**ఒట్టువెట్టు** చూ. ఒట్టు[4].

**ఒడకి** వి. ఇటికరుంప.

క. ఒడక, ఒడకు. ముక్కలగు, చిన్నాభిన్నమగు; ఒడ్డె. పగు. పగులు; ఒడకు, ఒక్కు. ఒడితెలు. ఒడె త్తెలు, ఒడ్డె; తు. ఒడియుని, ఒడెయుని, ఒడిపుని, ఒడెప్పుని, ఉడెప్పుని; త. ఒడై. ముక్కలగు, బద్దలగు. విరుగు; ఒడైయల్, ఒడైవ్. పగులు, విరుపు; ఉడై. పగులు. ముక్కలగు; ఉడైచల్. పగిలిన ముక్కలు; ఉడైప్పు. తెగు (తెంపుకట్టు). ఉడైప్పు. పగులు; మ. ఒడియుక. పగులు; ఒడిక్క. ఉడయుక. పగులు (కుండలు పగిలినా); ఉడిక్క. ముక్కలగు; ఓట్టు. బీటు; గోం. వొడానా. నష్టనాని. కుంతనాని పగులు; వొహ్ తానా. ఓర్. ఓడ్; పర్జి. ఓడ్. పగులు. ఓటిప్ (ఓటెల్). పగిలేట్లు చేయు; గదబ. ఓర్; కోల. ఒటిప్. (ఒటప్). విరుగు. పగులు-. (ఒటల్). (ఒలచ్). ఒల్. బీల; కొండ. వడ- (వడి-). ముక్కలగు; వటప్ (వటత్), ఫుత్తె (ఫుటప్). పగులు; వడఆడై; కొలా. ఓడ్. ఓడాగ్, ఓట్, ఓటత. పగులు. నాయ. ఓడ్, ఓట్; కొదగు; ఒడె (ఒడప్, ఒడంప్). పగులు. బీటు; ఒడ (ఒడప్, ఒడత్త), ఒడె, ఒడెతె.

**ఒదగట్టు** రూ.చూ. పదగట్టు. స.క్రి. పదగోయు.

**ఒదగాచు** వి. అమ్మివేయు.

**ఒదగెద్దము** వి. పెట్టె ముస్నుగుడానిని పక్కవాటుగా పెట్టటం.

**ఒదగొను** స.క్రి. కొల్లగొట్టు.

**ఒదగోలు** వి. కొల్లగొట్టటం.

**ఒదగోలుగొను** స.క్రి. దూరగొను, కొల్లగొట్టు. భోజ. 3.124.

**ఒదగోలుగొను** చూ. ఒదగోలు.

**ఒద(గూడు** స.క్రి. పొందు, కూడు. కు.సం. 4.442; అ.క్రి. 1. సిద్ధించు, కలుగు, లభించు, ప్రాప్తించు. భార.ఆది. 5.204. ఆము. 1.114, నైషధం. 6.20; 2. పోగుపడు, సంఘటించు. భార.ఆది. 5.66; 3. కలయు, కూడు. భార.ఆది. 5.163; 4. పత్తిల్లు, ఉండు. భార.ఉద్యో. 2.39; 5. పొలగు, అనుకూలించు. హర. 2.139.

క. ఒదవెకూడు. కలిసిఉండు; ఒదగూడు. కలియు; త. ఉడన్-కూట్టు. భాగస్వామ్యం; ఉడన్. కలిసి; మ. ఉటన్. కలిసి.

**ఒద(గూర్చు** ఒదగూడుయొక్క ప్రేరణార్థక క్రియ. స.క్రి. 1. సిద్ధపరచు, అమర్చు. భార.ఆది. 2.21, శాంతి. 1.64; 2. కూర్చు. కు.సం. 5.552; 3. కలిగించు. భార.విరా. 2.114; 4. లభింపచేయు. భార.ఉద్యో. 3.6, పాంచి. 1.59; 5. సిద్ధింపజేయు, నెరవేర్చు. భార.ద్రోణ. 2.362, విజయ. 2.175; 6. చేర్చు, పోగుచేయు. నరస. 1.9.

**ఒదచూఱ** వి. కొల్ల, దోపిడి. ద్వి.పరమ. 4. పు. 321.

**ఒదదాలు** వి. వస్తు విశేషం. ద.హిం.కా. 4.1344.

**ఒదరోలు[1]** పో.చూ. ఉడుపు, వస్త్రం. వి. వేటగాళ్ల తొడుక్కునే తోలుకవచం. వరాహ. 4.72, కాళ. 4.178.

క. ఉడె, ఉడి. ఉడుపు; త. ఉడై (లివా), ఉడు. ధరించడం: మ. ఉడ. ఉడుపు.

ఒడలు+తోలు అని సూ.ని. ఇది విచార్యం.

<ప్రా.తె. *ఒద+తోలు.

**ఒరదోలు**[2] వి. కల్లు గీసేవాళ్లు చెట్టు ఎక్కేటప్పుడు చెట్టుకూ నడుముకూ కలిపి కట్టుకునే తోలు వారు.

**ఒరప**[1] రూ.చూ. ఒరప్ప. ఒక రకం చేప.

**ఒరప**[2] వి. అరటిచెట్టు బోదెపొర.

**ఒరపప్పు** రూ.చూ. వరపప్పు. వి. దేవతా నివేదనకై నాన బెట్టి పదగట్టిన పెసరపప్పు.

**ఒరపి** రూ. ఒడిపి. చూ. ఒడియు, వి. గండి, రంధ్రం. ఆము. 3.23.

క. ఒడె, ఒడి. పగులు, చీల ; తు. ఒడకు. రన్నం ; ఒడియుని, ఒడెయుని, ఒడిపుని, ఒడెపుని. పగులు, చీల ; త. ఉడైప్పు. రన్నం ; ఒడె. పగులు ; మ. ఉలువు, ఉట. పగులు ; ఒటియుక, ఒటిక్క. చీటలువారు ; కొడ. ఒడె- (ఒడెప్-, ఒడంద్). పగులు, ఒడెవె. చీల ; పర్జి. ఓడ్. పగులు ; ఓహ్ ; కోట. (ఒడ్వ్-ఒర్డ్-). పగులు ; కొలా. ఓడ్ ; నా. ఓడ్. పగులు.

<మూ.ద్రా. *ఓడ్-.

**ఒరప్ప** రూ. ఒరప[1]. వి. ఒక రకం చేప.

**ఒరబడిక** రూ.చూ. ఒరంబడిక. వి. సమ్మతి, అంగీకారం.

**ఒరమి** రూ. ఒరమె. వి. ధనం, సౌమ్ము, సంపత్తు. కు.సం. 9.290.

క. ఒదమె, ఒదవె, ఒదివె. వస్తువు, సంపద, ఆస్తి ; ఒద. ఆస్తి, కలిమి ; తు. ఒదమ. కలిమి, సంపద ; ఒటు, ఓటు. కలిసి ; తొటు. కలియు ; ఉటు. చుట్టు ముట్టు ; మ. ఉటుప. ఆస్తి, ఆభరణాలు, జీతం, చెల్లింపు, స్నేహం, కలిమి, యజమాని ; ఉట. చెందియుండు ; కో. ఒర్యమ్. నగలు.

<క. ఒదమె.

**ఒరము** రూ.చూ. పొరము. అ.క్రి. పట్టు.

**ఒరమె** రూ.చూ. ఒరమి. వి. 1. ధనం, సొమ్ము, సంపద. భార. శాంతి. 1.49 ; 2. నగ. సాం. ని. మాస. 48.

**ఒరంబడిక** చూ. ఒరంబడు.

**ఒరంబడు** రూ. ఒరఁబడు. అ.క్రి. 1. సంతోషించు. భార. ఆది. 8.91, శివ. సా. 436 ; 2. అనుమతించు. భార. సభా. 2.30 ; స.క్రి. సహించు, ఓర్చు. భార. ద్రోణ. 2.240, సభా. 227.

క. ఒడన్, ఒడమ్, ఒడ. కలయిక, కలిసి ; ఒడంబడు, ఒడబడు. అంగీకరించు, ఒప్పుకొను ; తు. ఒడ. తో ; ఒడంబడిపుని. అంగీకరించు, సంతోషించు ; త. ఉటన్-పటు. ఒప్పుకొను, లోబడు ; ఉటమ్పటు. సరిపడు, పొసగు, కలిసికట్టుగా నుండు ; మ. ఉటన్. కలసి ; ఉటుంపెటుక. ఒప్పుకొను.

ఒడంబడిక రూ. ఒడబడిక, ఒడఁబడిక. వి. 1. సమ్మతి, అంగీకారం, ఒప్పందం ; 2. అంగీకార పత్రం ; 3. సంధి:

క. ఒడంబడికె, ఒడబడికె. అంగీకారం ; తు. ఒడంబడికె, ఒడంబడిగె. సమ్మతి, అంగీకారం, సంధి ; త. ఉటన్పటిక్కై. అంగీకారం ; ఉటన్పటు. అంగీకరించు ; మ. ఉటంపటి. అంగీకార పత్రం, అంగీకారం, సంధి.

**ఒరంబము** రూ. వరంబము. వి. గోడ మొ. వాటి నిలువు, నూటి చూరటానికి దారుకు సీసపుగుండు కట్టి వేలాడదీసిన దారు.

సం. అవలంబ-. వేలాడటం, ఆధారపడటం, ఆధారం. బహుశః ఆశ్రయం ; అవలంబక, ఆశ్రయం, అవలంబిత. వేలాడినది, ఆధారపడినది. ప్రా. మహా. ఓలంబ. వేలాడటం ; అర్ధ.మా. ఓలంబియ. వేలాడగట్టబడినది ; పా. ఓలంబ. వేలాడుతున్న, ఆధారం, చేతికర్ర, వరంబం ; మరా. ఓళంబా. లోతు కొలిచే వరంబం లాంటి సాధనం ; సిం. ఓలంబ. వేలాడు ;

మ. ఒలంబు. (పోర్చు. ప్లుంబొ). నీటి లోతు కొలవడానికి చివర సీసపుగుండు కట్టిన దారు, నిలువు చూచే గుండు బల్ల.

<ప్రా. ఓలంబ-.

**ఒరంబఱచు** 'ఒరంబడు' ప్రేరణ. రూ. ఒరఁబరచు, ఒరఁబర్చు, ఒరఁబఱుచు. స.క్రి. ఒరబడునట్లుచేయు, ఒప్పించు, ఆమోదింపజేయు. భార ఆది. 6.131.

త. ఉటన్పటుత్తు. ఒప్పించు.

**ఒరంబాటు** రూ. ఒరఁబాటు. వి. 1. సమ్మతి, అంగీకారం ; 2. సంధి.

త. ఉటన్పాటు. ఒప్పుదల.

**ఒరఁబడిక** చూ. ఒరఁబడు.

**ఒరఁబడు** రూ.చూ. ఒరంబడు. స.క్రి. సహించు, ఓర్చు. భార. ఆది. 2.137 ; అ.క్రి. 1. అనుమతించు, ఒప్పుకొను. భార. సభా. 2.127, శాంతి. 4.139 ; 2. సంతోషించు. శివ.సా. 436. వి. వాక్యాలంకారం. భాగ. 10. పూ. 478, క్రీ.శ. 890. బెజవాడ శాసనం.

**ఒరఁబడిక** రూ.చూ. ఒరంబడిక. వి. సమ్మతి, అంగీకారం. నరస. 7.72 ; 2. అంగీకారాన్ని సూచించే పత్రం.

**ఒరఁబరచు** రూ.చూ. ఒరంబఱుచు. స.క్రి. ఒప్పించు. భాగ. 1.227.

**ఒరఁబర్చు** రూ.చూ. ఒరంబఱుచు. స.క్రి. ఒప్పించు. బసవ. 4.389 వం.

**ఒరఁబఱపించు** చూ. ఒరంబడు. స.క్రి. ఒప్పించు. మల్హ. 2.3.

ఒదన్ + పఱపు + ఇంచు.

**ఒరఁబఱుచు** రూ.చూ. ఒరంబఱుచు. స.క్రి. ఒప్పించు, ఆమోదింపజేయు. భార. ఉద్యో. 3.78.

క. ఒడబడిసు, ఒడంబడిసు. ఒప్పించు ; త. ఉటన్పటుత్తు. ఒప్పించు.

**ఒరఁబాటు** చూ. ఒరఁబడు. రూ.చూ. ఒరంబాటు. వి. 1. సమ్మతి, ఒప్పుదల, అంగీకారం. భార. విరా. 4.84 ; 2. సంధి. భార. ఉద్యో. 3.33.

**ఒరఁబాటువడ్డి** వి. దినసరిగా, నెలసరిగా, అడిగినప్పుడు చెల్లించేది, వడ్డీపై వడ్డీతో చెల్లించేది – అని వడ్డీ నాలుగు రకాలు. అడిగినప్పుడు చెల్లించే వడ్డీ.

**ఒరఁబాటువడ్డి** చూ. ఒరఁబాటు.

**ఒరయఁడు** రూ. ఒరయుఁడు. వి. 1. ప్రభువు, రాజు. భార. మానల. 33 ; 2. పతి, భర్త. భోజ. 3.261 ; 3. స్వామి,

యజమాని. ఉ.రా. 6.359 ; 4. శ్రేష్ఠుడు. దశా. 5.26.

క. ఒడె. ప్రభుత్వం, యాజమాన్యం ; ఒడెయ. యజమాని, ప్రభువు ; తు. ఒడ. యాజమాన్యం ; ఒడెక్కారె. యజమాని, ప్రభువు ; ఒడయె, ఒడెయె. యజమాని, ప్రభువు ; త. ఉడైయాన్. ప్రభువు, యజమాని ; ఉడైయవన్. యజమాని ; ఉడైయార్, ఉడైయవర్. యజమాని, ప్రభువు ; మ. ఉటయన్. యజమాని, ప్రభువు ; ఉటమ. ఆస్తి. ఉటయవన్, ఉటయతు. యజమాని ; కొడ. ఒడె. దేవుడు, యజమాని ; ఒడెయె. భర్త ; కో. ఒడయన్. యజమాని.

<మూ.ద్రా. *ఒడ్.

**ఒడయదేవర** వి. జంగమదేవర, జంగమయ్య. ప్రభు. 21 ష. 16, 17 పం. పో.చూ. ఉడైయవల్. శివలింగం ; ఉడైయాన్. కులనామం.

**ఒడయదేవర** చూ. ఒడయడు.

**ఒడయు(డు** రూ.చూ. ఒడయడు. వి. 1. స్వామి, యజమాని. భార.శాంతి. 5.312 ; 2. అధికారి. భార.అను. 5.265 ; 3. ప్రభువు. జై.భార. 5.117.

**ఒడయురాలు** వి. స్వామిని, యజమానురాలు, స్వతంత్రురాలు. భార.అర. 7.337.

**ఒడయురాలు** చూ. ఒడయుడు.

**ఒడల** వి. ఒకవిధమైన నారమొక్క (Combretum decandrum).

**ఒడలిచూపులతే(డు** చూ. ఒడలు.

**ఒడలిచూపొడయ(డు** చూ. ఒడలు.

**ఒడలిమరువు** చూ. ఒడలు.

**ఒడలు** వి. 1. దేహం. భార.ఆది. 6.281. మను. 2.65 ; 2. ఆధారం, భూమి. కకు. 4.163.

క. ఒడల్, ఒడలు, ఒడంబి, ఒడంబె. శరీరం, పొట్ట ; తు. ఉడలు, ఒడలు. శరీరం; ఉడాలు, ఒడాలు. పొట్ట ; త. ఉటల్. శరీరం ; ఉటర్, ఉటుంపు ; మ. ఉటలమ, ఉటల్. శరీరం.

**ఒడలిచూపులతే(డు** వి. ఇంద్రుడు, ఒంటినిండా కళ్ళు గల రాజు. పె.శకుం. 2.214. **ఒడలిచూపొడయ(డు** రూ. ఒడలుచూపొడయడు. వి. ఒంటినిండా కళ్ళుగల ప్రభువు, ఇంద్రుడు ; త. ఉటలక్కణ్ణన్. ఇంద్రుడు ; మ. ఉటల్. శరీరం. ఆం.నం.దేవ. 17, అచ్చ.రా. కిష్కిం. 41. **ఒడలిమరువు** వి. కవచం, శరీరాన్ని రక్షించేది. **ఒడలుగాలి** వి. వ్యానం (శరీరంలోఉండే ప్రాణ అపాన వ్యాన ఉదాన సమానాల్లో), ఒక వాయువు. **ఒడలుచూపొడయ(డు** రూ.చూ. ఒడలిచూపొడయడు. వి. ఇంద్రుడు. **ఒడలుదా(చుకొను** అ.క్రి. (చేసినట్టు నటిస్తూ) పని ఎగ్గొట్టు. **ఒడలెత్తు** అ.క్రి. దేహం ధరించు, జన్మించు, పుట్టు. హరి.పూ. 7.115 ; త. ఉటల్-ఎటు. జన్మించు. **ఒడలెల్ల(గన్నులుగా(న్)** క్రి. విశ. అతిజాగ్రత్తగా.

**ఒడలుగాలి** చూ. ఒడలు.

**ఒడలుచూపొడయ(డు** చూ. ఒడలు.

**ఒడలుదా(చుకొను** చూ. ఒడలు.

**ఒడలెత్తు** చూ. ఒడలు.

**ఒడలెల్ల(గన్నులుగా(న్)** చూ. ఒడలు.

**ఒడి**[1] వి. 1. పిల్లలు కూర్చుండటానికి వీలయ్యే తొడలపై భాగం. ఉత్సంగం. ఉ.రా. 4.217 ; 2. ఒడిపై కట్టుకునే బట్ట. ఉ.రా. 4.128, ఆం.భా. 2.153 ; 3. పలుమోని ; 4. స్తంభంమీద శ్రేణి నిలపడానికి వీలుగా పెట్టిన చెక్కడపు పనిచేసిన కొయ్యపీట ; 5. బట్టిపైన ఎత్తుగా ఉండే రాతి ; 6. ఎద పెట్టేటప్పుడు మనిషి ముందువైపున నడుముకు కట్టుకునే విత్తనాల మూట.

క. ఉడి. ఉంటి, నడుము ; ఉడ, ఉడు, ఉడె ; తు. ఉడి (ఉడివార. మొలనూలు) ; మ. ఒటి, ఒటుకు. ఉంటి ; ఉడు. వివ్ల వ్యవహారాలు ; ఉటుపు. ముడ్డి ; కోట. ఒడ్. నడుము.

<మూ.ద్రా. *ఒడ్.

**ఒడికట్టు** అ.క్రి. 1. నిందామలు, ఏంపవచ్చినా రానీ అని సిద్ధంగా ఉండు. భార.యు. 1335, అచ్చరా.యు. 393 ; 2. సిద్ధపడు. వి. 1. ఒడిప్రదేశాన కట్టేసుద్ద. కాశ. 4.54 ; 2. ఒడ్డాణం. **ఒడికట్టుబియ్యము** వి. ఒడి(బ్రాలు. **ఒడిదారము** వి. ఒడ్డాణం. ద్వి.భాగ. 10, రమునా. 2.108. **ఒడినించు** స.క్రి. దక్షిణగా యిచ్చి గౌరవించు. **ఒడిబియ్యము** వి. ఒడి(బ్రాలు. ద్వి.పరమ. 5.438. వ. 16 పం. **ఒడి(బ్రాలు** (-ప్రాలు). వి. మంగళార్థం. నూతన వధువుకు ఒడిలో కట్టే బియ్యం.

**ఒడి**[2] చూ. ఒడియు. వి. ఒడుపు, నేర్పు. ఉ.హరి. 3.103.

**ఒడికా(డు** వి. నేర్పరి. **ఒడికారము** వి. 1. ఉద్రేకం. యయా. 4.25 ; 2. అపకారం ; 3. ఆధిక్యం. **ఒడిత్రాడు** వి. వేటలో ఉపయోగపడే దారు. కళా. 3.46.

**ఒడికట్టు** చూ. ఒడి[1].

**ఒడికట్టుబియ్యము** చూ. ఒడి[1].

**ఒడికము** చూ. ఒడి[2]. విశ. 1. మనోహరం, ఇంపైనది. భార. అర. 5.11, యయా. 2.46 ; 2. నేర్పరియైన. తపతీ. 1.14 ; 3. ఉచితం. క్రి.విశ. 1. అప్రతిహతంగా. ఉ.హరి. 2.43 ; 2. తృప్తికరంగా. ఉ.రా. 1.200 ; వి. 1. ఉపాయం, నేర్పు. నా.పంచ. 1.107; 2. మనోజ్ఞత, అందం, ఇంపు. శుక. 3.105 ; 3. ప్రేమ, వాత్సల్యం. దశకు. 5.13 ; 4. యుక్తత, మర్యాద, ఔచిత్యం ; 5. ఒట్టు, తిట్టు. త. వడిప్పమ్. సొంపు; వడిత్ర. మొ. ; మ. ఒళి. మనోహరం, చక్కని.

**ఒడికా(డు** చూ. ఒడి[2].

**ఒడికారము** చూ. ఒడి[2].

**ఒడికె** చూ. ఓడిక. వి. పొలంలో వాననీళ్ల పారటంవల్ల కోసుకుపోయి ఏర్పడ్డ పల్లం లేదా గొయ్యి.

**ఒడిత్రాడు** చూ. ఒడి[2].

**ఒడిదామర** వి. వృక్ష విశేషం.

**ఒడిదారము** చూ. ఒడి[1].

**ఒడిదుడుకు(లు)** రూ.చూ. ఒడుదొడుకు. వి. కష్టసుఖాలు, మేలుకీళ్లు, హెచ్చుతగ్గులు, తొందరపాటు.

**ఒడినింపు** చూ. ఒడి[1].

**ఒడిపి** రూ.చూ. ఒడపి. వి. పగులు, గండి.

**ఒడిపిలి** రూ.చూ. వరిపిలి. వి. 1. ఒక రకం బియ్యం. కా. 3.67 ; 2. విశేషం.

ఒడిపిలిపాసెము వి. బియ్యప్పిండితో తయారుచేసే పాయసం. బసవ. 3.660. పం.

**ఒడిపిలిపాసెము** చూ. ఒడిపిలి.

**ఒడిపేలు** చూ. వరిపిలి. వి. వరిమొక్కలానావుండి మాగాణి నేలల్లో పెరిగే గడ్డి. బాదుకంకిలాంటి ఎన్ను వేస్తుంది.

**ఒడిబియ్యము** చూ. ఒడి[1].

**ఒడి(బ్రాలు** చూ. ఒడి[1].

**ఒడియించు** చూ. ఒడియు[1].

**ఒడియు[1]** స.క్రి. 1. హఠాత్తుగా, పట్టుకొను. భార.విరా. 2.128. మను. 4.112 ; 2. విదారించు, చీల్చు. దా.రా.నుం. 318; 3. నశింపచేయు. దశా. 2.409 ; 4. ఆకర్షించు, లాగు, పట్టుకొను. పాండు. 2.7 ; అ.క్రి. ఆవలు మొ. వాటిని పట్టుకోటానికి కాని కొట్టటానికి కాని పొంచివుండు, కాచుకొనివుండు. రం.రా. 2 పు. 121 పం. 11, రాజవా. 3.66.

త. ఒటి (-త్త-, -ప్స-) పగలగొట్టు, నాశంచేయు ; క. ఒడి. ఒడి, ఒడె. ముక్కలుముక్కలగు, పగిలిపోవు ; మ. ఒటియుక. పగులు, ముక్కలైపోవు. నిరసించు ; ఒటియుక, ఒటెక్కుక ; తు. ఒడ్పుని. ఛేదించు; ఒడ్పు. ఛేదనం.

ఒడియించు స.క్రి. ఒడియచేయు. లాగించు. తీయించు. పారి. 4.58; త. ఒటెవి. కొనసాగకుండ చేయు, ఆపు.

**ఒడియు[2]** పో.చూ. వడియు, ఓడు. అ.క్రి. 1. కారు, స్రవించు. ద్వి.హరిశ్చ. పూ. 1979 ; 2. వ్యాపించు. రంగా. 3.187.

క. ఒడి. కారు, స్రవించు ; తు. ఒడ్డుని. స్రవించు ; ఒడ్డ. స్రవించటం ; ఒడ్పావుని. ఖాళీచేయు ; త. వటి. బొట్టుబొట్టుగా కారు ; మ. వటియుక. పొర్లిపోవు : కొ. ఒట్ (ఒటిన్). పోయు.

<మూ.ద్రా. *ఒట్-.

**ఒడిశ** రూ.చూ. ఒడిసె[1]. వి. సర్కారు జిల్లాలోని కొంత ప్రాంతాల్లో దుబ్బుగా పెరిగే ముళ్లచెట్టు.

**ఒడిశాల** రూ.చూ. పడిసెల. వి. రాయి పెట్టి తిప్పి ఒక కొనను వదిలి రాయి విసరివేసే తాడు.

**ఒడిస** రూ. ఒడిసియ[3], ఒడిసె[3], చూ. ఒడియు[1]. వి. రత్నాన్ని తొలిచే సూది, పొగర, రత్నపీఠి. వ్యు. విదారించేది, చీల్చేది.

**ఒడిసా** వి. ఒరిస్సా.

ప్రా. ఒడ్డ, ఒడ్డియ. ఉత్కళదేశం, ఉత్కళ దేశీయుడు ; అ.మాగ. ఉడ్డ ;

త. ఒరిచా.

**ఒడిసియ[1]** రూ.చూ. ఒడిసె[1]. వి. వృక్షవిశేషం.

**ఒడిసియ[2]** రూ.చూ. ఒడిసె[2]. వి. ఒడిసెగడ్డ, బిళ్లరోగం.

**ఒడసియ[3]** రూ.చూ. ఒడిస. వి. రత్నపీఠి.

**ఒడిసిల్లు** చూ. ఊదర. వి. గడ్డి ధాన్యం.

**ఒడిసె[1]** రూ. ఒడిశ, ఒడిసియ[1]. వి. వృక్షవిశేషం. పి.శకుం. 2.14.

ఒడిసెప్రాలు వి. ఒక రకం అడవిధాన్యం. పి.శకుం. 3.12.

**ఒడిసె[2]** రూ. ఒడిసియ[2]. వి. ఒడిసెగడ్డ, బిళ్లరోగం.

క. ఒడిసె, ఒఢుమ, ఉడచు, ఉడుము. ఒడిసెగడ్డ ; తు. ఒడి ; త. ఒటు, ఒటుక్కట్టై. బిళ్లరోగం ; మ. ఒటెక్కారు. బిళ్లరోగం.

ఒడిసెగడ్డ (ఒడి + సెగ + గడ్డ) వి. బిళ్లరోగం.

**ఒడిసె[3]** రూ.చూ. ఒడిస. వి. రత్నపీఠి.

**ఒడిసెగడ్డ** చూ. ఒడిసె[2].

**ఒడిసెప్రాలు** చూ. ఒడిసె[1].

**ఒడిసెల** చూ. ఒడుచు. రూ.చూ. పడిసెల. వి. రాళ్లు విసరివేయడానికై నడుమ ఏర్పరచిన చిన్న చిక్కంగల తాడు. హరి.ఉ. 2.15, కాశ. 3.10.

ఒడిసెలకాఁడు వి. ఒడిసెలు వేసేవాడు. హరి.ఉ. 183.

**ఒడిసెలకాఁడు** చూ. ఒడిసెల.

**ఒడుం** రూ. ఒడుము. వి. కొయ్యలమీద వేసిన అడ్డవాసం.

దే. ప్రా. వడ. దర్వాజాయొక్క ఒకభాగం.

**ఒడుకు[1]** రూ.చూ. వడుకు. స.క్రి. నూలు మొ. వడుకు.

**ఒడుకు[2]** రూ. ఒడ్కు. స.క్రి. ప్రవేశపెట్టు, ఇచ్చు.

**ఒడుగు[1]** రూ.చూ. వడుగు. వి. ఉపనయనం.

ఒడుగుపెండ్లికొడుకు రూ.చూ. వడుగుపెండ్లికొడుకు. వి. ఉపనీతుడు, వడుగు పెండ్లికొడుకు.

**ఒడుగు[2]** 'ఒదుగు'కు అసాధురూపం. అ.క్రి. ముడిగియుండు, తొలగు.

**ఒడుగు[3]** అ.క్రి. (మండిగా చేరి) నిద్రించు.

**ఒడుగుపెండ్లికొడుకు** చూ. ఒడుగు[1].

**ఒడుచు[1]** స.క్రి. 1. ఓడించు, జయించు, గెలుచు. క్రీ.శ. 892–922 ధర్మవరం శాసనం, భార.ఆది. 3.206 ; 2. అణచు, నశింపజేయు. భార.ఆది. 5.60; 3. బలత్కారంగా గ్రహించు, అపహరించు. భార.ఆర. 1.55, భీమ. 6.32 ; 4. బాధించు, నొంచు. భా.రా.ఆర. 2.303; 5. గ్రహించు, తెలియు. కేయూర. 4,120; 6. వధించు, చంపు. పి.శకుం. 2.118 ; 7. పోదోచు, తీసివేయు. అహల్య. 2.11.

క. ఉడుగు. తగ్గిపోవు, తొలగించు ; త. ఒటుక్కు. అణచు, బాధించు, దోచు, రద్దుచేయు ; ఒటుంకు. అణిగిపోవు, లయించు ; ఒటె, నాశంచేయు ; ఓటు. ఓడిపోవు ; టుటై. నిర్మూలించు, చంపు ; పో.చూ. మ. ఒటుక్కుక. అంతం చేయు, పూర్తిచేయు, నాశంచేయు ; కోట. ఒడ్గ్. నాశమగు.

బహుశః ఓడు (పరుగెత్తు) యొక్క ప్రేరణ ; ఓడించు > ఒడుచు ; లేదా పొడుచు > ఒడుచు. ఆదివకార లోపం.

<మూ.ద్రా. *ఒట్.

**ఒడుచు[2]** 1. మెల్లగా వీచు ; 2. ఒలుచు.

**ఒడుచు[3]** స.క్రి. బలత్కారంగా తీసుకొను.

**ఒడుదల** రూ.చూ. విడుదల. వి. సమాప్తి.

**ఒడుదుడుకు** రూ.చూ. ఒడుదొడుకు. విశే. 1. విషమం ; 2. కష్టం కలది ; వి. 1. విషమత్వం, కష్టం ; 2. కష్ట స్థితి.

**ఒడుదొడుకు** రూ. ఒడిదుడుకు(లు), ఒడుదుడుకు. విశే.

ఆడంబరంగల స్త్రీ; త. ఒయ్యారి. అలంకారం చేసుకున్న లేక నాగరిక స్త్రీ.

**ఒయ్యారికత్తె** రూ. ఒయారికత్తె. వి. సౌందర్యవతి, అందగత్తె. **ఒయ్యారికా(డు** రూ. ఒయారికాడు. వి. అందగాడు, సొగసుకాడు.

**ఒయ్యారికత్తె** చూ. ఒయ్యారి.

**ఒయ్యారికా(డు** చూ. ఒయ్యారి.

**ఒయ్యెయ్యవ్** చూ. ఒయ్య.

**ఒయ్యెయ్యవ(వ్)** చూ. ఒయ్య.

**ఒర**[1] వి. సామ్యం, పోలిక. భార. ఉద్యో. 2.37.

క. ఒరె; త. ఉరు. పోలిక-కలిగియుండు, పోలు.

**ఒరవచ్చు** అ.క్రి. సాటివచ్చు, సమానమగు. భార. ఉద్యో. 2.380, శృం.నై. 6.50.

**ఒర**[2] వి. పరీక్షార్థం ఒరగంటిమీద గీచేగీటు. భాగ. 3.415.

క. ఒరె. రాయు, రుద్దు, ఒరపిడి రాతిమీద గీయు, నూరు, నునుపుచేయు, పరీక్షించు; ఉర్దు. ఉద్దు, రుద్ది నునుపుచేయు; కొడ. ఉద్ద్- (ఉడ్-). రుద్దు; తు. ఒరెపుని, ఉరెపిని, ఒరెతు; త. ఉరై. ఒరపిడి రాతి మీద బంగారం, లేక వెండి గీయటంవలన ఏర్పడ్డ నునుపు దనం; ఉరై (-త్త్-ప్ప్-). బంగారం, వెండి మొ. ఒరపిడి మీద గీచి పరీక్షచేయడం; మ. ఉరసుక. రుద్దు, రాయు; ఉర. రుద్దటం; ఉరెక్క. రుద్దు, రాయు, నునుపుచేయు, మెరుగుపెట్టు; ఉరయుక. రుద్దు, ఒరపిడిపెట్టు; కోట. ఒర్ల్ (ఒర్త్-) గంధంతీయు, కుండలు చేసేటప్పుడు రాయితోరుద్దు; తొ. వర్ఫ్ (పర్త్-). గోం. ఉరియానా. పిండిచేయు, నుసిచేయు; పర్జి. ఉర్చ్. పలుచు; గద. ఉర్స్. తోలుతీయు; ఒల్లా. ఉర్స్; కురుఖ్. ఉర్నా. ఆకులుదూయు, విత్తనాలు కంకినుండి దూయు.

**ఒరకొను** రూ. ఒరగొను. స.క్రి. ఒరపెట్టు, పరీక్షించు. దశకు. 10.105. **ఒరగడుగు** వి. రెండవసారి బియ్యం కడిగిన నీళ్ళు. <ఒర[2]+కడుగు. **ఒరగల్లు** రూ. ఒఱగల్లు. వి. 1. గీటురాయి, బంగారం మొదలయిన వాటిని ఒరపెట్టే రాయి, నికషం. భాగ. 3.415; 2. విద్యా పరీక్షా స్థానం. క. ఒరెగల్. గీటురాయి; తు. ఒరెకల్లు; త. ఉరై-కల్. విలువైన లోహాలను పరీక్షించే గీటురాయి; మ. ఉరక్కల్లు. గీటురాయి. < ఒర[2] + కల్లు. **ఒరగావించు** వి. పరీక్షించు. శృం.నై. 8.159. < ఒర[2] + కావించు. **ఒరగొను** రూ. చూ. ఒరకొను. స.క్రి. ఒరపెట్టు, పరీక్షించు, బంగారం గీటుపెట్టు. **ఒరపట్టు** రూ. ఒరవట్టు. స.క్రి. రాపిడిపెట్టు. అచలా. 1.62. <ఒర[2]+పట్టు. **ఒరపెట్టు** రూ. ఒరవెట్టు. స.క్రి. బంగారాన్ని ఒరపిడి రాయితో పరీక్షించు. శృం.నై. 2.35. <ఒర[2]+పెట్టు. **ఒరవట్టు** రూ.చూ. ఒరపట్టు. స.క్రి. రాపిడిపెట్టు. కకుత్స్థ. 3.13. **ఒరవెట్టు** రూ.చూ. ఒరపెట్టు. స.క్రి. 1. సంఘర్షించు, మించు. మను. 6.102; 2. రాపిడిపెట్టు.

**ఒర**[3] వి. ఆలోచన. ఆము. 4.248.

క. ఓరు. ఆలోచించు, యోచించు, విచారించు; పో.చూ. ఒరె. మాట, పలుకు; త. ఓర్ (-ప్ప్-, -త్త్-). ఆలోచించు, యోచించు, విచారించు: పో.చూ. ఉరై. పలుకు, మాట్లాడు, చెప్పు; మ. ఓర్క్క. ఆలోచించు, తలంచు; ఓర్మ్మ. ఆలోచన, జ్ఞాపకం. <మూ.ద.ద్రా. *ఓర్.

**ఒరం** పూర్తి అయిన ఎద్దు గోధ. రా. 28.

**ఒరక** రూ.చూ. ఒఱకటము. వి. ఏటవాలు గట్టు.

**ఒరకట్ట** వి. అడవిపండి వెంట్రుకలతో చేసిన కుంచె. తె. 44.

పో.చూ. క. ఒరె. అంటుకొని ఉండు; ఒరగె. ఏకత్వం, సమగ్రత; త. ఒరుక్కు. కలిపికట్టు; ఒత్తో. కలప.

**ఒరకట్టు** వి. కోసిన జొన్న మొదలగు వాటి దంటును కంకులు ఒక పక్కనే వచ్చునట్లు పేర్చి కట్టు విధము.

<ఒరు + కట్టు.

**ఒరకాటము** రూ.చూ. ఒఱకటము. వి. 1. నిట్రపు అంచు: 2. ఇబ్బంది.

**ఒరకొను** చూ. ఒర[2].

**ఒరగ** పో.చూ. ఒరగు. క్రి.విశే. తప్పిదంగా, అయుక్తంగా.

**ఒరగట్టు** పో.చూ. ఒరకట్ట. వి. చుట్టగా చుట్టి కట్టిన వస్త్రపు కట్ట. నీలా. 3.49.

పో.చూ. త. ఉత్తై. పై పంచె, ఉత్తరీయం.

**ఒరగడుగు** చూ. ఒర[2].

**ఒరగద్దము** రూ.చూ. ఒఱకటము. వి. 1. స్థిమితంలేని స్థితి: 2. ఏటియ ప్రదేశం, నిట్రముగా ఉన్న రాతి పై భాగం; 3. కొన, అంచు.

**ఒరగ(బడు** చూ. ఒరగు.

**ఒరగ(బెట్టు** చూ. ఒరగు.

**ఒరగల్లు** చూ. ఒర[2].

**ఒరగారు** చూ. ఒరు-.

**ఒరగాలు** రూ. ఒరికాలు, ఒఱగాలు, ఒటిగాలు. చూ. ఒరు. వి. 1. ఒంటికాలు. పండితా. ప్ర. 2.132 పం.: 2. కుంటికాలు. సు.శ. 27.

త. ఒరుకాల్, ఒత్తై-క్-కాల్. ఒంటికాలు.

**ఒరగావించు** చూ. ఒర[2].

**ఒరగు** రూ.చూ. ఒఱగు. అ.క్రి. 1. పోవు, నశించు. కేయూర. 3.323; 2. వంగు. ఆము. 5.38; 3. వాలు, పడు. ఆము. 5.126; 4. కూలు, చచ్చు. మొల్ల. 5.159; 5. మూర్ఛిల్లు. కళా. 2.147; వి. 1. లోపం. రాజ. చ. 1.11; 2. ఒరగుదిండు. శుక.స. 1.321; 3. వంపు; విశే. వంకరపైన, వంపైన.

**ఒరగ(బడు** రూ.చూ. ఒఱగ(బడు. అ.క్రి. వంగు, వరగు, వాలు; అవనతమగు. <ఒరగు+-అ(7(న్)+పడు. **ఒరగ(బెట్టు** స.క్రి. వాల్చు, పాత్రను ఏటవాలుగా పెట్టు; ఎక్కువగా ఇచ్చు (అర్థవివరి). <ఒరగు+అ[7](న్)+పెట్టు. **ఒరగుడు** వి. ఒంకర, ఏటవాలు, వాలుట, పడుట. **ఒరగుదిండు** రూ.చూ. ఒఱగుదిండు. వి. తలగడ, తలాడ. **ఒరగుపదను** వి. కొంచెం తేమ, కొంచెం చెమ్మ. **ఒరగుపాగ** వి. వంకర పాగ, వంగిన తలకట్టు. సారంగ. 1.79. **ఒరగుబిల్ల** రూ.చూ. ఒఱగుబిళ్ల. వి. దిండు. ఒరగు

బిళ్ల రూ.చూ. ఒఱగుబిళ్ల. వి. బిందు. ఒరగువోవు రూ.చూ. ఒఱగుపోవు. అ. క్రి. వంగు, వంగిపోవు. వంకరగు. <ఒరగు + పోవు.

ఒరగుడు చూ. ఒరగు.

ఒరగుదిండు చూ. ఒరగు.

ఒరగువదను చూ. ఒరగు.

ఒరగుపాగ చూ. ఒరగు.

ఒరగుబిల్ల చూ. ఒరగు.

ఒరగుబిళ్ల చూ. ఒరగు.

ఒరగువోవు చూ. ఒరగు.

ఒరగొడ్డియము రూ.చూ. ఒఱగొడ్డెము. వి. వక్రోక్తి, వంకర మాట.

ఒరగొడ్డెము రూ.చూ. ఒఱగొడ్డెము. వి. వక్రోక్తి. ఆం.దా.

ఒరగొమ చూ. ఒర[2].

ఒరచాలుదుక్కి రూ.చూ. ఒఱచాలుదుక్కి. వి. ఒకచాలు దున్నిన దుక్కి, చాలు తేలికదారిన దుక్కి.

త. ఒరు-చాల్-ఉఴు (-త్-, -వ్-). నాగలితో ఒక సారి దున్ను.

ఒరచు రూ. ఒరుచు. స.క్రి. నునుపుచేయు, ఒరపిడి రాతిచేత రాపిడిపెట్టు.

త. ఉరైచు (-ఇన్-; -వ్-). శుభ్రంచేయు: మ. ఉరసుక. రుద్దు, రాపిడిపెట్టు; ఉరసల్. రాపిడి.

ఒరచుబద్ద- వి. 1. చిత్రికగుల్ల, పలక మొ. నునుపు చేసే వ్రంగి పనిముట్టు.

ఒరచుబద్ద చూ. ఒరచు.

ఒరట వి. మట్టం, అంతటా ఒకే ఎత్తులో వుండటం.

ఒరటు రూ.చూ. మొఱటు. విణ. మొండి, మొరటు.

ఒరవట్టు చూ. ఒర[2].

ఒరపదను రూ. ఒరపదును. వి. కొంచెం తడి.

<ఒరు + పదను. ఒకసారి పదును.

ఒరపదును రూ.చూ. ఒరపదను. వి. కొంచెం తడి.

ఒరవరి చూ. ఒరవు[2].

ఒరపిడి[1] చూ. ఒరపు[1].

ఒరపిడి[2] చూ. ఒరపు[2].

ఒరపిడిరాయి చూ. ఒరపిడి[1].

ఒరవు[1] చూ. ఒరయు. వి. సంఘర్షణం, రాపుడు, అదుముడు. అచ్చ.రా. 6.184.

ఒరపిడి[1] రూ. ఒరిపిడి. వి. రాపిడి. భార.శాం. 2.356. ఒరపిడిరాయి రూ. ఒరుపుడురాయి. వి. ఒరుపుడురాయి. ఒరవుదుక్కి వి. దున్నటానికి అనుకూలమైన పదును ఉన్న దుక్కి.

ఒరవు[2] రూ.చూ. ఒఱపు. వి. 1. ఉపాయం; 2. విలాసాతిశయం, సౌందర్యం; 3. యోగ్యత; 4. తంటా, దోషం; 5. తాపం, ఆదుర్దా; విణ. స్థిరం, సుందరమైన, గొప్ప, యోగ్యం.

ఒరవరి వి. సౌందర్యవంతుడు, సుందరుడు. <ఒరవు[2] + అరి. ఒరపిడి[2] ఒఱపిడి. వి. అయోగ్యుడు. ఒరవుమీఱు అ.క్రి. నాణెపడు, గొప్పగా ఒప్పు. ఒరవులాడి వి. అందమైన యువతి.

ఒరవు[3] పో.చూ. వరుజు. వి. పంటపొలాల్లో ఉండే కాల్వ.

ఒరవుదుక్కి చూ. ఒరవు[1].

ఒరవుమీఱు చూ. ఒరవు[2].

ఒరవులాడి చూ. ఒరవు[2].

ఒరవెట్టు చూ. ఒర[2].

ఒరపోగు రూ. ఒరవోగు. చూ. ఒరు. వి. ఒంటిపోగు.

ఒరపోగుచీర రూ. ఒరవోగుచీర. వి. ఒంటిపోగు గళ్ళు పడేట్టు నేకనేసిన చీర.

ఒరపోగుచీర చూ. ఒరపోగు.

ఒరబద్దె చూ. ఒరగు. 1. అచ్చుతుక్కోటానికి సుమారు బెత్తెడు వెడల్పు నేసి, చివర జానెడు పొడుగు దారాలు వదలిన గుడ్డ; 2. నేతచీరకు ముందువైపు వదలిన బద్దె.

ఒరబద్దెదారం వి. బద్దె పోగుల్లో అడ్డంగా దూర్చిన వరిదారం.

ఒరబద్దెదారం చూ. ఒరబద్దె.

ఒరబొమ్మ వి. ఆటబొమ్మ.

ఒరము[1] అ.క్రి. వేడెక్కు. ఆము. 4.212.

క. ఒరవు, ఉరివు. కాలుట, మండుట; ఉరి. అ.క్రి. కాలు; పో.చూ. త. ఉరు. కాలు, మండు.

ఒరము[2] పో.చూ. ఒదము. స.క్రి. పొందు.

ఒరయారము రూ.చూ. ఒయ్యారము. వి. సౌందర్య గర్వం. కళా. 3.17, విజయ. 1.63.

ఒరయిక చూ. ఒరయు.

ఒరయు రూ. ఉరియు[2], ఒరియు, ఒఱయు. స.క్రి. 1. గోకు. కు.సం. 1.100; 2. రాచు, సంఘర్షణంచేయు. భా.రా. 4.718; 3. పరీక్షార్థం బంగారం మొ. వాటిని రాతిపై గీటు పెట్టు. ఉ.హరి. 5.11; 4. పరీక్షించు. హర. 2.51; 5. పరిశీలించు, విచారించు. నా.పంచ. 1.180; 6. పొరయు, పొందు, చేరు. కాశీ. 6.127; 7. ఎదుర్కొను, ఢీకొను. ఆము. 1.43; అ.క్రి. 1. స్పర్ధచేయు, మార్కొను. వరాహ. 6.46; 2. రాచు, సంఘర్షించు. పారి. 4.28; 3. నొక్కుడుపడు. నీలా. 1.81.

క. ఒరె (ఒరద్-). రాయు, తాకు, ఒరపిడి పెట్టు, పరీక్షించు; ఒరసు, ఒరిసు, ఒర్సు. తాకు, స్పర్శించు, మృదువుగా రాయు; ఉర్దు. రుద్ది నునుపుచేయు; తు. ఉరెవుని. రాయు, రుద్దు; ఉరెసుని. నునుపుచేయు; త. ఉరై. (-త్-; -వ్-) రాపిడిపెట్టు, మెత్తనిముద్ద అగునట్లు రుద్దు, రాయు, బంగారం మొ. విలువైన వస్తువులను ఒరపిడిరాయిచే పరీక్షించు, (-న్త్-; -ల్-) పరీక్షించు, పరిశీలించు; మ. ఉరసుక. రుద్దు, రాయు; కోట. ఒరవ్- (ఒర్-). మెత్తని ముద్ద అగునట్లు రుద్దు, కుండలు తయారు చేసేటప్పుడు రాయిచేత రుద్దు; ఒర్గ్. రుద్దు; కుఇ. రూస. చితకగొట్టు, నలగగొట్టు, పిండిచేయు.

పో.చూ. సం.ప్రా. ఓఘ్ఛ్. రుద్దు, రాయు.

<మూ.ద్రా. *ఉర్-/*ఊర్.

ఒరయిక రూ. ఒఱయిక, ఒఱియిక. వి. ఒరిపిడి, సంఘర్షణం. చంద్రా. 1.8; వైషమ్యం, శత్రుత్వం, స్పర్థ.

చంద్రా. 1.71. **ఒరయుగడ** వి. రాపిడి, కష్టం. కు.సం. 4.381. **ఒరసికొనిపోవు** అ.క్రి. నొక్కుడుపడు, పండుపడు. **ఒరసికొను** స.క్రి. రాసుకొను, అంటు. కాశీ. 3.13. క. ఒరసు. రాచు, మృదువుగా రాయు, తట్టు, తుడుచు, నాశనం చేయు, పూయు; తు. ఒరెసుని; త. ఉరైత్తు-క్-కొళ్. తనకుతాను రుద్దుకొను; మ. ఉరసుక. రుద్దు, రాచి పొడిచేయు.

**ఒరయుగడ** చూ. ఒరయు.

**ఒరలు** రూ.చూ. ఒఱలు. అ.క్రి. 1. పొర్లు. రా.రా. 4.375, ఉ.రా. 8.177; 2. ప్రలాపించు, దుఃఖించు, ధ్వనించు, పొర్లు, పాచికవలె తిరుగు.

**ఒరలుట** వి. విడుదల, విమోచనం. **ఒరలుడు** వి. పొర్లుట, ఏడుపు.

**ఒరలుట** చూ. ఒరలు.

**ఒరలుడు** చూ. ఒరలు.

**ఒరవ** రూ.చూ. వరవ. వి. చుట్టు తవంతికి మధ్య కప్పునుంచి నీరు పడేందుకు వీలుగా ఏర్పరచిన దారి.

**ఒరవకుండు** చూ. ఉరియు. క్రి. ఉరియకుండా వుండు.

**ఒరవచ్చు** చూ. ఒర[1].

**ఒరవట్టు** చూ. ఒర[2].

**ఒరవడి** రూ. వరవడి. వి. 1. విద్యార్థులకు అక్షరాలు కుదరటానికి గురువు మొదలయిన వాళ్ళు రాసిన మేలుబంతి; 2. వేగం, ఆధారం, కట్టుబాటు, మర్యాద, ఆదర్శం.

త. ఉరై. మాట, భావవ్యక్తీకరణ; వరై (న్ఱ్-; ఱ్-). వ్రాయు, చెక్కు, గీయు. వి. బంతి, వర్ణం, పటి (<సం. ప్రతి.) నకలు; పో.చూ. మ. ఉర. పదం, వాక్యం, కీర్తి; ఒర. మేలుబంతి; పడి. నకలు.

<త. *వరై- పడి. పదాన్ని తిరిగి రాయటం.

**ఒరవిడి** రూ.చూ. వరవుడము. వి. సేవ, దాస్యం.

**ఒరవు** పో.చూ. ఒర[1]. వి. 1. విధం, పోలిక. పండి.చ. 2.131; 2. తగిన నలహా.

క. ఒరె. ఏకత్వం, పోలిక, నమత; త. ఉరు. అ.క్రి. పోలిక కలిగియుండు.

**ఒరవులుట్టు** అ.క్రి. చవులూరు.

**ఒరవెట్టు** చూ. ఒర[2].

**ఒరవోగు** రూ.చూ. ఒరపోగు. వి. ఒంటిపోగు.

**ఒరవోగుచీర** రూ.చూ. ఒరపోగుచీర. వి. ఒంటిపోగు గళ్ళుపడేట్టు, పేకనేసిన చీర.

**ఒరవోగుచీర** చూ. ఒరవోగు.

**ఒరసందు** చూ. ఒరయు. వి. రెండు ఇండ్ల చూరులు కిందకు దిగిన గొంది చోటు, చూర్లసందు.

**ఒరసికొనిపోవు** చూ. ఒరసికొను.

**ఒరసికొను** చూ. ఒరయు.

**ఒరసు** చూ. ఒర[1]. వి. పోలిక, ఉపమానం. నరన. 5.16.

**ఒరి** వి. శత్రుత్వం, నాశం, దోపిడి. ఆము. 6.110.

పో.చూ. త. వరి. కట్టు, బంధం.

ఒరిగట్టు అ.క్రి. ఎదుర్కొను. కు.సం. 11.670.

**ఒరికాలు** రూ.చూ. ఒరగాలు. వి. ఒరగబట్టిన కాలు.

**ఒరిగ** చూ. ఒడుగు. వి. నమస్కారం. రుక్మా. 1.123.

క ఒఱగు. ఉఱుగు. వాలు, ఒరగు. పండుకొను; పో.చూ. త. ఒరుఙ్కు. ఒంకు, కృశించు.

**ఒరిగట్టు** చూ. ఒరి.

**ఒరిజ** రూ. ఒరిజె. వి. ఏనుగు మెడకు కట్టే గొలుసు. రాజ. వా. 3.46.

క. హొరజి. దేవుని రథాన్ని లాగే లావుపాటి తాడు; హొరజె, హొరై. ఏనుగు మెడకు కట్టే మోకు.

<క. హొరజె.

**ఒరిజె** రూ.చూ. ఒరిజ. వి. ఏనుగు మెడకు కట్టే గొలుసు. చంద్రా. 1.31.

**ఒరిటి** వి. నాలుగు మూలలను నలుగురు పట్టుకుని గింజల్ని జల్లించుట కుపయోగించు వెదురుబద్దలతో చేయబడిన సాధనం.

**ఒరిపిడి** రూ.చూ. ఒరపిడి[1]. వి. రాపిడి, ఒత్తిడి.

**ఒరిమ** రూ. ఒరిమి, ఒరిమె[1]. వి. 1. స్నేహం, ఒద్దిక. శృం.నై. 3.126; 2. ఆసక్తి. శృం.నై. 6.61; 3. దయ, జాలి. ఉ. హరిశ్చ. 2.135.

క. ఒర్మె. < ఒమ్మె: సహితం, కూడ, కలిసి; తు. ఒమ్మత. ఐకమత్యం: ఒమ్మెవ్రుని. కలియు; త. ఒరుమై. ఏకత్వం, కలయిక: ఒరి(-ప్పు-; త్తు-). ఐకమత్యంతో కలియు; మ. ఒరుమ, ఒరుత్తి, ఒరుమ. కలయిక.

**ఒరిమిక** రూ. ఒరిమె. వి. 1. వినయం. అచ్చ.రా. 3.121; 2. స్నేహం. **ఒరిమిఁడి** వి. శత్రువు, ద్వేషి. పండి. చ. 1.73 వ. **ఒరిమె** రూ.చూ. ఒరిమిక. వి. 1. వినయం, అణకువ: 2. స్నేహం.

**ఒరిమి** రూ.చూ. ఒరిమ. వి. స్నేహం. మైత్రి.

**ఒరిమిక** చూ. ఒరిమ.

**ఒరిమిఁడి** చూ. ఒరిమ.

**ఒరిమె** చూ. ఒరిమ.

**ఒరియు** రూ.చూ. ఒరయు. స.క్రి. రుద్దు, రాయు.

**ఒరు-** సమాసాల్లో మాత్రమే వస్తుంది. రూ. ఓరు[3]. చూ. ఒకటి, ఒండు; విణ. ఒక.

క. ఒర్, ఓర్, ఒరగె. ఏకత్వం, మొత్తం; కొ. ఒరు, ఒక; తు. ఒర్. ఒక; ఒరు. ఒంటరి; ఒర. ఒకప్పుడు; త. ఒరు, ఓర్. ఒక: ఒరి (-ప్పు-; త్తు-). ఐకమత్యంతో కలియు; ఒరె. ఒకటె మాత్రం; మ. ఒరు, ఓర్. ఒక, అదే; కోట. ఒర్. ఒక; తొద. వ్రుర్ ఓథ్. ఒక సంవత్సరం; కుఇ. రో. విణ. ఒక; కు.వి. రో. ఒక; కురు. ఒర్త్. ఒకడు; మాల్తో. ఒర్. ఒక.

<మూ.ద్రా. ఒక్/*ఒర్.

**ఒరగారు** వి. మిరప పంట మొదటికోత. < ఒరు + కారు[2]. **ఒరుఁడు** రూ.చూ. ఒరువుఁడు. వి. 1. ఇతరుడు, అన్యుడు. భార. ఆర. 2.184; 2. ఒకడు. దశా. 8.150; 3. పొరుగువాడు; 4. కొత్తవాడు. **ఒరుదల** వి. 1. ఒంటరిపాటు, ఏకాంతం; 2. కొండెకానితనం. ఆము. 2.40; 3. ఎలుకకన్నం (అర్థ వివరి); విణ. కొండెవాడు. పిప్ర. 5.40. త. ఒరు-తలై. పక్షపాతం; ఒరు-

త్-తలై. ఒకవైపు. ఒరుదలకాఁడు వి. కొండెకాడు. ఆము. 4.220. ఒరుదలయేరు (-ఏరు) రూ. ఒరుదవేరు. వి. తలకు ఒక పక్కవచ్చే నొప్పి, పార్శ్వపు నొప్పి. ఒరుదవేరు రూ. చూ. ఒరుదలయేరు. వి. తలకు ఒక పక్క వచ్చే నొప్పి. పార్శ్వపు నొప్పి. ఒరువుఁడు రూ. ఒరుఁడు. నర్వ. ఇతరుడు. అన్యుడు. భార.అను. 5.99. క. ఒబ్బ, ఒర్బ, ఒర్వ, ఒబ్బను, ఒబ్బనను. ఒకడు; తు. ఒరియె, ఒరి; త. ఒరువన్. అన్యుడు, ఒకడు; మ. ఒరువన్, ఒరుత్తన్. ఒకడు; కోట. ఒవ్. ఒక; తొ. వ్‌ద్. ఒక; గో. ఒండె. ఒకటి; కుఇ. రొఅంజు. ఒక; కురు. ఒరొత్. ఒకడు లేక ఒకతి; మాల్తో. ఒర్తె. ఒకడు.

ఒరుసు రూ.చూ. ఒఱుసు. అ.క్రి. వంగు, వాలు, పడు. వి. తలగడ, మెత్త, దిండు.

ఒరుసుడుగద్దె వి. ఆనుకునకు ఒకవైపున ఆనుకోటానికి పనటిగా కట్టిన వంపుగావుండే భాగం.

ఒరుసుడుగద్దె చూ. ఒరుసు.

ఒరుచు రూ.చూ. ఒరచు. అ.క్రి. దువ్వు, రాయు, ఒరిపిడిరాతిచేత రాపిడిపెట్టు.

ఒరుచుబద్ద రూ.చూ. ఒరచుబద్ద వి. చిత్రిక గుల్ల.

ఒరుచుబద్ద చూ. ఒరుచు.

ఒరుడుపోటు రూ.చూ. ఉరికిపోటు. వి. తోక వెంట్రుకలు రాలిపోయ్యే వ్యాధి.

ఒరుఁడు చూ. ఒరు.

ఒరుదల చూ. ఒరు.

ఒరుదలకాఁడు చూ. ఒరుదల.

ఒరుదలయేరు చూ. ఒరుదల.

ఒరుదవేరు చూ. ఒరుదల.

ఒరుపు రూ. చూ. ఒఱపు. వి. ఎద్దడి. వర్షాభావం, ఎండల తీవ్రత.

ఒరుపుగాలి వి. ఎర్ర దుమ్ముతో బలంగా వీచే గాలి. ఒరుపుగుంటక వి. పైరులో గడ్డి తీసే మూడు పలుగుల సాధనం. ఒరుపుబల్ల వి. ద్వారబంధం నిలువుకమ్మీ పక్కన గోడకు అతికే చెక్క.

ఒరుపుగాలి చూ. ఒరుపు.

ఒరుపుగుంటక చూ. ఒరుపు.

ఒరుపుబల్ల చూ. ఒరుపు.

ఒరుపుడురాయి రూ.చూ. ఒరపిడిరాయి. వి. గీటురాయి.

ఒరుము అ.క్రి. 1. చురుకగు, తీవ్రమగు. ఆము. 4.171; 2. కలియు.

తు. ఒమ్మత. ఐకమత్యం, కలయిక; త. ఒరుమిప్పు కలయిక; ఒరుమి (-ప్పు-స్-త్తు-). కలిసియుండు; మ. ఒరుమిక్క. కలియు; ఒరుమ. కలయిక; కొడ. ఒర్మె. ఐకమత్యం.

ఒరువు స.క్రి. ఎత్తుపల్లాలు సరిచేయు, చదునుచేయు. వి. తగు సూచన.

ఒరువుఁడు చూ. ఒరు.

ఒరేయు స.క్రి. గూడుపెట్టు, నిలువుగా పేర్చు.

ఒర్లకట్టు వి. కప్పుమీద వేసే సున్నపుబట్టి.

ఒర్తు వి. రాబడి, ఆదాయం.

ఒర్రేయు స.క్రి. తిరగబెట్టు.

ఒఱ వి. 1. ఖడ్గాదికోశం, ప్రత్యాకారం. హై.వి. 8.138; 2. సూతివర. ఆము. 1.57; 3. కళ్ళతోదు పెట్టుకొనే తేను, దింపుగరిబు.

క. ఒఱె. తిత్తి. కోశం; కొడ. ఒరె. ఖడ్గాదికోశం; తు. ఒరె, ఉదె; త. ఉఱై; మ. ఉఱ. ఒర. దిండు, గలీబు, కోటు; కోట. ఒర్. తిత్తి, కోశం; పర్జి. ఒర. ఖడ్గాదికోశం.

ఒఱపెంకు వి. నూతి ఒర. ఒఱలమయ్యి రూ.చూ. ఒఱల నుయి. వి. మట్టికాల్చి చేసిన గుండ్రని ఒరలు దింపి కట్టిన నూయి. ఒఱలనూయి రూ. ఒఱల నుయ్యి. వి. మట్టికాల్చి చేసిన గుండ్రని ఒరలు దింపి కట్టిన నూయి.

ఒఱకటము రూ. ఒరక, ఒరకాటము. ఒరగడ్డము, ఒఱకము, ఒఱకాటము, ఒఱగడము, ఒఱగడ్డము. చూ.ఒఱగు. వి. 1. విషమ పరిస్థితి. ద్వి.భాగ. 1: 2. కష్టం; విణ. 1. విషమించినది; 2. ఎత్తువల్లాలు గలది.

ఒఱకము చూ. ఒఱగు. రూ.చూ. ఒఱకటము. వి. 1. పల్లవ ప్రదేశం. కాశీ. 2.45; 2. గొయ్యి. సురా. 99; 3. ఇబ్బంది, కష్టం. కాశీ. 7.166; విణ. నిట్టనిలువైనది.

ఒఱకాటము రూ.చూ. ఒఱకటము. వి. విషమ పరిస్థితి, లోతు, కష్టం.

ఒఱగడము చూ. ఒఱగు.

ఒఱగడ్డము చూ. ఒఱగు.

ఒఱగఁబడు చూ. ఒఱగు.

ఒఱగల్లు రూ.చూ. ఒరగల్లు. వి. గీటురాయి.

ఒఱగాయు అ.క్రి. ఒరిసేటట్లుకాయు, బాధపడు.

ఒఱగాలనిలుచు చూ. ఒఱగాలు.

ఒఱగాలు రూ.చూ. ఒరగాలు. వి. ఒంటికాలు. అప్ప. 2.197.

త. ఒత్తైక్కాల్. ఒంటికాలు.

ఒఱగాలనిలుచు అ.క్రి. ఒంటి కాలిపై నిలుచు.

ఒఱగిపోవు చూ. ఒఱగు.

ఒఱగు రూ. ఒరగు, ఒరుగు, ఒఱవు, ఒఱుగు. అ.క్రి. 1. వంగు, ఏటవాలుగా వుండు. కు.సం. 7.930, భార. భీష్మ. 1.47; 2. పక్షపాతం వహించు. భార. శాంతి. 2.374.

క. ఒఱగు, ఒఱగు. వంకరగు, వంగు, వాలు, క్రూరంగా ఉండు, పైనబడు, కిందబడు, నిద్రించు; తు. ఒరగుని. ఒంగు, ఒరుగు; ఒరుదుని. ఒక పక్కకు వాలు; ఒర్ద. వంకర; త. ఉఱఙ్కు. వాలు; కుఇ. ఉస, ఉత. మొక్కరించు; పర్జి. ఒర్గ్. వంగు.

<మూ.ద్రా. *ఒత్- అఙ్క్- లేక *ఉత్- అఙ్క్-.

ఒఱగడము రూ.చూ. ఒఱకటము. వి. విషమ పరిస్థితి, సంకటం. ఒఱగడ్డము రూ.చూ. ఒఱకటము. వి. సంకటం, కష్టం, బాధ; విణ. విషమం. ఒఱవ+గడ్డ(ము). ఒఱగఁబడు రూ. ఒరగఁబడు, ఒఱవఁబడు. అ.క్రి. వంగు, వాలు. ఆము. 1.67. <ఒఱగు+-అ(న్)+పడు. ఒఱగిపోవు అ.క్రి. వంగిపోవు. వంకరగు. ఒఱగుదిండు రూ. ఒరగు దిండు. వి. ఆనుకోటానికి ఉపయోగించే గుండ్రని దిండు.

సుద. 5.50. **ఒఱగుపోవు** రూ. ఒరగుపోవు, ఒఱగువోవు. అ.క్రి. వంగు, వంకరగు. హరిశ్చం. 4.168. **ఒఱగుబిళ్ల** రూ. ఒరగుబిల్ల, ఒరగుబిళ్ల. వి. ఆనుకోవటానికి ఉపయోగించే గుండ్రని దిండు. **ఒఱగువోవు** రూ.చూ. ఒఱగుపోవు. అ.క్రి. వంగు, వంకరగు. <ఒఱగు+పోవు.

**ఒఱగుదిండు** చూ. ఒఱగు.

**ఒఱగుపోవు** చూ. ఒఱగు.

**ఒఱగుబిళ్ల** చూ. ఒఱగు.

**ఒఱగువోవు** చూ. ఒఱగు.

**ఒఱగొడ్డియము** రూ.చూ. వఱగొడ్డము. వి. సర్మ గర్భ సంభాషణ, వక్రోక్తి, వేళాకోళం.

**ఒఱగొడ్డెము** చూ.చూ. వఱగొడ్డము. వి. 1. నూటి పోటి మాటలు. రంగ.చ. 2.171 ; 2. వక్రోక్తి, వేళాకోళం.

**ఒఱగొడ్డెములాడు** అ.క్రి. దెప్పిపొడుచు, వేళాకోళం చేయు.

**ఒఱగొడ్డెములాడు** చూ. ఒఱగొడ్డము.

**ఒఱచాలుదుక్కి** రూ. ఒరచాలుదుక్కి. ఒఱిచాలుదుక్కి. వి. ఒకసారి దున్నిన నేల.

త. ఒరు-చాల్-ఉఴు. ఒకసారి దున్ను.

**ఒఱటు** పో.చూ. మొఱటు. వి. 1. దురదృష్టవంతుడు, చెడ్డ అలవాట్లున్న వ్యక్తి, చెడ్డ ఆడది. భార. అను. 5.98 ; 2. దుర్మార్గుడు, క్రూరుడు. హరి.పూ. 9.19.

క. ఒరటు. అహంకారి ; ఉరుటు, ఒరటు. అహంకారం, గర్వం ; తు. ఒరంటు. మూర్ఖపు పట్టు, ద్వేషం ; త. ఉరుట్టు. వాగ్ధోరణిచే తబ్బిబ్బుచేయు, బాధించు, దుఃఖపెట్టు.

**ఒఱపరి** చూ. ఒఱపు.

**ఒఱపారు** చూ. ఒఱపు.

**ఒఱపిడి** చూ. ఒఱపు.

**ఒఱపిఁడి** చూ. ఒఱపు.

**ఒఱపు** రూ. ఒరపు[2], ఒరుపు, ఒరుపు. వి. 1. విధం, రీతి, మార్గం, పద్ధతి. కు.సం. 3.313, భార. విరా. 2.291 ; 2. మోటుతనం. భార. అర. 2.135 ; 3. తాపం, బాధ. భార. అర, 2.184 ; 4. నేర్పు, నైపుణ్యం. భార. విరా. 2.21 ; 5. ఆదర్శం. భార. వి. 2.191 ; 6. యుక్తి, ఉపాయం. భార. కర్ణ. 1.314 ; 7. యోగ్యత, సమర్థత. ఉ.హరి. 4.48 ; 8. కల్పన. విక్ర. 8.48 ; 9. సౌందర్యం, శోభ ఒప్పు, విలాసం. రామా. 4.107, మను. 4.69 ; 10. ప్రతాపం. రసిక 1.36 ; 11. నిలకడ, స్థైర్యం. పరమ. 3.14 ; విణ. 1. యుక్తం. భార. విరా. 4.89 ; 2. ఒప్పైనది, ఇంపైనది. శివ.సా. 289 ; 3. విశాలం, పెద్దది. భాగ. 8.256.

క. ఉఱు. పైకిరావటం ; ఒఱల్ ; త. ఉఱు. అ.క్రి. కోరదగినది, శాశ్వతమగు, ప్రేమించు, అనుభవం పొందు ; ఉఱై. స్థిరపడు ; ఉఱైప్పు. స్థిరత్వం, గట్టిదనం ; మ. ఉఱప్పు. స్థిరం, ఆధారం, వాగ్దానం ; కోట. ఉర్వ్- (ఉర్ద్-). లోపలకు అదుము.

**ఒఱపరి** వి. 1. అందగాడు. జై.భా. 3.28 ; చంపూ. 5.33 ; 2. అందగత్తె. నేర్పరి. **ఒఱపారు** అ.క్రి. మదురమగు, తియ్యనగు. రాధికా. 2.109. **ఒఱపిడి** రూ.చూ. ఒరపిడి[1]. వి. రాయిడి. సంఘర్షణం. **ఒఱపిఁడి** వి. 1. అధముడు, నీచుడు. విక్ర. చ. 3.107 ; 2 టక్కరి. **ఒఱపుకాఁడు** వి. 1. మోటువాడు. సురా. 57 ; 2. అందగాడు. **ఒఱపుమీఱు** అ.క్రి. ఒప్పు. రాగి ఉండు. కృ.శతం. 1.71. **ఒఱపులాఁడి** వి. సౌందర్యవతి. ఒప్పులాడి. చంపూ. 6.54. **ఒఱపులాఁడు** వి. నీటు, అందగాడు. సుద. 5.50.

**ఒఱపుకాఁడు** చూ. ఒఱపు.

**ఒఱపుమీఱు** చూ. ఒఱపు.

**ఒఱపులాఁడి** చూ. ఒఱపు.

**ఒఱపులాఁడు** చూ. ఒఱపు.

**ఒఱపెంకు** చూ. ఒఱ.

**ఒఱయిక** రూ.చూ. ఒరయిక. వి. 1. రాపిడి ; 2. తగాదా, వైరం.

**ఒఱయు** రూ.చూ. ఒరయు. స.క్రి. రాచు, గోకు, ఒత్తిడిచేయు.

**ఒఱలమయ్య** చూ. ఒఱ.

**ఒఱలమాయి** చూ. ఒఱ.

**ఒఱలు** రూ. ఒరలు. అ.క్రి. 1. విలపించు. భార. ఆర. 6.225 ; 2. అరచు, ధ్వనిచేయు. భార. ద్రోణ. 2.132, కాశీ. 6.163 ; 3. కలతనొందు, క్షోభపడు. రామా. 6.141.

క. ఒఱల్, ఒఱలు. అరపు, కూత, బొబ్బ ; తు. ఉరల్, ఒరల్ ; మ. ఉఱుమ్బుక. అరచు, గొణుగు ; కుఇ. ఒర్పు. బెంగపెట్టుకొను, గుబులుపడు ; కువి. ఒట్పు. దుఃఖించు.

**ఒఱవ** చూ. ఒఱగు. విణ. 1. వక్రం, వికృతం. భార. ఆర. 2.134 ; 2. తారుమారు, వ్యత్యస్తం ; 3. అసహ్యం, చిన్న యేరు.

**ఒఱవఁబడు** చూ. ఒఱవు.

**ఒఱవు** రూ.చూ. ఒఱగు. అ.క్రి. వంగు, ఒరుగు. జై.భా. 6.230.

**ఒఱవఁబడు** రూ.చూ. ఒఱగఁబడు. అ.క్రి. పక్కకు ఒంగు. జై.భా. 6.230.

**ఒఱిగాలు** రూ.చూ. ఒరగాలు. వి. వంగిన కాలు, కుంటి కాలు.

**ఒఱిచాలుదుక్కి** రూ.చూ. ఒఱచాలుదుక్కి. వి. ఒక మారు దున్నిన నేల.

**ఒఱిబీజము** రూ.చూ. ఒఱుబీజము. వి. ఒక పక్క బీజం వాచే రోగ విశేషం.

**ఒఱియిక** రూ.చూ. ఒరయిక. వి. ఒరిపిడి.

**ఒఱు** రూ.చూ. ఒట్టు[1]. విణ. పెద్దది, గొప్పది.

పో.చూ. సం. ఉరు. పెద్దదైన, గొప్పదైన.

**ఒఱుగు** రూ.చూ. ఒఱగు. అ.క్రి. వంగు, వాలు. వి. తలగడ దిండు.

**ఒఱుగొమ్ము** పో.చూ. ఒఱు. వి. ఒకవైపున భారం హెచ్చించటం వల్ల కలిగిన తూకం.

**ఒఱుబీజము** రూ. ఒఱిబీజము. వి. ఒకపక్క బీజం వాచే రోగ విశేషం.

ఒహులు: <ఒబు+బీజము.

**ఒట్టు** రూ. ఒట్టు³. విశ. కటువు, కారమైనది. పాండు. 4.184. వి. కారం, కటుత్వం.

త. ఉఱై. కారం; ఒఱు. బాధించు, దుఃఖపెట్టు. మ. ఉఱ. తీక్షణత, పదును.

ఒట్టుకసింద వి. తీటకసింద, కచ్చుర. **ఒట్టన** రూ. ఒట్టిన. విశ. కటువైన, కారమైన. ఆము. 5.107. వి. కారం. ఒట్టు(దనము వి. కారం. <ఒట్టు+-తనము.

**ఒట్టుకసింద** చూ. ఒట్టు.

**ఒట్టన** చూ. ఒట్టు.

**ఒట్టు(దనము** చూ. ఒట్టు.

**ఒట్టాడు** అ.క్రి. శౌర్యం పిదుచు, సొగుదల మాట్లాడు.

**ఒట్టి** వి. ఆటల్లో ఎదుటివారిని దెప్పగొట్టే మాట. ధ్వన్యనుకరణ శబ్దం కావచ్చు.

**ఒట్టిన** రూ.చూ. ఒట్టన. వి. కారం; విశ. కారంగల.

**ఒట్టియ¹** చూ. పట్టి-(ఆవు). రూ. ఒట్టె¹. విశ. లొంగనిది, వక్రం, అవశం. వి. 1. లొంగని ఆవు, సాధువుకాని ఆవు; 2. అధముడు, పంద; 3. సముద్రశాఖ, అఖాతం; 4. చిన్న కుప్ప.

క. ఒఱడు. పట్టిపోయిన ఆవు; త. వఱట్టుప్పసు. ఎండిపోయిన ఆవు.

**ఒట్టియ²** రూ. ఒట్టె². వి. పగులు, బీట.

**ఒట్టు¹** రూ. ఒఱు. విశ. పెద్దది, గొప్పది.

క. ఒత్తు. మందం, దట్టం, కప్పు; త. ఒట్టు. స.క్రి. సంబంధాన్ని గూర్చు.

**ఒట్టు²** పో.చూ. వట్టి. విశ. లోపం, తక్కువ, న్యూనత.

**ఒట్టు³** రూ.చూ. ఒట్టు. వి. కారం.

**ఒట్టె¹** రూ.చూ. ఒట్టియ¹. విశ. లొంగనిది, వక్రం, అవశం. నవనాథ. 1. పు. 40. పం. 3. వి. పట్టిపోయిన ఆవు.

**ఒట్టెకూతలు** వి. అసహ్యకరమైన మాటలు.

**ఒట్టె²** రూ.చూ. ఒట్టియ². వి. పగులు, బీట.

**ఒట్టెకూతలు** చూ. ఒట్టె¹.

**ఒల¹** వి. తడి, చెమ్మ.

సం. ఓల-. తడి, చెమ్మ. ప్రా. ఓల్ల, ఉల్ల. తడి, తేమ.

<సం. ఓల-.

**ఒల²** వి. నెపము, మిష, సాకు.

**ఒలక(బోయు** చూ. ఒలుకు¹.

**ఒలకిల** రూ.చూ. ఒలికి. వి. వల్లకాడు, స్మశానం.

**ఒలంద** రూ. వలంద. వి. డచ్చి భాష.

**ఒలపక్షము** రూ. వలపక్షము. చూ. ఒలయు. వి. పక్షపాతం.

క. ఒల్. కోరు, ఇష్టపడు; త. ఒల్, ఒల్లు. అంగీకరించు, తగు; మ. ఒల్లు. ప్రేమించు.

**ఒల(బడు** స.క్రి. కొల్లగొట్టు. ఆము. 6.85.

పో.చూ. త. ఉలై. సైన్యం మొ. చెల్లాచెదరగు, అణగగొట్టు, నాశనం చేయు.

**ఒల(బోక** వి. ఒరపు, ఆరాటం, పెట్ట.

**ఒలయించు** చూ. ఒలయు².

**ఒలయు¹** స.క్రి. 1. అభిలషించు, కోరు. భార.ఆది. 7.149; 2. పొందు. భార.అర. 1.234, మార్క. 2.55; 3. కదియు, సమీపించు. ఆము. 1.60; అ.క్రి. 1. కలయు, కూడు. భార.సభా. 2.131; 2. స్ఫురించు, తోచు. భార.ద్రోణ. 4.238; 3. కలుగు, జనించు, సంభవించు. భార.అను. 4.147; 4. ఉన్ముఖమగు, ఇష్టపడు. భార.మహా. 1.4; 5. వ్యాపించు, ప్రసరించు. భార.అర. 1.180, మను. 1.12; 6. ఒప్పు, ప్రకాశించు. ఉ.హరి. 5.276; 7. చొచ్చు, ప్రవేశించు. మార్క. 2.52, హరి.పూ. 2.30; 8. అతిశయించు, పెరుగు. శృం.నై. 2.119; 9. ఉండు, వర్తిల్లు. భాగ. 10. పూ. 1028; 10. తాకు, స్పృశించు. ఆము. 2.27; 11. సంచరించు, తిరుగు. చిత్ర.భార. 3.103.

క. ఒల్. బహిర్గతమగు, కనబడు, ప్రేమించు; పొళె, పొళె. ప్రకాశించు; తు. ఉలెప్పని, ఉళప్పని, పొళప్పుణు. ప్రకాశించు; త. ఒలి. అంకురించు, మొలకెత్తు, వర్ధిల్లు, వృద్ధిపొందు; ఒలియల్. విలాసం, వైభవం.

<మూ.ద్రా. *ఒల్- అయ్.

**ఒలయు²** అ.క్రి. 1. వేలాడు. భార.అర. 1.107; 2. పీచు. మను. 2.24, ఆము. 5.103; 3. వాలు, పడు. ఉ.రా. 6.83.

క. ఒలె. వేలాడు, ఊగు, కదలు; త. ఒలుక్కు. కదులు, పక్కకు కదలు; ఉలైవు. వణకు; మ. ఒలుమ్పుక. అటూ ఇటూ కదులు.

<మూ.ద.ద్రా. *ఒల్-.

ఒలయించు స.క్రి. 1. కూర్చు, సంఘటించు. భార.శాం. 3.147; 2. విడుచు, నిగిడించు. కృ. శకుం. 1.30.

**ఒలవి** రూ.చూ. ఒలవు. వి. ఎత్తు, ఉన్నతి. రం.రా. 6 వ. 316. పం. 18.

**ఒలవు** రూ. ఒలవి. అవ్య. మిక్కిలి, అత్యధికం. నరస. 2.148.

**ఒలస** రూ.చూ. వలస. వి. యుద్ధకారణంవల్లగాని ఈతి బాధల వల్లగాని ఒక ప్రాంతంనుంచి మరో ప్రాంతానికి జనులు తరలి పోవటం.

**ఒలాతడము** వి. ఇటూ అటూ పచారు చెయ్యటం, మంద గమనం.

త. ఉలాత్తు. వి. ఇటూ అటూ పచార్లు చేయడం; ఉలాత్తు. అ.క్రి. స్వారిచేయు, ఊరేగింపులో వెళ్ళు; మ. ఉలాత్తుగ. షికారుకు తీసుకెళ్ళు; పర్జి. చుల్. వినోదం కొరకు అటూ ఇటూ తిరుగు.

<మూ.దా. *చుల్-.

**ఒలాందా** రూ. ఒళంద. వి. హాలండు.

ఇం. Holland.

<ఇం. Holland.

**ఒలాందాకమలము** వి. డచ్చి పద్ధతిలో కోయబడ్డ వజ్రం. త. ఉలాంతాక్కమలమ్. **ఒలాందాభూములు** వి. భీముని పట్నందగ్గరున్న డచ్చివారి దాకిరేవులు. **ఒలాందామల్లె** వి. డచ్చిదేశం మల్లె. **ఒలాందావాండ్లు** సర్వ. డచ్చిదేశంవారు.

**ఒలాందాకమలము** చూ. ఒలందా.

**ఒలాందాభూములు** చూ. ఒలాందా.

**ఒలాందామల్లె** చూ. ఒలాందా.

**ఒలాందావాండ్లు** చూ. ఒలాందా.

**ఒలి**[1] చూ. ఒలుచు. వి. దోపిడి, మోసంచేతగాని బలంచేతగాని తీసుకుపోవటం, అపహరణం. జై.భా. 1.63.

**ఒలిపుచ్చుకొను** స.క్రి. ద్రోహంచేత శత్రువులకు ఒప్పగించు, బయపడేటట్టు చేయు, పోగొట్టు. **ఒలివడు** అ.క్రి. దోపుడుపోవు, చూరయిచ్చు. ఆము. 6.85. <ఒలి + పడు. **ఒలిపోవు** అ.క్రి. దోపుడుపోవు, ఒలిపడు. యయా. 1.29. <ఒలి[1] + పోవు.

**ఒలి**[2] వి. ఆడు కప్ప పేర్పులోని మూరెడు పన.

**ఒలి**[3] వి. తిరిగిన ఒక్క తిప్పు. దా. 12.

పో.చూ. సం. వలయ-. పరిధి. గుండ్రని ఉంగరం. కడియం మొ.

**ఒలి**[4] వి. దవలికాయలు ఉడకబెట్టిన తరవాత ఊడే పై పొర.

సం. వలి-, వళి-. ముడత, కడుపుమీది ముడత.

<సం. వలి-. అర్థవిపరి.

**ఒలికి** రూ. ఒలకిల, ఒలికిలి, ఒలుకు[2], ఒల్కి, ఒల్కు[2]. వి. 1. చితి.వీర. 2.274 ; 2. స్మశానం.

క. ఒలె. పొయ్యి, నిప్పుగూడు ; త. ఒళి. నిప్పు ; మ. ఉల. కొలిమి. కొలిమితిత్తి ; పర్జి. ఒలంగమ్. అగ్ని జ్వాల.

**ఒలికికాడు** వి. స్మశానం. పో.చూ. త. ఉలై. పొయ్యి, నిప్పుగూడు. **ఒలికిపొగ** వి. స్మశాన ధూమం, వల్లకాటి పొగ. **ఒలికిబూడిద** వి. (దొంగలు చోరసాధనంగా ఉపయోగించేది) చితాభస్మం. దశ. 5.72. **ఒలికిమిట్ట** వి. స్మశానం. **ఒలికులమిట్ట** రూ. ఒలుకులమిట్ట. వి. స్మశానం. **ఒలుకులగడ్డ** వి. స్మశానం. **ఒలుకులమిట్ట** రూ.చూ. ఒలికులమిట్ట. వి. వల్లకాడు, స్మశానం.

**ఒలికికాడు** చూ. ఒలికి.

**ఒలికించు** చూ. ఒలుకు[1].

**ఒలికిపొగ** చూ. ఒలికి.

**ఒలికిపోవు** చూ. ఒలుకు[1].

**ఒలికిబూడిద** చూ. ఒలికి.

**ఒలికిమిట్ట** చూ. ఒలికి.

**ఒలికిలి** రూ.చూ. ఒలికి. వి. స్మశానం.

**ఒలికులమిట్ట** చూ. ఒలికి.

**ఒలికొయ్య** వి. మగ్గంమీద నేత బిర్రు పెట్టటానికి, మోకు కట్టే కొయ్య.

**ఒలిదామర** వి. ఒక రకం చెట్టు.

పో.చూ. సం. వలి. చలి, వణకు, గాలి ; విఐ. శీతం. బహుశః <సం. వలి- + తామర.

**ఒలిపి**[1] రూ.చూ. ఉలిపి[1]. వి. పశువుల శరీరంమీది బొల్లివంటి మచ్చలు.

**ఒలిపి**[2] పో.చూ. ఒలుపు. వి. కొయ్యలో పుడుగు తొలిచేటప్పుడు రాలే పొడి, కొయ్య మెత్తపడటం.

**ఒలిపించు** చూ. ఒలుపు[1].

**ఒలిపిరి** రూ. ఒలిపెర. వి. వానకుంపర.

**ఒలిపుచ్చుకొను** చూ. ఒలి[1].

**ఒలిపెర** రూ.చూ. ఒలిపిరి. వి. వానకుంపర.

**ఒలిమి** వి. చేతి మగ్గంమీద డిజైన్లు చేసేటప్పుడు పడుగు పోగుల్లో కొన్నింటిని విడదీయటానికి లంకెలుగా వేసిన చిక్కుదారాలు.

**ఒలిమె**[1] రూ.చూ. ఒరిమ. వి. స్నేహం.

**ఒలిమె**[2] వి. దిమ్మకు పక్కన ఉన్న అంచు.

**ఒలియఁగట్టు** చూ. ఒలియు.

**ఒలియించు** చూ. ఒలియు.

**ఒలియు** అ.క్రి. 1. ఊడినదగు (చర్మము మొ.). భార.ఆది. 5.165 ; 2. ఊడు (చర్మము మొ.) ; 3. సోమరియగు.

పో.చూ. క. సులి. చించు, ఒలుచు. చదునుచేయు. కొల్లగొట్టు, దోపిడిచేయు ; తు. సొల్లుణా, తొల్లుని. ఒలుచు, తోలుదీయు ; ఒలిపు. చర్మం ; త. ఉరి, వాలి. ఒలుచు, తోలుడీయు ; ఒలియల్. చర్మం, వస్త్రం. వి. చర్మం ; మ. తొలిక్క. ఒలుచు ; గోం. ఊఘానా, ఊఘి, ఉచ్కా. ఒలుచు, పక్షి రెక్కలు ఊడదీయు ; పర్జి. ఒల్చ్-. ఒలుచు ; నా. ఒల్స్ ; పో.చూ. కుయి. ఫ్లోల్. ఉపరితలాన్ని రాపిడిపల్ల నునుపుచేయు ; మాల్తో. ఫోల్యె. ఒలుచు, బెరడుతీయు ; బ్రా. సిల్. చర్మం.

<మూ.ద.ద్రా. *ఒల్-/*తొల్-/*చొల్-.

<మూ.ద్రా. *చోల్-/*చొల్-.

**ఒలియఁగట్టు** స.క్రి. (వస్త్రాదులను) వెనక్కు విరిచి కట్టు. <ఒలియు + -అ[1](న్) + కట్టు. **ఒలియించు** పో.చూ. పొలియించు. స.క్రి. చంపు. భాగ. 10. 4.400.

**ఒలివడు** చూ. ఒలి[1].

**ఒలివాటు** రూ. వల్లెవాటు. వి. ఒల్లె.

**ఒలిపోవు** చూ. ఒలి[1].

**ఒలుకు**[1] రూ. ఒలుగు, ఒల్కు[1]. స.క్రి. 1. చల్లు, చిలకరించు భార.ఆది. 7.125, విరా. 5.232 ; 2. వెలువడజేయు. మార్క. 3.352 ; 3. పోయు. కవిక. 6 ; అ.క్రి. 1. స్రవించు, కారు. భార.ఆది. 2.100, ఉద్యో. 4.321 ; 2. వెడలు, వెలువడు, వ్యక్తమగు. భార.ఆది. 6.217, వి.పు. 2.48 ; 3. రాలు, చిందు, చెదరు. కాశీ. 6.257 ; 4. దగ్ధమగు. హర. 3.38 ; 5. కలుగు. సిం.ద్వా. 1.8 ; 6. పొగువడు. సిం.ద్వా. 2.69 ; 7. తొలగు, తొనకు. కకు. 2.138 ; 8. లాభదాయకమగు ; వి. 1. పతనం ; 2. ప్రవాహం ; 3. వయ్యారంగా నడిచే స్త్రీ.

క. ఓలాడు. అల్లకల్లోలాడు ; ఒళ్కు. ప్రవహించు. వి. వడిగల ప్రవాహం ; త. ఒయుకు. ప్రవహించు, కారు, ఉరియు, తెలియజేయు, నీటివలె కిందకు జారు ; ఒలుక్కు. పడజేయు, ముంచు ; పో.చూ. ఒల్కు. కదులు, కంపించు ; మ. ఒలియుక. ప్రవహించు ; ఒలిక్క. ప్రవహించు, గాయంనుంచి రసి కారు ; ఒలిప్పు, ఒలిఫ్రు. ప్రవహించటం ; ఓలుక. ప్రవహించు, చెమర్చు, కారు , పో.చూ. ఒలంపుక. ఇటూఅటూ ఊగిసలాడు.

**ఒలకఁబోయు** స.క్రి. చిందబోయు. < ఒలుకు[1] + -అ[1](న్) + పోయు. **ఒలికించు** (ఒలుకు ప్రే.) స.క్రి.

1. ఒలుకజేయు. మొల్ల. 6.1.25 ; 2. కక్కు. **ఒలికిపోవు** అ.క్రి. ఒలుకు. చిందు. పొర్లిపోవు. **ఒలుకుఁబప్పు** రూ. ఒలుపుఁబప్పు. వి. పొట్టు ఒలిచిన పప్పు. చాయపప్పు. రాజవా. 2.100. **ఒలుకులువాఱు** అ.క్రి. 1. ప్రవహించు. వరాహ. 12.43 : 2. ఒలుకు. చిందు. <ఒలుకులు+పాఱు.

**ఒలుకు[2]** రూ.చూ. ఒలికి. వి. స్మశానం.

**ఒలుకుఁబప్పు** చూ. ఒలుకు[1].

**ఒలుకులగడ్డ** చూ. ఒలికి.

**ఒలుకులమిట్ట** చూ. ఒలికి.

**ఒలుకులువాఱు** చూ. ఒలుకు[1].

**ఒలుగు** రూ.చూ. ఒలుకు[1]. అ.క్రి. జారు, పొర్లిపోవు.

**ఒలుచు** రూ. ఉలుచు, ఉల్చు, ఒల్చు. చూ. ఒలియు. స.క్రి. 1. ఊడ్చు. ఊడదీయు (చర్మం. వస్త్రం). భార. 4.5.222 : 2. దోచు, కొల్లగొట్టు. కాశీ. 7.250 ; 3. పొట్టుతీయు. పెచ్చుపెరచు. మటికా. 2.16 : 4. తొక్కతీయు.

పర్జి. ఒల్ చ్. తొక్కతీయు, ఒలుచు ; నా. ఒల్స్.

**ఒలుపడు** చూ. ఒలి. అ.క్రి. దోచు, దొంగిలించు, కొల్లగొట్టు.

**ఒలుపబంధము** చూ. ఒలుపు[2].

**ఒలుపు[1]** రూ. ఒల్పు[1]. ఒల్వు. చూ. ఒలుచు. వి. 1. పొట్టు మొ. ఒలవటం. ద.శా. 2.14 ; 2. సాధించిన పని.

**ఒలిపించు** స.క్రి. పొట్టు. తోలు మొదలైనవి తీసి వేయించు. భార.విరా. 1.180. **ఒలుపుఁబప్పు (-పప్పు)**. రూ.చూ. ఒలుకుఁబప్పు. వి. పొట్టు తీసిన పప్పు, చాయ పప్పు.

**ఒలుపు[2]** రూ. ఒల్పు[2]. వి. ఒకరకం కావ్యదోషం.

**ఒలుపబంధము** వి. ఒకరకం కావ్యదోషం.

**ఒలుపుఁబప్పు** చూ. ఒలుపు[1].

**ఒలులు** వి. గడ్డికుప్ప వేసేప్పుడు చేసే భాగాలు.

**ఒలువు[1]** వి. కొత్తగా బావులు తవ్వేముందు నీటిమట్టం, జాలు, రుచి మొదలయినవాటిని తెలుసుకోటానికి మొదటవేసే కొద్ది పాటి వైశాల్యం గల గుంట.

పో.చూ. క. ఉళి. మాటుప్రదేశం ; ఒళవు, ఒళగు. రహస్యం ; పో.చూ. కొడ. ఒళి, ఒళిప్పు, ఒళిచ్. దాక్కొను ; తు. ఒళ్. రహస్యం ; త. ఒళి. దాక్కొను. వి. మాటుప్రదేశం ; ఒళివ్వు. దాక్కొను ; ఒళివు. రహస్యప్రదేశం ; పో.చూ. మ. ఒళి. రహస్యప్రదేశం : తొద. వ్వుళయ్ (వళ్-) ; కోట. ఒయిళ్ (-ఒళ్ప్-). దాక్కోటం.

**ఒలువు[2]** వి. లోకువపటం, లోబడటం.

**ఒలుసు** అ.క్రి. తప్పుకొను. తొలగు.

**ఒలె** రూ.చూ. ఒల్లియ. వి. ఉత్తరీయం, పైపంచె. ఆము. 6.77.

**ఒలెవాటు** రూ.చూ. ఒల్లెవాటు. వి. రజ్జువలె మెలిపెట్టి పైనవేసుకున్న ఉత్తరీయం. క. ఒల్లివాటు ; త. వల్ల చాట్టు. ఎడమ భుజంమీద వేసుకున్న పైపంచె.

**ఒలెవాటు** చూ. ఒలె.

**ఒల్కి** రూ.చూ. ఒలికి. వి. స్మశానం. ద్వి.హరిశ్చ. ఉ. 1623.

**ఒల్కు[1]** రూ.చూ. ఒలుకు[1]. అ.క్రి. 1. స్రవించు, కారు. భార. ఆది. 2.24 ; 2. చిందు. వరా. 7.1,107.

**ఒల్కు[2]** రూ.చూ. ఒలికి. వి. స్మశానం.

**ఒల్చు** రూ.చూ. ఒలుచు. స.క్రి. 1. ఊడదీయు. భార.సభా. 2.231, కు.సం. 2.217 ; 2. కొల్లగొట్టు, దోచు. భార. మా. 185 ; 3. పెరుకు. ఊడబీకు. మార్క. 2.91.

**ఒల్చె[1]** వి. సాయకారి. పొరుగూరునుంచి వచ్చి సేద్యం చేసే రైతు.

**ఒల్చె[2]** వి. పందు పలకలకు బదులు వేసే సన్నటి కర్ర.

**ఒల్పు[1]** రూ.చూ. ఒలుపు[1]. వి. పొట్టు మొ. ఒలవటం. హర. 2.31.

**ఒల్పు[2]** రూ.చూ. ఒలుపు[2]. వి. ఒకరకం కావ్యదోషం.

**ఒల్ల** చూ. అల్ల. క్రి.విశ. మెల్లగా.

**ఒల్లకాటిమాటలు** చూ. ఒల్లకాడు.

**ఒల్లకాడు** రూ. వల్లకాడు. చూ. ఒలికి. వి. స్మశానం.

**ఒల్లకాటిమాటలు** వి. అనర్థకరమయిన మాటలు. వ్య. స్మశానం మాట్లాడే మాటలు.

**ఒల్లగిలు** రూ.చూ. ఒల్లగిల్లు. అ.క్రి. 1. సాయు, క్షీణించు. హరి.ఉ. 3.80 ; 2. తొలగు.

**ఒల్లగిల్లు** రూ. ఒల్లగిలు. చూ. ఒల్లు. అ.క్రి. 1. సాయు, క్షీణించు ; 2. తొలగు.

**ఒల్లన** చూ. అల్లన. క్రి.విశ. 1. తిన్నగా. భాగ. 10 పూ. 927 ; 2. శీఘ్రంగా. ద్వి. హరిశ్చ. ఉ. 1803 ; 3. మిక్కుటంగా, అధికంగా. నీలా. 3.10.

త. ఒల్లైన. తొందరగా.

**ఒల్లంతు** వి. గొట్టు మొదలైనవాటికి నొగగావేసిన వంగల కొయ్య. చీల్చునొగ.

**ఒల్లమి** చూ. ఒల్లు.

**ఒల్లము** పో.చూ. ఉల్లము. వి. మూర్ఛ, మైమరపు.

**ఒల్లఁబడు** చూ. ఒల్లు.

**ఒల్లఁబాటు** చూ. ఒల్లు.

**ఒల్లఁబుచ్చు** చూ. ఒల్లు.

**ఒల్లఁబోక** చూ. ఒల్లు.

**ఒల్లఁబోవు** చూ. ఒల్లు.

**ఒల్లి** విశ. బక్కపలచన.

పో.చూ. తు. ఒలెప్పుని. అలసట ; త. ఒల్లి. బక్క పలుచనివాడు, పల్చన.

**ఒల్లిగము** పో.చూ. వల్లిగము, వి. పొలంచుట్టూ వేసిన కంచె. పొలానికి కంచె వెయ్యటానికి పేర్చిన రేగు కంపల పోగు.

**ఒల్లియ** రూ. ఒలె, ఒల్లె. వి. 1. తలపాగ. భార.కర్ణ. 8.327 ; 2. చీర. హర. 4.81 ; 3. ఒణి, పైబట్ట. భాగ. 10 పూ. 548.

క. ఒల్లి. పైపంచె ; తు. ఒల్లి, ఒల్లె. దుప్పటి. చాలీ చాలని బట్ట ; మ. ఒల్లి. 5 గజాల పొడవు 3 గజాల వెడల్పు ఉన్నబట్ట ; ఒల్లియల్. మేలి వస్త్రం.

**ఒల్లు** అ.క్రి. 1. ఇష్టపడు. భార. అర. 3.273 ; 2. కలసి మెలసి నివసించు ; 3. ప్రేమించు.

త. ఒల్లు. కలియు, ఒప్పుకొను.

**ఒల్లమి** వి. 1. ఇచ్చగింపకుండటం. భార. సభా.

1.183, శృం.నై. 5.38 ; **2.** అనాదరం, నిరాకరణం. మను. 3.68 ; **3.** రోత, అసహ్యం. కవిక. 5.151 ; **4.** శత్రుత్వం, విరోధం. క. ఒల్. ఇష్టపడు, కోరు, ప్రేమించు ; త. ఒల్లామై. అసమర్థత, అలక్ష్యం, కోర్కె లను లేకుండటం. **ఒల్లబడు** స.క్రి. ఉపేక్షించు ; అ.క్రి. నిరుపయోగమగు. <ఒల్లు+-అ7(న్)+పడు. **ఒల్లబాటు** వి. ఉపేక్ష నిరసనం. భార. భీష్మ. 182, మార్క. 8.60 : విశ. **1.** అనాపేక్షితం, ఉపేక్షితం. మార్క. 5.88 : **2.** నిరుపయోగం. భార. ఉద్యో. 4.322. పో.చూ. క. ఒల్, వల్. ఇష్టపడు, ప్రేమించు : త. ఒల్లామై. అలక్ష్యం, తిరస్కారం. <ఒల్లు + -అ7(న్) + పడు. **ఒల్లబుచ్చు** స.క్రి. మూర్ఛిలజేయు. పీఠ. 4.132. <ఒల్లు+-అ7(న్) +-పుచ్చు. **ఒల్లబోక** వి. అనాదరం. రం.రా. 3.154 వ. <ఒల్లు+-అ7(న్)+పోక. **ఒల్లబోవు** అ.క్రి. **1.** మూర్ఛ పోవు, వైకల్యమునొందు. భార. విరా. 2.112 ; **2.** వాడి పోవు, వన్నెతగ్గు. ఒల్లు+-అ7(న్)+-పోవు.

**ఒల్లె** రూ.చూ. ఒల్లియ. వి. **1.** చీర. ఆము. 2.61 ; **2.** వస్త్రం. ప్రభా. 4.141 ; **3.** బాలికలు ధరించే వస్త్రం, పరికిణీ.

**ఒల్లెకోక** వి. నాగబంధం చీర, గర్భవతులు ధరించే ఎరుపు తెలుపు కలిసిన కలనేత చీర. **ఒల్లెచీర** వి. నాగ బంధం చీర, గర్భవతులు ధరించే ఎరుపు తెలుపు కలనేత చీర. **ఒల్లెతాడు** రూ.చూ. ఒల్లెత్రాడు. వి. **1.** జంతువును పట్టుకోటానికి వేసే ఉచ్చు ; **2.** ఎద్దు కొమ్ములకు కట్టే పన తాడు. **ఒల్లెత్రాడు** రూ. ఒల్లెతాడు. వి. ఎద్దు కొమ్ములకు కట్టే పనతాడు. **ఒల్లెవాటు** రూ. ఒలెవాటు. వి. వల్లెవేసు కున్నట్లు మెలిపెట్టి భుజంపైన వేసుకున్న ఉత్తరీయం. క. ఒల్లివాటు ; త. వల్లవాట్టు.

**ఒల్లెకోక** చూ. ఒల్లె.

**ఒల్లెంక** వి. ఒక రకం చేప.

**ఒల్లెచీర** చూ. ఒల్లె.

**ఒల్లెతాడు** చూ. ఒల్లె.

**ఒల్లెత్రాడు** చూ. ఒల్లె.

**ఒల్లెవాటు** చూ. ఒల్లె.

**ఒల్వు** రూ.చూ. ఒలువు[1]. చూ. ఒలుచు. వి. ఆభరణాలు మొదలయినవి తీసెయ్యటం, ఒలవటం, తీసెయ్యటం.

**ఒల్వువడు** అ.క్రి. చీల్చబడు, ఒలువబడు. <ఒల్వు+ పడు.

**ఒల్వువడు** చూ. ఒల్వు.

**ఒళగు**[1] రూ. వళవు[1]. వి. **1.** కిటుకు ; **2.** వలపు.

**ఒళగు**[2] రూ. ఒళవు[2]. వి. వీణాదండం, ప్రవాళం. భా.రా. 3.2.255.

త. ఉళకు.

**ఒళంద** రూ.చూ. ఒలాందా. వి. హాలెండు.

**ఒళబండారము** వి. ప్రభుత్వ ధనాగారం.

**ఒళరు** వి. **1.** తప్పు, నేరం ; **2.** వ్యాజం, సాకు, మిష ; **3.** హేతువు ; **4.** వదరు ; అ.క్రి. తబ్బిబ్బు మాటలాడు.

క. ఒళరు. అ.క్రి. ధ్వనించు, అరచు, కేకలుపెట్టు ; త. ఉళఱ్. స.క్రి. అర్థంలేకుండా మాట్లాడు, బొబ్బలు పెట్టు, అరచు.

**ఒళవరి** చూ. ఒళవు.

**ఒళవు**[1] రూ.చూ. ఒళగు[1]. వి. **1.** రహస్యం. విజయ వి. 2.200 ; **2.** రహస్య సమాచారం. కువ.చ. 4.138 ; **3.** బావి తవ్వేముందు నీటి ఉనరును కనుక్కోటానికి చేసే ప్రయోగాత్మకమైన తవ్వకం.

క ఒళగు, ఒళవు. లోపలి భాగం, రహస్యం ; కొడ. ఒళి. దాగు ; తు. ఒళ. రహస్యం ; ఒళవు, ఒళిపు. రహస్యాలోచన ; ఒళగుట్టు. రహస్యం ; ఒళిపు. రహస్య ప్రదేశం ; త. ఉళవు. రహస్యం, మర్మం ; మ. ఒళి, ఒళివు. దాపరికం, మరుగు ; ఒళిక. దాగు ; ఒళిక్క, ఒళివ్పిక్క. దాక్కొను ; తొ. ఉళై (ఉళై-). దాగు ; కో. ఒయ్క్- (ఒళ్చ్-). దాగు ; ఒయ్ల్. పెద్దపులిని వేటాడేటప్పుడు చెట్టుమీద పొంచి ఉండే మాటు, కుర. ఓలా. దాగేచోటు.

**ఒళవరి** వి. మర్మజ్ఞుడు, కిటుకు తెలిసినవాడు.

**ఒళవు**[2] రూ.చూ. ఒళగు[2]. వి. **1.** వీణాదండం, ప్రవాళం. కకు. 2.45 : **2.** కీలు, బిటవు.

**ఒళిగము** వి. **1.** ఏతాం ; **2.** నావమీది కడియం.

**ఒళివు** రూ.చూ. ఒఱువు[1]. వి. ఉపాయం, నేర్పు.

**ఒఱుంగు** వి. క్రమం, వరుస, వస్తువుల క్రమం, భూమిని సర్వే చెయ్యటం.

త. ఒఱుంకు అ.క్రి. క్రమంలో వుండటం ; స.క్రి. వరుసలో వుంచు ; వి. వరుస, స్థాయి, క్రమం, పద్ధతి.

<త. ఒఱుంకు.

**ఒఱువు**[1] రూ. ఒళివు. పో.చూ. ఒలువు. వి. **1.** ఉపాయం, లాఘవం ; **2.** సమయం ; **3.** దొంగలకు సూచన లిచ్చే స్థానికుడు ; **4.** లోబడి యుండటం ;

**ఒఱువు**[2] వి. ఆర్చిలు, స్లాబులు మొ. వాటి నిర్మాణానికి వచ్చే తాత్కాలికపు కట్టు.

**ఒళ్ళక్కదొర్లము** చూ. హుళక్కి. వి. అబద్ధాల ఆర్భాటం.

**ఒళ్ళము** రూ.చూ. ఎళ్ళము. వి. ఏడు పలాల బరువు.

**ఒళ్ళు** రూ.చూ. ఒడలు. వి. శరీరం, మేను. రా.వి. 4.55, కవిక. 3.156.

**ఒళ్ళుచేయు** అ.క్రి. **1.** బలిష్ఠంగా శరీరం పెరుగు ; **2.** నిస్సత్త్వంగా శరీరం పెరుగు. **ఒళ్ళుదాచుకొను** అ.క్రి. పనిలో అశ్రద్ధ చూపు. **ఒళ్ళుపెట్టు** అ.క్రి. బలియు. కండ పెట్టు. **ఒళ్ళువచ్చు** అ.క్రి. బలియు, లావెక్కు. **ఒళ్ళువంచు** అ.క్రి. కష్టించి పనిచేయు. **ఒళ్ళువిరుచుకొను** అ.క్రి. **1.** బాగా కష్టపడి పనిచేయు, చెమటోడ్చి పనిచేయు ; **2.** బద్ధకం తీర్చుకొను.

**ఒళ్ళుచేయు** చూ. ఒళ్ళు.

**ఒళ్ళుదాచుకొను** చూ. ఒళ్ళు.

**ఒళ్ళుపెట్టు** చూ. ఒళ్ళు.

**ఒళ్ళువచ్చు** చూ. ఒళ్ళు.

**ఒళ్ళువంచు** చూ. ఒళ్ళు.

**ఒళ్ళువిరుచుకొను** చూ. ఒళ్ళు.

**ఒవ** చూ. ఓడియ. వి. కోసి నూర్చకుండా వున్న పంట.

**ఒవ్వనివాఁడు** చూ. ఒవ్వు[1].

**ఒవ్వమి** చూ. ఒవ్వు[1].

**ఒవ్వు[1]** రూ. ఓవు. అ.క్రి. గిట్టు, పొసగు, వీలుపడు. భార. విరా. 2.286. వి. పరి మొదలయినవాటి పన.

క. ఓ. ప్రేమించు, సంతోషపడు, అంటుకొని యుండు; తు. ఒప్పియుని. ఒప్పుకొను; త. ఒవ్వు. అనుగుణంగా ఉండటం, పోలివుండటం; ఒవ్వఘు. ఒప్పుకొను; మ. ఓవి, ఓవి, ఉవవి. ప్రేమ; ఒవ్వా. అంగీకరించు, ఒప్పుకొను.

<*ఒ + అ > ఒ — వ్-అ/ఒవ్వ్-అ.

<మూ.ద్రా. ఓఁ.

**ఒవ్వనివాఁడు** వి. ప్రకాశించనివాడు, వెలుగులేనివాడు. **ఒవ్వమి** వి. 1. విరోధం, కిట్టకపోవటం. భార. ఆది. 7.217; 2. తప్పు, దోషం. కృశకుం. 2.85; 3. తిరస్కారం.

**ఒవ్వు[3]** పో.చూ. నొవ్వు. అ.క్రి. రూపుచెడు, అందవిహీనమగు. మార్క. 1.256.

**ఒసఁగు** రూ. ఒసవు. స.క్రి. 1. ఇచ్చు. భార. ఆది. 3.201 శాంతి. 6.66; 2. అర్పించు. హర. 2.53, పాండు. 2.25; 3. కలిగించు, కావించు, చేయు. శృం.నై. 5.8; 4. అధీనంచేయు, అప్పగించు. వసు. 3.176; 5. బహూకరించటం. దశా. 5.134; వి. 1. దానం. ఆము. 637; 2. కానుక, బహుమానం. ప్రభా. 4.101.

క. ఒసగె. బహుమతి, పారితోషికం; తు. ఒప్పియుని. ఒప్పగించు; త. ఒయ్. ఇచ్చు; ఒయ్యల్. ఇవ్వటం; ఉయ్. బహుకరించు.

<మూ.ద.ద్రా. *ఒయ్-, *ఒచ్-, *ఒల్-.

<మూ.ద్రా. *ఒచ్-.

**ఒసపరి** చూ. పొసపరి. విశ. అందమైన. వేంక. పంచ 4.143; వి. అందగాడు, అందగత్తె. ద్వి. హరిశ్చ. ఉ. 136.

క. పొస > పొసె > ఒస. నవ్యత్వం, కొత్తదనం; త. పుత. విశ. కొత్త; మ. పుదు.

**ఒసపరికాఁడు** రూ. ఒసపరిగాఁడు. వి. సుందరుడు, అందగాడు. **ఒసపరిగాఁడు** రూ.చూ. ఒసపరికాఁడు. వి. సుందరుడు, అందగాడు. వేంక. పంచ. 3.259. **ఒసపరితనము** వి. అందం, విలాసం. బహుళా. 2.55.

**ఒసపరికాఁడు** చూ. ఒసపరి.

**ఒసపరిగాఁడు** చూ. ఒసపరి.

**ఒసపరితనము** చూ. ఒసపరి.

**ఒసవు** రూ.చూ. ఒసఁగు. స.క్రి. 1. ఇచ్చు. ఒప్పగించు. వి.షు. 2.50; 2. కావించు.

**ఒసి[1]** రూ.చూ. ఓసి. అవ్య. నీచ, మిత్రస్త్రీ సంబోధనార్థకం.

**ఒసి[2]** పో.చూ. ఒసులు. వి. బండి జల్ల పక్కకు కదలకుండా ఉండటానికి బండి చట్రపు నిలువ పట్టెలకు బిగించిన కర్ర.

**ఒసికొయ్య** చూ. ఒసులు. వి. ఎద్దుబండి నిలువ పట్టెలకు బిగించిన కర్ర. **ఒసిగట్టి** చూ. ఒసులు. వి. ఎద్దుబండి నిలువ పట్టెలకు బిగించిన కర్ర.

**ఒసికొయ్య** చూ. ఒసి[2].

**ఒసిగట్టి** చూ. ఒసి[2].

**ఒసిలించు** అ.క్రి. నేత మోకు ముడివిప్పి వదులుచేయు.

**ఒసిలిపోవు** చూ. ఒసులు.

**ఒసీ** రూ.చూ. ఓసి. అవ్య. నీచ స్త్రీ సంబోధనం.

**ఒసుకు** వి. చేపలుపట్టే ఒక రకం గాలం, ఉంఛ గాలం. హంస. 4.184.

త. ఒయ్. లాగు, గుంజు.

**ఒసురు** రూ.చూ. ఓసరు. అ.క్రి. 1. తప్పుకొను; 2. వదులుగా ఉండు.

**ఒసులు** పో.చూ. వసులు. అ.క్రి. తప్పుకొను, తొలగు. పండి. చ. 2.150.

క. ఒయ్. పక్కకు పెట్టు; త. ఒయ్. తొలగు, తప్పుకొను; ఉయ్. కష్టాల నుంచి విముక్తి పొందు; ఒసి. కదల్చు.

**ఒసిలిపోవు** అ.క్రి. తప్పుకొను, తొలగు. **ఒసులుకొను** అ.క్రి. తొలగు, తప్పుకొను.

**ఒసులుకొను** చూ. ఒసులు.

**ఒసె** రూ.చూ. ఓసి. అవ్య. నీచ స్త్రీ సంబోధనం, మిక్కిలి పరిచయంవల్ల చేసే సంబుద్ధి.

**ఒసే** రూ.చూ. ఓసి. అవ్య. నీచ స్త్రీ సంబోధనం, ఎక్కువ పరిచయంవల్ల చేసే సంబుద్ధి.

**ఒసేయ్** రూ.చూ. ఓసి. అవ్య. నీచ స్త్రీ సంబుద్ధి, అతిపరిచయంవల్ల చేసే సంబుద్ధి.

**ఒసూలు** రూ.చూ. వసూలు. వి. (వస్తువులుగాని పన్నులుగాని) రాబట్టటం.

**ఒహెూ** రూ.చూ. ఓహెూ. అవ్య. 1. సంబోధనార్థకం. కళా. 2.72; 2. ఆశ్చర్యార్థకం. దశా. 1.169; 3. ప్రశంసార్థకం.

త. ఓకో, ఒహెూ[1]. ఆశ్చర్యాదుల సూచించేది.

**ఒహెుహెూ** రూ.చూ. ఓహెూహెూ. అవ్య. ప్రశంసార్థకం.

**ఒహెూహెూ** రూ.చూ. ఓహెూహెూ. అవ్య. ప్రశంసార్థకం. ప్ర.భా. 1.108.



**ఓ**[1] తెలుగు వర్ణమాలలో పదకొండో వర్ణం. ఊర్ధ్వ సంవృతమై తాలవ్యేతరమైన ఓష్ఠ్య దీర్ఘ స్వరం.

**ఓ**[2] అవ్య. **1.** ఊహను తెలుపుతుంది. భార. ఆది. 6.240; **2.** సందేహాన్ని తెలుపుతుంది. భార. సభా. 1.212, భాగ. 10. పూ. 1724; **3.** ఎట్లు, ఏమి మొదలయిన పదాలతో కూడిన వాక్యాల్లో ఉపయుక్తం. భార. ద్రోణ. 2.350; **4.** ఆర్తిని తెల్పుతుంది. భార. ఆర. 5.177; **5.** పదానికి చివర వచ్చి ప్రార్థనాదుల్ని తెలుపుతుంది. i. ప్రార్థనం. భాస్క.రా. 5.41; ii. ఆజ్ఞ. కాశీ. 5.274; **6.** అప్రాచుర్యాన్ని సూచిస్తుంది. భీమ. 1.115; **7.** సంబోధనాన్ని తెలుపుతుంది. వరాహ. 7.75. (సంబోధ్య వాచకానికి ముందే ప్రయోగింప బడుతుంది); **8.** తుశబ్దార్థకం. వరాహ. 10.39; **9.** పిల్చినప్పుడు మారు పలుకుటలో ఉపయుక్తం. భాగ. 8.91; **10.** ఆక్షేపాన్ని తెలుపుతుంది. వేంక. పంచ. 1.249; **11.** కాక్వర్థకం. ఆము. 2.91; **12.** పరిణామాతిశయాన్నిగాని, సంఖ్యా బాహుళ్యాన్నిగాని తెలుపుతుంది. పాండు. 3.33, విజయ. 2.125; **13.** ప్రశ్నను తెలుపుతుంది. ఉ.రా. 4.42, దశా. 1.67; **14.** దేన్నైనా విక్రయించటానికి చేసే ప్రకటనను తెలుపుతుంది. దశా. 8.125; **15.** ఏమి (క్రిమర్థకం). ఆం.భా. 3.70; **16.** నిరసనాన్ని తెలుపుతుంది. (వ్యవ. ఎవరో ఏమో అన్నారని వీడు గడగడలాడు తున్నాడు.

క. ఓ, ఒ. సందేహార్థక ప్రశ్నలనుగానీ, వక్రోక్తినిగానీ, సందేహాన్నిగాని తెలుపుతుంది, సంబోధననుగాని, ఆశ్చర్యాన్నిగాని, హెచ్చరికనుగాని తెలుపుతుంది; తు. ఓ; త. ఓ. **1.** సంబోధన ప్రథమా విభక్తి; **2.** సందేహాన్ని తెలుపుతుంది; **3.** ప్రశ్న; **4.** పాదపూరణ శబ్దం; మ. ఓ. పదాల చివరగాని, వాక్యాల చివరగాని చేర్చినప్పుడు ప్రశ్నను తెలుపుతుంది.

**ఓ**[3] రూ.చూ. ఒక్క. విణ. ఒకటి. కాశీ. 5.139.

**-ఓ**[4] చూ. అగు. ప్రత్య. ఒకటి, రెండు, మూడు మొదలయిన సంఖ్యా వాచకాల చివర ప్రత్యయంగా చేరి సంఖ్యా వాచకాలను విశేషాలుగా మారుస్తుంది. ఉదా. రెండు + -ఓ[4] > రెండో, మూడు + -ఓ[4] > మూడో.

**ఓకర** రూ. ఓకిలి, ఓఁకర. వి. **1.** వాంతి, వమనం, డోకు. వేంక. పంచ. 5.6; **2.** రోత.

క. *ఓకరి, ఓకరికె.* వాంతి, డోకు; తు. *ఓంకద్దె,* *వాంకటే.* డోకు వచ్చినట్లుగా వుండటం; త. *ఓక్కాళి.* వాంతి చేసుకొను, డోక్కొను; *ఓక్కాళమ్.* వాంతి; *ఓంకాళి.* వమనం చేసుకొను; మ. *ఓక్కానమ్.* వాంతి; *ఓక్కానిక్క.* వాంతి చేసుకొను, డోక్కొను.

పో.చూ. సం. *ఉద్గార-.* వాంతి, వమనం. వి. పైకి చిమ్మటం; ప్రా. *ఒగ్గారణ, ఒక్కఅమ్.* వాంతి; దే.ప్రా. *ఓక్కలి;* అ.మా. *ఉగ్గిణ్ణ.* వాంతి చేసుకొనిన; పా. *ఒకిరతి.* పారవేయు, దొర్లించు; *ఉగ్గార.* వాంతి. నే. *వాక్క, ఓక్క.* వాంతి; కుమా. *ఓకాణో.* వాంతి చేసుకొను; ఒ. *ఓసఁవ్రా;* సిం. *ఓకఁఋూ;* గు. *ఓకఁవ్రూ;* మరా. *ఓక.* వాంతి చేసుకొను; సింహ. *ఓక్కారె;* హిం. *ఓక్నా.* వాంతి చేసుకొను.

**ఓకరించు** రూ. ఓకిలించు, ఓఁకరించు. అ.క్రి. వాంతి యగు, వాంతి చేసుకొను, రోతపడు. క. *ఓకరిసు,* *ఒక్కరిసు.* **ఓకరింత** రూ. ఓకిలింత, ఓఁకరింత, ఓఁకలింత. వి. వమనం, డోకు, రోత. క. *ఓకరికె.*

**ఓకరించు** చూ. ఓకర.

**ఓకరింత** చూ. ఓకర.

**ఓకిలి** రూ.చూ. ఓకర. వి. **1.** వాంతి. శివయో. 1; **2.** రోత.

> ఓక్ + ఇలి. ధ్వన్యనుకరణ శబ్దం.

**ఓకిలించు** రూ.చూ. ఓకరించు. అ.క్రి. వమనం చేసుకొను. దా.రా.యు. 2.216, చంద్రా. 4.219; అ.క్రి. స.క్రి. ఏవగించు, రోయు. ఉ.హరి. 3.14, కాశీ. 5.55, కవిక. 5.110. **ఓకిలింత** రూ.చూ. ఓకరింత. వి. **1.** వాంతి, డోకు. పి. శకుం. 3.57; **2.** రోత, ఏవ.

**ఓకిలించు** చూ. ఓకిలి.

**ఓకిలింత** చూ. ఓకిలి.

**ఓకు**[1] వి. దూరదర్శిని, దుర్భిణి. బొబ్బిలి కథ. 86.1. ఫ్రెంచ్. *oculus.* కన్ను; లాటిన్. *ocularis.* కంటికి సంబంధించిన; ఇం. *ocular.* కంటికి లేక దృష్టికి సంబంధించిన; పోర్చు. *oculos.* కండ్లజోడు; స్పా. *ఓకులార్.*

< పోర్చు. oculos.

**ఓకువేసిచూచు** అ.క్రి. **1.** దూరదర్శినితో చూచు; **2.** నిశితంగా పరిశీలించు.

**ఓకు**[2] రూ.చూ. ఓగు. వి. **1.** హాని, అపకారం; **2.** ఒడుపు; **3.** లాభం; **4.** ప్రయత్నం.

**ఓకు**[3] వి. చీట్లపేక ఆటలో లెక్కపెట్టే పాయింట్లను 'ఓకు' లని అంటారు. చీట్లాటలో వుపయోగించే కార్డు.

**ఓకుళ్ళు** వి.బ.వ. వసంతం, పసుపు, సున్నం కలిపిన ఎర్రటి నీళ్ళు.

క. *ఓకుళి, ఓకళి;* తు. *ఓకుళి, ఓకళి.*

<సం. ఓపశ.

**ఓపవేసిచూచు** చూ. ఓపు.

**ఓగగు** చూ. ఓగు.

**ఓగాత్యము** రూ.చూ. ఓగాత్యము. వి. 1. అమంగళం, అశుభ మైనది. చెరుపు ; 2. అరుచి.

**ఓగితమగు** చూ. ఓగితము.

**ఓగితము** విశే. తగినది. ఉపయోగమైనది, అర్హం, పాత్రం, నృసిం. 2.905, భోజరా. 5.288.

సం. యోగ్యతా. యుక్తత, అనుగుణ్యం, పొందిక ; పా. యొగ్గ. విశే. తగిన ; యుక్త, శక్తిగల, సామర్థ్యంగల, తగిన.

క. యోగ్యతె. అనుగుణ్యం, యుక్తం, అర్హం, ఉచితం : తు. యోగితె. అదృష్టం, విధి : త. యోక్కియతై. యుక్తం, అనుగుణ్యం, అర్హం ; మ. యోగ్యత- సామర్థ్యం, యుక్తం, అనుగుణ్యం, యోగ్యత.

<సం. యోగ్యత.

**ఓగితమగు** అ.క్రి. పాలుపడు, తగు. భోజ. 5.288. <ఓగితము + అగు.

**ఓగిరము** రూ.చూ. ఓవిరము. వి. 1. ఆహారపదార్థం. కాశీ. 5.75 ; 2. అన్నం. భీమ. 2.134 ; 3. ఆహారం, తిండి. హర. 5.20.

**ఓగిలి** దే.వి. వరికుప్పలు నూర్చుట మొ. పనులకోసం కట్టిన పశ్వలబంతిలో చివరిమెద్దు.

**ఓగు** రూ. ఓకు[2]. వి. 1. ప్రతిజ్ఞ. ప.హిం.శా. 4.1271, 1269. 270 ; 2. చెరుపు. హాని. కీడు ; విశే. 1. దుష్టుడు, చెడ్డ వాడు. వేమన. 33. హంస. 5.113 ; 2. చెడ్డది, చెడినది.

క. ఒగి, నొప్పించు, బాధపెట్టు, భంగపరచు, దోచు ; త. ఓయ్. ముగించు, అంతంచేయు. వి. నిలపటం, ఆ. వేయటం : మరా. ఒకరెు, ఒఖరెు. కష్టం, దుఃఖకునం.

**ఓగగు** అ.క్రి. వ్యర్థదగు, కీడగు. **ఓగులవా(డు** విశే. 1. అధముడు, నీచుడు, దుండగీడు. కు.సం. 4.372 ; 2. యుద్ధభూమినుంచి పారిపోయి వచ్చినవాడు. **ఓగులాడుచు** అ.క్రి. దేవరించు, దైన్యపడు. <ఓగు + -లు + ఒడుచు. **ఓగోడు** వి. 1. పనికిమాలినవాడు ; 2. తిండిపోతు (అర్థ విపరి). <ఓగు + వాడు.

**ఓగులవా(డు** చూ. ఓగు.

**ఓగులు** పో.చూ. ఓలె. వి. బ.వ. వరి మొ. కోసి అక్కడక్కడ వేసే గడ్డికుప్పలు.

**ఓగులాడుచు** చూ. ఓగు.

**ఓగెము** వి. నేర్పు, చాతుర్యం.

**ఓగోడు** చూ. ఓగు.

**ఓ(క** రూ.చూ. వా(క. వి. పల్లకవిలె, వాకచెట్టు, వాకకాయ.

**ఓ(కర** రూ.చూ. ఓకర. వి. 1. డోకు, వాంతి ; 2. రోత.

**ఓ(కరించు** రూ.చూ. ఓకరించు. అ.క్రి. వాంతియగు, వాంతి చేసుకొను, రోతపడు.

**ఓ(కరింత** రూ.చూ. ఓకరింత. వి. డోకు, రోత.

**ఓ(కరివె** రూ.చూ. ఓ(కలివె.

**ఓ(కలింత** రూ.చూ. ఓకరింత. వి. వమనం, డోకు, రోత.

**ఓ(కలివె** రూ. ఓ(కరివె. చూ. ఓ(క. వి. వాకచెట్టు.

<ఓ(క + కలివె.

**ఓ(కలేగకాయ** చూ. ఓ(క. వి. వాకుడుకాయ. ఈ కాయలు గుండ్రంగా ఉండి వల్లటి రుచిని కలిగి ఉంటాయి.

**ఓచ** చూ. ఓగు.

**ఓచవా(డు** వి. 1. దుష్టుడు. హంస. 5.112 ; 2. క్షుద్ర దేవత.

**ఓచవా(డు** చూ. ఓచ.

**ఓచెల** రూ.చూ. ఓచెల్ల. అవ్య. ఆశ్చర్య సంతాపాదులను తెలిపే మాట. శృం.నై. 5.157.

**ఓచెల్ల** రూ. ఓచెల. అవ్య. ఆశ్చర్య సంతాపాదులను తెలిపే పదం. భాగ. 8.568.

<ఓ + చెల్ల.

**ఓజ[1]** వి. 1. యుక్తమార్గం, సన్మార్గం. క్రమం. శివ.సా. 211 ; 2. పద్ధతి, రీతి, విధము. భార.విరా. 1.128 ; 3. కౌశలం, నేర్పు. భార.విరా. 2.16 ; 4. న్యాయం, యుక్తం, నీతి, ధర్మం, తగవు. వరాహ. 7.26 ; 5. విధివి, విస్తృతి. వరాహ. 10.166 ; 6. ప్రకృతి, స్వభావం. వేమ. 1.140.

క. ఓజె. వరుస, క్రమం, అనుగుణ్యం, యుక్తం, రాశి, కుప్ప, సమూహం.

పో.చూ. సం. యోజ- <సం. యుజ్. కలియు, తగు.

**ఓజకువచ్చు** అ.క్రి. దారికివచ్చు. **ఓజగొను** అ.క్రి. సిద్ధించు, సఫలమగు, పీలగు. కు.సం. 7.918. క. ఓజెగొళె. స్వాధీనమగు, వశమగు. <ఓజ[1] + కొను. **ఓజగొల్పు[1]** స.క్రి. నేర్పుచూపు. **ఓజపడు** అ.క్రి. సరిపడు, పొసగు, చక్కబడు, వేడుకబడు, అనుకూలమగు, పి.శకుం. 3.55. **ఓజపఱచు** స.క్రి. 1. చక్కపరచు. నృసిం. 4.56 ; 2. ఒనర్చు, చేయు, నిర్మించు. పద్మ.పు. 2.9 ; 3. అలవర్చు.

**ఓజ[2]** వి. 1. ఉత్సాహం, పట్టుదల. భార.భీష్మ. 3.407 ; 2. భయం, వెరపు, భాస్క.రా. 5.2.105 ; 3. ఆజ్ఞ, ఆదేశం. భాస్క.రా. 6.2.631 ; 4. మహిమ, గొప్పతనం. భాగ. 5.116 ; 5. శోభ, వికాసం, కాంతి. శృం.నై. 6.52 ; 6. ఓటమి.

త. ఓమ.

సం. ఓజస్. బలం, శక్తి.

<సం. ఓజస్.

**ఓజగొల్పు[2]** స.క్రి. ప్రేరేపించు, పురికొల్పు. కు.సం. 8.141. <ఓజ[2] + కొల్పు.

**ఓజ[3]** రూ.చూ. ఒజ్జ. వి. ఉపాధ్యాయుడు, గురువు. భార.స్త్రీ. 2.196.

**ఓజబంతి** రూ.చూ. ఒజ్జబంతి. వి. 1. మేలుబంతి, ఒరవడిబంతి, విద్యార్థులు చూచి రాయడానికి ఉపాధ్యాయుడు పైన రాసియిచ్చిన ముత్యక్షరాల పంక్తి. నరస. 1.88 ; 2. ఆదర్శం.

**ఓజకువచ్చు** చూ. ఓజ[1].

**ఓజగొను** చూ. ఓజ[1].

**ఓజగొల్పు[1]** చూ. ఓజ[1].

**ఓజగొల్లు**[2] చూ. ఓజ[2].

**ఓజవడు** చూ. ఓజ[1].

**ఓజవేఱుచు** చూ. ఓజ[1].

**ఓజబంతి** చూ. ఓజ[3].

**ఓజించు** రూ.చూ. యోజించు. స.క్రి. సంఘటించు, సమకూర్చు. కావ్యా. 1.5.

సం. యుజ్. కలుపు, సంఘటించు.

< యోజించు.

**ఓజు** రూ.చూ. ఒజ్జ. వి. **1.** గురువు, ఉపాధ్యాయుడు. బసవ. 3. ప. 511.1 ; **2.** శిల్పి, చిత్రకారుడు : **3.** శిల్పులపేర్ల చివరవచ్చే బిరుదాంకం. ద.హిం.శా. 1369 ; **4.** కంసాలి.

**ఓఝ** రూ.చూ. ఒజ్జ. వి. పురోహితులపేర్ల చివరవచ్చే బిరుదు వాచకం. రుక్మా. 5.181.

**ఓట** రూ. ఓటు[1]. చూ. ఓడు[1]. వి. **1.** అపజయం. బసవ. 6.196. ప్రభా. 3.63 ; **2.** వినయం, సత్ప్రవర్తన. భార. ఉద్యో. 1.21 ; **3.** అనుమానం, పిరికితనం, భయం, సంకోచం. భార.ఉద్యో. 3.104 ; **4.** భయం. భార.శాంతి. 3.93, మను. 2.39.

క. ఓటు. పరుగు, పందెం, వేగం, స్థిరి ప్రవాహం ; తు. వొటు, ఒటు, ఓట ; త. ఓట్టమ్. పరుగు, వేగం ; మ. ఓట్టమ్. పరుగు.

**ఓటకంద** వి. పిరికికంద, భయం. కు.సం. 4.417. **ఓటకాఁడు** వి. పిరికివాడు, భయస్థుడు. శక. 1.83, **ఓటపడు** రూ. ఓటవడు. అ.క్రి. జంకు, జడియు, చిన్నపోవు. **ఓట పత్రము** వి. ఓడిపోయినట్లు తెలిపే పత్రం, అపజయాన్ని తెలిపే పత్రం. 6.154. **ఓటపుచ్చు** స.క్రి. ఓడించు. '**ఓటరి**' వి. పరాజితుడు, ఓడిపోయిన వ్యక్తి. చెన్నబ. 2.158. **ఓట వడు** రూ.చూ. ఓటపడు. అ.క్రి. జంకు, జడియు, చిన్నవోవు. <ఓట + పడు. **ఓటవఱచు** స.క్రి. పరిభవించు, అవమానించు, అగౌరవపరచు. కళా. 7.206. <ఓట + పఱచు.

**ఓటం** రూ.చూ. వట్టము. వి. కట్నం.

**ఓటకంద** చూ. ఓట.

**ఓటకాఁడు** చూ. ఓట.

**ఓటపడు** చూ. ఓట.

**ఓటపత్రము** చూ. ఓట.

**ఓటపుచ్చు** చూ. ఓట.

**ఓటమి** రూ. ఓటము. వి. **1.** అపజయం. ఉ.హరి. 3.156 ; **2.** భయం. భాగ. 1.104 ; **3.** అవమానం, పరాభవం. కళా. 7.207.

**ఓటమిక** వి. ఓటమి, పరాజయం. నిర్వ.రా. 5.27. **ఓటమిపడు** అ.క్రి. జంకు, ఓడిపోవు. **ఓటమిపాటు** వి. ఓటమి. పరాజయం. భాగ. 8.57. **ఓటమిపొందు** స.క్రి. ఓడిపోవు, ఓటపడు. **ఓటమిపెట్టు** స.క్రి. ఓడించు, ఓటపుచ్చు. హర. 7.52.

**ఓటమిక** చూ. ఓటమి.

**ఓటమిపడు** చూ. ఓటమి.

**ఓటమిపాటు** చూ. ఓటమి.

**ఓటమిపొందు** చూ. ఓటమి.

**ఓటమిపెట్టు** చూ. ఓటమి.

**ఓటము** రూ.చూ. ఓటమి. వి. **1.** భయం. భార.అర. 3.68 ; **2.** పరాజయం, ఓటమి. ఆము. 1.95.

**ఓటరి**[1] చూ. ఓట.

**ఓటరి**[2] రూ.చూ. ఒంటరి. వి. ఏకాకి.

ఈ శబ్దం సరిదుకం కావచ్చు.

**ఓటరి**[3] వి. అడవిపంది.

**ఓటరు** రూ.చూ. వోటరు. వి. ఓటు హక్కు కలవాడు.

**ఓటర్లపట్టిక** రూ.చూ. వోటర్ల పట్టిక. వి. ఓటర్ల జాబితా.

**ఓటర్లపట్టిక** చూ. ఓటరు.

**ఓటఱు** చూ. ఓటు[1].

**ఓటవడు** చూ. ఓట.

**ఓటవఱచు** చూ. ఓట.

**ఓటారుచు** చూ. ఓటు[1].

**ఓటార్చు** చూ. ఓటు[1].

**ఓటాఱిన** చూ. ఓటు[1].

**ఓటాఱు** చూ. ఓటు[1].

**ఓటాఱుచు** చూ. ఓటు[1].

**ఓటి**[1] చూ. ఓడు[2]. (ఓడు[2] యొక్క ఔపవిభక్తిక రూపం) విణ. పగులువారిన.

**ఓటికుండ** వి. బీటవారిన కుండ. **ఓటిగుల్ల** చూ. ఓడు[2]. వి. నత్తగుల్ల. ప్రబంధ. 6.79. వ్య. పగిలిపోయిన కాలీ గుల్ల. **ఓటితిపిరిదండె** వి. వీణెవంటి వాద్యవిశేషం. ఆము. 6.6. **ఓటితువ్వ** వి. పంటకు పనికిరాని తువ్వనేల, ఇసుకనేల, గరువనేల. **ఓటిపలుకు** వి. **1.** పరపతిలేనిమాట, ఉత్తమాట, కల్లమాట ; **2.** బెజ్జంగాని, పగులుగాని ఉన్న కుండ మొ. వాటిని కొట్టినప్పుడు వచ్చే ధ్వని. **ఓటిపోవు** అ.క్రి. పగిలిపోవు, ఓడగు. **ఓటిమాట** వి. విలువలేని మాట, పరపతిలేని మాట, ఉత్తమాట, కల్లమాట.

**ఓటి**[2] చూ. ఓడు[1]. వి. అననుకూలత, వైముఖ్యం.

**ఓటికుండ** చూ. ఓటి[1].

**ఓటిగుల్ల** చూ. ఓటి[1].

**ఓటితిపిరిదండె** చూ. ఓటి[1].

**ఓటితువ్వ** చూ. ఓటి[1].

**ఓటిపలుకు** చూ. ఓటి[1].

**ఓటిపోవు** చూ. ఓటి[1].

**ఓటిమాట** చూ. ఓటి[1].

**ఓటిలు** చూ. ఓటు[1].

**ఓటిల్లు** చూ. ఓటు[1].

**ఓటిల్లుచిందర** వి. పిల్లల ఒక రకం ఆట, బాల క్రీడా విశేషం. కాశ. 3.33.

**ఓటు**[1] రూ.చూ. ఓట. వి. **1.** అపజయం ; **2.** భంగం.

**ఓటఱు** రూ.చూ. ఓటాఱు. అ.క్రి. **1.** ఓడిపోవు, పరాజయాన్ని పొందు. భార.ద్రోణ. 2.99 ; **2.** భయపడు. భార.ద్రోణ. 4.125 ; **3.** నిస్సత్త్వమగు, బలహీనమగు. హరి.పూ. 6.128 ; **4.** ఎండిపోవు. **ఓటారుచు** రూ.చూ. ఓటాఱుచు. అ.క్రి. ఓడించు. **ఓటార్చు** రూ.చూ. ఓటాఱుచు. స.క్రి. **1.** ఓడించు. ఉ.హరి. 2.64 ; **2.** ఎండించు.

**ఓటాటిన** విశే. పగిలిన, ముక్కలుగానైన. **ఓటాఱు** రూ. ఓటఱు. అ.క్రి. 1. బలహీనుడగు, నిర్బలుడగు. భార.ద్రోణ. 5.38 ; 2. ఓడు ; 3. జంకు ; 4. నీరసించు. **ఓటాఱుచు** రూ. ఓటాడుచు, ఓటాడ్చు. స.క్రి. 1. ఓడించు. భార.ద్రోణ 5.139 ; 2. పెంపించు. **ఓటిలు** రూ.చూ. ఓటిల్లు. అ.క్రి. ఓడు, సంకోచించు, తిరస్కరించు, భయపడు. రం.రా. 6.300. **ఓటిల్లు** రూ. ఓటిలు. అ.క్రి. 1. సంకోచించు. జంకు. రం.రా. 6.300 : 2. ఓడు. **ఓటుచూపు** అ.క్రి. పగులుచూపు. **ఓటుచేయు** రూ. ఓటుసేయు. స.క్రి. 1. అవమానించు, భంగపరచు. ఓడించు. రసిక. 6.100 ; 2. కల్లచేయు. **ఓటుపడు** రూ. ఓటువడు. అ.క్రి. 1. భ్రాంతిపడు, మోసపోవు. కు.సం. 7.126 : 2. ఒలొంగు, వశమగు. భార.ఆది. 4.145 ; 3. అపజయాన్ని పొందు, ఓడిపోవు. భార.ఆది. 7.62 ; 4. రిచ్చపడు, ఆశ్చర్యాన్ని పొందు. నిశ్చేష్టులగు. భార.శల్య. 1.322 ; స.క్రి. ఓడిపోవు, పోగొట్టుకొను. భార.సభా. 2.209. **ఓటుపఱుచు** రూ. ఓటుపఱుచు. స.క్రి. ఓడించు, లోగొను. **ఓటుపాటు** వి. ఓటమి. లొంగుబాటు. **ఓటుపుచ్చు** రూ. ఓటువుచ్చు. స.క్రి. ఓడించు, చిన్నపుచ్చు. **ఓటుపోవు** రూ. ఓటువోవు. స.క్రి. కోల్పోవు. ఓడిపోవు. **ఓటువడు** రూ.చూ. ఓటుపడు. <ఓటు[1]+పడు. **ఓటువఱుచు** రూ.చూ. ఓటుపఱుచు. <ఓటు[1]+పఱుచు. **ఓటువుచ్చు** రూ. చూ. ఓటుపుచ్చు. <ఓటు[1]+-పుచ్చు. **ఓటువోవు** రూ. చూ. ఓటుపోవు. **ఓటుసేయు** రూ. చూ. ఓటుచేయు. <ఓటు[1]+చేయు.

**ఓటు[2]** అవ్య. (ప్రశ్నను సూచిస్తుంది) 1. ఆక్షేపంతో కూడిన ప్రశ్న. భా.రా. 5.49 ; 2. కాకువుతోకూడిన ప్రశ్న. కాశీ. 6.273. క్రి.విశ. బహుశః, నిశ్చయంగా. భాస్కర.శ. 84. బహుశః <ఓ[2]+అటు.

**ఓటు[3]** రూ.చూ. వోటు. వి. ప్రజాస్వామిక ప్రభుత్వంలో వ్యక్తికిగల పౌరసత్వపు హక్కు, ఆ హక్కుకు వినియోగించే పత్రం.

**ఓటు[4]** చూ. వాటము. వి. కప్పు ఎగురకుండా బరువుకోసం దానిమీద వేసే కట్ట.

**ఓటుకుముగ్గు** వి. వేళ్లసందులనుంచి ముగ్గునున్నాన్ని వదులుతూ గీసిన గీతలముగ్గు.

**ఓటుచూపు** చూ. ఓటు[1].

**ఓటుచేయు** చూ. ఓటు[1].

**ఓటుపడు** చూ. ఓటు[1].

**ఓటుపఱుచు** చూ. ఓటు[1].

**ఓటుపాటు** చూ. ఓటు[1].

**ఓటుపుచ్చు** చూ. ఓటు[1].

**ఓటుపోవు** చూ. ఓటు[1].

**ఓటుబాదు** వి. వెల్ల సున్నపునీటితో గోడలమీద పూసిన పూత.

**ఓటువడు** చూ. ఓటు[1].

**ఓటువఱుచు** చూ. ఓటు[1].

**ఓటువుచ్చు** చూ. ఓటు[1].

**ఓటువోవు** చూ. ఓటు[1].

**ఓటుసేయు** చూ. ఓటు[1].

**ఓట్రించు** స.క్రి. మోసంచేయు. మల్ల. 2.46.

**ఓడ[1]** వి. 1. నావ. భార.సభా. 2.40 ; 2. గోలెం ; 3. గాదె. (అర్థవివరి.).

క.ఋ. *ఓడ* ; త.మ. *ఓటమ్* ; పర్జి. *ఓడ* ;
పో.చూ. సం. *పోూడ*. ప్లవం. నావ ; ప్రా. (దేశి) *వెడ*. *బెడ*. ఓడ.

<మూ.ద్రా. ఓడ.

**ఓడకంబము** వి. ఓడకు మధ్యలో నిలిపే స్తంభం. **ఓడకాఁడు** వి. 1. ఓడలమీద వర్తకం చేసేవాడు. శుక. 1.170. 2. సరంగు, నావికుడు. **ఓడకీలు** వి. ఓడకు వేసే లంగరు; **ఓడకూలి** వి. పడవలో ప్రయాణం చేయడానికి యిచ్చే ధనం, రేవు. విజ్ఞా. 1.86. **ఓడకేవు** వి. ఓడకు ఇచ్చే కూలి, అతరం, పడవనెక్కి ప్రయాణం చేయడానికి ఇచ్చే కూలి. **ఓడకొడికంబము** వి. ఓడ నడుమ వేసే నిలుపాటి స్తంభం. **ఓడకొయ్య** వి. ఓడ మధ్యలో వేసే నిలుపాటి స్తంభం. **ఓడంగి** వి. 1. నావికుడు, ఓడవాడు, పడవవాడు ; 2. దోనెకు లోతట్టు వేసే దూలం. **ఓడఁగట్టినదూలము** వి. నిరంతర సంబంధం. వ్య. స్థిరంగా ఓడకుకట్టిన దూలం ఉద్భట. 2.211. **ఓడచింతకాయ** వి. దిగుమతి అయిన చింతకాయలు. **ఓడదొంగ** వి. ఓడలో దొంగతనం చేసేవాడు. **ఓడపసుపు** వి. విదేశాలనుండి ఓడలపై దిగుమతి చేసుకునే మేలిమిరంగు పసుపు. ఉ. హరిశ్చ. 4.86. **ఓడపోఁక** వి. దిగుమతియైన పరదేశపు పోకచెక్క. శుక. 1.133. **ఓడబేరము** వి. ఓడమీద చేసే వ్యాపారం. కాశ.శ. 111. **ఓడబేహారి** వి. ఓడ వర్తకుడు, ఓడపై వర్తకం చేసేవాడు. విజయ. వి. 4.22. **ఓడమాలి** వి. 1. సరంగు, నావికుడు ; 2. చిన్న దోనె నడిపేవాడు, పడవవాడు. **ఓడరేవు** వి. హార్బరు, ఓడలు నిలిచే సముద్రపు రేవు. భార.ఆది. 3.36. **ఓడవాఁడు** వి. నావికుడు, ఆం.భా. 1.158.

**ఓడ[2]** రూ.చూ. వార. వి. 1. మట్టితోగాని సిమెంటుతోగాని పలచగా గుండ్రంగా చేసి ఒకదానిమీద ఒకటి పేర్చి బావి పలచగా ... 2. బావికి చుట్టూ గోడకు బదులుగాని నిలిపిన వస్తువు; 2. బావికి చుట్టూ కట్టిన అరుగు.

**ఓడ[3]** వి. కూజా అడుగు భాగం.

**ఓడ[4]** వి. 1. ధాన్యం నిలవచేసే పెద్ద మట్టి పాత్ర ; 2. ధాన్యం నిలవచేసే ఒకరకం గరిసె.

**ఓడకంబము** చూ. ఓడ[1].

**ఓడకాఁడు** చూ. ఓడ[1].

**ఓడకీలు** చూ. ఓడ[1].

**ఓడకూలి** చూ. ఓడ[1].

**ఓడకేవు** చూ. ఓడ[1].

**ఓడకొడికంబము** చూ. ఓడ[1].

**ఓడకొయ్య** చూ. ఓడ[1].

**ఓడంగి** చూ. ఓడ[1].

**ఓడఁగట్టినదూలము** చూ. ఓడ[1].

**ఓడఁగొట్టు** చూ. ఓడు[1].

**ఓడచింతకాయ** చూ. ఓడ[1].

**ఓడదొంగ** చూ. ఓడ[1].

**ఓరవమవు** చూ. ఓర[1].

**ఓరపోఁక** చూ. ఓర[1].

**ఓరప్పలు** వి. బియ్యం పిండి పూరీలు.

**ఓరబేరము** చూ. ఓర[1].

**ఓరబేహారి** చూ. ఓర[1].

**ఓరమారి** చూ. ఓర[1].

**ఓరరేవు** చూ. ఓర[1].

**ఓరవాఁడు** చూ. ఓర[1].

**ఓరవం** వి. సారెపలక మధ్యభాగంలోని కుంతకట్టు.

**ఓరిక** చూ. ఓడు. రూ. ఓడికె. ఓడిగ, ఓర్క, ఓర్క. వి. **1.** ప్రవాహం. హరి. పూ. 7.117, మను. 468 ; **2.** తిన్నెలను అలికిపెట్టే ముగ్గులు, బొట్లు మొ. **3.** తూము, కాలువ, చిన్నకాలువ.

పో.చూ. క. ఓడికె. పరుగెత్తడం ; త. ఓత్తై. ప్రవాహం, నీటికాలువ ; ఓటుకాల్. నీటికాలువ ; మ. ఓటు. నీటి ప్రవాహం ; ఓటుక. ఆటంకం లేకుండా ప్రవహించు.

**ఓరికలుకట్టు** అ.క్రి. ప్రవాహం కాల్వలు కట్టు. **ఓరికవాఁగు** వి. ప్రవాహం. కు.సం. 2.74.

**ఓరికలుకట్టు** చూ. ఓడిక.

**ఓరికవాఁగు** చూ. ఓడిక.

**ఓరికె** రూ.చూ. ఓడిక. వి. నీటిగండి.

**ఓరిగ** రూ.చూ. ఓడిక. వి. పల్లపొలం, బాగేరు (అర్థ వివరి)

**ఓరిగలు** వి. గోడలకూ, తిన్నెలకూ పెట్టే సున్నబొట్లు.

**ఓరిగలేపు** స.క్రి. అల్లరిపెట్టు, లేవదీకొట్టు.

**ఓరిగించు** చూ. ఓడు[2].

**ఓరిగిలు[1]** చూ. ఓడు[1].

**ఓరిగిలు[2]** చూ. ఓడు[2].

**ఓరిగిల్లు[1]** చూ. ఓడు[1].

**ఓరిగిల్లు[2]** చూ. ఓడు[2].

**ఓరించు** చూ. ఓడు[1].

**ఓరివక్క** వి. ఒకజాతి నక్క, పొట్టినక్క.

పో.చూ. త. ఓనాయ్. తోడేలు ; మ. ఓనాయి. తోడేలు.

**ఓరిపోవు** చూ. ఓడు[1].

**ఓడు[1]** అ.క్రి. **1**, భయపడు, వెరచు, భార.ఆది. 2.225 ; **2.** (యుద్ధంలో) ఓడిపోవు, పరాజితుడగు, అపజయాన్ని పొందు. భార.ఆది. 7.46 ; **3.** లొంగు, వశుడగు. భార.భీష్మ. 2.260 ; **4.** పారు, పరుగెత్తు. హరి.పూ. 8.48 ; స.క్రి. (ద్యూతాదులందు) కోల్పోవు, పోగొట్టుకొను. దశకు. 565. ప్రబంధ. 679.

క. ఓడు. పరుగెత్తు ; ఓడె, ఒడె. పగులు ; ఓతె, ఒత్తె. పగులు, బీటు ; ఓడు. పెంకు ; తు. ఒట్టే. రంధ్రం, బెజ్జం. పగులు, ఓడు. పెంకు ; ఓడుని. పరుగెత్తు ; త. ఓటు. ఓడు, అపజయాన్ని పొందు, పరుగెత్తు, పారిపోవు ; ఓటి. పగిలిపోవు ; ఉత్తై. చెల్లాచెదరగు (సైన్యం), విచారంతో కుంగిపోవు, తునియలగు, ముక్కలగు, పగులు ; మ. ఓటుక. పరుగెత్తు ; ఓట్టు. చిన్నబెజ్జం ; కోట, ఓడ్- (ఓచ్-). పరుగెత్తు ; లొ. పూడ్-పూడ్య. గోం. సోడి, జోడి. పరుగెత్తి పారిపోవు ; కువి, పెుల్. పరుగెత్తు.

<మూ.ద్రా. *టోడ్-.

**ఓరఁగొట్టు(-కొట్టు)** స.క్రి. ఓడించు. **ఓడిగిలు[1]** రూ.చూ. ఓడిగిలు[1]. అ.క్రి. పరుగెత్తు. జై.భా. 1.136. **ఓడిగిల్లు[1]** రూ. ఓడిగిలు[1]. అ.క్రి. పారు, పరుగెత్తు. వి.శకుం. 3.202. **ఓడించు** 'ఓడు' ధాతు హేత్వర్థక రూపం. స.క్రి. గెలుచుకొను, విజయాన్ని పొందు. భార.సభా. 1.228. **ఓడిపోవు** అ.క్రి. అపజయాన్ని పొందు. **ఓడువడు** అ.క్రి. పగులు. **ఓడువఱుచు** స.క్రి. **1.** చిల్లులు పెట్టు. ఉ.హరి. 1,53 ; **2.** పగలగొట్టు. **ఓడుబిల్ల** రూ.చూ. ఓడుబిళ్ల. **ఓడుబిళ్ల** రూ. ఓడుబిల్ల. వి. ఇంటికప్పుకు పనికివచ్చే పెంకు. అష్టమ. క. 3.178, వసు. 4.72. **ఓడుసేయు** అ.క్రి. కన్నాలు చేయు. తూట్లుపడేట్టుచేయు. నిర్వ.రా. 6.144. <ఓడు[1] + చేయు.

**ఓడు[2]** పో.చూ. వడియు. ఒడియు. అ.క్రి. స్రవించు, కారు. కాశీ. 4.174.

క. ఒఱ్కు. ప్రవహించు ; త. ఒఱుకు. ప్రవహించు, స్రవించు, కారు ; ఒ. కారటం. స్రవించడం ; మ. ఒఱుకుక. ప్రవహించు. ఒఱుక్కు. నీటిప్రవాహ వేగం ; పో. చూ. వఱియుక. ప్రవహించు. పొర్లిపారు.

<మూ.ద.ద్రా. *ఒట్-:/*ఒట్/*పట్ లేదా <మూ. ద.ద్రా. *ఒట్/*ఒట్-.

**ఓడిగించు** స.క్రి. కాచేయు, కుమ్మరించు. **ఓడిగిలు[2]** రూ.చూ. ఓడిగిల్లు[2]. అ.క్రి. **1.** ప్రవహించు. హర. 4.7 ; **2.** స్రవించు. కాశీ. 6.134. **ఓడిగిల్లు[2]** రూ. ఓడిగిలు[2]. అ.క్రి. **1.** ప్రవహించు. కాశీ. 8.101 ; **2.** స్రవించు, కారు. కాశీ. 4.174.

**ఓడుచు** 'ఓడు[1]' ధాతుప్రేరణార్థక రూపం. స.క్రి. గెలుచు, ఓడించు.

**ఓడువడు** చూ. ఓడు[1].

**ఓడువఱుచు** చూ. ఓడు[1].

**ఓడుబాఱు** అ.క్రి. నెర్రులిచ్చు.

**ఓడుబిల్ల** చూ. ఓడు[1].

**ఓడుబిళ్ల** చూ. ఓడు[1].

**ఓడుసేయు** చూ. ఓడు[1].

**ఓర్క** రూ.చూ. ఓడిక. వి. పొలంలో వాననీళ్లు పారడంవల్ల కోసుకుపోయి ఏర్పడ్డ పల్లం లేదా గొయ్యి. అర్థవివరి.

**ఓణి[1]** రూ. ఓణీ, ఓని[1], వాణీ. వి. **1.** ఉత్తరీయం, కండువా ; **2.** యుక్తవయస్సువచ్చిన కన్యలు పరికిణి (లంగా) పైన వేసుకునే పైట.

పో.చూ. సం. అవగుంఠణ- ; దే.శి.ప్రా, ఒఢ్ఢణ- ; హిం. ఒఢన ; సిం. ఒఢణీ ; గు. ఒఢణీ-, ఒఢఁణు.

పో.చూ. క. ఓణి. స్థిరరేఖ ; తు.త. ఓళి.

**ఓణి[2]** రూ. ఓని[2]. వి. పెద్దబాట.

క. ఓణి, ఒళి. వరుస, సందు, మార్గం ; తు. ఓణి, ఇరుకు దారి.

**ఓణీ** రూ.చూ. ఓణి. వి. పైట.

**ఓం్ౕరడ** అవ్య. గాడిద అరుపు.

పో.చూ. త. ఓలమ్. ధ్వని, అరుపు, బొబ్బరింత ; ఊళై. కుక్క లేక నక్కయొక్క అరుపు. జబ్బుపడ్డ గొర్రె

మొక్క యొక్క ; పో.చూ. మ. ఓలమ్. ఆర్తనాదం.

**ఓంద్రపెట్టు** అ.క్రి. గాఢిద అరుచు. వేంక.పంచ. 3.58.

**ఓంద్రించు** అ.క్రి. అరుచు. స.క్రి. 1. అగౌరవపరుచు ; 2. ఖండించు, ఎదిరించు.

**ఓంద్రపెట్టు** చూ. ఓంద్ర.

**ఓంద్రించు** చూ. ఓంద్ర.

**ఓదము** వి. 1. అవపాతం, ఏనుగుల మొ. జంతువుల్ని పట్టుకోడానికి ఏర్పరచిన గొయ్యి. దాశ. శాంతి. 4.181 ; రం. రా. 338 ; 2. కందకం.

సం. అవపాత. పడేట్లు చేసేది, కందకం, గుంట, ఏనుగులు మొ. జంతువుల్ని పట్టుకోడానికి ఏర్పాటు చేసిన గొయ్యి ; ప్రా. ఓవడణ- ; దే. ప్రా. ఓవ ; శౌర. ఓవాద, ఓవద.

క. ఓవ, వాద. ఏనుగుల్ని పట్టుకోడానికి ఏర్పాటుచేసిన గొయ్యి. అగడ్త. కందకం.

<శౌర. ఓవద.

**ఓదరుచు** రూ.చూ. ఓదారుచు. స.క్రి. ఊరడించు, బుజ్జగించు.

**ఓదర్చు** రూ.చూ. ఓదారుచు, స.క్రి. ఊరడించు, బుజ్జగించు.

**ఓదారుచు** రూ. ఓదరుచు, ఓదర్చు, ఓదార్చు. స.క్రి, బుజ్జగించు, ఊరడించు.

త. ఓదై. ధ్వని.

బహుశః తె. ఓద (<త. ఓదై)+అరుచు.

**ఓదార్చు** రూ.చూ. ఓదారుచు. స.క్రి. అనునయించు, బుజ్జగించు, ఊరడించు.

**ఓదారుపు** రూ. ఓదార్పు. చూ. ఓదారుచు. వి. అనునయం, బుజ్జగింపు, ఊరార్పు.

**ఓదార్పు** రూ.చూ. ఓదారుపు. వి. అనునయం, బుజ్జగింపు.

**ఓది** రూ. ఒద్ది. వి. అజశృంగి, ద్విశృంగిక.

**ఓదిమ్రాను** వి. ఒద్ది చెట్టు. అజశృంగి.

**ఓదిమ్రాను** చూ. ఓది.

**ఓదియ** రూ. ఓదె. పో.చూ. పొది. వి. కోతకోసి చేలో అక్కడక్కడ వుంచే జొన్న మొ. వాని వెన్నుపోచల పోగు, కోసిన చిన్న పరిపన.

**ఓదు** చూ. ఓదు[2]. స.క్రి. పోయు. అ.క్రి. కారు.

**ఓదులయ్య** వి. ఉపాధ్యాయుడు, అయ్యవారు.

క. ఓదు. చదువు, అధ్యయనం ; తు. ఓదు, ఓదుని, ఓదుని ; త. ఓతు ; మ. ఓతు. అధ్యయనం, చదువు.

<క. ఓదు+-లు+అయ్య.

**ఓదె** రూ.చూ. ఓదియ. వి. కోతలైనతరువాత చేలల్లో అక్కడక్కడ వుంచే చిన్న పన.

**ఓదెకొంగ** వి. కోతల సమయంలో ఓదెల దగ్గర తిరిగే ఒక జాతి కొంగ. **ఓదెకొలుకు** వి. కోతల సమయంలో ఓదెల దగ్గర తిరిగే ఒక జాతి కొంగ. **ఓదెకోత** వి. ఒక వరసలో వేసిన గడ్డి కట్టల నుంచి కంకులు కొయ్యడం. **ఓదెవట్టి** వి. ఇద్దరిమధ్య మరో వానికి పైరు కోయడానికి వదిలే చాళ్లు. **ఓదెపడు** అ.క్రి. కుప్పలుగాపడు, కుప్పకూలు. **ఓదెపాటు** వి. ఓదెవలె పడటం, కుప్పకూలటం. విజయ. వి. పీఠిక. 44. **ఓదెపాటుచేయు** స.క్రి. పనలుచేయు, ఓదెగా పడేటట్లు చేయు. విజయ. వి. పీఠిక. 44. **ఓదెమునుము** చూ. ఓదెవట్టి. వి. ఇద్దరి నడుమ పైరు కోయటానికి వదిలిన చాలు. **ఓదెలతరువులు** వి. 1. పూర్వాషాఢ, ఉత్తరాషాఢ కార్తెలు ; 2. కోసి వుంచిన పంట పనలు. **ఓదెలువడు** అ.క్రి. కుప్పకూలు, ఓదెలు పడేటట్లుపడు. రామా. 8.166. <ఓదె+-లు+పడు. **ఓదెవడు** అ.క్రి. కుప్పకూలు, పనవలెపడు. <ఓదె+-పడు. **ఓదెవేయు** స.క్రి. పరికోసి మళ్ల మళ్లగా కోయు.

**ఓదెకొంగ** చూ. ఓదె.

**ఓదెకొలుకు** చూ. ఓదె.

**ఓదెకోత** చూ. ఓదె.

**ఓదెవట్టి** చూ. ఓదె.

**ఓదెవడు** చూ. ఓదె.

**ఓదెపాటు** చూ. ఓదె.

**ఓదెపాటుచేయు** చూ. ఓదె.

**ఓదెమునుము** చూ. ఓదె.

**ఓదెలతరువులు** చూ. ఓదె.

**ఓదెలువడు** చూ. ఓదె.

**ఓదెవడు** చూ. ఓదె.

**ఓదెవేయు** చూ. ఓదె.

**ఓద్రుడు** చూ. ఒడ్డియ. వి. ఒడ్డెవాడు.

**ఓవగాయ(లు)** రూ.చూ. వామనగాయ(లు). వి. లేత చింత కాయలు.

**ఓనమాలు** రూ. ఓనామాలు. వి. తెలుగు వర్ణ సమామ్నాయం, తెలుగు వర్ణాలను నేర్పే ముందు 'ఓం నమః శివాయ' అనే మంత్రంతో ఆరంభిస్తారు. ఈ మంత్రాన్ని ఆధారంగా చేసుకొని ఓ, న, మ, శి, వా, య, అనే అక్షరాలు తెలుగు వర్ణాల్ని నేర్పే ముందు నేర్పిస్తారు. 'ఓం నమః శివాయ' తో పాటు జైన సంప్రదాయంవల్ల 'సిద్ధం నమః' అనేది తర్వాతి కాలంలో చేర్చి నేర్పడం జరిగింది. ఇప్పుడు హైందవ బాల బాలికలకు విద్యాభ్యాసారంభంలో 'ఓం నమః శివాయ సిద్ధం నమః' అని పండితులు నేర్పుతారు.

<సం. ఓం నమః శివాయ.

**ఓనామాలు** రూ.చూ. ఓనమాలు.

**ఓవి[1]** రూ.చూ. ఓణి[1]. వి. కన్నెపిల్లలు కట్టే బట్ట, ఉత్తరీయం, పైట.

**ఓని[2]** రూ.చూ. ఓణి[2]. వి. 1. పెద్ద బాట ; 2. రొంక.

**ఓనికట్టు** రూ. ఓనెకట్టు. వి. కొండల మధ్య వున్న గొంది దారి, ఎడారి, దొంగలు దోచుకోవడానికి అనువైన చోటు.

**ఓనికట్టు** చూ. ఓని[2].

**ఓనెకట్టు** రూ.చూ. ఓనికట్టు. వి. దొంగలు దోచుకు పోవడానికి అనువైన చోటు.

**ఓవేయు** స.క్రి. దూరేట్లువేయు.

<పో+న్+ఏయు (వ్య). బలంగా దూసుకు పోయేట్లు చేయు.

**ఓవక** చూ. ఓవు.

**ఓవమి** చూ. ఓవు.

**ఓవరాని** చూ. ఓవు.

**ఓవరికము** చూ. ఓపు.

**ఓవలేని** చూ. ఓపు.

**ఓవలేనిది** చూ. ఓపు.

**ఓపాటము** వి. **1.** అలవాటు ; **2.** నేర్పు.

**ఓపిక** చూ. ఓపు.

**ఓపికకలవాడు** చూ. ఓపిక.

**ఓపికచేయు** చూ. ఓపిక.

**ఓపికపెట్టు** చూ. ఓపిక.

**ఓపికలేని** చూ. ఓపిక.

**ఓపు** చూ. ఓర్పు. అ.క్రి. **1.** సమర్థుడగు. శక్తుడగు. భార. ఆది. 1.100 ; **2.** ఇచ్ఛగించు. ఇష్టపడు. భార. విరా. 2.98 ; **3.** తుమున్నంతాలకు అనుప్రయుక్త మయ్యే టప్పుడు ఇది తద్ధర్మాద్యర్థక మవుతుంది. ఉదా. రానోపు. వానోపు ; స.క్రి. **1.** సహించు, ఓర్చు. కుసం. 8.9, భార. భీష్మ. 2.282.

పో.చూ. క. ఒయ్, ఒయ్యు. మోయు ; త. ఓర్ప్పు. సహనం ; తుయ్. మోయు ; గోం. వొఇ- (వోసి). తీసు కొని వెళ్లు ; ఓయ్-ఓయా. మోయు ; కుఇ. ఒప (ఒల్-). తీసుకొని వెళ్లు ; కువి. ఒర్‌హనై, ఓర్‌హినై. సహించు ; కురు. పెూ- (ఒచ్ఛ్-). నిర్వహించు, వ్యక్తపరచు, మోసుకుపోవు, భర్తనుగాని తలిదండ్రులనుగాని విడిచి విటునితోపాటు పోవు.

ఓవక (ఓపు ధాతువు యొక్క వ్యతిరేకార్థక రూపం). అవ్య. సహింపక. **ఓవమి** వి. **1.** నింద. హరి. ఉ. 8.14 ; **2.** దౌర్బల్యం, అశక్తత, పోమరితనం. పారి. 1.119. < ఓపు + అ[3] + అ-మి. **ఓవరాని** విఅ. సహింపలేని. **ఓవరికము** వి. **1.** ఓర్పు ; **2.** శ్రద్ధ. **ఓవలేని** విఅ. సహింపలేని. **ఓవలేనిది** వి. గర్భ ధారంవల్ల సహింప లేని స్త్రీ. **ఓపిక** వి. **1.** సహనం, ఓర్పు. భాగ. 1.500 ; **2.** శక్తి, సామర్థ్యం. విక్ర. 1.77, హరిశ్చ. 3.190. **ఓపికకలవాడు** వి. సహనం గలవాడు. **ఓపికచేయు** స.క్రి. సహనాన్ని పొందు. **ఓపికపెట్టు** అ.క్రి. ఓర్పు వహించు. **ఓపికలేని** విఅ. **1.** సహనంలేని ; **2.** శక్తిలేని. **ఓపువాడు** వి. శక్తిమంతుడు.

**ఓపువాడు** చూ. ఓపు.

**ఓపె** అవ్య. నీచ, మిత్రస్త్రీ సంబోధనార్థకం. ఆం.భా. 3.72.

'ఆపె,' 'ఈపె' మొ. పదాల సామ్యంవల్ల ఏర్పడి ఉంటుంది.

**ఓబ** చూ. ఊబు. వి. మూనకట్టు.

**ఓబనం** వి. వాహనం.

సం. వాహనమ్-. ఎక్కడానికి వీలైన ఏనుగు, గుర్రం మొ.; ప్రా. వాహణ-. బండి.

<సం. వాహనమ్.

**ఓబయ్య** చూ. ఓబళము. వి. నృసింహస్వామి.

ఓబయ్యకాలం చూ. ఓబళము. వి. చాలా పురాతన కాలం.

**ఓబయ్యకాలం** చూ. ఓబయ్య.

**ఓబళము** వి. ఆంధ్రప్రదేశ్‌లోని కర్నూలు జిల్లాలో ఉన్న ఒక యాత్రా స్థలం. అహోబలం.

ఓబయ్య, ఓబులు మొ. వ్యక్తినామాలు కూడ 'అహో బల' శబ్ద నిష్పన్నాలే.

సం. అహోబల-. యాత్రాస్థలం పేరు.

<సం. అహోబల-.

**ఓబినాటికాలము** వి. పురాతన కాలం. చాలా పాతకాలం. నరసింహస్వామినాటి కాలం, చాలా ప్రాచీన కాలమని అర్థవిపరి.

క. ఓబికాల. పాతకాలం.

**ఓబుడు** చూ. ఓబళము. వి. నృసింహస్వామి, చెంచులు పూజించే దైవం (ఈ స్వామి చెంచు కన్యను వివాహం చేసుకున్నాడు).

**ఓమగరికలు** రూ. ఓమగరికెలు. చూ. ఓమము. వి. మెట్ట భూమిలో పండే ఒక జాతి పప్పు.

**ఓమగరికెలు** రూ.చూ. ఓమగరికలు.

**ఓమటి** వి. ఆహారం, అన్నం. ఆం.భా. 2.257.

సం. అప (అవమృష్ట, ఉపవృష్ట). కుడిచివేయ బడిన, శుభ్రంచేయబడిన ; ప్రా. ఓమట్టు. రాకబడిన.

**ఓమన** రూ.చూ. వామన. వి. వామనగుంటలాట కుపయోగించే గింజలు మొ. పాండు. 2.25.

**ఓమనగాయ** రూ.చూ. వామనగాయ. వి. లేతకాయ. సిం.ద్వా. 3.158.

**ఓమనగాయలు** వి. వామన గుంటలు ఆడుకునే ప్పుడుపయోగించే చింతపిక్కలు మొ. పాండు. 2.25.

**ఓమనగాయలు** చూ. ఓమనగాయ.

**ఓమనగుంటలు** రూ.చూ. వామనగుంటలు. పో.చూ. అచ్చన గండ్లు. వి. వామన గుంటలాట. ఒక పొడవైన చెక్కకు పద్నా లుగు గుంటలు రెండు వరుసల్లో తయారుచేసి చింతపిక్కల్తో ఆడతారు.

**ఓమనపీట** వి. వామన గుంటలాటలో ఉపయోగించే పీట. దానిమీద పద్నాలుగు గుంటలు రెండువరుసల్లో వుంటాయి.

**ఓమము** రూ. ఓము[1]. వి. దీపకం, వాము. అజీర్ణవ్యాధిని నివా రించే ఒక దినుసు. అప్ప. 2.431.

క. ఓము, ఓమ, ఓవ, ఓఫ్ర, వామ, వోమ, హూమ. వాము ; తు. ఓమ్త ; త.మ. ఓమమ్.

పో.చూ. సం. యవానీ, అజమోద ; హిం. అజ వాయన్.

**ఓము[1]** రూ.చూ. ఓమము. వి. వాము.

**ఓము[2]** స.క్రి. **1.** (పురుడు) పోయు, పోసుకొను. కు.సం. 8.135 ; **2.** పోషించు, రక్షించు, కాపాడు. మను. 2.17 ; **3.** బాగుచేయు, సంస్కరించు. రామా. 8.246. కళా. 6.203 ; **4.** అనుగ్రహించు. వసు. 3.149 ; **5.** తాల్చు, వహించు. శుక. 2.557, విజయ, 3.166.

క. ఓఫ్. సంరక్షించు, కాపాడు ; తు. ఓమన. ప్రియ మైన, ముద్దైన, ప్రేమ ; త. ఓమ్పు. రక్షించు, పోషించు. భద్రపరచు; ఓంపటు. రక్షించు, కాపాడు ; మ. ఓమ్పుక. రక్షించు ; కురు. ఊఇ-(ఉయ్యో-) పెంచు, కాపలా కాయు; పో.చూ. మాల్తొ. ఒజ్-. కాపాడు, గుడ్లు పెట్టు.

<మూ.ద.ద్రా. *ఒడమ్బ్/*ఓ-మ్బ్-.
మూ.ద్రా. *ఓడ్-.

**ఓమె** అవ్య. మి(శ. నీచస్త్రీ సంబోధనం. శృం.నై. 4.114.
బహుశః ఆమె, ఈమె అను పదాల సామ్యంవల్ల (ఓమె) ఏర్పడి ఉంటుంది.

**ఓంపొడి** చూ. ఓమము. వి. ఉలవపిండి, వాముపొడి కలిపి నూనెలో వేయించి తయారుచేసిన నంబారం.

**ఓంబాయి** అవ్య. 1. పల్లకీ మోసేవాళ్లు చేసే ధ్వన్యనుకరణం; 2. ఇద్దరు పిల్లలు చేతులమీద మరొకరిని మోస్తూ ఆడే ఆటలో చేసే ధ్వన్యనుకరణం.

**ఓయన** రూ.చూ. ఒయ్య. అవ్య. 1. నూటిగు, తిన్నగా. భారా. ఆది. 1.133 ; 2. నిజంగా.

**ఓయను** స.క్రి. సిద్ధమగు. తప్పక ఒప్పుకొను.
<ఓ[2] + అను.

**ఓయలపాట** చూ. హొయలు. వి. స్త్రీలు పాడే ఒక రకం శృంగార గీతం. కు.సం. 4.446.
పో.చూ. త. ఒయిల్ కుమ్మి. 'ఒయిల్' నాట్యంలో పాడే పాట; ఒయిల్. గుండ్రంగా నిలబడి చేతి గుడ్డలను విసురుతూ పండుగ రోజుల్లో చేసే ఒక రకం నాట్యం.

**ఓయారము** రూ.చూ. ఒయ్యారము. వి. 1. విలాసం, సౌందర్య గర్వం. వి(క.చ. 5.171 ; 2. అందమైనది; 3. రీతి.

**ఓయారి** రూ.చూ. ఒయ్యారి. వి. సౌందర్యవతి, అందగత్తె, విలాసిని ; విణ. అందమైనది, విలాసం కలది.

**ఓయి** రూ. ఓయీ. అవ్య. 1. పురుష సంబోధనార్థకం. మను. 4.87. ఆము. 4.60 ; 2. సంప్రార్థనామల్లో క్రియలచివర ఉపయుక్తమయ్యే ప్రత్యయం. దశా. 2.419 ; 3. సమాపక క్రియలచివర చేరి కొన్నిచోట్ల ప్రశ్నను తెలుపుతుంది. ఉదా. ముగియునోయి – ముగియునా.
క. ఓయి. ఆశ్చర్యార్థకం ; తు. ఓయ్; త. ఓయ్.

**ఓయిరము** రూ.చూ. ఓవిరము. వి. ఆహారం, అన్నం. కాశీ. 5.297.

**ఓయీ** రూ.చూ. ఓయి. అవ్య. పురుష సంబోధనార్థకం.

**ఓయు** రూ.చూ. పోయు. అ.క్రి. కాదు ; స.క్రి. పోయు.

**ఓర[1]** వి. 1. హద్దు. మేర. మర్యాద. నిర్వ.రా. 3.15. 2. క్రీగంటి చూపు. అపాంగ వీక్షణం. భార.అను. 1.281: 3. పక్క. వైపు. వసు. 2.7 ; 4. అంచు. విజయవి. 2.200 : 5. వాలుప్రదేశం ; విణ. 1. పెడగా తిరిగినది. శృం.నై. 3.89 ; 2. కొంతవరకు మూయబడినది. మను. 5.69 ; 3. పక్కకు తొలగిపోయినది. వసు. 2.109 ; 4. అడ్డమైనది. సారంగ. 1.22 ; అవ్య. అడ్డంగా. ఆం.భా. 3.72.
క. ఓర, ఓరె, వార. ఏటవాలు ప్రదేశం, వాలు. అంచు ; కొడ. ఒరయ్. ప్రవాహానికి దూరంగా చదునైన ప్రదేశం ; తు. ఓరై. పక్కదార్లు, వాలు ; త. ఓరమ్. అంచు ; వారమ్. కొండవాలు ప్రదేశం ; మ. ఓరమ్. అంచు, ఒడ్డు.
పో.చూ. సం. అవరః. సమీపం? ; అవర. కింద, తక్కువ, వెనుకటి, తరువాత ; అపర. తరువాత, వెనుకటి. అర్వాచీనం, న్యూనం, తక్కువ. దూరం ; పా. ఓరసి. ఈ పక్క, ఈ వైపు ; ఓరతో. ఈ వైపునుండి ; కుమా. ఓరీ. పక్క ; నే. ఓర్. పక్క, వైపు, ఈ వైపు ; ఓం. ఓర్ హద్దా ; హిం. ఓర్. దిక్కు. మార్గం ; పం. ఓర్. మార్గం ; సింహ. ఓరె. ఈ పక్క, ఈ వైపు ; గు. ఓరు. దగ్గర.

**ఓరకన్ను** రూ. ఓరగన్ను. వి. పక్కచూపు, కడగంటి చూపు. కవిరా. 3.98. క. ఓరెగణ్ణు ; త. ఓరెక్కణ్. **ఓరకుండు** అ.క్రి. బయట చేరు, ముట్టగు, కడకేగు. **ఓర
కొవ్వు** వి. పంకకొవ్వు, ఓరసిగ. వైజ. 4.30. **ఓరగచ్చు** వి. ఓరగా చేసిన కచ్చు, పక్కకొదిగించిన గోచి. భల్లా. 3.
**ఓరగట్టు** వి. 1. ఆధారం, బలం. దశకు. 7.60 ; 2. ప్రతి
స్పర్థి, పోటీదారుడు. <ఓర + కట్టు. **ఓరగన్ను** రూ.చూ.
ఓరకన్ను. **ఓరగించు** స.క్రి. 1. పక్కకు వంచు, ఒడ్డి
గిలజేయు. బసవ. 5.450. 1 ; 2. నిరాకరించు, తిరస్క
రించు, విడుచు. సానందో. 3.53. **ఓరగిలు** రూ. ఓరగిల్లు.
ఓఱగిలు, ఓఱగిల్లు. అ.క్రి. ఒరుగు, వంగు, పక్కకు తొలగు.
భార.భీష్మ. 1.268. **ఓరగిల్లు** రూ.చూ. ఓరగిలు. అ.క్రి.
ఒరుగు, వంగు, పక్కకు తొలగు. **ఓరచూపు** వి. పక్కచూపు,
ఓరకంటిచూపు, విలాసపుచూపు. పీఠి. 50, సురా. 59. **ఓర
చ్చులు** వి. 1. మడమలదగ్గిర మందంగా అట్టలువేసి కుట్టిన
చెప్పులు. హరిశ్చ. 5.3 ; 2. ఒంటిఅట్ట చెప్పులు. **ఓరట్ట
చెప్పులు** వి. 1. గుదికాలుంచేచోట ఎత్తుగా అట్టలువేసి
కుట్టిన చెప్పులు ; 2. ఒంటిఅట్ట చెప్పులు. **ఓరతలపాగ** వి.
ఒకపక్కకు ఒరిగేటట్లుగా చుట్టిన తలపాగ. దశకు. 10.112.
**ఓరతోపుడు** వి. కొయ్యమీద ఒంపులదగ్గర చెక్కే తీరు. **ఓర
వదు** అ.క్రి. పక్కకు వంగు, ఒరుగు. **ఓరవయిట** వి. జారు
పయట, విలాసపువయిట, రొమ్ములు సగం కప్పిన పైట.
శరాం. 2.73. **ఓరపాక** వి. దోరపాక, గోడలమీదనించి
పక్కకుదించిన పాక. ఆం.భా. 2.16. **ఓరపాటు** రూ. ఓర
బాటు. వి. పక్కకు ఒరగటం, ఒరగటం. ఉ.రా. 3.40.
**ఓరపార(లు)** రూ. ఓరపారము. వి. 1. లోపం, దోషం,
కొరత. కువల. 2.9, హంస. 2.11 ; 2. అరమర, భేదం.
సుద. 4.67. **ఓరపారము** రూ.చూ. ఓరపార(లు). వి. 1.
హెచ్చుతగ్గు ; 2. దోషం ; 3. భేదాభిప్రాయం. **ఓరపుచ్చు**
రూ. ఓరవుచ్చు. స.క్రి. పక్కకు తిప్పు. **ఓరబల్ల** వి. ద్వార
బంధానికి నిలువుకమ్మి పక్కన గోడకు అతికే చెక్క. **ఓర
బాటు** రూ.చూ. ఓరపాటు. **ఓరబెట్టు** స.క్రి. తిరగవేయు.
<ఓర[1] + పెట్టు. **ఓరమోము** వి. పెడమొగం, ఒక పక్కకు
తిప్పిన మొగం. మను. 2.58. **ఓరలవంటివచ్చు** అ.క్రి.
అంచులను అంటుకొనివచ్చు. **ఓరలవచ్చు** అ.క్రి. అంచులను
అంటుకొనివచ్చు. **ఓరల్దిద్దు** స.క్రి.వంకలుపట్టు, తప్పులుపట్టు.
**ఓరవలి** వి. అనేక రంగుల చీర, వన్నెలచీర, కరకంచుచీర.
**ఓరవాకిలి** వి. 1. నగం తెరిచిన తలుపున్న గుమ్మం, అర్ధ
వివృతమైన గృహద్వారం. కాశీ. 4.121 ; విణ. 1. నగం
తెరవబడింది. పండిత.పురా. 96 ; 2. నగం తెరచిన తలు
పున్న గుమ్మంకలది. శుక. 2.220. **ఓరవుచ్చు** రూ.చూ. ఓర
పుచ్చు. స.క్రి. పక్కకు తిప్పు. శృం.నై. 7.103. <ఓర[1] +
పుచ్చు. **ఓరవోవు** అ.క్రి. 1. వంగు, ఒరగు, బసవ. 6.593 ;

**2.** వ్రక్రమగు, వంకరగు. చంద్రా. 6.128. < ఓర[1] + పోవు. **ఓరపారములు** వి. వ్యత్యాసాలు. **ఓరసించు** స.క్రి. తప్పుకొను, విడిచిపెట్టు, వైదొలగు. ఇందు. 5.143. **ఓరసింపు** వి. ముఖం పక్కకు తిప్పటం అని. 3.95. **ఓరసిలు** రూ. ఓరసిల్లు. అ.క్రి. దారి తొలగు, అపసరిల్లు. రామా. 2.113. **ఓరసిల్లు** రూ.చూ. ఓరసిలు. **ఓరసేయు** స.క్రి. పక్కకు వంచు, పక్కకు ఒరగించు. రం.రా.ఉ. 103.210. < ఓర + చేయు. **ఓరొంపు** వి. వాలుగా ఉన్న వంపు. **ఓర్పు**[2] వి. కిటికీ మూల భాగం.

**ఓర**[2] వి. రాత్రింబవళ్లు, అహోరాత్రం (సమాసాల్లో మాత్రమే ప్రయుక్తం). ఉదా. ఓరంతపొద్దు.

సం. హోరా. ఒక గంట (అహోరాత్రంలో 24 వ భాగం), రాశి చక్రంలో సగం, జాతకం; మహా. ప్రా. హోరా. జ్యోతిష శాస్త్రంలో చెప్పబడిన లగ్నం; నే. హోరా. వాల విభజన.

< సం. హోరా.

**ఓరంతపొద్దు** రూ.చూ. ఓరంతప్రొద్దు, క్రి. విశ. ఎల్లప్పుడూ, రోజంతా. **ఓరంతప్రొద్దు** రూ. ఓరంతపొద్దు, క్రి. విశ. రేయింబగళ్లు, ఎల్లప్పుడూ, రోజంతా, చాలా కాలం, అహోరాత్రం. కాశీ. 4.138, రం.రా. 493.11.

**ఓరకన్ను** చూ. ఓర[1].
**ఓరకుండు** చూ. ఓర[1].
**ఓరకొవ్వు** చూ. ఓర[1].
**ఓరగచ్చు** చూ. ఓర[1].
**ఓరగట్టు** చూ. ఓర[1].
**ఓరగన్ను** చూ. ఓర[1].
**ఓరగించు** చూ. ఓర[1].
**ఓరగిలు** చూ. ఓర[1].
**ఓరగిల్లు** చూ. ఓర[1].
**ఓరచూపు** చూ. ఓర[1].
**ఓరచ్చులు** చూ. ఓర[1].
**ఓరట్టచెవ్వులు** చూ. ఓర[1].
**ఓరడి**[1] వి. పట్టుదల. చమ. 1.75.

పో.చూ. త. ఒరుపటి. ఒక విధం, ఒక పద్ధతి, అదే విధంగా.

**ఓరడి**[2] రూ.చూ. వారడి. వి. తేడా.
**ఓరణము** వి. ఒకజాతిడేగ. యయా. 1.112.

సం. వారణ-. నివారించునది, అడ్డగించునది. వి. విఘ్నం, ఆటంకం.

< సం. వారణ-. అర్థ విపరి.

**ఓరతలపాగ** చూ. ఓర[1].
**ఓరతోపుడు** చూ. ఓర[1].
**ఓరంతపొద్దు** చూ. ఓర[2].
**ఓరంతప్రొద్దు** చూ. ఓర[2].
**ఓరపడు** చూ. ఓర[1].
**ఓరపయిఁట** చూ. ఓర[1].
**ఓరపాక** చూ. ఓర[1].
**ఓరపాటు** చూ. ఓర[1].
**ఓరపార(లు)** చూ. ఓర[1].
**ఓరపారము** చూ. ఓర[1].
**ఓరపుచ్చు** చూ. ఓర[1].
**ఓరబల్ల** చూ. ఓర[1].
**ఓరబాటు** చూ. ఓర[1].
**ఓరబెట్టు** చూ. ఓర[1].
**ఓరమోము** చూ. ఓర[1].
**ఓరలవంటివచ్చు** చూ. ఓర[1].
**ఓరలవచ్చు** చూ. ఓర[1].
**ఓరల్దిద్దు** చూ. ఓర[1].
**ఓరవ** పో.చూ. ఓర[1]. వి. విత్తనాలు చల్లడానికి అనువుగా చేసిన ప్రదేశం (రాళ్లు విడివిడిగా దూరదూరంగా ఉన్నదం).
**ఓరవలి** చూ. ఓర[1].
**ఓరవాకిలి** చూ. ఓర[1].
**ఓరవుచ్చు** చూ. ఓర[1].
**ఓరవోవు** చూ. ఓర[1].
**ఓరసారములు** చూ. ఓర[1].
**ఓరసించు** చూ. ఓర[1].
**ఓరసింపు** చూ. ఓర[1].
**ఓరసిలు** చూ. ఓర[1].
**ఓరసిల్లు** చూ. ఓర[1].
**ఓరసేయు** చూ. ఓర[1].
**ఓరి** రూ.చూ. ఓరీ. అవ్య. నీచ, మిత్ర పురుష సంబోధనంలో ఉపయుక్తమయ్యే సంబోధనార్థకం. విక్ర. 2.236.
**ఓరిమి** వి. సహనం, ఓర్పు, క్షమ. సీలా. 2.88.

త. ఓర్ ప్పు. ఓర్మి, ధైర్యంగా ఉండు; ఓర్ యై. ధైర్యం, మనస్థైర్యం: కువి. ఒర్ హనై. సహించు.

**ఓరీ** రూ. ఓరి. చూ. ఓ[2]. అవ్య. నీచ, మిత్ర పురుష సంబోధనంలో ఉపయుక్తమయ్యే సంబోధనార్థకం. ఉ.హరి. 4.187.
**ఓరు**[1] చూ. చిలుకు. వి. **1.** పండగ రోజుల్లో ఇంటిగోడలకు కింది భాగంలోనూ, అరుగుల కిందిభాగంలోనూ తీర్చిపెట్టే ఎర్రమట్టి పట్టె. ముకుంద. 1.26; **2.** వేళ్లతో సున్నం తీసి ఈతాకుల్లాగా కన్పించేటట్టు వేసిన ముగ్గు.

పో.చూ. త. ఉవర్. చవిటిమన్ను.

**ఓరుతీయు** అ.క్రి. ఇంటిగోడల క్రింది భాగంలోనూ, మూలల్లోనూ ఎర్రమట్టితో పట్టెలు తీర్చు. **ఓరుతీర్చు** అ.క్రి. ఎర్రమట్టితో ఇంటిని అలంకరించు. ఇందు. 5.20.

**ఓరు**[2] రూ. ఓఱు. వి. **1.** ధ్వని; **2.** వర్షం కురిసేటప్పుడు అయ్యే ధ్వని; **3.** గాలి తీవ్రతవలన కలిగే శబ్దం.

పో.చూ. సం. ఉరు-. పెద్దదైన, గొప్పదైన, ధ్వన్యనుకరణశబ్దం కావచ్చు.

**ఓరుగాలి** వి. పెద్దగాలి, హోరుమని ధ్వనిచేస్తూ వీచే గాలి. రామలింగ. 68.

**ఓరు**[3] రూ.చూ. ఒరు. విశ. ఒకటి. సమాసాల్లో మాత్రమే ప్రయుక్తం.
**ఓరుగాలి** చూ. ఓరు[2].
**ఓరుచు** రూ.చూ. ఓర్చు. స.క్రి. సహించు. శృం. నై. 3.130.

**ఓరుచుకొను** రూ.చూ. ఓర్చుకొను. అ.క్రి. సహించు.

ఓరుచుకొను చూ. ఓరుచు.
ఓరుతీయు చూ. ఓరు[1].
ఓరుతీర్చు చూ. ఓరు[1].
ఓరువరి చూ. ఓరుపు.
ఓరుపు రూ.చూ. ఓర్పు[1]. వి. క్షమ, సహనం.

ఓరుపరి రూ.చూ. ఓర్పరి. వి. 1. సహనశీలి, క్షమావంతుడు, శాంతుడు; 2. సహనంగలది. <ఓరుపు+-అరి.

ఓరువమి రూ.చూ. ఓర్వమి. వి. 1. అసహనం, సహింపమి; 2. ఈర్ష్య, అసూయ.
ఓరెద్దము వి. ఎగరాశి.
ఓరెము రూ.చూ. ఓపిరము. వి. ఆహారం, అన్నం. భాగ.ఉ. 10.966.
ఓరొంపు చూ. ఓరు[1].
ఓర్కు రూ.చూ. ఓడిః. వి. పొలాల్లో నీళ్లు పారటంవల్ల మట్టి కొట్టుకొనిపోయి ఏర్పడ్డ గొయ్యి. అర్ధపవరి.
ఓర్చలేనితనము చూ. ఓర్చు.
ఓర్చు రూ. ఓరుచు. స.క్రి. 1. జయించు, ఓడించు. భార.ఆది. 7.203; 2. సహించు, భరించు. భార.ఉద్యో. 4.257; 3. తయారుచేయు, సిద్ధంచేయు. భార. 4.268; అ.క్రి. 1. సమర్థమగు, ఓపు, చాలు. భార.ఉద్యో. 4.149; 2. నమకట్టు, సిద్ధపడు. భార.ద్రోణ. 5.32.

క. ఒల్వు. బలం, మన్నిక (వస్త్రం), త. ఒర్ప్పు. సహనం, క్షమ, ఓర్మి, ధైర్యంతో ఉండు, సాహసించు; కువి. ఒరహిన్నై, ఒర్హిన్నై. సహనం.

ఓర్చలేనితనము వి. అసూయ, ఈర్ష్య. ఓర్చుకొను రూ. ఓరుచుకొను. అ.క్రి. సహించు, తాళు. ఓర్వనివాఁడు వి. ఓర్చలేనివాడు, అసహనుడు. ఓర్వమి రూ. ఓరువమి. 1. అసహనం, సైపమి. భీమ. 5.148; 2. ఈర్ష్య, అసూయ. ఆం.భా. 1.134. ఓర్వలేనితనము వి. అసహనం.
ఓర్చుకొను చూ. ఓర్చు.
ఓర్త రూ.చూ. ఓర్తి. సర్వ. ఒక స్త్రీ, అన్య స్త్రీ.
ఓర్తి రూ. ఓర్త, ఓర్తు, ఓర్తుక, ఓర్తె. సర్వ. ఒక స్త్రీ, అన్య కాంత.
ఓర్తు రూ.చూ. ఓర్తి. సర్వ. ఒక వనిత, అన్య స్త్రీ. కాశీ. 5.316.

ఓర్తోర్తు సర్వ. ఒకతెమరొకతె, ఇద్దరు. నిర్వ.రా. 5.101.

ఓర్తుక రూ.చూ. ఓర్తి. సర్వ. ఒక స్త్రీ, అన్య స్త్రీ.
ఓర్తె రూ.చూ. ఓర్తి. సర్వ. ఒక వనిత, అన్యకాంత.
ఓర్తోర్తు చూ. ఓర్తు.
ఓర్పరి చూ. ఓర్పు.
ఓర్పు[1] రూ. ఓరుపు. చూ. ఓర్చు. వి. 1. సహనం, క్షమ. పారి. 1.112; 2. ఇతర్లను ఓడించడం. పాంచలి. 4.52.

క. ఒర్పు. శక్తి, దృఢత్వం, మన్నిక, మొతకతనం (గుర్రమొక్క): త. ఒర్పు. సహనం, క్షమ, ఓర్పు.

ఓర్పరి రూ. ఓరుపరి. వి. క్షమావంతుడు, శాంతుడు, సహనం కలవాడు. ప్రబంధ. 657, ఆం.భా. 3.11.

ఓర్పు[2] చూ. ఓర[1].
ఓర్వనివాఁడు చూ. ఓర్చు.
ఓర్వమి చూ. ఓర్చు.
ఓర్వలేనితనము చూ. ఓర్చు.
ఓఱగిలు రూ.చూ. ఓరగిలు. అ.క్రి. వంగు, వాలు.
ఓఱగిల్లు రూ.చూ. ఓరగిలు. అ.క్రి. వంగు, వాలు.
ఓఱు రూ.చూ. ఓరు[2]. వి. చప్పుడు, అలికిడి.
ఓల[1] వి. 1. జలక్రీడ, జలవిహారం. కు.సం. 9.287; 2. జలక్రీడలు సలిపే సమయంలో 'వట్టుకో' చూస్తాము' అని ఇతరుల్ని ప్రేరేపించటానికి ఉపయోగించే శబ్దం. హరి.పూ. 6.96; 3. నింద, నెపం, వ్యాజం. సాం.ని. 2.22.

క. ఓల్, ఓలు, ఓలాడిసు. జలక్రీడ లాడటానికి ప్రేరేపించు: ఓలాడు. నీళ్ళల్లో అటూ, ఇటూ ఈదు, ఈను, స్నానంచేయు; త. ఓలమ్. శబ్దం, ధ్వని, అరుపు, ఆర్తనాదం.

ఓలగందము వి. స్నానం చేసేటప్పుడు శరీరానికి పూసుకునే పరిమళ ద్రవ్యం, పూతపసుపు, పసుపు. శృం.నై. 6.68; ఓలపాట స్నానం చేసేటప్పుడుగాని, ఈదేటప్పుడు గానీ పాడేపాట, పడవపాట; ఓలపెట్టు అ.క్రి. కేరించు, కేకవేయు; ఓలలాడు రూ. ఓలలాడు, ఓలాడు[1]. అ.క్రి. (జలాదులందు) విహరించు, జలకమాడు. ఉ.హరి. 5.107. <ఓల+-లు+-ఆ?(న్)+ఆడు; ఓలలాట రూ. ఓలాట. వి. జలక్రీడ. ప్రభా. 2.106. <ఓల[1]+-లు+ఆట; వి. జలక్రీడ; ఓలలాడు రూ.చూ. ఓలలాడు. అ.క్రి. 1. జలక్రీడలాడు, ఈదు, స్నానంచేయు. యయా. 3.54; 2. మునుగు. ఆము. 4.138; ఓలలారుచు రూ.చూ. ఓలలార్చు. స.క్రి. (జలాదులందు). విహరింపజేయు, స్నానం చేయించు; ఓలలార్చు రూ. ఓలలారుచు, ఓలారుచు, ఓలార్చు. స.క్రి. 1. ఓలలాడించు (జలాదులందు). విహరింపజేయు, స్నానం చేయించు. భార. భీష్మ. 2.166; 2. తేల్చు; ఓలాట రూ. చూ. ఓలలాట. ఓలాడు[1] రూ. చూ. ఓలలాడు. అ.క్రి. (జలాదులందు). విహరించు, జలకమాడు. యయా. 3.54; ఓలారుచు రూ.చూ. ఓలలార్చు. స.క్రి. (జలాదులందు) విహరింపజేయు; ఓలార్చు రూ.చూ. ఓలలార్చు. స.క్రి. (జలాదులందు) విహరింపజేయు. హర. 2.7, పారి. 3.38.

ఓల[2] వి. చెక్కకు రెండు వైపులా బొంగులు బిగించి మోతకు పనికి వచ్చేట్టు చేసిన సాధనం.
ఓలగందము చూ. ఓల[1].
ఓలగమగు చూ. ఓలగము.
ఓలగము వి. 1. కొలువుకూటం, రాజదర్బారు, సభాభవనం, ఆస్థానమండపం. కు.సం. 9.235; 2. సేవ, కొలువు. రామా. 2.76; 3. సభ.

సం. అవలగ్న-. కిందకు వేలాడు, ఆత్మార్పణ చేసికొను; దేశి. ప్రా. ఓలగ్గా. సేవ; నే. ఓల్. కప్పం; మరా. ఓళగ. సేవ, దాస్యం.

క. ఓలగ, వాలగ. సేవ, దాస్యం; కొలువు కూటం, సభాభవనం; తు. ఓలగ. రాజదర్బారు; త. ఓలక్కమ్. రాష్ట్ర సమావేశ భవనం; మ. ఓలక్కమ్. దర్బారు.

<ప్రా. ఓలగ్గా.

ఓలగమగు అ.క్రి. సమావేశమగు. దశా. 1.14; ఓలగ

ముంచు స.క్రి. కొలుచు, సేవించు; **ఓలగముండు** అ.క్రి. సమావేశమగు, కొలువుతీర్చు, సభతీర్చు. హర. 3.37; **ఓలగించు** స.క్రి. కొలుచు, సేవించు. జై.భార. 1.44, మను. 1.5; అ.క్రి. 1. సభదీర్చు. సారంగ. 1.79; 2. ఒప్పారు.

**ఓలగముంచు** చూ. ఓలగము.

**ఓలగముండు** చూ. ఓలగము.

**ఓలగించు** చూ. ఓలగము.

**ఓలచెంగవాలు** వి. 1. ఓటమి, అపజయం; 2. ఓటమిని అంగీకరిస్తూ వేసే కేక. ఆం.భా. 2.224.

**ఓలపాట** చూ. ఓల[1].

**ఓలపాటిపవ్వములు** వి. జీలకర సన్నాలు.

**ఓలపెట్టు** చూ. ఓల[1].

**ఓలమావగొను** చూ. ఓలము.

**ఓలమి** రూ.చూ. ఓలము. వి. 1. చాటు; 2. శరీరం; 3. రహస్య స్థానం.

**ఓలము** రూ. ఓలమి, ఓలిమి. వి. 1. దాపరికం, చాటు. కు.సం. 11.624, భార. విరా. 2.118; 2. భేదం. అరమరిక. కు.సం. 11.54; 3. జంకు, వెనుదీయటం, కు.సం. 12.134; 4. రహస్య స్థానం, మరుగు చోటు భార. అను. 3.282; 5. దేహం, శరీరం. అప్ప. 4.320; 6. మూలధనం; విశే. 1. రహస్యమైన, మరుగైన. భార. విరా. 2.321, భాగ. పూ. 10.1033; 2. లోతైన. కవిక. 4.131.

క. ఒళ, ఉళ్, ఒళు. లోపలిది, దాచినది; తు. ఉళ్, ఒళ్. దాపరికం; త. ఉళ్, ఒళి. దాచటం; మ. ఉళ్, ఉళ్ళు, ఒళి. లోపల.

<మూ.ద్రా. *ఒళ్-.

**ఓలమావగొను** అ.క్రి. 1. వెనుదీయు, పరాఙ్ముఖమగు. నిర్వ. 4.60, భార. విరా. 4.223; 2. ప్రవేశించు. (రహస్య స్థలంలో) దొచ్చు. శృం.నై. 4.97. <ఓలము + ఆశ + కొను. **ఓలముకొను** అ.క్రి. చాటుచేసుకొను. కు.సం. 5.494. **ఓలముచొచ్చు** అ.క్రి. 1. దాగు; 2. వెనుదీయు.

**ఓలముకొను** చూ. ఓలము.

**ఓలముచొచ్చు** చూ. ఓలము.

**ఓలలవాడు** చూ. ఓల[1].

**ఓలలాట** చూ. ఓల[1].

**ఓలలాడు** చూ. ఓల[1].

**ఓలలారు** అ.క్రి. తేలు.

**ఓలలారుచు** చూ. ఓల[1].

**ఓలలార్చు** చూ. ఓల[1].

**ఓలాకు** వి. 1. అలయిక, శ్రమ; 2. వ్యాకులత, క్షోభం; 3. విచారం.

క. ఉయ్. నిర్బంధించు, హద్దుల్లో ఉంచు; త. ఉయవల్. బాధ, కష్టం.

**ఓలాకుపడు** అ.క్రి. 1. క్షోభపడు, వ్యాకులపడు. భార. విరా. 3.131; 2. అలయు, శ్రమపడు. హరి.పూ. 6.22.

**ఓలాకుపడు** చూ. ఓలాకు.

**ఓలాట** చూ. ఓల[1].

**ఓలాడు**[1] చూ. ఓల[1].

**ఓలాడు**[2] చూ. ఓలాకు. అ.క్రి. అలసిపోవు.

**ఓలారుచు** చూ. ఓల[1].

**ఓలార్చు** చూ. ఓల[1].

**ఓలి**[1] వి. వరుస, క్రమం. భార. శాంతి. 5.172. వ్యావహారికంగా ఉపయోగింపబడి కొన్ని చోట్ల సందర్భాను సారంగా 'బాగు, సంపూర్ణత' మొ. అర్థాల నిస్తుంది.

సం. ఆళి-; ప్రా. మహా. ఓ. ఆలి, ఓలి, ఓలి. వరుస; దేశి. ప్రా. ఓఆలి, ఓలీ; మరా. ఓళ్. వరుస; గు. ఓళ్.

క. ఓళి, ఓణి. వరుస. క్రమం. వరుసక్రమం, సంఖ్య; త. ఓళి. వరుస, పంక్తి.

<దేశి. ప్రా. ఓలి-.

**ఓలిపుట్టలు** వి. పుట్టల వరుస.

**ఓలి**[2] వి. కన్యాశుల్కం. వేమన. 2.17, ఆం.భా. 2.179.

క. ఓలు. జామీను, హామీ. ఓలె. సువాసినులు ధరించే కర్ణాభరణం; కొడ. ఓలె. స్త్రీలు ధరించే కర్ణాభరణం. తు. ఓలె. కర్ణాభరణం, తాటాకుతో చేసిన కర్ణభూషణం. త. ఓలె. కర్ణాభరణం.

**ఓలిగొను** స.క్రి. కన్యాశుల్కం తీసికొను, కన్నెకు వెల తీసుకొను. **ఓలించు** స.క్రి. పాలించు, కాపాడు, ఓము.

**ఓలిగొను** చూ. ఓలి[2].

**ఓలించు** చూ. ఓలి[2].

**ఓలిపాట** వి. కుప్ప నూర్చేటప్పుడు పాడే పాట, రోలిపాట.

**ఓలిపుట్టలు** చూ. ఓలి[1].

**ఓలిమి** రూ.చూ. ఓలము. వి. 1. చాటు, మరుగు. ఆం.భా. 1.76; 2. ఎడబాటు, విరహం. మల్హ. 3.98.

**-ఓలు** రూ.చూ. ప్రోలు. వి. గ్రామ నామాల్లో ఉత్తర భాగం.

**ఓలొంపు** పో.చూ. ఓర[1]. వి. వాలుగా ఉన్న వంపు.

**ఓల్‌ఖానా** వి. పీలుండే ప్రదేశం, ఒక రకం చెరసాల, కాపలా గృహం.

హిం. ఓల్. ఆశ్రయం, శరణం, ఒకని దగ్గర కుదువ ఉంచిన వస్తువు లేదా మనిషి. పో.చూ. ఓల్గ్-. రాజ పురుషుడు.

<హిం. ఓల్ + ఉ. ఖానా. (వ్య). రహస్యాలోచన మందిరం.

**ఓళిగ** రూ.చూ. హోళిగ. వి. భక్ష్యవిశేషం. బొబ్బట్లు.

**ఓవము** పో.చూ. ఓదము. వి. ఏనుగులు మొదలైన వాటిని పట్టుకునేందుకు తవ్విన గొయ్యి. అపపాతం. వరాహ. 4.75.

**ఓవర** రూ.చూ. ఓవరి[1]. వి. లోపలిగది, శయనాగారం.

**ఓవరి**[1] రూ. ఓవర. వి. 1. లోపలిగది, గర్భాగారం. దశకు. 7.100; 2. చంద్రశాల, శిరోగృహం. శుక. 3.294; 3. అంతఃపురం. ప్రభా. 5.10.

సం. అపవరక-. గృహాంతర్భాగం, అపవరికా; మహా.ప్రా. ఓఅరయ. గది; ఓఅరియా; పా. ఓవరక. లోపలిగది; హిం. ఓర; పం. ఓర; గు. ఓరు; మరా.

ఓవరి. దేవాలయ ప్రహారీ గోడ. లోపలిగది ; ఓరీ. చిన్న గది.

క. ఓవరి. <సం. ఉపగృహ-. లోపలిగది.

<పా. ఓవరక.

**ఓవరి²** వి. సభ్యత, నాగరికత, మర్యాద.

సం. అపవారిత. మూయబడిన, కప్పబడిన, మరుగైన ; ప్రా. ఓవారిఅ. కప్పబడిన ; పా. ఓవారియాన. అనహ్యకరమైన. నిషేధింపబడిన.

<ప్రా. ఓవారిఅ (అర్థవిపరి).

**ఓవసాంబ** వి. ఒక తెగ సన్నపడ్లు.

**ఓవిరము** రూ. ఓగిరము, ఓయిరము. ఓరెము, ఓహర.వి. ఆహారం, అన్నం. పుర్తి. శా. 3.1173.

సం. ఉపహార. నైవేద్యం, అతిథులకు పెట్టే ఆహారం, రాజుకుగాని అధికారికిగాని సమర్పించే కానుక ; ప్రా. ఉవహార-ఓగర, ఒగ్గర. బియ్యం : ఓగార, ఓగిర. మింగటం : పా. ఉపహార. కానుక ; నే. ఓఖరో, వైరో. తిను ; ఓఖలో, పణరో. ఎక్కువగా తినటం ; మరా. ఓయరా. బియ్యంలో ఓనబర్యానికి కేటాయించిన భాగం, పంటఇల్లు ; ఓగరణో. వడ్డించు.

క. ఓగర. అన్నం ; పో.చూ. ర. ఓరై. అన్నం, చిత్రాన్నం.

**ఓవు¹** రూ.చూ. ఒవ్వు¹. అ.క్రి. సరిపడు, గిట్టు, అనుకూలమగు. శుక. 1.70.

**ఓవు²** పో.చూ. ఓదియ. వి. కోసిన పైరును పొలంలో దాగులుగా పడవేసినది.

**ఓన** పో.చూ. యూన. వి. ఎదురుమూల.

**ఓనట** చూ. ఓనరు. వి. ఓనరింత, ఓసరింపు.

**ఓనడిలు** రూ.చూ. ఓనరిల్లు. అ.క్రి. తగ్గు, తొలగు, తూలు, చేరు.

**ఓనడిల్లు** రూ.చూ. ఓనరిల్లు. అ.క్రి. తగ్గు, తొలగు, తూలు, చేరు.

**ఓనరించు** రూ. ఓనరు.

**ఓనరింత** చూ. ఓనరు.

**ఓనరింపు** చూ. ఓనరు.

**ఓనరిలనుంచు** చూ. ఓనరు.

**ఓనరిలు** చూ. ఓనరు.

**ఓనరిల్లు** చూ. ఓనరు.

**ఓనరు** రూ. ఒనురు. అ.క్రి. తొలగు, అపసరిల్లు. ద్వి. సారంగ. 1.17 పు. 14 పం.

సం. ఒప-/సృ-. జారు, వెనుదీయు ; అపసరణ. వెళ్లటం, వెనుదీయటం ; అపసారః. బయటకు దారి ; ప్రా. ఓసర. వెనుదీయు, వెనుకకు తగ్గు, ఓసార. వెళ్లటం ; అమా. ఓసల్. వ్యాపింపచేయు ; పా. ఓసరతి. కిందికి వెళ్లు, వెళ్లు ; ఓసారేతి. చెదరిపోవు ; నే. ఓసార్ ; కదలిక ; గు. ఓసరవు, ఓసార్. వెనుదీయటం ; సిం. అవసరు. వెనుదీయు ; హిం. ఉసర్‌నా, ఉసార్‌నా ; మరా. ఓసరనే. కిందకు జారు, తగ్గిపోవు, ప్రవహించు.

<ప్రా. ఓసర.

**ఓనరించు** స.క్రి. 1. తొలగేట్లుచేయు. బసవ. 3.1140 ; 2. విడుచు, త్యజించు, విసర్జించు. పాండు. 1.101. ఉ. హరి. 1.57 ; అ.క్రి. 1. ఓనరిల్లు, తొలగు, అంతరించిపోవు. కు.సం. 4.457. భార.భీష్మ. 1.267 ; 2. ఇష్టపడకుండు. వసు. 1.122 ; 3. వంగు. పారి. 2.102.

క. ఓసరిసు. ఒక పక్కకుపోవు, దారితప్పు, వెనుదీయు దారివిచ్చు, వెళ్లు, తిరస్కరించు. **ఓనరింత** వి. విడివడటం, ఓనరించటం. ఉ.రా. 6.165. **ఓనరింపు** వి. తొలగటం. **ఓనరిలమంచు** చూ. ఓనరిలు. స. క్రి. పక్కన ఉంచు. వేరుగా పెట్టు. **ఓనరిలు** రూ.చూ. ఓనరిల్లు. అ. క్రి. 1. తప్పుకొను, తొలగు. భార.ఆది. 4.13 ; 2. అలియు. ఆము. 4.52 ; 3. తగ్గు. ఆం. భా. 3.96 ; 4. విరమించు. హరిశ్చ. 5.22. **ఓనరిల్లు** రూ. ఓనడిలు, ఓనడిల్లు, ఓనరిలు. అ.క్రి. 1. తొలగు, తప్పుకొను. కు.సం. 6.12. శృం.నై. 3.84 ; 2. తగ్గు, కొరతపడు.

**ఓసి** రూ. ఒసి¹, ఒసీ, ఒసె, ఒసే, ఒసేయ్, ఓసీ. అవ్య. నీచ స్త్రీ సంబుద్ధి, అతిపరిచయంవల్ల చేసే సంబుద్ధి.

పో.చూ. త. -చి. స్త్రీ ప్రత్యయం.

<ఓ²+సి.

**ఓసోసి** అవ్య. నిందితార్థ సూచకం. <ఓసి+ఓసి.

**ఓసినోటివాడు** రూ.చూ. బోసినోటివాడు. వి. పట్టిమాట వాడేవాడు.

**ఓసిరీ** రూ.చూ. ఉసిరి. వి. వృక్షవిశేషం (Emblic myrabalmi, Rox).

**ఓసీ** రూ.చూ. ఓసి. అవ్య. నీచ, మిత్ర స్త్రీ సంబోధనార్థకం. కళా. 3.216, కళా. 3.216.

**ఓసోసి** చూ. ఓసి.

**ఓహటము** వి. 1. వెనుదీయటం ; 2. జంకు ; 3. ఓటమి.

సం. అవఘట్ట-. త్రోయు ; అవఘట్టన. వి. రుద్దటం. దగ్గరకు చేరటం ; అప-ఘట్ (మాట యతియొక్క ప్రే. క్రి.). మూయు ; ప్రా. ఓహట్ట, ఓహట్టియ. ఆటంకపరిచేవాడు ; దే.ప్రా. ఓహట్ట ; అ.మా. ఓహట్టిత. వైదొలగటం, పక్కన ఉండటం ; నే. ఓహట్ను. అడ్డగించు, ఆక్రమించు, మరా. ఓహటణే. అ.క్రి. తగ్గించు. కిందకు పారేట్లు చేయు ; ఓహట-టి. ఆటంకం.

<దే. ప్రా. ఓహట్ట.

**ఓహటించు** అ.క్రి. 1. వెనుదీయు. భార. ఉద్యో. 4.249 ; 2. జంకు, భయపడు. నిర్వ. 9.69 ; 3. ఓడు. శృం.నై. 7.168. **ఓహటిలు** రూ.చూ. ఓహటిల్లు. అ.క్రి. 1. లయమగు, నాశనమగు. శృం.నై. 8.179 ; 2. భయపడు, జంకు. చంద్రా. 3.135 ; 3. వెనుదీయు. **ఓహటిల్లు** రూ. ఓహటిలు. అ.క్రి. 1. అలసిపోవు. సారంగ. 3.184 ; 2. నాశనమగు. శృం.నై. 8.176 ; 3. వెనుదీయు ; 4. జంకు, భయపడు.

**ఓహటించు** చూ. ఓహటము.

**ఓహటిలు** చూ. ఓహటము.

**ఓహటిల్లు** చూ. ఓహటము.

**ఓహర** రూ.చూ. ఓవిరము. వి. చిత్రాన్నం, పులిహోర.

**ఓహరి** హో.చూ. ఓహరిసాహరి. క్రి.విశ. అహం పూర్వకంగా, నేను గొప్ప నేను ముందు అనే ఆవేశం. అవిచ్ఛిన్నంగా.

**ఓహరిసాహరి** క్రి.విశ. **1.** సాహంకారంగా. భార. విరా. **3.164 ; 2.** గుంపులు గుంపులుగా. భార. భీష్మ. **2.173 ; 3.** ముష్టాముష్టి. వరాహ. **6.114 ; 4.** ఎడతెగక, అవిచ్ఛిన్నంగా. ఆము. **4.93.**

సం. అవహృ. కొంతపు వేలాడజేయు, కూడగట్టు ; అవహార. కొంతకాలం యుద్ధాన్ని ఆపటం, విరాయుధులవటం, ఆహ్వానించటం ; ప్రా. ఓహార్. న.క్రి. వక్రమగుట, క్రూరమగు ; పా. ఓహరణ. తీసుకుపోవటం, (పక్కదారికి) మార్గం తప్పించటం, పెడతోవ పట్టించటం ; ఓహరతి. తీసుకొనిపోవు, తొలగించు.

ఓహరి <సం. అవహార- ; సాహరి <ప్రా. సాహర-. <సం. సంహార-.

**ఓహరిసాహరియగు** అ.క్రి. ఎడంలేకుండా ఉండు.

**ఓహరిసాహరియగు** చూ. ఓహరిసాహరి.

**ఓహొ** రూ.చూ. ఓహో. అవ్య. **1.** సంబోధనార్థకం ; **2.** ప్రశంసాద్యోతకం.

**ఓహో** రూ. ఒహో, ఓహొ. అవ్య. **1.** సంబోధనా విభక్తికి ముందు వచ్చే ప్రశంసావాచకం. భార. ఆది. **2.234 ;** **2.** పిలిచినప్పుడు బదులు పలికేటప్పుడు ఉపయుక్తమౌతుంది. కవిక. **4.161 ; 3.** ఆశ్చర్య ప్రశంసాద్యర్థం. వరాహ. **9.140 ; 4.** అధిక్షేపను తెలుపరుంది. మను. **2.64.**

క. ఓహొ, ఓహో. ప్రశంసా సూచకం, ఆశ్చర్య సూచకం ; త. ఓకో, ఒహొ. ప్రశంసాద్యోతకం, విరాదాన్ని వ్యక్తం చేస్తుంది. ఆశ్చర్యాన్ని సూచిస్తుంది : మ. ఓహొ.

**ఓహోరె** రూ.చూ. ఓహోరే. అవ్య. ఆశ్చర్య ప్రశంసాదులను తెలుపరుంది. సమీర. **1.15.** **ఓహోరే** రూ. ఓహోరె. అవ్య. ఆశ్చర్య ప్రశంసాదులను తెలుపటుంటు. చంద్రా. **1.127.**

**ఓహోయి** చూ. ఓహో. అవ్య. ఆశ్చర్య ప్రశంసాదుల్ని తెలుపరుంది.

**ఓహోరె** చూ. ఓహో.

**ఓహోరే** చూ. ఓహో.

**ఓహోహొ** రూ.చూ. ఓహోహో. అవ్య. ఆశ్చర్యాదుల్ని తెలుపుతుంది. కవిరా. **4.14.**

**ఓహోహో** రూ. ఒహొహో, ఓహోహో. చూ. ఓహో. అవ్య. ఆశ్చర్య సంతాప ప్రశంసాదులను తెలుపుతుంది. దశా. **4.172.**

క. ఓహోహో. ఓహో యొక్క పునరుక్తి రూపం.

# ఔ

**ఔ**[1] వర్ణమాలలో పన్నెండో అక్షరం. ద్రావిడ భాషల్లో 'ఔ' వర్ణంగా లేదు. సంస్కృతంలో అ, ఉ లు కలిసి ఏర్పడ్డ సంధ్యక్షరం ప్రసిద్ధంగా ఉంది. తత్సామ్యంవల్ల తెలుగు, కన్నడం, తమిళం మొ. ద్రావిడ భాషల్లో దీన్ని వర్ణంగా గ్రహించారు. కాని భాషా శాస్త్రజ్ఞులు దీన్ని 'అవ్' గా పరిగణిస్తారు.

**ఔ**[2] రూ.చూ. అవును. అవ్య. సమ్మతిని తెలియజేసేది.

**ఔ**[3] రూ.చూ. అగు. అ.క్రి. అగు, రుజువగు. భార. అర. **5.57.** అవ్య. అవును, అట్లే (సమ్మతిని తెలియచేసేది). హర. **4.44,** ప్రశంసను తెలిపేది. నైష. **1.17.** ప్రత్య. విశేష్యాన్ని విశేషంగా మార్చే విపరణాత్మక ప్రత్యయం. ఉదా. అంబ-య్-ఔ-టితి. తారా. **5.105.**

ఔగామి రూ.చూ. అగుగామి. వి. మంచీచెడు, సత్యాసత్యం. శ్రీ.రాధా. **3.108.** **ఔగాములు** రూ.చూ. అగుగాములు. వి. **1.** సత్యాసత్యాలు. కళా. **3.180 ; 2.** కష్టసుఖాలు. పరమ. **5.341.** విశ. మంచీచెడు, ఉచితానుచితం. ప్రదా. **4.2.** **ఔఁగదె** రూ.చూ. అగుఁగదే. **ఔఁగదే** రూ.చూ. అగుఁగదే. అవ్య. ఆశ్చర్యార్థ సూచకం, తప్పకుండా. భాగ. **9.305.** **ఔఁగా** రూ.చూ. అగుఁగా. అవ్య. అవునుగాక. **ఔఁగాక** రూ.చూ. అగుఁగాక. అవ్య. అవునుగాక. భార. ఉద్యో. **4.141.** **ఔఁగాత** రూ.చూ. అగుఁగాత. అవ్య. అయ్యెడుగాక. ఆశీరర్థకం. **ఔఁగాదను** చూ. అగుఁగాదను. అ.క్రి. **1.** ఆలోచించు, సంప్రదించు. ప్రభా. **1.83 ; 2.** విమర్శించు, పరిశీలించు. రాఘవ. **4.103.** **ఔనఁటే** రూ.చూ. అగునఁటే. అవ్య. ఔనే. వినేవాళ్ల దృష్టినాకర్షించడానికి చేసే సంబోధన. దశ. **6.33.** **ఔఁబొమ్మ** (-పొమ్మ). అవ్య. అంగీకారార్థకం. నరే. **ఔర** రూ.చూ. అగురా. అవ్య. ఆశ్చర్యార్థ సూచకం. ఆము. **1.36,** దశా. **1.25.** **ఔరా** రూ.చూ. అగురా. అవ్య. ఆశ్చర్యార్థ సూచకం. **ఔరౌర** రూ.చూ. అగురగుర. అవ్య. ఆశ్చర్యార్థ సూచకం. ఉ.రా. **5.218.** **ఔలెండు** అవ్య. అవునులే. శుక. **2.150.** **ఔలెమ్మ** రూ.చూ. అవులెమ్మ. అవ్య. ఔనౌను, అవునులే, అవునవును. పారి. **1.54.** **ఔలే** రూ.చూ. అవులెమ్మ. అవ్య. అవునులే, ఔలెమ్మ.

**ఔకాఁపు** రూ.చూ. అవుకాఁపు. వి. అద్దెకాపురం.

**ఔకు** రూ.చూ. అవుకు. విశ. అస్థిరం, దుర్బలం ; వి. **1.** లోపం, సంశయం ; **2.** పక్ర, చిత్తడిభూమి ; అ.క్రి. జంకు, వెనుదీయు.

**ఔగామి** చూ. ఔ[3].

**ఔగాములు** చూ. ఔ[3].

**ఔఁగదె** చూ. ఔ[3].

**ఔఁగదే** చూ. ఔ[3].

**ఔఁగా** చూ. ఔ[3].

**ఔఁగాక** చూ. ఔ[3].

**ఔఁగాత** చూ. ఔ[3].

**ఔఁగాదను** చూ. ఔ[3].

**ఔఁగు** రూ.చూ. అవుఁగు. వి. ఒక రకం తీపి పదార్థం. రామా. 2.115.

**ఔఘళము** రూ.చూ. అవఘళము. 1. అతిశయం, పెంపు, అభివృద్ధి : పాండు. 1.117 ; 2. ఓటమి.

**ఔఘళించు** రూ.చూ. అవఘళించు. స.క్రి. ఓడించు. రాధికా. 1.23 ; అ.క్రి. కదలు.

**ఔఘళించు** చూ. ఔఘళము.

**ఔజు[1]** రూ.చూ. అవుజు[1]. వి. 1. జలయంత్రం ఉన్న దిగుడు బావి ; 2. క్రీడాసరస్సు.

**ఔజు[2]** రూ.చూ. అవుజు[2]. వి. బురద.

**ఔజు[3]** రూ.చూ. అవుజు[3]. వి. పనివాడు, శిల్పి. ఆం.బా. 2.

**ఔట** రూ.చూ. కౌట. పో.చూ. (అవిటి) ఔటి. వి. కాలు బిగదీసుకుపోవటం.

**ఔటి** పో.చూ. అవిటి. వి. దుర్బలత్వం.

**ఔటు** వి. ఒక పేలేదినుసు.

**ఔటుగుండు** రూ.చూ. అవుటుగుండు. వి. చిన్నరుపాకిగుండు, చట్టి ఫిరంగి గుండు.

**ఔడు** రూ.చూ. అవుడు[1]. వి. 1. పెదవి, కింది పెదవి. భార. ఆది. 6.291 ; 2. పన్ను. రం.రా. 6.330, వం. 25. కింది పెదవి లోపలి భాగం.

**ఔడుకొట్టు** అ.క్రి. కోపంలో కింది పెదవిని కొరుకు. **ఔడుగఱచు** రూ.చూ. అవుడుగఱచు. అ.క్రి. 1. (కోపంలో) పళ్లు కొరుకు. భార.ఆది. 6.294 ; 2. పెదవి కరచు. ఉ. రా. 3.162. <ఔడు+కఱచు. **ఔడుమాయు** అ.క్రి. 1. తెగు, ఖండితమగు. భీమ. 6.45 ; 2. పెదవిదాటి వచ్చు.

**ఔడుకొట్టు** చూ. ఔడు.

**ఔడుకొను** అ.క్రి. పంటకు పాలుకైకొను.

**ఔడుగఱచు** చూ. ఔడు.

**ఔడుమాయు** చూ. ఔడు.

**ఔతారము** వి. తేనిపోని చేష్టలు.

సం. అవతార-. దేవతలు మనుష్యులు మొ. ఆకారాల్లో పుట్టటం, దేవతలు ధరించే ఆకారాలు.

<సం. అవతార-. అర్థవిపరి.

**ఔతుఖానా** రూ.చూ. ఔదుఖానా, వి. స్నానాల (గది) తొట్టి.

**ఔదరి** పో.చూ. అవుదు[1]. చిన్న కాలవ.

**ఔదల** రూ.చూ. అవుదల. వి. తల. 1. శృం.నై. 7.93 ; 2. ముందల. నీలా. 1.81 ; 3. నడినెత్తి.

**ఔదలఁదన్ను** స.క్రి. తలదన్ను, మించు, అతిక్రమించు, అధిగమించు. కళా. 1.54. < ఔదల+తన్ను. **ఔదలఁదాల్చు** స.క్రి. తలదాల్చు. **ఔదలమోపుడించు** అ.క్రి. కార్యభారం తొలగించు. రామా. 6.75.

**ఔదలఁదన్ను** చూ. ఔదల.

**ఔదలఁదాల్చు** చూ. ఔదల.

**ఔదలమోపుడించు** చూ. ఔదల.

**ఔదు[1]** రూ.చూ. అవుజు[1]. వి. 1. కాలవ. మను. 3.28 ; 2. జలయంత్రంగల దిగుడు బావి.

**ఔదు[2]** రూ.చూ. అవుజు[3]. వి. సేవకుడు.

**ఔదుఖానా** రూ. ఔతుఖానా. వి. స్నానాల (గది) తొట్టి.

ఉ.హిం. హౌజ్. నీటికుండ, ఖానా. స్థానం.

< ఉ. హౌజ్‌ఖానా.

**ఔదెంచు** పో.చూ. అగుదెంచు. అ.క్రి. 1. కరచు ; 2. కలిదియగు.

**ఔనఁటే** చూ. ఔ[3].

**ఔనను** చూ. ఔను.

**ఔను** రూ.చూ. అవును. అవ్య. నిజంగా. ఆం.భా. 8.75. అవునా ?

**ఔనను** స.క్రి. మెచ్చుకొను, సమ్మతించు. **ఔనె** రూ.చూ. అగునే. అవ్య. పరిచితురాండ్రను, సేవకురాండ్రను సంబోధించేది. అవునె, ఔనటే. కాశీ. 4.106. **ఔనే** రూ.చూ. అగునే. అవ్య. స్నేహితుల్ని, సేవకుల్ని (స్త్రీలను) సంబోధించేది. అవునె, ఔనటె. దశా. 6.83. **ఔనేమో** అవ్య. బహుశా. **ఔనౌఁగదే** రూ.చూ. అగునగుఁగదే. అవ్య. ప్రశంసావాచకం. భాగ. 8.203. **ఔనౌనే**. అవ్య. భార్యాది సంబోధనార్థకం. దశా. 7.1.79.

**ఔనె** చూ. ఔను.

**ఔనే** చూ. ఔను.

**ఔనేమో** చూ. ఔను.

**ఔనౌఁగదే** చూ. ఔను.

**ఔనౌనే** చూ. ఔను.

**ఔపవిభక్తికము** వి. 1. ఉపవిభక్తి, ద్వితీయాద్యేకవచనాలు పరమైనపుడు వచ్చే ఆగమాదేశరూపమైన ఇ, టి, తి, వర్ణాలు ; 2. ఔపవిభక్తికాలు చేరే శబ్దాలు.

సం. ఉపవిభక్తి.

<సం. ఉపవిభక్తి-. అర్థవిపరి.

**ఔబలము** రూ.చూ. అవుబలము. వి. మల్లయుద్ధంలో ఒకపట్టు. సిం.ద్వా. 7.60.

**ఔఁబొమ్మ** చూ. ఔ[3].

**ఔర** చూ. ఔ[3].

**ఔరడి** వి. తిరస్కారం, అవహేళనం. రాధా. 3.72.

**ఔరా** చూ. ఔ[3].

**ఔరు** రూ.చూ. అగురు[2]. వి. ఔరుగడ్డి. వీరణం. ఆము. 4.124.

**ఔరుసౌరుదు** రూ.చూ. అవురుసవురు. విశే. నశించిన, క్షీణించిన. కాశీ. 1.125.

**ఔరుసౌరువడు** రూ.చూ. అవురుసవురువడు. అ.క్రి. పతనమగు, నశించు. శివరా. 2.109.

**ఔరుసౌరువడు** చూ. ఔరుసౌరు.

**ఔరౌర** చూ. ఔ[3].

**ఔల** రూ.చూ. అవల. విశే. 1. అవతల ప్రదేశం. రం.రా. 6.452. పం. 29 ; 2. పిమ్మట, ఆపై. కావ్య. 3.56.

**ఔలఁబెట్టు** రూ.చూ. అవులఁబెట్టు. స.క్రి. విడుచు, పరిత్యజించు.

**ఔలు** అ.క్రి. క్రిందపడు, ఊడు, రాలు.

**ఔలెందు** చూ. ఔ[3].

**ఔలెమ్ము** చూ. ఔ[3].

**ఔలే** చూ. ఔ[3].

**ఔమ** రూ.చూ. హౌను. వి. అందం.

**ఔమకత్తియ** రూ. ఔనుకత్తె. వి. సొగసుకత్తె, ఒయ్యారి.

**ఔమకత్తె** రూ.చూ. ఔనుకత్తియ. వి. సొగసుకత్తె, ఒయ్యారి.

**ఔమగాఁడు** రూ.చూ. అవునుకాడు. వి. హౌనుకాడు, సొగసుకాడు. విలాసవంతుడు. సాం.ని. 2.8.

**ఔమకత్తియ** చూ. ఔను.

**ఔమకత్తె** చూ. ఔను.

**ఔమగాఁడు** చూ. ఔను.



# ఆంధ్ర గ్రంథ సంకేత పట్టిక

| గ్రంథ సంకేతాలు | గ్రంథ నామాలు | గ్రంథకర్తలు | శతాబ్దం |
|---|---|---|---|
| అచలా. | అచలాత్మజా పరిణయము | తిరుమలబుక్కపట్టణము వెంకటాచార్యకవి | 18 |
| అచ్చరా. | అచ్చ తెలుఁగు రామాయణము | కూచిమంచి తిమ్మకవి | 18 |
| బాల. | బాల కాండము | | |
| అయోధ్య. | అయోధ్య కాండము | | |
| అరణ్య. | అరణ్య కాండము | | |
| కిష్కిం. | కిష్కింధా కాండము | | |
| సుందర. | సుందర కాండము | | |
| యుద్ధ. | యుద్ధ కాండము | | |
| అధ్యా.రా. | అధ్యాత్మ రామాయణము<br>ఉత్తర కాండము | కోటమరాజు నాగయ్య | 17–18 |
| అధ్యా.సం. | అధ్యాత్మ సంకీర్తనలు | తాళ్లపాక అన్నమయ్య | 15–16 |
| అని. | అనిరుద్ధ చరిత్రము | కనుపర్తి అబ్బయ్య | 18 |
| అను. | అనుభవ సారము | పాల్కురికి సోమనాథుఁడు | 13 |
| అప్ప. | అప్పకవీయము | కాకునూరి అప్పకవి | 17 |
| అష్ట.క. | అష్టమహిషీ కల్యాణము (ద్విపద) | తాళ్లపాక తిరువెంగళనాథుఁడు | 16 |
| అహల్యా. | అహల్యా సంక్రందనము | సముఖము వేంకటకృష్ణప్పనాయకుఁడు | 18 |
| ఆం.చం. | ఆంధ్ర చంద్రాలోకము | అడిదము సూరకవి | 18 |
| ఆనంద. | ఆనందరంగరాట్ఛందము | కస్తూరి రంగయ్య | 18 |
| ఆము. | ఆముక్తమాల్యద | శ్రీకృష్ణదేవరాయలు | 15–16 |
| ఇందు. | ఇందుమతీ పరిణయము | కుమార ధూర్జటి | 16 |
| ఇందు.ప. | ఇందుమతీ పరిణయము | తెనాలి రామభద్ర కవి | 16 |
| ఉత్త.రా. | ఉత్తర రామాయణము | కంకంటి పాపరాజు | 17 |
| ఉత్త.హ. | ఉత్తర హరివంశము | నాచన సోమన | 14 |
| ఉత్త.హరిశ్చ. | ఉత్తర హరిశ్చంద్రోపాఖ్యానము | తెక్కెళ్లపాటి లింగన | 18 |
| ఉద్భటా. | ఉద్భటారాధ్య చరిత్రము | తెనాలి రామకృష్ణుఁడు | 16 |
| కకుత్స. | కకుత్స విజయము | మట్ల అనంతభూపాలుఁడు | 16 |
| కలు.శ. | కలువాయి శతకము | దబ్బీరు నరస కవి | 19 |
| కవిక. | కవికర్ణ రసాయనము | సంకుసాల నృసింహ కవి | 16 |
| కవిజనా. | కవిజనాశ్రయము | మల్లియ రేచన | 12 |
| కవి.రం. | కవిజనరంజనము | అడిదము సూరకవి | 18 |
| కవిరాజ. | కవిరాజ మనోరంజనము | కనుపర్తి అబ్బయ | 18 |
| కవి.శ. | కవి చౌడప్ప శతకము | కవి చౌడప్ప | 17 |

| గ్రంథ సంకేతాలు | గ్రంథ నామాలు | గ్రంథకర్తలు | శతాబ్దం |
|---|---|---|---|
| కవి.సంజీ. | కవిజన సంజీవని | ముద్దరాజు రామన | 16 |
| కవిసంశ. | కవిసంశయ విచ్ఛేదము | అడిదము సూరకవి | 18 |
| కవిస.గా. | కవిసర్పగారుడము | [illegible]చన బసవన్న | 15–16 |
| కళా. | కళాపూర్ణోదయము | పింగళి సూరన | 16 |
| కార్తిక. | కార్తిక మాహాత్మ్యము | కుందుర్తి వెంకటాచలపతి | 18 |
| కావ్యా.చూ. | కావ్యాలంకార చూడామణి | విన్నకోట పెద్దన | 15 |
| కాశీ. | కాశీఖండము | శ్రీనాథుడు | 15 |
| కాళ. | కాళహస్తి మాహాత్మ్యము | ధూర్జటి | 16 |
| కాళ.శ. | కాళహస్తీశ్వర శతకము | ,, | 16 |
| కాళిందీ. | కాళిందీ కన్యాపరిణయము | ప్రభంజనాహోబలపతి | 17 |
| కిరా. | కిరాతార్జునీయము | గోపాలుని సింగయ | 19 |
| కుచే. | కుచేలోపాఖ్యానము | గట్టు ప్రభువు | 18 |
| కువ.చ. | కువలయాశ్వ చరిత్రము | సవరము చినసారాయణ నాయకుడు | 16–17 |
| కు.సం. | కుమార సంభవము | నన్నె చోడుడు | 11 |
| కృ.శకు. | శకుంతలా పరిణయము | చిరుమామిళ్ల కృష్ణ కవి | 17–18 |
| కృష్ణక. | కృష్ణ కర్ణామృతము | వెలగపూడి వెంగయామాత్యుడు | 16 |
| కృష్ణరా. | కృష్ణరాయ విజయము | కుమార ధూర్జటి | 16 |
| కృష్ణశ. | కృష్ణ శతకము | నృసింహ కవి | 17 |
| కృష్ణా. | కృష్ణాభ్యుదయము | నృసింహ కవి | 17 |
| కృష్ణాభ్యు. | కృష్ణాభ్యుదయము | గొంతేటి సూరన | 18 |
| కేయూ. | కేయూరబాహు చరిత్రము | మంచన | 13 |
| క్రీడా. | క్రీడాభిరామము | వల్లభరాయుడు | 14–15 |
| గంధ. | గంధవహము | మంచెర్ల వాసుదేవ కవి | 17 |
| ఘటికా. | ఘటికాచల మాహాత్మ్యము | తెనాలి రామలింగ కవి | 16 |
| చక్ర. | చక్రవాళ మంజరి | రాళ్లపాటి పెదతిరుమలయ్య | 16 |
| చంద్రభా. | చంద్రభాను చరిత్రము | తరిగొప్పుల మల్లన | 16–17 |
| చంద్రరే. | చంద్రరేఖా విలాపము | కూచిమంచి జగ్గకవి | 18 |
| చంద్రాంగ. | చంద్రాంగద చరిత్రము | పైడిమర్రి వెంకటపతి | 17 |
| చంద్రికా. | చంద్రికా పరిణయము | సురభి మాధవరావు | 16–17 |
| చమ. | చమత్కార మంజరి | సింహాద్రి వెంకటాచార్యులు | 16 |
| చంపూ.రా. | చంపూ రామాయణము | ఋగ్వేదకవి వెంకటచలపతి | 18 |
| చారు. | చారుచర్య | అప్పన మంత్రి | 14–15 |
| చి.భా. | చిత్ర భారతము | చరిగొండ ధర్మన | 16 |
| చెన్న.వి. | చెన్నపురి విలాసము | మతుకుమల్లి నృసింహ కవి | 19 |
| ఛందో. | ఛందో దర్పణము | అనంతామాత్యుడు | 15 |
| జాహ్న. | జాహ్నవీ మాహాత్మ్యము | ఏనుగు లక్ష్మణకవి | 18 |
| జైమినీభా. | జైమినీ భారతము | పిల్లలమర్రి పినవీరభద్రుడు | 15 |
| తపతీ. | తపతీ సంవరణోపాఖ్యానము | అద్దంకి గంగాధర కవి | 16 |
| దశకు. | దశకుమార చరితము | మూలఘటిక కేతన | 13 |

| గ్రంథ సంకేతాలు | గ్రంథ నామాలు | గ్రంథకర్తలు | శతాబ్దం |
|---|---|---|---|
| దశా. | దశావతార శతకము | ధరణిదేవుల రామయ | 17 |
| దాశ. | దాశరథి శతకము | కంచెర్ల గోపన్న | 17 |
| దిలీప. | దిలీప చరిత్రము | కొటికలపూడి వెంకటకృష్ణ కవి | 19 |
| ద్వి.నల. | ద్విపద నల చరిత్రము | చక్రపురి రాఘవాచార్యులు | 16 |
| ద్వి.పరమ వి. | ద్విపద పరమయోగి విలాసము | తాళ్లపాక తిరువెంగళనాథుఁడు | 16 |
| ద్వి.భాగ. | ద్విపద భాగవతము (దశమ ఖండము) | మడికి సింగన | 14 |
| ద్వి.భార. | ద్విపద భారతము | తిమ్మయ, బాలసరస్వతి, సోమన | 16 |
| ద్వి.సార.చ. | ద్విపద సారంగధర చరిత్రము | భాడాల శంభుదాసుఁడు | 18 |
| ద్వి.హరిశ్చ | ద్విపద హరిశ్చంద్ర చరిత్రము | శరభ కవి | 17 |
| ధనా. | ధనాభిరామము | నూతనకవి సూరన | 16–17 |
| ధర్మ. | ధర్మఖండము | ఇందువల్లి భవానీశంకరుఁడు | 18 |
| నరస. | నరస భూపాలీయము | మూర్తికవి | 16 |
| నవనాథ. | నవనాథ చరిత్రము | గౌరన | 15 |
| నారదీయ పు. | నారదీయ పురాణము | అల్లాడు నరసింహ కవి | 15 |
| నార.పంచ. | పంచతంత్రము | దూబగుంట నారాయణ కవి | 15 |
| నార.పు. | నారసింహ పురాణము (ఉత్తర భాగము) | హరిభట్టు | 16 |
| నిరంకు. | నిరంకుశోపాఖ్యానము | కందుకూరి రుద్రకవి | 16 |
| నిర్వ.రా. | నిర్వచనోత్తర రామాయణము | తిక్కన | 13 |
| నీతి.శ. | నీతి సీస పద్య శతకము | తాళ్లపాక తిరుమలయ్య | 15 |
| నీలా. | నీలాసుందరీ పరిణయము | కూచిమంచి తిమ్మ కవి | 18 |
| నృసింహ. | నృసింహ పురాణము | ఎఱ్ఱాప్రెగడ | 14 |
| పండి.చ. | పండితారాధ్య చరిత్ర | పాల్కురికి సోమనాథుఁడు | 13 |
| దీక్షా. | దీక్షా ప్రకరణము | | |
| పురా. | పురాతన ప్రకరణము | | |
| వాద. | వాద ప్రకరణము | | |
| మహిమ. | మహిమ ప్రకరణము | | |
| పర్వ. | పర్వత ప్రకరణము | | |
| పద్మ. | పద్మ పురాణము (ఉత్తర ఖండము) | మడికి సింగన | 14 |
| పరత. | పరతత్వ రసాయనము | ఈశ్వరపదిభట్టు | 16 |
| పరమ.వి. | పరమయోగి విలాసము | తిమ్మనృపాలుఁడు | 16 |
| పల్నా. | పల్నాటి వీరచరిత్ర (ద్విపద) | శ్రీనాథుఁడు | 14–15 |
| పాంచాలీ. | పాంచాలీ పరిణయము | కాకమాని మూర్తికవి | 16 |
| పాండు. | పాండురంగ మాహాత్మ్యము | తెనాలి రామకృష్ణుఁడు | 16 |
| పారి. | పారిజాతాపహరణము | నంది తిమ్మన | 16 |
| పార్వ. | పార్వతీపరిణయము | కోటి శ్రీరాయరఘునాథతొండమాన్ మహిపాలుఁడు | 18 |
| పి.శకు. | శకుంతలాపరిణయము | పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు | 15 |
| పె.శకు. | శకుంతలాపరిణయము | పెద్దాద నాగరాజు | 18 |
| ప్రబంధ. | ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము | గణపవరపు వేంకటకవి | 17 |

| గ్రంథ సంకేతాలు | గ్రంథ నామాలు | గ్రంథకర్తలు | శతాబ్దం |
|---|---|---|---|
| ప్రబో. | ప్రబోధ చంద్రోదయము | నంది మల్లయ, ఘంట సింగయ | 15 |
| ప్రభా. | ప్రభావతీప్రద్యుమ్నము | పింగళి సూరన | 16 |
| ప్రభు. | ప్రభులింగలీల (ద్విపద) | పిడుపర్తి సోమన | 16 |
| బసవ. | బసవ పురాణము | పాల్కురికి సోమనాథుడు | 13 |
| బహుళా | బహుళాశ్వ చరిత్రము | దామెర్ల వెంగళభూపాలుడు | 16 |
| బాల. | బాలకవి శరణ్యం | గిడుగు వెంకటరామమూర్తిపంతులు | 20 |
| బాలగో. | బాలగోపాల విలాసము | వెణుతుర్ల వర్ధి కవి | 17 |
| బిల్హ. | బిల్హణీయము | పంగిపెద్ది కృష్ణస్వామి | 18 |
| బ్రహ్మో. | బ్రహ్మోత్తర ఖండము | శ్రీధరమల్లె వెంకటరామ కవి | 18 |
| భర్తృ. | భర్తృహరి సుభాషితములు | ఏనుగు లక్ష్మణ కవి | 18 |
| భల్లా. | భల్లాణ చరిత్రము | చిటూరు గంగాధర కవి | 19 |
| భాగ. | భాగవతము | పోతన, ఏర్చూరి సింగన, వెలిగందల నారయ | 14 |
| భాను. | భానుమతీపరిణయము | వెంటూరి గంగరాజు | 16 |
| భార. | భారతము | | 11 |
| ఆది. | ఆదిపర్వము | నన్నయ | 11 |
| సభా. | సభా పర్వము | నన్నయ | 11, 14 |
| అరణ్య. | అరణ్య పర్వము | నన్నయ, ఎఱ్ఱన | 13 |
| విరా. | విరాట పర్వము | తిక్కన | |
| ఉద్యో. | ఉద్యోగ పర్వము | ,, | |
| భీష్మ. | భీష్మ పర్వము | ,, | |
| ద్రోణ. | ద్రోణ పర్వము | ,, | |
| కర్ణ. | కర్ణ పర్వము | ,, | |
| శల్య. | శల్య పర్వము | ,, | |
| సౌప్తి. | సౌప్తిక పర్వము | ,, | |
| స్త్రీ. | స్త్రీ పర్వము | ,, | |
| శాంతి. | శాంతి పర్వము | ,, | |
| అను. | అనుశాసనిక పర్వము | ,, | |
| అశ్వ. | అశ్వమేధ పర్వము | ,, | |
| ఆశ్రమ. | ఆశ్రమవాస పర్వము | ,, | |
| మౌసల. | మౌసల పర్వము | ,, | |
| మహా. | మహాప్రస్థానిక పర్వము | ,, | |
| స్వర్గా. | స్వర్గారోహణ పర్వము | ,, | |
| భాషా. | భాషా చారిత్రక వ్యాసావళి | తూమాటి దోణప్ప | 20 |
| భాస్క.రా. | భాస్కర రామాయణము | భాస్కరుడు, ఇతరులు | 13 |
| భాస్క.శ. | భాస్కర శతకము | మారద వెంకయ్య | 16 |
| భీమ. | భీమ ఖండము | శ్రీనాథుడు | 14–15 |
| భేషజ. | భేషజ కల్పము | బహుపాద వెంకటాచార్యుడు | |
| భోగినీ. | భోగినీ దండకము | పోతన | 15 |
| భోజ. | భోజరాజీయము | అనంతామాత్యుడు | 15 |
| భోజసు. | భోజసుతా పరిణయము | కోటేశ్వరుడు | 18 |

